# కూలీ

[నవల]

రచన:
ముల్కరాజ్ ఆనంద్

అనువాదం:
అవసరాల సూర్యారావు

ప్రచురణ:
విశాలాంధ్ర ప్రచురణాలయం
బకింగ్‌హాంపేట పోస్టు : : విజయవాడ.

# కూలీ

[నవల]



రచన:

ముల్కరాజ్ ఆనంద్

అనువాదం:

అవసరాల సూర్యారావు

ప్రచురణ:

విశాలాంధ్ర ప్రచురణాలయం

బకింగ్‌హాంపేట పోస్టు :: విజయవాడ.

# పరిచయం



అంతర్జాతీయ ప్రఖ్యాతి పొందిన ఉత్తమ భారతీయ రచయితలలో శ్రీ ముల్కరాజ్ ఆనంద్ ఒకరు. ఆయన 1905లో పెషావరులో ఒక నిరుపేద కుటుంబంలో జన్మించారు. తండ్రి సైన్యంలో సోల్జరుగా పనిచేయడంవల్ల, ఆయనతో పాటు అనేకప్రాంతాలకు వెళ్ళే అవకాశం ఆనంద్‌కు కలిగింది. వివిధ ప్రాంతాల ప్రజల జీవిత పరిస్థితులు, అలవాట్లు, అభిరుచులు, దుర్భర దారిద్ర్యమూ, భూమికోసం రైతులుపడే అగచాట్లూ, భుక్తికోసం కూలీలు పడేపాట్లూ ఆయనకు చిన్నతనంలోనే అవగతమయాయి. రష్యా మహావిప్లవమూ, సోవియట్ సమాజ స్థాపనా, భారతదేశ జాతీయోద్యమ ప్రభావాలూ పిన్నవయసులోనే ఆయనపై ప్రసరించి, చైతన్యవంతుని కావించాయి. భారతదేశ రాజకీయ ఆర్థిక పరిస్థితుల పరిశీలన, సామాజిక శాస్త్రాధ్యయనంపై అభిరుచిని కలిగించింది. పంజాబ్ విశ్వవిద్యాలయంలో 1925 లో పట్టభద్రుడై ఉన్నత విద్యాభ్యాసంకోసం ఇంగ్లండుకు ఆనంద్ పయనమయారు. సాహిత్యకళా తాత్విక శాస్త్రాలలో నిరంతర కృషివలన ఆనంద్ 'డాక్టర్ ఆఫ్ ఫిలాసఫీ' పట్టాన్ని పొందారు. ఇంగ్లండులో వుండగా సుప్రసిద్ధ బ్రిటిష్ కమ్యూనిస్టు రచయితలు రాల్ఫ్‌ఫాక్స్, క్రిస్టోఫర్ కాడ్‌వెల్, జాక్ లిండ్సే, జాన్ సోమర్‌ఫీల్డు ప్రభృతులతో స్నేహం కలిగింది. పీడితప్రజల దుఃఖమయ జీవితాన్ని చిత్రీకరించడమే

కాక, వారి జీవితాన్ని ఆనందమయంచేసే నవసమాజసృష్టికి సాహిత్యం ఒక మహత్తరమైన ఆయుధంగా ఉపయోగపడాలనే ఆకాంక్ష ఆయనకు జనించింది. పరాధీన భారతదేశ విముక్తి కోసం, తన మాతృదేశంలో నవసమాజ స్థాపనకోసం ఆయన లేఖిని పరుగులు తీసింది. బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్ని పార ద్రోలి భారతదేశ స్వాతంత్ర్యాన్ని సాధించి, సమాజంలో అట్టడుగునపడివున్న కోట్లాది భారతీయుల జీవితాభ్యున్నతికోసం ప్రజాస్వామికరచయితలనందరినీ సంఘటిత పరచాలనే మహత్తర ఆశయంతో నెలకొల్పబడిన అఖిలభారత అభ్యుదయ రచయితల సంఘనిర్మాతలలో శ్రీ ప్రేమచంద్, సజ్జాద్ జహీర్‌లతోపాటు శ్రీ ఆనంద్ ఒకరు.

శ్రీ ముల్క్‌రాజ్ ఆనంద్ శతాధిక గ్రంథకర్త. అంట రానివాడు, కూలీ, రెండాకులు: ఒక మొగ్గా, ది విలేజ్, ఎక్రాస్ ది బ్లాక్ వాటర్స్, ది స్వోర్డ్ అండ్ ది సికిల్, బిగ్‌హార్ట్ మొదలైనవి ఆయన రచించిన నవలలు. బార్బర్స్ ట్రేడ్ యూనియన్ అండ్ ది అదర్ స్టోరీస్, ది ట్రాక్టర్ అండ్ ది కారన్‌గాడెస్, యిత్యాదులు శ్రీ ముల్క్‌రాజ్ ఆనంద్ వెలువరించిన కథా సంపుటాలు. ఆయన వ్యాసాలు: పెర్షియన్ పెయింటింగ్, ది హిందూ వ్యూ ఆఫ్ ఆర్ట్, ది గోల్డెన్ బ్రెత్ మొదలైనవి.

1937 లో స్పెయిన్‌లో జరిగిన ఫాసిస్టు వ్యతిరేక ప్రజా ప్రతిఘటనోద్యమంలో శ్రీ ముల్క్‌రాజ్ ఆనంద్ యుద్ధ విలేఖరిగా పనిచేశారు. 1948 అక్టోబరులో సోవియట్ రష్యాను సందర్శించారు. 1948 లో వ్రోక్లాలో జరిగిన ప్రపంచశాంతి

కాముక కళావేత్తల మహాసభలో భారత ప్రతినిధిగా పాల్గొన్నారు. 1950 లో వార్సాలో జరిగిన ప్రపంచ శాంతిమహాసభకు భారతీయ ప్రతినిధిగా శ్రీ ముల్క్‌రాజ్ ఆనంద్ హాజరయారు. 1951 నవంబరులో జరిగిన ప్రపంచశాంతి మహాసభలో ప్రపంచ శాంతిసంఘ సభ్యులుగా ఆయన ఎన్నికయారు. సాహిత్య రంగంలో ఆయన కావించినసేవను, ప్రపంచ శాంతి స్థాపనకు చేసిన కృషిని అభినందిస్తూ ప్రపంచశాంతి కౌన్సిలు 1953, జూన్‌లో శ్రీ ముల్క్‌రాజ్ ఆనంద్‌కు అంతర్జాతీయ శాంతి బహుమానాన్ని యిచ్చి సత్కరించింది.

భారతదేశంలో నిత్యదారిద్ర్యంతో కుమిలిపోతున్న ప్రజల జీవిత గాధలు ఆయన నవలల ఇతివృత్తాలు. ధనికవర్గపు అధికారంక్రింద నలిగిపోతూ, పీడకవర్గాల దోపిడికి గురిఅవుతూ అన్నివిధాలా కృంగి కృశించిపోతున్న భూమిలేని నిరుపేద రైతులు, కార్మికులు శ్రీ ఆనంద్ నవలలో పాత్రలు. పీడిత ప్రజలకష్టాలను, దుఃఖాలను, అనుభూతులను, వాస్తవిక రచనా పద్ధతిలో చిత్రిస్తూ భూస్వాముల, ధనికుల క్రూరత్వాన్ని, అభివృద్ధి నిరోధకతనూ, ఆయన తన నవలలలో, కథలలో నిశితంగా బహిర్గతం కావించారు. బ్రిటిష్ సామ్రాజ్యవాద దోపిడీ విధానాన్ని, సామ్రాజ్యవాద తత్వాన్ని 'ఎక్రాస్ ది బ్లాక్ వాటర్స్' మొదలైన నవలలో శ్రీ ఆనంద్ తీవ్రంగా విమర్శించారు, ఖండించారు. ఉత్తమ ఆనందమయ జీవితం కోసం, నవసమాజ నిర్మాణంకోసం ప్రజలు సంఘటిత పోరాటం కావించవలసి వుంటుందనీ, ఒకర్ని ఒకరు దోచుకుందుకు

వీలులేని సమాజంలోనే నిజమైన మానవత్వమనేది వుంటుందనీ అదేనవలలో ఆయన ప్రబోధించారు.

1936లో వెలువడిన 'కూలీ' శ్రీ ఆనంద్ రచించిన నవలలో రెండవది. ఇది రష్యన్, జర్మన్, ఫ్రెంచి మొదలైన విదేశీయ భాషలలోనికి అనువదింపబడి పాఠకుల మన్ననలను పొందిన నవల. ఈ నవలలో ప్రధానపాత్ర 'మునూ' అనే ఒక కూలీ. నిరుపేద రైతుకుటుంబంలో పుట్టి, వున్న ఆ కాస్త భూమినీ భూస్వామి ఏనాడో అపహరించగా తను పుట్టినగడ్డవొదిలి పొట్ట చేత్తోపట్టుకొని పట్టెడన్నంకోసం పడరాని పాట్లుపడుతూ ఒక యింటి నౌకరుగా, ఫ్యాక్టరీ కార్మికునిగా, కొనసకు రిక్షాకూలీగా అనేక కష్టాలకు లోనయిన 'మునూ' దుఃఖమయ జీవితం 'కూలీ' నవలలో చిత్రీకరించబడింది. కార్మికుల దుఃఖమయ జీవిత విముక్తికై, సుసంఘటిత పోరాటమే మార్గమని ఈ నవలలో ప్రతిపాదింపబడింది. కథానిర్వహణలో, మనస్తత్వ నిరూపణలో పాత్రలను మలచడంలో, శ్రీ ముల్కరాజ్ ఆనంద్ సిద్ధ హస్తుడు.

భారతదేశ సుప్రసిద్ధ అభ్యుదయ రచయిత శ్రీ ముల్కరాజ్ ఆనంద్ రచించిన, అంతర్జాతీయ ప్రశస్తినందిన 'కూలీ' అనే నవలను తెలుగున అనువదింపచేసి పాఠకులకు అందివ్వ గలుగుతున్నందుకు సంతసిస్తున్నాము.

—ప్రచురణకర్తలు



# ౧

“మునూ! హోయ్ మునూ! ఓమునూ!” అనే కేకలు దూరంనుంచి వినవస్తున్నాయి. లోయ; లోయగర్భంలో ఒకచిన్న పల్లె; పల్లెకు రమారమి వందగజాల దూరాన చిన్నకొండవుంది. కొండశిఖరంమీద, చూరులు నేల కానుకుని గుండ్రంగా ఒకమట్టిగుడిసె. గడ్డి గుడిసె వరండాలో నించుని, గుజ్రీ గొంతుక చించుకుని అరుస్తోంది: “మునూ! ఒరేయ్, మునూ! హోమునోయ్!”

పల్లెలోనివన్నీ యించు మించు మిద్దెయిళ్ళే. ఇళ్ళ వరసకు దూరంగా పాములాగ మెలికలు తిరిగిన కాలిబాట. బాట బాగా నలిగిపోయివుంది. ఎండ తీవ్రంగా కాస్తోంది. కాలిరాపిళ్ళకు నేల దుమ్మంతా నలిగినలిగి బంగారపు పొడిలాగ ధగధగ మెరుస్తోంది. బాట చివరకు ఎండ సలసల కాగుతూ, ఆవిరులను రేపుతూ, ఒకమూలకు చేరుకుని పేరుకుంది. గుజ్రీ బాటమీద నుంచొని డేగవంటి చూపులతో, మునూకోసం నిరీక్షిస్తోంది. ఎంత నిరీక్షించినా ఎన్నిమారులు పిలిచినా, మునూ, ఐపూ మచ్చాలేదు.

“మునూ! హోయ్ మునూ! ఒరేయ్, హోయ్, మునూ! ఎక్కడికి చచ్చావురా? ఎక్కడికో దాగేశాడు, పీనుగ! పీనుగాని! ఒరేయ్, మాట్లాడవేం? త్రిపాద నక్షత్రం! ఇంటిపట్టున వుంటేనా! బస్తీలో ఉద్యోగం వేయిస్తానంటే గుంటడికి యోగముండొద్దూ? ఒరేయ్ మునూ! రారా! త్వరగా రారా! మీ మావయ్య పట్నం వెళ్ళిపోతున్నాడ్రా!” గుజ్రీ గొంతుక కంచుగంటలాగ గణగణ మ్రోగుతోంది. కీచురాయిలా, ‘గీ’ పెడుతోంది. కొద్ది దూరంలో బీస్ నది కివతల తీరాన, మామిడితోపు పచ్చగా వుంది. నది కవతల తీరాన నీటి అలలు వెండి రేకులను కట్టుకుంటున్నాయి. ఇరువంకలా, పచ్చపచ్చని అడవి మొక్కలు, కలుపు మొక్కలు, చిన్నచిన్న దుబ్బులు. గుజ్రీ చూపులు మామిడితోటను దాటి, నదీతీరానవున్న మొక్కలలోనుంచి దూసుకుపోతూ, నదికట్టుకున్న వెండిగాజులను వెదకుతున్నాయి. నిశ్చలంగా వెదకుతున్న ఆమెదృష్టికి పిల్లవాడు ఎక్కడా కనిపించడమే లేదు.

“మునూ, హోయ్ మునూ! హో మునోయ్” అంటూ మండిపడిపోతూ, పిచ్చిదానిలా అరుస్తోంది. ఎంతక్రోధం! ఎంతపిలిచినా, ఎంత అరిచినా

పలకడేమి! అరిచినకొద్దీ కుఱ్ఱవాడు మటుమాయమైపోతున్నాడు కదా! కంటికి కనిపించినవెంటనే పిల్లవాణ్ణి నమిలి మింగేద్దామన్నంత కోపం పుట్టు కొచ్చింది. అసహ్యం, ఉడుకుమోత్తనం తరుముకుతెరుముకు వస్తోంది. ఆ కోపంలో, ఆజుగుప్సలో తాను గొంతుకను ఎంతబిగ్గరగ ఎత్తి అరవగలదో, అంత బిగ్గరగానూ ఎత్తి కేకలువేస్తోంది. "ఎక్కడికి చచ్చావురా! దిక్కుమాలిన గుంజిగా! నీ కొచ్చినేస్ళ్ళ ఎవరికొచ్చాయిరా? ఇలా తగలడు ఓసారి!" కర్ణకఠోరంగా బొబ్బరింతలు పెడుతున్న ఆ స్త్రీ గొంతుక, లోయ, లోయంతా ప్రతిధ్వనిస్తోంది. ఆమెట్టస్టే తిట్లను తలుచుకుంటేచాలు, హడలు పుట్టుకొస్తోంది.

అత్తయ్యతిట్లు చెవినిపడగానే మునూగుండె బేజారెత్తింది. కాని ఆవిడ పిలుపులకు పలకడు; ఊలకడు. బయటకు కానరాకుండా, చెట్లనాటున దాగున్నాడు. దాగుని గుఱ్జీ ఏమిచేస్తున్నదో కనిపెడుతున్నాడు. నెమ్మ దిగ తలఎత్తి చూశాడు. అత్తయ్య విసిగిపోయి, వరండాలోనుండి, గుడిసె లోనికి వెళ్ళిపోతోంది; కదులుతున్న ఆమె కట్టుకున్న ఋంకుమకంకు చీర మునూ కళ్ళల్లో మెరిసింది; కాస్త ధీమాపడ్డాడు. ఆవిడ పిలుస్తున్నంతసేపూ, బీస్‌నదీతీరంలోనే దాక్కుని పశువుల్ని మేపుకుంటున్నాడు. ఆవులు, గేదెలు బురదగుంటలోనికి దిగబడి ఉదయకాలపు ఎండవేడిని లెట్టుకుంటున్నాయి. నదీజలం మంచుకురిసినంత చల్లగావుంది. పశువులకు నీరే హాయి! చల్లదనాన్ని, హాయినీ నెమరువేస్తూ పశువులు ప్రశాంతంగా పడుకుని అటూ ఇటూ దొర్లుతున్నాయి.

వాళ్ళత్తయ్య పిలుపులకు మునూ ఎంతకీ పలకకపోవడం చూసి జయ సింగు "నిన్నే – నిన్నేరా, మీ అత్తయ్య పిలుస్తూంటు" అంటూ మోచేత్తో ఒక్కపోటు పొడిచాడు. జయసింగు ఆ గ్రామ భూస్వామిగారబ్బాయి. నిగనిగలాడే మొహం; తెల్లని పాముపొరలాంటి దుస్తులు. "నీకే ... వినబడ్డం లేదూ? బుద్ధీ, జ్ఞానం లేకపోతే సరీ! అడివి జంతువు. జంతువ్వంటే జంతు వ్వేరా నువ్వు. అలా చూస్తాడూ. నాకేసి! గొంతుకు పగిలిపోయేటట్లు మీ అత్తయ్య చేతరపిస్తూ, మారుపలకవేం?"

మునూ బస్తీపోతున్నాడని జయసింగుకి చాలా సరదాగా వుంది. మునూ పల్లెవదలి అవతలికి విరగడయిపోతే, సిపన్, సిప్పంబరులకు, చుట్టుపక్కల గ్రామాలలోని పిల్లకాయలకు తాను నాయకుడు కావచ్చును. ఇందుకు మునూ అడ్డు. ఈ అడ్డు ఎంతవేగంగా తొలగిపోతే అంతమంచిది.

# 7

మునూను జయసింగు "అడవిజంతువు" అని పిలవడం బిషనుకు చాలా కష్టమనిపించింది. బిషన్ ఉంద్రంముక్కలాంటి మనిషి. గబుక్కున జయసింగు కేసి తిరిగి వెక్కిరింతగా "వాళ్ళత్తయ్య పిలుస్తూంటే ఇంటికెళ్ళడంలేదని మునూని అడివిజంతువంటున్నావే! కన్నతల్లిని రోజూ బూతులుతిట్టే తమరి మాటో? మిట్టమధ్యాహ్నం, గాలుపుంలో తిరక్క 'కాస్త యింటి పట్టునవుండరా బాబూ' అన్నందుకేకాదురా నీ తల్లిని నువ్వు తిడుతూన్నది? రోజూ జోబీ కర్చుకి మీ బాబు రెండేసణాలిస్తోన్నా సరే, స్కూలుకు వస్తున్నారూ దొరగారూ? అదిగో, నోరు మెదపకు... మేమా? సెలవలొస్తేనే పశువుల్ని తోలుకుంటాం; లేకుంటే స్కూల్లోనే వుంటాం. నీలా కాదోయ్ చేకూ! పోనీ ఇక్కడకొచ్చి గడతాడిలా తిరగడం తప్పితే, నువ్వేంపాటుపడుతున్నావో బాబ్బాబూ చెబుదూ కాస్త. వింటాం" చల్లచల్లగా నాలుగు చురకలు అంటించి బిషన్, మునూకేసి తిరిగేడు: "హాఁ వాడిమాటల కేంలేరా! మీ అత్తయ్య పిలవందెప్పుడు? నిబ్బన్న నిట్రాటకు పని పురమాయిస్తుంది. పోనిద్దూ. వెళ్ళకేస్సే."

జయసింగు ఏదో అడ్డబోయి గొంతుక సవరించుకుంటున్నాడు. గబుక్కున మధ్యలో అడ్డంవచ్చి బిషన్ వాడిగొంతును నొక్కివేశాడు. "ఊరుకోవోయ్ పిరికి మొహం! నువ్వా మాట్లాడతావుట మాటలు! నాలుగు మామిడి పళ్ళు తెంపి యిటా పట్రాడానికి నీకు దమ్ముల్లేకపోయాయి కానీ......మరి నీలాగేనా, మునూ; చూడు. ఈ పళ్ళన్నీ వాడేకోసుకొచ్చాడు. ధైర్యమంటే వాడిదీధైర్యం! తెంపుకొచ్చినా వాడే తెంపుకురావాలి. తిన్నా వాడేతినాలి. వాడిదీ ఆ హక్కు. నీకా, నావల్లకాదు...తినరా మును, తిను తిను. నాలుగు పళ్ళు పిడుచుకు తినవేంరా! చూస్తావింకా?" "దొంగతనం నాకు చేతకాదు. వెధవపళ్ళు ఎత్తుకొచ్చి తినాలాయేం? నాలుగు డబ్బులు మావి కావని పారేస్తే సరీ, కావలసినన్ని పళ్ళు!" బుద్ధిగా మూతి ముడుచుకుని బుడ్డిచెంబులా మొహంపెట్టి జయసింగు చెబుతున్నాడు. "ఇంతకే నేనేమన్నానని నీ కంత కోపం? వాణ్ణి వాళ్ళత్తయ్య పిలుస్తోందని చెప్పాను. వాణ్ణొక్కణ్ణీ తిట్టి ఊరుకుంటే బాగుణ్ణు! మనమే వాడిని చెరుపుతున్నామని కర్రుచ్చుకుంటుంది. ఎవడుపడితే వాడితిట్లన్నీ. ఆవిడనోటికి అడ్డూఆపూ వుందంటావా? వట్టి మోటియా మనిషి. ఇంకో సంగతి. మునూ, ఈవాళ వాళ్ళ మావయ్యతో బస్తీకి పోతున్నాడు. మరిరాడు!"

ఈ మాట విని ఎప్పుడూ చలాకీగావుండే భీమంబరుకూడా దిగులుగా మొహం పెట్టేడు. అందరిలోకీ చిన్నవాడేమో, విచారం ముంచుకొచ్చింది. "అవునకదూ మునూ? మమ్మల్నొదిలి వెళ్లిపోతున్నావుకదూ?"

"మరే; వెళ్ళిపోతున్నాన్రా. తప్పదూ" ఈ మాటలు చెబుతూంటే మునూకు వెన్నెముక చురుక్కుమంది. కడుపంతా దేవుకుపోతున్నట్లయింది." అప్పుడే యేం నౌకరీరా ? ఇంకా నీకు పధ్నాలుగేళ్ళు దాటలేదు. చదువు తోంది అయిదోక్లాసాయె !"

"ఏం చేయమంటావో చెప్పు. పెద్దవాడవయావ్; ఎక్కడైనా నాలుగు రాళ్ళు సంపాయించుకోవాలి. నీ పొట్ట నువ్వే చూసుకోవాలి. ఎల్ల కాలమూ ఒకళ్ళింట్లో పడి మేస్తూంటే ఎలా ? నాకూ రేపు ఓ కొడుకూ, కూతురూ పుడతారు. పదపద అంటోందిరా మా అత్తయ్య. మా మావయ్య పరేసకకదా! తను పనిచేసే బాంకి మేనేజరుగారింటిలో నా కుద్యోగం వేయిస్తాట్ట! శాంపురం తీసుకుపోతాను రమ్మంటున్నాడు" ఇలా చెబుతూ మును కళ్ళు పెద్దవిచేసి కొంచెం దర్పంతో చూశాడు. వాడికీసారి లేని ఘనత వచ్చినట్లయింది. తను వెళ్ళబోయేది పట్ణవాసం. పట్నాలలో ఎన్నెన్ని మజాలు! చక్కగ సింగారించుకుందుకు ఎన్నో బట్టలు. తినేందుకు తీపితీపి వస్తువులు. ఆడుకుందుకు వింతవింత బొమ్మలు. ఇవన్నీ తలుచుకుని మును అతిశయంతో మిడిసిపడుతున్నట్లు జయసింగు కనిపెట్టాడు, ఈసుతో.

"హా ! పట్ణవాసం మంచిరజ్జుగా వుంటుంది"

ఈ మాటలోని అర్థాన్నీ, జయసింగు భావాన్నీ కనిపెట్టి మునూ చిన్న నవ్వు నవ్వేడు. నవ్వితే నవ్వాడుకాని, కోపం రాకపోలేదు. ఆ నవ్వు వ్యంగ్యంగా యిలా చెబుతున్నట్లుంది: "ఇది ఆఖరిరోజు; నేనెలాగా వెళ్ళిపో తున్నాను. లేకపోతేనా, వూచిపుచ్చుకుని దవడూడదీద్దును. అంతేనా, పదహారు పళ్ళూ గవ్వల్లా రాలిపోను ! మరి, నీజన్మలో మొనగాడిలా యీ పిల్లలవెంట బయల్దేరవ్."

జయసింగు తండ్రి, తనతండ్రి ఆస్తిని ఎలా 'కా'జేశాడో పిన్నవాడయినా, మునూకు జ్ఞప్తికి రాకపోలేదు. లీలగా జ్ఞాపకం! అప్పుడు ... అంటే తన తండ్రి బతుకున్నపుడు ... అయిదెకరాల మాగాణీ మిగిలింది. ఆ వున్న కాస్త భూమినీ, బుగతగా రిలా తని అరగించుకున్నారో అనోటా ఆనోటా విన్నాడు. ఆపీడు బొత్తిగా పంటలుపోయాయి. 'ఉండి ఉడిగి కొసరెనో'

అన్నట్లు చిదురులుపడ్డాయి. తనఖాపెట్టిన భూమిమీద వడ్డీడబ్బులయినా కట్టలేదు. వడ్డీమీద వడ్డీ పెరగనిచ్చి అన్నీకలిపి నెత్తికిపులిమి ఆ వున్న కాస్త భూమినీ, భూస్వామి భుక్తంచేసుకున్నాడు ... ... ... తనకు తెలుసును; తనతండ్రి ఎంతటి విపరీత పరిస్థితులలో దారుణ అవస్థలతో చుట్టుకుపోయి ఉక్కిరిబిక్కిరయ్యాడోను. పగవాడికయినా అటువంటి కష్టాలు రాకూడదు. చేతిలో ఎర్రనిపేగాణీలేదు. రోగమా, ఊపిరి సలపనివ్వలేదు. తనమీద ... తన రెక్కలకష్టంమీద తిని బతకవలసినవాళ్ళు, ఇద్దరు. ఇవేవీ చాలవన్నట్టు చేతిపిల్లవాడొకడు. తనతండ్రి! నిరాశతో, నిస్పృహతో, కన్నీళ్ళతో భార్యను పిలిచి, తన చిన్నబావమరదిని, చేతిపిల్లవాణ్ణి జాగ్రత్తగా చూడమని చెపుతూ చెపుతూ ప్రాణాలను వదల్లేక వదల్లేక వదలిపెట్టాడు. మునూ కింకా గుర్తు వుంది. ఏమి ఆ భయానకదృశ్యం!

అంతకంటె మరొక భయంకర సంఘటన! తనతల్లి, తిరగలికొయ్య పట్టుకుని కాస్సేపు కుడిచేత్తోనూ యింకొంచెంసేపు ఎడంచేత్తోనూ రాత్రీ పగలు, గిరగిరా, గిరగిరా తిప్పుతూ తిరగలిలో బియ్యంపోసి రెక్కలు ముక్కలయేటట్టు విసరేది. ఆవిడ మోము మరి కనిపించదుకదా! తుదకు తనస్వప్నం లోనుంచి కూడా చెరిగిపోయింది! ఆ తల్లి ... ఆ మాతృదేవి, మళ్ళీ తనకు లభిస్తుందా? ఆనాడు, ఏమిటా దుస్సంఘటన!

మరచిపోదామన్నా మరపుకురాని భీకరస్వరూపం. భీతిని పుట్టించే మోముతో, చూస్తే కడుపు తరుక్కుపోయే వదనంతో, తన మాతృమూర్తి, కన్నతల్లి, చనిపోయి, నేలమీదపడివున్న, నాటిదృశ్యం! ... ఏనేవో అవ్యక్త భావాలతో, అగాధలోతులనుంచి, ఏదో చెపుతున్నట్టు, అనేక కోరికలతో పొదిగివున్న ఆమె ముఖాన్ని తాను చూసిననాటిదృశ్యం ... ఎంత బాధా యుతమైనదని! ఎంతటి నిరాశను జనింపచేస్తున్నది. తన బరువునంతా మోపుతూ, నిదురపోతున్న అతని చైతన్యంలోపడి, ఈదృశ్యం మనసులో మునిగిపోయింది.

మునూ దిగులుగా కృంగిపోజొచ్చాడు.

జయసింగు నిర్ధారణ చేసుకునేందుకు "అయితే నువ్వింక తిరిగిరావన్న మాట?" అని ప్రశ్నించాడు. "ఊహుఁ. మరి రాను. నాకు రావాలనిలేదు". మళ్ళీ వస్తానని అబద్ధమాడి జయసింగును ఉడికించాలనుకున్నాడు. కాని, అబద్ధమాడడం మునూకు మనస్కరించలేదు. నిజానికి తను పుట్టి పెరిగిన ఈ

పల్లెను వదలి ఎక్కడోవున్న పట్నానికి వెళ్ళిపోవాలని లేదు. ఆమాట తలుచు కుంటేనే, ఒళ్ళు జలదరిస్తున్నది. ఇక్కడ వుంటే ఎక్కడా తీరికన్నదే వుండదు. ఆ పనీ, ఈ పనీ చేయమని అత్తయ్యా బెత్తాయిస్తుంది. ఎందుకో ఒకం దుకు అస్తమానూ తిడుతూనే వుంటుంది. జాలీ భ్రమా లేక, కుర్రవాడనిచూడక మితిమీరి పశువును బాదినట్లు చితకపొడుస్తుంది. అయినా సరే; ఎన్నిబాధ లున్నాసరే; ఎంత కష్టమనిపించినాసరే, అతనికిమాత్రం ఆ పల్లె వదలి వెళ్ళిపోవడమంటే ప్రాణం కొట్టుకుంటున్నది!

పట్నమంటే చూడ్డామని లేక కాదు. ఇంత దబ్బునే పల్లెటూరు వదల డం వాడికిష్టంలేదు. నగరజీవితం మహాద్భుతంగా వుంటుందని తానూ విన్నాడు. బస్తీలకు పోయి, తిరిగి వచ్చేటపుడు తనగ్రామంలోని రైతులు ఎన్నోవస్తువులు, వింత సంగతులు మోసుకు వచ్చేవారు. వాళ్లు చెప్పేవారుకదా, పట్నాలలో షాహుకార్లు వేసుకునే సిల్కుదుస్తులు, మిసమిసలాడుతూ వుంటాయిట. తినే తినుబండారాలు కమ్మకమ్మని వాసనలతో చవులూరిస్తాయిట. సము ద్రాల కవతల ఇంతకంటె గొప్పవాళ్ళున్నారు. వాళ్ళ జీవితమే వేరు; నడతే వేరు. ఈ సంగతుల నన్నిటినీ, కథలుగా కూర్చుకుని చేతులు తిప్పుకుంటూ పల్లెటూరిజనం విడ్డూరంగా చెప్పుకుంటూ వుంటే, మునూ ఆశలు రెక్కలు విప్పుకున్నాయి. తనకా జీవితం కావాలని కలలు కంటున్నాడు. అన్నిటి మాటకేం, వాటమ్మ కనుపుకాలా! ఆ మిషన్లంటే మంచి కుతూహలంగా వుంది. వాడు నాలుగోక్లాసు చదువుతున్నపుడు ఆ సైన్సుపుస్తకంలో ఈ మిషన్ల బొమ్మలు చూశాడు. వాటిసంగతులు చదివాడు. ఆనాటి నుంచీ మిషన్లంటే వాడికి చాలా 'యిదిగా' వుంది. ఈ పల్లెటూరిబడిలో వున్న క్లాసులన్నీ చదివేశాక, 'ఇంక నీ కిక్కడ చదువు లేదురా' అన్నప్పుడూ హాయిగా బస్తీకి పోవచ్చును. పోయి, ఈ మిషన్ల బాగోగులన్నీ నేర్చుకుని తనే స్వంతంగా మిషన్లు చేయొచ్చును. ఓఁ కావలసినన్ని మిషన్లు; ఎక్కి తొక్కను!

అందాకా ఈ పల్లెటూళ్లో వుంటే సరి. కొంప మునిగి పోయిందేమీ లేదు. అసలు తను పుట్టిన ఈ పట్టెటూరు ఎంతగొప్పదని! అంతా తనయీడు కుర్రాళ్ళే. వాళ్ళతో కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ వుంటే అదే వుల్లాసం; అదే పండుగ. పొద్దున్నే, పశువుల మందల వెనకాలే నడుస్తూ, చడీచప్పుడూ లేకుండా, అటూ యిటూ చూసి, కావలసినన్ని పళ్ళు తెంపుకో వచ్చును.

ఎవరైనా తినగలగాలికానీ, అన్నీ ఫలాలే! మర్రిచెట్టు నీడ క్రింద, కొద్దిగ తేమగావున్న నేలమీద, మధుర మధుర రుచులనిచ్చే ఆ పళ్ళను తింటూవుంటే స్వర్గం వేరే ఎక్కడ వుంది!

ఏదో ఒకరకం పళ్ళు ప్రతి ఋతువులోనూ పండుతూనే వుంటాయి. వసంతంలో పసుపు పచ్చని, ఎర్రగాముగ్గిన మామిడిపళ్ళు డజన్లకొద్దీ దులిపి పచ్చగడ్డికిందా, గడ్డిమోపుల్లోనూ దాచుకోవచ్చు. నీలిగా ఊదాగావుండే నల్లని నేరేడుపళ్ళు; పొడుగ్గా పచ్చగా వుండే పుల్ బరీపళ్లు; కావలసినన్ని! అదేపనిగ కిందకు రాలిపడుతూ వుంటాయి. అన్నీ ఏరుకుందామంటే చేతులు లేవు. పోనీ వదలివేద్దామంటే ప్రాణం వొప్పుకుదా! పెద్ద అరటాకులుకోసి, వాటిని అంచులో వేసి, పదిలపరచుకోవచ్చును. ఇంక శీతకాలం వస్తుందా, చేపాటి కర్రల్లావున్న చెఱుకుగడలు; పంచదార స్తంభాలు. కునుకుపాట్లు పడుతూ, బద్ధకంగా, నిద్రమత్తుతో జోగిపోతున్న తోటలవాళ్ళకి, దొంగలు పడతారనే అనుమానమే పుట్టదు!

ఈ వూళ్ళోవుంటే, అంతాకలసి చక్కగా 'కోతికొమ్మచ్చాటి' ఆడుకోవచ్చును. విధీవిరామం లేకుండా చెట్లమీంచి కిందకీ మీదికీ గెంత వచ్చును. చెట్లు మనమూ ఎక్కినంత వేగంగా ఎవరెక్కుతారో! పందెం! ఎంత లావైన మానయినాసరే, కోతిలా కుప్పిగంతులు వేస్తూ చరచర యిట్టే ఎక్కిపోతాడు. కాళ్ళతో, చేతులతో పెద్దపెద్ద వృక్షశాఖలమీదను అవలీలగ పాకి, సర్కస్‌లో తాడుమీద డ్యాన్సుచేస్తున్నట్టు నృత్యం చేస్తాడు. చిన్న చిన్న కొమ్మలమీద గిర్రుగిర్రున చక్రీలు కొడుతూ ఛంగ్ ఛంగ్ న గెంతుతాడు. అంత ఎత్తునుంచి ప్రమాదం గిమాదం జాన్తానై; సూటిగా ఖాళీజాగాలోకి చొచ్చుకుపోతూ, ఒక చెట్టుమీదనుంచి ఇంకొకవృక్షంమీదకు సాగిపోతాడు. అప్పటికి బాగా అలసట వస్తుంది. ఆ చెట్టుమీద సేదతీర్చుకుందుకు, కాళ్ళు ముడుచుకు పెట్టుకుని కోతిలా కూర్చుంటాడు. చల్లనిగాలి వీచి, శరీరానికి పట్టిన చెమటను ఆరుస్తుంది. మంచులాంటిగాలి, కసింద మొక్కలను, కదు పుతూ పరుగులుతీస్తుంది. అదే సమయంలో పొదల్లోంచి కీచుమని అరుస్తాయి కీచురాళ్లు; బురదగుంటల్లోంచి బెకబెకలాడతాయి బోదురుకప్పలు; పిట్టలు పాటలు పాడుతుంటాయి. వికసించిన పూలపత్రాలమీదనుంచి గుంపులు గుంపులుగ తుట్టెలు తుట్టెలుగ తేనెటీగలు, తూరీగలు, సీతాకోకచిలుకలు బారులు తీర్చి సంగీతం వినిపిస్తాయి. రంగురంగుల పుష్పాల పుప్పొడులను

పీల్చుకొనే సమయ మది. బజ్ మంటూ ఝూంకారాలు, గాలుల్లో వినిపించే వాతావరణం అది. ఎంత సుందరవంత మీ ప్రకృతి.

ఈ శోభామయ దృశ్యాలను తలుచుకొని, మునూహృదయం కరిగిపో తున్నది. ఈ దృశ్యాలు మధురమైన కంఠాలనుఎత్తి తీయని శృతులతో రాగా లాపన చేస్తున్నట్లనిపించింది. జలజలపారే బీస్‌నది... దాని ఇసుక తిన్నెలు... మనోజ్ఞమైన ఈ పల్లెటూరి నీలి ఆకాశమూ కాదని, తాను వేరై, ఎక్కడనో దూరానవున్న తను ఎరగని చోటులకు తరలి వెళ్ళిపోవడం ! తలుచుకుంటే హృదయవిదారకం ! కాని... పట్నాలలో మిఠాయీలుంటాయి; ఊహుఁ... ఆ మిఠాయీలన్నీ ఇక్కడకొస్తే బాగుండును. అలావస్తాయా...?

"మునోయ్ ! హోయ్‌మునూ ! ఒరేయ్ పాపడా !" అనే ఎన్నమ్మ కేకలు, మళ్ళీవినవస్తున్నాయ్. మునూగుండె, గుబుక్కుమంది. కనులముందు అత్తయ్య వికృతరూపం తాండవిస్తోందా అన్నంతభయం పుట్టుకొచ్చింది. అవును; వాళ్ళత్తది చుప్పనాతిబుద్ధి. ఆవిడదే ఆ నూదిముక్కు; డబ్బాలావున్న దవడలు. అవిగో ఎర్రని కళ్ళు; కోపంతో విడివడిన నల్లనిజుత్తు, పళ్ళని రేకులవంటి పెదవులు.

చటుక్కున లేచి నిలబడ్డాడు.

పిల్లలంతా, జయసింగుసైతం, లేచి నించున్నారు.

మునూ పశువుల్ని లేవగొడుతున్నాడు. కుర్రవాళ్ళుకూడా, తమ తమ గేదెల్నీ, ఆవుల్నీ "జ... జజ... దదద..." అంటూ వింత వింత ధ్వన్యనుకరణలతో పిలుస్తున్నారు. తోకలు మెలిపెడుతున్నారు. చట్టిల్ని చరస్తూ "జ... జజ... దదద...".

# ౨

"ఈడిగిలపడుతున్నాడూ, కుక్కల కొడుకూ! చప్పున నడు గాడిదా!" అంటూ దయారామ్ తన మేనల్లుడు మునూమీద తాచుపాము బుసలు కొడుతున్నాడు. పిల్లవాడికేసి చేతులు జోరుగ విసురుతూ, త్వరగా నడవమని అదలిస్తున్నాడు. తానైతేమటుకు పెద్దపెద్ద మిలటరీ అంగలు వేస్తూ పిల్లవాడు తనతో సమానంగా నడవాలంటున్నాడు. బంగరు జలతారు కోటు తొడుక్కుని మడతలు నలగని తెల్లనిపాగా చుట్టి అడ్డదారిని కాకుండా, చుట్టుదారిని నడక సాగిస్తున్నాడు. ఆ రోడ్డును అంగ్రేజీ సర్కారువారు ప్రత్యేకించి నిర్మించుకున్నారు. సర్కారుతనమంతా తనలోనే మూర్తీభవించి, తాను దానికి ప్రాతినిధ్యం వహిస్తున్నట్లు గర్వంతో అడుగులు వేస్తున్నాడు. అతిశయం, దర్పం దయారామ్‌లో కాకుంటే మరెవరిలో వుంటాయి! తాను 'ఇంపీరియల్ బ్యాంకాఫిండియాలో' చప్రాసీ ఉద్యోగం చేస్తున్నాడాయెను!

పదిమైళ్ళు ఏకాఎకీ నడిచాడో లేదో, పాపం, కుర్రవాడికి కాళ్ళుపులిసి పోతున్నాయి. చెప్పులన్నా లేకుండా నడిస్తే పులవక మరేమౌతాయి! నరాలన్నీ పచ్చి పుళ్ళయి, మరి అడుగుతీసి అడుగు పెట్టలేకపోతున్నాడు. చతికిలబడి ఒగురుస్తున్నాడు, సయితుగ, కాళ్ళనుచాపి, చేతులతో రాసుకుంటున్నాడు. పిక్కలు గుద్దుకుంటున్నాడు. ఎండ నెత్తిపేలగొట్టేస్తోంది. మావయ్య తొడుక్కునే బూనీసు వేసుకున్నాడేమో లాం కోటు లా వేళ్లాడుతూ, ఉక్కపోస్తోంది. చెమటలు ఊరికే కక్కుతున్నాడు. రోడ్డుమీద బళ్ళు ఓ వరసా వాడీ లేకుండా అడ్డదిడ్డంగా నడుస్తున్నాయి. బళ్ళవాళ్ళు అజాగ్రత్తగ, ఎవరిమీదనైనా తోలుతామేమోననే శంకలేకుండా బళ్ళను తోలుతున్నారు. పట్టీలు కొడతాయా అన్నంత దూకుడుగ, మీదకు వస్తున్నాయి బళ్ళు. రేగిపోతున్న దుమ్ము పసుపుపచ్చని ప్రవాహంలా వుంది. గోధుమ రంగు బూడిద మునూ ముక్కులోనికి కొట్టుకొచ్చింది. పిల్లవాడు ఉక్కిరి బిక్కిరయాడు. పాలుగలాటి అతని మోము ఎర్రగ కంది పోయి, చమురు కారుతున్నది. ఇసకపడి నల్లని కనుపాపలు కరకర లాడు

తున్నాయి. నవనవలాడే శరీరంలోని నెత్తురంతా, చెమటరూపాన యిగిరి పోతున్నది. తోటకూర కాడలా నిస్సత్తువతో వేలబడిపోయాడు! అబ్బ, నిస్త్రాణ!

"ఆఫీసుకి వేళయిపోతోంది. దబ్బున్రారా, నీ అమ్మకడుపు కాలా!" అని దయారామ్ మళ్ళీ గద్దించాడు. నిజానికి ఆవేళ, వాడు ఆఫీసుకు ఆలస్యంగా వెళ్ళడమనే ప్రశ్నే లేదు. ఆరోజు చప్రాసీగారు సెలవుమీద వున్నారు. ఇక ఆఫీసూలేదు; ఆలస్యమూ లేదు. అయితేనేమి తానేదో ఆఫీసులో వెలగబెడుతున్నట్టూ, తానాలస్యమయితే ప్రభుత్వ కార్యకలాపాలన్నీ అల్లకల్లోలమయిపోతున్నట్టూ దయారామ్ హడావుడి. దారివెంబడి పోయేవాళ్ళంతా 'ఒహో! ఇంతగొప్ప ఉద్యోగమా' అని గాభరా పడాలి. తన మేనల్లుడు తన మామ ఉద్యోగంచూసి మురిసిపోవాలి!

పొక్కిన పాదాలవంక చూస్తున్నకొద్దీ, మునూకి దుఃఖం పొంగుకు వచ్చింది. కనులలో గిరగిర నీళ్ళు తిరిగి అవమానం ముంచుకువచ్చింది. తనమీద తనకే ఒకవిధమైన జాలి జనించింది. గదుముతోన్న దయారామ్‌కేసి తిరిగి ఓక్క మొహంవేసి "కాళ్ళు తోడుకుపోతున్నాయ్ మాఁవా!" అని ఒక్కసారి వెక్కివెక్కి వెల్లువవలె ఏడ్చివేశాడు. సన్నగా, రివటలావున్న మేనల్లుడి శరీరం నిమురుతూ దయారామ్ 'నీమీద నాకెంతో వాత్సల్యంసుమీ!' అన్నట్టు "చూడూ. ఇటుచూడూ! మళ్ళీ సెలజీతం అందితే, మంచి ఫేషైన జోళ్ళజత కొనిపెడతా" నంటూ ఓదారుస్తున్నాడు.

"అబ్బ! మరి నడవలేను మాఁవా"

దూరాన బండీ ఒకటి నడుస్తున్నట్లు కిర్రుకిర్రుమనే శబ్దం వినవస్తోంది. బీస్‌నదికి ఏడువందలగజాల దూరంలోవున్న రోడ్డు మలుపులో, వాళ్ళిద్దరికీ ఎదురుగావచ్చి బండి నిలబడింది. మునూ ఆ బండీని ఆశతో చూసి "నువ్వడిగితే, నన్ను కాస్త కూచోపెడతాడు మాఁవా!"

"అబ్బెబ్బే! డబ్బులేకపోతే, మనవంక చూడమన్నా చూడర్రా అబ్బాయ్!"

ఈమాట అనేటప్పుడు బండివాడికి వినిపించాలని దయారామ్ గొంతుక హెచ్చించాడు. బండివాడి కీమాట వినిపిస్తే కొంచెం జాలికలగకపోదు. జాలి అంటూ వొకటి కలిగితే, పిల్లవాణ్ణి "ఊరికే బండిఎక్కిస్తాను రమ్మనవచ్చును."

అంతేనేకాని, తనంతటివాడు అంతటి యూనిఫారమ్ వేసుకుని నోరుతెరచి ఒక బండివాణ్ణి 'దేహీ' అని ప్రార్థించడమా!

దయారామ్ అహంకారం, అతని మాటల్లోని గూఢార్థాన్ని బండి అబ్బి గ్రహించి "చాల్లేవయ్యా నీ దర్జా! ఇంతోటి మహా ఉద్యోగివీ బయల్దేరేవ్! నెత్తిగోతలుద్యోగం! చప్రాసీ వేషదూ! రా. ఇలావచ్చి బండీ ఎక్కు. పాపం, నీ ఎర్రకోటు చెమటపోస్తున్నట్టుంది" అని పిలిచాడు.

"నోటికొచ్చినట్లూ మాట్టాడకురోయ్! నేన్నితో మాట్టాడలేదు."

"పెద్ద కబుర్లు చెప్పకురా. ఆ బొట్టెణ్ణిలా బండీ ఎక్కించు."

"ఆట్టే వేషాలేయక, నీదారిని నువ్వు పోతావా పోవా? బిగుస్లు బిగరకు! గవర్నమెంటు మనుషుల్తో వ్యవహారం. ఖైదులో తోయించగలను!"

"అబ్బోరి బాబు! జైల్లో వేయిస్తాట్రోయ్! సిగ్గులేకపోయింది, కుర్రాణ్ణి కాలికి జోడైనా లేకుండా నడిపించడానికీ! యములాడు! యములాడే ... జ జ జ" బండివాడు బండిని తోలుకుంటూ తనమానాన తాను పోయాడు.

దయారామ్‌కి ఉడుకుమోత్తనం హెచ్చి బండివాడిమీదవున్న కోప మంతా, మునూమీద తీర్చుకుంటూ పళ్ళుపిగించాడు. "లే; హుఁ! లేరా! లంజకొడకా! లేస్తావా నన్నొచ్చి పీక నులిపేమంటావురా!"

పీక నులిపివేస్తానన్న వాళ్ళ మాఁవమాటలు, మాటలతో పోవు. ఆ విషయం మునూకు అనుభవమే. భయంవేసి గుబుక్కువలేచి, నించున్నాడు. వెనక్కితిరిగి కారుతున్న కన్నీటిని అరచేతితో తుడుచుకున్నాడు. దయారామ్ తనకు రక్షకుడు. ఏమిటి చేయడం! వాడివెంట నడవక తప్పిందికాదు. నిప్పులు చెరిగే ఎండలో దయారామ్‌వెంట పిల్లవాడు అడుగులు వేస్తున్నాడు.

నడుస్తున్నకొద్దీ, మాఁవను మనసులో బూతులు తిట్టుకుంటున్నాడు. రాళ్ళతో రప్పలతో నిండిన ఒక కొండవుంది. ఆ కొండలోంచి వంకలు తిరి గిన రోడ్డు వక్రరేఖలావుంది. పల్లంలోనికి అనంతమైన దిగువ ప్రదేశాలలోనికి ఆరోడ్డు జర్రున జారిపడుతున్నది. కొన్ని గజాలదూరం నడిచేసరికి, కాలికి కంకరరాళ్ళు తగలడమారంభించాయి. నేల కాలిపోతోంది. ఎండ చుర్రు మంటోంది. ఏవో ఏవేవో ఆలోచనలు బయలుదేరి మునూను ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి. భయంతో గుండె బితుకూ బితుకూమంటోంది. రాళ్ళు గుచ్చుకో

కుండా, అరికాళ్ళు మండకుండా, మునికాళ్ళమీద మునూ కప్పదాట్లు వేస్తున్నాడు.

ఇప్పుడు నడక సులువైనట్లనిపించింది. సారంగానికి అరమైలుదూరాన, కొండ మొదలున, ఎన్నో గొప్ప గొప్ప మేడలు, ఎర్రని మశీదు శిఖరాలు, దేవాలయాల గోపురాలు; కళ్ళల్లో మెరిసేసరికి ఓం! మునూ ఉల్లాసం వర్ణనాతీతం. శిఖరాలు ధగధగ సువర్ణ కాంతులతో ప్రకాశిస్తున్నపుడు అతని ఆనందం మొగ్గలు తొడిగింది. ఇంతసేపూ, నడిచిన నడక, పడిన ఆయాసం, టుప్పున ఎగిరి చక్కాపోయింది!

ఎక్కిన కొండ దిగుతున్నకొద్దీ, లావాలాటి తన కాంతిని సూర్యుడు పట్టణంమీద కరిగించి పోస్తున్నాడు. సూర్యకాంతికి నగరవీధులన్నీ మెరసిపోతున్నాయి. మేడలు,మిద్దెలు,షాపులు,బజారులు అన్నీ కాంతితో వెలిగిపోతున్నాయా అనిపించింది. ఈ నూత్న వాతావరణంలో పాతదృశ్యాలన్నీ కరిగిపోతున్నాయి. మునూకు, అపురూపమైన సౌందర్యం, ఎందుకోమరి, చెప్పలేని సొగసు ఈ నగరంలో గోచరిస్తోంది. పట్టణంలోనికి అడుగు పెట్టాడు. హామ్మయ్య !

ఒహో ! ఏమిటీ గమ్మత్తు ! పెద్దపెద్ద రబ్బరు చక్రాలతో, పరుగులు పెడుతున్నాయి. నాలుగుచక్రాల గుర్రపుబళ్ళు దౌడులంకించుకుంటున్నాయి. ఈ టాంగాలకు గుర్రాల్లేవే. పెద్దపెద్ద భూతాల్లావున్న సొట్టులు; బగ్గీలు, మెయిన్‌రోడ్డమ్మట ఒకటే పరుగు. హోరి, వీటమ్మ కడుపుకాలా !

బజా రమ్మటపోయే గుర్రపు బళ్ళకేసి నోరు తెరచి వాటికి రెండు కళ్ళూ వప్పగించి, విచిత్రంగా చూస్తున్నాడు. చిత్రాల్లోకల్లా చిత్రం. అన్నింటి మాటకేమి ? వాడు చూసిన మహాద్భుత చిత్రం ! ఎడారుల్లోని ఒంటె మూపుల్లా, ఇదేమి టీమృగం ; గుండ్రని రెండు మూపులతో, నల్లని ఆకారంతో, మూర్ఛవస్తోనట్లు రొప్పుతుంటూ, “రఘుప్ రఘుప్ ”న పొగ వొదులుతోంది ; ఒగుర్చుతోంది. అద్దాల తలుపులతో, ఏదో గోధుమరంగు యిళ్ళు దాని వెనకాల తగిలించి వున్నాయి. కీచుమని గోలగా ఈల వేసింది. చెవులు గింగురు మనేటట్లు అరుస్తోందే యిది ! ఈ కీచుమనే విజిల్ చెవినిపడగానే, మునూ గుండె, గొంతుకలోనికి గెంతుకు వచ్చినట్లయింది. అదేమిటో తెలుసుకోవాలనే ఆతృత హెచ్చి, దయారామ్ దగ్గరకుచేరి, ప్రశ్నించాడు “ఏమిటి మామా ! ఆ జంతువూ?” “అదా? అదీ, రైలింజరంరా!”.

మునుపటివలె కాక, యిప్పుడు దయారామ్‌కు కాస్తంత దయ కలిగింది. ఇది వరకటి గర్వంకూడా తొలగి పోయింది. ఏమీఎరగని తన పల్లెటూరువాళ్ల దగ్గరయితే, డాబుదూబులు చూపించవచ్చును; కాని పట్నవాసాలలో యీ దర్జాల నెవరూ ఖాతరు చెయ్యరు. ఆ సంగతి వాడికీ తెలుసును. బస్తీలో అడుగు వేయగానే, తానొక ఇంపీరియల్ బ్యాంకాఫిండియా బానిసననే విషయం స్ఫురణకు వచ్చింది.

దబదబ రొదచేస్తూ, కూతకూస్తూ రైలు ప్లాట్ ఫారం మీద ఆగింది. బిల బిల్లాడుతూ రైల్లోంచి ప్రయాణీకులు దిగుతున్నారు. ఎంతేజనం. పాల కోవాల్లా తెల్లని బట్టలు వేసుకుని, పాము పొరవంటి చీరెల ధరించి,మగవాళ్లు ఆడవాళ్ళు దిగివస్తున్నారు. రంగురంగులదుస్తులు చూడముచ్చటగావున్నాయి. తాను, తన కాంగ్రా పర్వత ప్రాంతాల్లో అనేక రంగులు చూడకపోలేదు; కాని ఇంతటి వింత వింత రంగుల్ని తా నెన్నడు చూడలేదు. అబ్బుర మేమరి! తనలో తాను అద్భుతం! మహాద్భుతం! అనుకున్నాడు.

"వీళ్లు పశువుల్నెక్కడ మేపు కుంటారు మావా? వీళ్లు పొలాల్ని దున్నుకోరూ?".

మెటికెలు విరుచుకుంటుకు మెడ వెనక్కి తిప్పేడు దయారామ్.

"వీళ్ళకి పశువులూ లేవ్; పంటలూ లేవ్."

"అదేమి టవీ?".

"లేక పోతే, మన పల్లెటూరి రైతుల్లా సొమ్ముల్ని కాసుకుంటూ, ఎద్దుముడ్డి పొడుచుకుంటూ కూచుంటారుట్రా, నీ వెర్రి కానీ!".

"మరి వీళ్ళు చేసేపని? వీళ్ళకి కూడెలా వస్తుంది?".

"వొస్సి! గొప్ప పాయింటు తీశావురా! వాళ్ళకి తిండి గింజలకే కరువా? బోలెడంత డబ్బు. హొవ్వో. నేను పనిచేసే బాంకిలో కోట్లకొద్దీ రూపాయిలు మూలుగుతున్నాయ్. వీళ్ళలో రకరకాల వాళ్లున్నా రనుకో అబ్బీ! మనం పండించే గోధుమ పంటంతా కొనేస్తారు; కొని పిండి విసిరిం చేసి, సర్కారు కెగుమతిచేస్తారు; లేదంటావూ, పత్తి కొనేయడం, బట్టలు తయారుచేసేయడం, లాభాల కమ్ముకోవడం; వాళ్ళ కేంరా! బిజినెస్ పీపిలూ. మరికొందరంటావా? ఉద్యోగస్థులు గొప్ప గొప్ప అధికారులు. ఇంతకీ నీ

కెక్కడ నేను నౌఖరీ వేయిస్తున్నానో తెల్సా? ఆయనకి బేంకీలో పెద్దుద్యోగం! తెలిసిందా?"

"చిత్రంగా నేవుంది మాఁవయ్యా"

దుకాణాలవద్ద పొయ్యిమీద కళాయిలలో ఏవో మరుగుతున్నాయి. గుమ గుమ వాసనలు వేస్తున్నాయి. ఆ గుండిగలను తదేకధ్యానంతో చూస్తూ మెల్లమెల్లగా అడుగులు వేస్తున్నాడు. మిఠాయి దుకాణాలలో, జంగిళ్ళనిండా తీపి సామాన్లు అమర్చబడి వున్నాయి. మిఠాయి వరసలు, జిలేబి పాకాలు. పళ్ళేలనిండా, కాజాలు సీలింగుదాకా పేర్చబడివున్నాయి. ఇంకొంచెం దూరంలో పాల్లాయి కొట్లున్నాయి. మరికొద్దిమేర నడిస్తే మంచి షాపులు. రబ్బరు బెలూనులు మహాషోకుగావున్నాయి. ఒక షాపు ముందర బానంత బొజ్జతో ఒకడు కూర్చుని ఊరికే తెగ అరుస్తున్నాడు: ఐస్ "ఐస్! ఐస్క్రీమ్. వెరీనైస్; చలవా, చలవా, లడ్డూలాటైస్ - క్రీమ్." అంటూ బేరగాళ్ళకు దోనె లందిస్తూ "బలేమంచి చౌకబేరమూ..." అని పాడుతున్నాడు.

ఆ అయిసునీరు రుచిచూడాలని మునూ నోరూరింది కాని, అడిగితే వాళ్ళ మాఁవ కూకలు వేస్తాడు. ఇంకో నాలుగు అడుగులువేసి చూస్తాడు కదా, హారిబాబో! నల్లగా గుండ్రని బిళ్ళ తిరుగుతూ, ఒక సినారేకు పెట్టె పాట పాడుతున్నది. రేకుల్లోంచి పాట ఏడుస్తున్నట్టే వినవస్తోంది. మునూ దానిదగ్గరసా వెళ్ళి ఆశ్చర్యంతో చిలకనవ్వు నవ్వేడు. పెట్టెలోని పాట కీచుమని, చటుక్కున బర్రమంది. గతుక్కుమని వెనక్కి తగ్గేడు. తగ్గి మళ్లీ సర్దుకొని ముందుకు వెళ్ళచూస్తున్నాడు.

దయారామ్ వెనక్కితిరిగి "దబ్బునరా దబ్బున! దారి తప్పిపోతావురా"

"ఓయ్ బాబోయ్! దీనింటా పటూరంగానూ, పెట్టె పాడేస్తున్నాది, మాఁవా!"

"ఆ పెట్టెలోకి మనిషెలా దూరతాడు మావా!"

షాపువాడు, కుర్రవాడికేసిచూసి, వేళాకోళంగా నవ్వాడు.

మేనల్లుణ్ణి దయారామ్ "చప్పున్రారా; వెర్రిపీనుగా!" అని పిలిచాడు, మేనల్లుడు దగ్గిరకువచ్చాక "ఆ పెట్టెసంగతిట్రా? దాన్ని ఫోనోగ్రాఫంటార్రా అబ్బాయ్. మనుషు లెవరూ లేకుండానే అదిపాడుతుంది. మెషిన్; మెషిన్."

మెషీను ఎలా పాడుతుందో అడిగేందుకు పిల్లవాడికి ధైర్యం చాలింది కాదు. దాన్ని చూస్తూ అలా వుండిపోవాలనిపించింది. కాని దయారామ్, ఛండశాసనపు ముండాకొడుకు. చెవులు మెలిపెడతాడు. అందుకనే వాడి వెంట వెళ్ళక తప్పిందికాదు.

నాలుగు గజాలదూరం నడిచాడో లేదో, రోడ్డుమీద వింతదృశ్య మొకటి కనిపించింది. ఒక అవ్వ దారిలోనుంచుని, కుక్కబొమ్మలకి "కీ" యిస్తూ వదిలిపెట్టాడు. కుక్కలు తమాషాగా పక్కలు ఎగరవేస్తూ "తైయ్, తైయ్"మని నృత్యం చేస్తున్నాయ్. ఏమిటీగారడీ! హాయ్, హాయ్! మునా, అలా చూస్తూవుంటే, వెనకాలే "టిన్, టిన్‌టిన్ టిన్"మంటూ గంటలు మ్రోగినశబ్దం వినవచ్చింది. తల వెనక్కితిప్పి చూసేలోపున తటాల్న దూసు కుంటూ, రెండుచక్రాల బైసికు లొకటి మీదకువచ్చింది. మీదకు తోక్కుకు రావడమేకాక, పైపెచ్చు ఆ సైకిలువాడు "చూసుకు నడు. తొత్తుకొడకా!" అని తిడుతూ పోయేడు. తలవెంట్రుక వాసిలో, తప్పిపోయిందికాని, లేకపోతే చెత్తలమీద పడిపోను.

"లంజాకొడకా! చస్తావురా! మతిలేని పీనుగా" తిట్లవర్షాన్ని కురిపిస్తూ దయారామ్ వెనక్కి పరుగెత్తుకొచ్చేశాడు.

బొమ్మలు అమ్ముకునే అవ్వ, గబగబవచ్చి ప్రమాదం జరగకుండా మునా చేతిని పట్టుకుని యివతలికి లాగివేశాడు. పరిహాసంగా, "ఒహో ఆ బైసికిలువాడికి తన సైకిలుని, నా కుక్కల్లా తైతైమని ఆడించాలని సరదావేసింది. అయితే పందెం ప్రారంభిస్తున్నానని ముందుగా చెప్పలేదు మాయ వెధవ. హాహాహాఁ ... ఏమీ లెక్కచేయకు. నీకొచ్చిన ప్రమాదం లేదు. అంతా వాల్‌రైటయిపోతుంది. మీవాడు తిడుతున్నాడనా నీ అనుకు? నిన్నెవరయినా తిడితే, యీ చెవితో విని, ఆ చెవితో వొదిలేయ్. అదే దానికి మందు."

ఈ మాటలు విని కుర్రవాడు నవ్వుకున్నాడు.

"నవ్వా? రాస్కెల్. చస్తున్నడు. దిక్కులు చూస్తావేం? దేని కిందయినా పడి చావగలవ్" అంటూ దయారామ్, మేనల్లుడి మొహంమీద ఒక గుద్దు గుద్దేడు. మునా ఏడుస్తున్నాడు. ద్వేషం, క్రోధం, అవమానం అతని గుండెలు నింపేయి. లోలోపల దయారాముని తిట్టుకున్నాడు. యాభై

గజాల దూరంలో ఒక పళ్ళదుకాణం కనిపించింది. అక్కడ రోడ్డు జంక్షన్‌లో స్త్రీలు, పురుషులు గుంపులు గుంపులుగ నడుస్తున్నారు. హఠాత్తుగా, ఒక ఆబోతు తోవతప్పి వాళ్ళను కుమ్మడం ఆరంభించింది. జనం అటు ఇటూ చల్లా చదరవుతున్నారు. అకస్మాత్తుగా ఒక సైకిలువచ్చి, ఆ ఆబోతును ఢీక్కొంది. ఆ సైకిలువాడే, అవునవును, అతనే, ఇందాకా తనను అనవసరంగా ఢీకించాడు. వాడే యీ అవమానానికి కారణం. అందరూ, తనను, తలొక మాటా అన్నారు. దయారామ్, మొహంమీద గుద్దేడు. మళ్ళి ఎందుకు, ఆ సైకిలువాలా ఎదురుగావచ్చి నిలబడ్డాడు? తనను వెక్కిరించడానికే కద! కొంచెం మరపూ తెరుపుతో ఓ కన్ను మూంవమీదపెట్టి, మరొక కంటితో బజారంతా తిలకిస్తున్నాడు. ఆ ఉక్కుగుర్రంవాడు, ఆ సైకిలు మనిషి మళ్ళీవచ్చి ఢీకించడుకద! వెనకనుంచి ఏదైనా బండివచ్చి మీదపడుతుందేమోననే భీతితో మొహం అటుతిప్పి చూశాడు.

వరసలు తీర్చిన షాపులతో సందులన్నీ జనసమర్దంగా వున్నాయి. షాపుల ముందు గుడ్డతెరలు వేల్లాడుతున్నాయి. గుడ్డల సందుల్లోంచి, సూర్యకాంతి లోపలకు దూరుతున్నది. షాపులముందు ఆడవాళ్లు, మగవాళ్లు చకచక నడుచుకు వెడుతున్నారు. అప్పుడప్పుడు చిత్రమైన మనుష్యులుకనిపిస్తున్నారు. సిల్కు చొక్కాలు వేసుకొని, బంగరు కాంతులతో మెరసే టోపీలు పెట్టుకుని, చక్కని జోళ్లు తొడుక్కొని, ఎవరో కొందరు సంపన్నులు అడపా తడపా, హోషుగ్గా నడుచుకు పోవడం, మునూ గమనించకపోలేదు. ఆజోళ్లు ఆ లాల్చీల తీరూ, చూస్తేచాలు, వొళ్ళుఝుమ్మ యిస్తున్నది. నాలుగడుగులు వేసే సరికి పక్కనే కొంతమంది ఆడవాళ్ళ గుంపు! కాళ్ళు నేలమీద పెట్టి నడుస్తున్నారా లేదా అన్నట్లు, అలా అలా తేలిపోతూ వెళ్ళిపోతున్నారు. కట్టుకున్న సిల్కు చీరలు రెప రెప లాడుతున్నాయి. చేతులు వయ్యారంగా తిప్పుకుంటున్నారు. తలమీద ఎర్రని తోపు రంగు ముసుగులు గాలికి పక్కకు ఒత్తిగిల్లుతున్నాయి. మునూ కీ దృశ్యమంతా, వొక స్వప్నం వలె వుంది. కలలోంచి తాను నడుస్తున్నట్లు తోచింది. ఇదొక కల్పనా జగత్తు. ఇందులోని ప్రతి వస్తువు ధగధగ ప్రకాశిస్తోంది. ఈ ప్రపంచానికీ, తను పుట్టి పెరిగిన కొండల లోకానికీ, ఎంత వ్యత్యాసం! ఎక్కడా కంచు కాగడా వేసి వెతకి చూసినా, పోలికే కనిపించదే! ఆహా! పట్టి గమ్మత్తు. గారడీ! మాయ!

బస్తీలోనికి వెడుతున్నకొద్దీ, కూలిజనం కనిపించారు. వాళ్ళ మూపులమీద ఎంతెంత బరువులు? అంతంతలేసి బస్తాలను వీపుమీద వేసుకుని ఏమీ కానట్టు మోసుకు పోతున్నారు. వీళ్ళ ఆకారాలను చూస్తే మునూకి మరీ విభ్రాంతిగా వుంది. కొండ ప్రాంతాల వాళ్ళకీ, ఈ కూలీలకీ పోలికల్లో ఏమీ తేడాలేదు. అవే ముక్కులు; అవే నుదుళ్ళు; అవే కళ్ళు; ఆచేతులు కాళ్ళు అన్నీ అంతే. ఈ ప్రపంచానికి అంటే ఈ నగరానికి గల ప్రాముఖ్యత యేమిటో పిల్లవానికి అవగాహన కాలేదు.

దయారామ్ తనకంటె ముందు నడిచిపోతున్నాడు. మునూ కొంచెం వెనక్కి పడ్డాడు. మార్బుల్ రాళ్ళతో కట్టిన ఒక పెద్ద భవనం ముందుకు వచ్చి, దయారామ్ ఆగిపోయాడు. తొందరగా పరుగెత్తుకు వచ్చి మునూ, అతనిని కలుసుకున్నాడు. ఆ భవనం చూపరుల కనులను చెదర గొడుతున్నది. మునూ కాత్పుత హెచ్చి గుండె దడదడ లాడింది. దయారామ్ ఆ భవంతి లోనికి అడుగులు పెడుతూనే "సలాం పిర్‌దిన్" అనడం మునూ విన్నాడు.

"సలాం సలాం. నువ్వీ రోజు చాల లేటయిపోయావే! బాబూ సాహేబ్ నీమీద ఊరికే అగ్గయిపోతున్నారు. మధ్యాహ్నం ఆయనికి భోజనం మాటో? నువ్వు కనిపిస్తేగా!"

పిర్‌దిన్ ఉబ్బసం ముందాకో కుకు. మరేమీ పని లేనట్టు అదేపనిగా దగ్గడం ప్రారంభించాడు. రంగువేసిన తన ముసలిగడ్డం జలతారు ఎర్రనికోటు మీద పీచులా వేళ్లాడుతున్నది. ఆ పీచును వ్రేళ్ళతో దువ్వుతూ దయారామ్ కేసి కన్ను రిట్టగించి చూస్తున్నాడు. ఈ ముసలాడిని గురించి, మాటి మాటికీ దయారామ్ ఏమేమో తన భార్యతో చెబుతూవుండేవాడు. అవన్నీ జ్ఞాపకా నికివచ్చి వీడే పెద్దబంట్రోతు అని మునూ నిర్ధారించుకున్నాడు.

పిర్‌దిన్ అన్నమాటలు దయారామ్‌కు చీమకుట్టినట్టయినా అనిపించ లేదు. ఏమంటే, బాబుగారు తనమీద ఎన్నడూ కోపగించరు; విసుక్కోరు. పైగా వాడి అవసరం ఆయనకు ఎంతైనావుంది. నౌకరు దొరకడం బస్తీలలో దొరకడమే గగనం! మామూలు ధోరణిలో దయారామ్, "అయితే బాబు గారు ఆఫీసులోవున్నారా, లేరా?"

చేతులు ఊపుతూ "ఆఁ ఆఁ వున్నావున్నారు, త్వరగా వెళ్ళవోయ్; ఉత్తినే నించోకా! ఈవేళ పీక మొయ్యాపనుందీ. కంటోన్మెంటు కింకా

సొమ్ము బట్వాడా చేయలేదు. షాహుకార్లొచ్చి ఆయనమీద పడి చంపేస్తున్నారుకద ! ఏ వ్యవహారమూ తెమలకపోతే ఎలాగ ? ”

పిర్‌దిన్ ధోరణి దయారామ్ గ్రహించి, దీనికి మందు వేయాలనుకున్నాడు. ఈ చచ్చుపీనుగను కాస్త ఉబ్బిస్తే చాలును. అంతా రైటయిపోతుంది.

“మియాన్ సాహెబ్ ! అంతే సాహేబ్జీ ! ” ఈ సంబోధనతో పిర్‌దిన్ ఉబ్బి తబ్బిబ్బు అయాడు. ఎవరైనా తనను గొప్ప మహమ్మదీయ కులజ్ఞునిగా మర్యాదచేస్తే చాలును. ఏది ఎలాగైతే తనకెందుకు ? అనవసర గొడవ. “ అహాఁ ! నీ సంగతి కాదోయ్ ! వాళ్ళంతా లేటుగావస్తే ఎలా చెప్పు” అని సర్దేశాడు. దయారామ్ నవ్వుకుంటూ తన మేనల్లుణ్ణి “జాగ్రత్తగా నా వెంట రారా” అని లోపలికి తీసుకుపోయాడు.

ఇద్దరూ ఒక పెద్దగదిలోనికి ప్రవేశించారు. గది చల్లగా హిమవంతంలా వుంది. ఇత్తడివూచలమట్టూ చెవులు రిక్కగించుకుని, కళ్ళు వప్పగించి ఆత్రంగా చాలామంది కూర్చుని వున్నారు. టంగ్ టంగ్ మని రూపాయలు మోగుతున్నాయి. రూపాయల సంచులు ఘుళ్ ఘుళ్ళు మంటున్నాయి. క్రొత్త కరెన్సీ నోట్లు జిల్ జిల్ మని బయటకు వస్తున్నాయి. మునూ తదేక దీక్షతో పరకాయిస్తూ, మామ వెనకాలే మరొక గదిలోకి వెళ్ళాడు. ఒక పెద్ద టేబిల్ ముందు, అతనికంటె ఎంతో ఎత్తుగావున్న ఒక కుర్చీలో, ఒక పొట్టి బుడంకాయ గుమ్మగూబలా కూర్చుని పుస్తకం తెరచి లెక్కలు చూసుకుంటున్నాడు. మొహం మెరక పల్లాలతో ఎగుడు దిగుడుగా వుంది. ముక్కు చప్పిడి. బుగ్గల మీద నల్లని చుక్కలు. పల్చని పెదవులపైన బొద్దుగా వున్న మీసాలు సగం సగం నెరిసి పోయాయి. మొహం రాచ్చిప్పంత. సీలింగు మీదనుంచి ఫేన్ ఒకటి గిరగిర తిరుగుతూ నాలుగు రెక్కల్నీ చాపి గాలిని విసురుతూంది. గదిలోనికి అడుగు పెట్టీపెట్టగానే, దయారామ్ పాదాలను దులుపుకొంటూ “ ఏలిన వారికి ఈ నాసాను దాసుడు దండాలండి సాబ్ ! దణ్ణాలు దణ్ణాలు!” అంటూ మెల్లగ మునూ చెవి కొరికేడు “ ఏలిన వారికి సాష్టాంగాలు పెట్టు!”.

మునూ కిదంతా అయోమయంగా వుంది. ఘుళ్ ఘుళ్ మంటున్న రూపాయలతో, చిందర వందరగా వున్న కరెన్సీనోట్లతో, ఇత్తడివూచలతో, కుర్చీలు బెంచీలతో గిరగిర తిరుగుతున్న ఫాన్లతో వున్న ఈ లోకం మరో

ప్రపంచంలా వుంది. ఇందులోనికి అడుగు వేయగానే, మునూ బిత్తర పోవడ మారంభించాడు. కంగారుతో, దయారామ్, అనమన్న మాటలను యథా లాపంగా అనేశాడు. బాబుగారు కుర్రవాడు పెట్టిన నమస్కారాన్ని అందు కున్నట్లయినా, తల ఎత్తితే ఒట్టు.

కొంతసేపు వికారమైన నిశ్శబ్దత తాండవించింది. మొదట అర్థంలేని నవ్వు మాత్రం బాబుగారి పెదవులపై కనీ కనిపించకుండా దాగుంది. తరువాత బాబుగారి నవ్వు రోతపుట్టిస్తోన్నట్లు స్పష్టంగా గోచరించింది. మునూ కీ నవ్వు భయాందోళనాలను కలిగించాయి. ఆయనకెందుకే వెటకారం అనుకున్నాడు.

దయారామ్, తన ఎదురుగా ఆసీనులై వున్న బాబుగారికేసి నమ్రతగా "మహారాజ్ ! ఇదిగో నండీ; వీడే నా మేనల్లుడు. తమ పాదాల దగ్గర పెడితే ఓయింటివాడు అవుతాడుకదా అని తీసుకొచ్చాను మా ప్రభూ ! తమ లోగిలి కనిపెట్టు కుంటాడండి బాబయ్యా" అని విన్నవించు కున్నాడు. "హాఁ! ఐసీ! ఇంతవరకూ నేను చూడనేలేదు. వాడేనా వీడూ?" బాబుగారు మునూ కేసి, తమ చూపుడువ్రేలు ఆడిస్తూ ప్రశ్నించారు. "చిత్తం, జనాబ్ చిత్తం ! ... మునూ ! వారే నీకు తల్లిదండ్రులు! బాబుగారికి మొక్కు".

బాబుగారు కుర్చీలో కూచుని పాదాలను డ్రాయరు ముందుకు బాణా కర్రలాగ చాపుకున్నారు. వారి పాదాలకు వున్న నల్లని బూట్లను మునూ తదేక దీక్షతో పరిశీలిస్తున్నాడు. ఆ నల్లని బూట్లు ఎంత బాగున్నాయని ! "నాకిలాటి బూట్లు ఎప్పుడు దొరుకుతాయు" అని ఎవరినో దీనంగా అర్థిస్తు ట్లున్నాయి అతని దృక్కులు.

మామ కేకవిని మేనల్లుడు గతుక్కుమన్నాడు. "ప్రభువువారి పాదా లకు దణ్ణాలండి బాబు దణ్ణాలండి" టేబిల్ మీద కుడిప్రక్కగావున్న నల్లని మెషిన్ గణగణమ్రోగుతూంటే దానిమీద దృష్టిని మరల్చిన బాబుగారికి మునూ మాటలు చెవినిపడతాయా ? మెలికలు తిరిగిన వైరుడిప్పను ఎడమచెవి దగ్గర పెట్టుకుని, గొట్టంలో మూతిపెట్టి బాబుగారు మాట్లాడుతున్నారే! ఏమిటీ దీనికథ ?

"యస్; సర్; ఓ యస్, సర్ ! . . . డి జంక్షన్, డి టెహాను . . ."

తనకు కాబోయే యజమాని ఏదో మిషన్‌తో చెప్పేస్తున్నాడే ! ఆయన మాట్లాడేది ఇంగ్లీషా, కాదా అని మునూ వితర్కించుకుంటున్నాడు.

ఇంగ్లీషు చదువుకున్న వాళ్ళకి పెద్ద పెద్ద ఉద్యోగాలు లభిస్తాయనీ, లేనివాళ్ళకి బంట్రోతుగిరీ లేననీ, అందుకే కాబోలును, తన మాష్టారు పదేపదే చెబుతూ వుండేవాడు !

బాబుగారి భాష సమ్మోహనాస్త్రంలావుంది. విభ్రాంతుడై, వారి బట్టలవంక పరిశీలనగా చూస్తున్నాడు. నిడివిగా, ఎత్తుగావున్న తెల్లని కాలరు; బంగారపు చమికీవేసి, ఎర్రగావున్న మొఖమల్ బుట్ట చుట్టూ పొడవైన గుండ్రని తలపాగా, డబ్బుసంచీల్లావున్న జేబులతో ఖాకీ కోటూ; వదులుగా వున్న పైజమా; కాలికి నల్లని, ఇంచక్కని బూట్లు; "నాకలాంటి బూట్లేకనక వుంటేనా, యిందాకట్లా యీడిగలబడుదునా మరి ? ఇలా పాదాలు పొక్కి వుండునా ?" అనుకుని విచారించేడు.

బాబుగారు ఫోనులోంచి మూతి యివతలపెట్టి "అచ్ఛా గుంటవెధవని బీబీజీకి అప్పగించు."

బాబుగారి ఆజ్ఞ విని, చేతులుజోడించి, దయారామ్ సెలవు పుచ్చుకున్నాడు. నల్లని బూట్లకోసం జపంచేస్తున్న మునూ రెక్కలు పట్టుకుని బరబర అవతలకి లాక్కుపోయాడు. బ్యాంకు ఆవరణ సొగసుగ, దర్పంగ కనిపిస్తున్నది.

ఆవరణదాటి మెట్టురోడ్డుమీదకు నడిచాడు. కొద్దిదూరం నడిచేసరికి, ఎగుడుదిగుడుగ, కిటికీలేని యిళ్ళు కనిపించాయి.

ఇళ్ళన్నీ ఒకదానిమీద యింకొకటి పడుతూ క్రిక్కిరిసివున్నాయి. అక్కడక్కడ విరిగిన సీసాలు, తుప్పుపట్టిన టిన్నుడబ్బాలు, చిల్లు బాల్చీలు గుట్టలుగా మేటవేసి వున్నాయి. కుళ్ళిపోయిన కూరగాయలు, నాచుపట్టిన యిటుకబెడ్డలు కుప్పలువేసి వున్నాయి. ఇంత అసహ్యంగావున్నా, "ఇది పట్నవాసంసుమీ" అన్నట్లుంది, ఆ వాతావరణం !

ఆ ఇంటివరసలుదాటితే, చివరనేవుంది బాబుగారి లోగిలి. చతురస్రాకారంతో ఒకఅంతస్తు మేడ. ముందు ఒక వరండా. ఆ వరండాలో పాశ్చాత్య పద్ధతిని ఒక నల్లనిబోర్డు తెల్లని అక్షరాలతో అమర్చబడివుంది.

"బాబూ నాథూమల్;
సబ్ - ఎక్కౌంటెంట్:
ఇంపీరియల్ బ్యాంక్, శ్యామ్‌నగర్".

అనే దానిపైనున్న అక్షరాలు బాబుగారి ఘనతను మనదేశ నాగరకులకు చాటి చెబుతున్నవి.

వంకలు వంకలుగావున్న ఆ రోడ్డు కొండకు పోయేదారి. ఆ దారి కిరువంపులా వృక్షాలు. ఎత్తుగా మెట్టమీద, లేత పసుపురంగు బంగాళాలు, నీడలు పరుస్తోన్న చెట్లక్రింద రమ్యంగా కనిపిస్తున్నాయి. బంగాళాల చుట్టూ జుత్తు కత్తిరించిన పచ్చని దుబ్బులు వరసలుతీర్చి వున్నాయి. బుల్లిబుల్లి చేతులను త్రిప్పుతూ, చిన్ననోటితో నీటిని పైకి పుక్కిలించే గొట్టాలతోనుండి ఎంత ముచ్చటగా వుంది! పరుపులవలె పరచివున్న మెత్తని పచ్చగడ్డితో, రంగు రంగుల గుత్తుగుత్తుల పూలతో, బంగాళాలు చూపరుల కనులు చెదరగొడుతున్నవి. మునూ కిదంతా ఒక గారడీలావుంది. ఆ భవనాలలో నివసిస్తున్నది మనుష్యులో, మరి దేవతలో! ఎంతగాభరాగావుంది ఈ జీవితం! చెదరిపోయే అతనిదృష్టి భవంతులమీదనుంచి మరలింది. పెద్దభూతంలావున్న ఒకాయన ఎర్రని వెడల్పైన మొహం, నెత్తిమీద కాకీదొకటి బుట్టలాగ బోర్లించుకొని తెల్లని కాలరును, సింధూరపురంగు గుడ్డపీలక చుట్టుకుని కిందకు దిగి వస్తున్నాడు. సిగ్గయినా లేకుండా కాకీ నిక్కరును తొడుసుకువచ్చిన తిరగలి దిమ్మలవంటి పిర్రలు, పెద్ద గుండ్రని బానబొజ్జ, వీటిని కప్పకుండావున్న చిన్న షర్టూ వేసుకున్నాడు. చిత్రమైనవి, చాల విచిత్రమైనవి, గోధుమరంగు బూడ్సుల జోళ్ళు. తెల్లదొరలంటే ఇలా వుంటారని, మునూ తీర్మానించుకున్నాడు.

కుడిపాదాన్ని హఠాత్తుగా కిందకుకొట్టి ఎటెన్షన్లో నిలబడి దయారామ్ "సలాం, హుజూర్! సలాం" అనడం మునూ గమనించాడు.

ఇది విని ఆ భీకర స్వరూపి ఏం చేశాడోమాత్రం మునూ చూడలేదు. కొండదిగువనున్న పట్టణంలోని ఇళ్ళనుచూస్తూ, దొరగారు బెత్తం ఝుళిపిస్తూ నడుచుకుపోవడంమాత్రం చూశాడు. కనుచూపు మేరకు దొరగారిని వెళ్ళనిచ్చి ఆయ నెవరో అడుగుతోన్నట్టువున్న మేనల్లుని చూపులను గ్రహించి ఎంతో భయంగా, నమ్రతగా చెబుతున్నాడు. "మా బేంకికి ఏజంటుగారంటే ఆయనేన్రా!"

దయారామ్ త్వరత్వరగా బాబుగారింటికివెళ్ళి తలుపు తట్టేడు. గుమ్మం ముందు కొంచెం అనుమానంగా నించుని చూస్తున్నాడు. మళ్ళీ తలుపుగొళ్ళెం టిక్ టిక్ మనిపిస్తూ పిలిచాడు. కొద్దిసేపు గడిచింది. ఎంతకీ తలుపు తెరచిన అలికిడి కానరావడంలేదు. "బీబీజీ! అమ్మా! ఏమండో!" అని మిరపకాయ తిన్న కాకిలా అరుస్తున్నాడు.

వెంటనే ఓరవాకిలిగా తలుపు తెరచుకుని ఒకామె ప్రత్యక్షమయింది. ఆవిడ మోము చంచలంగా కనిపిస్తోంది. సన్నని పెదవులమీద అలసిన నవ్వు, నుదుటమీద కొద్ది ముడతలు. కళ్ళురంగు గోధుమ. సూదిముక్కును నిఘాగా చూస్తున్న మెల్లచూపులు. చదునైన రొమ్ము; సన్నని ఆకారం. ఒక మట్టిబొమ్మను సిల్కుచీరలో చుట్టబెడితే, ఎలావుంటుందో అలావుంది బీబీజీగారు. కాని కట్టుకున్న చీరమాత్రం చాలా అందంగావుంది. సిల్కుచీరమీద వెడల్పయిన పువ్వులు. మునూ ఇలాటి చీరెలు ఒక్కసారే ఇదివరకు చూశాడు. జయసింగు తల్లి ఒక భూస్వామి భార్య. పట్నవాసంలో పుట్టి పల్లెకు కాపరానికి వచ్చింది. వచ్చేటప్పుడు నగర వైభవమంతా తనతోనే తీసుకువచ్చినట్లు, ఒక చీరె విడిచి మరొక చీరెను నిముష నిముషానికీ మారుస్తూనే వుంటుంది. పల్లెటూరి రైతు స్త్రీ లంతా "ఆవిడ కేమిట్రా! మాటే ఒక మాణిక్యం! దర్జాఅంటే అదిగదీ!" అనిపొగుడుతూ వుండేవారు. జయసింగు తల్లి తప్ప ఎవరూ ఇలాటి చీరెలు కట్టుకోవడం ఇంతవరకూ మునూ చూడనే లేదు. ఆనాడు ఆవిడ; ఈ నాడు ఈవిడ.

బీబీజీ దయారామ్ కేసి ఆశ్చర్యంతో చూస్తోంది. ఎందు కిలాగ చూస్తున్నదా అని మునూ కొంచెం భయపడ్డాడు. ఈ ప్రపంచం సహితం విడ్డూరంగా వుంచే! బీబీజీ మొహమే, తనకు కొత్త. ఆవిడేకాదు ఆఇంట్లో వున్న గదులు, కుర్చీలు, బల్లలు, చిత్తరువులతో అలంకరించిన గోడలు అంతా వింత వింతగా కనిపిస్తున్నాయి. ఈ కొత్తదనం మునూకు హడలు పుట్టించింది.

దయారామ్ చేతులు జోడించుకొని "బీబీజీ! వీడే నమ్మా వీడే, మా చిన్న మేనల్లుడు. మీ పాదాలదగ్గర పెడదామని తోలుకొచ్చేశా నమ్మా!" అంటూ మునూను క్రోధంగా "దణ్ణం పెట్టరా వెధవా! పందిలాగ. 'బీబీజీ, మీ కాళ్ళకు మొక్కుతున్నా నమ్మా' అనూ; అన్నా పీనుగా!".

రెండు చేతులూ పైకెత్తి మునూ "మీ కాళ్ళకు ..." అనేలోపున లోపల గదుల్లోంచి గుక్క బెడుతోన్న ఒకబిడ్డ గొంతు వినవచ్చింది. రాకాసి గొంతుకతో బీబీజీ అరుస్తూ వెనక్కి వెడుతోంది "అబ్బబ్బ! రాకాసి పిల్లా! నా ప్రాణం కొరికేస్తోందీ! ఎవరితోనూ మాట్లాడు కోనీయదు; ఏ పనీ చేసుకోనీయదూ! ఇదేం సంతమ్మా, దిక్కుమాలిన సంతా! వెధవ పోలికలు, ఎవరి పోలికలో కానీ! ... చచ్చేవ్ కావే పీనుగా! నిన్నెన్నమ్మ ఎత్తు కెళ్ళా. ఏం దొమ్మొచ్చిందే నీకు ...". "అయితే అంతా రైటయి

నక్లేనా అమ్మగారూ? ఈ బొట్టెణ్ణిక్కడ దిగవిడిచేనా?" అని దయారామ్ అడగక పోతే, ఇంకా ఆ తిట్లప్రవాహం సాగిపోయివుండేది. ఆవిడ నాలుకకు అమ్మా అవూ లేదు. తిట్లు తిడుతూ కూర్చోమంటే అహోరాత్రాలు విసుగూ విరామమూ లేకుండా రోజుల తరబడి కూర్చోగలదు. ఎంత ఓపిక ఆవిడది!

దయారామ్ ప్రశ్నకు బీబీజీ ఏమి సమాధాన మిస్తుందో మునూకు వినాలని కుతూహలం హెచ్చింది. ఆవిడ పేరు చెవితే చాలు గుండె దడదడ లాడుతూంది. బీబీజీ కోడిపెట్టలా మెడ చాచింది. "ఇంకా మనం ఏమీ మాట్లాడుకోందే! కాస్సేపుండరా!" అంటూ గదిలోనికి వెళ్ళి పోయింది. దయారామ్ ఇవతల నుంచే "ఉంటా.నమ్మగారూ! వుంటాన"ని కేక వేశాడు.

బీబీజీ గబగబ లోపలకు వెళ్ళి, ఏడుస్తున్న పిల్ల వీపుమీద పిడకలాంటి ఒక్కచరుపుచరిచి, బయటకు చక్కావచ్చింది. "బాబుగారితో చెప్పావుట్రా?"

"ఆం! మనవిచేసుకున్నా నమ్మగారూ! అలాటి అడ్డదిడ్డప్పన్ను వీడెరగడమ్మా మీ దయవల్ల! కుర్రాణ్ణి బాబుగారు చూసి, నచ్చేరు. తమకు వీణ్ణి అప్పగించి రమ్మన్నారు!

"సరేలే! అలా అయితే బజారుకోసారి వెళ్లిరా. రాత్రికి కూర లేవీ లేవు."

మెల్లిగా ఏడుస్తే బీబీజీ వినిపించుకోదని గ్రహించి పిల్ల కింకపెట్టసాగింది. బీబీజీ శాపనార్థాలను కురిపిస్తూ పక్కగదిలోకి నడిచింది. మునూ శరీరమంతా, జీలుగబెండువలె తేలిపోతున్నది.అమితభయాశ్చర్యాలతోయీవ్యవహారమంతా, వచ్చినప్పట్నుంచీ చూస్తూనేవున్నాడు. బీబీజీని చూసేసరికి వాళ్ళ మేనత్త స్ఫురణకు వచ్చింది. అయితే తన మేనత్త ఇంత చెడ్డదికాదు. "మా మేనత్త యింతలేసి తిట్లు తిట్టదికాదే!" అనుకున్నాడు.

అతని హృదంతరాళాలలో ఒకగీతం జాలిగ, విషాదస్వరంతో, అస్పష్టమైన లయతో, వినవస్తున్నది. ఆపాట ఏకాంతస్థలాలలోనిది: 'ఈ స్త్రీ యింట్లో నీ జీవితం ఎలా వుంటుందనుకుంటున్నావ్?' అని ఆ గేయం ప్రశ్నిస్తున్నట్లు, వెక్కిరిస్తున్నట్లు, కనిపించింది.

అమ్మగారేమనుకున్నారో మరి, పక్కగదిలోంచి ఇలా బొబ్బపెట్టారు: "పోనీ, ఓపని చేయరా, అబ్బీ! ఆఫీసునుంచొచ్చేటపుడు, బాబుగార్నే కూరలు కొనుక్కొని రమ్మనమను. కుర్రాడిచేత పట్టించుకొస్తేసరి!"

అమ్మగారి ఆజ్ఞ విన్నాక మునూకు మరీ కంగారెత్తింది. వాడిమీద వాడికే జాలి జనించింది. విచారంతో హృదయం భారమయింది. కొండలుదాటి అంతదూరంనుంచి నడిచివచ్చిన ప్రాణానికి కాస్త విశ్రాంతైనా లేకుండా, యిదేమి టీతంటా ? కాస్సేపు కూర్చుని సేదతీర్చుకోవచ్చునుకదా అనుకుంటే, తలమీద పిడుగుపడ్డట్టు బీబీజీ హుకుం వచ్చిపడిం దిదేంఖర్మం ! ఆకలి నకనక లాడుతున్నది. భారతీయ గృహాలకు ఎవరు ఏ వేళల వచ్చినా, ఆ అతిథులకు, రాగానే కాళ్ళు కడుక్కుందుకు నీళ్ళుయిస్తారు; భోజనానికి లెమ్మంటారు. అది గృహమేథి ధర్మం. కాని యిదేమిటీవరస ? మునూ, రాగానే భోజనానికి రమ్మనమనడం అలావుంచి, పైపెచ్చు మంచీ చెడ్డా లేకుండా, యింట అడుగుపెట్టడమే తరవాయిగా పనికి తగిలిలేస్తోందీవిడ ! మంచి మర్యాదస్తురాలే !

'బహుశా పట్నవాసపాళ్ళింతేరా' అనుకున్నాడు మునూ.

"అలాగేనండమ్మా. అలాగే పంపిస్తాను" అంటూ దయారామ్, మునూ రెక్కలు పుచ్చుకున్నాడు : "రారా. రా"

రెక్క పుచ్చుకొని బరబర అవతలకి లాక్కుపోతూ, దయారామ్ మెల్లగా నచ్చచెబుతున్నాడు. "బాబుగార్ని, అమ్మగార్ని జాగ్రత్తగా కనిపెట్టుకుండూ ! నీ బాగోగులన్నీ బాబుగారు చూస్తార్లే. ఏం, అలా చూస్తున్నావ్, గుడ్లగూబలా? 'నెలకీ మూడురూపాయలు జీతం యిస్తాన్లేరా' అన్నారుకదా బాబుగారు ! చాలదూ ? ఓ! నీ క్కావాల్సినంత తిండమకో అబ్బీ ! తిన్నంత ! నువ్వు తినగలిగినంత. నీకు తీరిక దొరికిందీ, నా గదికి వచ్చేయ్ ! నా గది చూపిస్తాలే. బేంకి దగ్గరుంది ".

ఈ మాటలు వింటున్న కొద్దీ పౌరుషం గొంతుకలోకివచ్చి ఆగిపోయింది. ఉక్రోషం, చేతకానితనం, ఆత్మాభిమానం హెచ్చి, కనుకొలకులలో నీళ్ళు తిరిగి, ఆ నీళ్ళచూపులలోనుండి బీస్ నదీజలాలు వెండి తీగలవలె తళ తళ మెరిశాయి. ఎర్రని సూర్యకాంతిలో, ఎత్తైన రాళ్ళగుట్టలు, కొండలు, గిరగిర తిరిగి దుఃఖాన్ని రెట్టించాయి. బీస్‌నదీ తీరాన, ఇసుక తిన్నెలమీదుగా, భూమినీ ఆకాశాన్నీ లెక్కచేయక, మైళ్ళకు మైళ్ళు అలసటలేకుండా, అరుస్తూ తిరిగే తన పశువులమంద కనిపించింది......

ఆ రాత్రి బాబూ నాథూరామ్ గృహంలో వంటగదిమూలను మునూ ఉండచుట్టుకుని పడుకున్నాడు. అలసలసి వున్నాడు కనుక బాగా నిద్ర

పట్టింది కాదు. చికాకుగావున్న మనస్సుకు నిద్రపట్టదు. చినిగిన పాతగొంగళీ ఒకటి కప్పుకుందుకు వాడిమొహాన పారవేశారు. తొడుక్కున్న బనీను చెమటకు తడిసిపోయింది. చెవులలో గుయ్యిమంటూ దిక్కుమాలిన దోమలు కుడుతున్నాయి. దీపపు పురుగులు, గుడ్డియీగలు, మొహంమీద వాలుతూ, ప్రాణం కొరుక్కుతింటున్నవి. తన గ్రామంలో త్వరగా నిద్రపట్టేది; ఎవరో జోకొడుతూ నిద్రపుచ్చినట్లుండేది. పెందరాళే పడుకొని, దబ్బున లేచేవాడు. ఇక్కడసలు కనులు మూతలుపడడంలేదు. నిద్రపట్టడంలేదని బుసలుకొడుతున్నాడు. ఈ ఇల్లు తనకు సంకొత్త. అందుకే నిద్రరావడంలేదు; కళ్లు తెరుస్తున్నాడు; మూస్తున్నాడు. నిద్రమాత్రం చాలా దూరానవుంది!

మరొక గదిలోనుంచి, బాబుగారి గురకలు పెద్దగా వినవస్తున్నాయి. కాని అవి ఏ గదిలోనుంచి వస్తున్నాయో వాడికి తెలియరావడంలేదు. ఇంట్లో గదులన్నీ వాడు చూడలేదు. సాయంకాలం బజారునుంచి, కూరగాయలు తెచ్చినప్పుడు, పక్కకైనా చూడకుండా, సరాసరి బీబీజీ పిలుపు విని ఆవిడ వున్న వంటింటిలోకి వెళ్ళిపోయాడు. బీబీజీ చల్లారిన ఒక అట్టుముక్క తినమని యిచ్చింది. అది కాస్తా తిన్నాక యిన్ని బంగాళీదుంపలు తొక్కలు ఒల్చి సిద్ధంచేయమంది. వంటవండుతున్నపుడు ఆమెకు సహాయంచేశాడు. అన్నం వండాక, ఎవరు ఎక్కడెక్కడ కూర్చున్నదీ తాను గమనించలేదు. భోజనానంతరం ఎవళ్లమానాన వాళ్లు వెళ్లిపోయారు. తరువాత బాగా అలసిపోయాడు. ఇదిగో, యిప్పుడు, యిక్కడ, ఈ మూల నిద్రపట్టక దొర్లుతున్నాడు. ....

ఇలా తెల్లవారిందో లేదో అమ్మగారి కీచుగొంతుక వినిపించింది. "హారి రీన్తల్లి కడుపు మాడా! ఇలా సాయిరాత్రమయిందో లేదో పడుకుంటావ్! ఒకటే నిద్ర. బారెడు పొద్దెక్కిందాకా, లేవవేం? చూడగా, నువ్వే మాకు యజమాన్లా వున్నావ్!".

కీళ్ళన్నీ చురుక్కు చురుక్కుమని పొడుస్తూంటే ముచూ నిద్రనుంచి లేచాడు. అంతా గందరగోళంగా వుంది. ముందూ వెనకా చూశాడు. మకిలిగా వున్న యిత్తడి ప్లేట్లు, కంచు గిన్నెలు, పంచ పాత్రలు గదినిండుకుని వున్నాయి. ఒక మూల అల్యూమినం బొమ్మలు, గాజు సీసాలు, అలంకరించి వున్నాయి. తన గ్రామంలో డసరాసుపత్రిలో చూసిన మందు సీసాలవంటి

వేవో కొన్ని మరోమూల చీటీలంటించి వున్నాయి. అక్కడమాత్రం ఇక్కడిలా దుమ్ముపట్టక సీసాలు శుభ్రంగావున్నాయి. అద్దైనా కాంపౌండరు జాగ్రత్తచేస్తూ వుంటాడుగనుక. గదిలో యింకొకమూలను, పిండి బస్తాలు, బీటుదుంపల సంచులు, వాటిల్లో ఏ మున్నాయో కాని, మరికొన్ని డబ్బాలు వున్నాయి. పాగాకొయ్యకు ఒక ఊలు బనీను, మాసిన రెండు కుడితినీలు వేలాడుతున్నవి. గోడకు విరిగిపోయి మసిబారిన అద్దం ఒకటి తగిలించారు. మరొకపక్క ఎండిపోయిన పూలదండలతో కప్పిన రెండు పెద్ద చిత్తరువులు వున్నాయి. కర్రపేళ్ళ పోగు ఒకమూల; మరొక పక్క దండేనికి పాతవీ, కొత్తవీ కొన్ని బట్టలు వేళ్లాడుతున్నాయి. కొంచెం మీదుగా ఎత్తైన ఇనుప షెల్ఫులో జిగజిగ మెరసే పింగాణి గిన్నెలు, గుండ్రని కప్పులు, సాసర్లు, ముందు పంది మూతిలా వుంటూ, చివరను పిట్టముక్కులా వున్న కూజా ఒకటీ వున్నాయి.

ఈ పింగాణీ సామాను ఎందుకు ఉపయోగిస్తారో మునూకు అర్థం కాలేదు. కాని వాటి గాజుమూతలు మాత్రం బలే గమ్మత్తుగ వున్నాయి. ఇత్తడి పాత్రలు, కంచు గిన్నెలు మునూకేసి కొరకొర మాస్తున్నట్లు "కాన్సేపటిలో మా వీపులు మాలిష్ చేయాలి కపడ్దార్" అంటున్నట్లు డిక్రీ అమలు పరుచుకునే వాడి ధోరణిలో కనిపిస్తున్నాయి. పింగాణీసామాను చూపులలో ఏదో నిగూఢార్థం కనిపిస్తున్నది. గోడకున్న చిత్తరువులు ఎంతో చిన్నెవన్నెలను కల్పిస్తున్నవి. అతని కంటి కీవస్తు సముదాయం, ఎంతో మోజుగా తోచింది. కాని గదిమాత్రం చిందరవందరగా వుంది.

గదిలోని వెలుతురు కళ్ళను సూటిగ గ్రుచ్చింది. కళ్ళు రెపరెపలాడాయి. కొద్దిగ చలించినా, తనలో తాను ఏదో ఆలోచిస్తూ నిలబడిపోయాడు; ఆలోచన శూన్యంలోనికి ప్రవేశించింది. ఈ అవస్థ ఒక త్రుటికాలంమాత్రం. కళ్లు చిట్లించుకుని, పెద్దవిచేసి గది నంతటినీ కలయ చూడవలెననే కోరికతో అటు ఇటు పరికించాడు. ఇంట్లో మరేసామాన్లు వున్నాయో ఒక్కసారి వెతకులాడాలనే యిచ్ఛతో పరీక్షగ నిలబడ్డాడు.

మునూకి ఏది పుట్టినా అది రాక్షసి కోరిక. ఎంతటి పట్టుదల వాడిది! కనుకనే తన పల్లెలో గుడ్లకోసం, పిట్టలకోసం, చెట్లగూళ్ళను, పొదలను, గోపురాలను గాలించి గాలించి వెతకి వెతకి వేసారేవాడు. అంతటి ఆత్రుత, నేడూ పుట్టి అతని నేత్రాలను వెలిగించింది. ఇదివరకు తోటలలోని పళ్ళను

సంగ్రహిస్తున్నప్పుడు అతని హృదయం ఎలా కొట్టుకునేదో, అలానే యిప్పుడూ కొట్టుకుంటున్నది. సాహసోపేతమైన ఒక ఎరకోసం, వాడి నరాలు తెంచుకుంటున్నవి. కండరాలు పొంగిపోతున్నవి. కాళ్ళతో లేచి, ఎదురుగావున్న తలుపుదగ్గర మునివేళ్ళమీద నిలబడి, తొంగితొంగి చూస్తున్నాడు. భుజాలను ఎగురవేస్తున్నాడు. కన్నంలోంచి చూడగానే లోపల చిన్నగదిలో చాల సామాను కనిపించింది. రెండు పెద్దమంచాలు, చాల ట్రంకులు, మూడుచక్రాల సైకిలు ఎదురుగా వున్నాయి. దిండుమీద ఒక ప్రక్కకు తలపెట్టుకుని బాబుగారు పవళించివున్నారు. మరొక పరుపుమీద అమ్మగారు నిద్రపోతున్నారు. ఆట్టేసేపు అలా నించుని చూస్తే అలికిడికి అమ్మగారో, బాబుగారో లేవకతప్పదు. లేచారా కొంప లంటుకుంటాయి. అందులో అనుమానం లేదు.

భయంగా మున్నా, కుడివైపునవున్న మరొక గదిలోకి చూపులు మళ్ళించాడు. గది తలుపు ఓరవాకిలిగా తెరచి వుంది. గది మధ్య పరిశుభ్రమైన తెల్లని పరుపుమీద ఒకాయన పడుకున్నాడు. నిన్న దారిలో వాళ్ళ మావ నమస్కారం పెట్టిన దొరగారిలా తెల్లగావున్నాడు. ఈయనగురించే కాబోలును, బీబీజీ తనతో యిందాకా మాట్లాడేత. ఈయనే బాబుగారి సోదరుడై వుంటాడు. అయితే ఈయన పేరు ప్రేమబాబన్న మాటేకదూ !

ఎంత అందంగావుందీగది ! ఒకమూల పెద్దటేబిలు, చుట్టూ తాను తన హిస్టరీ పుస్తకాలలో చూసిన సింహాసనాల్లాంటి గొప్ప గొప్ప కుర్చీలు; చిన్నవీ పెద్దవీ, ఫొటోగ్రాఫులు, సెలవు రోజులను ఎర్రని అంకెలతో గుర్తుపెట్టిన, నల్లనిఅంకెల ఒక కేలండరు, చుట్టూ రకరకాల బొమ్మలతో వున్న వినాయకుని విగ్రహం, లక్ష్మీ సరస్వతుల ప్రతిమలు మనోహరంగా అలంకరించి వున్నాయి. నాగరికత, మానవునకు ప్రసాదించిన, ఈ వస్తుసంచయాన్ని ఏకాగ్రచిత్తంతో మున్నా అవలోకిస్తున్నాడు. అలా రెప్ప వాల్చకుండా, యింకా చూసుకుకాని, మంచంమీదవున్న. పెద్దమనిషి కదిలి పలవరించడం మొదలెట్టాడు.

"ఓయ్ ముండూ ! పక్కమీంచి లేచావా లేదురా?" అనే కేక వినవచ్చేసరికి గుండెలు పీచుపీచు మన్నాయి. ఊపిరాడిందికాదు. దడదడలాడే తన హృదయధ్వని వెళ్ళి బీబీజీని లేపిందేమోనన్నంత భ్రాంతిపడ్డాడు.

సహజసిద్ధమైన పల్లెటూరు యాసతో మునూ "లేచానండమ్మ; లేచానండి" అన్నాడు. బద్ధకంగా ఆవులిస్తూ పక్కమీద ఒళ్లు విరుచుకుంటూ, ఒక్కొక్క అక్షరాన్నే ఈడుస్తూ బీబీజీ అంటున్నది : "లేచావా? అయితే, పొయ్యి బుగ్గి ఎత్తు. అంట్లు తోం. నిన్ననే తోంవల్సింది వెధవపీనుగా! తోమకుండా నిద్రపోయావ్‌. పొయ్యి ముట్టించి, బాబుగారికి టీనీళ్ళుపెట్టు. నీళ్లు కాగేక నన్ను లేపేం!"

వెంటనే గదిలోంచి ఏడుపు వినిపించింది. చిన్నపిల్ల లీల. ఆవిడే అయివుంటుంది. లేచి గోలగోలచేస్తోంది. తల్లి జోకొట్టి పిల్లను నిద్రపుచ్చింది. పెద్దపిల్ల శైల ఎక్కడ నిద్రపోతున్నదా అని ఆలోచించసాగాడు మునూ. నిన్నను, తను వచ్చేసరికి ఆ పిల్ల యింట లేదు. పినతండ్రితో సంతకు వెళ్ళిందట. అందువల్ల ఆ పిల్ల మొహం ఎలావుంటుందో తను చూసి ఎరగడు!

వంటింటి చావిడికేసి నడుస్తున్నకొద్దీ, వాడికి కడుపు బిగబెట్టినట్లయింది. కడుపుబ్బుకొస్తోంది. ఎలాగ ఈ దేహబాధ తీర్చుకోవడం? ఈ ఇల్లేమో తనకు కొత్త. ఏ వస్తువులు ఎక్కడ వున్నాయో తెలియదాయె! ఏపని ఎలా చేయాలో ఏమో, కర్మ!

వాళ్ల ఊళ్లో అయితే ఏ చిక్కూలేదు. లేచిన వెంటనే, గబగబ పొలాల్లోకి దౌడుతీయడమే! తరవాత నూతిదగ్గర స్నానంచేసుకునేవాడు. ఇంటికొచ్చి చల్దన్నం తిని, స్కూలుంటే స్కూలుకీ, లేకుంటే పశువుల్ని తోలుకుని బీస్‌నదికీ పోయేవాడుమరి! ఇన్నేటి చిక్కులా తనకీ! అంతా దర్జాగా వుండేది వాడి పద్దు!

ఇపుడు కడుపు గుడగుడలాడుతోంది. దీనిపీడ ఎలా వదిలించుకోవాలో వాడి కేమీ తోచడంలేదు. ఎక్కడచూసినా, అన్నీ యిళ్లే. మరుగుస్థలం ఎక్కడుందో కనిపించదు. కొండలమీదకి పోదామంటే అటు తొంగి చూడకూడదని ప్రభుత్వ శాసనం. కొండలమీదకూడా, వీటితస్సాదియా, తురాయిల్లా అన్నీ బంగాళాలే. పట్నవాసపువాళ్ల మరుగుదొడ్లు ఎక్కడ వుంటాయో, వాడికేంతెలుసును? పల్లెటూరు పశువుల కాపరి!

వంటగది అవతలి తలుపుతెరచి నలుమూలల చూశాడు. ఇంట్లో మరుగుదొడ్డి వున్నట్లు కనిపించలేదు. ఈ సరికి వాడి స్థితి నానాభీభత్సంగానూ వుంది. ఇంక ఆపుకోలేనురా భగవంతుడా, అని దేవుడితో మొర

పెట్టుకుంటున్నాడు. తొడుక్కున్న చడ్డీ అంతా ఖరాబవుతుందేమోనని వాడి భయం!

ఇంటి బయటకు దొడ్డు లంకించుకుని, గోడ దగ్గర చతికిల బడ్డాడు. ఇలా కూర్చున్నాడో, లేదో "ఒరేయ్ పీనుగా! ఎక్కడికి చచ్చావురా దౌర్భాగ్యుడా!" అనే పిలుపు వినవచ్చింది. ఆవిడ యిలా తనవైపు వచ్చేస్తున్నదేమో, చూసేస్తుందేమో, దిక్కుమాలిన సొద! భయపడుతున్నాడే కాని, కాస్త కడుపు బిగబట్టుకుని, లేచి సర్దుకోలేక పోయాడు.

పిలిచిన పిలుపులకు ఎంతకీ సమాధానం రాకపోతే, ఆవిడే తలుపు తెరుచుకొని బయటకు వచ్చింది. ఇంకేముంది? కొంపలు అంటుకుపోతున్నట్లు బొబ్బలు పెడుతున్నది. గభాలున తలుపు చేరవేసుకొని తిట్లు లంకించుకుంది.

"హారి నీసిగ్గు చివండా! మా కెక్కడ దాపరించావురా? నీ తల్లి కడుపుకాలా!...నువ్వు కుక్కవి; పందివి. నీకు సిగ్గులేదు; ఎగ్గులేదు. వెధవ, వెధవ, కొండవెధవ! ఎంతఅఘాయిత్యం; ఎక్కడకెళ్ళాలో నన్నడిగి చావలేక పోయావురా? నీ నెత్తి నగ్గిపెట్ట! మ్మూరు తెలియకపొయెన్రా! మేం ఎరక్కపోతిమిరా! నువ్వింత దున్నపోతువనీ! రోజూ పొద్దున్నా, సాయంకాలం, ఆఫీసర్లంతా యిలా తిరుగుతూంటారు కదా, వాళ్ళేం అనుకుంటారని? హుం హూం బాబుగారి పరువంతా తీసిపారేశాడు పశువాని.గాడిద; గాడిద వెధవ! హేయ్! మీ కే! చూడండి; చూడండి. ఈ జాగా ఎలా గత్తర చేశాడో!"

పిల్లవాడు తన జాగాను యిలా గత్తర చేసిన దృశ్యం చూసేసరికి, బీబీజీ గాభరా ఎత్తిపోయింది. అసహ్యం వేసింది. చీత్కారం చేసుకుంటూ కోపంతో గొంతుక స్థాయిని హెచ్చించింది. శాపనార్థాలతో ప్రారంభమయిన వుద్యమం, చివరకు విచారంలోకి మళ్ళింది. తుదకు ఆవిడ గొంతుక కరుణ రసంలోకి పరిణతి చెందింది. రక్తమంతా పేరుకుని మొహంజేవురించింది.

తిట్లుతింటూ మునూ గతుక్కుమన్నాడు. రహస్యంగా కూర్చుని ఏదో తనమానాన తాను ఏడుస్తుంటే, మధ్యను ఆవిడేవచ్చి నలుగురిలోనూ అల్లరి చేసింది. రచ్చకీడ్చింది. దారమ్మట పోయేవాళ్ళందరినీ పిల్చి పనిగట్టుకుని తీసుకు వచ్చి చూపిస్తోంది. ఇంతకంటే అవమానకరమైనదేదీలేదు. ఇల్లంతా లేచి, తనను పరామర్శిస్తుంటే అంతకంటె పరువుతక్కువ యింకేముంది? బల్లపరుపు

భుజాలను ఎగరవేసుకుంటూ, దొడ్డికాళ్ళతో గునగుననడుస్తూ, రుచ్చెళ్ళూడిపోతున్న పంచెయినా సర్దుకోకుండా కంగారుగా పరుగెత్తుకొస్తున్నాడు నాథూరామ్. ఎవడో దొంగపడి తన యూటా ముల్లె ఎత్తుకుపోతున్నట్లు ఏమిటా పరుగు! ఆయన వెనకాలే, లొడలొడలాడుతూ, ఒక పుష్టిగా వున్న మనిషి!

"ఏమిట్రా ఈ అల్లరీ! ఎందుకీ అరుపులు?" అంటూ ఆ నాజూకు మనిషి ప్రశ్నించాడు. ఆఖరుకి బాబుగారి పదేళ్ళ పెద్దకూతురు శైల కూడా బయటకు చక్కావచ్చింది. ఫిల్ల జుత్తు రాగిరంగు. ఈ తమాషాచూసి నవ్వుతున్నాయా అన్నట్లుమెరిసే నల్లనికనులు. సన్నంగా తెల్లని దంతపు ప్రతిమవలె వుంది. వీళ్ళనందర్నీ పోగుచేసుకుని బీబీజీ మళ్ళా తుఫాన్ లేవదీసింది. "ఈ సిగ్గులేని కుక్క! చూడండి ఏం చేశాడోను! వెళ్ళివెళ్ళి వంటింటిగుమ్మంలో కూచున్నాడు. సప్తకట్ల వెధవ! వీణ్ణమ్మవా రెత్తుకుపోనూ. వంటిల్లంతా పాడుపాడు చేశాడు ... పాడు, పాడు ... హాఁ ... హాఁ ... ఏక్. ఏక్కూ."

మునూ కిపుడెంతో నామర్దాగావుంది. ఏదో అంధకారంలోకి మెదడంతా కూరుకుపోతున్నది. ఈ లోకంనుంచి ఎక్కడికో ఎగిరిపోతే బావుణ్ణు. అందరూ చూసేటట్టు యిదివరకెన్నడూ వాడు "బయటకు" కూర్చోలేదు. తనజీవితంలో యిదే తొలిఘట్టం. అదైనా అంతా వెదికి వెదికి ఎక్కడా మరుగు దొరక్కపోతేకదా, కూచున్నాడు. అలా కూర్చోవలసిరావడమే సిగ్గుచేటు. అలాటపుడు, బీబీజీ రావడం; వచ్చినమనిషి చూసిపోక తిట్టడం; తిట్టినమనిషి ఊరుకోక అందర్నీ పిల్చి చూపించడం; ఎంత అవమానకరం! సిగ్గు సిగ్గు. ఛీ. ఇంత పరువుమాలిన జీవితం జీవిస్తేనే, లేకుంటేనే!

బీబీజీ అరుపులు విని, సన్నని ఎముకముక్కవంటి చేతని ఎత్తి భార్యను సముదాయించుకోకపోతే, కొంపలంటుకుంటాయన్నట్లు ఎలకలా బాబుగారు కిచకిచమన్నారు: "ఏమిట్రా అదీ, ముష్టిలంజకొడకా!" నుదురంతా ముడతలుపడేటట్లు మూతిబిగించి, వికారంగా మొహంపెట్టి, పెదవులుతెరచి, ఎర్రని యిగుళ్లను బైటకు కనిపించేటట్టు తొస్సిపళ్లు ఆడిస్తూ "ఇక్కడెందు కెళ్లావురా, నీ అమ్మ సిగ్గొయ్యా?"

ఈప్రశ్న విని, చిన్నబాబుగారు, వట్టినవ్వుతాలమనిషి, వెటకారంగా "అక్కడ ఎందుకెళ్లాడా? వెళ్లకపోతే వాడి చెడ్డ ఖరాబవుతుందని. వాడి

చెడిపోడయితే, దాన్ని బీబీజీ ఉతికి ఆరేయడం వాడికిష్టంలేదు! ...... సరే, అయిందేదో అయిందిలే! కాస్సేపటిలో పాకీవాడొస్తాడుకదా!" శైల పకపక నవ్వుతూ, చిన్నాయన కాళ్లు పట్టుకుని వేలాడుతున్నది.

"ఇంట్లోకివెళ్లిపో శైలా! పిల్లలిక్కడికి రాకూడదమ్మా" కోపం దిగమింగుకుని భార్యను, నాథూరామ్ ప్రశ్నించాడు:

"మరుగుదొడ్డిలో కూర్చోలేకపోయాడా?"

"ఆసంగతి వాణ్ణే కనుక్కోండి!"

"పోనీ, నువ్వే చూపించకపోయావుగాదొడ్డి?"

"ఏమిటేమిటీ? నేన్చూపించాలీ యీ వెధవకి మరుగుదొడ్డి!" నయం; నయం; ఇంకానయం; ఎత్తుకు తీసుకెళ్లమన్నారు కారు; నెత్తి కెక్కిస్తున్నారు పీనుగని! ఎక్కించుకోండి మీకంత ఓపికవుంటే; నాకేం ఓపికలేదమ్మా! నాకిదో తద్దినమా; వీడోళనిగాడు! బాబ్బాబూ! ఎవరో ఒకరువెళ్లి పాకీవాణ్ణి పిల్చుకురద్దురూ!"

చిన్నబాబుగారు తనహాస్యధోరణిలో ప్రసంగిస్తున్నారు: "అలాగే కానీ! మనమెందుకు, క్షుద్రవెధవని హడలెక్కించడం! భయపడితే, మరీ పారుకుంటాడు. పిరికిపీనుగ!...దానిమాటకేం, ...శైలా! మనకిన్ని టీనీళ్లు పోసేందుకు మీ అమ్మకు కోపం చల్లారిందా, లేదా? కావలిస్తే తీరుబడిగా, ఆనక కోపం తెచ్చుకోవచ్చనిచెప్పు!"

"కాస్సేపాగలేరా, ప్రేమబాబూ? మీరుమరీని! ముందీపీడ వొదిలించు కోనీండి" బీబీజీ డోకు రాకపోయినా, డోకువస్తోన్నట్లు అసహ్యంగా మొహంపెట్టి, "క్కక్క ...వీక్క ... ఛీ ...డోకూ! డోకు! వాంతొ స్తోందిరాబాబూ!"

బీబీజీ వెనకాల నీళ్లచప్పుడయింది. తలతిప్పి చూసేసరికి యింకేముంది! మునూవంటింటిదగ్గర నుంచున్నాడు: "ఒరేయ్, చచ్చినాడా! ఎక్కడికిరా వెళ్లేవ్?" మునూబెంబేరెత్తిపోయి "లేదండమ్మా! లేదండి! ఎక్కడికీ వెళ్లి లేదండి. కడుక్కుందామని కుళాయిదగ్గరికెళ్లానండి!"

"నీపిండాకూడ్రోయ్" అంటూ బీబీజీ పరుగెత్తుకెళ్లింది. రెండు చేతుల తోను వాణ్ణి పట్టుకుని బయటకుతోస్తూ "స్నానం చేస్తేనేకాని ఈ వంటింటి

దరిదాపులికిరాకు! నీ బొడ్డు పొక్కా! వెళ్లూ, వెళ్లా!" మునూ తుర్రున పారి పోయాడు. పారిపోయినా ఆవిడ తిట్లవర్షం ఆగిపోలేదు: "ఈ వెధవ నాకెక్కడ దాపరించేడమ్మా, వీడా నౌకరీ వెధవ; నేనా? నాకు వాడు చేయడానికి బదులు, నేనే, వాడికి చేయవలసొస్తోంది చాకిరీ. బొడ్డూడని వెధవ! వీణ్ణి పెట్టుకుంటే నే, పెట్టుకోకపోతే నే, శుద్ధ మొద్దు! అసలు పల్లెటూరే అంతే. పల్లెటూరిబడుద్ధాయిలు..."

మాట మధ్యలో అడ్డువచ్చి చిన్నబాబుగారు "పల్లెటూరివాళ్ళ ఊసెత్త కొదినోయ్! పాపం, తమదీ పల్లెటూరేగా!" "బాగున్నాయ్ మీ హాస్యాలు. ఇంటికి కొత్తవాళ్ళొచ్చినా సరే, మర్యాదా మప్పితం లేకుంటే సరి!"

ఈ మాటలేమీ వినిపించుకోకుండా వొదినెగారు వినేటట్టు మరది "శైలా! ఇంపీరియల్ టీ కంపెనీ గోడమీద పోస్టరు చూశావు కదటే!"

"ఆఁ ఆఁ చూశాను కక్కా, చూశాను! దాన్లోనే మంచి పాట రాసివుంది కదూ! పాడమంటావూ కక్కా?"

"పాడు; పాడు! బీబీజీకి వినిపించేటట్టు గట్టిగా పాడవేతల్లీ!"

శైల సన్నని గొంతుకతో పాట ప్రారంభించింది.

"ఆనందం, ఆనందం, తేనీరే మన కానందం!

చా, చా, చా, గరం గరం చా, హాయినిచ్చే అవికకమ్మే చా!

పాలు, నీటికీ, పంచదారకూ, పరిమళమిచ్చే చా!

అది పతికిచ్చే సతిసేవయే, ఆనందం, మహానందం!"

పాట విని, బీబీజీ కోపం చిర్నవ్వుగా మారిపోయింది. నవ్వుతూనే కోపం అభినయిస్తూ "బాగుందే నీ వరస! ఆడపిల్లవుకదటే! కాస్తంతవంచాలిం పక్కల్లే? పెద్దా పేరక్కావ్, బయల్దేరేవ్, మీ కక్కాగారకేం? ఏం చేసినా చెల్లుతుంది! మరింక నాల్గురోజులుపోతే డాక్టరుగారయిపోతున్నారాయె! ఊరుకోమను. టీ కలిపి పట్టుకొస్తానని చెప్పు".

నాపరాయిమీద కూర్చుని, మునూ యిసుకతో అంట్లు తోము తున్నాడు. స్నానానికీ అదేస్థలం; అంట్లు తోమేందుకూ అదే ప్రదేశం. అక్కడనుంచి, గోడదాకా తూములోంచి నీరు ప్రవహిస్తోంది. బురదనిండా

పురుగులు కులకుల్లాడుతున్నాయి. పురుగులకు తోడు దోమలు, ఈగలు. బురద కంపుకొడుతూంటే, మడమలమీద కూర్చుని గిన్నెలు తోముతున్న మునూ వెనకకి తిరిగేడు. ఈసారి ఎదురుగుండావున్న తలుపులను తోసుకుంటూ, దుర్భరమైనగాలి వీచి, ముక్కు శోణాలను బద్దలు గొడుతోంది. "ఛా. ఛా. ఇక్కడేవుండే మరుగుదొడ్డి" అని కసురుకుంటున్నాడు. వంటింటిలో అల్లరిగా అటూ ఇటూ తిరుగుతూ శైల వాళ్ళమ్మను "అమ్మా! అమ్మోయ్! వాడితో నేనుకూడా అంట్లుతోవుతానే" అని అడిగింది.

"అవతలకి ఫో! జేష్టకానా! పనికిమాలిన వెధవతో, నీకు జట్టేమిటి?"

తల్లి కసుర్లు పడలేక, శైల అవతలకు వెళ్ళిపోయింది. పిల్లను బయటకు కసరికొట్టి బీబీజీ పొయ్యిమీద మరుగుతున్న నీళ్ళను కిందకు దింపింది. షెల్ఫు మీదవున్న టీ సెట్టు పట్టుకొచ్చింది. బీబీజీ ఏమిచేస్తున్నదో, మునూ జాగ్రత్తగ గమనిస్తున్నాడు. మరిగిన నీటిని పెద్దకుండలో పోసింది. కుండ ఎంతో బాగుంది. మూతి పందిముట్టెలావుంది. చివరన దాని కొంక పిట్టముక్కు కూడాను. ఆ చీనాపాత్రలను తను ముట్టుకుంటేనే మైలపడిపోతానన్నట్లు ముట్టుకుండా, లేదా అన్నట్లు పైకితెచ్చింది. వంటింటికి చాలా దూరంగా, ఆ పరసరాలకు అవతల తేనీరు తయారుచేసింది. చీనాపాత్రలనిండా పోసింది. ఈ కప్పులు, సాసర్లు ఆమె ఆచారానికి అడ్డంకులు. మహమ్మదీయ మిత్రులను వెంటవేసుకుని వాళ్ళాయనగారు యింటికివస్తారు. వచ్చిన ఆయన వూరుకోక ప్రతి ముస్లింకీ టీ యిమ్మంటారు. ముస్లింలు తాగిన సాసర్లు, కప్పులు వంటింట్లోకి తేవడమేమిటి? గ్రహచారం కాకపోతే! హిందూమతం నశించిపోతే, ఎంత ప్రమాదకరం!

ఆవిడ టీనీళ్లు కలపడం ఆ ఆచారం, మునూ నిఘాగా చూస్తున్నాడు. ఆవిడ కదలే ప్రతీ కదలికతోనూ, వాడి కన్నులుకూడా కదులుతూనే వున్నాయి. ఇత్తడిగిన్నెలను, ఆ పింగాణీపాత్రలు తగలకుండా ఆమె తేనీరు తయారుచేస్తున్నది. వేడివేడి నీళ్ళను గబుక్కున టీపాత్రలోనికి వొంపుతూ, చటాల్న మునూకేసి తిరిగిచూసింది. ఇంతసేపూ, వాడు తనకేసి చూస్తూనే వున్నాడని పసికట్టి "నీపని నువ్వు చేసుకోరా, నాకేసెందుకు దిక్కులు చూస్తావ్" అని గదిమింది.

ఈ మాటల్లోని పరమరహస్యం మునూ కవగాహనయిపోయింది. తానేదైతే చూడకూడదనుకున్నదో, అది వాడికి తేటతెల్లమయింది. టీకుండలో

పోస్తున్న నీటిలో కోడిగ్రుడ్లు దాచివుంచినట్లు వాడికి తెలిసిపోయింది. 'అమ్మదొంగా!' అనుకున్నాడు. ఒకేసారి రెండుపనులూ కలసివస్తాయనుకుంది. పనిలో పని. టీ నీళ్ళతో కోడిగ్రుడ్లను కూడా, ఆరోగ్యానికి భంగకరమని తెలుసుకోకుండా ఉడకబెట్టింది. ఇల్లాలికి పొదుపరితనం ఎక్కువ!

తను చూసినట్టు బీబీజీ గ్రహించి మండిపడింది. గాథరాతో మొహం ముడుతలుదేరింది. దీనికితోడు, ప్రక్కగదిలోంచి లీల......... దాన్ని యిందాకనేకదా నిద్రపుచ్చింది! లేచి రాగాలాపన ప్రారంభించింది. మునూనీ, లీలనీ, జోడించి మోతాదు మోతాదుగా తిట్లు తిడుతున్నది: "హోరి నీఅమ్మ కడుపుకాలా! నీపని నువ్వు చూసుకోరా! ఈ దొంగచూపులెందుకూ? ... ఒసేవ్! పిసరంత వున్నావో లేవో, మా ప్రాణాలు కొరికేస్తున్నావేవ్. మాయముండా! లేచావూ. ఏం పాపం చేసుకుంటే పుట్టేవోకాని; కాస్సే వూపిరి తీసుకోనీయదూ; ఏపనీ చేసుకోనీయదూ!"

బీబీజీ రొట్టె రెండుముక్కలుచేసి కాలుస్తున్నది. అవి కాలిన తదుపరి మూడవ ముక్కను కోసింది. మళ్ళీ లీల ఓగ్గరగ ఏడుస్తోంది. "ఏం రాలుగాయి తనం! ఏం రాలుగాయితనం! చూడండి, చూడండి! దీని పెంకితనం. చచ్చిన ముండా! నీకేం దాపరించిందే? నిన్ను మరిడెమ్మెత్తుకుపోనూ! కాంద్రకోట నూకాలమ్మెత్తుకుపోనూ! చంటిముండమీద గాలి ఏదైనా వాలిందో, ఏమిటో; వెధవలు ఎవరి కళ్ళు పడ్డాయోనమ్మా! ఒకటే ఏడుపు. ఆ సాధు ముండాకొడుకు వేరుకట్టేడు; తాయెత్తు కట్టించాను. అయితేనేం; ఏడుపు మానుతుందా? దీనికడుపుకాలా!. పనీ; ఒకటేపని! రాత్రీ పగలు, కృష్ణా, రామా అనుకోనీయకుండా, యిదేం సంసారంరా భగవంతుడా! చీర మార్చుకుందుకు టైములేదు. షాపుకెళ్ళి చీరలు కొనుక్కుందామని ఎన్నాళ్ళనుంచో అనుకుంటున్నాను. ఊపిరి సలిపితేగా! పక్కింటికెళ్ళి కాస్త కబుర్లు చెప్పుకుందామనుకుంటే ఈ పిల్లల్తోనే, తెల్లారిపోతుంటే నాబతుకు! నిన్న పడుకునేసరికి రెండు గంటలయిందికదా! చంటిముండ పక్కలు ఎత్తనూ కడగనూ... ఇంకెప్పుడో...ఒసేయ్ శైలా! ఓసి చచ్చినముండా! అలా యిలా ఇల్లల్లా తిరిగి అల్లరిచేసేకంటే, చెల్లెల్ని కాస్సేపు ఎత్తుకోరాదటే!"

వదినెగారి ఈ గోలంతా విని ప్రేమ, చంటిపిల్లను ఎత్తుకుని శైల చిటికెన వేలు పట్టుకుని తనగదిలోనికి వెళ్ళిపోయాడు. పిల్లలను ఆడించాలని కాస్సేపు గ్రామఫోను వేశాడు.

అప్పటికే గిన్నెలన్నీ తోమివేసి, మునూ సిద్ధంగా కూర్చున్నాడు. సంగీతం చెవులకు సోకినవెంటనే గిన్నెలు కడగాలనే మిషమీద చాటు చాటుగా కుళాయిదగ్గరకెళ్లి, బీబీజీకి కనిపించకుండా తప్పుకుంటూ, తారుతూ, వరండాలోంచి, గ్రామఫోను వినిపిస్తున్న గదిలోకి వెళ్లాడు.

బీబీజీ అల్లరిలోపడి, అరుపులమధ్య అసలు సంగతే మర్చిపోయింది. మునూ మాటకేం, రొట్టెలుమాడి మసిబొగ్గులవడం గమనించ నేలేదు.

గదిలోనుంచి చక్కని ప్రేమగీతం వినవస్తున్నది. సంగీతం చల్లని, మెత్తని స్వరంతో యిల్లంతా వొత్తుతూ నింపుతున్నది.

బీబీజీ త్వరగా పని తెముల్చుకొని పక్కింటికి వెడదామనుకుంటున్నది. పక్కింటావిడ చనిపోయింది. ఇంకా, తానుచూడ్డానికే వెళ్ళలేదు. పరామర్శకు వెళ్లకపోతే, పదిమందీ తట్టా బాజా కడతారు.

గదిలోనికి మునూ ప్రవేశించగానే "గుడ్లగూబలా కళ్ళూ నువ్వూ గదిలోకి వచ్చేముందు కాళ్లు కడుక్కున్నావా లేదురా?" అని ప్రశ్నించాడు ప్రేమబాబు.

"లేదుదొరా!" మునూ, తడసిన పాదాలతో, చంకకింద చెంబున్న బుట్టలోంచి నీళ్లు కారుతూంటే, తివాసీమీద నుంచున్నాడు "చెబుతున్నానని ఆగ్రహించకండి దొరగారూ! తమరు కాళ్లుకడుక్కుని రాలేకపోతేపోనీ! అదిగో గదిముందు పీటుంది. దానిమీద కాస్త కాళ్లు దులుపుకుని దయచేయండి. విన్నారా మునూ మహాశయా!" ప్రేమ నవ్వుతున్నాడు; మునూకీ నవ్వు వచ్చింది. భయానికి బదులు ఉత్సాహం వచ్చింది. చినబాబుగారెప్పుడూ యింతే! వెక్కిరిస్తూ మాట్లాడతారు. తనతో నేకాదు; ఎవరైనా ఆయనకు ఒకటే; తనను గదిలోనుంచి పొమ్మనమనలేదు. అదేపదివేలు. ఈమాటలువిన్నాక "బాబుగారు దొడ్డవారు" అనుకున్నాడు. గలగలమంటూ, సంగీతం లయవేస్తూ కరుణను ఒలికిస్తూ హృదయాన్ని పరవశం చేస్తున్నది. ఈ పాడుతున్న మెషిను నిన్న బజారులో తాను చూసినదే. దీన్నితాకితే ఎల్లావుంటుందోకదా! 'నా దెంత అదృష్టం! నేను పనిచేసేందుకు వచ్చిన ఈ యింట్లోనే మెషిఉంది. బలే; బలే. ఎంతచిత్రం!' అనుకున్నాడు. బరువు దించుకొని సావకాశంగా పాటలు విందామ్మనని, గంపదింపుకుందుకు వంటింటిలోకి వెళ్లాడు. అయితే

తిరిగి గదిలోకి ఎలా ప్రవేశించడం? తట్టలో పొయ్యిబుగ్గి బయట పోయాలనే వంకమీద, అవతలకి చక్కా వచ్చేశాడు.

దురదృష్ట వశాత్తు, వాడూ వచ్చేసరికి సంగీతం ఆగిపోయింది. తట్ట పట్టుకుని వీధిలోకి వెళ్ళాడు. రోడ్డు కెదురుగ కుళాయిదగ్గర పొడుగ్గా వున్న ఒక అబ్బాయి నీళ్ళు పట్టుకుంటున్నాడు. ఇద్దరు పిల్లవాళ్ళు ఆ నీటి ధారను చూస్తూ కూర్చున్నారు. ఆ పొడుగబ్బాయి "నీ పేరేమిటి?" అని ప్రశ్నించాడు. మునూ తన పేరు చెప్పాడు. ఆ కుర్రవాడు: "అలాగా! అయితే నీ తుక్కు ఆ పెంటమీద పోసుకో" అంటూ వేలితో పెంట పోగును చూపించాడు. మునూ పెంటపోగు దగ్గరనుంచే "అయితే యిక్కడ నువ్వు కూడా నౌకరువేన్నమాట?"

"మహారాజు కొడుకులాగ. బాబూ గోపాల్ దాస్ గారి నౌకర్ని".

"ఓహో!"

"మీ బాబుకంటె మా బాబుగారెంతో గొప్పవాళ్ళోయ్! తెలిసిందీ? తెలీకపోతే తెల్సుకో. ఆయనకి కోర్టులో పని. మా ఊరా? హోషియాపురం!".

"అయితే మీ ఊరు మా కాంగ్రాకు దగ్గిర" పొడుగు కుర్రవాడు మునూ స్థితిగతులను ప్రశ్నించలేదు. అయినా సరే, మునూ గణగణ లాడుతూ వాళ్ళ మామను గురించీ, ఊరి పెద్దల సంగతీ చెప్పుకొస్తున్నాడు: "మీ హోషియాపుర్కం నా చిన్నతనంలో, మా అమ్మతో వచ్చాన్లే" అంటూ వాడితో పొత్తు కలిపేశాడు. కొన్ని క్షణాల కాలంలో ఇద్దరి హృదయాలు ఒకరి కొకరికి అర్థమైనాయి. ఇద్దరు ఉత్తరాదివారు కలుసుకున్నపుడు, ఇలానే ఏమీ దాపరికాలు లేకుండా అభిమానంతో సంభాషించుకుంటారు.

కంచుగంటలా బీబీజీ గొంతు వినిపించింది. ఉలిక్కిపడి లోపలకు పరుగెత్తాడు. పరుగెత్తుకు వస్తున్నవాణ్ణి చూసి, చిన్నబాబు హాస్యాలకు లంకించుకున్నాడు: "ఒరేయ్, కోతీ! నీ కాళ్లురా!". ఈ చతురతను, సహృదయుడు కనుక మునూ అనుభవించ గలుగుతున్నా నన్నట్లు, పీటమీద కాళ్ళను దులుపుకుని, చేతులు ఆనించాడు. ఇప్పుడు అచ్చంగా కోతిలానే వున్నాడు. ప్రేమ నవ్వేడు; వాడూ నవ్వేడు. కాళ్లూ చేతులూ నేల మీదానించి, కోతిలా తైతైమని నృత్యం చేస్తున్నాడు. తన గ్రామంలో, బడినించి వస్తు

న్నపుడు నాలుగు రోడ్ల మొగలో కోతికొమ్మచ్చి వాడు ఆడించేకోతి, వాడికి జ్ఞప్తికి వచ్చింది; శైల నవ్వుతూ "చూడు కక్కా చూద్దూ, కోతిలా వాడెలా గెంతుతున్నాడో!" కోతికొమ్మచ్చివాడి పాత్రను అభినయిస్తూ చిన్న బాబుగారు "షేభాషో! షేహభాష్" లీల బుర్ర ఊపుతూ చేతులు ఆడిస్తున్నది.

"ఎలుగు బంటిలా గెంతడం నాకూ వొచ్చు కక్కయ్యా!"

మునూ యింకా ముందుకీ వెనక్కీ ఊగుతున్నారు; అడుగులు వేస్తున్నాడు. గెంతుతున్నాడు. మొహ మంతటినీ, వంకరగా పెట్టి పెద్దది చేస్తున్నాడు. గిరగిర కళ్ళు తిప్పుతున్నాడు. పళ్ళు యికిలిస్తున్నాడు. ఆఖరికి, కిచకిచమని కోతిలా అరిచాడు.

"ఏమిటీ అల్లరంతా? ఎందుకురా నీ మొహం తగలెయ్యా, ఈ గొడవ? హాసలీ వెధవని కచేరీగదిలోకి ఎందుకు రానిచ్చారండీ, బాబూ! ఆ గదిలోకి అడుగుపెట్టడానికి, వీడికున్న హక్కేమిటంటా! మిమ్మల్నే, ప్రేమా, మిమ్మల్నే, నేనడుగుతూంది. నౌకరు పీనుక్కీ, మీతో బాటు నవ్వే తాహతు, ఆడే హక్కు ఎలావచ్చింది? ఎవరిచ్చారు.?"

"ఒకళ్ళిచ్చేదేమి టొదినా! వాడే తీసుకున్నాడు."

ఇంట్లో గిన్నెలన్నీ ప్రతిధ్వనించేలా బీబీజీ అరుస్తున్నది. ఇల్లంతా నిశ్శబ్దమయింది.

భయపడిపోయి మునూ, వంటింటిలోనికి వెళ్ళిపోయాడు. కాని వాడి మనసుమాత్రం నొచ్చుకున్నట్లు కనిపించలేదు. పైపెచ్చు వెర్రిఆనందం పట్టలేక పోతున్నాడు. కళ్ళల్లోంచి నీరుకారుతున్నది. ఉల్లాసంతో మొహమంతా, వికసించింది. ఎన్ని రోజులయింది, వా డిలాసంతోషంతో గెంతి! సహజమైన పల్లెటూరి చేష్టలు; ఆ ఆటలు యిన్నాళ్ళకి ఆడేడు. మళ్ళీ ఆరునెలలవరకు, ఆడనక్కర్లేనంత ఆనందం తొలకరించింది.

వంటింటిలో బీబీజీ, కాళ్ళుచాచుకొని తుంగచాపమీద చతికిలబడి, గోధుమరొట్టె కాలుస్తున్నది. పొయ్యిలోనుంచి పొగవస్తున్నది. మునూ, సంతసంతో, గెంతుతూవచ్చి చటుక్కున ఆగిపోయి, ఆమెను అగుపించకుండా ఆమెచెంతనే నించున్నాడు. ఆనందంతో ఎర్రబారిన బుగ్గలు, నవ్వుతున్న వాడి మోమూ, చూసిందా, బీబీజీ తోకత్రొక్కిన త్రాచులా

లేచి పడుతుంది. వాడి తాడు తెగుతుంది. వంటింటిలోనికి కుర్రవాడు వచ్చిన సవ్వడి కనిపెట్టి ఆమె పని పురమాయించింది: "ఒరేయ్, గుంటడా! చెప్తున్నాను; ఆ తర్వాత చెప్పలేదని మొరాయిస్తివా, చెడ్డాలూడగొడతా. విను. నీకున్న పనల్లా వంటింటిలోనే. ఇంట్లో పని నువ్వు వెంటవెంటనే చేసుకుపోవాలి. ఒక్క నిమిషం పనిమాపుగుళ్ళయిందా, నిన్ను కోదండం వేయిస్తాను, నీ మటుక్కేమనుకుంటున్నావో కాని, నాతో వ్యవహారం! పిల్లలతో ఆటలాడేవా, వీపు మోత మోగిపోతుంది. అసలా కచేరీగదిలో కనిపించావా, డొక్క వాల్కిల్ చేస్తాను. వింటున్నావా? రంగున పదీ కొట్టేసరికి బాబుగారేమో ఆఫీసుకు పోవాలి. శైల బరికి వెళ్ళాలి. నువ్వు ఆలస్యం చేస్తూ ఆటలాడుతూ పన్లు మురగబెట్టావా మేం వొప్పుకునేది లేదు ... ... ఎందుకురా, నిన్ను పెట్టుకున్నదీ, దండుగ వెధవా! నీకు సంకటమా, దొబ్బుడాయా? ఇంతా అంతా జీతం యిస్తున్నామట్రా? బిళ్ళకుడుంలాంటిరూపాయలు; నెలై సరికి రంగున లెంపకాయకొట్టినట్టు పట్టుకు పోతున్నావ్! హాఁ! నీ అమ్మ నాడెరుగుదువా, నీ అబ్బ నాడెరుగుదువా. ఇందాకట్లా ఆ గుమ్మం దగ్గరాడేవా, డొక్క చింపి డోలు చేయిస్తాను. చేతులు కడుక్కోనిదే గిన్నెలు ముట్టుకోకుమీ. నీ వొళ్ళు మురికీ, నువ్వు మురికీ. నువ్వు చూస్తే వాటిని ముట్టుకుంటున్నావ్. నీ చేతి కుళ్ళు నీ చొక్కాకి తుడుచుకుంటున్నావే! ... అదిగో అదిగో. జాగ్రత్తా. అన్నట్టూ యిందాకా స్నానం చేశాక, నువ్వు దేన్తో తుడుచుకుంటున్నావ్? మళ్ళీ ఆ కట్టుబట్టతోనేనా? ఆ చెడ్డీతోనే కదూ! ... నీ అమ్మ కడుపు కాలిపోనూ నన్నేదైనా అడక్క పోయావురా నీ అమ్మసిగ్గోయ్యా! పాతగుడ్డ పారేద్దునూ! శైలా, శైలా! ఒసేవ్, వినుపించుకోవేమే దండుముండా ఈ కొండాముండాకొడుక్కి, పెట్టెతీసి, ఓ పాతగుడ్డ పారేయవే, తల్లీ! ఇదిగో చెప్పడం మరిచాను. మీనౌకర్ల కందరికీ ఆ కొండ దగ్గిరుంది పాకీదొడ్డి. నేను చెబుతోన్నది తలకెక్కిందిరా; నేన్నీకు చెప్పడమే మరిచాన్లే. అన్నట్టు యిందాకా స్నానం చేశావుకదా, చేశాక ఏపైనా గత్తర ముట్టుకున్నావా?"

బీబీజీ చెబుతున్న ఈ సొదంతా, కుర్రవాడికి సోదెలోకికూడా రాకుండా పోయింది. వాడి మౌనాన వాడు మనస్సులో ఏమేమో ఊహించుకుని, కోతి నృత్యం చేస్తూనేవున్నాడు. కాని ఏదో సమాధానం చెప్పకపోతే, ఆమెకు కోపం వస్తుంది. "లేదండమ్మా లేదు" అని సమాధాన మిచ్చాడు.

"అయితే ఫర్వాలేదులే. కానీ......నువ్వింట్లు తోమినట్లున్నావ్?"

"తోమిన తర్వాత, చేతులు రుద్దేసుకున్నాను కదండీ."

"మరి వేటినీ ముట్టుకోలేదంటావా?"

"అబ్బే. లేదండి. లేదు."

"అబ్బే. లేదండి, లేదు; వెధవ సమాధానం! బుగ్గి అదీ ఎత్తేవు కదుట్రా?"

"లేదండమ్మగారూ."

అబద్ధమాడకుంటే, బీబీజీ సతాయింపులకు అడ్డుండబోదని గ్రహించి బిగ్గరగ దబాయించాడు. "అది నిన్నటి మాటండి."

"చినబాబుగారికి టీ తీసుకెళ్ళు."

ఆమెతో అబద్ధాలాడి గొప్పగ పక్ష్మీకొట్టించాననుకుని ఆత్మగతంగా నవ్వుకున్నాడు. ఆ బుగ్గి ఎత్తింది నిన్న కాదు. ఇందాకనే ఎత్తి చేతులను క్షణం క్రిందటనే కోతినృత్యం చేసేటప్పుడు పీచుకిరా సేశాడు. ఆ పీచు మరీ అధ్వాన్నంగావుంది.

ఆమె కప్పులను సాసర్లను చక్కగా ట్రేలో అమర్చింది. ట్రే చూచి మునూగాభరా పడ్డాడు. ఒక్కొక్కటే తీసుకుపోవాలో, అన్నిటినీ ఒకేసారి మోసుకుపోవాలో తెలియక తికమకలు పడసాగేడు. సందేహం నివృత్తిచేసుకుందుకని "వీటి నెలాగండమ్మగారు తీసుకెళ్ళడం?" బీబీజీ వాడి మాటను, వెక్కిరిస్తూ "ఎలా తీసుకెళ్ళడమండీ! అమ్మగారూ ఎలా తీసుకెళ్ళాలండీ.... పన్లు ఎలా చేయాలో నీ కెన్నిసార్లు చెప్పేదిరా? ఒట్టి మట్టిబుర్ర! ఇలాటి కుర్ర కుంకల్ని - బొడ్డూడని వెధవల్ని, ఆ దయారాంగాడు మా కప్పగించి, కొంప తీసేశాడు" అంటూ ఆవిడ యింకా సోదెలోకి దిగేసరికి, మునూ పింగాణీ చిప్పలవంక చూస్తూ, ఆమె మాటలకు అడ్డువచ్చాడు: "అమ్మగారూ! తెలియక అడుగుతున్నాను. ఈ సామాను దేనితో చేస్తారండీ!"

"అహ్హ నీ సిగ్గు చివడా! ఈ తిట్లన్నీ ఎవరికిరా? ఇంత మొండి ముండాకొడుకువేంరా నువ్వు! నీ తలతిక్క తగలెయ్య! ఏమిట్రా ఆ వాగుడు! నేను మాట్లాడుతూంటే మధ్యన అడ్డుతగలడం! ఈ తిట్లన్నీ నాకొక్క దన్నట్లు దులిపి పారేయడం! వెళ్ళు. కెళ్ళు. నీ పని నువ్వు చేసుకోక, ఆ కప్పులు వేటితో చేస్తే నీ కెందుకు? పింగాణీతో చేస్తారు.

చెప్పారు; సగా ?...ఎంత చిత్రమో చూడండి! వాడి జన్మలో పింగాణీ చిప్పల్నే చూడలేదట! ఇదుగో...ఒరేయ్! ఆ ట్రే జారిందా, నీ మక్కెలు జారగొడతాను. తెలిసిందా ?"

బీబీజీ తిట్లు వాడికి చీమకుట్టినట్లయినాలేదు. ఆమె దీవనలు మామూలే. నిత్యం చచ్చేవాడికి, ఏడ్చేవాడెవడని వాడూరుకున్నాడు. ఇంతకీ ఆమె ఎంత అదిలించినా, వాడికి రావలసిన సమాధానం వచ్చేసిందికదా! ఇకనేం; అవి పింగాణీతో చేస్తారన్నమాట! నవ్వుకుంటూ ట్రే ప్రాణప్రదంగా తీసుకుని వయ్యారంగా గదిలోకి ప్రవేశించాడు.

ప్రేమ చప్పట్లు చరచి "రండర్రా కుర్రాళ్ళూ! టీ తాగుదురుగాని. ఇప్పటికే ఆలస్యమయిపోయింది." శైల సరదా పట్టలేక కళ్లతో నవ్వింది. "టీ, టీ" అని అరిచింది. ఆ పిల్లకళ్లలో ఏమున్నదోగాని, ధగధగమంటున్నాయి. నేరేడిపళ్ళవంటి కన్నులు. మూతి చిన్నది. చక్కగా, తీరుగా బిగించివుంది.

"ఊఁ ఊఁ ఊఁ... నాకూడా కావాలి" అంటూ చేతులు తిప్పుతూ, తల ఆడిస్తూ అతిగారాబుగ, లీల ఏడుపు మొహం వేసింది. ఇంతసేపూ, గదిలోని గ్రామఫోను సంగీతానికి, చేతులు తల ఆడిస్తూనే వుంది. సంగీతం పెద్ద బాబుగారూ విన్నారు. కాని, ఒక్కసారికూడా, పిల్లల్ని దగ్గరకు చేర నియ్యలేదు. ఆయనది అదేమి హృదయమో, మరి!

ప్రేమబాబుకి సూటువేసుకున్నపుడు, టీ కప్పు చూసినపుడు, ఇంగ్లీషువాడిదర్జా స్ఫురణకు వస్తుందికాబోలును. ఆంగ్లేయుడు తన 'ఇండియన్ సర్వెంటు'ను పిలిచినట్టు కొంత కోపంతో, మరికొంత సాధికారంగా, వెక్కిరింత గొంతుతో, "హేయ్ నల్లా! టీ ఇక్కడపెట్రా"! అని ఆజ్ఞ జారీచేయించాడు.

ఒకసారి నిద్రలేచి, బడలికం తీరక, మళ్ళీ నిద్రపోతున్న తండ్రిని, శైల "లే అప్పా! టీ చల్లారిపోతోంది." కూతురు పిలుపులు విని బీబీజీ తన భర్తను వేళాకోళం చేసింది. "ఆయన అప్పుడే ఎందుకు లేస్తారే తల్లీ! ఆఫీసులో ఊఁ బరికి బరికి వచ్చారాయెను! పాపం పెళ్లాం బిడ్డలతో మాట్లాడానికైనా తీరిక వుందటే" భార్య కంఠస్వరం విని భర్త నిద్రనుంచి మేల్కొన్నాడు. పాలిపోయిన కళ్ళు లోతుకు నూతుల్లాదిగజారిపోయినై. జోగుతూ, భీతితో, నీరసంగా నవ్వుతూ, గదిలోనికి అడుగువేశాడు. పాపం!

ఆయనకు ఖేదుకు జాస్తి. పెళ్ళాం ఎంత చెబితే అంత. పొద్దున్నే శివామని బోణీలా ఆవిడ నోట్లో పడడ మెందుకని, తగు బందోబస్తులోనే వున్నాడు.

గదిలోని చిన్న టేబిల్ మీద, ట్రే వుంచి కుర్రవాడు గుమ్మంవద్దకు పోయి నించున్నాడు. చొరవగా చిన్నబాబుగారు, కూజాలాటి పాత్ర నొకదానిని తీశారు. ముందు పాలుపోసి, తరువాత ఆ పిట్ట ముక్కులోంచి డికాక్షను కలిపి కప్పులలో పంచదార కలిపేరు. మునూ, ఆ తయారీ కేసి నిఘాగా చూస్తున్నాడు. 'ఇదేదో కొత్తగా వుందే' అనుకున్నాడు. తేనీరు చేయడాని కింత కర్మకాండ ఎందుకని తర్క వితర్కాల్లోకి దిగాడు. ఒక పాత్రంలోనుంచి ముందు పాలుపోయడ మెందుకు, ఆ తరువాత మరొక కుండ లోంచి తేనీళ్ళు కలపడ మెందుకు? వాళ్ళ ఇంటిలో, అత్తయ్య యింతోటి రంధీ చేయదే! అంతా ఒక్క లిస్తలో టక టక కలిపి పారేస్తుందే! పాలూ, నీళ్ళూ, పంచదార, అవలీలగా కలిపి ఒకే కుండలో దిమ్మరించి, 'తాగండర్రా' అనేది. మరొక సందేహం. ఆ పెద్ద రొట్టెవున్నదా, దాన్ని అలా తిని ఊరుకోక ముక్కలు కోయడమేమిటి? కాల్చడం దేనికి? మునూ వాడి జీవితంలో అలాంటి యింగ్లీషు రొట్టెను చూసినపాపాన పోలేదు.

చినబాబుగారు కులాసాగా తేనీరు తాగుతూ "ఒరేయ్ కోతిపిల్లా! కాస్నేదిరా, వెన్న? మీగడో మీగడ!" మునూ బిత్తరపోయి చూస్తుంటే; ఆయనే "బీబీజీ నడిగి పట్రా" అన్నాడు.

ఈ ఆజ్ఞ అతని నిశ్చలతను భగ్నపరచింది. బీబీజీ "ఇదిగో! ఇలా దయచేసి వెన్నా, మీగడా పట్టుకుపో అబ్బీ! ఇందాకనే తీసి ఇక్కడ పెట్టాను. నువ్వు మర్చిపోయావ్ కాని. తీసికెళ్ళు బాగా తిని బలుస్తారు. నేనేమో దాసీదాన్లా యిక్కడే పడేడుస్తుంటాను."

ఒక కనురెప్పపాటుకాలంలో, మునూ వెళ్ళి వెన్న తీసుకుని వచ్చాడు. చినబాబు టీని చల్లారుస్తున్నాడు. వేడివేడి టీ మునూను ఆకర్షించింది. నోరూరుతోంది. నాలుక చప్పరించాడు. పెదవులు ఆడించాడు. పెద్దబాబుగారు రెండు చేతులు మీదకు విరుచుకుంటూ ఆవులించారు. ఒక కన్నుమూసి, రెండవ కంటితో వాడికేసి చూస్తున్నారు. నిగారింపేమీలేని కళేబరాన్ని శుష్కించిన బిచ్చగానివలె పద్మాసనంపై చేరవేశారు.

రొట్టెకు వెన్న రాసి, అతి సునాయాసంగా కొరుకుతూ కుడిచేతిలోని టీ కప్పుతో రెండు మూడు గుక్కలు అవలీలగ తాగుతున్న చినబాబుగారి ముఖభంగిమలను మునూ తిలకిస్తున్నాడు. పెద్ద బాబుగారి కక్కడ కూచుంటే సుఖంగా లేదేమో, పాపం రొట్టెముక్కలను వొంటిమీద, తివాసిమీద పోసుకుంటూ చటాల్న లేచి వెళ్ళిపోయారు. కప్పులోని తేనీరును సాసరులోపోసి, పొగలు రేగుతున్న టీని ఉఫ్ఫ్ న ఊదుతూ, వుండి వుండి జుర్రున జోర్చుతున్నారు. నిక్క బొడుచుకుని బిరుసుగావున్న మీసాలను, పచ్చని అసహ్యం వేస్తున్న నాలుకతో నాకుతున్నారు.

నించున్న మునూను శైల చూసింది. ప్రేమ చెంతకు వెళ్లి "కొంచెం టీ చుక్కలు మునూకి పోస్తాను కక్కా."

శైలకు తనంటే ఎంత దయ! మునూకు ఆనందం వేసింది. ఆ పిల్ల చల్లని మాటలు తన మనసును మెల్లగ ఒత్తినట్లయింది. ఆ టీ పుచ్చుకునే లోపునే బీబీజీ ఎన్నెమ్మ కేకలు వినవచ్చాయి.

"ఒరేవ్, చచ్చినాడా! ఎక్కడికిరా బేఫికరయావ్ ? చేయడానికింకేమీ పనులు లేవనుకున్నావా ? కాస్త ట్రేని అలా పట్టుకెళ్ళడంతోనే నీపనయిపోయిందనుకున్నావా? జీతానికితగ్గ పనేదిరా కుర్రాడా! తిన్నంతతినాలి; తిండికి తగిన పని చేయాలి. తెలిసిందీ ?" ఈ కేకలు విన్నాక, వాడి మనసు ఎంతగానో నొచ్చుకుంది. టీ తాగకుండానే వెళ్ళిపోవలసివచ్చింది, దిక్కుమాలిన కర్మ! కుర్రవాడు కనీ కనిపించగానే, ఆమె పనులను జెత్తాయిస్తున్నది. " ఇదిగో ! ఆ యిసక పుచ్చుకుని ఈ గిన్నెలు తోం; బహుద్ధాయిపీనుగా! చిన్న పిసరు మసి, మడ్డి కనిపించిందీ, నీపని పట్టిస్తాను. నాతో వ్యవహారం. నీ మట్టుకేమనుకున్నావో గాని !"

కిక్కురు మనకుండా, మునూ అంట్లు తోముతున్నాడు. ఆవిడ మళ్ళీ ప్రారంభించింది సోది. " అవక్కడ వదల్రా దేవుడా ! నీకు పనీ పాటూ చేతనయితేగా ? నా మటుక్కి నేనే చేసుకుంటే సరి ! ఈ బొడ్డూడని బొట్టెడితో నాకేం తీరుతుందీ పనీ ! నా వెర్రి కాని ! ఎవళ్ళూ సమంగా పనిచేయలేరు ! నీకా మాత్రం కనబడ్డం లేదా అని ? గుడ్డి, ఓ గుడ్డి గాడిదోయ్ ! ఆ మసి అలాగే వొదిలేస్తావట్రా ! మా అద్దగోడమీద గిన్నెలు చూడు, ఎంత శుభ్రంగావున్నాయో మరి ! అంట్లు తోవడంరాని వెధవ్వి

నువ్వింక ఎలా ముందుకు వస్తావురా!" ఆమె ధోరణి, యింకా ఏ రూపం దాల్చునో కాని, మధ్యలో భర్తగారి యీడుపు స్వరం వినిపించింది. "బాబూ రామ్‌లాల్ గారొచ్చారే! ఇంకో కప్పూ సాసరూ యిలా పట్రా! ... ... కాస్త గడ్డం గీసుకోమంటావా వద్దా నన్ను? గోరు వెచ్చని నీళ్ళు కాసిన్ని తెచ్చిపెడుదూ ... శైల స్నానం చేసిందా లేదా యింకా? అలా ఆడు తూంటే దానికి స్కూలు లైమయిపోదూ! హుం. రామ్‌లాల్‌గా రమ్మాయిలు అప్పుడే స్కూలుకి ముస్తాబులై, పోయారు."

మగని కేక విని, బీబీజీ వల్ఫులోనుంచి కప్పు సాసరు తీసుకుని గది లోకి ఓడియ పడుతూ వెళ్ళింది. ఆవిడ స్వరూప స్వభావాదులు ఒక్క చిటెకలో మారిపోవడం మునూ కెంతో ఆశ్చర్యాన్ని కలిగించింది. కాలిన కొబ్బరి పెంకువలె, చముర్రోడుతున్న ఆవిడమోము, అంతలోనే అకస్మాత్తుగా మారి పోయింది! ఆ మెది ఎంతటి రాక్షస గొంతుక!

గదిలోనుండి, బీబీజీ శైలను, లీలను స్నానానికని బయటకు బరబర లాగుకొనివస్తున్నది. ఈ దృశ్యం వాడి కనుల కెంతో మనోహరంగా వుంది. పిల్లలు స్నానాలు చేస్తున్నపుడు చూచేందుకు యింపక్కా వుంటుంది. కాని బీబీజీ, వాడికి వేడినీళ్ళిచ్చి బాబుగారి కిమ్మని అక్కడనుండి, తగిలేసింది. అలా తగిలేసి కాని, పిల్లల్ని స్నానం చేయనిచ్చిందికాదు. నీళ్ళు పోశాక, పరికిణీ, జాకట్టు తొడిగి ముస్తాబు చేసింది.

'ఈవిడో పిచ్చికుక్క. ఎక్కడ, ఎలా, ఎప్పుడు కరుస్తుందో దానికే తెలీదు' అనుకుంటూ మునూ కచేరీగదిలోనికి నిష్క్రమించాడు. వాడి కెక్కడున్నా ఒకటే కాని, కచేరి గది మాత్రం, మరో ప్రపంచం. ఆలోకంలో చిన్న బాబు టీ త్రాగుతూ, హాస్యాలాడుతూ, కాలక్షేపం చేస్తూ వుంటారు. వికారమైన దృక్కులతో పెద్దబాబుగారు, ఇంకెవరో కొత్త బాబుగారు, యిప్పుడే వచ్చినట్లు వాడూ విన్నాడుకదా! ఆ కొత్త మనిషి మొహం లేతగావుంది. కళ్ళల్లో ప్రేమ వుట్టిపడుతోంది. పంజాబీపాటలను పాడుతూ, చిటికెలు వేస్తున్నాడు. తన గ్రామంలో వీధిభాగోతం కట్టినపుడు, గంధోలీ గాడు, యిలానే పాడేడు. సరే, ఆయన పాటమాటకేమిగాని, వింతదృశ్యం మరొకటి కనిపించింది. బుగ్గలనిండా సబ్బు నురుగుతో, చిన్నబాబుగారు తెల్లని మిసను పళ్ళను, దాన్నేమంటారో మరి, తుడుస్తున్నారు. ఆయన చేస్తున్న ఈ పనిని ఏ మంటారో, వాడికి తెలియక ఆశ్చర్యంతో అవలోకిస్తు

న్నాడు; ఆలోచిస్తున్నాడు; ఊహిస్తున్నాడు. ఊహ తన గ్రామంలోని మంగలిషాపులోనికి పరుగెత్తి కళ్ళీ ఆగిపోయింది. అదీసంగతి; తెలిసిందిప్పుడు సగం మాట గొంతుకలోనే మింగుతూ అప్రయత్నంగా బయటకు "క్షవరమా! దీని పేరు! దీని తస్సాదియ్యా!" అన్నాడు. బాబుగారి క్షవర కార్యక్రమాన్ని నించుని పరీక్షిస్తున్నాడు.

ఈ మిషిన్ మరీ బాగున్నది. ఏమిటి దీని కథా- కమామిషూ. దీని పళ్ళు గమ్మత్తుగానే వున్నాయి. నిన్న బస్తీలో చిత్రమైన వస్తువులనేకం కళ్ళకెదురయాయి. వాటికంటే యిది బహు తమాషాగా, నాజూకుగా వుందే! తన గ్రామంలో మంగలిషాపంటే వుందికాని, ఇలాంటి మెషిన్ మాత్రంలేదు. మూరెడు కత్తితో గడ్డాలను చరచర చెక్కుతూ మంగలాడు అదో బ్రహ్మవిద్యనుకునేవాడు. మధ్యి మధ్య మొహమంతా, గంట్లు పెట్టేసే వాడు. 'బాబుగారు కిందకీ మీదకూ కాక, మీదకీ కిందకూ ఊరికే మొహమంతా సాఫ్ చేసుకుంటున్నా, దీన్నల్లికదుపుకాలా, యిది తెగదుకదా! గమ్మత్తే' అనుకుంటూ, ఆలోచనలో లీనమైపోతున్న కుర్రవాణ్ణి చిన్నబాబు చూశాడు. కొంచెం లాలనగ "ఏమిట్రా చూస్తున్నావ్; వరళ్ళాగ!"

ఈ దృశ్యం కుర్రవానికొక జిజ్ఞాస కలిగించినట్లు బాబుగారు గ్రహించినట్లున్నారు. విస్మయంతో, మునూ పక పక నవ్వేశాడు. కొద్దిసేపు పోయాక సాహసించి "బాబుగారూ! ఈ మిషిను శానా ఖరీదవుతుందికదండీ!" చిన్నబాబు నవ్వుతాలమనిషి. వేళాకోళాలకు, వేళాపాళా లేదు. కొంచెం మనసును నొప్పిస్తూ "దాని ఖరీదు నీ కెందుకురా? బుర్ర డెక్కుకోవాలని వుందా? నీకు అమ్మా బాబూ లేరూ?"

అమ్మమాట చెవిని పడగానే, కుర్రవాని కనులలో గిర్రున నీరు తిరిగింది. తనను చూస్తే తనకే జాలి.

"లేరండయ్యా, లేరండి".

ఇంతసేపూ, మౌనంగా కూర్చున్న ఆ నూతన వ్యక్తి ఊరుకోక, "హరి నీ దుంప తెగా! నువ్వు నా చిటికెన వేలంతలేవు; గడ్డం గీసుకుందుకు నీకు రేజరు కావాలేం?"

చిన్న బాబుగారు సహజ హాస్యధోరణిలో "హాస్సి! ఇంతేకదురా నీ కోరిక! అలాగేలే. నామీద, దయవుంచి అవతలగదిలోకెళ్ళి తువ్వాలు

తెచ్చి పెట్టావా, రేజరెండుగ్గాని, మంచి పదునైన బ్లేడు ఇస్తా. దాన్తో నీ మెడకాయి కోసుకుందువుగాని."

మునూ, తుండుకై వెనక్కి పరుగెత్తేడు. వాడి లేలేత హృదయం, చినబాబుపై ప్రేమచూపుతోంది. అతని వైపువకే గురిచేసినట్లు మనసు లాగుకునిపోతోంది. తిరిగి గదిలోకి వచ్చేసరికి, ఒక కోడిగుడ్డువంటి మెషిన్ కనిపించసాగింది. ధగ ధగ మెరిసేదాన్ని పెద్దబాబు యింకా పదును పెడుతున్నారు. తన ఊరి మంగలివాడు పదునుపెట్టే తోలు స్ఫురణకువచ్చింది. మనసు ఉండబట్టక "హా! ఇది పదునుపెట్టే మిషనూ! అదిగదీ!" అని కేక వేశాడు.

లోనుంచి బీబీజీ కేక వినవచ్చింది! "ఒరేయ్! కొక్కిరాయి వెధవా! ఇట్టేవచ్చి ఎక్కడికిరా పారిపోయావ్? ఎప్పుడూ తిని, తిరుగుళ్ళే కదరా నీకు! నిన్నీవంట్లోని కనిపెట్టుకుని ఏడవరా అని చెప్పలేదూ? నేన్చెప్పినట్టూ వింటావా, నీ గూబలు పిండేసేదా?......రామ రామ! తెల్లారి లేచాను, శనిముండనా అని. ఏపనీ తెమల్డమేలేదు. శైలని స్కూలుకి ముస్తాబు చేయాలా? బాబుగారికి ఆఫీసు టైమవుతోందాయె! అక్కడ పూచిక పుల్ల యిక్కడ పెట్టడం నీకు చేతగాదు. నీతో నే నెలా చచ్చేనో, నాకే తెలీదు......చేతులు మురికిరా! ఏవీ ముట్టుకోకు నీపనికో దణ్ణం, అన్నీ నే నే చేసుకుంటాన్లే; నిన్ను నమ్ముకూర్చుంటే నా పనేంగాను!"

"అయితే నన్నేం చేయమంటారమ్మా!"

"నీ బిచ్చానికో దణ్ణం; చేపినిమాత్రం ఉసికొల్పకు; నీ పనికోదణ్ణం. కాల్చుకుతినక ఓ మూల కూచో!"

"కూచుంటే ఎలాగమ్మా?"

"అయ్యో! నీ అమ్మకడుపు కాలా! ఇంతకీ గడుగ్గాయి వెధవ; ఏపని చేయాలో నువ్వు నాచేత వాగించాల్రిటా! కనిపించడంలేదూ, ఏం చేయాలా? అదిగో, అలా తగలడు. టీ కప్పులు కడుగు. ఆ అరటికాయ తొక్కలు గీయరా నాయనా! చేయాలంటే పనులేలేవూ? లక్షున్నాయు".

మునూ టీ సెట్టును కడుగుతున్నాడు. నీళ్ళుపోసిన వెంటనే, పింగాణి పాత్రలు తెల్లగ మారిపోయాయి. 'చాల సులభంగా, తొల్చేశానే' అనుకుంటూ ఆశ్చర్యపడ్డాడు. ఇత్తడి గిన్నెలయితే, అంత సులువుగ మసి వదలవు.

ఇవి పింగాణీ చిప్పలు కనుక, ఇట్టే పనయిపోయింది. తొందరగ వాటి నన్నిటినీ కడిగి, అవి ఆరేదాకా నించున్నాడు. బీబీజీ యిది పసికట్టింది. బిగ్గరగా "ఒరేయ్! ఏమిట్రా ఆపనీ! ఇత్తడి గిన్నెలను ఎలా తోముతావో, అలా తోమాలిరా! పెద్దమ్మా! ఒక్క 'టీ' మరకైనా లేకుండా తోం; వెధవెంగిళ్ళు పై పైనే తోల్చి, ఆ ప్లేట్లలోనే తిని, ఆ కప్పుల్తోనే తాగడానికి మనబతుకింకా, దొరల్లాగ గతి కడుక్కుపోలేదు! మనకా దొరపీనుగులు ఆఫీసర్లు; మర్యాదైతే చేయండి; ఎవరు కాదన్నారు? కాని ఏమిటా దరిద్రం? టబ్బుల్లో స్నానం చేస్తారు; వొంటి మురికంతా ఆ టబ్బుల్లోనే. సబ్బు నురగంతా అక్కడే; ఆ బురద నీళ్ళల్లో పొద్దస్తమానూ నానుతూంటారు ... హాఁ, మొన్న బేంకి ఏజంటుగారి 'ఆయా' వచ్చి చెప్పిందీ; తురకాళ్ళలా గొడ్డుమాంసం తింటార్టా! మాదిగ పీనుగల్లా పందిమాంసం తింటారట! ఛీ... ఛా...ఏక్" అంటూ వాంతి వస్తున్నట్లు అభినయిస్తున్నది. ప్రేమ స్నానానికి వచ్చాడు. వేళాకోళంగా నవ్వుతూ, ఆయన "అయితే అత్తగా! "నేను కూడా పందిమాంసం తింటున్నానుకదూ!" "మీరు బొత్తిగా చిన్నపిల్లలై పోతున్నారే! నన్నలా వుడికించకండి బాబ్బాబూ! మీకు పుణ్యముంటుంది".

"నిజంగానే స్మీ! పందిమాంసమంటే చెవికోసుకుంటున్నా"

ఏదో చేశానంటే చేశానన్నట్టు, గిన్నెలను మునూ పరపర తోమేస్తున్నాడు. వాడి గొడవ వాడిది. చేతులు పీకుతున్నాయి. ఇట్లాంటి యింటి పనులు వాడెన్నడూ చేయలేదు. వయసుచూస్తే కొద్ది. తరిఫీదులేదు. ప్రతీపనీ తూచినట్టు చేయడం వాడితరంకాదు. అత్తకు ఎంత కోపంవచ్చినా, తిట్టినా, యిలాంటి ముష్టిపనులు ఎప్పుడూ చేయించలేదు. ఎందుకు! ఏమాట కామాటే చెప్పుకోవాలి మరి! మొహందగ్గరొక మాటా, మొహం చాటున మరొక మాటా అనకూడదు. మారు మాటాడకుండా ప్రశాంతంగా, తనే యింటెడు పనీ చేసుకుపోయేది. మునూకి జాలివేసి "నేను తుడుస్తానత్తా!" అనేవాడు. "నే పేడనీళ్ళు జల్లుతాలెస్తూ" అనేవాడు. కాని ఆవిడ, వాడిచేత ఎంతమాత్రం ఏ పనీ చేయించేదికాదు. ఆవిడకు అప్పుడప్పుడు మునూపై కోపం వచ్చేది.

తనకు పిల్లలు లేరనే రుసరుసలు అందరిమీద చూపించేది. ఆ గాలి విసురు మునూకు కూడా తగిలేది. ఇరుగు పొరుగు ఆడవాళ్ళు గొడ్రాలని ఆవిణ్ణి క్షూణపరిచేవారు. లేకపోతేనా ... ఆవిడ ఎంత మంచిదని! అదంతా ఎందుకు? వాణ్ణి ఎత్తుకుని, దగ్గరగా తీసుకుని, ఎన్నిసార్లు ముద్దుపెట్టుకుంది

కాదు! అత్తయ్య మంచం మీద, ఆవిడ పక్కన, ఎన్నిమారులు పడుకోలేదు! కాని బీబీజీ సంగతలాకాదు. ఉత్తుత్తి పుణ్యానికే తిడుతుందేమిటి తనను, దిక్కుమాలినసొద!

కుళ్ళు గుడ్డతో గిన్నెలు తుడుస్తూ, మునూ మళ్ళీ ఆలోచించాడు. 'ఎప్పుడో ఒకప్పుడు బీబీజీ తనను తిట్టడం మానేస్తుందిలే' అనుకుని సముదాయించుకున్నాడు. నాలుగు రోజులు పాతబడితే, మన వ్యవహారం ఒక పాకాన కొస్తుందని ఊరడిల్లేడు.

చినబాబుగారు మాత్రం మంచి ఎన్నికైనమనిషి. కోతిలా ఆడుతుంటే తనతో సరిసమానంగా అతనూ ఆడేడు; పిల్లలూ గెంతారు. ఇక యెటు వచ్చీ పెద్ద బాబు సంగతి. ఆయన మాటా? అతను ఇంట్లో వుండడమే అరుదు. ఉన్నప్పుడల్లా నిద్ర. అతని కంటపడకుండా, తాను ఇట్టే తప్పించుకు తిరగవచ్చును. కాని దీని దుంపతెగా! బీబీజీ తిట్లు తప్పించుకోవడం బ్రహ్మ తరంకాదు. మునూ మనస్సు ఇక్కడ చటుక్కున ఆగింది. బీబీజీని తీవ్రంగా విమర్శించుకుంటూ మనస్సు ఆలోచిస్తున్నది. బీబీజీ అవులిస్తే పేగులు లెక్క పెడుతుంది. తాను ఎంత మనసులో తిట్టుకున్నా, యిట్టే పసికడుతుంది, అందుకని, ఆవిడను తిట్టుకోవడం ఆపివేశాడు.

కచేరి గది మూల వేలాడుతున్న చక్కని సిల్కుసూటుకేసి మునూ మనసు మళ్ళింది. ఎన్నో ఆలోచనలు వెలుగుతున్నాయి. ఆరిపోతున్నాయి. చిన బాబుగారు అవి వేసుకుంటే కనుల వైభవంగా వుంటుంది. వెళిపోదామని లేచేసరికి వాడికి, ఆయనే ఎదురయ్యాడు.

"మీ మహారాణీవారు ఆ చపటా కాళీ చేసిందిగా? స్నానానికి వేళవుతోంది".

"కాళీగానే వుందండి".

ఇంతలో బీబీజీ అరుపులు ఉరుములవలె వినవస్తున్నాయి: "గిన్నెలన్నీ తోమేశావురా! ఆగదిలో కెందుకెళ్ళావ్? నీ కక్కడ పనేమిటంటా?" బుర్ర తడుముకుంటూ, కారణం ఏమి చెబుతామా అని ఆలోచిస్తూ నించుండిపోయాడు. "నేనాండి ... నేనూ ..." సగం మాటలో అడ్డువచ్చి ఆవిడ గద్దించింది; పిడికిలి బిగించి కొట్టవస్తోన్నట్లు ముందుకు వచ్చి నిలబడింది. "అబద్ధాలాడకు జూటాకోర్; వెళ్ళు. వెళ్ళి ఆ గిన్నెలన్నీ అక్కడ దాచు;

బాబుగార్లకి స్నానానికి వేళయింది. ఆ చిక్కుడు కాయలు వొలు; తర్వాత యిది తుడు. నిన్ను పిలిస్తేనేకాని ఆ గదిలోకి అడుగు పెట్టొద్దని ఎన్ని సార్లు చెప్పేదిరా? వాళ్ళంతా యింట్లోంచి వెళ్ళిపోయాక, తివాసీ తీసి, గదంతా తుడిచి, పక్కలు పరుద్దువుకాని!... ఓహో! నీకే వల్లకాదూ చేత కాదారాయె! నేను చేసి చూపించాల్నే నీకు? ఈ లోపున, ఓ వెర్రి వెధవోయ్! వంటింటిలోకి వెళ్ళి నీ పని నువ్వు చేసుకుపోరా! అసలు నీకు పనిమీద ధ్యాన ముండేడిసిందా? అలా అలా పరుగెడుతాడు; ఇలా ఇలా తిరుగుతాడు. దొంగ పీనుగ! కొండ ముండా కొడుకు. మూర్ఖప్పీనుగ! జన్మెత్తి ఏ వస్తువూ చూళ్ళేదు; ఈ యింట్లో ఏ వస్తువు చూసినా, వాడి కబ్బురమే!

చెంబుతో నీళ్ళు బుర్రమీద వొంపుకుంటూ, చినబాబు "ఒరేయ్, మునూ! అమ్మగారి తిట్ల ప్రవాహంకంటే ఈ నీటి ప్రవాహం ప్రమాదం రోయ్! తప్పుకో" అని హెచ్చరించారు. ఆహా! ఎంత మంచివారు చిన్న బాబుగారు. ఎంతటి హాస్యం. అమ్మగారికీ, ఆయనకీ ఎంతో భేదంవుంది. ఈ ఛలోక్తికి మునూ ఆహ్లాదంతో నవ్వుకున్నాడు; అమ్మగారు జ్ఞప్తికివచ్చి సణుగుకున్నాడు; లోలోన నిందించుకున్నాడు.

శైల, బడికి ముస్తాబయి వాళ్ళమ్మకోసం నించున్నది. చేతిలో పైసా పడితేనే కాని, ఆ పిల్లకూ్కలుకు పోదు. బీబీజీ ఆ పిల్ల మొహాన డబ్బులు పారేయడానికని వెళ్ళిపోయింది; కాకుంటే యింకా ఆవిడ తిట్లు వాడు తిన వలసి వచ్చేది. తిట్టాలనే ఆవిడకుంటే కారణాలే దొరకవా? రాజుగారు తలుచుకుంటే దెబ్బలకేం కొదవ? బిందె, కుళాయివద్ద సరిగ్గా పెట్టడంలేదనో, చీపురు పట్టుకోవడం చాతకాదనో, బంగాళాదుంపలకింకా తొక్కలువుంచేశావనో, ఏదో ఒక కారణం, నేరం కనిపిస్తూనే వుంటుంది!

చినబాబు శరీరం, నీటికి తళ తళ మెరుస్తున్నది. కవటూకువంటి ఆయున దేహం సిల్కుబట్టలు వేసుకుంటే ఎలా వుంటుంది! హఠాత్తుగ ఒక విగ్రహం కనిపించినట్లయింది. బూట్లు, నల్లనిబూట్లు చక్కని అల్లికలేసుతో ఎదురుగ కనిపించాయి. అవి పెద్దబాబువి. చిన్నబాబుకుకూడా ఇలాటివి వున్నాయా, లేవా అనే మీమాంసలో పడిపోయాడు.

"శైలా! శైలా! ఏమమ్మో శైలా!" అనే ఒక గొంతుక వాడి ధ్యానాన్ని భగ్నపరిచింది. చిన్నపిల్ల అందమైన మజ్లిన్ రుమాలు తలకు

చుట్టుకుంది. వంటింటి గుమ్మంలో చిత్తరువులా నించుని వుంది. ఇవతలకి తొంగి చూస్తున్నది. పగడపురంగు మోము కళకళలాడు తున్నది. జన ముద్దుగావున్న సుందరాంగి. ఆ అమ్మాయి పిలుపందుకుని, శైల పడకగదిలో నుంచే, "ఆ! వచ్చే; వచ్చే; కాస్తాగవే తల్లీ!" అని కేకవేసింది. కేక విని పించుకోనట్టుగా ఆ పిల్ల ముందుకు "బీబీజీ ఏరీ?" అంటూ తోసుకువచ్చింది. దారిమధ్య నించున్న మునూనిచూసి అదరిపడి "అమ్మోయ్" అని అరిచింది. మునూ కచేరీ గదిలోనికి గాభరాతో పారిపోయాడు. బట్టలు వేసుకుంటున్న చిన్నబాబు "ఏమిట్రా ఆ పరుగు, చింపాంజీలా?"

బీబీజీ ఆ పొరుగింటి పిల్లను "కౌసల్యా! అదేమిటే మా అమ్మా! వాడేం చేశాడే నిన్ను? కొండవా డంటే నీ కెందుకే అంత బెదురు? అచ్చే! వాడుట్టి వెర్రి వెంగళప్ప. కరుస్తాడా? మింగేస్తాడా?.........అ న్నట్టు, పొద్దున్నే వాడేం చేశాడో నీ కెవరైనా చెప్పేరటే! అక్కడ...ఆ గోడవ తల, వెధవ చెంబిటికి కూచున్నాడేవ్!" కౌసల్య ఏమీ మాట్లాడకపోగా, తానే మళ్ళీ అందుకుంది: "శైల ముస్తాబవుతూందిలే. బరికి తీసికెళ్ళూ; జాగ్రత్తగా తీసికెళ్ళేం తల్లి తల్లీ!"

తలపైకెత్తి కౌసల్య "మీ నౌకరు వొట్టి గంధోళీగాట్టు; కోతిలా ఆడతాడని మా నాన్నగారు చెప్పారు దొడ్డమ్మా.....శైలా! ఓ శైలోయ్! ఎంతసేపు నిలబడేదే నీ కోసం? త్వరగారావే మరీ! మా అక్కా వాళ్ళూ మనకోసం అవతల నించున్నారు. స్కూలుకు నీనుంచి లేటయిపోతోంది."

బీబీజీ పని గట్టుకుని, ప్రతీవాళ్ళతోనూ, ప్రొద్దున్న తాను తెలియక చేసిన పనినిగురించి ప్రచారం చేస్తుంటే, మునూ కది పొడుమన్నట్టుంది, సిగ్గుపడిపోయాడు. ఆ పిల్లవంక, తను మొహమెత్తి ఎలా చూడడం! ఆ ఉన్న కాస్త పరువూ తీసి పారవేస్తోంది. ఏమి టీ లోకపు తీరుతెన్నులు? తానొక నౌకరు; ఒక బానిస; కాదంటే ఒక గులాం; అడ్డమైనచాకిరీ చేస్తేనే కాని పొట్టకి జరగదు; నాలుగు మెతుకులకోసం, అంతవరకూ రాలేదు, కాని అవసరమైతే తిట్లు కాదు, తన్నులు సహితం తినాలి. అతనికి ఎంతో విచారం వేసింది. తాను ఏకాకి. జీవితంలో 'నా' అనేదేదీ లేదు. ఇంక సుఖమెక్కడిది? ఆనందమన్నది ఎలావుంటుందో కదా!

చిన్నబాబు చటాల్న బయటకు వస్తున్నారు. టస్సూరు చొక్కా వేసుకుని, చక్కగా యిస్త్రీచేసిన ట్రౌజరూ, ఫ్లానల్ హేటు పెట్టుకుని

నీటుగా ముస్తాబయి గదిబయట ఎదురయాడు. ఆయనలా తాను తయారు కావాలి. ఆయనంటే వాడికి ఉల్లాసం; ఉత్సాహం; ఆవేశం; ప్రేమ; గౌరవం; ఎన్నో అన్నీను.

"ఒరేయ్, దయ్యం! నీకు కొమ్ములే తక్కువ. కొనిపెట్టేవీ ?...... అమ్మగారేర్రా!" ఈ మాటలకు వాడు నవ్వుకున్నాడు. సరదాపడ్డాడు. బీబీజీ, మరది గొంతుకధ్వని విని "ఇదిగో; ఇక్కడ పనిచేసుకుంటున్నాను. మీకేం కావాలీ" అని ప్రశ్నించింది.

ఆవిడను పరిహాసంచేస్తూ ప్రేమబాబు "ఇంపీరియల్ బ్యాంకాఫిండియా యుద్యోగియును, నెలకు నూట ఏబది రూక లార్జనపరుడును నగు మదీయాగ్రజుని మనీఫర్సునుండి, పంచరూప్యంబు లిటు తెండు" అంటూ ఉడికిస్తున్నాడు.

"ఏ పిల్ల కట్టుకుంటుందోకాని ఈ మనిషి మహా అల్లరిబాజాబాబూ" అంటూ నవ్వుతూనే బీబీజీ డబ్బులపెట్టె దగ్గరకు వెళ్లింది. గదిలోకి వెడుతూ, తన వెనకాలే రావద్దన్నట్టు మునూకేసి తేరిపారచూసింది. దొంగతనంగా మునూ తొంగితొంగి చూస్తున్నాడు. పెట్టెకన్నంలో తాళంపెట్టి గుంజుతూ, వెనక్కి తిరిగి అనుమానంతో చూసింది. వాడు ఎదురుగ నిలబడి దొంగ చూపులు చూస్తున్నాడు. పెట్టె తెరవడంమాని, పెట్టెకనబడకుండా చాటుగా కూర్చుని గావుకేకలు ప్రారంభించింది. "హరి దొంగముండాకొడకా! ఒడుపుల కుక్కలా ఏమిట్రా ఆ చూపులు? పని చేసుకో. ఛో. ఊఁ"

భయంతో మునూ అవతలకి వెళ్లిపోయాడు. బంగాళీ దుంపలు ముందు పోసుకుని వొలుస్తున్నాడు. చిన్నబాబుకి రూపాయలందిస్తూ బీబీజీ "ఇక వెళ్లి గదులు తుడు"అని నౌకర్వాణ్ణి ఆజ్ఞాపించింది. రూపాయలందుకుంటూ ప్రేమ "ధనమూలం యిదం జగత్తు ఒదినా! పైకి వెళ్తున్నపుడు జేబులో గలగల మంటూ యిన్ని రూపాయిలుంటేనేకాని, పనిజరగదు. డబ్బుంటే కొండమీద కోతి దిగి చక్కావస్తుంది; అయినా నీకు తెలియనిదేముందిలే! డాక్టర్లజేబులో డబ్బుంటే మరీ భేషుగ్గావుంటుంది. అదంతా మన ప్రాక్టీసే అనుకుంటారు. రోగులు చుట్టూ మూగుతారు. బంధువులతో మనచేతి చలవనుగురించి చెబుతారు. డబ్బు, డబ్బును ఆకర్షిస్తుంది. అంతే!"

"ఇంతకీ మీ ప్రయాణం ఎక్కడికో చెప్పేరుకారు."

"పట్నం చివరను మన రోగి వున్నాడు."

ప్రేము, అన్నగారితో కలిసి అవతలకు వెళ్లిపోయాడు. గది ఖాళీ అయింది. గొంతుకబడి నేలమీద కూచుని, మునూ మునికాళ్ళమీద దేకుతూ, చీపురుతో తుడుస్తున్నాడు. గదిలో వార్నిష్ వేసిన కుర్చీలు సింహాసనాల్లా వున్నాయి. కుర్రవాడు వాటిని చూసి ముచ్చటపడుతున్నాడు. ముద్దుపెట్టుకుందామా అన్నట్లు చూస్తున్నాడు. తుడుస్తూ మధ్య మధ్యాగి, గోడమీద చిత్తరువులను పరికిస్తున్నాడు. తుడుస్తున్నవాడు గబుక్కున లేచాడు; లేచి బొమ్మలచెంతకు జరిగాడు. జరిగి రెప్పవాల్చకుండా పరిశీలిస్తున్నాడు. చటాల్న మళ్ళీ మామూలు స్థానానికి వచ్చి చీపురు పట్టుకున్నాడు. మధ్య మధ్య ఆగాడు; తుడుస్తూ చూస్తున్నాడు; మళ్ళీ పనిని ఆపివేశాడు. లేచాడు; వచ్చాడు. నించుంటున్నాడు. కూర్చుంటున్నాడు. లెక్కలేనన్ని గుంజీలు తీస్తున్నాడు. ఈ పటాలు, బొమ్మలు, రంగుల గీతలు, వీటి అర్థం ఏమిటో కదా! ఆ బీరువానిండా పుస్తకాలున్నాయి కదా, వాటిల్లో ఏమని రాశారో మరి! దీని సిగతరగ, గోడనున్న గడియారం, మనిషి గుండెకాయలా, టిక్కు టిక్కుమంటున్నదే! మనిషిలా అది మాట్లాడదేం చెప్మా! జంతువులూ మాట్లాడవు. దీన్ని జంతువుకింద జమకడదామన్నా, టంగు టంగున గంటలు కొడుతున్నదే! అసలు ఈ వస్తువులలో ఏదో మర్మం వుంది. ఆ పెట్టెలోంచి సంగీతం; ఇది మరీ మాయగా వుంది. చూడగా చూడగా ఇదొక గమ్మత్తుల లోకం. ఈగది గంధర్వనగరం. విభ్రాంతుడై మునూ బర్రన కుర్చీనొకదానిని ఈడ్చేడు. చప్పుడు విని, బీబీజీ కేక వేసింది: "చప్పుడు చేయకురోయ్! నీ తల్లి కడుపుకాలా, పిల్లలేస్తుంది"అంటూనే గదిలోకి ప్రవేశించింది. "పనంటే అంత తొందరెందుకురా! నెమ్మదీ, నెమ్మది"అంది. గదుల తుడుపులయాక, పంపుదగ్గరకువెళ్ళి బిందెలతో నీళ్ళుపట్టి గాబునింపమంది; ఈలోగా తాను 'పరుపులు సర్దుతాన్లే' అంది. నీళ్ళు పట్టడడం పూర్తయాక, 'వంటమప్పు తాను రమ్మన'మంది. వాడు వెళ్ళి వంటింటిపొయ్యివద్ద పిల్లిపిల్లలా ముడుచుకు కూర్చున్నాడు.

మరికొంతసేపు పోయాక, బాబుగారికి, శైలకు భోజనం పట్టుకువెళ్ళేందుకు దయారామ్ వచ్చాడు. మావను చూసిన వెంటనే బావురుమని ఏడవాలనిపించింది. కాని బీబీజీ ఎదురుగ వుంది. చెమడాలూడవేస్తుంది. "ఇక్కడ నీకు తోస్తోందిరా"అని అడిగాడుదయారామ్; తోచడంలేదని ఏడిస్తే తన్నులు తప్పవని "ఆఁ తోస్తోంది మావాఁ!" అన్నాడు.

బీబీజీ భోజనం సర్ది, దయారామ్ చేతికిచ్చింది; కారియర్ పట్టుకుని "కుర్రవాణ్ణి కూడా తీసికెడతానమ్మా" అని అర్థించాడు. ఆమె కొద్ది అనుమానంతో చూస్తుంటే, అతను "కుర్రవాడికి దారి తెలిస్తే, శైలమ్మను రోజూ స్కూలునుంచి తీసుకురావచ్చుకదమ్మా!" ఆవిడ సరేనన్నట్లు తలూపింది.

దారిలో తనసొదంతా మునూ వెళ్లబోసుకుంటున్నాడు. మధ్య మధ్య వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు. బీబీజీ మరోపనేమీ లేనట్టు అస్తమానూ, తిడుతుందిట; పని ఎంతబాగాచేసినా, ఆవిడను సంతోషపెట్టడం చాలా కష్టమట. ఇంతకంటె అత్తయ్యే మంచిదట; వచ్చినప్పట్నుంచీ, తనకిక్కడేమీ బాగులేదట; నానాబాధగానూ వుందట. "ఒరేయ్, వెయ్యిచెప్పు; లక్ష చెప్పు. నువ్వు నౌకరుకుర్రాడివి. ఎన్నన్నా ఏంచేసినా, నీపని నువ్వుచేసుకు పోవాలేకాని, ఇలా ఫిర్యాదులుచేస్తే ఎలాచెప్పు? ఇంటిదగ్గర సుఖం మరిగి పోయావు, ఒళ్లు తీట్లుతీస్తోంది. మీ అమ్మ నిన్ను చితకతన్నేది. ఈవిడ మీ అమ్మకంటె నయమేకదటరా! ఒహో! మీ అత్తయ్యసంగతా? నువ్వంటే దానికెంతో గారాం. అసలందుకే చెడ్డావు!" ఈమాటలు పిల్లవాడికెంతో వ్యథనుకలిగించాయి. శరీరమంతా గగుర్పొడిచింది. ఎక్కడలేనిశక్తీ ఉప్పొంగి వచ్చింది. ఊచిపుచ్చుకుని దయారామ్ చెంపపగలకొడితేనా!......

మళ్లీ యిల్లు. ఇంటికొచ్చాక, బీబీజీ వాడిచేతిలో రెండుచపాతీలు, ఇన్ని బంగాళదుంపలు తినమని, ఎత్తిపడవేసింది. కూరని, చపాతీలను వాడు గిన్నెల్లో పెట్టుకుని తినడానికి వల్లకాదు; చేతులే వాడికి విస్తరి. తానొక నౌకరు. అందుకే ఈ అవమానం; చపాతీలు నోటికి వెళ్లలేదు. గొంతుక, డిక్కపడింది. అయితే, ఇలాటి విషయాలను లెక్కపెట్టుకు కూర్చుంటే కడుపు కాలుతుంది!

మధ్యాహ్నపు భోజనాలయినాక, ఆవిడ, లీలను వెంటబెట్టుకుని, పొరుగింటికి బాతాఖానీకి వెళ్లింది. మునూ తిరిగి అంట్లుతోమడానికి వుపక్రమించాడు. పనియింకా పూర్తికాలేదు; సాయింత్రం కావస్తున్నది. ఎండకి చెమటలుకక్కుతూ, పనికి అలసిపోతున్నాడు. నిట్టూర్చాడు. కాస్సేపు శరీరం వాల్చాడు. ఇంతలో, పొద్దున్న వచ్చిన ఆ పొడుగమ్మాయి, కౌసల్యవచ్చింది. శైల, మరి యిద్దరు ఆడపిల్లలు, సరదాగా కేరింతలాడుతూ కచేరిగదిలో గడబిడ చేస్తున్నారు. మునూ వెంటనే లేచాడు; లేవడమేతడవు, భంగున గదిలోకి దుమికాడు. తైతైమని కోతినృత్యం చేస్తున్నాడు. పిల్లలందరికీ, వాడి ఆట

సంతోషమనిపించింది. కాని పైకిమాత్రం శైల "నువ్వు నౌకరువిరా. మేం నీతో ఆడకూడదూ" అంటూ వాడిని నెట్టింది. వాడుమాత్రం కదలలేదు. పాప్మని వాళ్లూ బలవంతం చేయలేదు.

చిన్నబాబు మరికొందరితో 'టీ'కి వచ్చాడు. వస్తూనే "టీ, టీ" అని అరిచాడు. మరది యింటికిరావడం చూసిందికాబోలును, బీబీజీ బాతాఖానీ కట్టిపెట్టి, అతనివెంటే లోనికి వచ్చింది. ఆ ఆకతాయి మనిషిని చూడగానే మునూ ఆనందం పల్లవించింది. అతను తెచ్చిన రసగుల్లాలు, లడ్డూలు, జిలేబీలు, చూచేసరికి నోరూరింది. చినబాబు "తినరా, తినూ!" అంటూ కొన్ని రసగుల్లాలు ప్లేటుతో వాడికిచ్చాడు. ఆయనెంత దయగలవారు! తన గ్రామంలో తన అనుచరులు తాను ఆజ్ఞయివ్వడమే తడువుగా, ఇట్టే అమలు పెట్టేవారు; అంతశ్రద్ధతోనూ, చిన్నబాబు ఆజ్ఞను నెరవేర్చేసేడు. తీరా టీ త్రాగి ఆయన వాహ్యాళికి వెళ్లిపోయేసరికి ఎంతో దిగులువేసింది.

తిట్లవర్షాన్ని అమ్మగారు తిరిగి ప్రారంభించారు. కళ్ళెర్రచేశారు; పెదాలు బిగించి "అన్నా వెధవా! నీ పని నువ్వు చేసుకోక..." కేకవిని పిల్లవాడు పరుగెత్తాడు. మసాల సామాను రోట్లోవేసి దంచుతున్నాడు. ఉల్లిపాయల తొక్కు తుళ్లి కళ్ళల్లో పడ్డది. బీబీజీ "కళ్లు మూసుకుపోతున్నాయిరా! తుళ్లగొడుతున్నావు"అని బొబ్బరించింది. చేతులు కడుక్కోకుండా గిన్నె ముట్టుకున్నాడు. ఆమె కసరింది. వంటకు కావలసిన చిల్లర పనులన్నీ చేశాక, బాగా అలసట వచ్చింది. అలాగే నిద్రపట్టేసింది. మళ్ళీ ఆవిడ హుంకరించింది. కాని, కంటిమొయ్యా నిద్ర పట్టడంవలన, ఈ హూంకరింపులేమీ వాణ్ణి బెదరగొట్టలేకపోయాయి. తిట్లు తిట్టినా, తట్టిలేపినా లేచే పరిస్థితిలో లేదు వాడి అవస్థ.

ఈ బాబుల యిళ్ళల్లో వాడిది బానిస జీవితం. దీని కెలా అలవాటు పడడం! మార్పు లేదు; అనుభూతి లేదు. పైగా రోజంతా ఒకే పద్ధతిచాకిరీ. గాలిలో ఎగిరే పిట్టను పంజరంలో బంధించడం ఏమంత సులభంకాదు!

ఒకనాటి ఉదయం, పక్కమీదనుంచి లేచీలేవడంతోనే, తనలో తనకు ఒక తర్కం బయలుదేరింది. వితర్కించుకుంటున్నాడు. కప్పుకున్న దుప్పటి యింకా అలానే వుంది; ప్రశ్న పరంపరలు ప్రవాహంలా ముంచెత్తుకొస్తున్నాయి. "ఎవరిని ? నేనెవరిని? ఓమునూ!" నేనెవరినని నే అతని ప్రశ్నకు

వెను వెంటనే "నేను మునూని; బాబూ నాథూరాంగారి నౌకరు మన్రాణ్ని" అనే సమాధానం వచ్చింది.

"అయితే ఈ యింటికి నేనెందుకొచ్చినట్టు?"

"ఎందుకా? మీ మామ నీ బతుకింక నువ్వు బతకమని యిక్కడకు తీసుకురాబట్టి."

ఆలోచనలు రేగి కల్లోలపరుస్తున్నాయి. భావంమీద భావం లింకుల వలె జనిస్తూ, గొలుసు కడుతున్నాయి. 'బహుశా నీకూ తనలాగే ఒక చప్రాసీ' ఉద్యోగం యిప్పిస్తాడేమో మీ మామ; లేదా మరొకరి యింటిలో కుదురుస్తాడేమోలే' ఆత్మ ఊరడించింది; ఊహించింది.

ఎన్ని ప్రశ్నలనైనా వేసుకున్నాడుకాని, ముఖ్యమైన ప్రశ్న మాత్రం వేసుకోలేకపోయాడు. తానొక భృత్యమాత్రుడేకాక, నిజానికి ఎవరో సమాధానం తెలుసుకోలేకపోతున్నాడు. తాను నౌకరు ఎందుకు కావలసివచ్చిందో, నాథూరామ్, యజమాని ఎందుకు కాగలిగాడో అతని చైతన్యం ప్రశ్నించలేకపోయింది; సమాధానం చెప్పుకోలేకపోయింది. అతనేమో యజమాని; తనేమో ఒక నౌకరు; అతనికి జోళ్ళు వున్నాయి. తనకు లేవు. ఇది తప్పనిసరి; మామూలే. సూర్యోదయం, సూర్యాస్తమయం ఎంతటి సహజాలో ఈసంబంధాలూ అంతే! ఆలోచించగా చిన్నబాబుగారు వెంటనే స్ఫురించారు. బీబీజీ చూడకుండా తన కా సాయంత్రం, రసగుల్లాలు తినమని చేతిలో పడేశారు. తీపిని తలుచుకోగానే నోరు ఊటలూరింది గులాబ్‌జాములు, రసగుల్లాలకంటె, ఇంగ్లీషు స్వీట్లు మరీ బాగున్నాయి. బాగుంటే ఏం లాభం! కొనుక్కొని తినాలి; తినాలంటే డబ్బు కావాలి; డబ్బు కావాలంటే ఉద్యోగాలు చేయాలి. బాబుగార్లలాగే ధనవంతులు కావాలి. వారందరికిమల్లే సిల్కు సూట్లు, ఫ్లానల్ టోపీలు పెట్టుకునే తాహత్తు హోషుక్కు వస్తేకద అంతటి వైభవం! జోళ్ళు వేసుకోవాలి. వేసుకుని టాక్‌టీక్‌మని నడిస్తే అంతా దర్జావే!

వాడే వేసుకోవలసివస్తే, చిన్నాయనవికంటె పెద్దాయన బూట్లే నచ్చుతాడు. అవి నల్లనివి. ఇవి గోధుమరంగువి. చిన్నాయన జోళ్ళకు బకిల్సు లేవు. వీధిలో అమ్మే పల్లెటూరు రైతులు వేసుకునే జోళ్ళలా బోళాగా వున్నాయి. చిన్నబాబుకి పెట్టెనిండా సూట్లే; సిల్కురుమాళ్ళే, ముట్టుకుంటే దూదల్లే మెత్తన. ఆయన్ని తన కొంకచాకొక్కా, పంట్లాం

యిమ్మని అడిగితేనో అని...ఇస్తాళ్ళే; మనిషి మహామంచివాడు. కానిఆనూట్లు తనకు సరిపోవుకదా! పొడుగు. తా నెలాగా పెద్దవాడవుతాడు. అప్పుడడిగితే యివ్వకపోడు. అడిగితే లేదనేరకం కాదు. ఇస్తే పుచ్చుకొని యించక్కా వేసుకుని, హాాయిగా తిరగొచ్చు. ఇప్పుడేమంత కొంప మునిగిపోయింది!... లేకుంటే యిప్పుడే పుచ్చుకుని దాచుకుంటేనో ... అక్కే ఫరవాలేదు; అప్పుడూ యిస్తాడు. అడగ్గానే తనకు లేజరుగ్లేడు యివ్వలేదూమరి! చిన్నాయన ఎంతో తెలివైనవాడు! ఆయన దగ్గర మిషనొకటి వుంది. ఆ మిషను మూతిని మన గుండెలమీద వుంచి, దాని చేతుల్ని తన చెవుల్లో పెట్టుకొని చూస్తే చాలు, ఏదో రహస్యం చెబుతుంది. వెంటనే " నీ జబ్బు ఫలానా. దీని కిదీమందు" అని చెప్పేస్తారు. అస్థాయక్షిణీముండ!

ఒకటే కాదు. ఇలాటివి చాలా వున్నాయి. ఆయన కెన్నో పెట్టెలు, వాటి నిండా మందులు; ఈ మందుల్ని ఎలా చేస్తారో! బాబుగారిలా తానూ ఒక డాక్టరయిపోతే! బాగుంటుంది; బాగుంటుంది. పోనీ పెద్దబాబుగారిలా బేంకులో ఉద్యోగం చేస్తే; మంచి దర్జాగా వుంటుంది. ఆయనకందరూ, "దణ్ణాలండి;. దణ్ణాలండి" అంటారే! కాని...........

ఆలోచనల రేకులు మెల్లమెల్లగ విడివడుతున్నాయి. చైతన్యం విక సిస్తున్నది; కాని దాని ఉనికి అతనికి తెలియరావడంలేదు. మొదట అతనిని గురించి ఆలోచించింది; తరువాత చైతన్యం నెమ్మదిగా దూరంగా జరిగి ఎవరికో ఒకరికి బానిసగావున్న తన యజమాని గృహంచుట్టూ తిరిగింది; తుట్ట తుదకు పట్టణంలోనికి అల్లుకునివెళ్ళింది. ఈ గీతలచుట్టూ చందమామ గూడును కట్టుకున్న అతని చైతన్యం ఒక అపూర్వ ఆలోచనను రేపింది. అది ఏమో స్పష్టంగా తెలియడంలేదు. మూఢవర్ణాశ్రమ, వర్గ భేదాలతో, కట్టుబాట్లతో, శాసనాలతో, ఏ సమాజం వెర్రితలలు వేస్తున్నదో, ఆసమాజం ఆ పిన్నవాడిని అణచిపెడుతున్నది. ఝుడిపిస్తున్నది. తమ పొట్టా, తమ బట్టా తప్ప మిగిలిన వేవీ అక్కరలేని స్వార్థపరులు కొద్దిమంది నిర్ణయించిన ఈ చట్టాలు, ఈ వర్గ వ్యత్యాసాలు వాడిని ఊబిలోనికి దించి విడిచినయ్; ధనం కోసం, అధికారం కోసం, పరపీడన సాగించే కుక్షింభరుల నీతులతో, తత్వాలతో, క్రౌర్యాలతో నిండిన ఈ సమాజం, అతనిని లేవకుండా క్రిందకు పడవోసి 'చిత్తు' చేయబోతున్నది. ఒకతరం, మరొకతరం, ఇంకొకతరం, తరతమ భేదాలతో ఉన్నతవర్గాలు దోపిడీని కొనసాగిస్తున్నాయి. ఖామందులు

సమాజపు సంపదలను జుర్రుకుంటున్నారు. అడ్డువచ్చినవారిని నంచుకు తింటున్నారు, బల్లి ఈగలను తింటున్నట్లు.

కాని ఎంత విచారకరం! దురదృష్టం! పాపం, ఆ పిల్లవాని జిజ్ఞాస ఏవేవో పరిధులచుట్టూ ప్రదక్షిణ చేసింది. పాతపుంతలలోనే పయనించింది. కాని మరోకలా అయితేనా! అతనిశక్తి అతనికి ఆకళింపుకు వచ్చేది. అణగి మణగివుండే అజ్ఞాతశక్తులు లేచివచ్చేవి. ఆ మానవమూర్తిలో ఎంతో మార్పు వచ్చేది. తన యజమానివలె తయారుకావాలనే అతని కోరికలోవున్న కుటిలత్వాన్ని, వంచనను సులభంగా గ్రహించుకునేవాడు. ఈ గ్రహణ కా పసివాని జీవితం, ఏ మాత్రం దోహదం చేయలేదుమరి!

అయితే, తాను చిన్నప్పుడు కథలు చదివాడు; విన్నాడు. బళ్లో బోధించిన పాఠాలను వల్లెవేశాడు; చెప్పిన కథలలోని విషయాలను చక్కగా జ్ఞాపకం పెట్టుకున్నాడు. అతని గ్రామంలోని కథలు, రాష్ట్రంలోని, దేశంలోని వృత్తాంతాలు ఇవన్నీ ఆస్తులకోసం, అధికారాలకోసం, ఆధిపత్యాలకోసం, వింజామరలకోసం, సింహాసనాలకోసం, ఎవరో కొందరు, బొడ్డున మాణిక్యం పెట్టిపుట్టిన బహుకొద్దిమంది చేసిన వీరకృత్యాల వర్ణనలు; ఏ దేశ చరిత్ర చూసినా యింతే. పల్లకీలు మోయించుకునే వాళ్ళు చేసే ప్రతీచర్యా యింతే. వాటి చాటున తడిసివున్న రక్తం, పాపం. అతనికి గోచరించలేదు. ప్రపంచంలో ప్రతి పసిపిల్లవాని హృదయంవలె, కొసకు యువకుల మనసులవలె, అతని నేత్రాలముందు గొప్పతనం, కీర్తి అనేవి కనిపించినవేకాని, అసలు రహస్యం విడివడలేదు. అల్పులుగా, జారులుగా, నీచాతినీచులుగా సమాజపు అట్టడుగున పాతాళాలలో ఎల్లకాలమూ పడివుండమని శాసిస్తున్న, దండిస్తున్న ఒకానొక సాంఘికదురన్యాయం వున్నదనే సత్యం, పరమ సత్యం అతని కింకా దృగ్గోచరం కాలేదు. ఒక మాయతెర అతని మనోనేత్రాలను కప్పివుంచింది; అతనితో దాగుడు మూత లాడుతున్నది. కాని ఈ దాగుడుమూతలమాటున ఒక బలీయమైన కోరిక పరిఢవిల్లుతున్నది. శరీరం పుష్టిగ ఎదుగుతున్న కొలదీ, వాంఛలు తీగెసాగి మొగ్గలు తొడుగుతున్నవి. అవి ఒక సహజపరిణామం వలె ఎదుగుతూ, అతనికి తెలియకుండానే, ఆవహించినయ్!

సంతృప్తి కావాలి. ఆశలు జనిస్తున్నాయి. వింత వింత రుచుల వైపునకు జిహ్వ లాగుతున్నది. జీవితానందం, జీవిత సౌఖ్యం కావాలనే ఆరాటం హెచ్చింది. మనసు కోరికలను పొదుగుకుంటున్నది. తరుముకు, తరుముకు

వచ్చిపడే యీప్సితాల విజృంభణలో పిల్లవాడు ఉక్కిరిబిక్కిరవుతున్నాడు. రంగులవైపునకు దృష్టి మళ్ళింది. సహజ వాసనల ప్రేరేపణ, జీవితంలో దేనినో అనుభవించమని హెచ్చరిస్తున్నాయి. కాని చైతన్యంలేని ఆమానవుడు తన యజమాని వంటగదిలో, ఆ మురికికూపంలో కాస్త ఊపిరిపీల్చుకోవడమే 'పదివేలు' గా భావించుకుంటున్నాడు. ఆఖరికి తనకు కాస్త రొట్టెపిసరు దొరికినా మహద్భాగ్యమే!

అతనికి దిక్కూమొక్కూ లేదు. గాలికి పుట్టి ధూళికి పెరిగేడు. ఎవరైనా తనను బుజ్జగిస్తే లాలిస్తే బాగుండును. ఒకరి ఆసరా తనకు కావాలనేది యిన్నాళ్లూ తోచనేలేదు; నేడిది అత్యావసరంగా తోస్తున్నది. జీవితంలో ఆనందం వెల్లివిరియడం లేదు; దీనికి హేతువు విధి; కర్మ; విధి అనే చదరంగపు బల్లలో కొందరు రాజులు, మరి కొందరు బంట్లు. ఇతను బంటు. ఇతనే కాదు; మానవులంతా ఇంతే! ఈ సంగతినే తన గ్రామంలోని పౌరాణికుడు చెప్పేవాడు.

అతనికి గల సహజవాసనల బలం సంపూర్ణశక్తివంతములుగ స్ఫురించేవరకు, ఈ స్థితి తప్పదు. కొందరు మనుష్యులు గొప్పవాళ్లు. మరి కొందరు పేదవాళ్ళు. రోగాలతో రొప్పుకుంటూ, దరిద్రంతో తీసుకుంటూ, పక్షుల్లా రాలిపడే, కుమిలి పోయే, చని పోయే తన కొండజాతి ప్రజలకంటె ఈ ధనికులు మిన్న; అధికులు; తన పల్లెలో ఫించనీ తీసుకుంటున్న సుబేదారు కంటె, జయసింగు తండ్రి కంటె ఈ నగరంలోని కొందరు అధికులు. వీరి కీర్తుకత ఎలా వచ్చింది? అది అతని కవగతంకాలేదు. వీరంతా నాజూకైన బట్టలు ధరిస్తున్నారు; వీరికున్న వస్తువులన్నీ అందచందాలతో పుట్టి పడుతున్నవే. ఇదే చాలును, వీరు విచిత్రమైన, దేవతా పురుషులని చాటి చెప్పడానికి! అయితే ఈ నాజూకు దుస్తులు, నగలు, కార్లు, భవనాలు, తోటలు, దొడ్లు, మడిమాన్యాలు వీరి కెలావచ్చాయి? దీనికిగల కార్యకారణ సంబంధాలేమిటి? ఈ ప్రశ్నలు అతని బుద్ధికి తట్టనేలేదు. ధనికులకున్న తృప్తీ, ఆనందం, అహంకారం, నిశ్చింత, సుఖం, కులాసా జీవితం, విలాసం ఇవన్నీ ధనం వారికి కొనిపెడుతున్నది. ఈ నగ్నసత్యం ఆపిల్లవానికి విదితంకాలేదు. వారు పీల్చేగాలి, తినే తిండి సమస్తం ధనం పణంపెట్టగా వచ్చిన ఫలితాలు. అటువంటి ఈ ధనరాసులు, గొప్పవారి లోగిళ్ళలో ఎందువలన మూలుగుతున్నాయ్? అది వాడు వితర్కించుకోలేదు. పైగా ఇదంతా

సహజమే ననుకున్నాడు. లోకంలో తనొక బానిస; తన జన్మమే అంత. ఒకరికి చాకిరీచేసి పడివుండడమే తన జన్మసాఫల్యం! యజమానిని అన్ని విధాల మెప్పించే నౌకరులా అతను ప్రవర్తించాలి. ఈ భావం అతనిలో ఉదయించి బలపడింది. పనిలో పరిపూర్ణతను సాధించాలి.

పరిపూర్ణతను సాధించేపథంలో అనేక గోతులు, గుంటలు, లోతులు, గతుకులు వుంటాయి. దురదృష్టవశాత్తు యీ గోతులలో అతను జర్రున జారిపడ్డాడు.

ఒకనాటి సాయంకాలం విచిత్రమైనదే, ఒక సంఘటన జరిగింది. మిస్టర్ డబ్ల్యు. పి. ఇంగ్లండు అనే దొరను కుటుంబసమేతంగా విచ్చేయ వలసినదని నాథూరామ్ ఆతిథ్యాని కాహ్వానించాడు. ఆయన బేంకులో చీఫ్ కాషియర్ గా పనిచేస్తున్నాడు; అనేక చిన్నఉద్యోగు లతనిని ఆశ్ర యించవలసివుంటుంది. అందులో నాథూరామ్ ఒకడు. చూసీ చూడగానే, దొర నరాంతకుడని స్ఫురిస్తుంది! విపరీతమైన మనిషి. రివటలా పొడవు. కాళ్ళు కర్రలకుమల్లే వుంటాయి. పాదాలు కోణాకారం. దేనినో పారేసుకుని, వెదుకుతున్నట్టు ఊగుతూనడిచే దొరను చూస్తే నవ్వువస్తుంది. మొహ మంతా ముడుతలుతేరింది. కళ్ళజోడొకటి ముక్కున వేళ్లాడుతున్నది. ముడు తలు, కళ్ళజోడు మినహాయించి అతని ముఖాని కివీ లక్షణాలని, వేనినీ పేర్కొనలేము. సబ్-ఎక్కౌంటెంటుగా పనిచేస్తూ, నాథూరామ్ తన పైఉద్యోగిని ఎలా బుట్టలోవేశాడా అని మిగిలిన గుమాస్తాలు ఆశ్చర్యపడ్డారు. నాథూరాం ఆతిథ్యాన్ని స్వీకరించేందుకు, దొరకు ఏమైనా ప్రత్యేక కారణా లున్నాయా అని ఆలోచించేరు. అయితే దొరదగ్గర విశేషించి ఒక సుగుణం వుంది. అన్నివేళల, ఆయన పల్చనిపెదవులమధ్య చిరునగవు తాండవిస్తూ వుంటుంది. ఆ ప్రసన్నత, ఈ తేనీటి విందుకు కారణం.

ప్రతి ఉదయం, నాథూరామ్, దొరకు 'గుడ్ మార్నింగ్ సర్' అంటాడు. వెంటనే, పెదవులపై చిరునగవు చిందుతుంది. నిర్మలమైన ఈ మందహాసం అతని మంచితనాని కొక చిహ్నం. ధుమధుమలాడే మనుష్యు లింతచక్కగ నవ్వలేరు. దీనికి బేంకు మేనేజరు మిస్టర్ రాబర్ట్సుగారే ఉదాహరణ. ఆయనది కపటస్వభావం. అయితే ఇంగ్లండు దొర, నవ్వుతాడేకాని ముభావంగా వుంటాడేమి? ముక్తసరిగ మాండేమాటలు మాటలాడతాడు. అతని నవ్వు నిజమైనదేనా! లేక ఆ నవ్వులో తనపై కనికరంచూపేభావం యిమిడి

వున్నదా? ఆ నవ్వు కేవల మొక నటనగా కనిపిస్తున్నదే! తెచ్చిపెట్టుకున్నదో, సహజసిద్ధమో తేల్చుకోవాలనుకున్నాడు. లేకుంటే చాల ప్రమాదం వస్తుంది. తను యిప్పుడు సబ్-ఎక్కౌంటెంటు; దొర సిఫారుసుచేస్తే ఎక్కౌంటెంటు కావచ్చును. నేటికి ఎన్నో సంవత్సరాలనుంచి, తన కా ఉద్యోగం కావాలని అర్రులుచాస్తున్నాడు. ఇప్పటికైనా వస్తుందో, రాదో చెప్పలేని స్థితిలోవుంది ఆ ఉద్యోగం; ఇరవై సంవత్సరాలనుంచి, వాడి ఆయుష్షు మండిపోను, అఫ్‌జుల్‌హక్ ఆ ఉద్యోగంలో తిష్ఠవేసుక్కూర్చున్నాడు.

మిస్టర్ ఇంగ్లండు నూతనోద్యోగి. దొర ఆనుపానులు తెలుసుకుని ఆకట్టుకోవాలి. ఈ నూతనోద్యోగి క్లబ్బులో చేరినవెంటనే మిగిలిన ఆంగ్లేయులతో నేస్తం కుదురుతుంది. దానితో పాతబడిపోతాడు; దొర లందరికి మల్లేనే, భారతీయులను అసహ్యించుకుంటాడు. ఈ అసహ్యాభావం జనియించేలోపునే, దొరను బులిపుచ్చకాలాడి బుట్టలోవేసుకోవాలి. ఇపుడు మొహంమీద పాటమరించే యీ నవ్వుకాస్తా విషపునవ్వుగా మారిపోయేలోపున, ఈ గాలీ, నీరూ వంటపట్టి, తలబిరుసుతనం హెచ్చేలోపున, దొరను వలలోవేసుకోకపోతే గట్టిచిక్కే; ఆనక విచారించి లాభంలేదు; అతని పుట్టుపూర్వోత్తరాలు, కుటుంబ స్థితిగతులు, యిష్టాయిష్టాలు, యివన్నీ తనకెందుకు? ఎప్పుడో ఒకప్పుడు తన పనితనాన్ని చూసి, మోజుగలిగి, దొరకు అనుగ్రహం కలిగేటంతవరకు, వేచివుండడం నిరుపయోగం. అయ్య వచ్చేవరకు అమావాస్య ఆగదు. కనక అతనిని తేనీటివిందుకు ఆహ్వానిస్తే వ్యవహారం పొదుపుచేసుకోవచ్చును. ఘాత్తుపరుచుకోవచ్చును. ఇంతకీ దొరతో కత్తుకలపడ మెలాగ! పొత్తుకుదిరే అవకాశం ఎక్కడ? దీనికి ధైర్యం, సాహసం అవసరం. ముందుగా బ్రహ్మాండమంతప్రయత్నంచేసి పూర్వరంగం తయారుచేసుకోవడం మంచిది.

ప్రతి దినం, ఉదయాన్నే గుడ్‌మార్నింగ్ అనడమేకాక, విశేషించి నాలుగయిదు మాటలు ఏవో మాట్లాడాలని ధైర్యం తెచ్చుకున్నాడు. కాని అదును దొరకడం లేదాయె! ఊపిరి బిగించుకుని, సమయంకోసం నిరీక్షిస్తున్నాడు. "ఆ ఉత్తర మేమయింది? ఈ ఫైలు సంగతేమిటి?" అని దొర ప్రశ్నిస్తే మంచి మజాగా వుండేది. ఊహుఁ; అలా ప్రశ్నించడు దొర; కర్మ; కర్మకాకుంటే మరేమిటి? ఏదీ, ఇలా ఇద్దరూ కలుసుకుంటారు, అలా తుర్రున బుర్రుపిట్టలా దొర ఎగిరిపోతున్నాడు; తనకు తానై ఫైళ్ళవిషయం కలగజేసు

కుని ప్రస్తావిద్దామంటే కొంచెమైనా వ్యవధి కావాలికదా! ఈ విధమైన ఆలోచనలలో నాథూరామ్ మునిగితేలుతున్నాడు. దొర నవ్వే నవ్వులో అంతరార్థాలేమై వుంటాయా అనే మీమాంసలో పడిపోయాడు.

ఒకంత యింగ్లీషువాళ్ళు పట్టుకు దొరకరు; జలగల్లా జారిపోతారు; ఆఫీసు వ్యవహారాలలో మరీని; ఎవరిమీదా స్థిరంగా అభిమానం నిలవదు. అంతా అనుమానమే; గాభరాయే; వాళ్ళు మాట్లాడరు. ఒకరిని మాట్లాడ నీయరు. నోరు తెరచుకుని ఆలోచిస్తూ కూర్చుంటారు. ఆతని స్నేహితు డొకాయన, వీళ్ళనుగురించి బహుచక్కగా వర్ణించిచెప్పేడు; ఆ స్నేహితుడు ఇంగ్లండులో బారిస్టరుప్యాసయి దేశం వచ్చేడు; ముందుగా దొరలతో సంభాషణ కలపాలంటే, వాతావరణం బాగులేదనో, బాగుందనో ప్రారం భించాలట; బారిస్టరు స్నేహితుని అనుభవమే అదిట!

ఒకనాడు మామూలుగా, మిస్టర్ ఇంగ్లండ్ కనీ కనిపించగానే "గుడ్ మాణింగ్ సర్!" అన్నాడు. దొర అందంగా ఒక నవ్వునవ్వేడు. కాని, ఆ నవ్వులో ఏదో వింతపోకడ కనిపించింది. దొరకంటె, నాథూరామ్ యిరవై సంవత్సరాలు పెద్ద. పిన్నవాడైన తనపట్ల నమ్రతను ప్రదర్శించడం, మిస్టర్ ఇంగ్లండుకు అనౌచిత్యమనిపించింది. పైగా నాథూరామ్ సంపన్నుడు; నలభై వేల పైచిలుకు వాటాలు అలహాబాదు బేంకిలో అతనికున్నవాయెను. అనేక బ్యాంకులున్న గవర్నమెంటుకు మంచి నమ్మకస్తుడు; ఆప్తుడు. డైరక్టర్లుగావున్న అనేకమంది ఆంగ్లేయు లతనిని గౌరవిస్తారు; నమ్ముతారు; హోదాకు తగినట్లుగా ప్రవర్తించక, లేనిపోని ఈ నమ్రత లెందుకో దొరకు బోధపడలేదు. 'భారతీయు లెంతటి సంపన్నులైనా, వట్టి నీచులేనని' ఒకసారి తనతో మిస్టర్‌హోర్న్ ప్రసంగవశాత్తు చెప్పేడు. అది నిజం. అయితే 'ఎంచాత వాళ్ళు నీచుల'ని తానానాడు అడగలేదు.

మరొక రోజున, మిస్టర్ ఇంగ్లండు హాలులోనుంచి 'వంకర టింకర'గా అడుగులు వేస్తూ అయిమూలగా నడుచుకుపోతున్నాడు. నంగిరి మొహంతో, చేతులు నలుపుకుంటూ నాథూరామ్, అతని వెనకాలపడ్డాడు. చికాకుగ మొహం పెట్టి, దొర గాజుతలుపుల వరండామీదకు వెళ్ళేడు. గాజు తలుపుల నీడ చల్లగ హిమవంతంలా వుంది. వసారా ప్రశాంతంతో నిండివుంది. సంప్రదాయానుసారం, నాథూరామ్ "ఫైన్ మార్నింగ్ సర్!" అనేశాడు. హఠాత్తుగ ఏదో పిడుగు మీదపడినట్లు దొర గతుక్కుమన్నాడు. మొహం

వెల వెల బోయింది. గిరుక్కున మొహం అటుతిప్పేసుకున్నాడు; లోనున్న భావాలను బయటకు పొక్కనీయకుండా, లోపలనే దాచుకుని వెడ వెడ నవ్వుతూ, వ్యంగ్యంగా, "అవు నవును! బాగుంది" అన్నాడు. ఆయన చిత్త వృత్తిని నాథూరామ్ గ్రహించుకోలేదు. రొట్టె నేతిలో పడిందికదా, ఇక యిప్పుడు తేనీటికి పిలవనా వద్దా అని తటపటాయిస్తున్నాడు; ధైర్యంచాలక 'కిమన్నాస్తి'గ మౌనం వహించాడు.

రాక రాక ఒక మహాతరుణం వచ్చింది. మొన్నను తాను కల్పించిన ఆవేదనను, కాఠిన్యతను ఉపశమింపచేసి, నాథూరామ్‌కు ఉల్లాసం కలిగించాలని దొర సంకల్పించుకున్నాడు. పని కల్పించుకుని తనకు తానై నాథూరామ్ చెంతకువచ్చి "ఎలా వున్నారు నాథూరామ్?" వ్రాసుకుంటున్న ఆవర్జా క్రింద పారేసి, చటాల్న లేచాడు; చెవులమధ్యనున్న కలం జారిపడింది. "ఫైన్ మాణింగ్ సర్!" "ఓయస్; వండర్‌ఫుల్!" కొన్ని నిముషా లెవరూ నోరుకదపలేదు: నిశ్శబ్దత; ఒకరి నొకరు పరస్పరం అవలోకించుకుంటున్నారు. ఇద్దరూ నిలబడే వున్నారు. "సరే; భోజనానికిపోతాను; ఆకలి అంతగా లేదు కాని" భోజన ప్రసక్తి రానేవచ్చింది కనుక, నాథూరామ్ 'విందు సంగతి' దొర చెవిలో మెల్లగా జార్చవచ్చును;

"మీ రొకసారి మా యిండియన్ మీల్సు రుచి చూశారుకారు!"

"క్లబ్‌లో మీకూరలు రుచిచూశాను; అబ్బబ్బబ్బ! ఎంతకారమయ్యా!"

"మీరలా మా వంటల్ని తోసి పారేయడమే! కూరలు నేతి పోపు వేసి మా ఆవిడ మంచి పసందుగ వండుతుంది. మసాలావేస్తే మరీ బాగుంటుంది; వేపుడు ముక్కలు యింకా బావుంటాయి."

"కూరలు నాకు సాయించవండీ;" ఇంగ్లండ్ యథాప్రకారం ఐవ్వేదు; ఈ స్వదేశీయులతో అంత చనువుకూడదని క్లబ్‌లోని మిత్రులు పదే పదే హెచ్చరించినవిషయం గుర్తుకువచ్చింది; గిరుక్కున తిరిగి, "థాంక్యూ; థాంక్యూ" అంటూ బయటకు పోయేందుకు, ఉద్యుక్తుడవుతున్నాడు.

"మా ఇల్లు ఒకసారివచ్చి చూడరూ?" నాథూరామ్ గుండె అదిరి పోతున్నది. టక టక గడియారంలా కొట్టుకుంటున్నది. "మీరు మాయింటి కొకసారి దయచేసి, మే మిచ్చే విందారగిస్తే, మా ఆవిడ ఎంతో ఆనందిస్తుంది సార్! మా తమ్ముడు, సర్..."

దొరకిదంతా అప్రస్తుత మనిపించింది; అసంగీకారసూచనగా తల ఊపేడు. నాథూరామ్ అంతటితో పోనీయలేదు; "ఈవాళనే సర్"

"ఇవాళ కాదు."

"పోనీ, రేపు సర్."

"నో; నో; ఎప్పుడో ఓ రోజున."

"ఓయస్సార్! ఓయస్స్; మీరు తీరికైనపుడే!"

ఈ వాగ్దానం పుచ్చుకున్నాక, నాథూరామ్, మిష్టర్ ఇంగ్లండును పొద్దున్న మధ్యాహ్నం, సాయంకాలం, ముప్పూటలా, తేనేటికి రమ్మని వేపుకు తింటున్నాడు. అతని పోరుపడలేక ఇంగ్లండు అంగీకరించాడు.

విందు యింకా వారం పదిరోజులుందనగానే, నాథూరామ్ ఇంట్లో సందడి హెచ్చింది; గడబిడతో, యిల్లంతా పెళ్ళివారియిల్లువలె తయారయింది. ఇంట్లో అందరికీ చేతినిండా పనే, మనూకు సహితం, ఈ తొడతొక్కిడి మీదపడింది. తివాసీలను దులిపేరు; కుర్చీలు సర్దుతున్నారు; కర్టెన్లు అలంకరిస్తున్నారు; సీసాలు, బొమ్మలు, పుస్తకాలు, చిన్నచిన్న పాత్రలు కనిపించకుండా, వాటిపై తెల్లని గుడ్డలను ముసుగు వేశారు. ఇంగ్లండుదొర తేనీటి విందుకై, నాథూరామ్ గృహానికి వెడుతున్నాడనే వార్త పొగలాగ బయటకు పొక్కింది. ఊరంతా ప్రాకింది. ఇరుగు పొరుగు గృహస్తులు దొర వస్తున్నపుడు, తమను చూడకుండా పరదా ఏర్పాటులను చేసుకున్నారు. మాసిపోయిన డోర్‌కర్టెన్లను అలంకరించుకున్నారు.

నీలిరంగు నేవీసూటు ప్రత్యేకంగ వేసుకుని, ఒక ప్రక్క నాథూరామ్, మరొక ప్రక్క ప్రేమ్‌బాబు, నడుస్తూ వుంటే దొరకు ఉక్కబోసినట్లయింది. వెనకాల, చప్రాసీ దయారామ్ అడుగులు వేస్తున్నాడు. దొరకు మహా చికాకుగవుంది. వెడల్పైన సిల్కు చేతిరుమాలు తీసుకుని కనుబొమలు అద్దుకున్నాడు. తను వెళ్ళబోయే నాథూరామ్ ఇల్లు ఏమాదిరిగా వుంటుందో అని ఊహిస్తున్నాడు. హెమిల్లు ఎస్టేటులో తన తండ్రికున్న ప్యాలెస్‌లా వుంటుందేమో ననుకొన్నాడు. బ్రిక్సన్‌లోని ఆ బంగాళాను మిష్టర్ డ్రాగ్ సహాయంతో వాయిదాలమీద సొమ్ము చెల్లించి కొనుక్కున్నారు. ఇంతకు ముందు మిడ్ లాండు బ్యాంకులో గుమాస్తాగ వున్నపుడు తా నా యింట్లో ఒక గదిలో నివసించేవాడు; గుమాస్తాగా వున్నవాడల్లా ఆకస్మాత్తుగ కేషియర్

అయిపోయాడు. ఇంతకీ నాథూరామ్ గృహం, హాలీవుడ్ పిక్చరు 'ది స్వామీస్ కర్స్' లోని హిందువుడైన, అబ్దుల్ కరీంగారి మహల్‌లా వుంటుందేమో! ఆ మహల్ హాలులో మధ్య నొక ఫౌంటెన్ వుంది. చేతులతో పూలగుత్తులు, మాలలు, ధగ ధగ ప్రకాశించే ముత్యాల, వజ్రాల సరులు పట్టుకుని, అబ్దుల్ కరీంగారి అసంఖ్యాక భార్యలు నృత్యంచేశారు. నాథూరామ్ గృహం అలానే కల కల లాడుతుందేమో!

గుమ్మాల కున్న ముకికి గుడ్డల తెరలను తొలగించి, పరదాల ముసుగుల లోంచి 'సాహేబ్, సాహేబే!' అనే మాటలు వినవస్తున్నవి. ఆ అలికిడి విని నాథూరామ్ "మహమ్మదీయులు! ఘోషా హెచ్చు సార్!" అన్నాడు. ముస్లిములపై తనకున్న వ్యతిరేకతను వ్యక్తంచేసే అవకాశం దొరికిందికనుక "అదిగో, ఆ అలికిడంతా, అఫుజుల్ హక్కుగారింటనే; ఆడవాళ్లు, ఘోషా కదండీ, అటు ఇటూ పరుగెత్తుతున్నారు." ప్రక్కకు తిరిగి చూసి, మిస్టర్ ఇంగ్లండ్, కొంచెం కష్టంలో వున్నట్టు నవ్వేడు. నాథూరామ్ గడపలోనికి వచ్చాక, డాక్టర్ ప్రేమ్‌చంద్ "మీ నెత్తికి తగులుతుంది; కొంచెం చూసుకోండి" అని హెచ్చరించాడు; మిస్టర్ ఇంగ్లండ్‌కు కొంచెంలో మొట్టికాయ తప్పిపోయింది. తల పైకెత్తి చూశాడు. ద్వారం యిరుకుగా వుంది; చూసుకుని నడిచేసరికి ఆ యిరుకుదారి, చిన్న వసారాలోంచి, నాథూరామ్ కూర్చునే గదిలోనికి తీసుకువెళ్ళింది. ఎర్రని దొర మొహం వివర్ణమైంది. ఇంటి కొంచా బాగా కిందకు దిగి వుంది. కూర్చుంటే తప్ప, నించుంటే శఠగోపం పెడుతుంది. గది యిరుకు. ఇమ్ములేదు. పచారుచేదామంటే అసలే వీలులేదు. చప్రాసీ దయారామ్, ఉద్యోగి నాథూరామ్ లిద్దరు, గాభరాగా దొరగారు కూర్చుందుకని రెండు కుర్చీలు పట్టుకువచ్చారు. మిస్టర్ ఇంగ్లండు చుట్టూ కలయ చూశాడు; ఈ వాతావరణంలో నిల్చున్న అతనికి తా నొక జంభాసురునివలె తోచింది. అట్టేసేపు కనులతో ఏమీ వెతకకుండా, సింహాసనంవలెనున్న ఒక కుర్చీలో చతికిల బడ్డాడు! ఎదురుగ ఒక గజానుని మట్టివిగ్రహం, వాడిపోయిన దండలతో కనిపించింది. కనీకనిపించగనే దొర, మొహం చిట్లించుకున్నాడు. ఇదేదో దిష్టిబొమ్మల్లేవుంది. విగ్రహారాధన కూడనిపని అని, దొర తల్లి చర్చికి వెడుతున్నపుడల్లా దొరకు బోధించేది.

"ఈ విగ్రహమండీ, గణపతిది. ఏదైనా కార్యం ప్రారంభించే ముందు ఆయన్ని స్మరించుకుంటాం. లౌకికజ్ఞానానికీ, మనోబలానికీ,

సంపదలకూ యిలవేల్పు" ఒత్తి ఒత్తి ఒక్కొక్క పలుకునే చిలుకలా నాథూరామ్ అప్పగించాడు. తన భార్య ఎదుట, తను అందులో ... ఒక దొరముందు ఇంగ్లీషు మాట్లాడటం ఇదే మొదటిసారి; ఇప్పుడైనా చూసిందా లేదా; చూసి మురిసిపోయివుంటుంది! యిల్లాలు!

"అలాగా, ఇదేదో వినడానికి చిత్రంగానే వుందే!" అన్నాడు మిస్టర్ ఇంగ్లండ్; ప్రసంగం కొద్దిగా మళ్ళించాలని డాక్టర్ ప్రేమ్‌చంద్ "ఇక్కడ చదువయిపోయిందండీ; ఇక ఇంగ్లండు పోవడమే తరవాయి" డాక్టర్ ప్రేమ్‌చంద్ స్వతంత్ర జీవి. అన్నవలె దొరకింద పనిచేస్తున్న ఉద్యోగి కాడు; కనుక దొరతో సరిసమానస్థుడిమల్లే ప్రసంగించాడు.

"అవశ్యం; వెళ్ళిరండి" ఈమాట, మాటవరసకి అన్నాడే కాని, అలా అనగలిగేతాహతు లేదు; మిస్టర్ ఇంగ్లండ్‌కు విశ్వవిద్యాలయమంటే ఏమిటో తెలియదు. పెద్ద చదువులంటే ఎలా వుంటాయో వాటిముక్కూ, మొహమూ ఎరగడు. సౌత్ హామ్‌టన్‌గోలోవున్న ఒక చిన్న స్కూల్లో 'షార్టుహాండ్' టైపురైటింగ్ అభ్యసించాడు. అదే అతనికిగల విద్యాగంధం. ఉన్నతవిద్య గురించి తన కేమీ తెలియదని అందామనుకున్నాడు. కాని, ఈ భారతీయుల కంటె తా మెప్పుడూ అధికులమనేభావం అడ్డుతగిలింది. అవసరమైతే దొరలు తాము కింగ్‌జార్జికొడుకులమని భారతీయులకు చెప్పవలసివుంటుందని క్లబ్‌లోని తన సహచరులు పదే పదే ఇంగ్లండ్‌ను హెచ్చరిస్తూ వుండేవారు. అవును. అలాగే స్ఫురింపచేయాలి.

మిస్టర్ ఇంగ్లండ్‌ది తెల్లతోలు; ఎర్రగా బుర్రగా బుగ్గలు. ఆశ్చర్యంగా నోరు తెరుచుకుని గుడ్లప్పగించి దొరకేసి మునూ చూస్తున్నాడు. నాథూరామ్ గోడదగ్గరకు వెళ్ళి మేకుకు వున్న ఫొటోను తీయబోయాడు. కంగారుగా తీయబోయేసరికి పక్కనున్న ఫొటోలు జారి క్రిందపడబోయాయి. మునూ గబగబ గదిలోకి పరుగెత్తి వాటిని పట్టుకున్నాడు. నాథూరామ్ దొర కెదురుగా ఫొటోనుప్రదర్శించి "ఇది మా పెళ్ళికి తీయించుకున్న ఫొటో సార్"

దొర ఫొటోవంక కాస్త ఉత్సుకతతో చూడకపోలేదు. ఇది గమనించి, నాథూరామ్ ఫొటోను దొరమోకాళ్లపై వుంచాడు. ఫొటో అంచులను పట్టుకుని అద్దంలోవున్న ఫొటోలవంక తదేకదృష్టిని దొర ప్రసరింపజేస్తున్నాడు. మునూ కేక ఉత్సాహం ఉండబట్టక, దొర మోచేతులవద్ద నుంచుని, ఫొటోలోకి తొంగితొంగి చూస్తున్నాడు. పిల్లవాడి ఉత్సాహమే అంత; దానికి చిన్నా

పెద్దా, గొప్పా, బీదా వ్యత్యాసం లేదు. ఎముకముక్కలాటి మోచేత్తో మునూను ఒక్కతోపుతోసి నాథూరామ్ "ఛో, ఛో వెధవయ్యా! వాజీపీనుగా!" తమాయించుకుని కూర్చుంటున్న దొరకు చిరాకుపుట్టింది. తన మొహంలో మొహంపెట్టి నించున్న ఈ కుర్రవాడెవడు? బహుశా నాథూరామ్ కొడుకయి వుంటాడు! కొడుకు నలా గద్దించడం నాథూరామ్‌కు తగదు. అబ్బ! కుర్రాడిదగ్గర మురికికంపు. రోత పుట్టిపడుతూ దిక్కుమాలిన నిక్కరు! నల్లగా! వొంటిమీద ఏమిటో అగజ్జి! అసలీదేశస్థులంతా యింతే. హార్న్ దొర తన కెన్నిసార్లు చెప్పేడు ఆమాట; నల్లవాళ్లు ఈ భారతీయులు వట్టి రోగిష్టిముండావాళ్లని! అవును. అతనిమాట నిజమే. వీథులన్నీ కుష్ఠురోగుల మయం.

మునూపట్ల తను వహించిన కాఠిన్యం సహేతుకమేనని నాథూరామ్ దొరకు రుజువుచేయదల్చుకున్నాడు. చీత్కారం చేసుకుంటూ "ఈ నౌకరీ కుర్రాళ్లున్నారా అండీ!..." అవునవునన్నట్లు దొర పెదవులు విరిచి, మొహం చిట్లించాడు.

ఫొటోలో మధ్యను నాథూరామ్ భార్య కూర్చునివుంది. ఆమె ఒక స్త్రీమూర్తి అనేకంటె ఏదోఒక ఆకారంఅనడం మంచిది. ఆ ఆకారం గుడ్డలతో నగలతో చుట్టబడివుంది. మొహంమీద రెండుముసుగుల పరదా. కాళ్లు పారజాపి బీబీజీ ఠీవిగా కూర్చుంది. నాథూరామ్, బీబీజీ ఫొటోను చూపిస్తూ "ఈవిడ మా ఆవిడ సార్!"

"బాగుంది; చాలాబాగుంది!" అన్నాడేకాని దొరకు ఆ బాగు ఎక్కడవున్నదో స్పష్టపడలేదు. ఫొటోను ఎంతచూసినా బీబీజీ మోము కనిపించదాయె! ఫొటో కిందపడేసి, చేతులు దులుపుకున్నాడు. చేతులనిండా దుమ్ము. తొడుక్కున్న ట్రౌజరు పాడుపాడు. నానా ధ్వంసం. ఛ, ఛా! మొహం చిట్లించుకున్నాడు దొర; ఏదో సణుక్కున్నాడు ఇంగ్లండ్. క్షమాపణ పూర్వకంగా ఏమో చెబుతున్నట్లు నాథూరామ్ "మా ఆవిడికి ఘోషాలేదుకానీండి; సిగ్గుజాస్తీ. నలుగురికీ కనిపించడానికి ఓడియపడుతుంది; ఆవిడేకాదు; మా దేశంలో ఆడవాళ్లంతా యింతేనండి!" నాథూరామ్, క్రింద నున్న ఫొటోతీసి పైకెత్తి "ఇదిగో ఇది నాఫొటోయేనండి; పెళ్లినాడు మధుపర్కాలతో తీయించుకున్నది."

ఫోటోలో నాథూరామ్ తానొక అవతారమూర్తివలె కూర్చున్నాడు. తలపాగా; చెవులకు పోగులు. మెడలో పూలదండలు. తెల్లని ఇంగ్లీషు యిండియన్ బట్టలు. కుర్చీలో వాటంగా కూర్చుని, ఎడమచేతితో ముద్దు ముద్దుగ బీబీజీ కూర్చున్న కుర్చీచేతిని నిమురుతున్నాడు. కుడిచేతి రిస్టువాచి. అందరికీ కనిపించేటట్టు పెట్టి, టైము చూపిస్తున్నాడు. నాథూరామ్ ఫోటోను పరిశీలనగా చూస్తుంటే, వెనకతట్టున ఇద్దరు భూతాలవంటి నల్లని మనుష్యులను చూశాడు. ఫోటోకల్లా వీళ్ళే అలంకారం. ఆలోచిస్తున్న దొర కంఠరాయం కలిగింది. గదిలోనుండి ఒక బడబడమనేచప్పుడు, తడిసిపోయిన డప్పుల ధ్వని విన వచ్చింది. "ఎయిన్...ఎయిన్...హే...ఎన్...వీన్..." అనే గొంతుక డబ్బాలోని గులకరాళ్లవలె మ్రోగుతోంది. అది గ్రామఫోను సంగీతం. దొర విని అచ్చెరువుచెందాలని డాక్టర్ ప్రేమ్‌చంద్ 'కీ' యిచ్చాడు. సంగీతంతో ఇల్లంతా మోతగావుంది. ఛంగ్‌న ఒక్క దుముకు దుమికి గదిలోకి వాలాడు; "ఘుజల్, ఘుజల్. ఔత్తరాహబాణీ. మిస్ జానకీబాయి అనీ; గొప్పగా పాడుతుంది సార్. ఆమెది అలహాబాద్!" స్కూలునుంచి శైల అప్పుడే ఇంటికి చేరుకుంది. విన్నదేమో గ్రామఫోన్ మోత, గబ గబ గదిలోనికి పోయింది. ఎదట నిల్చున్న శైలను చూపిస్తూ "మా పెద్దమ్మాయి సార్!" కూతురాయకేసి చూసి "యిటురావే తల్లీ! ఎవరనుకున్నావ్? మన సాహేబ్‌గారే!" శైల సిగ్గుతో తలవంచుకుంది; వెర్రి వెర్రి నవ్వులతో మొహం దించుకుంది. మిస్టర్ ఇంగ్లండ్‌కు కంగారెత్తింది. పాముగుడ్లు పోసినట్లు శరీరం చెమటపోసింది. ఒగర్పు హెచ్చింది. "ఎన్ వీన్ ఏయిన్" మంచి సంగీతమే. తాడు తెంచుతోంది. ఒకటే రొద. భరింపలేనంత గడబిడ. దొర చెవులు చిల్లులు పడుతున్నాయి. ఇంగ్లండు దొర ఇదివరకు సహితం, వికారమైన సంగీతానికే అలవాటుపడ్డాడు. "ప్రేమ యొక సిగరెట్ వంటిది." "రోజ్ మేరీ, ఐ లవ్ యూ" "ఐ వాంట్యూబీ హేపీ, "ఐ కాంట్బీహేపీ, టిల్లయి మేక్యూ హేపీ;" ఇవీ అతనికి నచ్చిన గానసుధ. మిస్టర్ ఇంగ్లండ్ నోరు చప్పరించాడు. అటు ఇటు పరికించాడు. పిల్లవాళ్లు తనవంక ఎగాదిగా చూస్తున్నట్లనిపించింది. మనసు చివుక్కుమన్నది. ఈ బెడద యింతటితో తీరితే బాగుండేది. పీడ వదిలేది. తిని కూర్చుండి కాలిమున్న బురద నెత్తికి పులుముకున్నానే అనుకున్నాడు.

"ఒరే మునూ! దొరబాబుకి టీ, తే; వేగిరం; ఊఁ వేగిరం."

"ఆఁ ఆఁ! తెస్తాను బాబుజీ చిటికెలో వచ్చేస్తాను !" మునూ ఆనందం పరవళ్ళు తొక్కింది, ఆవేశం పొంగుకువచ్చింది. గదిలోని కవతలకు ఒకేఒక్క ఉప్పెనగంతు. ఎదురుగ వస్తున్న దయారామ్‌ను ఢీకొనును. కాని తలవెంట్రుక వాసిలో తప్పిపోయింది. లేకుంటే దయారామ్ బజారునుండి తెస్తున్న మిఠాయి వుండలు, మైసూర్‌పాక్‌లు మన్నుకొట్టుకుపోయేవి. పగలల్లా గోధుమ విసిరి, వుండలుచేసి, బీబీజీ చపాతీలు ఒత్తింది. పెనంముందు కూచుని బాలాజీ నూనెతో దోరదోరగా కాల్చింది. అవన్నీ దండుగైపోవును. దేవుడు మేలుచేసి, అవి కిందపడలేదు. 'అయినా యింత మిడిసిపాటేమిట్రా వెధవా' అని మునూను కసరబోయి, చటుక్కున ఆగింది. ఇంటికి పెద్దమనిషివచ్చాడు. తాను నోరుచేసుకోడం మంచిదికాదు. వంటింటి అవతల మునూ నించున్నాడు. బీబీజీ "అసుంటా; అసుంటా" అని తరిమి, కోపంగా చూసింది. ప్లేటులో వంటకాలు పెట్టి "గదిలోపెట్టు; హూఁ వెళ్ళు" అని గద్దించింది. ఆమె గద్దింపులు వినిపించుకొనేందుకు మునూ చైతన్యం ఇక్కడలేదు. ఎవరో దొరబాబు, తన బాబుగారింటికి వచ్చాడు. గ్రామఫోన్ మ్రోగుతోంది. పరవశత్వంతో తనను తానే మరిచిపోయాడు. వేగం గదిలోకి పోవాలనేదే వాడి ధ్యాస. ప్లేటు పట్టుకున్నాడు నోరూరుతుంది. కమ్మని వాసన. వేడివేడి వంటకాలు. వింత వింత చవులు.

గదిలోకి అడుగువేశాడు. నాథూరామ్ వ్రాసుకునే బల్ల డిన్నర్ టేబిల్. తను తెచ్చిన ప్లేటును డిన్నర్ టేబిల్‌మీద వుంచి, దొరబాబును పరిశీలిస్తున్నాడు. నాథూరామ్ తిడుతున్నట్టు మొహంపెట్టి "ట్రే పట్రా !" మునూ వచ్చేలోపున, దొరగారికి నాథూరామ్ ఫలహారమందిస్తున్నాడు. మిస్టర్ ఇంగ్లండ్ ముక్కుదగ్గర రెండుచేతులా వంటకాలు పట్టుకుని నిల్చున్నాడు. "ఇది గులాబ్‌జాం అనీ...ప్రశస్తమైనదిలెండి! తింటే బహు రుచి...దీన్ని చిత్తగించారూ...ఇది రసగుల్లా. అప్పుడే తీసిన 'ఫ్రెష్‌క్రీం'తో చేస్తార్ సార్! బలే గమ్మత్తుగా వుంటుందిలెండి. గులాబీ అత్తరు దీనిమీద చిలుకుతారేమో, గుమగుమలాడుతుంది. మీరొస్తారని, ప్రత్యేకం చేయించాను సర్!" రసగుల్లాల, గులాబ్‌జామ్‌ల మదనవాసన మిస్టర్ ఇంగ్లండ్‌కు పడలేదు. కడుపు తిప్పుతున్నది. "నోనో...థాంక్యూ."

"ఓ యస్ సార్! ఓయుస్సార్."

ఇంగ్లండ్ చేతి కొక ఫోర్క్, లేదా ఒక స్పూనూ యిచ్చివుంటే, శాస్త్రి ఎంగిలి పడేవాడేమో! కాని అతను చేతులతోనే తినాలని గృహమేధి సంకల్పం కాబోలును. ఇంగ్లీషువాళ్ళ కది అసాధ్యం. కోడిపిల్లను వేయించి ఎదుటపెట్టినా, దానికి పూర్తి న్యాయం కలిగేలా చూడాలంటే ఫోర్క్ అవసరం. ఫోర్క్‌తోనే శస్త్రచికిత్స.

"పోనీ, కాసిన్ని...ఈ రెండు...రెండంటే రెండు...పకోడీలు...మా ఆవిడ మీకొస్తారని చేసిందిసార్!...దయారామ్!...ఇలా పట్రా!"

దయారామ్ ప్లేటు పట్టుకువచ్చాడు. శనగపిండి పకోడీలు. బాగా వేగి నల్లగా వున్నాయి. తింటే చాలు జీర్ణకోశం చెడుతుంది. దొర భయ పడ్డాడు. తన పెదవులకు విషపాత్ర నందిస్తున్నట్లు భీతిల్లి మిస్టర్ ఇంగ్లండ్ "నోనో, థాంక్యూ; కడుపు నిండుగావుంది. ఇప్పుడే భోంచేశాను."

"మా వంటలు మీకు హితవుకావంటే పోనీ సర్! ఇవయినా తినండి; ఇంగ్లీషు స్వీట్సు. స్పెషలార్డరిచ్చి తెప్పించానూ!".

"అబ్బెబ్బే! సరిగాలేదు. అందులో ఈ వేళ ఎండ..."

నాథూరామ్ హతాశుడయాడు. దొర ఏమీ రుచిచూడలేదు. వండిన వన్నీ వండినట్లే వున్నాయి. దొర ఏమీ తినకపోతే, తనకూ అతనికీ మొగ మాటం ఏర్పడేదెలా? మచ్చిక చిక్కకపోతే తన ప్రమోషన్‌మాట ఆయన చెవిని వేయడమెలా? తా ననుకొన్నది ఒకటి. జరిగిన దింకొకటి. మిస్టర్ ఇంగ్లండ్ మూతిదగ్గర తీపిసామాను పెడుతూ "సర్! సర్! ఒక్క పిసరు రుచి చూద్దురూ!"

"థాంక్యూ థాంక్యూ! నిజం నాథూరామ్, కడుపు నిండుగావుందీ; ఒక్క కప్పు టీ తీసుకుంటాను. త్వరగా వెళ్లిపోవాలి. మీకు తెలుసుకదా, నాకు ఒకపనా, ఒక లోకమా?" నాథూరామ్ క్రిందిపెదవి అదిరిపోతున్నది. ఏదో తెలియని ఆవేశం; వణకు జలదరింపు.

"నేను చాలా ఆశపడ్డాను సార్! నేను ఈ దీనుడు తమ భృత్యుడు యిచ్చే ఆతిథ్యం స్వీకరిస్తారని; కాని టీ మాత్రమే తాగి వెళ్ళిపోతామంటు న్నారు; నా మన సెలావుంటుందో మీరే చెప్పండి...టీ, టీ, ఒకే, మనూ, టీ! టీ!"

టీ ట్రేతో గబగబ వస్తున్న మునూ, బాబుగారి కేకలు విని బెదిరి పోయాడు. చేతులోంచి ట్రే క్రిందపడ్డది. వంటిల్లంతా గలగలమంది. బీబీజీ కస్సు బుస్సులతో చిరచిరలాడుతోంది. ఏదో ప్రమాదమే వాటిల్లినదని, దొర ఊహించాడు. నాథూరామ్ కంపించిపోయాడు. గుండె బరువెక్కింది. ఊపిరి సలపలేదు. టీ సెట్టు ఐదురూపాయలు; మొన్ననే కొన్నాడు. ఇవాళ ముక్కలయింది. ఐదు రూపాయలు; జీతంలోంచి ఐదురూపాయలు! దండుగ వెధవ!

వంటయింటి గడబిడ విని, డాక్టర్ ప్రేమ్ పరుగెత్తేడు. బీబీజీ టీ కలుపుతోంది. ఆవిడదంతా చీమనడక; పని తెమల్చదు. డాక్టర్ ప్రేమ్ వదెన గారి చేతిలోనుంచి టీపాయ తీసుకుని కప్పులలో పోసి పాలు పోశాడు. చక్కెర కలిపాడు చక్కని సాసరులో నవ్వుతూ దొర వున్న గదిలోనికి ప్రవేశించాడు. "మిస్టర్ ఇంగ్లండ్! మా నౌకరు మునూ మంచి జ్ఞాని. పగలగొడితేనేమి, జపాన్ టీ సెట్టేకదా, కారు చౌకని వాడికి తెల్సులెండి. రోజుకు ఎన్ని పగలగొట్టినా యిబ్బందిలేదని వాడి ఊహ!".

మిస్టర్ ఇంగ్లండుకు శరీరం చెమటపట్టింది. గది ఉక్క. తన అసహాయస్థితికి తానే నిందించుకున్నాడు. కోపగించుకున్నాడు. నోరు బిగించుకున్నాడు. కప్పు తీసుకుని పెదవుల కానించాడు. కాస్త చప్పరించాడు. అబ్బ; నాలుక చురుక్కుమంది. నమ్రతతో, క్షమాపణ వేడుకొంటూ నాథూరామ్ "మాకు చాలా 'యిది' గా వుంది సార్! ఎంతో 'ఇద' ని పిస్తోంది. కాని మళ్ళీ తామొకసారి దయచేస్తారుకదా! ఆఁ అదే అడుగుతున్నది మా ఆవిడ". దొర దిగ్గున లేచాడు. గిరుక్కున తిరిగాడు. అవతలకి అంగలు వేశాడు. వెర్రి గొల్లనిలా, నాథూరామ్ అతని ననుసరించాడు. "కొంచెం చూసుకోండి మిస్టర్ ఇంగ్లండ్, కొంజా, కొంజా; తగులుతుందేమో!" దొర తలలోపలి గుమ్మానికి మారుకు తగలకుండా డాక్టర్ ప్రేమ్ ముందే హెచ్చరించాడు. దొర వదనంపై చిర్నగవు వెల్లివిరిసింది. మూతి బిగించుకుని, నిశ్శబ్దంగా నడిచి వెళ్ళిపోతున్నాడు. దొరవెంట నాథూరామ్, దయారామ్‌లు బయలుదేరారు; "గుడ్ఆఫ్టర్‌నూన్" అని ప్రేమ్‌నాథ్ కొంచెం దూరం సాగనంపి వచ్చాడు. దొర వీధులోంచి నడిచి వెడుతుంటే, ఇళ్ళ కిటికీలలో నుంచి ఆడవాళ్ళు 'ఎవరీ ఆగంతకుడని' చూస్తున్నారు; దారినపోయే

పిల్లలు ఆగి దొరను పరీక్షించారు; పెద్దలు కాస్సే పొగి పరకాయించి మాశారు.

తేనీటివిందు ఒక ప్రహసనంలా ముగిసింది. రసాభాస - డాక్టర్ ప్రేమ్‌చంద్ విందు నవ్వుతాలపాలయిందనుకుంటూ గదిలో కుర్చీలో చతికిల పడ్డాడు. రసగుల్లా ఒకటి రుచిచూస్తున్నాడు. వంటఇంటిలో బీబీజీ ఆపసోపాలు పడుతున్నది. ఎలుగెత్తి శాపనార్థాలు కురిపిస్తున్నది.

"వెధవ, మూర్ఖపు వెధవ! గుడ్డిమాలోకం, పట్టుకున్న దేమిటో, ఎలా పట్టుకళ్ళాలో వంటిమీద స్మారకం వుంటేగా, కొండవెధవకి! చెపితే వినిపించుకోడు; కొండకిర్రు ఏ మూర్తాన యింట్లో కాలుపెట్టాడో, యిల్లంతా నాశనం, సర్వనాశనం! ఆ తగలేసిన పింగాణీ చిప్పలు ఎంతో తెలుసు్రా నీకు! నీ నెలజీతమంత!" వదినెగారి ధాంధూంలు విని మరది బయటకు వచ్చేడు.

"దొర ఒక్క పిసరు నోట్లో వేసుకోలేదు. నాలుగు రుచులూ ఎరిగిన వాడు కాడు దొర" బీబీజీ ఈ మాటలు విని మండిపడింది. "ఇంతకీ ఈ వెధవనాలి; వీడే కారణం!"

"మధ్యన వాడేం చేస్తాడు? దొరతిండే అంత; కోతిమొహం వాడూను!" "బోడెద్దుకి పోట్లు మప్పకండి ప్రేమ్ బాబూ! అంతా ఆళ నేశ్వరంశెధవే కారణం; ఏజన్మరాసినపుట్టేడో మరి; కొండపీనుగ. వీడు రాకముందు ఇల్లు మోతీమహల్లా వుండమ్మా; ఇంట్లో వీడడుగుపెట్టాడు, యిల్లంతా పశువులసాల చేసేశాడు. నిక్షేపంలాంటి టీ సెట్టు!"

బీబీజీ దిగ్గున లేచి మునూ దవడమీద ఒక్కటి వేసింది. నాలుగు వేళ్ళూ చంపకంటుకుపోయాయి. "చూడండి వెధవ ఎలాచూస్తున్నాడోను, దెయ్యం పట్టినట్టు. చచ్చుపీనుగ వీడే కారణం! ఈ యింటికి పీడపట్టుకుంది. అలాకాదు, ఇలా చేయాలిలా మసులుకోవాలని చిలక్కి చెప్పినట్లు చెప్పాను; ఒకసారికాదు, రెండుసార్లుకాదు; లక్షసార్లు."

"అదేమిటొదినా! పాపం వాణ్ణి తంతారూ?"

"మీ రనవసరంగా వాణ్ణి వూసుకురాకండి...బాగుంది బాగుంది... ఆ నౌకరీ వెధవని లాలించడమొకటా?"

మునూ కనుకొలకులలో నీరునిండింది. రెండు కన్నీటి చుక్కలు చొక్కామీదపడ్డాయి. చేతిలోంచి పింగాణీ కప్పులు జారీజారగనే వాటితో పాటుగుండె కూడా జారిపోయింది. భయం ముంచుకొచ్చింది. మూగవానిలా నించుండిపోయాడు. దుఃఖం దిగమ్రింగుకుని కాళ్ళీడుస్తూ మెల్లగా అవతలకి వెళ్ళిపోయాడు. "పైకి ఏడ్చావా నోట్లో గుడ్డలు కుక్కుతా తొత్తుకొడకా" అనే నాథూరామ్ కేక ప్రతిధ్వనించింది. దుఃఖం పొంగుకువచ్చింది. దిగమ్రింగుకుని గొంతులోనే ఆపుకున్నాడు. ఉండుండి ఒక్కొక్కసారి దుఃఖం పైకుబికింది. వెక్కివెక్కి ఏడ్చాడు. జీవితం, పిల్లవాని జీవితం; ఇదే మొదటిసారికాదు; పొంగి పొరలివచ్చే దుఃఖాన్ని లోలోపలనే భరించి తన మూగబాధను వినేవారెవరూ లేకపోతే, తనతో తానే చెప్పుకోవడం! జీవితానికి కొత్తకాదు. దుఃఖంతోనే వాడు పుట్టాడు!

ఇంటుమసులుతున్నాడన్నమాటేగాని ముళ్ళమీదవున్నట్టేవుంది. బీబీజీ యిల్లు ముళ్ళకంచెల బందులదొడ్డి. ఇక్కడనుంచి పరుగెత్తుకుని ఎక్కడికో, ఎక్కడికైనా సరే- పోవాలి. ప్రొద్దునే లేస్తున్నాడు. అంట్లు తోమడం, చెంబులు తొల్చి ఇల్లు తుడిచి... పక్కలు ఎత్తడం, వేయడం, పిల్లన్ని ఎత్తుకోడం. రోజూ యిదే ఆ వృత్తి! కలలోని పాత్రలవలె మునూ లేస్తున్నాడు; చాకిరీ చేస్తున్నాడు. ఇంటికి పడ్డ నీళ్ళన్నీ మోస్తున్నాడు. ఎప్పుడు సాయంకాలమవుతుంది ఎపుడు అతనికి విముక్తి. ఇదే మునూ మూగ ఆవేదన. వారానికి ఒకపూటమాత్రమే అతనికి సెలవు. వారం తిరిగింది. సెలవుపూట వచ్చింది. పొద్దున పనిచేసి, మధ్యాహ్నం ఇంటికి పోవచ్చనుకున్నాడు. త్వరత్వరగా చెంబులు తోముతున్నాడు. ఎప్పటిమల్లే హుషారుగా లేడు. చురచురలాడుతున్నాడు; విసుక్కుంటున్నాడు. పని చేస్తూ చేస్తూ మధ్య మధ్య ఆగిపోతున్నాడు. దిక్కులు చూస్తున్నాడు. పరధ్యానం. బీబీజీ చూసింది. ఇక ఈవేళ మునూను ఇంటికి విడిచిపెట్టకూడదు. పనికాగానే మధ్యాహ్నం యింటికి పోతాడు. పోయి అమ్మగారు తనను కొట్టారని దయారామ్‌తో చెప్తాడు. అలా చెప్పడం బీబీజీకి యిష్టంలేదు.

ఎంత వేగిరం పని తెముల్చుకుని ఇంటికి పోదామా అనిపిస్తున్నది. బీబీజీ తిట్లు, శాపనార్థాలు, గుద్దులు, ఇల్లంతా గోల, చికాకు ఈ వాతావరణం దుస్సహం. దయారామ్ గదికిపోతే ప్రాణం తెరిపినపడుతుంది. ఇన్నాళ్ళై బీబీజీ నాలుగు ఎంగిలి మెతుకులు పెట్టకపోలేదు. కాని అవి వాడికి

సాయించవు. మూకుడులో కొయ్యముక్కల్లా మిగిలిపోయిన వేపుడు ముక్కలు, కిలం పట్టిడోకు; నోరుచచ్చింది. మొహం మొత్తింది. దయారామ్ గదికి వెళితే కాస్త చేపల పులుసు, నంచుకుందుకు ఉల్లిపాయ; ఎంతో బాగుంటాయి. మరి ఎన్నాళ్ళయిందో అవి తిని; గబ గబ మామదగ్గరకి పోదామనుకున్నాడు మునూ.

భర్త తినగా మిగిలిన అన్నం పులుసుముద్ద తీసి తినమని మునూ కింత పడేసింది బీబిజీ. 'ఇంటికెళ్ళొస్తానమ్మగారూ!' అన్నాడు మునూ. "ఇంటికి పోతాట్ట! ఇక్కడ తినట్ట! ఇవేవీ సొక్కవుట! నౌకరీ వెధవ. పెద్ద జమీన్దార్‌లా మాట్లాడుతున్నాడు! పనీ పాటూలేక, పీకమొయ్యా తిని 'అమ్మన్‌దస్తా గూటం'లా బలిసీ; తినగా తినగా గారెలు చేదు... అప్పుడే పోతానంటున్నావ్ కదా గుంటవెధవా! నీ బాబెవడు చేస్తాడ్రా ఈ పనీ! ఇంకా నీళ్ళుతోడలేదు... బట్ట లుతకలేదు... చూడు చూడు ఆ మూల వెంటపోగు. ఎత్తి పారపోయవేం?... చూడండీ మీకే. వినిపించుకోరేం? మిమ్మల్నే వినిపించుకోరేమండీ, కర్మ!"

భార్య కేకలు విని బాబూ నాథూరామ్ బయటకు వచ్చేడు. కోపంతో మొహం చిట్లించుకుంటూ "ఒహోహో! ఏమిట్రా నీ అల్లరి! పెట్టిందేదో తినలేవ్? నువ్వేమన్నా మహారాజు కొడుకివిట్రా; నౌకరీ కొచ్చి-వెస్కు వెధవయ్యా. వెళ్ళి మీ మావపెడతాడూ తిను. తిను."

'వెస్కు' అనేమాట బాబుగారి నోటంట ఊడిపడగానే, మునూ పులకిత హృదయుడయాడు. కట్టువిప్పిన లేగదూడలా అవతల కొక్కగెంతు వేశాడు. కొండ దిగుతూ మావవున్న గదికి గబగబ అడుగులు వేస్తుంటే హృదయంలో ఒక మెరుపు మెరిసినట్లయింది. బీబీజీ యింట అంతా దుఃఖమే; అశాంతి. అణకువ. ఎన్నెన్ని బాధలు. వరస వరసగా బాధలు తోరణాలవలె కనులముందుగోచరించాయి. పూర్వస్మృతులు ప్రేగులలో కత్తిమొనలవలెమెదలు తున్నాయి. ఈ బాధాస్మృతులను, స్మృతుల సంకెళ్లను చెరిపివేసి, విదిలించు కోవడమెలా? నేత్రాలలో నీటిబిందువులు నిండినవి. దుఃఖం ఆగడంలేదు; కడుపు దేవుకుపోతున్నది. హృదయం ద్రవించిపోతున్నది. బాధలన్నీ పేరుకుని మబ్బులవలె కూడుకుని అతనిపై నల్లని తెరలను కప్పివేశాయి. అతనిపై ఎవరికీ కరుణ లేదు; సానుభూతి లేదు: ప్రేమ లేదు; వాత్సల్యం లేదు. "ఎంత దౌర్భాగ్యుడివిరా మునూనువ్వు" అని తనను తానే సంబాళించుకున్నాడు. తనపై

తనకే జాలి! కనులు ఆవిరులను చిమ్ముతున్నవి. ప్యాంటుచివరను చేసు కున్నాడు. నౌకర్లుండే కాలనీకి గిరుక్కున మళ్లాడు. కన్నీటితో చారలు కట్టిన బుగ్గల్ని తుడుచుకున్నాడు. గట్టిగా దగ్గి, చీదుకున్నాడు. గొంతుక సవరించుకున్నాడు. రేగిన జుత్తు సర్దుకున్నాడు.

గదిలో గుర్రుపెట్టి దయారామ్ నిద్రపోతున్నాడు. గది చీకటి. ఇరుకు. ఆరడుగుల పొడుగు, అంతే వెడల్పు. గది మూల వొక మట్టిపొయ్యి వుంది. మరి ఒక మూల యిత్తడి గిన్నెలు, ఒక ట్రంకుపెట్టె వున్నవి. లోపలికి వెళ్లి నిశ్శబ్దంగా మునివేళ్లమీద నించుని, నిద్రపోతున్న మామమీదకు తగలకుండా వొంగి, కాలి బొటనవేలును పట్టుకుని ఊపాడు. నెమ్మదిగా కాలు తట్టాడు. దయారామ్ కళ్లు తెరచి నిద్రలో వున్నట్టే "ఎవరువారు? ఎందుకయ్యా? ఎవరునువ్వు" అని కలవరించాడు.

"కూడేమన్నా మిగిలిందా మామా?" తోక తొక్కిన తాచల్లే బుస్సుమని నాలిక ఆడిస్తూ "తొత్తుకొడకా! ఇదిట్రా నీకు వేళ తిండికీ; అబ్బబ్బ! నిద్రంతా చెడగొట్టాడు లంజకొడుకు! ఏం. బాబుగారింట్లో మింగలేదా?"

"అన్నం మిగలకపోతే, బజారుకుపోయి ఏదో కొనుక్కుతింటాను. కొంచెం డబ్బియ్యవ్?" మునూదగ్గరెప్పుడూ డబ్బుండదు. నెలల్లా పనిచేస్తే జీతం మూడు రూపాయలు. వాడి నెలజీతం దయారామ్ లాక్కుంటాడు.

"గాడిదకొడకా! డబ్బు డబ్బు డబ్బు; ఎక్కణ్ణుంచి తేన్రా; వచ్చే మూడ్రూపాయలూ నీ ఎదాన్న కొడితే, నీకు గుడ్డ లెలావస్తాయ్? ఏదో కూడబెట్టి నాలుగు కుణికీనీలు, జోళ్లూ కొందామని నే ననుకుంటూంటే ఇదేంబుద్ధిరా! పోకాళకాలం."

"నాకు నువ్వు చొక్కా కొనిపెట్టిందే! ఇదిగో చొక్కా చిరిగి పోయింది; బీబీజీ పారేస్తే తొడుక్కుంటున్నాను; జోళ్లు కొనిపెడతాననడమే, కాని కొనేదీలేదు పెట్టేదీలేదు!"

"ఆహ్హ కుర్రవెధవా! తలపొగరు! వొదులుస్తానుండు."

"అవును; నా కేమీ నువ్వు కొనందే!"

దయారామ్ క్రోధావేశుడై మునూ చొక్కా పట్టుకుని దగ్గరగా లాగేడు "తుంటరి లంజకొడకా! నన్ను జమాఖర్చు లడుగుతావా యేం? పెద్దంత్రం చిన్నంత్రం లేదురా లద్దీకే! నీకు నౌకరీ చూసిపెట్టినందుకు

ఇదిట్రా నాకు బహుమతీ! ఇన్నాళ్లూ పెంచి పెద్దచేసినందుకు నామీదనే నీ తిరగబాటు! డబ్బు, డబ్బు, డబ్బు! ఎప్పుడూ డబ్బు" దయారామ్, పిల్లవాణ్ణి పట్టుకుని గట్టిగా గుంజేడు. వీపుమీద ఒకటి గుద్దాడు. గూడులమీద నాలుగు చరిచాడు. మోచేత్తో పొడిచాడు "కొట్టకు మావాఁ! నొప్పిమావాఁ ఆకలేస్తుంటే అడిగాను. మరి అడగన్లే."

"తిండివేళకి ఏ అశుద్ధం తింటున్నావ్ ఇంటికి రాక! వేళాపాళా లేదూ?......అమ్మగారింట్లో నీకు ముద్ద పడెయ్యలేదేం?"

మునూ వెక్కి-వెక్కి ఏడుస్తూ "వేళకివద్దామంటే పని తెమల్లేదు. వెడుదువుగాన్లే అని బీబీజీ వుంచేసింది. నీకు తెలియదు మావాఁ, నే నెప్పుడూ నీతో చెప్పలేదూ; బీబీజీ అస్తమాను కొడుతుంది మాఁవా; అమ్మగారు కొట్టిందని చెబితే నువ్విలా కొట్టేవాడివేకావు. శిలగడదుంపలు తినమని పెట్టింది. నాకవి సయించవ్. పప్పూ అన్నం పెడతావు కదాని అడిగేను మాఁవా."

"ఘూటాకోర్! నోరిప్పితే అబద్ధాలు. ఎవరిమీదో ఒకరిమీద ఎప్పుడూ, పోటీలే చెపతాడు లద్దగాడిదవెధవ!" దయారామ్ పళ్లుబిగించుకుని, కోపం అణచుకోలేక వణకుతూ, పిల్లవాడిని గోడకు అదిమిపెట్టి ఒక్కనొక్కు నొక్కాడు. "అమ్మో బాబో! అమ్మ బాబోయ్" అన్న కేకలు వినిపించాయి. "హూఁ హూఁ"అని హూంకరిస్తున్న దయారామ్‌కు పిల్లవాడి అరుపులు జాలి కలిగించలేకపోయాయ్. కళ్ళు చింతనిప్పుల్లా చేసుకొని ఉగ్రుడై ఊరుముతున్నాడు. శరీరం బిగుసుకుపోయింది. ఏంచేస్తున్నాడో, చేసేపని కూడునో కూడదో ఆలోచించుకునే స్థితిలో లేడు. పళ్ళు బిగించి, చేతులు ఎత్తి పిల్లవాణ్ణి సమీపించాడు. ఖూనీచేస్తానన్నట్లు చూశాడు. రెప్పవాల్చకుండా చూస్తూ "చెప్పు, నిజం చెప్పు, ఇంతసేపు ఎక్కడ గాలిషికార్లు తిరుగుతున్నావు? చంపేస్తాను; నీ నెత్తురు కళ్ళచూస్తాను. చెప్పు, నిజం చెప్పు" మునూ కొయ్యబారిపోయాడు. గొంతుక బిగుసుకుంది. నోటంట మాటరాక లోలోపలనే కుమిలి కుమిలి దుఃఖిస్తున్నాడు. దయారామ్ తన జీవితంలో కారుణ్యమన్నది ఎరగడు. బ్యాంకు నౌకరీలో తానందరికంటె తక్కువవాడిననే తలంపులతో, అతనిలో ఏకొంచెమో వున్న మానవత్వం నశించిపోయింది. దయారాముకు డబ్బంటే కాఠిణ్యం; మునూ ఎవడు జమాఖర్చులడిగేందుకు?

మునూ సమాధాన మేమీ చెప్పకపోగా, దయారామ్ తిరిగి గద్దించాడు. "ఇంతసేపూ ఆగమ్మ కాకిలా ఎక్కడ తిరుగుతున్నావని అడుగుతున్నాను: నాప్రశ్న బోధపడిందా ?" సింహంవలె గర్జిస్తూ తనముందు కురుకుతున్న దయారామ్‌ను చూసి మునూ వెనక్కి తప్పుకున్నాడు. ఏడుస్తూ "నేనెక్కడికీ వెళ్ళలేందే; ఇంట్లోనే వున్నాను."

"అబద్ధం, వొట్టి అబద్ధం !" పిచ్చివానిలా దయారామ్ కేకలువేస్తూ చాడీకోరు వెధవ; దగాకోర్, పుండాకోర్, రౌడీ; నీసంగతి నాకెరిక! మళ్ళీ అమ్మగారి మీద, బాబుగారిమీద చాడీలు చెప్పేవా వీపు పగులుతుంది. ఆవేళ ఏం చేశావు; బాబుగారు మంచివారుకనుక సరిపోయింది; కాకుంటే ? బోలెడు డబ్బెట్టి కొన్న పింగాణీకప్పులు...కప్పులు చితగ్గొడితేకొట్టావు! యజమాని దగ్గర బాబుగారు మొహమెత్తుకు తిరక్కుండా చేశావు!"

దయారామ్ అంతటితో ఊరుకోలేదు. తిట్లతో కోపం ఉపశమింపలేదు. కాలితో ఒక్కతాపు తన్నాడు; "ఏదో తప్పి తలకెత్తుతున్నట్లు మాట్లాడుతున్నావు; మహా పనివంతుళ్ళాగ; చిలిపి వెధవ, కజ్జాకోర్ వెధవ, దొరగారి దగ్గర తలవంపు! బాబుగారు మొహం దించుకునేటట్టు చేశావు! పైగా చాడీలు చెస్తావేం ? నువ్వొచ్చేవరకూ నా అంతపనివాళ్ళేడని బేంకులో పేరు సంపాదించగలిగా; నువ్వొచ్చావు; నన్నందరికీ లోకువచేశావు, నీలాగే పని చేశానా నేను ? కాళ్ళరిగేటట్టు బాబుగార్లచుట్టూ తిరిగాను. పట్టరానివాళ్ళ కాళ్ళుపట్టాను. ఈ ఉద్యోగం సంపాదించాను. నమ్మకస్తుణ్ణనిపించుకున్నాను. సెభాసనిపించుకున్నాను. బాబుగారా, ఆయన మనసు నాకు తెలియదట్రా ! ఆయన్ని ముందు చెప్పి తర్వాత దేవుణ్ణి చెప్పాలి. ఈ తింటున్న కూడు ఆయన్ది; కడుతోన్న గుడ్డ ఆయనిది, మాఁరాజు; ఆయనమీద నాతో ఫుల్లింతాలు; వెధవా ! వెళ్ళి ఆయనకాళ్ళమీద పడి మొక్కు; నమ్మకంగా పనిచేసుకో. బతుకు.మళ్ళీ యింకోసారి యిలా చేశావా డొక్కవాలిక్కల్ చేస్తాను; నేనంటే ఏమనుకున్నావో నీమటుక్కి? జాగ్రత్తరోయ్! ఈదయారాముడిగాడికి నీలాటి వాళ్ళంటే లెక్కాజమా లేదు. హాఁ ఈశెషబిషలు వీడిదగ్గర జాన్తానై. పనిమాని వెధవకీ దొంగ తిరుగుళ్ళు." దయారామ్ దండకం వప్పగించి మునూ కంఠం పట్టుకుని అవతలకి నెట్టాడు"ఫో, తిండీలేదు, గిండీలేదు; ఫో, ఫో, బీబీజీ కాళ్ళట్టుకో."

మునూ దుఃఖితహృదయుడై బాబుగారింటికి త్రోవతీశాడు. ఆ త్రోవ లోనే జీవిత సంపూర్ణతను వెదుకుతూ వెళుతున్నాడు. బ్యాంకుదగ్గరకు వచ్చి ఆగాడు; కానేపు ఆగి గిరుక్కున పక్కవీధిలోనికి మళ్లాడు. వీధిలోంచి సందులోకి దారితీశాడు. సందులలో ఎందు కట్లా తిరుగుతున్నాడో అతనికే తెలియదు. కళ్ళు ఏడవడంవల్ల ఎర్రబడ్డాయి; బోదురుకప్పల్లా ఉబ్బిపోయాయి. బుగ్గలు చారలు కట్టాయి; మొహం వాచిపోయింది. సిగ్గుపడ్డాడు. ఆత్మాభిమానం ముంచుకువచ్చింది. మొహం ఎవరికీ కనబడకుండా వొంచుకుని నడుస్తున్నాడు. ఏదో ఆలోచన రేగింది; మళ్లీ మటుమాయమైంది. ఇక ఆలోచన సాగలేదు. "దొంగలండీకే దయారామ్‌గాడు! వొళ్లు మండి పోతోంది. కాని..." తిరగబడు; తిరగబడి కసితీర్చుకో అని ఆలోచన పురి గొల్పింది. తిరగబడాలనే తలంపు, క్రోధావేశన్ని చేసింది. పటపట పళ్ళు కొరుకుతూ నించున్నాడు. "లంజకొడుక్కి తుపాకి దెబ్బేసినా కనబడను; పారిపోతాను; బీబీజీ, వాడూ నేనెక్కడికిపోయానో తెలియక పిసుక్కు చస్తారు. చావనీ, నేనెక్కడున్నానోనని సాటింపు వేయిస్తారు; దండోరా వేయించనీయ్; దొరకను; దొరకనుగాక దొరకను! అప్పుడుకాని వీళ్లకి బుద్ధి రాదు. కాని..." "కాని డబ్బేదీ పారిపోడానికి? అన్నా, చేతిలో దమ్మిడీ కూడా లేదుకదా; తిండో? దరిద్రముండాకొడుకునా అని! ఎలాగో ఓలాగ పారిపోతాననుకో; ఓవేళ కీడెంచి మేలెంచుదాం; కొంపతీసి దొరికిపోతే నేను! మరీ చావగొడతారే!"

దారిపొడుగునా ఆలోచిస్తూ నడుస్తూంటే దేవాంగుల మగ్గాలు టక టక మంటున్నాయ్. ఇళ్లచూరులలోనికి పిచికలు తనను వెక్కిరిస్తున్నట్లు కిచకిచ మంటున్నవి. వీధిమొగను గానుగచెట్టు నీడక్రింద పిల్లవాళ్ళు దాగుడు మూతలాడుతున్నారు. మధ్య మధ్య కేకలు వేస్తున్నారు; అరుస్తున్నారు. మరి ఒక మూలను కొందరు ఇసుక కుప్పలుచేసి, దూగుంపుల్ల ఆడుకుంటున్నారు. వీధి గుమ్మాలచెంత నిలబడి ఆడవాళ్ళు బాతాఖానీచేస్తున్నారు. గుడిసెలలోంచి మగ్గాల టక టక ధ్వని వినవస్తున్నది. మునూ ఈ సందడిని పట్టించుకోలేదు. సందు యింత కలకల్లాడుతున్నదనే సంగతనే వాడు గమనించలేదు. ఏదో అసంతృప్తి అతన్ని ఆవరించింది. జబ్బుపడి లేచినట్లు వుంది మనస్సు; అంగుట్లో అరుచి; నోరు నీరుకారుతున్నది. ఆకలి ప్రేగులను నులిపివేస్తోంది. శరీరమంతా చుట్టుకుపోతున్నట్టు, తల తిరిగిపోతున్నట్టు, భూమి కదలిపోతున్నట్టు!

ఎందుకీబాధ? చేదుమందు త్రాగుతున్నట్లు గుటకలువేస్తూ నడకపుచ్చుకున్నాడు. జీవితంలో ఏది ఎదురైతే దానినే శిరసావహిస్తున్నాడు; దానికే లొంగిపోతున్నాడు.

ఇంటికి వచ్చి చూసేసరికి బీబీజీ కనిపించలేదు. గదిమూలకు ఒరిగిపోయి సంతాపాన్ని ఆవేదనలను దుఃఖాన్ని జీవితభారాన్ని మర్చిపోయేందుకు కనులు మూశాడు. నిద్రపట్టడంలేదు. పందెపు గుర్రాలవలె ఆలోచనలు పరుగులు తీస్తున్నాయి. 'పగదీర్చుకో' అని ఒక ఆలోచన; అంత క్రూరంగా నిన్ను హింసించిన దయారామ్‌పై కత్తికట్టు; కసితీర్చుకో అని వేరొక ఆలోచన; కాస్త ఆగు అని ఇంకొక ఆలోచన. ఒకదానివెంట మరొకటి, ఆలోచనలు తరుముకు వస్తున్నవి. నువ్వు ముందా, నేను ముందా అని ఒకదానితో ఒకటి పందెం వేసుకుంటున్నవి.

"చర్మం వొల్చేస్తా తొత్తుకొడుక్కి! పడుకున్నాక బాగా నిద్ర పట్టేక తలమీద రాయి ఎత్తేస్తా" "నేను పెద్దవాణ్ణయాక వాడు ముసిలాడవుతాడు కదూ? అప్పుడు వాడి పస; దుడ్డుకర్రతో బుర్ర పగలేస్తా" మాగన్ను పట్టింది. నేల చల్లగావుంది. మధ్య మధ్య మెసుకువ వస్తున్నది. ఆ చల్లని నేల, అతని శక్తి నంతటినీ పీల్చివేస్తున్నదా అనిపించింది. నిస్త్రాణ; వొళ్లు జుమాయిస్తున్నది. శవంవలె కొయ్యబారిపోయాడు. మైకం కమ్మింది. నిద్ర ముంచుకు వచ్చింది. లోలోపల ఆత్మ క్షోభిస్తున్నా తెలుసుకోలేనంత గాఢ నిద్ర అలముకుంది.

కొన్ని రోజులు గడిచిపోయాయి. జీవితం యథాప్రకారంగానే వుంది. హృదయానికి తగిలిన గాయం మానిపోయింది. మామూలల్లే జీవితంలో రుచులు జనించాయి. ఇదివరకటి శక్తిని, తేజస్సును, ఆత్మధైర్యాన్ని పుంజుకున్నాడు. వివిధ రుచులమీదకు వాసనలమీదకు, కోరికలమీదకు దృష్టి మళ్లింది. జీవితంలో వింత వింత ధ్వనులు అతని మనస్సును సూదంటురాయికిమల్లే ఆకర్షిస్తున్నవి. ఆకర్షణ, ఆనందం, ఉల్లాసం, ఉత్సాహం! ఎంత గొప్పవి!

ఒకనాటి సాయంకాలం ఒక విచిత్రసన్నివేశం జరిగింది. బీబీజీ ఆ రోజల్లా వాణ్ణేమీ అనలేదు; కసరనైనా కసరలేదు. మునూ హృదయం సంతోషంతో పరవళ్లుపొంగింది. బిందె తీసుకుని వీధి మొగను వున్న కుళాయి దగ్గరకు వెళ్లాడు. ఆ వీధి కంతకూ అదొక్కటే కుళాయి. మడీ తడీ వున్నవాళ్లు తప్ప ఆ కుళాయిదగ్గర కెవరూరారు. మునూ పంపుదగ్గర ఎంతసేపు నించున్నా

వర్మ యింకా నీళ్లు పట్టుకుంటూనే వున్నాడు. బిందెమీద బిందె నింపుతున్నాడు. ఒకంతకు చోటివ్వడు. వర్మకు అహంకారం జాస్తి; బ్రాహ్మణ పిల్లవాడు. సబ్‌జడ్జిగారి యింట పనిచేస్తున్నవాడు. మిగిలిన కుర్రవాళ్ళందరి కంటె పెద్ద; కనక వాడా కుళాయిని గుత్తకుపుచ్చుకున్నాడు. పంపుదగ్గరకు మునూ రాగానే వర్మ వెక్కిరింతగా అన్నాడుకదా "మీ రాణిగా రెలా వున్నార్రా? అహఁ! మీ అమ్మగార్రా!" మునూ తల దించుకున్నాడు. వర్మ దుమ్ములగుండులా మొహంపెట్టి వెక్కిరించాడు. "మొహం ఎత్తి అడిగిందానికి సమాధానంచెప్పరా కొండకిర్రు వెధవా!...మీ అమ్మగారు నువ్వంటే అభిమానంగా చూస్తోందా? లేక ఇంకా తిడుతూనేవుందా? పాలిచ్చి నిన్నిక సాకుతుందిలే!"

"నోరు ముయ్! వాగుతున్నావ్ వాగుడు! నోటికొచ్చినట్టూ మాట్టాడ్డానికి సిగ్గేయడంలేదూ? మీ అమ్మగారి ఊసు నే నెత్తేనా?"

"హాఁ అద్దదే! అందుకూ నీకంతకోపం! తెలిసింది కిటుకు! నువ్వంటే ఆవిడికి ప్రేమ; నిన్ను లాలిస్తోందికదూ! అందుకే ఆవి డెన్ని తిట్టినా పడుంటున్నావ్;" "ముయ్ నోర్! ఫఫ......గంటలతరబడి నించోబెట్టి నీళ్లన్నీ నువ్వే పట్టుకుంటున్నావ్? కాసిన్ని నీళ్లు పట్టుకోనీయ్!" వాగ్వివాదం కాస్త పెరుగుతుండగా, ప్రక్కయింటి బ్రాహ్మణ నౌకరు లెహార్నీ బిందె పట్టుకువచ్చాడు. "ఒరేయ్ లెహార్నీ! ఈ కొండాణ్ణి చూడ్రా! అహఁ నే నేమీ అన్లేదురా; వాణ్ణి వాళ్ళమ్మగారు నానాతిట్లూ తిడుతుందా, మరి ఆవిణ్ణంటే వీడికేం? నేనుమాత్రం ఏమన్నాను? ఆవిడ గుండెలు ఎత్తుగ యింపక్క వుంటాయన్నాను. హాత్తేరీ అలా అండానికి వీల్లేదంటున్నాడు వెర్రివెధవ. వీడి కెందుకూ ఆవిణ్ణి వెనకేసుకురావడం? ఆఁ తెలిసిందిలే... ఆవిడంటే వీడికి ప్రేమరా, ప్రేమ!" మునూ చరచర పంపుదగ్గరకు త్రోసుకొచ్చి "ముందు నన్నీ బింది పట్టుకోనీయ్"

"ఒక్కటి తగలనీరా, నసాలం అంటుకుపోయేటట్టు! దుంగముక్కలా వున్నానని కామోసు పేట్రేగిపోతున్నాడు. నాకు తెల్సు వీడి బలుపుకు కారణం! అమ్మగారు సామాను తెమ్మని యిచ్చిన డబ్బుల్లో కమిషన్లు కొట్టేస్తున్నాడు. దొంగతిళ్ళు తిని బలిసిపోయాడు... మొన్న నా కళ్ళతో స్వయంగాచూశాను. భాగ్ కొట్లోకూర్చుని మిఠాయివుండలు తినేస్తున్నాడు."

"ఉట్టిది; అంతా అబద్ధం... నీళ్ళు పట్టుకుపోనీండి నన్ను".

"నే నబద్ధాల కోరునా! ఆగాగు... చూస్తావేంరా వర్మా! తగల నీయ్!"

తనను తన్నమని చెబుతున్న లెహ్నాకేసి మునూ దిగ్భ్రాంతితో చూస్తున్నాడు. కోపమయితేవచ్చింది; కాని, తానొక అసమర్థుననుకున్నాడు. వర్మ, అతని మెడ దొరకపుచ్చుకుని అవతలికి నెట్టాడు. పంపు దిగువను జారుగా వుంది. గచ్చునిండా నాచు వుండడంవలన, మునూ జారి బంతివలె తూలి పోయాడు. క్రిందకు పడిపోకుండా చేతులతో ఆనుకుని, వెంటనే లేచి వర్మమీద కలియబడ్డాడు. కొలిమినుంచి లేస్తున్న అగ్గిరవ్వల మాదిరి, కళ్ళ ల్లోంచి ద్వేషం ఉబికింది.

"ఏమరిపాటుగా వున్నప్పుడు కాదు; ఇప్పుడు కొట్రా బాపనాడా!"

వర్మ పంపుప్రక్కకు నక్కి గుడ్లగూబలా చూస్తూ "చూడు చూడు వాడి కండకావరం!" అంటూ కుళాయి గొట్టం గట్టిగా పట్టుకుని నించు న్నాడు, ఎవరినీ రానీయ నన్నట్టు.

"ఎవర్నీ రానీయక పోవడానికిది నీ బాబుగారి సొత్తా? ఇది నీకోసం వేశారా? గంటల తరబడి నువ్వొక్కడివేనా పట్టుకోడం కుళాయి?"

"ఇది మా బాబుగారి కుళాయవునో కాదో చెప్తా నుండుండు!" లెహ్నా ముందుకు త్రోసుకువచ్చి మునూ రెక్క పుచ్చుకున్నాడు. అవతలకి త్రోశాడు. వెనకనుంచి వర్మ కాలితో ఒక్కతాపు తన్నాడు; పట్టు విడి పించుకుని మునూ పంజావిప్పుకున్న పులివలె వర్మమీద కురికిపడ్డాడు. సందిట చిక్కించుకుని మీదకు ఎత్తాడు. కింద కుదేద్దామనుకుని, నిష్కారణం చచ్చిపోతాడని భయంపుట్టి, పట్టు వదలివేశాడు. వర్మ క్రిందకుజరిగి మునూ మొహంమీద గుద్దేడు. మొహంతిరిగి మునూ క్రింద కొరిగాడు. అతనిని బోర్లా పడవేసి వీపుమీదకూర్చుని మోకాళ్ళతో అదిమిపెడుతూ, లెహ్నా మారుమెడలు పెడుతున్నాడు. ఇటిక నేలకేసి మునూ మొహాన్ని కొట్టాడు. మునూ కాళ్ళు జాడించి, గబుక్కున మోకాళ్ళపైలేచి లెహ్నాను తిరగ వేశాడు. లెహ్నా నేలకరుచుకుపడ్డాడు. వర్మ భయంతో గబ గబ కుళాయి దగ్గరకు పారిపోయి బట్టలు గుంజుకోవడ మారంభించాడు. లెహ్నా అరుపులు విని వర్మ పరుగెత్తుకు వచ్చాడు. లెహ్నా పట్టు విడి పించుకున్నాడు. ఇద్దరూ చెరొకప్రక్క నిల్చుని మునూవంక కొర కొర చూస్తున్నారు. దగ్గర కొచ్చారా దవడూడి పోతుందన్నట్లు దెబ్బతిన్న పులిలా

మునూ నిలబడ్డాడు. క్రోధంతో వర్మ ముందుకు లంఘించాడు. నడుం చుట్టి వేసి మీదకు ఎత్తి పట్టుకుని వర్మను ఇరవైగజాలవతల జాగ్రత్తగా క్రిందకు వదిలేశాడు. మునూ తిరిగి సంపువద్దకు వచ్చి మాచేసరికి, లెహుళ్ళా బేఫికరయి పోయాడు. కుళాయి దగ్గరబిందె విప్పి నించున్నాడు. నీటిధార దబ దబ పడుతున్నది. ఇంతవరకు జరిగింది ఏదో చిన్న ముష్టి యుద్ధం; ఇందులో కొంపలంటుకుపోయే ప్రమాదమేమీ లేదు. అందుకే వాడంత పరధ్యానంగా నీళ్ళు పట్టుకుంటున్నాడు. వర్మ దొంగచాటుగా వెనకనుంచివచ్చి కర్రతో మునూ నొక్కిపెట్టు పెట్టాడు. చేతులడ్డం పెట్టుకుని దెబ్బ మీదపడకుండా కాసుకున్నాడు. వర్మ మళ్ళీ కర్ర విసిరాడు. ఈసారి మునూ నుదురుకు తగిలి చిట్లింది. పిచికారీ కొట్టినట్లు నెత్తురు చిమ్మింది. లెక్కచేయకుండా అతను, వర్మచేతిలోని కర్రను లాక్కుందామని ప్రయత్నిస్తున్నాడు. వర్మ కర్రను ఊరికే గాలిలో అటు ఇటూ ఊపుతున్నాడు; దొరకనీయకుండా తిప్పు తున్నాడు. కర్ర మునూ చేతికందుతూండడం, మళ్ళీ జారిపోతూండడం... మునూ హఠాత్తుగావర్మ పైకురికి, మెడగట్టిగా పట్టుకున్నాడు. నెత్తిమీద పిలక దొరకపుచ్చుకుని కుదుళ్ళతో సహా ఊడిపడేటట్టు పిలకను గుంజుతున్నాడు. బ్రాహ్మణ పిల్లవాడు పట్టు ఒదిలేశాడు. మునూ కర్రతీసుకుని దూరంగా విసిరేశాడు.

కుళాయిధార దబ దబమంటున్నది. బిందెనిండింది; నీరు పైకిపోతున్నది. వర్మను వొదిలిపెట్టి, బిందెను భుజానవేసుకుని ఇంటివైపుకు మళ్లేడు; మొహం మంతా నెత్తురు; అరచేతుల్నిండా నెత్తురు మరకలు, వర్మ దూరాన నిలబడి బొబ్బలు పెడుతున్నాడు: "పోరా, కొండలంజకొడకా! పోయి మీ అమ్మగారి ...కిందదాక్కో!"

వంటింటి గుమ్మంలో బిందెతో మునూ కనిపించేసరికి "ఇంతసేపై ఏం చేస్తున్నావ్‌రా, నీ పని పాడుకాను ? ఎవరితోటి ఆ కుక్కజట్టీలు?" బీబీజీ మామూలు ధోరణి ప్రారంభించింది. "ఎవరితోనూ లేదండమ్మగారూ!" వంటింటి తిన్నెమీద బిందె దింపుకుని, బీబీజీని దాటి, పొయ్యిదగ్గరకువెళ్లాడు. పొయ్యి బుగ్గి యింత తీసి, నుదుటి గాయానికి మెత్తుకున్నాడు; రక్తంతో బుగ్గి తడిసిపోయింది.

"అయ్యో, అయ్యో !" చూపించు, చూడనీ, ఎక్కడతగిలిందో బీబీజీ అతని దగ్గరకువెళ్ళి నుదురు చూసింది; "ఎలా కారుతోందో రక్తం ! వాడేనా

నిన్ను కొట్టింది, ఆ మందులమారి లంజకొడుకేనా? వాడితో తిరక్కురా బాబూ అని ఎన్నిసార్లు చెప్పేనుకాదునీకు? వింటావూ నామాట; బ్రాహ్మణ జన్మెత్తేడన్నమాటేకాని, ఆవెధవ నోరిప్పితే అన్నీ బూతులేకదూ! వాడు కూసే కూతలు వినడం నీకు సరదారా బాబూ, సరదా! అనుభవించు; చచ్చినట్టనుభవించు; చేసినందుకు వెధవస్నేహం."

"ఆఁ ఏంలేదండమ్మగారూ! గీరుకుపోయింది." మునూ మెల్లగా అవతలకు వెళ్ళిపోయాడు. ప్రేమ్‌బాబు గదిలో కూర్చుని చొక్కా కాలరు యిస్త్రీ చేసుకుంటున్నాడు. బీబీజీ చరచర మరది గదిలోనికి పోయి "చూశారా, చూశారా ప్రేంబాబూ! ఓసారిలావచ్చి ఆ రక్తం చూడండి. ఎలా కారిపోతోందో! దెబ్బలాటలో వాడి నెత్తి పగలగొట్టారు వర్మా వాళ్లూను!"

"ఒరే మునూ, ఇలా రారా".

మునూ డాక్టర్‌గారికి నుదుటి గాయం చూపిస్తూ "ఇక్కడే తగిలింది బాబుగారూ!" తనగాయం తనకేమీ పట్టనట్లే నిర్లక్ష్యంగా తిరుగుతున్నాడు. బాబుజీ అతని నుదురు పట్టుకుని గాయాన్ని పరీక్షిస్తున్నాడు. "నొప్పేమీ లేదు బాబుజీ; రక్తం రాకుండా పొయ్యి బుగ్గి అంటించేశాను! రేపటికల్లా మానిపోతుంది." వొంటి కేదైనా దెబ్బ తగిలినప్పుడు వెంటనే మారుమాటాడకుండా కాస్త మన్నో, బుగ్గో మెత్తితేసరి, రక్తం కడుతుంది అని వాళ్ళ ఊరి మంగలి చెబుతూవుండేవాడు. ఈ బైరాగిచిట్కా ఇపుడు మునూకు అక్కరకొచ్చింది. "నీ నెత్తి; బుగ్గి మెత్తావూ? సెప్టిక్ అవుతుందిరా పిచ్చి పీనుగా! ఇలారా చెప్తాను."

డాక్టరుగారి పరీక్షకు రోగి అంగీకరించాడు. దెబ్బ అపాయకరమైనదే; నుదురు పగలడమే కాదు. తలకట్టుకూడా చీటువేసింది. స్టవ్ వెలిగించి నీళ్ళు మరగబెట్టాడు. నీళ్ళు మరిగినాక, గాయం కడిగి కట్టు కట్టాడు. స్టవ్ గుయ్‌మంటూ వాసన వేసింది. కడుతున్న గుడ్డ మందుకంపు. మామూలు పొయ్యి ఇలాగ గుయ్యమనదే; దీనిమీద నీళ్ళు యిట్టే మరిగిపోతాయే! ఈగుడ్డలో మందువేశాడుకదా డాక్టర్‌గారు, ఏమిటామందు? ఎందుకు వాసనవేస్తున్నది? మునూ తదేకదీక్షతో స్టవ్‌కేసి చూస్తూ, ఆలోచనలమధ్య తనను తాను మర్చిపోయాడు.

గాయానికి కట్టుకట్టి వంటింటివసారాలను పడుకోమని మునూను పంపించివేశాడు. కనురెప్పలు బరువుగ వున్నాయి. తలుపులవలె మూతపడ్డాయి.

స్మృతి అపస్మృతుల మధ్య ఏవో జ్ఞాపకాలు; ఏవేవో భావాలు వస్తున్నాయి; పోతున్నాయి. మగత నిద్రలో బీబీజీ కేకలు వినిపించాయి. ఆవిడ నిజంగా అరుస్తున్నదో, లేక ఇదివరకటి ఆమె కేకలు కలలోవలె వినిపిస్తున్నవో అతను చెప్పలేడు, కాని బీబీజీమాత్రం గొంతుక చించుకుంటున్నది. ఆమె బొబ్బరింతలకు ఇంటి పెంకులు ఎగిరిపోతున్నవి. "కళ్లు నెత్తిమీదకొచ్చాయి; ఈ నీరు వంటపట్టిందీ వెధవలకి! పోకాశకాల మొచ్చింది. డబ్బుందికదా అని నోటికొచ్చిన కూతల్లా కూస్తాం, పడమంటే ఎవరు పడతారనుకున్నారో? పలుకుబడుంటే మాత్రం ఎవరి గొప్ప వాళ్ళదీ! తన మొగుడే, పోనీ నెలనెలకీ దోసిళ్ళ కొద్దీ సంపాదిస్తున్నాడు; సంపాదిస్తే పీక మొయ్యా తినమనండి; ఒకళ్ళకేవన్నా పెడతారా? వీళ్ళ మోచేతికింద నీళ్ళు తాగుతున్నామనా పడ్డానికి? గొప్ప వాళ్ళయితే ఎవరికాక్కావాలి, వెధవగొప్ప? మాఇంట్లో మేంగొప్ప; మాకు మేవేఁ పెద్ద!"

బీబీజీ ఎవరినుద్దేశించి తిడుతున్నదో, ఎవరు ఇవతలకు రావాలెననుకున్నదో ఆవిడ వీధిలోకి రానే వచ్చింది. 'ఎందుకమ్మా తిడుతున్నావని' ఆమె అడగకుండానే, అంతా అర్థమైపోయిన కథలాగ ఇంట్లోంచి-వస్తూనే నోరు చేసుకుంది. "జాత్తక్కువ్వాళ్లు; వాళ్ళ తల పొగరే అంత. రానీ ఆయన్ని రానీ, ఇంటికొచ్చాక వీళ్ళ పనిపట్టిస్తా......పెద్దింటివాళ్ళనే గౌరవం అక్కర్లేదటమ్మానీకు? నోరు కడుక్కొని మరీతిడుతున్నావు! మీకేనా నౌకరీ కుర్రాడుంట! ఇంక లోకంలో మరెవరికీ లేరా? ఎలాగైతేనా సంపాదించారు యిన్నాళ్లకి; జన్మానికల్లా శివరాత్రి! ఎద్దు మొద్దులా కొండ వెధవా అని!"

దీనికి సమాధానంగా బీబీజీ తిట్లు కలత నిదురలో మునూరు స్పష్టంగా వినిపించలేదు; కాని అమ్మగారి గొంతుక సన్నంగా మాత్రం వినవచ్చింది. దూరంలో పుంతలో వినిపించే ప్రతిధ్వనిలా ఆమె గొంతుక అతని చెవిని పడుతున్నది. క్రమక్రమంగా అదికూడా దూరమై నిశ్శబ్దత తాండవించింది. ధ్వని లేని చిన్ని చిన్ని మాటలవలె నాసికారంధ్రాలనుండి ఊపిరి వినవస్తున్నది. వాయువును పీలుస్తున్నాడు; వొదులుతున్నాడు. ఇంకా అతను సజీవుడే అని గుండె చెబుతున్నది.

వంటింటి గదిలోనే పగలల్లా కాలక్షేపం. రోజులు మళ్ళిన కొద్దీ బీబీజీ వాడిసంగతిక పట్టించుకోవడం మానేసింది. కాని డాక్టరుబాబు మాత్రం

నిత్యమూ అతని గాయం కడిగి మందు వేస్తూనే వున్నాడు. పినతండ్రి, మునూ గాయానికి మందువేస్తుంటే, కట్లు కడుతుంటే, శైలశ్రద్ధగా పరికిస్తున్నది. ఆ పిల్లను వాడంటే జాలి.

శరీరంలోని రక్తమంతా తూములోంచి పోయిన నీరులాగ, ప్రవహించి పోయింది. గాయం రక్తాన్ని పీల్చివేసింది. నరాలు మెలికలు తిరుగుతున్నాయి. చేదలతో తోడినట్లు నెత్తురు నెవరో తోడివేసినట్లయింది. వొళ్లు రుదుపు, అల సట, తలనొప్పి, వగర్పు; వంటిమీద చేయివేసుకున్నాడు. జ్వరం వచ్చింది. భరించలేని జ్వరం, రోకళ్ళతో దంపుతున్నట్లు తల. అపరిమితమైనబాధ. అకారణంగా దుఃఖం! మూలుగుతున్నాడు; బరువుగ నిట్టూరుస్తున్నాడు.

వొంటిమీద స్పృహలేదు. అపస్మారకం. ఎదుటవున్న వస్తువులు స్పష్టంగా గుర్తుపట్టలేక పోతున్నాడు. రాత్రివేళ, నల్లని చీకటి ఆవరించిన ఆకాశంవలె వుంది మనస్సు. కాని ఏవేవో పిచ్చి పిచ్చి ఊహలు చుక్కల వలె మిణుకు మిణుకు మంటున్నవి. చెవిపోటు; గుఁయ్ మనిరొద. గదిమూల ఒరిగిపోయి ఉండచుట్టుకు పోయాడు. ఇపుడిక బాధ ఎలా వుంటుందో వాడికి తెలియదు. గడ్డ గట్టుకుపోయింది శరీరం. ములుకర్రతో పొడిచినా స్పృహరాదు. 'అబ్బ' అనడు! ఇక ఈ స్థితికి అంతమన్నదేలేదా?

డాక్టరుబాబు తొందరగా మందుకలిపి యిచ్చాడు. మందుత్రాగిన కొంతసేపటికి కనురెప్పలు మెల్లగా విడుతున్నాయి. శరీరం ముచ్చెమటలూ పోసింది. దీర్ఘమైన నిట్టూర్పు విడిచాడు. గుండెల్లో లోలోపల శూన్యంగా వున్న గుండెలోతులలో, అతని అవ్యక్తచైతన్యం కదలజొచ్చింది. ఉద్రేకాలు కలలోంచిలేచి కళ్ళు నులుపుకుంటున్నట్లనిపించింది. మెలమెల్లగా దృష్టిని చుట్టూ సారించాడు. వస్తువుల పోలికలు తెలుస్తున్నాయ్. పూర్వంలాగేవుంది కాని, కాస్త తెలివితెచ్చుకోగానే, ఏదోఒక విచిత్రభావ ముదయించి చటు క్కున మాయమైంది. కొన్ని శతాబ్దాల సుషుప్తినుంచి మేలుకొన్న చైతన్య భావం సెలఏటి అలవలె పొంగజొచ్చింది. తనకు ఎదురుగ చొచ్చుకువచ్చే ఏదోఒక కెరటాన్ని ఢీకొని అంతలోనే వెనక్కుతగ్గి, మళ్ళీ పరవళ్ళుత్రొక్కి, విరుచుకుపడి ముందుకు దుమికింది. ఆ కెరటాన్ని తనవైపుకు త్రిప్పుకున్నట్లు నటించి, ఒక్కసారి దాటుకుపోయింది.

ఇన్నాళ్ళయి ఈ ఇంటిలో అతను గడుపుతున్న జీవితం నికృష్టం; అంధకారమయం. దారితెన్నులు కనిపించవు. ఎంతపుణికిసలాడినా మార్గం

అగోచరం. ఇపుడు అతని చైతన్యం నిద్రనుంచి తట్టిలేపుతున్నది. ఊహాపుట్టింది. ఆలోచన రేగింది. భావనాబలం తీవ్రమయింది. చనిపోయిన ఆప్తుడొకడు సమాధిని పెకల్చుకుని బయటకువచ్చి నలుగురిలోనూ మసలుతున్నపుడు కలిగే ఆశ్చర్యసంభ్రమాలు !

ఉదయించింది; నూత్నజీవితం ! ఉదయించి చీకటినిండిన అతని జీవితాన్ని దీప్తింపచేస్తున్నది; తెల్లని కాంతి, చల్లనికాంతి, ఇంచక్కని కాంతి! చిక్కనిచీకటిని చీలుస్తున్నది.

ఇక్కడకు చేరగనే, వాళ్ళమాంవ చెప్పిన సలహాను జ్ఞప్తికి తెచ్చుకు న్నాడు. అప్పుడు జీవితంలో భద్రతలేదు; కష్టాలు ఒకదానివెంట ఇంకొకటి; తగిలినవేలికే తగలడం ! ఈనౌకరీ వేయిస్తానని పల్లెనుంచి తీసుకువచ్చాడు; చేయవలసినపని అట్టే వుండదులే అన్నాడు. గుండెగలు ఎత్తక్కర్లేదు; గంగాళాలు మోయక్కర్లేదు. రారమ్మన్నాడు. అవిచేస్తా నివిచేస్తానని మావం ఊరించాడు; బెల్లించాడు. మభ్యపెట్టి నరకకూపంలో రాసి రంపాన పెడుతున్నాడు. మరి కాకపోతే, ఏమిటి ఈచాకిరి ? బీబీజీ అస్తమానూ కస్సుబుస్సుమంటుందే ! దొరగారొచ్చిన్నాకు కర్మంచాలక చేతిలోంచి జారిపడ్డాయి, ఇంతోటిపింగాణీ చిప్పలకి యింతరాద్ధాంతమా ? ... చిన్నబాబుగారింట వుంటున్నారుకనక కాస్త ప్రాణం తెరిపినపడుతోంది. చిన్నబాబుగారు ఎంతమంచిమనిషి ! వొట్టి నవ్వుతాలమనిషి. నవ్విస్తాడు. నవ్వుతాడు !

జ్వరం నిమ్మళించిందో లేదోనని మేనల్లుని చూచేందుకు దయారామ్ వచ్చాడు. దయారామ్ కఠినహృదయుడు; మునూను వాడంటే అసహ్యం; ఎవరన్నా అసహ్యమే; ఒక్క చిన్నబాబుగారు, శైలమాత్రమే మంచివాళ్ళు. శైలఅందాలబరిణ. ఎన్నోసార్లు ఆపిల్లను పట్టుకున్నాడు. కాని జలగలాజారి పోయేది. మునూను ఎంతముద్దుముద్దుగా పలకరిస్తుందని ! కడుపునిండామాటలే. నాలిక బైటకుపెట్టి వెక్కిరిస్తుంది. ఎగతాళిచేస్తుంది; "ఏయ్‌కోతీ ! అన్నానికి రావేకోతీ!" అని తమాషాగా పిలుస్తుంది. ఆపిల్ల పిలుపులో ఆప్యాయతవుంది; చనువుంది; సొగసుంది. కనకనే ఆపిల్లంటేవాడికిప్రాణం. పిల్లను చూసినకొద్దీ చూడాలనిపిస్తుంది; మాటల్ని విన్నకొద్దీ వినాలనిపిస్తుంది. అతని మనోనేత్రాల ముందు శైలప్రతిబింబం మూర్తీభవించింది. తల్లి ఎంతబ్రతిమాలుకున్నా శైల స్నానానికి వెళ్ళదు. తల్లిలాలిస్తుంది; బుజ్జగిస్తుంది. శైలఘూరాం చేస్తుంది. కాళ్ళు నేలకేసి కొట్టుకుంటూ తైతైమని గెంతుతుంది. తల్లికేకలువేస్తుంది; తిడుతుంది.

కోసకు వీపుమీద నాలుగుచరిచి వొంటిమీద నీళ్ళుపోస్తుంది. స్నానంచేసుకుని తెల్లని గౌనువేసుకుని గదిలోనికి మెలమెల్లగ అడుగులువేస్తూ వచ్చే శైల ! ఆమెవిగ్రహం, కనులముందు చెదిరింది. చెదిరి చెరిగిపోయింది.

తెల్లని పల్చని బట్టలు వేసుకుంటే ఉల్లిపొర కాగితం అంటించినట్టే; పుత్తడి బొమ్మవంటి శైలరూపం, అతని మనోవీధిని మళ్ళీ గోచరించింది. బంగరు బొమ్మ. చంచలమైన చూపులు. అమాయకమైన నవ్వు. నవ్వినపుడు కనురెప్పలచాటున గిరగిర తిరిగే గుండ్రని నీళ్ళు, స్త్రీలను తల్లులవలె, అక్క-చెల్లెళ్ళవలె ప్రేమించమని చిన్నతనంలో బడిలో మాస్టారు చెప్పేవారు. శైల తనచెల్లెలు. ఈ భావం తరచుతున్నకొలదీ ఆ పిల్లతో సరదగా ఆడుకోవాలపిస్తున్నది. ఆడుకోవాలనే ఆతురతలో చెల్లెలనే మాట మరచిపోయాడు. ఆమె కనిపించినప్పుడల్లా మొహందించుకుంటున్నాడు. స్మృతి పథంలో ఆమెరూపు మెరిసినప్పుడల్లా సిగ్గుతో తలవంచుకొంటున్నాడు. ఇదివరకు వాళ్ళ వూళ్లో మామిడి తోటల్లోకి పోయి, చిట్టచివరి కొమ్మనున్న ఎర్రని పండును, దోరగా ముగ్గిన పండును కోసుకు తినాలని దానివంక యిదే భంగిమలో తలవంచి చూసేవాడు. నల్లని పెదవులపై చిన్ననవ్వు వెలిసేది. ఆకలి నవ్వు. అలసిన, చిర్నగవు. అర్ధ చైతన్యపు భావమేదో, అతని పెదవులపై తొణకిసలాడింది. దీన్నిమించి, ఇంకొకభావం, కాదు ఆశ, అవును కాంక్ష, ఒకటివచ్చి అలముకుంది. బలీయమైనకోరిక, ఏదోకావాలనే వాంఛ ఉదయించి మనసునావరించింది. ఉక్కిరిబిక్కిరి చేసింది. అవును, ప్రేమ దుస్సహమైనది.

తనకే చేతిలో డబ్బుంటే! తనకీయవలసిన జీతం రాళ్లు; కడిగేసిన ఆ నాలుగు జీతపురాళ్ళూ బాబుగారు, దయారామ్ కీయక, తన చేతిలోనే పెడితే! ఎంత బాగుండేది! జీతం వెనకవేసుకునేవాడు; చిన్న జంగిడి కొనుక్కొని లడ్డూలు వేసుకుని వీధులంట తిరిగి అమ్ముకునేవాడు; అమ్ముకుంటే రోజుకొక రూపాయి కళ్ళ చూసేవాడు. మరి ఆ కుర్రాడు, జంగిడి పట్టుకునే కదూ, శైల స్కూలు యివతల కూర్చుని అమ్ముకుంటున్నాడు? నిక్షేపంలా రోజుకొక రూపాయి ఆర్జించుకుంటున్నాడు. కాలం కలిసొస్తే తనూ అలా చేసేవాడే! ఆర్జించుకునేవాడుకదా! మునూ దృష్టి సంపాదన వైపుకు మళ్లింది. డబ్బు! డబ్బు! "డబ్బుంటేసరి, కొండమీది కోతి దిగొస్తుంది" అనేవాడు దయారామ్. పల్లెనుంచి తీసుకువస్తూ ఈ మాట మళ్ళీ మళ్ళీ అన్నాడు. "అవును, అంతే" అనుకున్నాడుమునూ. అతని ఆలోచనలు మబ్బులు విడినట్లు

విడిపోతున్నాయి. డబ్బు సమస్తం కొనిపెడుతుందనే భావం అతనికి కలగడం ఇదే తొలిసారి; అతను నిరుపేద, బాబుగారు డబ్బున్నవారు. తన గ్రామంలో అంతా కూటికి లేనివాళ్ళే: జయసింగ్ తండ్రి మాత్రం ధనవంతుడు. అతనికున్న భూములన్నీ నల్లబంగారమే. పేదలకు, సంపన్నులకు మధ్య ఎంత వ్యత్యాసం!

మునూ దృష్టికొక్కసారి తనుపుట్టి పెరిగినఊరు, పల్లెటూరు గిర్రున తిరిగి కనిపించింది. బిషన్ అతనూ కలిసి ఒకేచోట పుట్టి, పెరిగారు. కలసి చదువుకున్నారు. పాపం, వాడి తండ్రి ముడుతలుదేరిన శరీరంతో, ఎముకల ప్రోగు వలె వుండేవాడు. శతవృద్ధు బిషన్ తండ్రి, జ్ఞప్తికి వచ్చి మునూ క్షోభించి పోయాడు. ఎవరైనా ఒక్కపూట కూలికి పెట్టుకుంటేచాలు, బిషన్ తండ్రి ఉబ్బితబ్బిబ్బయేవాడు. ఏ పూట నూకలు ఆ పూట తెచ్చుకుని వరగ పెట్టుకునే వాళ్ళు. బిషన్ తల్లి కామందుగారింటికి పోయి ఆ పనీ ఈ పనీ చేసేది! మునూకు తన తండ్రి అంతగా జ్ఞాపకంలేదు. లీలగా జ్ఞాపకం. మునూ రాత్రిళ్లు పడుకోకపోతే కథలు చెప్పి నిద్రపుచ్చేవాడు. తండ్రి ఆఖరుసారి శాశ్వతంగా కళ్ళు మూసుకునే టప్పుడు కొడుకు నొకసారి తీసుకురమ్మని దగ్గరకు రాగానే తలనిమిరాడు. 'నాకిక ఈ భూమ్మీదనూగ్గింజల్లేవ్! వీణ్ణయినా జాగర్తగా పెంచి పెద్దవాణ్ణిచేయ్' అని భార్యకు అప్పగించిపోయాడు. తండ్రి చనిపోయే ముందు కళ్ళు మూస్తూ మూస్తూ ఒక్కసారి కొడుకుకేసి చూచాడు. అదే ఆఖరిసారి! లోతుగ గుంటలుపడ్డ కళ్ళు! ఆ కళ్ళలో నిస్సహాయత, పితృప్రేమ తొంగిచూసి వెంటనే అదృశ్యమయింది. తన తల్లి. అమ్మ. తిరగలి గిరగిర విసురుతూ, మధ్య మధ్య ఆగి ఊడిపోతున్న గురుజును రాయితో కొడుతూ, తన తొడమీద తలపెట్టి పడుకున్న కొడుకు బుగ్గలు నిమురుతూ జాలి జాలిగా అతనిని చూసేది. ఆ అమ్మ ఇప్పుడు యేదీ? తన తల్లి వొళ్ళో తల దాచుకుని, నిద్రించినపుడు కాళ్ళు పీకుతున్నా ఆమె, కొడుకును కసురుకొనేది కాదు! తల్లిప్రేమ. ఎంత గొప్పది! తల్లి వొళ్లో నిద్రపోతే ఎంతహాయి అనిపించేది! ఎంతటి వెచ్చదనం! అటువంటి తల్లీ తండ్రీ మళ్ళీతనకు వస్తారా! వస్తే బాగుండును; తల నిమిరి వొళ్లోపడుకోబెట్టుకుంటే బాగుండును; ఇపుడు తనకు 'నా' అనే వాళ్ళెవరూ లేరు. తన గ్రామంలో ఎంతోమంది మనుష్యులు, పేదలు, నిరుపేదలు వున్నారు. కాని గ్రామంపేరు చెప్పి ఇద్దరో ముగ్గురో - అంటే! డబ్బుగల వాళ్లున్నారు. ఈ నిరుపేదలంతా, తన తల్లి దండ్రులవలె తీసుకు తీసుకు దిక్కుమాలిన చావు

చావవలసిందేనా ? పట్టణంలో పల్లెలలోవలెగాక ధనికులు హెచ్చుమంది. నగరాలలో పేదలకంటే ధనికులే ఎక్కువ. అలా అనుకున్నా, మొత్తంమీద చూస్తే పేదలసంఖ్యే అధికంవలే కనబడుతున్నదే! ఒక బస్తీ చుట్టూ వందల కొద్దీ పల్లెటూళ్లు. ఈ పల్లెటూళ్ళన్నీ తన గ్రామంలాగే వుంటే పేదలసంఖ్య లెక్కపెట్టలేనంత. ఏదోఒక బస్తీలో ధనికులు హెచ్చువుంటే సరా ? పల్లెల్నీ పట్నాల్నీ కలిపిచూస్తే నిరుపేదలు హెచ్చుమంది; ధనికులు కొంచెంమంది ! అయితే ప్రపంచంలో పేదలేమిక్కుటం !

ప్రపంచంలో ఎవరిసంఖ్య హెచ్చు అనేదానికంటే, ప్రపంచంలో రెండు రకాల మనుష్యులున్నారనేది నిజం. పుట్టిన కులం ఏమైతేనేమి; కులంతో ప్రసక్తిలేదు. "నేను రాజుల పిల్లవాణ్ణి; లేనివాణ్ణి; వర్మబ్రాహ్మడు; లేనివాడు. వాడూ నౌకరీవాడే! లోకువ నౌకరీ! ఊహుఁ! పుట్టినకులం ఏమయితే నేమి ? బాబుగార్లంతా ఒకలాగే వుంటారు. వారిక్రింద పనిచేసే నౌకరీ కుర్రాళ్ళంతా ఒకటేమోస్తరు, ప్రపంచంలో రెండే రెండు తరగతుల ప్రజలు; ఉన్నవాళ్ళూ, లేనివాళ్ళూ! ధనికులూ దరిద్రులూ! ఇంతే; ఇది నిజం; ముమ్మాటికీ నిజం !"

అతని ఆలోచనల కంతరాయం కలిగింది. పిడకల మీద కిరసనాయిలు చల్లి నిప్పుచేశాడు. ఇటికపొయ్యి మీద నీళ్ళ కాగుపెట్టేడు. పొయ్యి రాజే శాడు కాని పుల్లలు అంటుకోవడంలేదు. దుక్కపేళ్ళు. నలిపేళ్లుంటే బాగుండు ననుకున్నాడు. పొయ్యి మండక పొగలు క్రమ్ముతున్నది. కళ్ళచుట్టు నీరు కార జొచ్చింది. కళ్లు నులుపుకుని నీటిని తుడుచుకున్నాడు. కునుకు దీపం మాదిరి సన్నగిల్లుతున్న అతని ఆత్మ ఏదో చెప్పలేని ఆవేదనతో కుమిలి పోజొచ్చింది. అవ్యక్తానుభూతి, క్రోధంగా మారి నిస్పృహతను నింపింది. గట్టిగా వెక్కి వెక్కి ఏడవాలనుకున్నాడు. పిచ్చివానిలా అరుద్దామనుకున్నాడు. దుర్మతి ఆత్మను ప్రకోపింపచేసి అతని బలమైన ఇచ్ఛను చెదరగొట్టింది; బెదరగొట్టింది.

పరి పరి విధాల మనస్సు బెదిరిపోయినా, ఆత్మక్షోభిస్తున్నా, ఇంకశక్తిని కూడగట్టుకోక తప్పదనుకున్నాడు. ఒక్కసారి నిట్టూర్చి నిలబడిన మనిషి, గబ్బున శరీరం విరుచుకుని ఆవులించి చిటికెలు వేశాడు. కళ్లు పెద్దవి చేసుకుని నలుమూలల పరికించి గబ గబ పని కుపక్రమించాడు. గిన్నెలు తోమి, కూర గాయలు తరిగి, ఇల్లు మళ్ళీ మళ్ళీ తుడిచి, పక్కలు ఎత్తి, అన్నం వడ్డించేడు. బీబీజీ ఏపని చెబితే ఆపని అవలీలగా పూర్తిచేశాడు. అవయువాలు సర్దు

తున్నాయి; శరీరం చెమట పట్టింది. వేడి నిట్టూర్పు. ఉత్సాహం ఉల్లాసం. యథాప్రకారం నవ్వుకున్నాడు. హాయిగా సన్నగా కూనిరాగం తీశాడు. గెంతాడు. కేకలు వేశాడు. పిల్లిమొగ్గలు, రింగటాలు కొట్టాడు. ఆవేళల్లా వాడికి ఉల్లాసమే! జీవితంలో కొత్తశక్తి లేచివచ్చింది. తనకూ తనయజమాను లకూ మధ్య సరిహద్దులు లేరనిపించింది. సహజోద్రేకాలు, అవ్యక్త జీవిత శక్తులు, సాధారణ మానవ మనోవాంఛలు ఈ కంచెలను, అధిగమించమని ఆదేశిస్తున్నాయ్. దీనికితోడు అతనిలోవున్న సహజ మూర్ఖత అతన్ని అనేక ఇబ్బందులలో పెడుతూనేవుంది. స్కూలులో అతనికి సక్రమశిక్షణలేదు; ఉపాధ్యాయులు దండించేవారు. కొట్టినా అతనికి తెలియనితనం కనుకనే ఇన్ని కష్టాలు.

ఆనాడు మునూ ఎంతో తెలివితక్కువగ ప్రవర్తించాడు. వంటింట్లో కూర్చుని బంగాళాదుంపలు వొలుస్తున్నాడు. శైల అప్పుడే అయిదారుగురు పిల్లల్ని వెంటబెట్టుకుని బడినుంచి యింటికివచ్చింది. బీబీజీ యింటలేదు. పొరిగింట సాయంకాలం అమ్మలక్కలందరు బాతాఖానీ వేయడం మామూలు. అమ్మగారు వెందరాశే పని తెముల్చుకుని పెత్తనాలకు వెళ్ళేరు. పుస్తకాలు నించున్నపాటున దభేలున పడేసిన పిల్లలనుచూసి, మునూ ఆపిల్లలతో ఆడుకో వచ్చునను కున్నాడు.

చేతులు కడుక్కుంటుంటే గదిలోంచి టిన్‌టిన్‌టిన్ అనే శబ్దం వినరా సాగింది. మంచి అవకాశం, మించిపోనీయకూడదు; గ్రామఫోను వినడానికి వెళ్లినట్లు నటించి చక్కగా కోతిలా గెంతవచ్చును. పిల్లలతో ఆడుకోవచ్చును. ఇదివరకు ఆ పిల్లలంతా తన ఆటనుచూసి మురిసిపోయినవాళ్ళే; బీబీజీవాడితో ఆడకూడదని ఆంక్షవేసింది. పిల్లలు ఆటఆడడం మానేశారు. గదిలోకి ఒక్క సారి ఛంగునగెంతి, చేతులు నేలకానుకుని కాళ్లుఆడిస్తూ, బుర్ర అటుఇటూ తిప్పుతూ, గిరగిర తిరుగుతూ కోతిలాగ గెంతడమారంభించాడు. మధ్య మధ్యను నాలిక తెరచి 'అమ్మవారు' మొహంచేసుకుని, "హాః హాః హాః" అని పిల్లల్ని భయపెడుతున్నాడు. అకస్మాత్తుగా ఒక్క దుముకి దుముకి పిల్లల పాదాలను కోతి బరికినట్లు బరుకుతున్నాడు. పిల్లలు నలుమూలలకు చెదిరి పోయారు; "ఈకోతి మిమ్మల్నేం చేయదూ...రండీ...హహాహా" అని భరోసా యిచ్చాడు.

కౌసల్య భయపడింది. "అవతలకి పోరా, బాబూ! నీకు పుణ్యముంటుంది!"

"మేం నీతో ఆడం; ఆడకూడదు. అమ్మ చెప్పింది" అంది శైల; శైలకు వాడితో ఆడుకోవాలనే వుంది; కాని ఈసారి ఆడితే చేతులమీద అట్లకాడ కాల్చి వాతవేస్తానంది అమ్మ! లేకపోతే అతనికీ ఆపిల్లకూ మధ్య అవరోధమేమీ లేకపోయేది. శైలకు అతన్ని తాకవలెననివుంది. మునూ దగ్గరగా వచ్చింది; వచ్చి చెవిపట్టుకుని బయటకు వాణ్ణిలాక్కెళ్లింది.

తన చెవిని అలాగ శైల పట్టుకులాగడం మునూకు ఇంచక్కా వుంది. భుజాలను కుంచించుకుని "అమ్మో" అని తమాషాకి అరిచేసరికి ఆడపిల్లలంతా కిలకిల నవ్వారు. శైలి చెవిగట్టిగా మెలివేసింది; పళ్లు యికిలించి ఉడతలా కిచకిచమన్నాడు. అచ్చంగా కోతివంగినట్టు శైలిమీదకు వంగి పట్టుకున్నాడు. శైల చెవిమళ్లీ నులిపింది; కోతి ఇకఊరుకోక కటుక్కున ఆ మెబుగ్గల్ని కొరికివేసింది "అమ్మోయ్! అమ్మోయ్!" అనే శైల అరుపులు ఎంత దగ్గరగా వినిపిస్తున్నప్పటికీ, బీబీజీ చెవికి మాత్రం సోకలేదు. కౌసల్య చరచర బయటకు వెళ్లి బీబీజీని కేకవేసి తీసుకువచ్చింది. "బీబీజీ! చూడండి కోతి వెధవ ఎలా కరిచేశాడోను!"

"ఎవర్నే? వాడమ్మకడుపుకాలా!" లోపలకు వచ్చి చూసేసరికి శైల బుగ్గలపై కరిచిన ఎర్రని నెత్తురు నొక్కులు కనిపించాయి. శైల బుగ్గలను నిముకుంటున్నది. "చూణ్ణీతల్లీ, చూణ్ణీఅమ్మా!" బీబీజీ శైల నుదురు పట్టుకుని పైకి ఎత్తింది. తెల్లని దంతపు బుగ్గలు ఎర్రని జీరలతో కందిపోయివున్నాయి; పళ్ళనొక్కులు స్పష్టంగా కనిపిస్తున్నాయి. రక్తం కొద్దిగా పైకిచిమ్మింది.

బీబీజీని చూడగానే ఒక పెనుప్రళయం ఒక తుపాను విరుచుకు పడనున్నదనీ ఇకతట్టుకోవడం దుస్సాధ్యమనీ మునూ నిలువునా కంపించి పోయాడు: "ఆడుకొంటున్నాం అమ్మగారూ!" "హాఁ గాడిదకొడకా! ఇంకా మాట్లాడుతున్నావ్, సిగ్గులేక! నీ జివ్వుఁడా! కుడిచెయ్యా ఎడంచెయ్యా తారతమ్యం తెలీదట్రా! నీ ఇల్లు వల్లకాడు కానూ! అచ్చోసిన ఆబోతులా నీ తల్లి కడుపుకాలా, ఇదేంపనిరా! తెగతిని కొవ్వెక్కి ఇలాటి పన్లు: బాబుగారానీయ్! కొట్లో వేయించేస్తారు...పాముకి పాలుపోసి, పెంచుతున్నావఁని తెలియకపోయెన్రా! భగవంతుడా!... తిన్నింటికి వాసాలు లెక్కెడుతున్నాడు. నీ అంత్రం ఎంత? మా అంత్రం ఎంత? రానీయ్ ఆ దయారామ్‌గాణ్ణి రానీయ్!

నిలేసి అడుగుతా; ఏం చెప్తాడో సమాధానం ? ఇన్నాళ్ళూ కొడుకుని చూసి నట్టు చూసి కడుపులో పెట్టుకున్నాను...విశ్వాసాల్లేవు వెధవజాతి ! వెళ్ళి తల పగలకొట్టించుకువస్తే బోలెడన్ని మందులు పోసి యెదానకొట్టాం."

పగలల్లా ఆఫీసులో పనిచేసి అలసి అలసి ఇంటికి వచ్చేసరికి ప్రాణం కుదుటపడుతుందేమో అనుకుంటే అదీలేదు. బాబూనాధూరామ్ ముఖమంతా చెమటపట్టి జుత్తురేగి, చీకాకుగ ఇంటిగడప తొక్కాడు. ఇలా గుమ్మంలో అడుగువేశాడో లేదో అలాగ తుపాన్ తీవ్రత వినిపిస్తున్నది; భార్యచేస్తున్న రభసనుచూసి, అణకువతో "ఏమిటే ఈ కంగాళీ? రభసా; ఎందుకొచ్చిన గందరగోళం?" బీబీజీ, భర్త గొంతును అనుకరిస్తూ దెప్పిపొడుస్తున్నట్లు చేతులు విసురుతూ "ఊఁ మారే! గందరగోళం! ఏదొచ్చినా ముందు నా నోరే కనిపిస్తుంది మీకు! కంగాళీట; కంగాళీ; కాదేంమరి కుక్క వెధవని తీసుకొచ్చి వంటిళ్ళలో కెక్కిస్తే!" "ఆఁఆఁ ఏమిటి చేశాడు? ఏమిటి జరిగింది."

"ఇదిగో మీకే చెప్తున్నాను; నా వొళ్ళు కుత కుత ఉడికిపోతోంది! ఈ వెధవని యింట్లోంచి తగిలేస్తారా?లేదా...ఏం కాలమొచ్చింది; మాయదారి కాలం! ఇంతున్నాడో లేదో వెధవకి ఎన్ని వుత్పన్నబుద్ధులు! చిన్నంత్రం పెద్దంత్రం..."

నాధూరామ్ లేనికోపం తెచ్చుకుని మొహం కనుబొమలు ముడుచు కుని పళ్ళికిలిస్తూ "ఏం చేశావ్? చెప్పరా గాడిదా!"

మునూ కంఠం గద్గదికమయింది; హృదయం కంపించింది. మొహం జేవురించి సమాధానం చెప్పలేకపోయాడు. "కానికాలం వచ్చింది. లోకం అడ్డుసుడిగా నడుస్తోంది" అంటూ బీబీజీ, భర్త వెనకాలనించుని రొద చేస్తున్నది. భార్య పక్కకు తిరిగి, అరచేతిని ఆడిస్తూ "నువ్వింక ఊరుకో; తిట్లతో లాభంలేదు. చెప్తా వీడిపని" అని నాధూరామ్ కుర్రవాడిమీద చేయి జేసు కున్నాడు; "అడిగిందానికి వెంటనే జవాబియ్యి; తెలిసిందా?" మునూ చలి జ్వరం వచ్చిన వాడికిమల్లే వణకుతూ, భీతిగ "నేనేం చేయలేదు బాబుగారూ! ఊరికినే ఆడుకున్నాను." పళ్ళు పటపట కొరికి బాబుగారు "ఆడుకుంటు న్నావ్! ఆట! హాఁ" ఎడా పెడా రెండువేసి, కాలిబూట్లతో తన్ని అవతలకి నెట్టేశాడు. కాలిబూట్లు! అవే వేసుకోవాలని మునూ చిరకాల స్వప్నం! "ఇంకెప్పుడూ ఆడను బాబుగారూ! కొట్టకండి."

"కొట్టకండా? మీరు కొట్టకండి, నేను తైతక్కలాడతాను; చూస్తూ ఊరుకోండనే కదూ నీవనేది" మళ్ళీ బూట్లతో తన్ని, మూలనున్న చేపాటి కర్ర తీసుకొచ్చాడు. కర్రతీసుకు మీదకు వస్తున్న నాథూరామ్ కంఠం కొరికి వేయాలనన్నంత కోపం వచ్చింది. 'చూస్తావేం, తిరగబడు' అని సలసల కాగుతున్న రక్తం ప్రేరేపించింది. ఉక్రోషం, ఏవగింపు పుట్టుకొచ్చాయి. కాని పెదవులు మాత్రం విడివడలేదు; నాలిక తడబడింది. నోట మాటపెగలక, ఉక్కిరి బిక్కిరై, తమాయించుకున్నాడు. "నీ భరతం పడతా; మోకాళ్ళ చిప్ప లూడదీసి ఎండలో నిలబెడతా; పిలక్కి తాడుకట్టి దూలానికి వేలాడగడతా; చేతికి అరదండాల వేయిస్తా!" మళ్ళీ ఒకదెబ్బ; దెబ్బమీద దెబ్బ. వొళ్ళు హూనమయింది. మునూ మూలుగుతున్నాడు; సావురాయిమూలుగు. "నోరు మూదిపావా! చితకబొడుస్తా"నని నాథూరామ్, మీదకు వెడుతున్నాడు. భార్య భర్తకోపం గమనించి "చస్తాడు; ఇకూరుకోండి!"... కోపంవస్తే వొళ్ళూపై తెలీదు; పిచ్చికోపం మనిషికి!" అని, భర్తనునిలవరించింది.

"మరెప్పుడూచేయను, మరెప్పుడూ..." అనే దీనాలాపం, అప్పుడప్పుడే అలముకుంటున్న సంజచీకట్లలో కలసిపోతున్నది.

కుక్కను కొరడాతో కొడుతున్నకొద్దీ మూలమూలలకు పారిపోయి దాగుకుంటుంది; మానవమాత్రుడన్నవాడు తప్పించుకుందుకు ప్రయత్నిస్తాడు.

పిల్లవాడిని తిట్టి అవమానపరచి బూట్లతో తన్ని భోజనానికి వెళ్ళిపోయిన తరువాత, మునూ యింతవరకూ 'మరెప్పుడూచేయను; మరెప్పుడూచేయన'ని ఏసంజచీకట్లతో చెప్పుకుని బ్రతిమాలుకున్నాడో, ఆసంజచీకట్లలోంచి, ఇల్లు వదలి, మెలమెల్లగ వెళ్ళిపోయాడు. దారికిరుప్రక్కలావున్న చెట్లగుబురులను దాటి, కొండమలుపుతిరిగి, బ్యాంకు వీధిని పడ్డాడు. వీధిలో ఎత్తైన భవంతులు, అందమైన అద్దాల మేడలు, ధగధగ కాంతులతో మెరసిపోతున్న షాపులు కనిపించాయి. బజారు కలకలలాడుతోంది. విద్యుద్దీపాల కాంతి నీటిధారాలవలె షాపులమీద పడుతున్నది. ఒకవంక రంగురంగుల దీపాలతో వున్న పెద్ద పెద్ద దుకాణాలు, ఇంకొకపక్క యిలాయి దీపాలతో కునుకుపాట్లు పడుతున్న చిన్న చిన్న కొట్లూ, మరొకచోట ప్రమిద దీపాలముందు గుడ్డిఈగలను తోలుకుంటూ కూర్చున్న వర్తకులూ, మునూకు కనిపించేసరికి విభ్రాంతిలో మునిగిపోయాడు. దీపాల వెలుగు కళ్లల్లో సూదులతో గ్రుచ్చినట్లయింది. కనుల నీరు తళ తళ మని ఒక్కసారి మెరిసింది. బజారమ్మట నడచివెడుతుంటే

దారిఎటో తెలియని నాలుగురోడ్ల జంక్షన్లు అనేకం అడ్డుతగిలాయి. ఒక్కొక్క సారి మధ్య మధ్య ఆగుతూ అటు ఇటూ పరికించ సాగేడు. దీపాల తోరణాలు నూదుల గుత్తుల్లాంవలె వున్నాయి; జనం ఒకరినొకరు తోసుకుంటూ క్రిక్కిరిసి నడుస్తున్నారు. మొహమెత్తి మనుష్యులకేసి చూశాడు. నడుస్తున్న మనుష్యుల కళ్లు తనమీదనే వున్నట్లు భయంవేసింది. వీళ్ల కళ్లు దీపాల మాపులకన్న బాధ! మొహం దించుకుని గబగబ అడుగులు వేశాడు. జనం చేతులూపుకుంటూ, ఒకరినొకరు పిలుచుకుంటూ, చప్పట్లు కొట్టుకుంటూ, సముద్ర ప్రవాహంలా సాగిపోతున్నారు. ఒక్కసారి దీపాలన్నీ గబుక్కున్న ఆరిపోయి, చిమ్మ చీకటి అలుముకుని, ఎవరికీ కనబడకుండా తనను దాచేస్తే బాగుండును! మౌనం; నోరు మెదపరాదు; తలయెత్తకూడదు; నూటిగా ముక్కుకు నూటిగా తనగమ్యం! వద్దు; వద్దు, బజారులో మనుష్యులు; వింత వింత రంగురంగుల తలపాగాలు చుట్టుకుని, నల్లని, తెల్లని టోపీలను పెట్టుకుని, అరటిమూటవంటి సిల్కుబట్టలువేసుకుని, ఒకరిమీద ఒకరు పడుతూ తిరుగుతున్నారు. ఇక్కడనుంచి త్వరగా వెళ్లిపోవాలనుకుని ఒక్కసారి ఆగాడు. వెళ్లిపోవాలి; తప్పదు; సుదూరఏకాంత ప్రదేశానికి! ఎక్కడ వున్నాసరే! పాతాళంవంటి ఒక గుహలో తలదాచుకుని, ఈ అవమానాన్ని పరాభవాన్ని విస్మరించేటందుకు ప్రయత్నించాలనుకున్నాడు. అక్కడ తనను ఎవరూ గుర్తుపట్టలేరు; గుర్తుపట్టని ప్రదేశానికే పారిపోవాలి! బజారు దాటాడు. వీధి మలుపు తిరిగాడు. గబగబ అడుగులు వేశాడు. వెనక్కి చూస్తూ అంగలువేసాడు. చిన్నపరుగు ప్రారంభించాడు. వీధి కొసకు వచ్చాక మళ్లీ వెనక్కి చూడకుండా దౌడుతీశాడు! రొప్పుకుంటూ పరుగులెత్తాడు!

రహదారి కనిపించింది. అక్కడక్కడ పూరికొంపలు, చిన్న చిన్న బడ్డీ దుకాణాలు...చిమ్మచీకటి!

దూరంగా చిమ్మచీకటిలో గేటుతోవున్న ఒక ఆవరణ...ఆవరణలో అక్కడక్కడ చిన్న చిన్న మంటలు, పొగ...కమురుకంపు! ఇక్కడ అంతా నిశ్శబ్దం; చీమ చిటుకుమనదు. అలికిడిలేదు; అలజడిలేదు! అంతా నిశ్చల వాతావరణం! ఇక్కడొకసారి ఆగినిల్చుంటే చివరకు నిల్చున్న తను కూడా లేనట్లే అనిపించింది. 'తను' వున్నాననే జ్ఞాపకంకోసం గుర్తుకోసం ఒక్క దీర్ఘ నిట్టూర్పు విడిచాడు. ఎక్కడనుంచో కాని రెండు కుక్కలు 'భౌయ్యో'మని అరిచాయి. మనూ గతుక్కుమన్నాడు. రైలుకూత

వినిపించింది. దిగ్గున ముందుకు ఉరికి శ్మశానంచుట్టూ వున్న గోడమ్మటే పరుగెత్తి దూరంగా వున్న గోడౌను చేరుకున్నాడు. రైల్వే బద్దీలపై పెద్ద పెద్ద అడుగులువేస్తూ దాటుతున్నాడు. రైలు యింజను వస్తున్నదేమోననే భీతితో నలుదిక్కుల చూశాడు. రైలు యింజను హఠాత్తుగవస్తే పని అయి పోతుందని అడుగులు తొందరగ వేశాడు. ఒక్క నిట్టూర్పు విడిచాడు. ఒగరుస్తూ పరుగెత్తుతూంటే ఎర్రని ఆకుపచ్చని సిగ్నల్ దీపాలు దగ్గరకు రమ్మని కళ్లతో సౌజ్ఞచేస్తున్నట్లుఅనిపించింది. రైలుకట్టమ్మటనుబడి నడుస్తుండగాతీగెలు కాలికి తగిలి కిందబడి, చేతులానుకుని లేచాడు. వెంటనే దూరంగా కూత వేస్తున్న ఇంజనువచ్చి మీదపడుతుందేమో ననుకున్నాడుకాని, అది ఫర్లాంగు దూరంలోనే వుండిపోయింది. పెట్టెలింకా రైలుయింజనుకు తగిలించలేదు. మళ్లీ రైలు కూతవేసింది. చెవులు గింగురులెత్తాయి. తిన్నగా నడచి వెడుతుంటే రైలుపెట్టెలవరస కనిపించింది. వెలుతురు. ఒక పెట్టెలో దూరాలని, ఫుట్‌బోర్డుమీద నిలబడ్డాడు. కాని ఎవరో అపరిచితవ్యక్తి చేతిలో ఎర్రని పచ్చని కాంతులిచ్చే దీపం ఊగులాడుతుండగా, మునూ గుండె దడపుచ్చుకుంది. సణుగుకుంటూ క్రిందకు అడుగుపెట్టాడు. ఆ దీపాలబాబుగారు అతన్ని చూడనట్టే తనదారిని తాను వెళ్లిపోయాడు బ్రతుకు జీవుడా అనుకుంటూ రైలుపెట్టెను చేరుకుని పైకిపాకి కిటికీలోంచి పెద్దపులిలా, చాటుమాటుగా వేటాడుతున్న వేటగాని బారినుండి తప్పించుకుని, చీకటి లోయలోనికి దుమికే పెద్దపులిలాగ, పెట్టెలోనికి గెంతివేశాడు. ఎదురుగావున్న ఒక గట్టి మూటమీద పడిపోయాడు. నరాలొక్కసారి కరుక్కుమన్నాయి. ఎముకల్లో పుట్టిననొప్పి తలవరకు వ్యాపించింది. కంపార్టుమెంటు చీదరగా ఉక్కపోస్తూ దయ్యంలావుంది. గుమాయింపు, ఉక్క, వేడీ! బెణికినచోట చేత్తో నిమురు కుంటూ మొహంమీదపోసిన చిరుచెమటలను చొక్కాతో తుడుచుకుని నేలమీద చతికిలపడ్డాడు. పెట్టె ఒక జైలులావుంది. అప్పుడప్పుడు 'నే నేకాకిని నాకు తోడూనీడా ఎవరూలేరు; ఒంటరి జీవితంనాది;' అనేభావం జనియిస్తున్నది. ఇంచుమించు ఖాళీగావున్న ఆ పెట్టె శూన్యంతో దిగులు గొల్పు తున్నది. వొంటిమీద తేళ్లూ జెర్రులు పాకుతున్నట్లువుంది. చెమటతో శరీరం తడసిపోతున్నది. జుబ్బా విప్పుకుని, గుండె తుడుచుకున్నాడు. దూరంగా చీకట్లలోంచి కీచురాయి 'గీ' పెడుతోంది, చెవులు గళ్లుపడేటట్టు; వాతావరణం భయంకరం...తరువాత నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ తొందర

తొందరగ నడుస్తున్న మనుష్యుల అడుగులు వినిపించ సాగాయి. జనం గుంపులుగావచ్చి పెట్టెలలోనికి దారి చేసుకుంటున్నారు. తను కూర్చున్న పెట్టె కనురెప్పపాటులో మూకతో నిండిపోయింది. ట్రంకులు, పరుపు చుట్టలు, సజ్జలు, బస్తాలు, చీపురుకట్టలు, తట్టలు, బుట్టలతో పెట్టె ఒక బజారుగా మారిపోయింది. ఒక ట్రంకువచ్చి మీద పడబోయింది; బుట్ట తలకు తగిలింది. పరుపుచుట్టలు కాళ్లమీద పడుతున్నవి. మునూ అవతలకి జరిగాడు. ఒకదాని వెంట ఒకటి సామాను అవతలనుంచి వచ్చి పడుతుంటే కూర్చునే బల్లక్రిందకు దూరి తన్నుతాను రక్షించుకున్నాడు. శరీరం వేడి ఎక్కింది, ఆవిరులను కక్కుతున్నదా అన్నంత- వేడి !

చుట్టూ అవతల వినిపించే గోల దగ్గరపడసాగింది. ప్లాట్ ఫారంమీద కేకలు చప్పట్లు ఈలలు వినిపించ జొచ్చాయి. "అల్లా దాదాఖాన్! ఎక్కడున్నావయ్యోయ్, నీ ఇంటా పంటారంగానూ!"

"దేవీసింగ్! పెట్టెలో కెక్కావా? లేదా?"

"లల్లాచురంజీలాల్, జాగా దొరికిందీ?"

"జాగ్రత్తా జాగ్రత్తగా ఎక్కుమీ, కమ్మి గట్టిగా పట్టుకోరోయ్ నాయన్నాయన"

ఈ కేకలకు లయవేస్తున్నట్టు మునూ గుండె మెల్లగా కొట్టుకుంటున్నది. ఆ సందడిని చూద్దామని తల పైకిఎత్తి చూశాడు. బల్ల తలకు తగిలింది. చెంపలనిండా దుమ్ము అంటుకుంది. చెమటతో వొళ్ళంతా తడిసిపోయింది. నరాలు ఉబ్బి శరీరమంతా బూడిదగుమ్మడిలా జవజవలాడుతున్నది.

రైలు కదిలింది. ఇంతసేపూ మనుష్యులు విడిచిన ఊపిరినే మునూ పీల్చుతున్నాడు. ఇక ఫరవాలేదు; గాలి పొలాలమీదనుంచి చల్లగా వీస్తున్నది.

గాలి స్వచ్ఛమైనగాలి, నిర్మలమైన గాలి!

రైలు జిప్ జిప్‌మని పొగలు చిమ్ముతూ, వెళ్ళిపోతున్నది. వేగం హెచ్చింది. పెట్టె ఊయెలలా ఊగుతున్నది. మునూ పసిపిల్లవాడు! చెవులు

గింగురుమనేటట్టు కూతవేసి రైలు పాము మెలికలు తిరిగి చెట్లను పుట్లను, కొండలను అవతలకి గిరవాటువేసి, తనదారిని తాను పోతున్నది! అయితే ఈ రైలు ఎక్కడకు పోతున్నట్టు? ఏమో ఎక్కడికి పోతున్నదో!

'అది ఎక్కడికి పోతే నాకెందుకు, నేను మాత్రం ఇక్కణ్ణుంచి పోతున్నాను అప్పాయ్యా' అనుకుని, తలమీదనుండి పెద్దబరువు దింపుకున్నట్టు దీర్ఘంగా నిట్టూర్చాడు.

# 3

"హూఁ" అని తనశక్తిపూరా అంటూ మూడవతరగతి రైలుపెట్టెలోని ఒకబల్లక్రిందనున్న మూటన్నిలాగుతున్నాడు సేక్ ప్రభుదయాల్. రైలు జర్క్ జర్క్ మంటూ శ్యాంనగరంనుంచి దౌలత్‌పూర్‌కు మంద మందంగా నడుస్తున్నది. సేక్ దృఢకాయుడు; పొడగరి; అతని విశాలమైన భుజస్కంధాలు, నిడివైన కంఠమూ, ముఖకవళికలు వర్తకుని లక్షణాలకంటె యుద్ధవీరుని ఠీవిని మరపిస్తున్నవి. రాత్రి అతనికి బాగా నిద్రపట్టనట్లుంది. కనురెప్పలచాటున నిద్ర జోగుతున్నది. పెట్టె కిక్కిరిసి వుండడంచేత, మోకాళ్ళు ముడుచుకుని బెంచీ చివరున రాత్రల్లా కొంగవలె కూర్చుండిపోయాడు. తను చేరవలసిన స్టేషను యింకా దూరంలోనే వుంది; అయినా ఇంత బాధతో ఇరుకులో కూర్చుని చచ్చేకంటె నించోడమే మేలని లేచిపోయాడు. బెంచీకిందవున్న మూట బరువుగా సీసపు ముద్దలా వున్నదేకాని ముట్టుకుందుకు మాత్రం మెత్తగానే వుంది. 'హోఁహోఁ హూఁహూఁ" అనే మూలుగులతో, నోటినిండా పీల్చిన గాలిని ఒగర్పుతో వొదిలిపెట్టి, మూటను పైకి బరబర యీడుస్తున్నాడు. కాళ్ళు అదిమిపెట్టి రెండు చేతులతోను మూటకొనలను పట్టుకుని "హుస్సహుస్సు"మని ఉసురుసురు మంటున్నాడు. మూటను గబుక్కున ఇవతలకు లాగేసరికి భయం ఆశ్చర్యం తోట్రుపాటు కలిగాయి. రాత్రల్లా ట్రంకులు, పేకేజి, సందుగు పెట్టెల పరుపుచుట్టలగుట్టలమధ్య ఇరుక్కుపోయి నిద్రపోతున్న ముద్దయిన మునూ శరీరం మూటగా ఇవతలకు ఊడిపడింది.

"రామ రామ! పాహిమాం, పాహిమాం" అంటూ రెండుచేతులతోను కన్నులు కప్పుకుని సేక్ అరిచాడు. మొహం వెల వెల బోయింది. సేక్‌తో కలసి వర్తకం చేస్తున్న గణపతి కాస్తదూరంలో మీద బెంచీమీద ఎలాగో చోటుచేసుకుని పడుకుందుకు వ్యర్థ ప్రయత్నం చేస్తున్నాడు. సేక్ అరుపులు విని, "పొద్దున్నే ఎవడి మొహం చూశావయ్యా? పిల్లి బ్రమ్మత్య మెడకు చుట్టుకుందీ!"

మునూ చుట్టబెట్టుకుని ప్రభుదయాల్ పాదాలవద్ద మూటగా పడి వున్నాడు. మునూ దగ్గరకువచ్చి పరీక్షగా చూసి ఒక మహమ్మదీయ రైతు

"అల్లా! లాహూల్ వల్లా!... ఎవరో పాపం నిర్భాగ్యుడు" సిక్కురైతొకడు "వ్హాగురూ! గురూ! భగవానుడి చిద్విలాసమేమో చెప్పలేము కదా!" అని ఆశ్చర్యంగా నోరు తెరిచాడు. ఒక మూలకు ఇరుక్కుని ప్రయాణీకులకు పెడమొహంపెట్టి మారుపమిట వేసుకుని ఒళ్లోని పిల్లాడికి స్తన్యమిస్తున్న ఒకామె "ఇంతకీ పాపం వాడు బతికున్నాడో లేదో ముందు చూడండి" అన్నది.

పెట్టెలోని ప్రయాణీకులు కళ్ళు నులుపుకుంటూ కొందరు అటు ఇటూ చూస్తున్నారు; మరికొందరు సగం నిద్రలోనే కళ్ళుమూసుకుంటూ తెరుచుకుంటూ అపశోపాలు పడుతున్నారు. ఈ గడబిడ ఇప్పుడే తమకు తెలిసినట్లు ఈ విచిత్ర సంఘటనచూచి ఆశ్చర్యపడుతూ, తూగిపోతున్న కనులను తెరచి చూసి "ఎవరండీ ఆకుర్రాడు? ఏ ఊరట?" ప్రయాణీకులగోల మునూను నిద్రపోనిచ్చింది కాదు. లేచి నలువంకల కలయచూశాడు. చుట్టూ మనుష్యులు మూంగి తనను గురించే ప్రసంగించుకుంటున్నారు. భయం నిలువునా కుంగదీయగా నోట మాట రావడంలేదు. పెట్టెలమధ్య సామాను గత్తరలలో పడుకునివున్న అతన్ని ప్రభుదయాల్ ఇవతలకు బరబర లాగుతున్నప్పుడు మునూకు చీమకుట్టినట్టయినా లేదు. గాఢ నిద్రలో వున్నాడు. అప్పుడే భయంకర స్వప్నం, దుస్స్వప్నం వచ్చింది. కలలో ఏనుగులవంటి ఆకారాలతో రాక్షసులు జుత్తువిరియబోసుకుని, అతని శరీరంమీద గజ్జలకాళ్ళతో తొక్కుతున్నారు. పర్వతాలవంటి రెండు దయ్యాలు! అబ్బ! వంకరలు తిరిగిన పొడుగాటి కొమ్ములతో, బొబ్బలు పెడుతూ రెండుదయ్యాలు! కొరడాలు పట్టుకుని కళ్ళు చింతనిప్పుల్లా చేసుకుని ఉగ్రులై మునూను చితకకొడుతున్నారు.

ప్రభుదయాల్ తనలో తానేదో కూడబలుక్కున్నాడు. "అవును; దేవుడి సంకల్పం విచిత్రంగానే వుంటుంది! ఎప్పటికి ఏది ఎవరికి ప్రాప్తమో కదా!... కుర్రాడిది కొండల ప్రాంతమే; లేచిన వేళా విశేషం!"

గణపతి, ప్రభుదయాళ్‌ను పరిహాసపూర్వకంగా "నీ పుణ్యం పుచ్చింది దయాళ్! వెతకబోతున్న తీగ కాలికితగిలింది. కాలం కలసిరావాలి భాయ్! ఇక నీ భార్యకి మందులూ మాకులూ తాయెత్తులూపట్రా నక్కర్లేదులే నువ్వు! అహాహాఁ! నీకూ అవి మరి అవసరంలేదు." ఇంతటితో ఊరుకోక ఛలోక్తిగ "మీ ఆవిడ కాదయ్యా గొడ్రాలు...నువ్వూ!"

ప్రభుదయాల్ ఇవేమీ వినిపించుకోనట్లే కొండప్రాంతపు యాసతో మునూను ప్రశ్నించాడు. "అబ్బాయ్, హాఁ అబ్బాయ్ ! నీ పేరేవరమ్మా ! మీది ఏవూరు ? మీ తలిదండ్రులాదులెవరు?" దయాళ్ దౌలత్‌పూరువచ్చి చాల కాలమైనప్పటికీ తన కొండప్రాంతపు యాస మరిచిపోలేదు. దౌలత్ పూరువచ్చి కూలీనాలీ చేసుకుని, కొన్నాళ్ళకు మామిడిపళ్ళ వర్తకుడయాడు. ఊరగాయలు, తాండ్ర, జామ్ తయారుచేసి అమ్ముకుంటూ తానూ ఒక మనిషి ననిపించుకోగల్గుతున్నాడు.

"నా పేరాండీ? మునూ. బిలాస్‌పూర్‌లో నన్నంతా మునూ అంటూండేవారు; శాంనగర్‌లో మున్ద్దూ అనేవారు; మా అమ్మా నాన్నా లేరండి; చిన్నప్పుడే పోయారు."

"మరి, నువ్విక్కడికి ఎలా వచ్చావ్?"

"దయారామ్ మా మావేఁనండి; బేంకిలో చప్రాసీకదండీ; నాకు బాబుగారింట్లో పని వేయించాడు...నిన్న బాబుగారు ఒళ్ళూపై తెలీకుండా కొట్టారండి."

"అందుకు పారిపోతున్నావన్నమాట !"

"ఆఁ అవునండి" మునూ స్వరం భయకంపితమైంది. ధైర్యంగా వుండా లనుకున్నా మనస్సు చిక్కబట్టుకోలేకపోయినందువల్ల మొహం ముడుచుకు పోయింది; బావురుమని జెగిలిపోయి ఏడిచాడు. కన్నులనుండి జల జల నీళ్లు కారి, జుబ్బామీద పడేసరికి, తను చేస్తున్న పని తనకే సిగ్గనిపించి, కుడిచేత్తో తుడుచుకుని, కళ్లను కప్పుకున్నాడు.

చుట్టూవున్న రైతులకు తన ఇంగ్లీషు ఉచ్చారణ సొగసు చూపించా లని సూటు, బూటు, హేటు, చుక్కల నెక్‌టైలో వున్న ఒక యువకుడు "వీడు......" అన్నాడు.

గణపతికేసి తిరిగి ప్రభుదయాల్ "కుర్రాణ్ణి ఇంటికి తీసుకుపోదాం" అని ఏమంటావన్నట్లు చూపులను సారించాడు. "వీడి ఆనూపానూ మనకు తెలియదుకదా, తీసుకుపోవడానికి ? ఏ అల్లరిముండాకొడుకో, దొంగపీనుగో మనకేంతెలును ?" అంతేనంటావా అన్నట్లు గణపతిని ప్రభుదయాల్ చూపులతోనే ప్రశ్నించాడు. "ఏమో...అయితే మనకింకా ఓ మనిషి అవ సరం వున్నాదనుకో...తులసీ, బోంగాలు చాలవు; వాళ్లకి కాస్త చేయి ఆస

రాకి ఓ కుర్రా డవసరమే !...ఇంత తిండీగుడ్డా పారేస్తే వస్తాడనుకుంటాను; జీతమక్కర్లేదు."

దయాల్, గణపతి సలహాను పాటించక, నలుప్రక్కలా చెదిరి మొహం మీద పడుతున్న మునా నల్లని జుత్తును సవరిస్తూ లాలనగా అడిగాడు: "మాతో వెళిపోవస్తావూ ? ఇంచక్కా వుందువుగాని; ఇక్కడేలే మా ఊరు, హమిర్‌పూర్; బిలాస్‌పూర్ దగ్గిర...నీమంచీ చెడ్డా అన్నీ మేమే చూసు కుంటాంలే...నీకే బాదరబందీ రానీయం !" సందేహంతో కొటుమిటులాడు తున్న మునా నోరువిప్పి 'వస్తాను, రాను' అనలేకపోతున్నా, వస్తానన్నట్లు తల క్రిందకూ ముందుకూ ఊగింది. తప్పించుకు పారిపోతున్నాడే కాని, ఎక్క డికి వెళ్లవలెనో గమ్యం నిర్ధారణ కాలేదు. పైగా బాబుగారికీ, దయారామ్‌కీ తను దొరికిపోవచ్చునుకూడా !

దయాల్, పిల్లవాడి వీపుతట్టి బుజ్జగించాడు: "ధైర్యం తెచ్చుకో, ఇలాంటపుడే ధైర్యం అవసరం... ఏడవకేడవకు వెర్రివాడా! మంచివాడివే! ఏడుపెందుకూ ?...కళ్లనీళ్లు తుడుచుకోమ్మా ! మేం వున్నాంగా. నీ కెందుకు దిగులు ?...చూడు అలా చూడు...రైలు ఎలా వెళ్ళిపోతోందో; దౌలత్ పూర్ వచ్చేస్తున్నాం."

దయాల్‌కు, పిల్లవాడంటే ఒకవిధమైన జాలి, అభిమానం, ప్రేమ అంకురించాయి. వాత్సల్యం జనించింది; ఆత్మీయత కలిగి తనకు పుట్టని కొడుకు మీద అల్లుకున్న విచిత్ర భావాలు, తీయని కలలు మునావైపునకు మళ్లాయి. తనకు పూర్తిగా అపరిచితుడయిన ఈ కుర్రవానిని తన కుమారునిగా చూసుకో వచ్చుననే భావం ఉదయించి, ఇది లోకంలో నుసాన్యమైన పని కాదను కున్నాడు. అలా అనుకుంటున్నప్పుడు తన తల్లిదండ్రులు తలపుకు వచ్చారు. తను దౌలత్‌పూర్‌లో వుండగా, హమిర్‌పూర్‌లో తల్లిదండ్రులు చనిపోయారు; ఇద్దరి మరణమూ కన్నకొడుకు ఇంటలేనప్పుడు, దగ్గరలేనప్పుడు జరిగి పోయింది. పగలూ రాత్రీ కూలిపనిచేసినా తల్లికీ, తనకూ, తండ్రికీ ఒక పూటకు సరిపడే బియ్యమయినా వచ్చేవికావు. కొడుకు పెద్దవాడయాడు, ఒక ఇంటివా డయాడు. ఒక మనిషిగా లెక్కకొచ్చాడు; తనకు రెక్కలువచ్చి ఏదో ఇంత ఆర్జించుకుంటున్నప్పుడు, తీరా తల్లిదండ్రులు లేకుండా పోయారు. కొడుకు, కోడలు సంసారం, అచ్చట్లు ముచ్చట్లుచూసి మురిసిపోయేందుకు తన తల్లిదండ్రులు లేరుకదా ! అనుకుని దయాల్ బాధపడ్డాడు. 'చనిపోయిన వాళ్ళు

తిరిగొలావస్తారు. 'వెర్రికాని' దయారామ్ స్మృతిపథం ఇంకొక దిశకు మనుపు తిరిగింది. "ఈ కుర్రవాడి తల్లిదండ్రులు, కొడుకు అజ్ఞానపరుడు కాకుండానే చనిపోయారు. _ నాలాకాదు...నాది మరీ పాపిష్టి జన్మ..." పిల్లవాడు మాత్రం తనకు లాగే వున్నాడు. ఇద్దరికీ తల్లిదండ్రులు లేరు. వాడూ తనకు వలెనే, తన తల్లిదండ్రులను గురించి తలపోస్తూ వుండవచ్చును. గణపతిలాంటి వారికితప్ప మిగతావారి స్థితిఅంతా ఇంతే! గణపతి తండ్రి బ్రోకరుగా ఆర్జించినదంతా కొడుకుకే అప్పగించి అల్లారుముద్దుగా పెంచాడు. కొడుకు త్రాగేవాడు; చీట్లపేక ఆడేవాడు; ముండవాటమున్న మనిషి. కొడుకు కుటుంబ గౌరవం పాడుచేసినా, గణపతి తండ్రి డబ్బంతా వాడికే అప్పగించాడు వింత, వింతల్లోకల్లా వింత! చదువుకుందుకు అన్ని అవకాశాలూవున్న గణపతికి చదువంటలేదు. చదువుకుందామని నేనెంత మథనపడినా, ఏ అవకాశమూ లేకపోయింది!......ఆఁ ఈ పిల్లాడికి చదువు వస్తునేమో?

వెనక్కి తిరిగి దయాల్ "ఓయ్ మునూ! మాట...నీకు కాస్తేమైనా చదువొచ్చునా?"

"ఆఁ ఆఁ...వచ్చు...నేను అయిదో క్లాసులో ప్రవేశించేసరికి మా మావయ్య నౌకరీలో పెట్టాడు కాని..." గణపతి ఎగతాళిచేస్తూ ప్రభు దయాళ్‌ను "నీ ఎక్కౌంట్లు రాయడానికి పనికొస్తాళ్ళే.'

"అవును; మన గుమాస్తాగా వేసేద్దాం."

"మొట్టమొదటనే ముక్కూ మొగమూ చూడకుండా పెద్దఉద్యోగం ఇచ్చేయకు, నీ పుణ్యమాయిరి!" కళ్ళతో విషపునవ్వు నవ్వి "వాడి తల్లీ మొగుడూ! ఇంకా భూమ్మీద కాలు మోపలేదు, అప్పుడే నీకు దత్తుడు కావడం, వెంటనే మున్షీ ఉద్యోగం! ఏం ఆలోచనయ్యా నీది! వాడు దొంగో దొరో!" ప్రభుదయాళ్ గణపతి మాటలు విని ఒక జంకనవ్వు నవ్వేడు; అయితే మునూపట్ల కలిగిన పితృప్రేమమాత్రం తొలగిపోలేదు.

దౌలత్‌పూర్ పొలిమేరలను దూసుకుంటూ రైలు వెళ్ళిపోతున్నది. కిటికీలో తలపెట్టి వంగుని మునూ నగరశోభను వీక్షిస్తున్నాడు. అరటితోటల అవతల, ఊడలు దింపిన వెర్రిమర్రిలవెనక, తోపులలోనుంచి, బంగరు కాంతులతో పెద్దపెద్ద అంతస్థుల మేడలు, దేవాలయశిఖరాలు, గోపురాలు తొంగి తొంగి చూస్తున్నవి. మునూ కిటికీలోనుంచి కిందకు చూశాడు. _ అనతి

దూరంలో, నూతిదగ్గర చిన్నచిన్న అంగవస్త్రాలు కట్టుకుని బిందెలతో నీళ్ళను తోడుతూ, కొంతమంది మనుష్యులు కనిపించారు. పిల్లలు గోచీలు విప్పుకుని వొంటినిండా నూనె మర్దన చేసుకుని నీళ్ళు పోసుకుంటున్నారు. ఒకరి వీపును మరొకరు తోముతూ నవ్వుతూ కిచకిచ లాడుతున్నారు. ఈ దృశ్యాన్ని పూర్తిగ చూసేలోపుగనే రైలు వెళ్ళిపోయింది. తలను అటుతిప్పి మరిఒక దృశ్యాన్ని తిలకిస్తున్నాడు. మసీదు, మసీదుమీద నాలుగు శిఖరాలు, శిఖరాలమధ్య పచ్చని తలపాగాతో, తెల్లని దుస్తులతో ప్రార్థనకని ఎలుగెత్తి అరుస్తున్న ఒక ముల్లా! మసీదు గిరగిర రైలుతోకూడా పరుగెత్తుకొచ్చి యిక పరుగెత్తలేనన్నట్లు ఆగిపోయింది. గుజ్జనగూళ్ళవలె వున్న అనేక షాపులు, జంగిడి దుకాణశాలలు, క్రాసింగువద్ద నిలుచుని నీలిరంగు బట్టలు వేసుకుని పచ్చజండా ఊపుతున్న సిగ్నల్‌వాడు, మునూ దృష్టికి తగిలీతగలనట్లు తగిలి, ఈ దృశ్యంకూడా అదృశ్య మయింది. రైలురోడ్డుకు సమానాంతర రేఖవలె పోతున్న మార్గంలో లారీలు, బస్సులు దుమ్ము రేపుకుంటూ 'భయ్ భయ్' అరుపులతో పరుగెడుతున్నవి. దగ్గరగావున్న 'బర్మాఆయిల్ కంపెనీ' ఒకసారి కనిపించి, దానికి అవతల, దూరంగా 'సోడా వాటర్‌వర్క్స్' అని వ్రాసివున్న ఫ్యాక్టరీచిమ్నీనుంచి తెరలుతెరలుగా నల్లని మబ్బులవంటిపొగ ఆకాశంపొడుగున ఎగజిమ్ముకుపోతున్నది. ఎంత పెద్దపక్షి! గండభేరుండపక్షి రెక్కలు చాచుకుని నేలపై వాలిందాఅన్నట్లు భ్రమగొల్పుతున్నది. ఆకాశం ఎత్తునవున్న ఈపక్షితోక పొగలను కక్కుతున్నదే! దృష్టిమరల్చి ఇటు అటు వెతుకుతున్నట్టు చూశాడు. మైళ్ళపొడుగున మేడలు, మిద్దెలు, బంగాళాలు ఇళ్ళు...దౌలత్‌పూర్- అబ్బ-ఎంతగొప్ప నగరం! వింతవింతగా కొత్తకొత్తగా ఏదోలావున్న ఈప్రపంచంకేసి మునూ కనుచూపు లొకసారి ప్రయాణంసాగించి, అతని హృదయాంతరాళాల్లోని భావాలను వెదకివెదకి పైకితీస్తున్నవి. మొట్టమొదటిసారి శానగరం చూసినప్పుడు అతనికి కలిగిన పట్టరాని ఉద్రేకం, ఉల్లాసం, తొట్రుపాటు, కలవరం, ఆనందం, భీతిఅన్నీ ఒకేసారి ఇపుడూ హృదయాన్ని నింపివేసినయ్! అది ఏమో తెలియని ఒక నూతన ప్రపంచంలోనికి—ఒక వింతలోకంలోనికి అడుగుపెడుతున్నాననే ఒకవిధమైన కంపం, ఈ నవీనప్రపంచంలో జీవితం బాగుపడుతుందికదా అనే ఆనందోద్రేకం ఒకేసారి మునూ హృదయంలో రేకెత్తాయి.

స్టేషన్‌నుండి సరాసరి ఇంటికి బండిచేయించుకుని, గణపతి ప్రభు దయాళ్‌తో బయలుదేరారు. గణపతి, దయాళ్‌లకు మధ్య గొంతుకబడి మోకాళ్ళను ముడుచుకు కూర్చుని మునూ బండివంక చూశాడు. బండిలో మరి అయిదుగురు ప్రయాణీకు లున్నారు. బండి వెదురుబొంగులదవడంవలన అవి టిగావుంది." కాన్వాసుగూడు చిల్లులు. సరాసరి ఇంటికి బయలుదేరడంవల్ల దౌలత్‌పూర్ బజారును చూసే భాగ్యం మునూకు పట్టిందికాదు. 'కేట్ కిల్లర్స్ లేన్'కు ముందుభాగంలో వున్నషాపులు, లేన్‌కు అవతల ఇరుకుసందు మురికికంపు. సందులో మూడంతస్తుల మేడముందు కుళ్ళిపోయిన ఆకులు, పెంటపోగులు దుర్వాసన కొడుతున్నది.

ఎదురుగ బల్లచెక్కల తిన్నెలపై కూర్చుని అర్ధనగ్నంగావున్న స్త్రీలు ఆకులతో దొప్పలు, గిన్నెలు కుడుతున్నారు. వారిని దాటుకుపోతూ ప్రభు దయాళ్ గణపతులు సాగిపోతుంటే, వారివెనక నడిచేందుకు మునూకు సిగ్గుగానూ వుంది; ఎబ్బెట్టుగానూవుంది. ఎవరీ స్త్రీలు! తన కొండప్రదేశపు కూలివాళ్ళే. హిందువులు పండుగులకుపబ్బాలకు పాత్రలకు బదులు ఆకులతో చేసిన దొప్పలను, గిన్నెలను వాడతారు. వీటిని కుట్టుకుని ఏదో ఓకాడికి అమ్ముకుని దాంతో కలో గంజో తాగుతారు కూలివాళ్ళు; మగాళ్ళు కూలి పనిచేసి అంతో ఇంతో తెస్తారు; ఆ తెచ్చినదానికి ఆడవాళ్ళు సంపాదించే ఈ నాలుగు దమ్మిడీలూ కొంతలోకొంత. వేణ్ణీళ్ళకు చన్నీళ్ళసాయం! ప్రభు దయాళ్, గణపతులను చూసినవెంటనే కూలిస్త్రీలు పర్వతప్రాంతపు యాసతో "జయదేవ్ సేఠ్‌జీ! కులాసాగా వున్నారుకదా! ఇంట్లో అంతా బాగున్నారా?" అని ప్రశ్నించారు. దయాళ్ చేతులు జోడించి "ఆ భగవంతుడిదయవల్ల..." అన్నాడు. ఎదురుగ వున్న పెద్దఆవరణనుదాటి, ఆవరణ కానుకునివున్న ద్వారాన్ని సమీపించి, భవంతిలోనికి అడుగుపెట్టాడు. భవంతి వసారాలో కర్రచెక్కలతో కట్టిన చిన్నచిన్న గదులు చీకటిగా వున్నాయి. గదుల బయట చాలమంది ఆడవాళ్ళు ఆకులను కుట్టుకుంటున్నారు. దయాళ్, గణపతుల సవ్వడిని కనిపెట్టి ముదుసలులేకాక యువతులుకూడా లేచివచ్చి వారిచుట్టూ బిలబిల్లాడుతూ గుమిగూడారు. సంతోషంతో నవ్వుతూ విసనికర్రలవలె మొహం విప్పుకుని కిలకిలమంటూ "మీ ఊరునుంచి మాకేం తెచ్చారు; మాకేం తెచ్చారు?" అని ఆప్యాయతతో అడుగుతున్నారు. మీ కోసం వీణ్ణే

తెచ్చానన్నట్లు దయాల్ తనను వేలితో చూపిస్తున్నపుడు, మునూకు ఆశ్చర్య సంభ్రమాలు కలిగాయి.

ముగ్గురూ పది మెట్లు ఎక్కగానే కాంపౌండ్ కానుకునివున్న గది కనిపించింది. గది పెద్దది. గదిలో సన్నని మనిషి, ఓడియపడుతున్న కళ్లతో, తళతళమనే చూపుల కాంతితో మనుష్యుల సవ్వడి విని బెదిరిపోయే లేడివలె అటుఇటు తచ్చాడుతున్నది. ఆమె తప్పక దయాళ్ భార్య అయివుంటుందను కుని మునూ ఆమెవంక ఆత్రంగా చూశాడు. పాలిపోయి శుష్కించిపోయిన వదనం, కదలని పెదవులు! అభిమానంగా జాలితో కడుప్రీతితో మునూదగ్గ రకు వచ్చి తానెవరని అడగనైనా అడగకుండా రెండుచేతులా చేరదీసి, నుదురు తాకి, ఆమె కన్నతల్లివలె అనుమురుంది. ఏ మాతృదేవి మృదుహస్తాల చల్లదనం, ఏ తల్లి జాలిచూపుల వెచ్చదనం కావాలనుకుని ఇన్నాళ్లూ తపస్సుచేశాడో ఆ కన్నతల్లి చేతి చలవ!

వెక్కిరింత నిండిన గొంతుతో గణపతి "దణ్ణాలమ్మా వొదినా! దణ్ణాలు! దాసాను దాసుడి దణ్ణాలు" అన్నాడు.

"కలగాలి, కలగాలి, చిరాయువు కలగాలి! అయితే మరిదీ... వెళ్ళిన పనయిందా? పిల్ల నెక్కడైనా చూసుకున్నావా? అందం కావాలి చందం కావాలి కొరుక్కుతింటాననని మహా ఎగిరిపడుతున్నావ్ లే!"

పార్వతి వేసిన ప్రశ్నకు గణపతి అపహాస్యంచేస్తూ "దానిసంగతికేం కానొదినా! నీకోసం రెడీమేడ్ పుత్రరత్నం; తీసుకొచ్చా."

"మంచిపనేచేశావ్!" పార్వతి సంభాషణను ముగించివేసి, మునూను దగ్గరకు తీసింది; ప్రేమతో కౌగలించుకుంది. కూర్చున్న భర్తను "ఇంకా కూచునే వుండిపోయారూ? వంటయిపోయింది; స్నానంచేసొచ్చి దబ్బున రెండు మెతుకులు తింటే నయంకాదూ! రాత్రిల్లా నిద్రపట్టివుండదు; రైలు ప్రయాణం; ఈ రోజుల్లో మరీకష్టం!" అన్నది. భార్యమైగల తన అభిమానాన్ని వ్యక్తంచేయకుండా భారతీయసంప్రదాయ పద్ధతిని, నిగూఢంగా ప్రభు దయాల్ ప్రత్యుత్తరమిచ్చాడు: "భోజనాని కేముందిలే! తినొచ్చు!" గోడకు చేరవేసివున్న కొబ్బరిపీచు పరుపు పరచి దానిమీద తను తెచ్చిన సామాను సర్ది, మునూను పరుపుమీద కూచోమని పిలిచాడు. మునూ దృష్టి ఇక్కడ లేదు. ఈ గది చల్లదనానికీ, గది అవతల ఆవరణలో కాస్తున్న ఎండకూ గల

భేద మేమిటయి వుంటుందని తర్కించుకుంటున్నాడు. తర్క మెంతకూ తెమలక, ఇందాకా తను చూసిన ఫ్యాక్టరీకి దారి ఎలాగనని ఆలోచనలతో వెదకుతున్నాడు. మొహం చిరుచెమటలను పోసింది. చొక్కాతో తుడుచు కున్నాడు. పార్వతి అందిచ్చిన మర్బత్తుగ్లాసుతో, మునూ ఆలోచనలకు భంగం కలిగింది. మర్బత్తు తాగినతరువాత ప్రభు దయాళ్ మునూను వెంటపెట్టుకుని స్నానానికి వెళ్లాడు.

స్నానం ముగిసినతరువాత పార్వతి అన్నం వడ్డించింది. కూర, పప్పు, చింతకాయ పచ్చడి, వడ్డించినవన్నీ పర్వత ప్రాంతాలవారువే పదార్థాలే; బీబీజీ ఇంట వీటి రుచినే, మర్చిపోయాగు; పిండిరొట్టెలు తీపిగా వున్నాయి. నోరు వెచ్చవెచ్చగా వుంది; పెరుగూ అన్నం కలిపాడు. ముద్దలుచేసి సంతృప్తిగా తిన్నాడు. ఇలాటి భోజనం జీవితంలో ఇదివరకు ఒక్కసారే తిన్నాడు. వాళ్లమ్మ తద్దినంనాడు యిక మూడు నెలలకు తన పల్లెటూరు వదలి వెళ్ళిపోతాడనగా, వాళ్ల మేనత్తగుర్జీ అన్నీ చేసి మునూకు పెట్టింది.

కడుపు నిండిపోయింది. శరీరం బరువెక్కినట్లుయింది. చాపమీద చతికిలపడ్డాడు. కంటినిండా నిద్రవచ్చింది...నిద్రలేచి చూసుకునేసరికి మూడు గంటలయింది.

"ఒకసారి అలా వెళ్ళిరా; వెళ్ళి ఫ్యాక్టరీచూడు; అదిగో అదే మన ఫ్యాక్టరీ! కుడిచేతివైపు మళ్లి నాలుగడుగులువేస్తే ఎవరో ఒకరు నిన్ను దిగువ భాగానికి తీసుకువెడతార్లే" దయాళ్ గుడుగుడు పీలుస్తూ మునూకు మరీ మరీ చెబుతున్నాడు.

గదిమూలకు వెళ్లి కిటికీలోంచి కిందకు చూశాడు; వెళ్ళనా మాననా అనే సందేహం పీక్కుతింటున్నది. ఫ్యాక్టరీ జౌత్ఖానా చీకటిగా లోతుగా భూమిలోనికి పెద్ద గుంటచేసుకుని భయోత్పాతం కలిగిస్తున్నదికదా, అందులో దిగడం ఏమంత మంచిపని! గాలిలేదు, వెలుతురులేదు, నిర్కుమాలిన నుయ్యి. ప్రమాదం ప్రమాదం! నూతికి జారిపోతూ ఒక కిటికీవుంది; సాహసించి దిగినప్పటికీ ఏదో ఒక పెల్లవిరిగి మీద పడనైనాపడవచ్చు; లేదా తానే జారిపడవచ్చు. ఊపిరాడక చనిపోతే!

ఉక్కిరిబిక్కిరవుతున్న ఆలోచనతోపాటు తనకు సహజసిద్ధమైన ఉత్సాహం జనియించకపోలేదు. వెళ్లి చూద్దామనే ఆసక్తిని 'సరేలే,

ఆ ప్రదేశలోపమే అంత, 'నేనేం చేస్తా' ననే ఆత్మ సంతృప్తితో సంబాళించు కున్నాడు. ఈ సంబాళింపులో అంతర్భాగంగా తను అదృష్టవంతుడననే ఒక భావం అతిశయించింది. ప్రభుదయాళ్ కరుణార్ద్రహృదయుడు; అలాటి వానికి రైలులో తను దొరకడం, అతని దయ సంపాదించడం, ఇదంతా అదృష్టమేమరి!

పెరటిలోవున్న ఒక టిన్నురేకుల షెడ్డులో ఒకమూల మూడు పొయ్యిలున్నవి; పొయ్యిలపై పెద్ద డేగిశాలతో నీరు సలసల మరుగుతూ గుయ్యిమంటున్నది; ఆవిరులను కక్కుతున్నది. మరి ఒకపక్క ఎత్తైన కర్ర తిన్నెపై ఇనుపపెట్టె, పచ్చని, ఎర్రని ఎక్కౌంటు బుక్కులు, ఇంకు స్టాండు, నల్లని ఒక పెద్ద సిరాబుడ్డి ఇమిడికగా కనిపిస్తున్నవి. పొయ్యిలవద్ద నూతిచుట్టూ రాగి గ్లాసుకులతో వున్న పీపాలున్నవి. మరికొన్ని పీపాలు జింజరు మొదలైన పానీయాలతో తొణకిసలాడుతున్నాయి. చిన్న సందులో నుంచి నాలుగడుగులు వేయగనే, ఒక ద్వారం; ద్వారం తెరవగనే మళ్ళీ మరొక సందు; సందు చివరను ఫ్యాక్టరీ, ఇరస్తా పరస్తా ఏమీ లేకుండా ఒంటిపులి రాకాసిలా.

ఎత్తైన కిటికీలోనుంచి నూతిమీదుగా ఫ్యాక్టరీలోనికి మునూను ఎవరో దింపేటపుడు, ఆ వ్యక్తి దుర్వాసనకొట్టాడు. అతనివంక చూశాడు; మనిషికి ముక్కూ మొగమూ ఆకారమే లేనట్లుంది. ముద్దలాగ, ముఖమంతాకూడుకుని పోయింది. శరీరమంతా కదుపులు తేరింది. చేతులు పొడుగ్గానే వున్నాయికాని, నీళ్ళలో నాని వొరిసిపోయినట్లున్నాయి. కాళ్లూ అంతే; పిక్కలమీద నరాలు ఉబ్బి పైకి విల్లుఎక్కుపెట్టినట్లు పొడుచుకువచ్చాయి. పాదాలు, వేళ్ళు కురుపులతో రసికారుతున్నవి. ఇతనికి కుష్ఠురోగం వచ్చింది; కనుకనే మొహం నిండా పట్టీలను వేసుకున్నాడు, అనుకున్నాడు మునూ. చొక్కా గోను గుడ్డకన్న కనికిష్టం; "మొహంలో వెతికిచూసినా చురుకుతనం కనిపించదు; మొద్దు."

ఆ మొద్దుమనిషి దింపీ దింపగనే మునూ అతని బారినుంచి తప్పించుకుని కప్పవలె ఒక్కదుముకు దుమికాడు. నవ్వి అతనికేసి పరీక్షగాచూశాడు.

దూరాన గణపతి అదిలింపులు వినిపిస్తున్నవి: "మహారాజ్! దిక్కులు చూడక నీ పనేదో నువ్వు చూసుకో, హూఁ" తనను అక్కడనుంచి త్వరగా

కదలి పొమ్మనే, గణపతి అదిలింపులకర్థమై ఉంటుందని మునూ భావించాడు. కొంత స్వాభిమానంతో ముందుకునడిచి వెళ్ళాడు.

దగ్గరకు వచ్చి నిల్చున్న మునూను బోంగా అనే పిల్లవాడు అనుమాన దృక్కులతో పరికించి, కనురెప్పలను ఆడిస్తున్నాడు. బోంగా మట్టివిగ్రహంలా వున్నాడు: మొహం పాలిపోయివుంది. దుబ్బుగా, పొట్టిగా గుమ్మటంవంటి మనిషి. గబగబావచ్చి మునూకు ముందరకు త్రోసి, నోరు తెరుచుకుని, వింత వింతగా అస్పష్టంగా సౌజ్ఞలనుచేస్తూ బోంగా ఏమిటో చెబుతున్నాడు. వాడి గొడవ మునూ కేమీ అర్థంకాక, తికమకపడ్డాడు.

గూటిదగ్గర తిన్నెమీద కూర్చుని గుడుగుడు పీలుస్తూ గణపతి "నిన్నక్కడ కూర్చోమని చెబుతున్నాడు బోంగా! వాడికి చెవుడూ, విన పడదు; మూగి!" తనను కొట్టే ఉద్దేశ్య మేమీ బోంగాకు లేదనీ, కేవలం కూర్చోమనడమే వాడి మనో సంకల్పమనీ, మునూకు తెలిసి వచ్చాక, ప్రాణం స్థిమితపడింది. బతుకుజీవుడా అని తప్పించుకుని మండుతున్న పొయ్యిలవద్దకు వెళ్ళాడు. అక్కడ ఒక పిల్లవాడు నించునివున్నాడు. మనిషిరంగు చామన చాయ; చూపులనుబట్టి చూస్తే మంచివాడిలాగే కనబడుతున్నాడు; బాబు గారులా, దొరగారిలా జుత్తు దువ్వుకుని కుర్రవాడు బాగానే వున్నాడు. పొయ్యిమీద మరుగుతున్న డేగిశాను దింపి, కుండీలోనికి నీటిని వొంపేడు. పెద్ద గాజువంటి డేగిశాను, అందులోనూ సలసల మరుగుతున్న నీటితోవున్న దానిని ఆ కుర్రవాడు కిందకు దింపుతున్నప్పుడు, మునూకు కంగారువేసి భయంతో "అయ్యో అయ్యో! చేతులు కాలిపోతున్నాయ్! వేడినీళ్ళు; చెయ్యంతా కాలిపోయింది! ఉడికిపోయింద"ని గగ్గోలుచేస్తూ ముందు కురి కాడు. ఆ పిల్లవాడు "ఏడిశావ్ సమంగా కూచునిచూడక ఏమిటా అరు పులు! కూచో" అని అరిచాడు. మునూ నించున్నచోట చాలామంది ఆడ వాళ్ళు కూర్చుని ఆపిల్ పళ్ళను తరుగుతున్నారు.

గణపతి చీంబోతులా మొహంపెట్టి "అక్కడ కూచో తొత్తుకొడకా! తులసిగాడికి లేని కంగారు నీ కొచ్చిపడింది; ఏమిటనుకొంటున్నావ్ ఆ డేగి శాలు? ఎసెన్సు; కాసేపు పోయాక వాడితోవెళ్ళి ఎవరెవరికి ఎసెన్సు లిస్తు న్నాడో ఆ షాపులన్నీ బాగా గుర్తుపెట్టుకో; రేపట్నుంచీ, గ్లాసుకులన్నీ నువ్వే బజారుకు తీసుకెళ్ళాలి; తులసి ఇక రాడు నీతో. వాళ్ళు చేసుకుం

టోన్న పనికి అడ్డు తగలకు చెంవుడు కాకిలా అరుస్తూ;... గాడిద కొడుకు మేం తీసుకురాకపోతే ఈ పాటికి పోలీసు లాకప్‌లో వుండును!... ఒరేయ్ మునూ! వాళ్ళు పనిచేసుకొంటున్నార్రా పీసుగా! అటు ఇటు తిరక్క అక్కడే కూచో!”

గణపతి, మునూను కూర్చోమని ఒక స్టూలు చూపించాడు. స్టూలు నిండా బురద; మన్ను; జోళ్లు పెట్టుకునే ఆ స్టూలే కూలివాళ్ళు కూర్చుండుకు తగినదని అతని అభిప్రాయం. మునూ ఎత్తయిన గోడలవంక పరికించాడు. గోడలకు కొన్నిచోట్ల పెల్లలు ఊడిపోయాయి. మరికొన్నిచోట్ల యిటుకపొడి రాలుతున్నది. ఊడివచ్చినచోట మన్ను మెత్తారు. గోడకు పిడకలు చరిచి వున్నాయి. నల్లని పొగతుట్టలు, అక్కడక్కడ గుహాలలోమాదిరి గబ్బిలాలు వేలాడుతున్నవి. సాలీళ్ళు, మగ్గాలవలె గూడులను నేసుకుపోతున్నవి. అటుయిటు సంచరిస్తున్న అతని చూపులు గణపతి కనులకు కనిపించాయి. గబుక్కున దృష్టి మరల్చుకుని షెడ్‌వంక చూచాడు. షెడ్ బరువుగా దూలాలను కిందకు అణచుతున్నట్లు వుంది. స్తంభాలమీద తమాషాగా సాలిపట్టులు పూలరేకులవలె చెక్కబడివున్నాయి. ఈ పాతాళలోకంలోనికి సూర్యుడెప్పుడూ తొంగిచూడనట్లు, గాలికి బేడీలు తగిలించినట్లు కనిపిస్తున్నది. తులసి పొయ్యిమీదనుంచొక డేగిశాను దింపి సలసల క్రాగుతున్న ద్రావకాన్ని సీసాలోనికి దిమ్మరించాడు. ఆవిరి అతని మొహంపై క్రమ్మి నీటి గ్రుడ్లను పోసింది. మునూచూపులు యిక వేటినీ పరిశీలించడంలేదు. తనను తానే చూచుకుంటూ ఈ పాతాళలోకంలో, గోడలు ఊడిపోయి పాడై వున్న చీకటి కుతారంలో, కంగాళాలతో, గాబులతో, బిందెలతో, డేగిశాలతో క్రిక్కిరిసివున్న గుహాలలో తనవంటి మనుష్యులకు స్థానం లేదనుకున్నాడు. కళ్ళు నులుపుకుని గుండెను తేటపరుచుకుంటున్నపుడు “నీ వెవరవు? ఎక్కడనుంచొచ్చావు?” అని ప్రశ్నిస్తున్నట్లు ఆ ముగ్గురు కుర్రవాళ్ళూ ఓరచూపులతో మునూను చూశారు. ఇదంతా తనకు తెలియని ఒక ఆట; తానీ ఆటలో సత్రకాయ. ఎందుకొచ్చినట్లు! ఒక విధమైన చికాకు, అసహనం అతన్ని ఆవహించింది. డేగిసాలమీదుగ గాలి వీచి, మరుగుతున్న మాంసం వాసనను రేపింది. దిక్కుమాలిన కంపు! తనకే కనక రెక్కలు వుంటె తప్పక ఈ పాటికి గబుక్కున ఎగిరిపోయి వుందును.

ప్రభుదయాళ్ పిల్లవాడిని వెతుక్కుంటూ అక్కడకు రావడంతో మునూ ప్రాణం లేచివచ్చింది. "మునూ! ఎక్కడయ్యా? ఎక్కడున్నావ్?"

గణపతి మునూవున్న ప్రదేశంవంక వేలెత్తిచూపిస్తూ "అదిగో! అక్కడే! వెర్రిగొల్లాడు! వాళ్లల్లా కాలి చచ్చును ఎద్దుమొద్దువెధవ! దేగిశాల్లోంచి నీరు దిమ్మరిస్తూంటే వీడెందుకు చెప్పు ఆ తులశిగాడిపక్కన! మంటలోపడి శారుని చచ్చాడుకున్ను" మునూ గబగబ లేచి దయాల్ వద్దకు వచ్చి నిలబడ్డాడు. నవ్వుతూ ప్రసన్నంగా దయాల్ "రా బజారుకి వాతో; షాపులన్నీ చూద్దువుగాని; రేపట్నుంచి రోజూ ఆ షాపువాళ్లకి నువ్వే సరు కందిద్దువుగాని! బాగా గుర్తుపెట్టుకో...బజార్నుంచి దేవుడిగుడి కెడదాం" వివర్ణమైన మోముతో కటువుగాం, గణపతి "అదే నీతోవచ్చిన తిప్పలు...బంట్రోతుల్ని బంట్రోతుల్లా వుంచవ్...నెత్తికెక్కించుకు నువ్వు తిరుగుతావ్; మమ్మల్ని తిరగమంటావ్!"

ప్రభుదయాల్ దీనికి సమాధానంగా చిర్నగవు నవ్వి అక్కౌంటు పుస్తకాన్ని చేతబుచ్చుకుని వెళ్ళిపోయాడు. మునూ సంతోషంతో అతన్ని వెంబడించాడు.

పర్వతాల సమీపమున వున్న శ్యాంనగర్ తన అందచందాలతో, క్రిక్కిరిసిన బజారులతో, విశాలమైన రోడ్లతో, ఎత్తైన మేడలతో మునూను ఎంతటి దిగ్భ్రాంతిలో ముంచెత్తినదో, దౌలత్పూర్ కూడా అంతటి ఆశ్చర్యాన్ని కలిగించింది. అయితే ఇప్పుడు అతనికి వున్న పెన్నిధి ఒకటే ఒకటి; తాను దయాల్ చెంత అతి సన్నిహితంగా వుంటున్నాడు; కనక ఇక్కడ తాను తప్పిపోతానేమోననే దిగులు లేదు.

కేట్ కిల్లర్స్ సందునుంచి మిస్రీబజారుకు వచ్చాడు. చేరువలోనే వున్న జాట్కిన్, సబునియన్చ, బుస్కవరన్ బజారులలోనికి వరస వరసన చొచ్చుకుపోతూ, ఒకకంట దయాల్ను, మరొకకంట దుకాణాలను పరికిస్తూ అంగలువేస్తున్నాడు. కుడినుంచి ఎడమకువచ్చాడో ఎడమనుంచి కుడి పక్కకే మళ్లాడో తెలియలేదు. ఈ దారులన్నీ పడుగుపేకలా కలసిపోయి వున్నాయి. డొంకతిరుగుళ్లు; గాభరాగా వుంది. ఇక్కడ ఒక్కణ్ణే వదిలివేస్తే ఇంటికి దారి కనుక్కోవడం కష్టమే.

కంటికి అనుతున్నవన్నీ చూస్తూ సందులను గొందులను దాటుతుంటే అనేకమంది మనుష్యులు వివిధ తరహాలవాళ్లు తారసిల్లుతున్నారు. కళ్లు తెరచుకుని, పళ్లికిలిస్తూ మనుష్యులు పోతున్నారు; వస్తున్నారు. రంగురంగుల బట్టలు, తలపాగాలు బజారులమ్మట నడిచివెడుతున్నవా అనిపిస్తున్నది.

దూరంనుంచి ఎవరో పిలిచిన కేక వినిపించి దయాల్ ఆగిపోయాడు. "ఎప్పుడయ్యా రావడం ఊర్నుంచీ?

బారులు తీర్చివున్న షాపులు, షాపులలో వింతవింత వస్తుసముదాయం, మిఠాయిదుకాణాలలో వరసలుగా పేర్చిన తీపిసామాను, అట్టలమీద అతికించబడిన తాళాల దుకాణాలు, మునూ కళ్లల్లో మెరిశాయి. బట్టలకొట్ల ముందు తెల్లని, నీలితానులు వ్రేలాడగట్టి వున్నాయి. తోలుపెట్టెలు, సంచులు, బెల్టులు తోరణాలమాదిరి ముచ్చట కలిగిస్తున్నాయి. వీధులలోనికి షాపు ముంగిట అంచుల్ని బెంచీలువేసి, మీద గుడ్డపందిర రాట్లమీద నిలబెట్టి కొంటర్లవద్ద షాహుకార్లు బైఠాయించి బేరాన్ని చూసుకుంటున్నారు. కొద్ది కలవరపాటుచెంది మునూ, దయాల్ ఎక్కడవున్నాడో అని చూశాడు. సీసాలు, నూనెలు, ఎసెన్సులు, సుగంధద్రవ్యాలు అమ్మే ఒక షాపువద్ద తన యజమాని నించుని మాట్లాడుతున్నాడు. షాపుముందు చిన్న, పెద్ద, ఆడ, మగ అనేకులు బేరసారాలాడుతూ కలకల్లాడుతున్నారు. ఆడవాళ్ల ఒంటిమీద నగలు ధగధగ మెరసిపోతున్నవి; మగవాళ్లు ధరించిన సిల్కుదుస్తులు తళతళ లాడుతున్నవి. షాపువానితో తన యజమాని సంభాషిస్తూ "వీడు ఈ ఊరికి కొత్త. రేపట్నించీ ఎసెన్సు వీడే ,పట్టుకొస్తాడు. హకీంజీ! "మునూ చెయ్యి పట్టుకుని ముందుకు లాగి లల్లాకు చూపించాడు. షాపు యజమానిది బానంత కడుపు. కొంటరు ముందు ఫరుపు పరుచుకొని కాళ్లు పారజాపుకు కూర్చున్నా జాగ్రత్తగా బేరగాళ్ల నొకకంట కనిపెడుతూనేవున్నాడు: "అచ్ఛా దయాల్జీ! అచ్ఛా!"

దయాల్ నమ్రతతో చేతులు రెండూ జోడించి తలవంచి నిలబడ్డాడు; బయటకు దారి తీశాడు. తన యజమానివెంట మునూ ఒక కుక్కపిల్లవలె అనుగమించాడు. దారిలో ప్రత్యక్షమౌతున్న సైన్‌బోర్డులను, కూడబలుక్కుని చదువుకుంటూ వెడుతున్నాడు. ఒక్కొక్క షాపుకి ఒకటీ రెండూ కాదు; నాలుగయిదు సైన్‌బోర్డులు! షాపులకే కాదు; ఇళ్లముందుకూడా ఇవే!

డాక్టర్. హీరాలాల్ సోని, ఎమ్. బి; బి. యస్ (పంజాబ్) యల్. ఆర్. సి. పి; ఎమ్. ఆర్. సి. యస్ (ఇంగ్లండ్) డి. వి. ఎమ్ (లివర్‌పూల్) డి. ఒ. యమ్. యస్. (బ్రిస్టల్)! హారి దీనిదుంపతెగా! ఆంజనేయుడి తోకలా ఎంతుందిరాబాబూ! అనుకున్నాడు మునూ. ఈ బోర్డువున్న షాపు మిగిలిన వాటికిమల్లే లేదు. కుర్చీలు, బెంచీలు అందంగా అమర్చబడ్డాయి. అసలు ఈ అక్షరాలకు అర్థమేమిటో, బోధకపడక మునూ ఆశ్చర్యచకితుడయాడు.

కాస్త నాలుగడుగులు వేసేసరికి మరొక షాపు. ఈ షాపు అన్నిటి కన్నా చిత్రంగావుంది. నూనెలేదు, వొత్తిలేదు, చిమ్నీలేదు; ఊరికే గమ్మత్తుగ ఒక మేజిక్‌లా చిన్నచిన్న బుడ్లు తీగమీద వేలాడుతూ వెలుగుతున్నాయ్! ఆరిపోతున్నాయ్; మళ్లీ వెలుగుతున్నాయ్; ఎర్రని పచ్చని రకరకాల రంగురంగుల దీపాలు; ఇలాటి అర్థంకాని వింతలేవి కనిపించినా, అవి 'ఇంగ్లీవాడి మాయ' వలన జరుగుతున్నవని శ్యాంనగర్‌లో తనకు బళ్లో మాస్టారు చెప్పేవారు! ఇదీ అంతే! దీనినిగురించి ఊరకనే ఆలోచనచేయక, కళ్లల్లో వత్తులు వేసుకుని షాపులవంక పదేపదే చూస్తున్నాడు. ఎదురుగా మేడలవరస తన హిస్టరీ పుస్తకంలో వున్న షాజహాన్ ఛాంబర్ వంటిది కనిపించింది. అంతస్తుపై అంతస్తు, ఎన్నెన్నో మేడలు పొయ్యి పొక్కిళ్లను పోలివున్నాయి. మేడల వరసలో ఒకచోట మిషన్ల టక టక వినిపిస్తోంది. మిషన్లముందు కూర్చుని, కాలితో ఏమిటో తొక్కుతూ బల్లమీద గుడ్డను జరుపుతూ, దర్జీలు కుట్టుకుంటున్నారు. మరి ఒకడు చొక్కాకు కాజాలు కుడుతున్నాడు, ఇంకొకడు బట్టను కత్తిరిస్తున్నాడు. మరొకచోట ఇంకొక గది; ఈ షాపునిండా వెండిసామాను, బీరువాలలో బంగరు గొలుసులు పొదుల ఉంగరాలు, గాజులు; షాపుముందు కూర్చుని ఒకాయన నల్లని రాతిపలకమీద గీటుపెడుతున్నాడు. చెరుపుతున్నాడు. మళ్లీ గీటు పెడుతున్నాడు. కాస్త దాటితే మిఠాయిదుకాణం, పళ్లదుకాణం, నారింజ, కమల, బత్తాయి, చక్రకేళి, మామిడి పళ్లు గుత్తులు గుత్తులుగ, బుట్టలనిండా బల్లలమీద వరసలు వరసలుగ...దారమ్మట పోయేవారిని పలకరించిమరీ ఊరిస్తున్నవి. రాజుల మామిడి, కోలం గోవా, కొత్తపల్లి కొబ్బరి; ఇమాం పసందు, సువర్ణరేఖ తినడానికి పసందుగా వుంటాయి. ఎంత కమ్మని వాసనలు! ఏమి గుబాళింపు!

తల అట్టకట్టుకుపోయి జడలు వీపుమీద పడుతూ, శరీరంనిండా విభూతిరాసుకుని దిగంబరస్వామి! మెడలో ముళ్ళకంచెలు తగిలించుకుని, సవరించుకుంటున్న సాధుపుంగవు డొకడు మునూదృష్టిని ఆకర్షించాడు. జనం గుంపులుగా వస్తున్నారు. పరాయిలతో మహమ్మదీయులు, ధోవతులను సర్దుకుంటూ హిందూవులు క్రిక్కిరిసి నడుస్తున్నారు. జన సమ్మర్దంలో బళ్ళొకటి; వంటెద్దు బండీ గబుక్కున్న మళుపు తిరిగి ఎదురుగవస్తోన్న రెండెడ్ల బండిని ఢీకొన్నది. దయాల్ తప్పించుకుని మునూ చిటికినవ్రేలు పట్టుకుని పక్క సందులోనికి మళ్ళేడు. సందులో దేవాలయం వున్నది. గర్భగుడిలో దేవుని విగ్రహా లనేకం వివిధరంగులతో అలరారుతున్నవి. సిక్కుగురుని గుడి ప్రాంగణందాటి, విష్ణ్వాలయంలో ప్రవేశించారు. ఆలయంముందు పుష్కరిణి నీటితో నిండుగా కనిపిస్తున్నది. కనకాంబరాలను, మల్లెపూలను మాలలుగా గుచ్చి పిల్లలు కేకలువేస్తూ అమ్ముకుంటున్నారు. దయాల్ రెండు దండలను కొని భక్తి ప్రపత్తులతో నిలబడ్డాడు. ఎర్రని సూర్యకాంతి పుష్కరిణిలో కుంకుమను వొలకబోస్తున్నట్లున్నది. అస్తమిస్తున్న సూర్యుని కెదురుగ చేతులెత్తి జనం ధ్యానిస్తూ నిల్చున్నారు.

సంజ చీకట్లను వీడ్కొలుగా దేవాలయంలో దీపాలు వెలుగుతున్నవి. ఒక్కొక్క మెట్టునే దాటుతూ ఇద్దరూ ఆలయంలోనికి స్వామి దర్శనార్థం ప్రవేశించారు. ఎదురుగా విగ్రహం జరీబట్టలతో, నగలతో, ముత్యాల దండలతో ధగధగ ప్రకాశిస్తున్నది. గుడిలో ఠంగ్ ఠంగ్ న జయగంటలు మ్రోగుతున్నవి. అర్చకులు మంత్రాలను పఠిస్తున్నారు. శ్లోకాలను ఎలుగెత్తి చదువుతున్నారు. "జయజయ" ధ్వానాలు మిన్ను ముడుతున్నవి. దేవునికి సాష్టాంగ ప్రమాణంచేసి, శఠగోపం పుచ్చుకుని, తీర్థం కళ్ళకద్దుకుని దయాల్ పుచ్చుకున్నాడు. అతనితోపాటు మునూ దేవుణ్ణి ధ్యానించి, దేవాలయ ప్రాంగణాని కానుకునివున్న ఆరామంలోనికి కాలుపెట్టేడు. పూల పొదరిళ్ళు, లతా కుంజాలు వింత శోభనిచ్చే పొగడచెట్లు, తులశివనం కనులకు పండుగ చేస్తున్నవి. చుట్టూ హోమాగ్నిని రగుల్చుకుని, కాషాయాంబరధరులైన సాధుపుంగవులు నున్నని గడ్డాలను నిమురుకుంటూ, తమ కిరువంకల నిల్చున్న భక్తకోటిని అర్ధనిమీలిత నేత్రులై తిలకిస్తున్నారు. భక్తాగ్రేసరులు దిగంబర స్వాములకు పూలను, పళ్ళను సమర్పించి చెంపలు వేసుకుంటున్నారు; సన్యాసులకు మ్రొక్కుతున్నారు. "దైవాంశ సంభూతులు"; "కాదు; దేవుడే"

అనే భక్తుల గుసగుసలు మునూ చెవులకు వినిపించాయి; కాని ఆ మాటల తాత్పర్య మేమో వఅగాహన కాలేదు.

ఇంటికి వెడుతూ దారిలో ప్రొద్దుటినుంచి సాయంకాలంవరకు జరిగిన సన్నివేశాలను తలుచుకుంటున్నాడు. తలచుకుంటున్నకొలదీ తాను ఒక నవీన అపరిచయ ప్రపంచంలో జీవిస్తున్నట్లు తోచింది. "యజమాని యిల్లు బాగుంది; ఫ్యాక్టరీ బాగా లేకపోతేనేం? ఇంట్లో నన్ను బాగానే చూస్తారు; సందేహం లేదు; నే నెక్కడికిపడితే అక్కడికి ఇంచక్కపోవచ్చును; అయితే నా కేంపని వప్పగిస్తారూ, అని?" మునూ! ప్రశ్నపై ప్రశ్న వేసు కుని సమాధానాలను వెతుకుతున్నాడు. బజారుకు వెళ్ళే అవకాశం లభించింది. అదే పది వేలు. బజారులో అనేక తమాషాలు గిరిగమ్మత్తులు, ఇదివరకు శ్యాంనగర్‌లో ఎన్నడూ చూడని వింతలు! హాయిగా చూడవచ్చును; దిల్ ఖుషీగా తిరగొచ్చును. ఒహో! ఏమి బస్తీ అని! ఈ చివరనుంచి ఆ చివరవరకు కొట్టవచ్చినట్లు మేడలు' సింహ ద్వారాలు, గోపురాలు. దీని పేరు దౌలత్‌పూర్; ఇదివరకు తాను విన్న పేరే; వినడమేమి, చదివిన పేరే! తన హిస్టరీ పుస్తకంలో చదవడమేకాదు; దీని బొమ్మకూడా చూశాడాయె! 'ఉత్తర భారతదేశంలో ప్రసిద్ధికెక్కిన నగ రములలో దౌలత్‌పూర్ ఒకటి' మహారాజా దౌలత్‌సింగ్ గొప్ప చక్రవర్తి దీనిని నిర్మించాడని, అదేకాలంలో అయోధ్యను రాముడు పరిపాలిస్తూ వుండేవాడని తన గ్రామంలో తాతచెప్పిన కథ అతనికి జ్ఞప్తికి వచ్చింది. తాత చెప్పిన కథ పూసగుచ్చినట్లు అతని మనసులో తిరిగింది. దౌలత్‌పూర్‌లో అనేక యుద్ధాలు కరిగాయి. మహమ్మద్ గజ్నీ అనేక విగ్రహాలను ధ్వంసం చేసిన రాజు, సోమనాధ దేవాలయాన్ని దోచిన చక్రవర్తి, దీన్నికూడా జయించాడు. అయితే ఆ రాజు ఈ నగరాన్ని దోచుకున్నప్పుడు, ఇపుడు తాను చూసివస్తున్న దేవాలయాన్నికూడా దోచుకున్నాడా, లేదా? అనే ప్రశ్న అతన్ని వేధించజొచ్చింది. అయితే వొకటి. అక్బరుమాత్రం బహు దొడ్డ వాడు. దౌలత్‌పూర్ అర్చకులందరికి చెప్పలేనన్ని ధనరాసుల నిచ్చాడట; ఇచ్చి మీ మతాన్ని మీరు ఉద్ధరించుకోండన్నాడట! ఈ నగరంలోనికి మొగలులు రాకుండా, ఊరవతలనే సిక్కులు వాళ్ళను ఓడించేశారు సిక్కు లలో రంజిత్‌సింగ్ గొప్పవాడు; తనకింద పనిచేసేవాళ్ళకు రంజిత్‌సింగ్

ఈ పట్నాన్ని ఏలుకోండని యిచ్చివేశాడు. తరవాత ఇంగ్లీషువాళ్ళు దీనిని ఆక్రమించారు. అప్పటికింకా 'సిపాయి కలహం' జరగలేదు.

తన హిస్టరీ పుస్తకంలో చదువుకున్న పాఠాలన్నీ వరస వరసగా కళ్ళకు కట్టినట్లయి, అందులోని చక్రవర్తుల బొమ్మలు అతని మెదడుపై అచ్చొత్తినవి. రాజులు, చక్రవర్తులు, పెద్దపెద్ద పగిడీలతో, పగిడీలపై ఫించాలతో మెడలో, హారాలతో, చేతిలో ఖడ్గాలతో కిరీటాలతో రంగుల రాట్నంలోని గుర్రాలు ఏనుగులవలె గిర్రు గిర్రున అతని మనసులో తిరుగాడ సాగాయి. "మా ఊరు మొన్న మొన్ననే కట్టారు; ఈ నగరం అమ్మ బాబో, ఎప్పటిదో!" నగరం లోని పాతభవనాలను, నూతన భవంతులను, వీధులను, అంగడులను తలుచుకుని గాభరా ఎత్తాడు; ఆశ్చర్యపడ్డాడు. ఊరంతా చూశాడా, వాడికంటికి ఊరవతలనున్న రైలుస్టేషను, పక్కనేవున్న ఇంగ్లీషు దొరల బంగాళాలు నజరుగా కనిపించాయి. "అక్కడ దయాల్ ఇల్లుంటే బావుండునేసి" అనుకున్నాడు మునూ. మరి పెత్తనమంతా దొరలదే కదా, ఎందుకని ఈ పాడుపడిన కొంపల్ని తీసిపారేసి, తమ బంగాళాలవంటివి ఇక్కడకూడా కట్టలేదు? నిజమే, కడితే బాగుండేది! బంగాళాలు ఇక్కడకూడా వుంటే అందులో కుర్చీలు, బెంచీలు అందంగా పెట్టుకోవచ్చునే! "బంగాళాలుండనీ, మాననీ; మొత్తంమీద నే నిక్కడ కొచ్చాను.'.. ప్రభుదయాల్ పుణ్యమా అని చేర దీయబట్టికాని, లేకుంటే ఈపాటికి నే నేమైపోదును. ఇంకా ఆ రైల్లోనే ఈదురో దేవుడో అని ఏడుద్దును...అహా, కూడుదొరక్క చద్దును."

పరధ్యానంగా నడుస్తున్న మునూకు ముందు నాలుగు బారలదూరంలో ప్రభుదయాల్ నడుస్తున్నాడు. మునూ చర చర నాలుగడుగులువేసి దయాల్ చేతిని పట్టుకుని అతని వెంటపడ్డాడు.

* * *

"లేరా మునూ! లే! మొద్దునిద్ర!"

ప్రొద్దుటే తులశి బొంగురుగొంతు వినిపించసాగింది. మునూ మగత నిద్రలోనే వున్నాడు. ఆ కేకలు కలలో వినిపించినట్లు భావించి, అటుఇటూ దొర్లి బోర్లాపడ్డాడు. తులశి, వాడి కాలి బొటనవేలును మెలివేస్తూ నిద్ర లేపుతున్నాడు. మళ్ళీ గొణుగుడు, చెవిలో రొద ప్రారంభమయింది: "లేరా! లే! ఎంతలేపినా లేవడూ?"

మునూ మెల్లగా కనురెప్పలు తెరచి చూశాడు. నేలనున్న ఇసుక కళ్లకు కరకర తగిలింది. నిదురగొంతుకతో, బద్ధకంగా మూలిగాడు. "శే! చాల్లే నిద్ర. నేపో చూశాడా అంటే మైకం వొదలగొడతాడు!" మునూ గట్టిగా ఆవులించాడు. చేతులు చాచి వొళ్లు విరుచుకున్నాడు. కళ్లు నులుపుకుని చుట్టూ చూశాడు. ఇంకా బాగా తెల్లవారినట్లు లేదు. సంజవెలుగులో దూరాన నిద్రిస్తున్న మనుష్యుల కాళ్లూ చేతులూ కనిపించాయి. ఉదయ కాంతులు చీకట్లను తరిమివేస్తున్నాయి. కొండలలో గాలి గుడుగుడులు తీస్తోంది. కళ్లువిప్పి చూసేసరికి ఇది తన స్వగ్రామమనే భ్రమకలిగి పోయింది; తన గ్రామంలో నీలి ఆకాశం మూలల పర్వతశ్రేణులు, ఆకాశం భూమీ కలుసుకున్నచోట తెరలుకమ్మినట్లు కొండలు; ఆ కొండల నీడలు తన కనుగ్రుడ్లల్లో వచ్చి వాలినట్లు! ఆకాశంలో చిన్నిచిన్ని చుక్కలు పెట్టినట్లు పిట్టలు బారులుగా తోరణాలుకట్టి ఎగురుతున్నపుడు, ఆ పిట్టల గుంపులను చూస్తూ ఆవులను చేలగట్లకు తోలుకువెడుతున్నపుడు ఎంతహాయి! ఆకాశంలో ఎగురుతున్న పిట్టలు పర్వతాల లోయలమీంచి రెక్కల్ని ఊపుకుంటూ, క్రిందకు చూస్తూ కిచకిచ మంటాయి! శ్యాంనగరంలోని వింతలు అతనికి అంతగా జ్ఞాపకంలేనట్లే. బాగా ప్రొద్దుపొడిచేక అతను లేచేవాడు. అతనికి ఏ ఇల్లూ జ్ఞాపకానికి రానక్కర్లేదు. బాబుగారి ఇల్లుకూడా అంతే! ఏమిటుంది అక్కడ తను బావుకుందుకు! "నే నెక్కడున్నానో అని గింజుకుచస్తారు... నేను కనిపించలేదుకదా ఏమిటిచేస్తారో వాళ్లు? మా మావకు కోపంవచ్చి వుంటుంది...రాస్తాను. ఇక్కడ కులాసాగావున్నట్టు రాస్తాను, కానీ, మళ్లీ అక్కడికి రాననికూడా చెబతాను!"

తులశి పక్కచుట్ట చంకనుపెట్టుకుని గొంగళీ వీపున వేసుకుని "రా! పోదాం" అన్నాడు. నిద్రపోతున్న మనుష్యులను జాగ్రత్తగ దాటుతూ, మునివ్రేళ్లమీద నిలబడి నడుస్తూ ఇద్దరూ బయటకు వస్తున్నారు. వాతావరణం అంధకారమయమేకాదు; ముక్కిపోయిన వాసన. రాత్రల్లా గాలి బంధింపబడి దుర్వాసన వేస్తున్నది. క్రిందకు దిగుతున్నపుడు ముచ్చెమటలు పోశాయి. నూతిమీదనుంచి ఫ్యాక్టరీలోనికి, కిటికీ తొంగిచూస్తున్నది. కిటికీలోనుంచి దుమికి తులశి "నా చేయి అందిస్తానుండు; నెమ్మదిగా దిగు; కొత్త. పడతావ్"

మామూలు 'సార్వీసు' ప్రకారం మునూ చెట్టుకొమ్మలమీదనుంచి గెంతినట్లు ఛంగున క్రిందకు దుమికాడు.

తులశి సరంబీవద్దకు పోయి గుహాలావున్న గదిలోనికి ప్రవేశించాడు. నేలమీద రెండు మణుగుల శరీరం నిశ్చింతగా నిద్రపోతున్నది. అతనిపక్కనే మీద కాలు జాపుకుని బోంగా నిద్రపోతున్నాడు.

“లేరా! మహారాజ్! ఒరే బోంగా! లెండ్రా మీ అమ్మకడుపులు కాలా!” ఏనుగు గున్నవలె గుర్రుపెడుతూ ఒకడు, ఎలుగుబంటిలా చెవిటి మూగిముండాకొడుకు మరొకడూ ఒకరిమీద యింకొకరు పడుతూ ఎంతపిలిచినా లేవకపోవడం మునూకు తట్టుకాలేసుకొచ్చింది. ఇదివరకు బల్లలమీదనుంచి పీపాలలోనికి తొంగిచూసినట్లు, వాళ్ల మొహాంలోనికి తొంగిచూశాడు. “ఇదా వీళ్లు పడుకునేచోటూ” అని వింతపోయాడు. వాళ్లకంటె తనపని రాజాలా వుందనుకున్నాడు. ప్రభుదయాల్, పార్వతీ, గణపతి, తులశి పడుకొనేచోట, ఇంటి డాబామీద తనూ పడుకుంటున్నాడు. దయాల్ దయాస్వభావుడు. తాము వుండేచోటనే తనకూ జాగా యిచ్చి లాలనగా చూస్తున్నాడు. పార్వతీ ప్రభుదయాల్‌లు భోజనంచేస్తూ తననుగురించి ఏమేమో మాట్లాడుకోవడం విన్నాడు. మునూ నిద్రపోతున్నాడనుకున్నారు. కాని ఆలుమగలు, నిజానికి తనకు మాఁగన్నే పట్టింది, పార్వతి అన్నదికదా, “వీణ్ణి మనం పెంచుకుంటేనో! ఆనక కాలికీ చేతికీ ఔతాడు!” భర్త తల ఆడించాడు. పార్వతి మనసు చక్కెరలాటేది. తన తల నిమిరింది. రొట్టె యిచ్చింది. వెన్న అద్దుకుతినమంది. కాని ఆవిడెప్పుడూ నోరు మెదపదే! మూగనోము పట్టినట్లు. మొహం కొట్టవచ్చినట్లు వుంటుంది. కాని, నవ్వినపుడు, మాట్లాడుతున్నపుడు కలకల్లాడుతుంది, ఆమెఅంటే తనకు భయం; భయంకంటె మొగమాటం హెచ్చు.

“ఓయ్ మునూ! రా, ఇలావచ్చి కాస్త బొగ్గులు ఎత్తు. నేను బూడిద ఎత్తుతా” తులశి ఇనుపచట్రం తీసుకుని పొయ్యిబూడిదను యివతలకు, కుప్పలుగ లాగుతున్నాడు. మునూ త్వరగా క్రిందకు దుమికి యివతల కొచ్చిన బూడిదను పోగుపెడుతున్నాడు. బూడిదలో నివురుగప్పిన నిప్పు చేతికి తగిలి “స్స్...అమ్మమ్మమ్మ”అని చేతులు విదిలించుకుంటున్నాడు. కాలిన వేళ్ళను నోటితో “ఉఫ్ఫ్”మని ఊదుకుంటున్నాడు. బూడిదలో చేతులు పెట్టవద్దని ముందే హెచ్చరిక చేయకపోవడం తులశిదే తప్పు. తన తప్పును కప్పుకోవాలని “ఓరి బభ్రాజమానం! దా, దా! మెల్లిగా నీకే తెలుస్తుందిలే పని ఎలా చేయాలో...పాపం చేయి చురుక్కుమందేం! రామ రామ!”

చేతుల్ని వెనక్కులాగుకుని వేళ్ళను ఊదుకుంటూ, నొప్పితోపాటు ముఖ కవళికలను మారుస్తూ "అబ్బబ్బ" "హూఁ" "అమ్మయ్యా" అంటున్నాడు మునూ.

తనకు కొత్త ఉద్యోగం వచ్చింది. ఏపనైనాసరే అందరికంటే గొప్పగా చేయగలననే ఆత్మవిశ్వాసం అతనికి వుంది. అలాంటపుడు యింకా కొత్త ఉద్యోగంలో ఇలాగ వేలుపెట్టాడో లేదో చురుక్కుమంది! అడుగులోనే హంసపాదు. మునూ కాస్సేపు కూర్చుని ఆలోచనలో పడ్డాడు.

తులశి నవ్వుతూ "రా, రా! అలవాటుమీద అదే చేతనౌతుందిలే కాస్త నిమానుగా వుండు... పొయ్యిలో చేతులు పెడతారట్రా... హారి వాజమ్మా వాజమ్మ! చట్రమో గిట్రమో పట్టుకులాగాలి కానీ..."

మునూ పొయ్యి కెదురుగా ద్వారంవద్ద పడివున్న ఇనపచట్రం తీసుకు తెచ్చుకున్నాడు. పొయ్యిలోంచి బుగ్గిని పిల్లిలా బకురుతున్నాడు. బూడిద కుప్పకు దూరంగా నిలబడి బితుకు బితుకుగా పొయ్యిలో ఇనుపకాడను అటు ఇటూ తిప్పుతున్నాడు. చట్రం ఎటూ కదలదు; బుగ్గి ఇవతలకిరాదు. నిప్పంటే భయం; ఈ బరువేమిటి యింతుంది! వెన్నుపూస విరిగిపోతున్నదే! చేయి తిప్పడం కష్టంగానే వుంది. కోపం ముంచుకొస్తున్నది. చికాకుగా వుంది. తన గ్రామంలో ఇసకపర్రలమీద వాళ్ల మామ పాంకోడులు తొడుక్కుని నడిచినప్పుడుకూడా ఇలాంటి బాధ ఎరగడు. నుసినంతా ఎగరగొట్టి బొగ్గులను వేరుచేసిన తరవాత, నుసిలో వేళ్ళుపెట్టాడు. అబ్బ, ఎంత మెత్తగా వుంది, డాక్టరుబాబుగారు తొడుక్కునే తెల్లని సిల్కులాల్చీలా; ఎంత హాయిగా తగులుతోంది! నుసిపోగు చేయమంటే ఇక అడిగారా! ఓ! వెన్నెల కుప్పల్లా పోగులు పెట్టేస్తాడు!

"ఇంకా మీరు పొయ్యి ముట్టించలేదన్నమాట! ఏమర్రా...హుఁ" గణపతి గద్దింపు మొదట వినవచ్చింది. గద్దింపుతోపాటు అతని స్వరూపమే ఎదుట ప్రత్యక్షమయింది. చీంబోతులా మొహంపెట్టి ధుమ ధుమ లాడేడు. ధుమ ధుమలాడి వూరుకుంటే బాగుండును. ఛాతీ విరుచుకు పొడుచుకు వచ్చాడు. వీపుమీద తువ్వాలయినా కప్పుకోలేదు. నాపరాయిలా దిక్కుమాలిన వీపు!

తులశి తన సహజధోరణిలో యజమానిని చూడగానే, మునూను గద్దించాడు. యజమాని మనసునుబట్టి మసులుకుంటూ, యజమాని ఉత్తరువు

లను తనద్వారా సాటి పనివాళ్ళకు అందచేస్తూండడం తులశికి అలవాటు. ఈ అలవాటు అతని కొకవిధంగా ఫ్యాక్టరీలో ఫోర్ మెన్ హోదాను కల్పిం చింది: "చప్పున తెములు; పనయ్యేటట్టు చూడు. ఊఁ! చకచకా సాగి పోవాలి;"

తులశి గద్దింపులకు మునూ అదిరిపోలేదు; గణపతి చూపులకు జెదిరి పోయాడు. చీంబోతువలె బుసలుకొడుతున్న గణపతిని చూడనైనా చూడ కుండా, మునూ తన పని తాను చేసుకుంటున్నాడు. గణపతి పేరుచెబితే అతనికి హడలు. బాబుగారు బీబీజీలన్నా అంతభయం వుండేదికాదు. 'పుణ్యాం పుచ్చి యిక్కడ ఏదో పనంటూ ఒకటి దొరికింది; వీడేమిటి నాకూ, మెడ మీద కత్తిలాగ?' మానూ తనలోతాను భావించుకుంటున్నాడు. 'ఆఁ వీడు చేసేదేమిటెలే నన్ను! దయాల్ మంచివాడు; ఆవిడా మంచిదే; నేనంటే ఆవిడకెంతభిమానం! రాత్రి రొట్టెతోపాటు వెన్నపూసకూడా యిచ్చిందే, పాపం!'

మునూ భావపరంపరకు అంతరాయం కలిగేటట్లు తులశి కేకవేశాడు: "బూడిద ఓమూల వొబ్బిడిగా పొయ్యిరా గాడిదా!" పొయ్యిలోనున్న సగం కాలి ఆరిపోయిన పేళ్ళను ఏరి పోగు పెడుతున్నాడు తులశి.

కిటికీ దగ్గరనుంచుని ఆవులిస్తూ గణపతి "మహారాజ్ గాడేడి? బోంగా గాడు లేచాడ్రా! గాడిద కొడుకులు కుంభకర్ణుడిలా! హుఁ!" యజమాని పిలుపునందుకుని తులశి మేలుకొలుపులు పాడుతున్నాడు!" లెండ్రా మొద్దు ముండా కొడుకుల్లారా!"

సందులో వేసివున్న గుమ్మం గొళ్ళెం టక్ టక్ మని ఎవరో కొడుతున్న సవ్వడి వినిపించింది. తులశి ద్వారంవద్దకు వెళ్ళసాగాడు. కిటికీనుంచి క్రిందకు దూకి గణపతి "నీపని నువ్వు చేసుకో. నేను చూస్తాలే ఎవరొచ్చారో!" నసుగుకుంటూ గణపతి ముందుకు వెళ్ళేడు; "లంజ కొడుకులు... యింత పొద్దోయింది; యింకా వీళ్ళు లేవలేదు; వాళ్ళిప్పుడు వస్తున్నారాయె!" మేం వూళ్ళో లేనప్పుడు వీళ్ళన్ని తైతక్కలాడే వారో! తండ్రి సంతకెడితే పింతండ్రికి పుట్టినబాపతు! వీళ్ళని నమ్మమని ఎవడు చెప్పాడు! ప్రభా నేనూ ఊళ్ళో లేకపోతే వీళ్ళకాపూట పండుగే!"

బల్లచెక్కలమీద నిద్రపోతున్న కూలీలను తట్టి లేపుతూ "పందుల్లా తిని ఊరికే దొర్లుతున్నారు; లెండి! వెధవల్లారా!" మహారాజ్ కళే

బరాన్ని కాలితో ఒక తాపుతన్ని "మన్నుతిన్న పాములా పడుకున్నావురా పీనుగా! లే! లే!" అని ఉరిమాడు.

"ఆఁ ఆ! లేస్తా మహారాజ్!" అంటూ మహారాజ్ కదలకుండా ముడుచిపెట్టుకుని పడుకున్నాడు. కాస్సేపటిలో గుర్రులుతీయ నారంభించాడు.

తలుపు గొళ్లెం మళ్లీ టకటకమంది. "వుండుండు; వస్తున్నా" నని గణపతి కేకవేశాడు! పేడు తీసుకుని పడుకునివున్న మహారాజ్‌ను ఒకటి వేశాడు. అతను లేవలేదు. మళ్లీ యింకొకటి. మహారాజ్ క్రోధంతో కళ్లు విప్పాడు. కళ్ళు చింతనిప్పుల్లా వున్నాయి. అలసిన కన్నులతో యజమానిని చూశాడు. గణపతి మళ్లీ యింకొకటి వేశాడు; "గాడిదకొడకా! బారెడుపొద్దెక్కినా నిద్ర!"

గణపతి లేచి కూచుని ఆవులింతలు ప్రారంభించాడు. ఆవులింతలు 'ఊఊ' అనే మూలుగులు అతని బాధను వ్యక్తం చేస్తున్నవని అనుకుంటేతప్ప, గణపతి దెబ్బలు మహారాజుకు చీమకుట్టినట్లయినా లేదు. మందబుద్ధివంటి చూపులతో చుట్టూ కలయచూశాడు. నిద్దరవలన ఎరుపెక్కిన కనుగుడ్లలో నీరు మెరసింది.

"ఒక దుక్కను లేపడానికి యింకొక దుక్క కావాల్సొచ్చింది... ఇక యీ శషభిషలు నాదగ్గిర పనికిరావ్! ఎముకలు విరగ్గొడతా, జాగర్తగా. మసులుకో!"

ఈసారి గదిగొళ్ళెం మరీ చప్పుడవుతున్నది. గుమ్మం దగ్గరకు గణపతి వెళుతున్నకొద్దీ ధ్వని హెచ్చుతున్నది; అతనికి చికాకువేసింది. దెబ్బలుతిన్న మహారాజ్ మూలుగులు గణపతికి జాలికి బదులు క్రోధాన్ని కలిగించాయి. చేతనున్న దుక్క నవతలకు గిరవాటేసి, గుమ్మంవద్దకు చేరుకున్నాడు. దారిలో మునూ నించుని దొంగపాటుగా మాహారాజ్ కళ్ళల్లోకి జాలిగాచూస్తున్నాడు. జాలిజాలిపే చూపులతో ఒకరినొకరు పలకరించుకుంటున్నారు. ఇద్దరి కళ్ళ వెంట గిర్రున నీరుతిరిగింది. మునూ వైఖరి కనిపెట్టి గణపతి:

"వొడుపులకుక్కలా, దొంగలంజకొడకా! దొంగ దొంగ చూపులు చూస్తావేంరా? నీపనేదో నువ్వు చూసుకో! వాడిమీద జాలొకటా నీకు ... వీపు తీటతీస్తా ..."

తలుపు కొట్టిన దబదబ ...

"వుండండుండండి! వెధవ సంతాని!"

గణపతి తలుపు తెరిచేసరికి, లచ్చి గొంతుక వినిపించింది. మొహం పొట్టిగా దుబ్బుగా వుంది. గుండ్రటి మొహంమీద నవ్వు తొణకిసలాడు తున్నది. కన్ను చికిలించి కిల్లాడీ చూపులతో గణపతిని చూసి "ఎవరన్నా నవ్విపోతారు! పొద్దున్నే కృష్ణా రామా అనుకోక, పిల్లల్ని కొట్టడమా? అహాఁ! మంచి బాబువే!" లచ్చి యిత్తడి అడ్డబాసకున్న ఎర్రపూడి విస్సాటంగా తల ఆడించడంతో ఒకసారి మెరిసింది. లచ్చి వెంటవచ్చిన ముసలివాళ్ళు "రామ్ రామ్ సేఠ్‌జీ!" అని నమస్కరించారు. ముగ్గుబుట్టలా తలలు నెరిసి పోయి వున్నాయి. కళ్ళు బండిచక్రాల్లా లోతుకు దించుకుపోయాయి. శరీరం ముడతలుదేరి, గోనెసంచులవలె వేలాడుతున్నది. లోకంలోని కష్టాలన్నీ నుదుట గొలుసుకట్టులా వ్రాసివున్నట్లు మొహాలమీద ముడతలు! నడుస్తు న్నప్పుడు కాళ్ళు కడ్డంపడకుండా, మోచ్చెళ్ళకు మీదకు పట్టుకుని ఒకరివెంట ఒకరు లోనికి ప్రవేశించారు.

లచ్చి కిల్లాడీచూపులు గణపతికి హుషారునీయకపోలేదు. మనసు పరిపరి విధాల మళ్ళింది. చూపు తప్పించుకుని గబగబ గూడుదగ్గరకుపోయి గుడు గుడు గొట్టం వెతకడ మారంభించాడు.

లచ్చి పెద్ద గొంతుక చేసుకుని "ఒరేయ్ తులశీ! కాస్తంత చమురు ఈ ప్రమిదల్లో పోయి! పత్తి పట్రా, వొత్తుల్లేవ్".

మట్టిప్రమిదల్లో నూనెపోసి, వెలిగించుకుని, ఆ వెలుగులో కూలీలు పనిచేసుకుంటున్నారు.

గణపతి గుడుగుడులో చిలుము పోసుకుని, నిప్పుకోసం పొయ్యిదగ్గ రకు వెడుతూ, ఆడకూలీలను చూసి ఆగాడు: "రైట్ రైట్! అదీ పనంటే! కానీయండి, కానీయండ!"ని హెచ్చరించాడు.

పొయ్యిలో బొగ్గునేసి తులసి కిరసనాయిలు దిమ్మరించాడు. అగ్గిపుల్ల గీసి అంటించాడు. బొగ్గులు మండుతున్నవి. కాని పొయ్యింకా రాజుకోలేదు. గణపతి నిప్పుకోసం నిరీక్షిస్తూ నించున్నాడు. బానిసలను కొరడా కొసల్తో అదిరించే యజమానిలా బోరవిరుచుకుని నించున్నాడు గణపతి. మునూ బెదిరి పోతున్నాడు. హడలెత్తిపోతున్నాడు.

ఎంతకీ చిలుంగొట్టానికి నిప్పు దొరకకపోవడం అతనికి విసుగెత్తింది. మొహం ముడుచుకుని "ఆ మిగతా పొయ్యిల్ని కూడా రాజేయండి! పందుల్లా తిని కూచోక!"

లచ్చి అతని తిట్లకు అడ్డువచ్చి "బాబోయ్, తక్కువ్వాడివి కావు నువ్వు! ఆనక మేమేదో ఎత్తుకుపోయామంటావ్; ఇప్పుడే లెక్క పెట్టుకో, దిక్కుమాలిన ఏపిలు పళ్ళు!" గణపతి, లచ్చి వెంట వెళ్ళేడు. ప్రమిదలలో నూనె పోసేందుకు, తులసి సీసాపట్టుకుని గణపతి వెంట బయలుదేరి మధ్యలో చీకటిలో మాయమయాడు. మహరాజ్ నూతిలోంచి నీళ్ళు తోడుతున్నాడు. చేదలతో పీపాలలో నీరు ఊరికే గుమ్మరించి పోసేస్తున్నాడు. నీళ్ళకు పీపాలలోని ఆపిల్ పళ్ళు పైకితేలి అటు ఇటు చేపలవలె కదలుతున్నవి.

మరి బోంగాకింకా నిద్రమత్తు వదలనేలేదు. జోగుతూ, కళ్లింకా పూర్తిగా తెరవకుండా పొయ్యి వద్దకు చేరాడు. బొగ్గులు సవరిస్తూ కాస్సేపు ఆగి ఓ కునుకుతీశాడు. మళ్ళీ లేచాడు. తులశి యింకారాలేదు. నిద్రపోవచ్చు!

కిరసనాయిలు వాసనతో పొగ రేగుతున్నది. నల్లని పొగ సన్నగా మునూ తలమీదనుంచి వర్తులాలను చుడుతున్నది. మునూకిప్పుడు ఆలోచనలు లేవు. బొగ్గుల్ని అటూయిటూ కదిపాడు.

బార్లా తీసివున్న ద్వారంలోంచి గుప్పున మురుగువాసన వేసుకొచ్చింది. తడిసిపోయిన మన్ను కంపు, కుళ్ళిపోయిన పళ్ళు, గర్మసాలా, ఎసెన్సులవాసన! గాలి, వాసనతోపాటు, మునూ తలమీద ఇంత దూగర విరజిమ్మింది.

"చాలా తమాషాగా వుందే యిక్కడ! అంతా కొత్తే, అయినా ఫరవా లేదు. అంతా మనప్రదేశాలనుంచొచ్చినవాళ్ళేలే బాబు, బీబిజీలాకాదు. ఒక్క గణపతే పట్నవాసంవాడు!" మునూ తనను తాను సమాధాన పరచుకుంటున్నాడు.

పొగ దట్టంగా ఫ్యాక్టరీనంతా క్రమ్ముకుపోతున్నది. గాలివిసురుకు పొగ ఉక్కిబిక్కిరై సుడిగుండాలు తిరుగుతోంది. మబ్బులవలె ఫ్యాక్టరీని ఆవరించింది. పొయ్యిలో మంటలు ఉడతపిల్లలవలె గెంతుతున్నాయి. పొగ మబ్బులకు మునూ ఉక్కిరిబిక్కిరయాడు. ముక్కుశోణాలనిండా పొగకూరుకుపోతున్నట్లనిపించింది. కళ్ళవెంట నీరుకారుతున్నది. అతని ఆలోచనలన్నీ ఆగి

పోయాయి. నాసికారంధ్రాలలో దూరినపొగ అంతటితో విడిచిపెట్టినా బాగుండును. నోటిలోకి పోయింది. దగ్గుతెర వచ్చింది, గొంతుకను పట్టుకుంది. దిక్కుమాలిన పొగ, ఇదేంపొగ, యిదేం వాసన! గట్టిగా దగ్గి తుబుక్కున ఉమ్మేశాడు. చెవులు గళ్ళుపడ్డాయి. చెవులు ఎంత గళ్ళువేసినా, పొగ మబ్బుల అవతల ఎవరివో కేకలు' బొబ్బరింతలు వినిపిస్తున్నాయి. ఎవరిదింత పెద్ద గొంతుక ? ఆకాశం చిల్లులుపడేటట్లు !

"ఎవర్రా అవీ! ఏమిటర్రా అదీ! ఓరేయ్ ప్రభా !.. మాట్లాడరేం దొంగలణ్ణికొడుకులు !...వీడి తల్లిమొగుడూ !" కేకలతోపాటు విపరీతంగా వినవచ్చే ఉబ్బసపుదగ్గు. ఇక ఓపికలేక ఒగర్పు, ఆయాసం! కేకలు ఆగిపోయాయి. ఒగర్పు, దగ్గు వినవస్తున్నది. దగ్గుకూడా కోపిస్తున్నట్లే గురకలు పెడుతోంది.

చెవులు రిక్కించి మునూ వింటున్నాడు. ఇపుడింకొకరి కంఠధ్వని. ఇందాకటిది ముసలాడిది. ఇది ముసలిదాని గొంతుక.

"లంజకొడకల్లాలా ! యమదూతల్లా దాపరించార్రా మా పాలిటికి ! మీ ఫాక్టరీ కూలా. మీయిల్లు దిబ్బకాను ! మీ కళ్ళల్లో జిల్లేడుపాలొడా ! పొగ, పొగ, అయ్యయ్యో! ఇదేం పొగమ్మో! నేనేం చేతునే...వీళ్ళ జిళ్వాడ! ఇల్లంతా పొగయిపోయిందమ్మో...తలుపులు వేసుకునే వుంచాం... ఆగితేనా...మమ్మల్నిక కాపరం చేసుకోనీయరేమిటర్రా ! నిక్షేపంలాటిల్లు... సుఖం లేదమ్మో, సుఖంలేదు! గోడలన్నీ, తెల్లటి గోడలే తల్లీ, మొన్ననే పుట్టెడు గుల్లసున్నం ఉడికించివేశానే తల్లీ! నల్లవేసిన గోడలు! అయ్యో అయ్యో! పొగమూరి పోతున్నాయ్ !......ఎదటపడండి చెప్తా, వెధవల్లాలా, మీ పని! "

మునూ స్మృతిపథంలోని కొకతూరి శ్యాంనగరం, బీబీజీ ఆమె అరుపులూ గిర్రునతిరిగినై. బీబీజీ గొంతుకంత కఠినంగా కర్కశంగా లేక పోయినా, ఈవిడ గొంతుక పెళుసుగ కొట్టవచ్చినట్లు లేకపోలేదు. పొగలో చూచాయగా కనిపిస్తున్న తులశిని చూసి మునూ ప్రశ్నించాడు ; "ఎవరావిడ ?"

తులసిమొహం వివర్ణమైంది: "ష్ !" ఊరుకోమని సౌంజ్ఞచేశాడు. మంటవేస్తే పొగరాదు కదాని పొయ్యి గబగబ విసురుతున్నాడు. ఎంతకీ మంట రాకపోవడంచూసి, విసనికర్ర విసుగ్గాపారేసి, బోర్లాపడుకుని "ఉఫ్,

ఉఫ్" మని ఊదుకున్నాడు. ఊపిరితిత్తులు కొలిమితిత్తులుగాచేసి ఎంత ఊదుతున్నా పొగమాత్రమే కెరటాలుగ లేస్తున్నది.

"మీ తల్లికడుపు మాడా! ఎక్కడ దాపురించార్రా మాకు! మీ వ్యాపారం, మీలాభమేన్రా మీక్కావల్సిందీ? హాహీ! ప్రభా!...గణపతీ?"

తోడరుమల్లుగారు కేకలువేస్తున్నారు. ఆయన బి. ఏ. యల్. యల్. బి; వకీలు, మునిసిపల్ కౌన్సిలరు. తెల్లటి పైజామా, నల్లని వేస్టుకోటు, నల్లని మొహంమీద తెల్లటి తలపాగా; తోడరుమల్లు తన ఇంటి యివతల కర్ర చెక్కల ప్లాటుఫారంమీద నుంచుని కేకలువేస్తూ శృతికి తగ్గట్లుగా, చేతనున్న పొన్ను బెత్తం క్రింద 'టకీటకీ'మని కొడుతున్నాడు. కోపంతో మనిషి ఊగిపోతున్నాడు.

సగం సగం జారిపోతున్న ముసుగులోంచి కనిపిస్తూ బుంగమూతిపెట్టి తాటకిలా తోడరుమల్లు భార్య "అవునండీ! మీరింటవున్నారని తెలియదండీ? వెధవలకి! వీరీ! వీరని? వెధవపీనుగులు!"

"ఇవతలకి రారేం, గాజులు తొడిగించుకున్నట్లు!" వీధిలో గడబిడ విని ఈ సారి తోడరుమల్లు కొడుకు రామనాథ్ బయటకు వస్తూనే గావుకేకలు పెడుతున్నాడు: "ఇదుగో రండి! వచ్చి సజావుగా పోనీయండి వ్యవహారం; ఆనక ఏడిస్తే లాభం లేదు; ఇల్లూ, ఫ్యాక్టరీ కాళీ చేయించేస్తాం... రావుబహద్దూర్‌గార్తో ఏదో ఓ ఒప్పందానికి రండి!"

ఫ్యాక్టరీ అంతా పొగకుమల్లే నిశ్శబ్దం ఆవరించింది. పొగ యింకా రింగటాలు కొడుతూనే వుంది. వాతావరణం యింకా ఉద్రిక్తతగనే వుంది. గణపతి సందులోకి వస్తూ "చాల్చాలు... వెళ్ళండి... వెళ్ళండి! రాయ్ బహద్దూరైతే ఎవరికి లెక్క! ఎవరింట్లో వాళ్ళు రావుబహద్దూర్లే! మీకూ మాకూ సంబంధమేమిటయ్యా?"

"సంబంధం ఏమిటా? ఆఁ ఆఁ! ఇలారా, సందులోంచిరా...... సంబంధం ఏమిటో చూపిస్తా...నా తడాఖా ఎరగవులావుంది!"

"ఏమిట్రా అదీ, అబ్బాయీ! ఊరుకో! జాత్తక్కువవాళ్ళ నోట్లో నోరుపెట్టడం దేనికి? చిన్నంత్రమా పెద్దంత్రమా వెధవలకి! మాట్లొచ్చిన కుక్క యిస్కో అంటే యిస్కో అంటుంది! చాల్చాలు, పద, పోదాం."

తోడరుమల్లు భార్య నిజానికి ఇంట్లోకి వెళ్ళిపోయేదే; పొద్దున్నే తోడరుమల్లు కొడుకుతోపాటు గుర్రపుబగ్గీ మీద పూలతోటకు షికారు పోతూ వుంటాడు. హాయిగా షికారుపోయే వాళ్ళకీకుక్క జట్టీ లేమిటని తోడరుమల్లు భార్య అనుకుంది. లోనికి పోబోతున్నది. కాని గణపతి, తలుపు దగ్గరకు చరచరపోయి రామ్‌నాథ్ మెడ దొరకపుచ్చుకున్నాడు. సందులోకి ఒక్కతోపు తోశాడు. కిందకు పడిపోతున్న తన కొడుకును ఆపేందుకు, కాలు అదిమిపెట్టి నిల్చుని చేతికర్ర కేలమీదకొట్టి "హారి, వీళ్ళ తలపొగరూ !" అంటూ ఆశ్చర్యపోయాడు.

"మెల్లిగా అంటారు...తలపొగరు !...కళ్ళు నెత్తిమీదకొచ్చాయ్! నాలుగురాళ్ళు కళ్ళకు కనిపిస్తున్నాయి. భూమీ ఆకాశం కనిపించడంలేదు!"

గణపతి, రామనాథ్ మెడపట్టుకు క్రిందకు నెట్టగానే ఉడుకు మోత్తనంతో గబగబ వెనక్కి తిరిగాడు. ఒక్కసారి లంఘించి గణపతి మెడ అంకించుకుని నాలుగు చరిచాడు. దబదబ బాక్సింగ్ చేస్తున్నట్లు మరో రెండు గుద్దులు గుద్దేడు. ఫ్యాక్టరీలోనుండి మునూ తులశీ బొంగాలు పరుగెత్తు కివతల కొచ్చి దెబ్బలుతింటున్న గణపతిని చూసి హడలెత్తిపోయారు. గణపతి వెంట కుప్ప మీద పడిపోయాడు. పడిపోయినవాడు పడివుండక, అనవసరంగా రామనాథ్ నడుం పట్టుకుంటుకు ప్రయత్నించి విఫలుడయాడు. విఫలుడయినా బాగానే వుండును. మొహం చిట్లేటట్టు మళ్ళీ నాలుగుగుద్దులు తిన్నాడు. ముక్కుమ్మట నెత్తురు కారుతున్నది.

"తాగుబోతు, ఝూటాకోర్,. ఫుండాకోర్! వీడెదం! చెడిబతికిన గాడిదికి డబ్బువిలువేం తెలుస్తుంది? గౌరవమర్యాదలేవిటి" తోడరుమల్లు భార్య శాపాలు పెడుతూ, చేతులతో ఎత్తిపోతలు పోస్తున్నది.

సందులోని ఇళ్ళన్నీ కిటికీలు తెరచుకుని, ఆడవాళ్ళు ఆశ్చర్యంగా తొంగితొంగి చూస్తున్నారు. గుసగుసలాడుకుంటున్నారు. అడ్డంగా నిల్చున్న మునూ బొంగాలను వత్తిగించుకుంటూ, ప్రభుదయాల్ ముందుకువచ్చాడు. ముందు కురుకుతున్న గణపతినడుం చుట్టబెట్టి పట్టుకుని, రొప్పుకువస్తున్న రామనాథ్ కెదురుగ నిలబడి "మతిమాలినవాడితో మీకేం పని ! ఇదిగో; దీనికాకారణం నేను ! తగినబుద్ధి చెప్పండి !!" అన్నాడు.

"వీళ్ళ నెత్తికి బూడిదెత్తా! వొదిలేయ్ పీనుగుల్ని! రా, పోదాం! కళ్ళు దించుకుపోయి ఏడుస్తున్నారు...ఎప్పుడూ ఎరగని వెధవలకి నాలుగు రాళ్ళు కళ్ళకగ్పడుతున్నాయ్ మరి!..."

తోడరుమల్లు భార్య తిడుతున్న తిట్లను లెక్కచేయకుండా గణపతి రెక్కపట్టుకుని ఫ్యాక్టరీలోకి లాక్కువెడుతూ దయాల్ "వాళ్ళతో మనకేం పనీ? అనవసరంగా మనకెందు కీ జట్టీ? ఇంటివాడే చూసుకుంటాళ్ళే!... దెబ్బలు కొట్టారూ నిన్ను? హాఁ!"

గణపతి వొళ్ళు తెకతెక వుడికిపోతున్నది. మొహం ముకుళించుకు పోయింది. రామనాథ్‌మీద కలిగిన కోపం కూలివాళ్ళమీద కక్కుతూ కుర్రవాళ్ళమీద కస్సుబుస్సు మన్నాడు.

ప్రభుదయాల్ శాంతస్వభావుడు. "శాంతించు; శాంతించు. మనం క్రోధానికి లొంగిపోకూడదు" అన్నాడు వేదాంతిలాగ. గణపతి పిల్లవాళ్ళను అవతలకి నెట్టివేశాడు. పీపాలమధ్య బురదగుమ్మిలో దొర్లు పుచ్చకాయలాగ దొర్లిపడ్డాడు మునూ. బొంగా తల గూటికితగిలి బొప్పికట్టింది. చెక్కుకుపోయిన మణుకుల్ని సర్దుకుంటున్నాడు తులశి. అలాగే లేచి అందరూ తమతమ పనుల్లోకి వెళ్ళిపోయారు. బూడిద ఎత్తేందుకు మునూ వంగున్నాడు. డేగిశా బోర్లించి యిటుకపొడి కొబ్బరిపీచులతో పరపర తోముతున్నాడు బొంగా. తులసి డేగిశాలలో ఆకులను పడవేస్తున్నాడు.

ఇంత గడబిడ జరిగినప్పటికీ, మహారాజ్ కేమీ చలనం కలిగిందేకాదు. గుడ్డివాడు తోవంట నడిచిపోతున్న విధంగా, చేదలతో నీరు చేదు తున్నాడు. కాలిఎముక ముందుకు వచ్చింది. చనిపోయిన దూడపేగులవలె పిక్కలమీది నీలినరాలు ఉబ్బి వున్నాయి.

"ఓరి మహారాజ్! డేగిశాల్లో నీరు తోడరా భయ్యా!" తులశి ఆజ్ఞ ననుసరించి పీపాలలో బదులు డేగిశాల్లో నీరు నింపుతున్నాడు.

లోపలికి రమ్మనమన్న దయాల్ పిలుపునందుకుని మునూ తన యజమాని కేసి తిరిగి చూశాడు. రెండు చేతులు మూతిదగ్గరపెట్టి ఆడిస్తూ తినడానికి ఏదో వుంది రమ్మనమని మునూను దయాల్ సౌంజ్ఞచేసి పిలిచాడు.

మునూను లోనికి రమ్మని మామూలుగా పిలుస్తున్నాడేకాని, దయాల్ మనసంతా అటేవుంది. తోడరుమల్లుకీ గణపతికీ జరిగిన దెబ్బలాట చివికి

చినికి గాలివాన కాదుకదా అనుకున్నాడు... భయంలేదు. నమ్రతతో చేతులు రెండూ జోడించి రావుబహద్దూర్‌వారికి క్షమాపణ చెప్పుకున్నాడు. ఇక ఈ వివాదం యింతటితో ఆగిపోతుంది అనుకున్నాడు. కాని, తోడరుమల్లు అంత సులభంగా వీటిని మర్చిపోయేరకం కాదు. ఆయనకి గొప్పగొప్ప వాళ్ళందరితోను పరిచయం; స్నేహం.

గత యిరవై సంవత్సరాలుగా, దౌలత్‌పూర్ బార్‌లో ఆయన పేరు మార్మోగిపోయింది. వాగ్ధాటిలో, వాదనాప్రౌఢిమలో పేరుమోసిన లాయరు. ఎన్నో మగనాలి తగువులు, ఖూనీకేసులు ఆయన తలమీంచి ఎగిరిపోయాయి. డిఫెన్సు ఆయనకు తెలిసినంత కట్టుదిట్టంగా యింకొకరికి తెలియదని ప్రఖ్యాతి కొచ్చాడు. దొమ్మీ కేసులు ఎంతమోపయిన సాక్ష్యాలున్నా టుప్పున ఎగిరి చక్కా- పోవలసిందే!

ఆయన పలుకుబడి, ఠీవి, వాదనాబలం గమనించి ప్రభుత్వం ప్రాసిక్యూటర్ని చేసింది. ప్రాసిక్యూటరుగా పనిచేసినన్నాళ్ళూ కీర్తికి కీర్తి; పలుకుబడికి పలుకుబడీ - ఉద్యోగ విరమణానంతరం ఆయనకుగల ప్రతిష్ఠ పెరిగిందే తప్ప, తరగలేదు. ఏమంటే ప్రభుత్వంతో ఆయన సహకారం ఎప్పటిలా వుండనే వుంది. యుద్ధనిధి వసూలుచేయడమే కాక ప్రచారం చేశాడు. యుద్ధనిధికిగాను ఇరవైవేల రూపాయలు తనకు తాను సమర్పించుకున్నాడు. ఘనత వహించిన చక్రవర్తి ప్రభుత్వానికి నమ్మిన బంటు. దేశంలో శాంతిభద్రతలకు గొడుగునీడలుపట్టి శాసనాలనవిచ్ఛిన్నంగా అమలుజరిపేటప్పుడు చేదోడువాదోడుగా వుండడంవలన ప్రభుత్వం ఆయనకు 'రావుబహదూర్ బిరుదును' ప్రసాదించి తనను తానే గౌరవించుకుంది. యుద్ధసహాయానికిగాను మెచ్చుకొని భారతసామ్రాజ్య వైస్‌కమాండర్‌గా నియమించింది. పౌరసేవకు సంతసించి మల్లుగారిని, ప్రభుత్వం దౌలత్‌పూర్ కౌన్సిల్‌కు అధికారసభ్యునిగా నామినేట్‌చేసింది. గంగిరెద్దులా మోయలేని ఈ బిరుదుల్ని మల్లు మీదవేసుకుని ఉబ్బితబ్బిబౌతూ వుంటాడు. ఆయన కదొక సరదా. ఒక అలంకరణ. ఊరిలోని ప్రజలకు ఈ బిరుదులంటే అర్థమేమో తెలియదు. అయినా, ఆయనంటే వారికి ఎందుకో తెలియని తగని గౌరవం!

గత రాజకీయ పోరాటంలో దౌలత్‌పూర్ పోలీసుల దమననీతి ఎలా వుంటుందో రుచిచూసింది. రావుబహదూర్‌గా రప్పుడు రాత్రికి రాత్రి లాడ్జీలాలూసుగూ మూటకట్టుకుని దౌలత్‌పూర్ కోటలోకి ఉడాయించేశారు.

సతీసమేతంగా యిల్లు ఖాళీచేసిన మల్లుగారి, ఐవూ, జాడా లేకపోగా "రావు బహదూర్‌గా రెక్కడంటే ఎక్కడ"ని ప్రజలు ప్రశ్నించుకున్నారు. కొంత మంది ఆయన్ని "దేశద్రోహంటే దేశద్రోహ"ని అంటే అన్నారుకాని, ఆయనంటే ప్రజలకు భయభక్తులు లేకపోలేదు. ఆయనంటే అందరికీ భయమే! ఆయన గుర్రబ్బగ్గీలో పెద్దపిల్లవాడిని కూర్చోబెట్టుకొని షికారుపోతుంటే వీధిలోకూర్చున్నవాళ్ళు లేచిపోతారు. నించున్నవాళ్ళు చేతులు జోడించి "బాబ్బాబ్ దణ్ణాలండి దణ్ణా" లంటారు.

ఆయనంటే లోపల'గుర్రున్న'వాళ్ళుకూడా సలాములుచేస్తారు. ఇదంతా తెచ్చిపెట్టుకున్న నమ్రతని ఆయనకీ తెలుసు. వీళ్ళ పాడుమొహాలు ప్రొద్దున్నే చూడడం యిష్టంలేకనే, ఊరిచివరనున్న తన స్వంత బంగళాలలోకి కాపురం ఎత్తేదామనుకుంటూ వుండేవాడు. కాని ఆ బంగళాలను దొరలకు అద్దెకిచ్చేడాయె! నెల తిరిగేసరికల్లా ఫస్టున ఫస్టుక్లాసులాటి రూపాయలు వద్దుమొర్రో అన్నా వచ్చిపడుతోండె! 'పోనీ, ఒక బంగాళా అద్దె పోతుందిలెమ్మని, నాది కాదనుకొని' కాపురమున్నా, దొరలపొరుగు. భార్య చదువూ చట్టుబండలు తెలియనిది. ఇంగ్లీషు ఆచారాలు, సంప్రదాయాలు ఎరిగిన మనిషికాదు. వాళ్ళతో కత్తుకలియదు. ఇక్కడయితే ఊరిమధ్య అన్నీ చిన్నచిన్నకొంపలు. తన భార్య యిరుగుపొరుగు అమ్మలక్కలతో పిచ్చాపాటీ చెప్పుకోవచ్చును. అప్పుడప్పుడు తగుమాత్రం చిలిపిజట్టీలు వచ్చినా, తకరులేదు. నిక్షేపంలాటి ఈ సదవకాశాన్ని మల్లుగారి భార్య జారవిడుచుకుందుకు సుతరాం యిష్టపడదు.

పక్కన వున్న ఫ్యాక్టరీ పొగలుచిమ్ముతూ యిల్లంతా మేఘావృతం చేస్తుంది. గదుల్లో పొగ, చీడీలనిండా పొగ, కూచుంటే పొగ, నించుంటే పొగ! ఇక్కణ్ణించి ఎక్కడికైనా పోవాలనే తలంపు మల్లుగారికి కలగక పోలేదు. ఈ సారి ఆ కోరిక గట్టిగానే పట్టుకుంది. కాని, ఆయన యిల్లు వదలి పోతున్నాడనే గాలికబురు చెవినిపడిందంటే చాలు, యిరుగుపొరుగు కుటుంబీకులకు ప్రాణం చివుక్కుమంటుంది. ఆయన ప్రభుత్వపరంగా చేసిన ద్రోహాలనన్నిటినీ విస్మరించి, ఆయనను వెళ్ళిపోవద్దని ప్రాధేయపడేవారు. "తమరు వెళ్ళిపోతే మాకింక నిలవనీడేదీ? ఈ వీధిలో రౌడీవెధవలు మమ్మల్ని కాపరం చేయనిస్తారాండీ? మీ పొరుగు మాకు చస్తే వస్తుందా మరి?" అని బ్రతిమాలుకున్నారు. తోడరుమల్లుకు గొప్ప గొప్ప

ఇంగ్లీషుదొరలతో స్నేహం. అది ఇరుగుపొరుగుల కంటికి ఒక గౌరవం. వీధిలోనివారంతా బతిమాలుకుంటున్నపుడు, తాను లెక్క చేయకుండా కాపరం ఎత్తివేసి ఇంకొకచోటికి పోవడం తోడరుమల్లుకు భావ్యంగా తోచలేదు. వాళ్లమధ్యనే, బతికిన నాలుగునాళ్లూ నిశ్చింతగా గడిపేద్దా మనుకున్నాడు. పొరుగున ఫ్యాక్టరీ పొగ కాస్త ఉక్కిరిబిక్కిరి చేస్తున్నదే కాని మిగిలినదంతా నివాసయోగ్యంగానే వుంది. ఫ్యాక్టరీవాళ్లని తగిలివేయమని దత్తు సోదరులకు నచ్చచెప్పి చూశాడు. పాడుబడిన ఆ కొంపకు అప్పనంగా వస్తున్న అద్దెను దత్తుసోదరులు పోగొట్టుకోదల్చుకోలేదు. తోడరుమల్లు వినతి వ్యర్థమైంది. ఇక చేసేదేమీ లేక, తోడరుమల్లు ఫ్యాక్టరీ వాళ్లనే బాధించి చూశాడు. అదిరించాడు; బెదిరించాడు. ప్రయోజనం లేకపోయింది. లేకపోగా సిగపట్లగోత్రంవరకూ పెరిగింది గ్రంథం. ఫ్యాక్టరీనుంచివచ్చే పొగ నలువైపుల కమ్మకుండా ఒక చిమ్నీ కట్టిస్తే ఇంత రాద్ధాంతం ఉండదనే సంగతి తోడరుమల్లుకూ తోచిందికాదు; అతని భార్యకూ తెలిసిందికాదు. పోనీ గణపతి, ప్రభుదయాల్ల కంతకన్నా తోచిందికాదు.

వీధిలో నలుగురి ఎదుట గణపతి శివాలెత్తి నానా కూతలూ కూయడం రావుబహద్దూర్ హోదాకు చిన్నతన మనిపించింది. ఏమీ జరగనట్లు ఊరుకుంటే నలుగురిలో నామోషి. వెంటనే తోడరుమల్లు హెల్తాఫీసరుకు ఫిర్యాదు రాసిపడేద్దామనుకున్నాడు. దుక్కకాటుకి చెప్పుదెబ్బ. ఈ దెబ్బతో కోరలు తీసిన పాములా పడివుంటారు పీనుగులు. హెల్తాఫీసరు తనకు స్నేహితుడు. తను కౌన్సిల్‌లో మెంబరుగావున్నపుడు అతనూ పనిచేశాడు. ఇంకనేం ! రోగం ఇట్టే కుదురుతుంది. ఫుల్స్కాప్ కాగితం చించి అరసున్నాలైనా మరవకుండా అర్జీ దాఖలు చేసుకున్నాడు :

"మహారాజశ్రీ డాక్టర్ ఎడ్వర్డు మగ్గొలిరిజాంకుస్ ఎస్క్వైర్; ఎం.ఏ; డి. పి. హెచ్., యల్. ఆర్. సి. పి. యమ్మార్‌సి. యస్. మరియు యఫ్. (ఆక్సుఫర్డు) దొరవారి దివ్యసముఖమునకు :

తమ భృత్యుఁడున్ను రిటైరుఁడు పబ్లికు ప్రాసిక్యూటఁరునూ, పంజాబ్ హైకోర్టువం దడ్వకేటుయును, ప్రస్తుతము దౌలత్‌పూరు కాపురస్థుడు నయిన సర్ తోడరుమల్లు, బి. ఏ., యల్. యల్. బి, కె. సి. ఐ. ఇ., వ్రాయించి దాఖలు చేసుకున్న అర్జీ విన్నపములు :

గౌరవనీయ మహాశయా,

ఇన్నినాళ్ళుగా తమకు నా హృదయపూర్వకాభివందనములుఁ జెప్పనందుకు మన్నించఁగోరెద. తమయందు నాకుగల భక్తిగౌరవముల నపుడపుడు జాబుల మూలముననైననుఁ దెల్పియుండవలసి యుండెడిది. కాని అది యేమి కర్మమో యేమో, అందులకు పిసరంతయు వీలుఁ జిక్కినదే కాదు. నా యీ అపరాధము నెట్లు సమర్థించుకొనవలయునో నాకే దురవగాహ మయ్యెడిని. ఏలనన; అయ్యది సమర్థనీయముఁ గానట్టిది. అందుచే తమ కీ పత్రము నిపుడుఁ బంపుకొనుచున్నాను. నే నే స్వయముగ తమను దర్శించి, దాఖలు చేసుకొనవలసి యుండ, యివ్విధముగ లేఖఁ బంపుట కెంతయో సిగ్గగుచున్నది. ఏది యేమైనను తమ కొక విన్నపము. మీ పేరెల్లవేళల నామది స్మరించుకొనుచునే యుండును. తమకు నా కాత్మీయులు. మన స్నేహము ఇవ్వాళిటిదికాదు. మన మిద్దరము పురపాలక సంఘమునఁ నున్ననాటినుండియు అంతరంగిక మిత్రులమైతిమి.

ప్రకృతము, ఘనతవహించినఁ దమ రొకతూరి "కేట్ కిల్లర్స్ లేను" నకు దయసేయవలెనని నా ప్రార్థన. మాకు పొరుగు నేయున్న కర్మాగార మన్నివేళల నూరక అదేపనిగ రొదరొద సేయుచున్నది. రొదయైనను నెట్లో భరింతుము. కర్మాగారమునుండి వెలువడు పొగ వీధినంతయు క్రమ్మి, క్రమ్ముటయే కాక, గృహములను మేఘమండలముమాడ్కి సేయుచు ప్రాణమును విసిగెత్తించుచున్నది. రాక్షసిబొగ్గు దుర్వాసనచే ప్రజల యారోగ్యము ధ్వంసమగుచున్నది. 'ఆరోగ్యమే మహాభాగ్య'మనెడి నుడి కలదుకదా!

ఒక నాడీ విషయముఁ గర్మాగారాధిపతితో విన్నవించగా, నా కుమారు నెంతయో నాతడు రభసఁ జేసెను. చివరకు గణపతియను నాతడు నా పుత్రునిపైఁ జేయిచేసుకొనెను. ఎంత వారించినను వా డూరకొనక మా వానిపై గలియబడెను. నా కుమారుని వ్రేళ్లు నలిగిపోయినవి; మొగమా గాయమాయెను. ఇట్టిపరిస్థితులఁ జక్కదిద్దుటకు తమ రాక ఎంతయో జరూరుకదా! నా కది గౌరవహేతువు.

ప్రభుత్వమునకు నేఁ జేసిన సేవ మీకు విదితమే. ఘనతవహించిన వైస్రాయిగారి యుద్ధనిధికి నే నిరువదివేల రూప్యములు విరాళమిచ్చియుంటిని. నా రాజభక్తికి సంతసించి ప్రభుత్వమువారు నాకు 'నైట్ హుడ్' బిరుదమును బ్రసాదించిరి. కీర్తిగాంచిన సామ్రాజ్యమునకు నేఁ గావించిన సేవలను మదినిడుకుని న న్నా ధూమబాధావిముక్తునిగఁ జేసెదరని విశ్వసించుచున్నాను.

ఆ పొంగఃజికామను కలవరపాటును గలుగజేయుచున్నది. దుఃఖమునకు హేతువగుచున్నది. ఆద్దానిని భరింప దుస్సహము.

తమ ధర్మపత్నికి నా భార్య ప్రణామములని చెప్పుడీ!

తమ విశ్వాసపాత్రుడు, సేవకుడు,
తోడరుమల్లు.

దురదృష్టవశాత్తూ యీఉత్తరాన్ని హెల్తాఫీసరు ఖాతరుచేయలేదు. తాను కోరినట్లు డాక్టర్ మగ్గోబ్యాంక్సు సందుల్ని పరిశీలించడానికి రాకపోతే మానె! పోనీ రాసిన వుత్తరానికి జవాబైనా ఈయలేదు. తోడరుమల్లుకు సహజంగానే కోపం వచ్చింది. సెప్టెంబరు మొదటితేదీన జరగబోయే మ్యున్సిపల్ కౌన్సిల్ సమావేశంలో అమీతుమీ తేల్చివేసుకుందామనుకున్నాడు.

అనుకుంటున్న సెప్టెంబరు ఫస్టు రానేవచ్చింది. పెందరాళే లేచి, బగ్గీ ఎక్కి పట్నంలోని ఉద్యానవనాలకు షికారువెళ్లాడు. అక్కడనుంచి యింటికి రాకుండా సరాసరీ మీటింగుకు బయలుదేరాడు. మీటింగుకింకా ఒక గంట వ్యవధి వుంది. ఎండ తీవ్రంగా కాస్తున్నది. మల్లుగారికి ఆదుర్దా, కోపం జాస్తీ అవుతున్నాయి. తన కార్యభారం మాటిమాటికి జ్ఞాపకానికివచ్చి గుండెల్లో బరువుదించుకుంటున్నది. చెమటలు కక్కుతున్నాడు. ముంచుకువచ్చే రోషంతో కావేషితో చేతిలో బెత్తం ఊపుకుంటూ మధ్యమధ్య దగ్గుకుంటూ టౌనుహాలు చీడీలో పచారు చేస్తున్నాడు. ఉబ్బస రొప్పుకొస్తున్నది.

ఎట్లాగయితేనేం, టౌనుహాలులో పదిగంటలు వేశారు. కమిటీ సమావేశమయే గదిలోనికి ప్రవేశించాడు.

మొట్టమొదట సమావేశానికి హాజరైన సభ్యుడు తనొక్కడే. మరెవరూ లేరు. తను శ్రీ. చుక్క ఎవరో చూడాలనుకున్నాడు. అరగంట గడిచింది. ఎవరూ రాలేదు. గంట గడించింది. ఎవరూ వస్తున్నట్టు అలికిడిలేదు. ఒక నౌకరుమాత్రం హాలులోనికి ప్రవేశించి కుర్చీలు, బెంచీలు సర్దుతున్నాడు. బ్రష్‌తో దుమ్ము దులుపుతున్నాడు. అరగంట గడిచింది. కార్యదర్శి మిస్టర్ హేమ్‌చంద్ బి. ఏ (కాంటబ్) దర్శనమిచ్చాడు. మనిషి వయసులోనే వున్నాడు. కళ్లకు పల్చని అద్దాలు. వస్తూనే వినయవిధేయతలతో తోడరుమల్లుకు నమస్కారం చేశాడు. వంగి వంగి సలాములు పెట్టడం అతనికి అల

వాటే. అతని ఉద్యోగం మున్సిపల్ కౌన్సిలర్ల దయాధర్మభిక్షమీద ఆధారపడిందాయె!

ఫ్రాక్‌కోటు జేబులోంచి బంగారు గడియారం బయటకు తీసి, చేతిమీద పడుతున్న వెండిగొలుసును వొత్తిలిగించి తోడరుమల్లు "ఏమయ్యా, బాబూ హేమ్‌చంద్! పదకొండున్నరయింది. ఎవరూ ఫికర్లేదే?"

నుసి దులుపుకుంటూ రెండువేళ్ళ మధ్యనున్న సిగరెట్టును ఒక్క పీల్పు పీల్చి, హేమ్‌చంద్ "తమకు కొత్తగా తెలియన్దేముందండీ సార్! ఈ లల్లాల దగ్గరే అంత!" హేమ్‌చంద్ మినిట్సుబుక్కు తీసుకుని గత సమావేశపువివరాలను ఈవేళ రాసుకుందు కుపక్రమిస్తున్నాడు: "అన్నటైముకి తెగేసి పనిచేయనివాళ్ళకీ, లోకల్ సెల్ఫు గవర్నమెంటేమిటి, మల్లు గారూ?"

అతనన్నమాటలు అక్షరాలా నిజమని మల్లుకు తెలుసును. కౌన్సిలర్లెవరికీ డొక్క చింపితే అక్షరజ్ఞానంలేదు. అంతా వ్యాపారస్థులే. కాగితంమీద సంతకం పెట్టడం అలావుంచి, వేలుముద్రకూడా ఎక్కడవేయాలో తెలియదు. కౌన్సిలులో చర్చించే ఏ విషయమూ తలకెక్కిన పాపానపోదు. దత్తుసోదరులమీద తానుచేసిన ఫిర్యాదుపట్ల, హెల్తాఫీసరు నిర్లక్ష్యంపట్ల తగు చర్య ఏం తీసుకోవాలో తెలుసునా వీళ్ళకు! ఉద్యోగంనుంచి తక్షణం, మారుమాటాడకుండా హెల్తాఫీసరును బర్తరఫ్ చేయవలసినదిగా ఇంకో గడియలో తాను కౌన్సిలుముందు వేడివేడి తాజాఉపన్యాసం చేయబోతున్నాడు.

అందుకుగాను బ్రహ్మాండమైన ఉపన్యాసం హిందూస్థానీభాషలో తయారు చేసుకుని అట్టేపెట్టుకున్నాడుకదా, ఆ హిందూస్థానీమాటలు పంజాబీ లల్లాకు పోనీ బోధపడుతుందా?

అకస్మాత్తుగా వుండుండి హేమ్‌చంద్ అందుకున్నాడు: "ఏమండోయ్! తోడరుమల్లుగారూ! ఫ్యాక్టరీపొగ గురించి మీ రేదో కంప్లెయింటు పెట్టినట్లున్నారే! ఆఁ! ఏం లేదు! హెల్తాఫీసరుగారూ నాకా కాయితం చూపించార్లెండి. పాపం ఆయనకు ఆ గల్లీల్ని తనిఖీ చేద్దామనే వుందండీ! కాని టైమో? ఊపిరి పీల్చుకోందుకూడా వ్యవధి లేదనుకోండి! కాని ఎప్పుడో ఒకప్పుడు మీతోనే వద్దామనుకుంటున్నారు............బహుశా మనం, లోకల్ గవర్నమెంటు ఆక్టు రెగ్యులేషను 317 పేరా 10 ప్రకారం చర్య తీసుకోవచ్చేమో........."

" మిస్టర్ హేమ్‌చంద్! ఈ శషభిషలు నా దగ్గర పనికిరావు. మొట్ట మొదటి సంగతి, ఈ హెల్త్ఆఫీసరుమీదే కంప్లెయింటు పెట్టదల్చుకొన్నాను ముందు ఆ విషయం ఎజండాలో కెక్కించండి."

" అమ్మమ్మమ్మ! ఎంతమాట, రావుబహద్దూర్ గారూ! కౌన్సిలు మీటింగులో ఏ విషయం శాంతంగా చర్చించడం పడదని తమకు తెలియదా చెప్పండి, నాచేత చెప్పించాలని తమ ఉద్దేశం కానీ! కౌన్సిలర్లందరూ గవర్నమెంటుకు యిచ్చకపురాయుళ్ళే కదా!

ఇందులో ఒక్కడికైనా ఓ రూలూ, రైమూ, పురపాలన సంగతీ తెలుసునంటారా తమరు? మీ కంపరి సంగతి అట్టుగుట్టు ఆనవాళ్ళతో తెల్సునాయె. కాదూకూడదని దీన్ని ఎజండాలో కెక్కిస్తామే అనుకుందాం. అపుడేమవుతుంది? చురన్జీలాల్ ఏకబిగిని మూడుగంటలసేవు మనమీద తుపాను ప్రారంభిస్తాడు. షేక్ ఇఫ్తికారుద్దీన్ సంగతి సరేసరి! అగ్గిరాముడై పోతాడు. సర్దార్ ఖరక్‌సింగ్ నిప్పుతొక్కిన కోతి; గడ్డం సవరించుకుంటూ కస్సుబుస్సులాడతాడు; తై తై మని తైతక్కలాడతాడు. ఎవరేది మాట్లాడుతున్నారో ఎవరికీ తెలీదు. ఏం మాట్లాడుతున్నారో మాట్లాడుతున్నవాళ్ళకే అర్థంకాదు. మీ ప్రతిపాదన ప్రతిపాదనలాగేవుండిపోతుంది. తీర్మానం ఓటుకేరాదు. ఇంతకీ ఇంగ్లీషు ఆఫీసర్ని ఎవరండీ బర్తరఫ్ చేసేది? తలటక్కెక్కిందీఅంటే గవర్నమెంటు కౌన్సిల్‌నే సూపర్‌సీడు చేసేస్తుందాయె!.........ఉండండుండండీ! డాక్టరు మర్జోరీ బ్యాంక్స్ ఆఫీసులోనే వున్నాడు. అడిగొస్తా. అనవసరగొడవ మీతో ఆయనకెందుకు? మీరూ గవర్నమెంటు మనుషులేనాయె! మీకుమాత్రం యీ ముసలి కాలంలో ఇంగ్లీషువాళ్ళతో తగాదాలు దేనికి? వెంటనే మీతో బయల్దేరి గల్లీలు తనిఖీ చేయమని దొరగారికి చెప్పొస్తా."

తోడరుమల్లుకు కూడా తగువుపెట్టుకోవడం ఇష్టంలేదనే చెప్పాలి. పదిమందిలోను పీక్కినపడ్డం అతనికీ శ్రేయస్కరం కాదు. బజారులో నలుగురు చూసేటట్టు బగ్గీలో ఇంగ్లీషు ఆఫీసరుపక్క కూర్చునివెళ్ళడం రాజసీవిగా వుంటుంది. దొరతో తనిఖీకివెడితే అదీ ఒక అందమే. భారతదేశంలో ఆంగ్లేయులుండడం ఎంత యిష్టంలేకపోయినా, చాలమందికి తెల్లఆఫీసర్లంటే మోజు. వాళ్ళతో పరిచయమంటేనే మహాసంబరం. మల్లు అన్నాడుకదా: "ఫస్టుగావుంది. త్వరగావెళ్ళు. తునితగువు తెల్లార్తుంది."

హేమ్‌చంద్ లోనికివెళ్ళి డాక్టరు మర్జోరీబ్యాంక్స్‌ను పిలుచుకు వచ్చాడు. హెల్తాఫీసరు పొట్టిగి త్తవంటి మనిషి. నలభైసంవత్సరాలప్రాయం. బట్టతల. పల్చని పెదవులకింద చిరునవ్వు చిందుతుండగా, పోలోటోపీ చేత పట్టుకుని "గుడ్‌మార్నింగ్ సర్ తోడర్‌మల్! మన్నించండి! మీ ఉత్తరానికి జవాబిచ్చేందుకు తీరికే లేకపోయిందండీ! ఇంతకీ ఊళ్ళోలేనాయె. లాహోర్‌లో క్రికెట్ ఆడేందుకు పోవలసివచ్చింది."

ఇంతకోపం, దర్జా ఏమయిపోయినవో ఏమో, మరి తోడరుమల్లు అతి నమ్రతతో "గుడ్‌మార్నింగ్ సాహేబ్!" అని విన్నవించుకున్నాడు.

"రండి కార్లోకి రండి" అని దొర ఆహ్వానించాడు. దొర ఎప్పుడూ ఉల్లాసంగా వుండడానికని ప్రయత్నిస్తాడు. టెన్నిస్, క్రికెటు, పోలో ఆడతాడు. విస్కీబుడ్లు ఖాళీచేస్తాడు. ఆటలు, త్రాగుడు లేకుంటే ముసలితనం ముసురుకు వస్తుంది. యవ్వనంలో నవనవలాడుతూంటేనేకాని, నాజూకు దొరసాని నచ్చదు. తన భార్యప్రేమను పొందడానికి పైలాపచ్చీసుగా వుండడమే మార్గం. ఆవిడ అభిమానం కోల్పోయిననాడు తనకు సుఖమన్నదే లేదు!

దొరకు గుర్రపుబగ్గీ అంటే అరికాలమంట. దానిలో కూచుని వెడుతుంటే తోవమ్మటపోయే ప్రతీభడవా నమస్కారాలంటూ చేతులెత్తుతూ వుంటాడు. ఇదొక న్యూసెన్సు. దీన్ని తప్పించుకోవాలంటే మల్లును తన కారులో కూచోబెట్టుకుని తీసుకుపోవడమే శరణ్యం. లేకుంటే మల్లు తన బగ్గీ ఎక్కుదాం రమ్మని దొరను పిలుస్తాడు.

దొర తనకారులోనికి రమ్మని ఆహ్వానించేసరికి తోడరుమల్లు ఆనందం పట్టతరంకాదు. దొరగారి పక్క తనుకూర్చుని కారు కుదుపుతూ ఊళ్లోంచి వెడుతూంటే దాన్లో వుండే రజ్జు అడిగారా! ఊరు ఊరంతా విరగబడి చూస్తుంది. పేటపేటంతా హడలు "వెరీగుడ్ సాహెబ్".

దొరగారు కారుదగ్గరకు అడుగులు వేస్తున్నారు. ఆ నడకలోని రాజతీవి! ఆయన వెనకాలే బెత్తం ఊపుకుంటూ తోడరుమల్లుగారు తాబేటి నడక. ఆదర్జా మరొకరికి రమన్నారాదు. దొర కారులో చతికిలబడుతూ "ఈ కారు మామిసెస్ మొన్ననే పుట్టింట్నుంచి తెచ్చుకుంది. సరికొత్తకారు. న్యూబ్రాండ్ ఫోర్డు! మీమటుక్కిది బాగులేదూ?"

"నచ్చకపోవడమేమిటి? పుష్పకవిమానం!"

దొరపక్కన మల్లు కూలబడ్డాడు. డ్రైవరు సుచసింగ్ కార్లో కూచుంటూ "రావుసాహెబ్ గారింటికేనా, హుజూర్ !"

"యసెస్"

కారు వేగంగా వెడుతున్నది. ఇంత వేగంలో గాజుతెలుపులమధ్య తను దొరగారిపక్కన కూచుని వెడుతున్నట్లు బస్తీలో ఎవరికీ కనిపించదే! మల్లు కొంచెం నిరాశపడినా, కారు కుదుపులకు మనసు సముదాయించుకున్నాడు. సీటు మెత్తగా వుంది. స్ప్రింగిస్తోంది. సుఖంగావుంది. అదేచాలు.

కారు క్లాక్ టవరు స్క్వేరుదాటింది. కేటీ కిల్లర్సుసందు దగ్గరపడుతున్నది. ఇవన్నీ యిరుకు సందులు. వీటిల్లోంచి కారెలా వెడుతుంది ! నడవాలి కాబోలును. దొరకు మతిపోయినట్లయింది. ఇలా సందులు గొందులు వుంటాయని ముందే ఊహించుకోవల్సింది. పొరపాటైపోయింది.

హెల్తాఫీసరుగారు కారుదిగి నడుస్తున్నారు. వెనకాల తోడరుమల్లు అడుగులకు మడుగులొత్తుకుంటూ బయలుదేరాడు. తాను దొరతోకలసి వెడుతున్నానని సాహుకార్లంతా ఆశ్చర్యపడాలని కనిపించిన ప్రతి సాహుకారుకు మల్లు నమస్కారబాణం వదిలేస్తున్నాడు. ఇతర పనుల్లో నిమగ్నులైనవారిని కూడా పలకరించి చూస్తున్నాడు. కొంతమంది బిచ్చగాళ్ళు "బాబూ రాగిదమ్మిడీ; ధర్మంచెయ్యండి బాబూ !" దొరవెంట పడ్డారు. కుళ్ళుగుడ్డలు, ఒంటినిండా చిడుము, గజ్జి. ఈగలు ముసిరినట్లు ముసురుతున్నారు. డాక్టరు మగ్గోరీబ్యాంక్సుకి రోతనిపించింది. సందు దగ్గరపడుతున్న కొద్దీ దొర క్రోధం మరీ తీవ్రమవుతున్నది.

షాపుల్లోంచి మగవాళ్ళూ, మేడలమీంచి ఆడవాళ్ళూ ఆయనకేసి కళ్ళప్పగించి చూస్తున్నారు. దొర అసహ్యంతో తలవంచుకున్నాడు. సందునిండా ఆమూలా ఈమూలా పెంటకుప్పలు, పగిలినకుండలు, చిల్లంపెంకులు—అబ్బబ్బ ! మహాకంగాళీగా వున్నాయే !

" పాకీవాళ్ళు సరిగ్గా డ్యూటీచేయరండి సార్ ! "

దొర సందమ్మట నడిచివెడుతుంటే పొరిగింటామె యింటి గోడమీంచి లుంగచుట్టిన గుడ్డముక్క వీధిలోకి విసిరివేయడంతో అది సరాసరివచ్చి దొర నెత్తిన పడబోయింది. దొరమూతి బిడాయించుకుని వేళ్ళతో ముక్కు నొక్కుకున్నాడు. పక్కనేవున్న మేడ రెండవ అంతస్థులో ఒకాయన

స్నానంచేస్తూ సబ్బునీటిని ఏకధారగా కిందకు ప్రవహింప చేస్తున్నాడు. దిక్కుమాలిన భారతదేశం. దొరకు వళ్ళుమండి భారతదేశం గొంతుకాయ పట్టుకుని పిసకాలనిపించింది.

"ఆ కనిపించేదే మా యిల్లు సార్! అదుందే అది; అదే ఫ్యాక్టరీ!"

"హాఁ! ఐసీ!" సందు నానా గత్తరగానూ వుంది. బురద, రొచ్చు. ముందుకు పోదామా, వద్దా అని దొర తటపటాయించాడు. తనడ్యూటీ నాలు గడుగులు ముందుకు వేయించింది. సందులోని అమ్మలక్కలంతా ఆశ్చర్యంతో "దొరగారు! దొరగారే!" అని గుసగుసలాడుకుంటున్నారు.

తన భర్తవెళ్ళి దొరను లాక్కొచ్చారనే స్వాతిశయంతో ముసుగు సవ రించుకుంటూ తలుపువారనుంచుని తోడకుమల్లు భార్య విజయగర్వంతో "రా! రా! బయటికొచ్చి ఇందాక పేలిందేదో యిప్పుడు పేల్రా! ఒరేయ్ ప్రభా!" అని కేకలువేస్తున్నది.

దొర ఫ్యాక్టరీ ఆవరణలోనికి అడుగుపెట్టేడు. గోచీమాత్రం పెట్టుకుని గూటిదగ్గర బల్లలమీద కూచున్న మునూ, దొర కనీకనిపించగనే,"గుట్‌నూన్" అరిచాడు. బీబీజీ యింటవున్నప్పుడు చిన్నబాబుగారు గుడ్‌మార్నింగ్, గుడ్ నూన్, గుడ్ ఆఫ్టర్‌నూన్, గుడ్‌నైట్ అనే నాలుగు ఇంగ్లీషుముక్కలు వాడికి నేర్పారు. నోటికివచ్చిన ఆ నాలుగుముక్కల్నీ ఉత్తినే పోనీయదలుచుకోలేదు మునూ!

దొర కొద్ది ఆశ్చర్యంతో చూస్తూనే వెంటనే "గుడ్‌మార్నింగ్"ని తనూ అన్నాడు. దొరఫ్యాక్టరీలోనికి వెళుతూ అంతా కలయచూశాడు. పీపాలు ఒకమూల పడివున్నాయి. కుళ్ళిపోయినపళ్లదుర్వాసన. డేగిశాలు అరుగులమీద మూలుగుతున్నాయి. కాళ్ళకి చెమట పట్టింది. బట్టతలనిండా చిరుచెమటలు పోశాయి. టోపీని జేబురుమాలుతో తుడుచుకున్నాడు. తుడుచుకుంటున్నాడే కాని కళ్లుమాత్రం నాలుగు మూలలను జాగ్రత్తగా పరిశీలిస్తున్నాయి. దొరకు చిన్నతనంలో తాను చదువుకున్న ఒక విషయం స్ఫురణకు వచ్చింది. శరీరం జలదరించింది. ఈ నల్లవాళ్లు తక్కువముండాకొడుకులు కారు. ఉన్నట్లుండి దొంగచాటునవచ్చి ఠపీమని బాకుతో పొడిచిపారిపోతారు.ఎంతెంత పన్లయినా యిట్టే చేసేస్తారు. దొర నక్కితిరిగిచూసేసరికి అడుగుల చప్పుడు వినిపించింది. ఎవరు చెప్మా అని దిగులుపడుతుండగా ప్రభుదయాళ్ వచ్చి వంగివంగి సలాము చేశాడు. 'బతుకు జీవుడా'అనుకొని వచ్చీరాని హిందీలో "దీని ఓనరు ఎక్క

డున్నాడయ్యా?" "నేనే జనాబ్" ప్రభుగుండె దడదడలాడింది. వెర్రిమొహం వేసి నుంచున్నాడు.

దొర, మల్లుకేసి తిరిగి "ఆల్ రైట్ రావుబహద్దర్! నావల్ల ఏమవుతుందో అదంతా చేసితీర్తాను!"

విడ్డూరంగా చేపల గంపచుట్టూ మూగినట్లు జనం దొరచుట్టూ పోగయారు. "బహద్దర్! ఏమి టీజనం దారికడ్డంగా! కాస్త అవతలకితోలేయండి!" దొర చికాకు చటుక్కున గ్రహించి తోడరుమల్లు "జావో జావో" అని జనాన్ని గద్దిస్తూ తమను నేను సాగనంపుతానుగా!" సందుదాకా వచ్చేసరికి స్త్రీలు, పురుషులు, పిల్లలు మళ్ళీ గుంపుగా మూగి, తెల్లతోలువంక పరిశీలనగా చూస్తున్నారు. తోడరుమల్లు తన బెత్తాన్ని గాలిలో మీద ఆడిస్తూ జనాన్ని బెదరగొట్టి చెదిరిపొమ్మంటున్నాడు.

ఫ్యాక్టరీగేటు పొంచున నిలబడివున్న మునూ వెళ్లిపోతున్న దొరను "గుడాఫ్టర్‌నూన్ సాహెబ"ని సలాం కొట్టాడు. అపరిచితమైన ఎవరి కంఠమో వినిపించేసరికి దొర దిగ్భ్రాంతిపడి అటుయిటు చూశాడు. చిరిగిన చొక్కా, నిక్కరూ వీడూ మునూను చూడగానే దొర కోపం నవ్వుగా మారింది. "హారి పిడుగా! ఇంగ్లీషున సలాములు పెడుతున్నావే!"

దొర తన ఫ్యాక్టరీ తనిఖీ చేసి చేయడమేగాక రావుబహద్దరుతో తనకు చేతనైనదంతా చేస్తానని చెప్పడం ప్రభుకు భయమనిపించింది. సాహెబ్ తప్పక తనను జైలుకు పంపకమానడు. గబగబ ఫ్యాక్టరీలలోనికి వెళ్ళి రెండు జాడీలనిండా పికిల్సూ,జామూనింపి మునూచేతమల్లుగారింటికి పట్టించుకువెళ్లాడు. మల్లుగారిభార్య యింటి హాలులో నించుని తిడుతున్నది. "ఇక చూసుకోండి మీ పనేమవుతుందో! మిడిసి పడుతున్నారేం! పెద్దా, చిన్నా కుడి చెయ్యా, ఎడం చెయ్యా చూసుకోనక్కర్లే? పోలీసులచుట్టూ తిరగండిక వాజమ్మల్లారా! పోత్రం వెధవలకి? ఏం చూసుకునో ఆ మిడిసిపాటు." వాజి మొహంవేసుకుని వస్తోన్న ప్రభుదయాల్‌ను చూసి ఆవిడ స్వరం మరీ రెచ్చింది. "వీళ్ళలో తిరక్కుండా కాలికీ, చేతికీ బేడీలు వేయిస్తాను."

చేతులు జోడించి నిలబడ్డాడు దయాల్. దయచూపమని ప్రాధేయపడ్డాడు. క్షమించవలసిందని ఆమె పాదాలకు మోకరిల్లాడు: "మన్నించండమ్మా మన్నించండి! ఏదో తెలిసీతెలియని వాళ్ళం. ఇన్నాళ్ళూ తమరీ

వీధిలో మా అందరికీ తల్లిలా ఏ కష్టంవచ్చినా ఆదుకున్నారు......ఇదిగో! మంచి జాం. పిల్లలు తింటారు. వుంచండమ్మా...మునూ!...లోపల పెట్రా."

దయాల్ చేసిన సౌజ్ఞను గ్రహించి మునూ జాడీలను లోపలపెట్టాడు. దూకుడుగా కాళ్ళిగ రేసుకుంటూ తోడరుమల్లు వస్తున్నాడు. దొరతో తన కేపాటి స్నేహముందో వీధివాళ్ళకందరికీ తెలియవచ్చిందనే సంతోషంతో మల్లు మనసు మల్లిపూవులా వికసించినది. వస్తూనే "వీడూ, ఈ భడవ! ఈ దొంగపీనుగ యిక్కడ కెందుకొచ్చాడు. పొమ్మను. జైలుకుపొమ్మను! తెగులు కుదురుస్తా. పోనీకదాఅని ఊరుకుంటే...హాఁ!"

తోడరుమల్లు భార్య అదొకిలా మొహంపెట్టి జాడీలకేసి వోరగా చూస్తూ "పోనిద్దురూ, ఏదో తెలియకచేశాడు. పాపం వాణ్ణెందుకు జైలుకు పంపించడం. పిల్లవాడు. చస్తాడు."

"ఒసేయ్! అన్నిటికీ నువ్విలా అడ్డురాకు!"

"చేసినపాపాలు చాలవా ఏమిటండీ! వాడి ఉసురు మన మెందుకు పోసుకోడం?"

ప్రభుదయాల్ బుసలు కొడుతున్న మల్లుగారిని చూసి హడలెత్తి పోతున్నాడు. కాళ్ళు వొణుకుతున్నాయి. ఖైదులో తోయిస్తే తనగతేం కాను! మల్లుకన్న అతనిభార్య మంచిది. జాడీలుచూసి మెత్తబడింది. మొగుణ్ణి చల్లబరిచింది.

దయాలుకిదంతా హడలెత్తించే వ్యవహారం. మునూకుమాత్రం వీధి భాగోతంలావుంది. ఫ్యాక్టరీలోనికి వెళ్ళగానే బోంగాతో దచ్చీలు కొడు తున్నాడు. తులశీమహరాజ్ లు వాడికోతలను నోరువెళ్ళబెట్టుకుని వినడం మునూకు మరీ హుషారనిపించింది. దొర వచ్చేరాగానే తను యింగ్లీషులో మాట్లాడేశాట్ట! ఇలాంటి దొరల్ని ఇదివరక నేకమందిని చూశానులెమ్మన్నాడు.

రకరకాల అసంగత అసంబద్ధ పరిస్థితుల అనుభవంతో మానవులలో చాలామంది తమ్ముతాము తెలుసుకోగలుగుతారు.

మునూ ఈఫ్యాక్టరీ జీవితానికి అతిత్వరలోనే అలవాటుపడిపోయాడు. అతని జీవితం అంధకారబంధురం. ఆ వేళ బాగా పనిచేసి, అలసిఅలసి నేల మీదకొరిగాడు. రాత్రి పన్నెండయినా నిద్రపట్టలేదు. పట్టిననిద్ర పూర్తిగ పట్టదు. కన్నుమూయనూ, తెరవనూ! తెలతెలవారుతున్నదనగా పక్క-

మీంచి లేచాడు. బద్ధకం తీరలేదు. వొళ్ళు విరుచుకున్నాడు. వొళ్ళువిరుచుకు పనిచేయడానికని ఫ్యాక్టరీ ఆవరణలోనికి తూలుతున్న అడుగులతో ప్రవేశించాడు. వొళ్ళు జవజవలాడుతున్నది. కాళ్ళు నీరసంతో తేలిపోతున్నవి. కళ్ళు మూతలుపడుతున్నవి. రక్తమంతా చేదలతో ఎవరో చేదివేసి, వట్టి కళేబరాన్ని నడవమని ముందుకు తోస్తున్నారా అనిపించింది.

అయితేనేమి ? పనొస్తే వొళ్ళు దాచుకోవడమన్నది వాడి యింటా వొంటా లేదు. పని చురుగ్గా చేయడమే కాదు. నేర్పువుంది.

పొద్దున్నే లేవడం, లేచిన వెంటనే పొయ్యిలో బుగ్గి బొగ్గులూ ఎత్తడం, తులసీ తనూ పొయ్యి అంటించడం, రోజూ మామూలే. పొయ్యి రాదుకుంటున్నపుడు మళ్ళీ పొరుగింటివాళ్ళు కాట్లకుక్కల్లా కరవవాస్తారేమోనని హడలు ! ప్రభ, తోడకుమ్ములకు ఎసెన్సులూ అవీ యిచ్చినా వాళ్ళవి అప్పుడే మర్చిపోయారు. ఎప్పటికప్పుడే పరగడుపు.

కుర్రవాళ్ళు పనిచేసుకుంటుంటే చీంబోతు మోహం వేసుకుని గణపతి తయారు. దూకుడుమనిషి. ధాంధూ మంటాడు. మొన్న దెబ్బలాటలో వొళ్ళు హూనమయిందగ్గిర్నుంచీ కుర్రవాళ్ళమీద అమల్దారీ తగ్గించాడు. ఆవేళనుంచీ ప్రాతఃకాలమే ప్రభతో దేవుడిగుడికెళ్ళడం, కోనేటిలో స్నానం చేసుకుని కోవెల చుట్టూ తిరగడం అలవరుచుకున్నాడు. మధ్యాహ్నం భోంచేసి తాను సైకిలెక్కి బజారుకు పోతున్నాడు. పోయి ఎసెన్సులు అవీ కాన్వాసు చేసుకుంటున్నాడు. ప్రతీదుకాణం చుట్టూప్రదక్షిణ; సాయంకాలం సైకిలుషికారు. తరుచు ఊరి మీదేవుంటాడుకాని ఎప్పుడో ఒకప్పుడు అకస్మాత్తుగా అగమ్మకాకిలావచ్చి వాలతాడు. ఎన్నెమ్మ నోరుపెట్టుకుని కుర్రవాళ్ళను అదిలిస్తాడు. కాలు ఒకచోట నిలవదుకదా, నోరు వుండబట్టదుకదా, ఎప్పుడూ ఎవర్నో తిట్లు, బూతులు ! కొరకంచులా చురచురలాడతాడు. గణపతి అస్తమానం ఎందుకిలా చిర్రుబుర్రు లాడతాడో మునూకు కారణం తెలిసిందికాదు. గణపతి చిన్నతనం నుంచీ హాయిగాతిని తిరగడాని కలవాటుపడ్డాడు. తండ్రి ధనవంతుడు కావడంచేత, మురిపెంగా కొడుకును పెంచాడు. వెన్నలో తమలపాకులు ముంచి నోటికందించేవాడు. కాని కొడుకు తీరా పెద్దవాడయాక ఒక్క దమ్మిడీ మిగల్చకుండా డబ్బంతా జూదానికి తగలేశాడు. గణపతికి నోట్లో అక్షరంముక్కాలేదు. కూచుని తిండానికి ఆస్తీలేదు. పనిచేద్దామంటే వొళ్ళు వంగదు. ప్రభుదయాలు ధర్మమాఅని వ్యాపారంలో వాటాయిచ్చాడు.

ఇచ్చాడు కాని, గణపతికి పనీపాటూ చేతకాదు. దయాల్ ధయాధర్మ భిక్షవై బతుక్కొస్తున్నాడు. సోమరిపోతు. లోపల లొటారం; పైకి బటారం. తన కేమీ చేతకానట్టు తెలియదన్నట్లు ఎవరికైనా తెలిసిపోతుందేమోనని ఎప్పుడూ ఏదోపని వున్నట్టు అటు ఇటు తిరుగుతుంటాడు. ఫ్యాక్టరీకొచ్చి అదమా యిస్తాడు. కూకలేస్తాడు. కుర్రాళ్ళను కొడతాడు. మనిషికంతా స్వలాభమే. ఆశకి అంతులేదు. కోటికి పడగలెత్తాలని పగటి కలలు. లక్షాధికారులంతా తనను చూసి గడగడలాడడంలేదనే దుగ్ధ. మనుషులకేసి చూస్తాడా ఎవర్నీ 'సాచా'గా మొహం ఎత్తిచూస్తే వొట్టు. చూశాడా చూపుల్లో అంతా విషం. గడియకో క్షణానికో ఎవర్నో హత్య చేద్దామనే తలంపుతో వున్నాడా అని పించేటంత భీకరమూర్తి. గణపతి కనిపించగానే మనుష్యులు మొహం తిప్పేసు కుంటారు. ఎవరి దారిని వాళ్ళుపోతారు.

శ్యాంనగరంలో బాబుగారింటివద్ద నిక్షేపంలా వుండేవాడుకదా మునూ ఇక్కడికొచ్చాకనవ్వుదామన్నా నవ్వురావడంలేదు. గణపతిఆకారంచూసేసరికి వొంటిమీద వేపపువ్వు జల్లినట్లయింది. భయం, చలిజ్వరంలా వణుకు, విచారం. అసంతృప్తి గుండెల్లో మంటగా లేచి దహించివేస్తున్నది. జీవితం మీద నిరాశ, నిర్లిప్తత జనించి తలను మోకాళ్ళమీదకు, దించివేస్తున్నది. మునూకిప్పుడు అన్నీ ఆలోచనలే. ఏమిటో ఆదిగులు! ఎందుకో గుండెల చాటున అంతటిమోయలేని విషాదం! ఎవరితోనూ మాట్లాడకూడదనిపించేది. చివరకు దయాలుతో అతని భార్యతో వాళ్ళెంత ప్రేమగా చూస్తున్నాసరే, మాట్లాడకూడదు. మాట్లాడితే గణపతి తన కంఠం వుత్తరించివేస్తాడు!

ఈ భయంనుంచి దిగులునుంచి, నిరాశామయ, విషాదకర మూర్ఛనల నుంచి అతన్ని అప్పుడప్పుడు తెప్పరిల్లజేస్తున్నది ఒకటే ఒకటి. తనతోటి కూలి వాళ్లకూ, తనమధ్య ఏదోచెప్పలేని ఆప్యాయత, బాంధవ్యం. ఏర్పడింది. ఇది ఒక రేర్పరచిన హృదయసంబంధంకాదు. వాళ్లకుకూడా తెలియని ప్రచ్ఛన్న రూప ఆత్మీయత.

గణపతి ఫ్యాక్టరీ గడపదాటీదాటగనే, కుర్రవాళ్లు మహదానందంలో పదాలు పాడడ మారంభిస్తారు. పొయ్యిబుగ్గిఎత్తుతూ ఒకడు, పళ్లనుమోస్తూ యింకొకడు, నీళ్లతోడుకుంటూ మరొకడు, పిల్లవాళ్లెక్కడున్నాసరే, పాట మాత్రం ఒకటిగానే వినిపిస్తుంది. జానపదగీతం; నిద్రపోతున్నట్లు జోగుతుంది. జోగిజోగి హఠాత్తుగా మేలుకున్నట్లు గింగురు మంటుంది గీతం,

గీతం, తనగుండెలో కడివెడు నీళ్ళున్నట్లు కన్నీళ్ళు కారుస్తుంది. జాలిగా, నిట్టూర్పులమధ్య, బరువుగా నిద్రలో పాడినట్లు వినిపిస్తుంది గీతం. ఈ కన్నీటి పాటలకు బదులు ఒక్కొక్కసారి కుర్రవాళ్ళు ఉల్లాసంగా ఆనంద గీతాలు పాడుతూవుంటారు. సమూహగానం చేస్తారు. మరికొన్ని వేళల, ప్రేమగీతాలు వినిపిస్తూవుంటాయి. జానపద గేయాలలో కొంచెం మోటుశృంగారం, బూతూ రంగరించి వున్నప్పటికీ, బహిష్కృతులైన వీళ్ళకి అవేకాస్త మనసుకూరట కలిగిస్తాయి. బాధలతో బొబ్బలెక్కిన మనసుకు ఈ పాటలే నవనీతం. ఇప్పుడు ఈ పాటలు పాడినప్పుడు మునూ మనసు చిగురిస్తుంది. చిన్ననాటి మధుర సంఘటనలు మొగ్గలు తొడుగుతాయి. ఉల్లాసంతో తనూ పాడతాడు. ఆడ తాడు. గెంతులువేస్తాడు. పనిచేసుకుంటున్న ముసలి కూలీలతో హాస్యాలు. వాళ్ళు వొలుచుకుంటున్న పళ్ళను దొంగిలిస్తాడు. ఎంత బతిమాలినాయివ్వడు. మురిపిస్తాడు. ముచ్చటగా తప్పించుకు పరుగెడతాడు. బోంగా, మహారాజ్ లిద్దరూ విరగబడి పకపక నవ్వుతారు. మునూ ఘనవిద్యచూసి ముగ్ధులౌతారు. తోటి పిల్లకాయలు శహభాషంటే యిక అడిగారా ! మునూ మరీ మరీ విజృంభిస్తాడు !

అద్దగోడ వద్ద గూటిలోవున్న జపాను అద్దంతీసి, మొహం చూసుకుంటాడు. తన ప్రతిబింబాన్ని చూసి తానే "వ్వక్వవ్వ" అని వెక్కిరించుకుంటాడు. సెల్యూలాయడ్ దువ్వెన్నతో జుత్తు దువ్వుకుంటాడు. చిన్న బాబుగారి శ్యాంనగరంలోని బాబుగారి జుత్తు మెత్తన. ఒకపక్క పాపిడి తీసుకుని మీదకు దువ్వుకునేవారు. తన జుత్తు ముళ్ళకంపలా వంగి ఏడవదేం ? మొద్దుల్లా గొంగళీ పురుగుల్లా 'వీటిపని పడతానుండు.' తనస్నేహితులు కొనుక్కునిదాచుకున్న సబ్బు తెచ్చి తలమీద నీళ్ళు గుమ్మరించి గట్టిగా రుద్దుకొని పన్నెతో అణచి అణచి దువ్వుకొంటాడు. తులసి కొనుక్కున్న వాసననూనె తలమీద దిమ్మరించుకొని మెత్తగా రుద్ది దువ్వెన్నతో క్రాపింగును లాంగదీసుకుంటాడు. బాస్ ! జుత్తునున్నగావుంది. కాని గణపతివచ్చేలోపున ఈ ముస్తాబుచేసుకోడం అయిపోవాలి. చూశాడా బడితెపూజ తప్పదు. పాపం, మొన్నంటే మొన్ననే తులశి సరదాకని తల దువ్వుకుంటుంటే గణపతి "నాలాగే షోగ్గా వుండాలనా, రంగేళీ వెధవా?" అని చావబాదేడు.

ఇంటుస్టాండుదగ్గర ఒక మంగలి కత్తివుంది. పొడుగ్గా నల్లటిపిడితో మంచి 'దారు'గానే వుంది. దానితో యజమాని పెన్సిళ్ళుచెక్కుతూవుంటాడు. మునూకు గడ్డం గీసుకొంటే ఎలావుంటుందోననిపించింది; గమ్మత్తుగానే వుంటుంది. కాని యింకా గడ్డంరాలేదే! దీని సిగకోసిరి, నూగుకూడాలేదాయె! త్వరత్వరగా గడ్డంవచ్చేస్తేబావుణ్ణు. తగిన వయసువస్తేనేకాని మీసం గీసంరాదు. నిండుయవ్వనం వచ్చి శ్యాంనగరంలోని చిన్నబాబుగారిలా చిన్నమీసకట్టు ఎదిగి పొడుగైన జబ్బలు మంచి పిక్కబలంవుంటేనా! టిప్‌టాప్‌గావుంటుంది వ్యవహారం. జబ్బలు తడుముకున్నాడు. పొడుగుచూసుకున్నాడు. తనపల్లెవిడిచి వచ్చినదగ్గర్నుంచీ,యింతవరకూ తనకుఎదుగూబొదుగూలేదు.ఛీఛీఅనుకొన్నాడు. పుష్టిగాపెరగాలి. సంతుష్టిగా తినాలి. పెద్దవాడిలా అవుపించాలి అని కోరుకున్నాడు.

శరీరంపెరిగేందుకు తగిన కసరత్తు చేస్తున్నానేనని సంతృప్తిచెందాడు.తను వొట్టినే కూచుంటున్నాడా;లేదే! ఫ్యాక్టరీలోపని. పనయాక ఫ్లాసులుపట్టుకుని బజారుకినడక. నెత్తిమీదబోలెడంతబరువుతో బజారులోతిరుగుతూంటేఎంతో ఆనందంగా వుంటుంది. ఫ్యాక్టరీలో విసుగు. బజారులో మంచి మంచి చీరలు కట్టుకునిపోతున్న స్త్రీలు, పంచెల కుచ్చెళ్ళు చేత్తోపట్టుకుని విసురుగా నడిచే మగవాళ్ళు కనిపిస్తారు. విసిగివిసిగివున్న ప్రాణం తెప్పరిల్లి హాయి అనిపిస్తుంది. షాపుల్ని చూస్తే యింకేమన్నా వుందా! కన్ను చెదిరిపోతుందికదూ! ఫ్యాక్టరీ ఒకలోకం. బజారింకొక ప్రపంచం. సుందరమైన జగత్తు. బజారుకు వెళితే ఒకంతకు యింటికి రాబుద్ధిపుట్టదు. ఫ్లాస్కులు దుకాణదారులకు అప్పగించి కుర్రవాళ్ళు మెల్లమెల్లగా అడుగులువేస్తూ అన్నింటినీ పరకాయిస్తూ ఫ్యాక్టరీకి వస్తారు. గణపతి అక్కడ ఆ సమయానికికానీ వున్నాడా, కుర్రవాళ్ళభరతం పట్టేదన్నమాటే: "వెధవల్లాలా! పొద్దస్తమానం పెత్తనాలేం?" అంటూ ఆలస్యమైనందుకు శిక్షగా వారాలతరబడిని ఫ్యాక్టరీలోనే ఖైదుచేస్తాడు. రోజుకూ పీభైగూనల నీళ్ళు తోడిస్తాడు. జబ్బలుపులిసిపోతాయి. ఇకబజారుకు పోయే వంతు మహరాజ్‌ది. వాడెక్కడున్నా వొకటే. పని తెములుచ్చుకుని అవలీలగా ఫ్యాక్టరీలో ఏదో కొంప మునిగిపోతున్నట్టు వచ్చివాలతాడు.

పాతాళలోకంలో నరకంవంటి ఫ్యాక్టరీలో కుర్రవాళ్ళకిదే నిత్యకృత్యం. చీకటికూపం. మంటలు. వేడి డేగిశాలలో మరిగే ఎసెన్సుల కుతకుత శబ్దం. కుళ్ళిపోయిన పళ్ళు మరిగిమరిగి కాలెక్కిన సిరప్పులవాసన. పీపాలలోంచి

చెడునీరు కారుతూవుంటుంది. దారంతా బురద గావుంటుంది. కూలీలపాదాలు ఒరిసిపోతాయి. అయినా అటుఇటూ పరుగులెత్తుతూనే వుంటారు. ఎవరికీ స్థిమితంగా కూచుండుకు వీలేవుండదు. కాళ్ళకు జోళ్లయినా లేకుండా పగిలిన పాదాలతో తిరగలిలా తిరిగిన చోటనే తిరుగుతూ సతమత మౌతుంటారు. మొలకు వున్న చింకి గుడ్డలు వికారంగా వాసనవేస్తూ వుంటాయి. డేగిశాల్లో మరుగుతున్న నీటిని మరొకదానిలో తోరపడం, మళ్ళీ చన్నీళ్ళతో ఆ డేగిశాలను నింపడం, గుండిగలను ఎత్తైనదిమ్మలమీంచి దింపడం, ఫ్లాస్కుల్లో ఎసెన్సులుపోసి వాటిని బజారుకు బట్వాడా చేయడం...రోజూ యిదేతంతు !

ముసలమ్మలు పళ్ళు వొలుస్తూంటే ఎసెన్సులు తయారయ్యేలోపున వాళ్ళకి సహాయం చేస్తారు. బాల్చీలతో నీళ్ళుతోడతారు; జాం తయారుచేస్తున్న యజమానులకు చెయ్యి అందివ్వడం మామూలే. గంటలకొద్దీపని, పని. ఎంతకీ ఎంతమందిచేసినా తెమలని దిక్కుమాలినపని ! యంత్రాలచక్రాలకు మళ్లే చేతులు వాటంతటవే పనిచేసుకుపోతాయి. తమ చేతులు పనిచేస్తున్నపుడు ఎలా కందిపోతున్నవో, కాయలు కాస్తున్నవో వాటికేసి చూడమన్నా చూడరు. పాము గుడ్లు పోసినట్లు శరీరమంతా ముచ్చెమటలతో తడిసిపోతున్నపుడు తాము బ్రహ్మరాక్షసివంటి పన్లో చిక్కుకున్నామనే స్పృహకలుగుతుంది. మిట్టమధ్యాహ్నమవుతుంది. ఆకలి పేగుల్ని దొలిచేస్తూవుంటుంది. ఇంటికి పోయి యింత'కూడు' తిందామనిపిస్తుంది. ఒకర్నివిడిచి యింకొకరు నెమ్మదిగా యిళ్ళకుపోయి భోజనంవద్ద కూచుంటారు. అమ్మగారు ఉడకేసిన యింతపప్పుముద్ద కలుపుకుని అదే మహాప్రసాదమనుకుని కళ్ళ కద్దుకుంటారు. ముద్ద దిగగానే, మళ్ళీపనిమాట జ్ఞాపకం వస్తుంది; కూడు తిన్నాక పని కదల బుద్ధేయదు. నీడపట్టుని కాస్సేపు చలికిలబడదా మనిపిస్తుంది.

అమ్మయ్య ! వేసవిదాటింది. శీతాకాలం వచ్చింది. ఫ్యాక్టరీలో మునూకిప్పుడు కాస్తసుఖంగావుంది. కొత్తలో అన్నీ ఎరుసెరుసుగానే కని పించేవి. ఇప్పుడు ఫ్యాక్టరీ అంతాపాతపడిపోయింది. ఏవస్తువు ఎక్కడ వున్నాయో యిట్టే పోల్చుకోగలుగుతున్నాడు. జాడీలు, టిన్నులు, బుట్టలు, తట్టలు, ఫ్లాస్కులు ఎక్కడవున్నాయో కళ్ళతో వెతుక్కోనక్కరలేదు. చేతులు వాటంతటవే, వాటిమీదకు పోతాయి.

చలికాలం బావుంటుంది. వేసవిలోవలె పాములభయం వుండదు. ఎండాకాలంలో 'పగళ్ళు సెగళ్ళు'. పాములు విపరీతం, ఓసారి పొయ్యికెదురుగా షెడ్డులో పుల్లల గుట్టమీద పెద్ద కొండచిలువలాంటి పాము చుట్టుకుని పడుకుంది. తను వచ్చిన సవ్వడి విని జర్రునలేచి పాకుతోంది. గుండె బేజా రెత్తింది. మరొక రోజున మహారాజ్ రెండు పాములు చచ్చిపడివుంటే కర్రతో మోసుకొచ్చాడు. ఒకదానితో ఒకటి దెబ్బలాడుకుని రెండుపాములూ చచ్చిపోయివుంటాయి! అదంతా ఎందుకు? రెండు తలల పామొకటి, జాం టిన్నులో చచ్చిపడివుంటే ప్రభుదయాల్ స్వయంగా చూశాడాయె!

వేసవికన్న శీతాకాలమే నయం. చలివేస్తుంటే పొయ్యిదగ్గర వెచ్చగా కూచోవచ్చును, పొద్దున్నే మంటలు, సన్నంగా గుండ్రంగా, వంకరలుగా, నీలిగా, ఎర్రగా, గెంతుతూ వుంటాయి. ఇటిక గోడలను నాకుతున్నట్లు; కొండవాళ్ళలా నృత్యం చేస్తున్నట్లు, మంటలు సొగసుగా కనిపిస్తాయి.

శిశిర ఋతువు వెళ్ళిపోయింది. వసంతం వచ్చింది. అప్పటికి మామిడి పళ్ళిప్పుడే వచ్చేస్తాయ్. తెల్లవారడం తరువాయి, గంపలకొద్దీ మావిడిపళ్ళు చేతిపట్టు కందవంత పెద్దవి దోర దోరని పళ్లు బజారులో కుప్ప తెప్పలు. తను చిన్నతనంలో వాళ్ళ ఊళ్లో తోటల్లో మావిడితోపులమధ్య తిరుగుతూ కోసుకునే యించక్కటి పళ్ళు! సువర్ణరేఖలు. రాజులమావిడి. మిఠాయి మావిడి. కొత్తపల్లి కొబ్బరి. కోలం గోవాలు. చెరుకు రసాలు. నూజివీడు మావిడి. బంగిరిపిల్లి మావిడి. అబ్బ! నోరూరుతున్నది. ఫ్యాక్టరీలో ఎదురుగ, గుట్టలుగ మోసుకొచ్చి కూలివాళ్లు, తనకంటెదుట పెద్దవాళ్ళే గుమ్మరించేస్తున్నారు. లచ్చి, వాళ్ళూ వాటిని అందుకుని కొట్లలో దిమ్మరిస్తున్నారు. వీటితోనే జాం, పికిలూ చేస్తారు.

కళ్ళు చెదరిపోయేటట్లు, నోరు ఊటలు ఊరేటట్లు ఎదురుగ అన్నోటి మావిడిపళ్లు కనిపిస్తున్నపుడు మునూ హృదయం ఉవ్విళ్ళూరక నురేంచేస్తుంది! గణపతి చీంబోతు మొహం వీడూ అడ్డు. కాస్త అలా అతన్ని అవతలకి వెళ్ళనిచ్చి యిలా తలొకపండూ తీసుకుని పిండుకుని తిందామనుకుంటున్నారు కుర్రవాళ్లు. వాళ్ళందరికిమల్లే మునూ కాసుకూర్చున్నాడు.

మావిడిపళ్ళకోసం పడే 'యావ' మునూకు ప్రమాదం తెచ్చిపెట్టింది. బాగా ముగ్గినపండు పెద్దదయితే ఒక్కడు తినడం కష్టం. చిన్నదయితే అయిదారు తినొచ్చును. మావిడిపళ్లు తింటే వేడి. వేడి తగ్గాలంటే చల్లని పానీయం

అవసరం. పండని కాయల్ని ఒకటికూడా తినడం మంచిదికాదు. తీరాచూస్తే అక్కడున్నవన్నీ పచ్చికాయలే. గట్టిగా రాళ్ళల్లే వున్నాయి. పనిచేస్తున్నపుడు యెడంచేత్తో ఒకొక్కటే సంగ్రహించి మెల్లమెల్లగా కొరుక్కుతినొచ్చనను కున్నాడుమునూ. కాయకొరికి ముక్కమింగేసరికి పళ్ళుజివ్వుమన్నాయి. తెలియని ఆకతాయితనం, ఒక కాయగాదు; రెండుకాదు. ఉడతపిల్లలా ఊరికే కొరికేస్తు న్నాడు. కళ్ళు నీళ్ళుకారేవరకు తిన్నాడు. ఎలా కనిపెట్టాడో గణపతియిట్టే పసిగట్టి గచ్చుమీదకాయను రుద్దుతున్న మునూవంక గబగబా అడుగులు వేసి సమీపించాడు. వెనకాలనుంచుని మునూచెవి దొరకపుచ్చుకున్నాడు. సాగతీసి గూబగుయ్యిమనిపించాడు. మునూపెడుతున్న కేకలకు ప్రభకిందకు పరుగుపరు గున చక్కావచ్చాడు. ప్రభనుచూచి గణపతి మరీ రెచ్చిపోయి మునూను మళ్ళీ కొట్టబోయాడు. ప్రభుదయాలు అడ్డంవచ్చి మునూను పక్కకుతీసుకుని: "ఎవరైనా పచ్చికాయల్ని తింటార్రా? నాల్గురోజులు గడ్డిలో ముగ్గేసుకుని తిన్లేకపోయావ్ ?"

మున్నూ ఏడవజొచ్చాడు. కళ్లు ఎర్రపడ్డాయి. దయాల్ దయతో లాలిస్తూ "ఏడవకేడకు కళ్లల్లో మందువేయిస్తాలే రాడాక్టర్ దగ్గరికి తీసు కెడతాను."

గణపతికి తట్టుకాలేసు కొచ్చింది: "బోడెద్దుకి పోట్లుమప్పుతున్నావ్ లంజాకొడుకు తెగబలిసీ...వాడికా కొమ్ములు నీ నుంచేవస్త. పన్లేదు. పాటు లేదు. సువారప్పోతులా తిని తిరగడం, వెధవాని! బడిత, వీపుమీద విరుగు తుందంటేనేకాని వొళ్లొంచుతారా వీళ్ళు! కొండకిర్రులంజాకొడుకులు! తీసు కెడతాట్ట తీసుకెళ్ళడం. డాక్టరూ మందూ మాకూ! నెత్తిమీద కెక్కించు కుంటే నువ్వెక్కించుకుని తొక్కించుకో! అంతేకాని వ్యాపారంపాడుచేయకు నీ ధర్మమాని. అసలేపని మారుగుళ్ళవుతోంది. ఒక్క తొత్తుకొడుక్కీ భయం భక్తీలేదు."

గణపతి సోదె వినిపించుకోకుండా దయాల్, పిల్లవాణ్ణి వెంటబెట్టు కుని వెళ్ళిపోయాడు.

ఆసాయంకాలం గణపతి బాకీలవసూళ్లకని పొరుగూళ్లకువెళ్లిపోయాడు. ఫ్యాక్టరీ చల్లగా ప్రశాంతంగా వుంది. పనివాళ్ళకు హాయి అనిపించింది. 'ఈ గాడిద కొడుకు ఎక్కడుంటే అక్కడ వానలూ, పంటలూవుండవు. ఊరికి పోయాడు. శని విరగడైందనుకున్నారు'కూలీలు.

కాని మునూరు శాంతిచిక్కలేదు. మళ్ళీ, పాపం ఉష్ణంవచ్చింది. గణపతిలేని ఆనందాన్ని అనుభవించడానికతను నోచుకోలేదు. వడ్లగింజవేస్తే పేలపుగింజ యేంత వేడిగావుంది శరీరం, ఎడతెరిపిలేకుండా కళ్ళవెంబటి నీరు కారుతున్నది. ఇదివరకొకసారి శ్యాంనగరంలో వర్మతో యుద్ధంచేసి గాయంతిగిలిన తరువాతయిలాగే తనకు జ్వరంకాసింది. అయితే, దయాలుభార్య బీబీజీలా మాత్రంకాదు. ఆమె అతన్ని వేయికళ్ళతో కనిపెట్టుకు చూస్తున్నది. పక్కనే ప్రతినిమిషం కూర్చుని తలనొప్పిగా వుందంటే తలనిమురుతున్నది. కణతలు ఎగిరిపోతున్నట్టున్నాయంటే కణతలు రుద్దుతున్నది. ఒళ్ళు సలుపుతున్నదంటే చేతులతో పడుతున్నది. ఎముకలన్నీ నొప్పి. ఒళ్ళు వేడి. చెమటలు కక్కుతున్నాడు. శరీరాన్ని నిమురుతూ "అయ్యోయ్యో! నాకేనా వచ్చింది కాదమ్మా! ఏమీ ఎరగనిబిడ్డను పీణిపట్టుకుంది. ఆ పెట్టేభాదేదో ఆ తండ్రి నారాయణమూర్తి! నన్నే పెట్టకూడదమ్మా!...భయంలేదు. బడివాటూప్టం. తెల్లారితేపోతుందిలే!"

దయాలు భార్యమాటలు, ఓదార్పు మాత్రమేకాదు. మందుల్లా వున్నాయి. పాముకాటువేస్తే మంత్రించిన మాటలు. ఎంత ఆప్యాయత లాలన, బుజ్జగింపు, ప్రేమ! పాడుతున్నపుడు గానం ఆగి ఆగి హఠాత్తుగా ఒక్కసారి రాగస్రవంతి ఆత్మను వశపరచుకున్నట్లు, ఆమె మాటలు మనసును వశంచేసుకుని మంత్రించాయి. చల్లనితల్లి. కడుపు చల్లనితల్లి. శతాబ్దాల మాతృహృదయం పుణికిపుచ్చుకున్న యిల్లాలు. మానవులను ప్రేమించడం ఆమెకు ఆ జన్మసిద్ధంకాబోలును. కడుపుతీపి. మావిడిపళ్ళకంటె మధురమైన మాటలివి. వీటిని తన జన్మలో మర్చిపోలేననుకున్నాడు. ఆత్మపీఠంపై ప్రమిదలు వెలిగించి వెలుగునింపుతున్న కంఠం. ఇదే బ్రతుకులో చల్లని జాబిల్లి. చిన్నతనంలో అన్నీ తీయతీయని సంఘటనలే. వాటికన్న యిది అపూర్వమైనది.

దీనికంటె అద్భుతావహమైన సంఘటన. మరుద్దామన్నా మరుపురానీక మాటిమాటికీ గుండెను పలకరించేసన్నివేశం. తను మూలుగుతున్నాడు. అటు ఇటు దొర్లుతున్నాడు. చనిపోతే మేలనుకుంటున్నాడు. అరుస్తున్నాడు. అమ్మను జ్ఞాపకం చేసుకుంటున్నాడు. తల్లిలేని కొరతతీరినట్లుగా, ఆమె తన చెంతకువచ్చి, చేతులు గుండెమీదవేసి 'నిశ్చింతగా పడుకో. నీకేం భయం లేద'న్నది, చంటిపిల్లణ్ణి ఒళ్ళోకితీసుకుని బుజ్జగించినట్లు తనపక్కనేపడుకుని

వీపు నిమురుతున్నది. తనతల్లి కౌగిలింతకంటె ఈమె కౌగిలింతలో ఏదో భేదమున్నది. ఊహుం లేదు; ఉంటే తల్లి కౌగిలింతకంటె ఈమె బుజ్జగింపు యింకా మిన్న. అవ్యక్తచైతన్యపుశిఖర ఔన్నత్యాలను అందుకునే అప్యాయత! అమాయకమైన పసిపాపప్రేమలోని ఉల్లాసం ఎంత గొప్పది! ఇట్టి ఉల్లాస జనితమైన ఒక స్మృతి, చక్కెరఖండంవంటి స్మృతి, అతని మనసులో పాము మెలికలు తిరిగింది. తిరిగి ఒకరి హృదయాన్ని, యితరుల కష్టసుఖాలను అర్థం చేసుకోవలసిన ఆవశ్యకత వున్నదనేసత్యాన్ని అతనికి బోధించింది. ఈ ఆత్మ బోధ ఒకనారీహృదయం వినిపించడం ఎంత హాయి! ఒకమధురదివ్యస్మృతి జలవలె ఉదయించి, నమ్మకం, విశ్వాసం, సంక్షేమం అనే అనేక కోరికల మెలికలను దాటి విశృంఖలమైన ప్రేమజగత్తును చేరుకున్నది. హృదయప్రేరేపిత సహజ సిద్ధమైన ప్రేమ, మనసుకుపట్టిన కోరికలన్నిటినీ గుర్తించి వాటిని సఫలీకృతం చేసేటందుకు ప్రయత్నించే ప్రేమ, అది విహరించేందుకు సరిహద్దులేవీ అడ్డు రావు; పశుపక్ష్యాదులకుసైతం వుండే ఈ ప్రేమ యిన్నాళ్లూ మతసిద్ధాంతాలూ నైతిక సూత్రాలూ విధించిన ఎల్లలనుదాటి అధిగమించి, వాటిని ఎగతాళి చేస్తున్నదా అనిపించింది.

ప్రభుదయాలు ఆయుర్వేద వైద్యుణ్ణి తీసుకువచ్చి మునూను చూపించాడు. వైద్యుడు తన ఖాతాదారుడే. మిరియాల కషాయం అనుపానంతో ఎర్రని మందుపొట్లాలు నాలుగేసి రోజూ పుచ్చుకోమని యిచ్చాడు. నాలుగు రోజులలో జ్వరం మళ్ళింది. కుర్రవాడి కయిదోనాడు పథ్యం పెట్టారు.

మరి నాలుగురోజులు పోయాక అంతా మామూలు వ్యవహారమే. ఫ్యాక్టరీ గూభ్యంలోకి దిగబడ్డాడు. కాని ఈసారి మునూ అంటే అందరికీ ఎందువల్లనో మరి, అభిమానం వేయజొచ్చింది. సాధ్యమైనంతలో పనిచెప్పడం మానేవారు. చెప్పినా చిన్న చిన్న పనుల్నే పురమాయిస్తున్నారు. పనితగ్గినా కుర్రాడికి నీరసం తగ్గలేదు. ఆలోచనలు ఎక్కువయినాయి. ఎవరితోనూ అంతగా మాట్లాడ్డంలేదు. చెంపల్ని చేతులు వేసుకొని దీర్ఘంగా ఆలోచిస్తూ కూచుంటున్నాడు. పనిచేస్తూ చేస్తూ ఆగిపోతున్నాడు. ఆలోచిస్తూ పని చేస్తున్నాడు. ఎందుకో అంత పరధ్యానం! ఆ మూగనోము!!

అనుకున్న ప్రకారం పొరుగూర్లనుంచి గణపతి తిరిగిరాలేదు. ఇది దయాల్ కి తప్ప మిగిలిన వాళ్ళందరికీ ఆనందంగానేవుంది. దయాల్ మాత్రం కింవామీగా పడుతున్నాడు. చేతిలో ఎర్రని ఏగాణిలేదు. డబ్బుకు రొక్కం

టుగావుంది. సొమ్ము జరూరు. వసూళ్ళకెళ్ళి ఏమన్నా తెస్తాడేమో అంటె గణపతి 'షికరు' లేడు. తోడరుమల్లు, పబ్లిక్ ప్రాసిక్యూటరై సంపాదించిన డబ్బు వడ్డీలకి తిప్పుతున్నాడు. ఋణాలిచ్చి పబ్లిక్ పెర్సిక్యూటరైనాడు. ఆయనదగ్గర ఏమైనా వాడితే అవసరం గట్టెక్కుందనుకుని దయాల్ వద్దకు పోయి ప్రాధేయ పడ్డాడు: "చేయి యిరుకున పడింది: తమ రాదుకో పోతే యిక లాభంలేదు' నెల తిరగడంతోటే తమ అయిదొందలూ తమకు పువ్వుల్లో పెట్టి దాఖలుచేస్తా"నంటూ అయిదువందలు అప్పుపుచ్చుకున్నాడు. వడ్డీ నూటికీ నలభైవిను రూపాయలకు వొప్పందమయింది. పత్రం మీద దస్కత్తుచేస్తూ దయాల్ తాను చెల్లించవలసిన బాకీలనన్నిటినీ మనసులో కూడుకున్నాడు. ఊళ్ళో తెచ్చిన బాకీలు అవీ ఇవీ కలిపి రెండుమూడు వేలకు తేలాయి. ఆ; ఏముంది ! గణపతి రాగానే నోట్లన్నీ చెల్లుబెట్టవచ్చును.

ఈ లోపున ఫ్యాక్టరీకి యిరుగు పొరుగనున్న వాళ్ళని మంచి చేసుకోక పోతే వ్యాపారం సజావుగా నడవదు. ఇరుగుపొరుగు వాళ్ళతో ఇబ్బందేమీ లేదు. తోడరుమల్లునే కాస్త 'బులావు' చేయాలి. తోడరుమల్లు యింటి పక్క అతనిదే పెద్దగది కాళీగానేవుంది. తనకు ఎలాగూ కావాలి. అద్దెకు తీసుకుంటే కాస్త మొహమ్మాటం ఏర్పడి మల్లు పస్తాయిస్తాడు. ఆగదిలో మరి కొందరి కూలీల్ని పెట్టి గులాబీరేకులు వూడదీయించి గులాబీజాం చేయించొచ్చును. అనుకున్నట్టే అద్దెకు తీసుకున్నాక, మల్లుమాత్రమే కాక, అతనిభార్య కూడా కాస్త అభిమానిస్తోంది. "అదేవిటోయ్ దయాలూ! బొత్తిగా కనిపించడం మానేశావూ? నీరసంగా వున్నావే?"

ఈ కుశలప్రశ్న మల్లు భార్య నిజంగా తనమీద ప్రేమవుండే అడిగిందో లేదో అతనికి అర్థంకాలేదు. క్షమాపణ చెప్పుకున్నట్లు రెండు చేతులూ జోడించి వినయంగా నమస్కరించాడు. వాళ్ళకి తనమీద అభిమానం వుంటేనేంగాక, లేకుంటేనేంగాక, అతనికిమాత్రం వాళ్ళ మీద గౌరవం వుంది. వాళ్ళు ధనికులూ, వయసుమళ్ళినవాళ్లూ. ఇదంతా ఎందుకొచ్చిన చిత్తక్షోభ. వాళ్ళ కియ్యవలసిన ఋణం సీదాగా తీర్చేస్తే ఏ యిబ్బందీ వుండదు. వుండదనుకుంటే, యింకా గణపతి ఊర్నుంచే తగలడడేం కర్మ.

ఎట్లాఅయితేనేం, గణపతి కొంపకు చేరుకున్నాడు. ఇంటికి వస్తూనే ధాంధూం మంటున్నాడు. ఆడకూలీలను తిడుతున్నాడు. కుర్రాళ్ళను ఉరుముతున్నాడు. ప్రభనుచూసి మూతి ముడుచుకున్నాడు. గణపతి ఎందు కిలా

వున్నాడో అతని ప్రవర్తననుచూసి మునూ యిట్టే గ్రహించేశాడు. ఆవలిస్తే పేగులు లెక్కపెట్టే మునూకు గణపతిని అర్థం చేసుకోవడం కష్టమనిపించలేదు. మొన్న జబ్బునించి తేరుకున్నాక మెదడు పాదరసంలా పరుగెత్తుతోంది. ఆ మాటకొస్తే గణపతికి వేరే తుంటరిభావం వున్నదని ఆనాడే గ్రహించాడు. ఆవేళ, ఫ్యాక్టరీలోకి వచ్చినప్పుడు గణపతి తనకేసి పరకాయించి చూశాడు. కొట్టొచ్చినట్టు చూసి తరవాత మొహం తిప్పేసుకున్నాడు: "వెళ్ళు! వెళ్ళి పన్చూసుకో" మునూ కైరాతీ వెధవట. చమురు కాళ్ళ పెద్దమ్మట. వాడొచ్చినప్పట్నుంచి శని పట్టుకుందిట! ఎన్ని తిట్లు! నోటికొచ్చినన్ని తిట్లు!

గణపతి విషప్పుచ్చి. కుచోద్ద పీనుగ. ఏదో ఆలోచన వుంది వాడికి. తత్వం ఫిరాయించింది. గల్లాపెట్టెకేసి, కాతా బుక్కులకేసి దొంగచూపులు చూశాడు.

గణపతికేసి మునూ తిరిగి చూడమన్నా చూడడు. అతనిది అడివి జంతువు స్వభావం. వచ్చినప్పట్నుంచీ అతని మొరటుతనం మరీ హెచ్చిపోయింది. బహుశా వాడుతిరిగిన వూళ్ళగాలీ, నీరు అంత! ఏ కర్రని నిప్పంటే అదే కాలుతుందని గణపతి ఊసు విస్మరించాడు. దయాల్ లోపల గులాబీ రేకులను విడదీస్తున్నాడు. తనూ వెళ్ళి ఆపూరేకులను పోగుచేస్తున్నాడు. గణపతిని మునూ మర్చిపోయినా, మునూను గణపతి మర్చిపోలేదు. మునూ తనవంక అనుమానంగా చూడడం, గణపతి కనిపెట్టేడు. సమయంచూసి వారి సంగతేమిటో తేల్చుకుందా మనుకున్నాడు.

సమయం వచ్చింది.

గణపతి రాగానే నెల్లాళ్ళలోపున అప్పు తీర్చేస్తానని దయాలు, మల్లుకు మాట యిచ్చాడు. నెలదాటి పదిరోజులయింది. దయాలుకు మొహం చెల్లడంలేదు. గులాబ్‌జాం జాడీనిండా నింపి మునూను పిల్చి "మల్లుగారింటికి; ఆవిడకే యియ్యి!" అని మెల్లగా అతని చెవిలో గొణిగాడు. ఎక్కడికైనా వెళ్ళమంటే మునూ కొక పండుగ. అందులోనూ మల్లుగారింటికి. ఆయన గదిలో పేముకుర్చీలు, సోఫాలూ అద్దాలబీరువాలూ, చూడ్డానికెంతో యించక్కా వుంటాయి. జాడీపట్టుకుని మునూ ఒకటే పరుగుతీశాడు. గణపతి తిన్నెమీద కూచుని గుడు గుడు పీలుస్తున్నాడు. పరిగెడుతున్న మునూను చూసి గొట్టం కింద పారేసి గబగబ అడ్డంవెళ్ళాడు. గణపతి వెళ్ళేలోపున

మునూ తుర్రున ఎగిరిపోయాడు. జాడీ ఎవరికిస్తున్నాడో కనిపెట్టాలని గణపతి తలుపువార నక్కిచూస్తున్నాడు. ఇంట్లోహాలుముందు అమ్మలక్కల్ని పోగు చేసుకుని చేతులు తిప్పుకుంటూ ఊసులాడుతున్న మల్లుగారి భార్యకు మునూ జాడీ అందివ్వడం గణపతి కళ్లారా చూశాడు. మునూమీద మల్లుభార్యమీద కోపం ముంచెత్తుకొచ్చింది. హాత్తేరీ! నిన్నకాక మొన్న ఎవరి కొడుకైతే తనను తన్నాడో, తన్ని పైపెచ్చు హెల్తాఫీసరుచేత నానా హంగామా చేయించాడో వాళ్ళతో ఈ దఫేదార్‌కి నేస్తమా!

వాళ్ళతో వీడికి యిచ్చకాలా! 'ఇప్పుడెందుకు, మునూ లోపల కొచ్చాక చెబతా నా సంగతేమిటో'నని గిరుక్కున తిరిగి వెళ్ళిపోయాడు. చిందులు తొక్కుతూ అటు ఇటు పచారు చేస్తున్నాడు.

మునూ యింతమొహం చేసుకుని లోపలకొచ్చాడు. వాడి చెవి పుచ్చుకుని నులుపుతూ : " ఆ జాడీ ఎవరబ్బగారి సొమ్మని వాళ్ళకిచ్చావురా ? "
మునూ బెక్కులు బెక్కుతూ : "శేక్‌గారిమ్మన్నారండి !"

"ఏమిటేమిటి ?"

"అవునండి. నా కేంతెల్సు. ఆవిడగారే అడిగితే అదిమ్మన్నారండి దఫేదారుగారు."

"ఇదా, నువ్వు నాకిచ్చే సమాధానం ! యిమ్మన్నారట్ట ! ఇమ్మనడం ఏదడిగితే అదీ ... హుఁ ... లంజకొడకా ! నీకు యిక్కడా కావాలి, అక్కడా కావాలేం చెప్పు ? మాకు బద్ధవిరోధులుకదా వాళ్ళు ! ఎవర్రా నిన్నక్కడి కసలు వెళ్ళమంటా ! తై తై అని పరిగెత్తుకెడుతున్నావ్, గాడిద కొడకా !"

దవడ పగిలేటట్టు ఒక్కదెబ్బ ఫడేల్‌మంది. దెబ్బలు తగలకుండా చేతుల్ని మొహానికడ్డం పెట్టుకుంటున్నాడు మునూ. జబ్బమీద ఒక్కపోటు పొడిచాడు గణపతి. "బాబోయ్, బాబోయ్" అనే అరుపులు వినవచ్చాయి. పిడికిలి బిగించి మళ్ళీ జబ్బమీద ఒక్క 'కుందా' పోటు పొడిచాడు. గూడు మీద యింకొకతాపు. ఒకటీ, రెండూ, మూండూ, నాలుగూ దబ దబ చెంప కాయల వర్షం. మెడపట్టుకుని అవతలకి తోశాడు. మునూ బురదలో పడి పోయి దొర్లిపోయాడు. వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు. మెడమీద కాలితో ఒక్క తాపు తన్ని "లంజాకొడకా అంత గొంతుకెందుకురా ? కిందపడి

దొర్లుతావేం? పని ఎగ్గొట్టడానికి కిదో ఎత్తా? మళ్ళీ ఆ గుమ్మం తొక్కు, పులుసులో కెముకల్లేకుండా తంతా."

కుర్రవాడి ఏడుపువిని పరుగుపరుగున వచ్చి బురద అంటుకున్న మునూను చూసి నిలబడిపోయాడు దయాల్. గణపతి చింతనిప్పుల్లాంటి కళ్ళతో ప్రశ్నిస్తున్నట్లు చూస్తున్నాడు. దయాలు చూపులనిండా కరుణ ఫుట్టిపడుతున్నది. ఇంత గందరగోళమవుతూంటే ఇవతలకి రాకుండా, మల్లు భార్య ఊరుకున్నది కాదు. విభ్రమంతో నిలబడి చూస్తున్న మల్లు భార్యను దయాల్ చూసి మరీ వణకెత్తిపోయాడు. గణపతి మొహం చిట్లించుకోటం, ఉడుకుమోత్తనంతో మునూను ఆకారణంగా తన్నడం ఈ రభసంతా ఎందుకో ఆమెకు తెలుసును. పెద్దగా అరుస్తూ, "అదా నీ కడుపుమంట క్కారణం? మాకు ముష్టిముండా జామ్ యిచ్చాడనా, నీ ఉడుకుమోత్తనం తగలడ! అంతపొగ ఉక్కిరిబిక్కిరి చేస్తున్నా నోరు మెదిపాముట్రా! భరించి చచ్చినట్టూరుకోలేదూ? మీ కాపాటి విశ్వాసం వుండక్కర్లే? ఆవేళ ఊరుకున్నాంకాని నీ మిల్లు పీకించి పారేద్దుమే! పోనీ కదాని ఆపదకడ్డుపడితే యిదా నీ మేలు! ... ఓళ్ళకుడుం లాటి రూపాయిలమ్మా, ఒకటికాదు రెండుకాదు, అయిదొందలు పీళ్ళేదాన్ని కొట్టాం. ఇంతవరకూ అతీలేదు; గతీలేదు. అవసరంకదాని గది అద్దె కిచ్చామే! ...... ఆ ముసిలిముండలు, సచ్చరముండలు; తుబుకూ తుబుకూ ఉమ్మేస్తూ గదంతా నానాకంగాళీ చేస్తున్నా పల్లెత్తుమాట అన్నాంరా? ఏదో సామెత చెప్పినట్టు ... తిన్నింటికే వాసాల్లెక్కెట్టండి... జాత్తక్కువ వెధవల్లారా"

"ఆఁ చెప్పొచ్చావ్! వెళ్ళమ్మా వెళ్ళు. మా యిష్టం. మా నౌకర్ని చావగొట్టుకుంటాం. మధ్య మీ కెందుకని!"

"ఆఁ! చావగొట్టుకుంటావ్; చావగొట్టుకోడం! చీంపోతులా మొహం నువ్వూను! తలపొగరు నోరు చెబుతుందని. నీ తోటివాడేనా, దయాలూ! అతనెలా వున్నాడూ, నువ్వెలావున్నావు? తెలుసురా అబ్బీ నీబండారం. వృత్తి దగుల్బాజీవి. అసలు నీవంగడమే అంత. బాబుకి తగ్గకొడుకు! ఆ ఎంగిలికూడూ ఈ ఎంగిలికూడూ కతికి, నాలుగు రాళ్లు గడించాడు నీబాబు. ఆ నాలుగురాళ్లూ అయిపోయేవరకూ నీలాగే రెపరెపలాడేశు. కట్టుకున్న భార్యని తగిలేసి ఓ బూాబెమ్మని చేరదీసి...థూ! నువ్వూ...మూడు మూర్తులా నీ బాబునే పోలేవు...తాగుబోతు ముండాకొడుక్కి దొరికాడు దయాలు,

వాడ్డబ్బు కూచుని అప్పనంగా తినమరిగేవు! పోకిరీ ముండాకొడకా! ఏమిట్రా ఆ చిల్లంగిచూపులు! సంసార్ల కొంపలమధ్య కాపరం వుండడానికి నువ్వేం తగు మనిషివని!... పెళ్ళికాని పిల్లలు అలా తిరుగుతూంటారారాయె, వయసొచ్చిన ఆడపిల్లలు మసులు కూంటారాయ్...ఇక్కడనుంచి వీణ్ణి తగిలేస్తేనే కాని పరువు మర్యాద లేక వుండవమ్మా!"

తోడరుమల్లు భార్య గణపతిని మొహం వాచేటట్లు చివాట్లుపెట్టడం మునూకు సరదా అనిపించింది. గణపతి ఒక్కచచ్చిపోయి మొహం దించుకోడం ఎంతో సంతోషంగా వుంది. ఏడుపుమాని ఆతిట్లన్నీ చక్కగావిని "అచ్చా! అచ్చా" అని లోలోపల చంకలెగరేశాడు. గణపతి నోరు మెదపలేదు. ప్రభుదయాలు మాత్రం "క్షమించడమ్మా! క్షమించండి! తెలివితక్కువ్వాడు. కుడిచేయీ, ఎడంచేయీ తెలియదు. నోరుపారేసుకున్నాడు. పోనీ, నేనున్నాను కాదమ్మా; తమ మాటకి అడ్డులేదు. ఇంకిలాటివి రానీయన్లెండి... మీరు తల్లివంటివారూ, మేం బిడ్డవంటివాళ్ళం. మీ కాగ్రహంవస్తే పట్టగలమా తల్లీ!"

"ఒకసారా, రెండుసార్లా, ఇది లక్షోసారి. ఇక ఊరుకునేది లేదు. దయతలచి, మేం ఊరుకుంటే ఏం చేతకాకూరుకున్నామనుకుంటున్నారు...... మొద్దు పీనుగలు! నీచు తినే వెధవలు! ధూ...ధూ..."

"లేదమ్మా లేదు!"

"లేదేమిటి, లేదు? ముం దా తాళాలిలాయిచ్చి గది కాళీ చేయి. బాకీ జమకట్టి మరీ కదులు."

దయాలుకు మతిపోతున్నట్లయింది. చేతులు రెండూ జోడించి "మతి స్థిరంలేక ఏదో అన్నాడు. తమ రికమన్నించకపోతే మా గతేం కానమ్మా!"

"మన్నించండి; మన్నించండి! మంచి టక్కరి మాటలే నేర్చావు ఆ భడవని వెనకేసుకొస్తా వెందుకు?"

"కూకలేస్తానమ్మా! కూకలేస్తా"

మునూ ఏడుపుమాని సంభాషణ వింటున్నాడు. అతనిగుండె అదిరిపోతున్నది. దయాల్ని ఎక్కడ ఎవరు కొడతారేమోననే భీతి జనించింది. వీధిలో గగ్గోలువిని ఫ్యాక్టరీలో పనిచేసుకుంటున్న కూలీలు యివతలకి వచ్చే

శారు. సందంతా గుమిగూడివుంది. ఇరుగు పొరుగు ఆడవాళ్ళు చోద్యంగా వింటున్నారు.

ఒక క్షణకాలం నిశ్శబ్దం.

మల్లు భార్య చుట్టూ కలియచూసింది. ఆడవాళ్ళు గుమిగూడి వినడం ఆమెకు వళ్ళుమండింది. అతిశయం హెచ్చి తన డాబు దర్పాలను వాళ్ళకి చూపించాలని మేడమీద ముస్తాబవుతున్న భర్తను యివతలనుంచే "గండి! మీకే చెపుతూంట! మేం యిక్కడ గొంతుకలు, నులిపేసుకుంటున్నా మీ కేమీ పట్టనట్లు లోపల బబ్బున్నారు! మనిషంత మనిషిని, మీదకొచ్చి తిట్టిపోస్తుంటే మీ రూరుకునేందుకు గాజులు తొడిగించుకున్నారా?"

సాయంకాలం షికారుకుపోతున్న తోడయమల్లు జెస్తం ఊపుకుంటూ ఆడావుడిగా బయటకొచ్చాడు. దుస్తు దగ్గలు దగ్గుకుంటూ "అబ్బబ్బా! ఏమిట్రా ఆ గొడవా?" భర్తను చూడగానే ఆమె నల్లనిమొహం తెల్లనైంది. తన ఆధిక్యతను వెల్లడిస్తూ మొహం చిట్లించుకుని "చూడండి, చూడండి, వీళ్ళ తలపొగరు! ఏదో యింతకాలాని కింత కలిగిందని మిడిసిపడుతున్నారు! పొగ వచ్చి మేడంతా నాశనం చేస్తోన్నా మనం ఏమన్నావండీ! పైపెచ్చు వీళ్ళకో నెత్తిమీద దేవతలనుకుని అప్పూలూ సొప్పూలూ యిచ్చాం ... వద్దు బాబూ అని మొత్తుకుంటే విన్నారూ. మీరు నామాట? వాళ్ళెత్తిన నోట్లను నోట్లూ కొట్టారుకదా, డబ్బురు తోడు, గడిచ్చాం. మంచీ చెడ్డా వుండక్కరలే? ముష్టిముండాజాడీ యిచ్చాడని తెగ నీలుగుతున్నాడే! వుండండి. వాళ్ళ జాడీ వాళ్ళ మొహాన్నేసి కొడతాను!"

"ఆ వెధవ జాడీ నువ్వెందుకు పుచ్చుకున్నావే! కావలసినవన్నీ కొని యింట్లో పోస్తూనే వున్నానాయె!" ఉబ్బస రొప్పుకొచ్చి మల్లు ఉక్కిరిబిక్కిరయ్యాడు. దయాలు చేతులు రెండూ జోడించుకుని ఎదురుగ వచ్చి నిలబడ్డాడు: "అమ్మగారి తప్పేముందండి బాబయ్యా! ఇస్తే పుచ్చుకోననే అన్నారు. కాదూ కూడదని నేనేనండి బతిమాలింది. ...గణపతి మూర్ఖుడు బాబూ! తమకి తెలవం దేముంది, మిమ్మల్ని కనిపెట్టుకున్న వాళ్ళం! ఈ సారికి పోనీయండి. తప్పైపోయింది. నేనిచ్చినట్టు తెలీక గణపతి ఏదో-మిణి కాడు. తెలిస్తే వాడుమాత్రం అలా దూకుడు చేయడానికి గుండా, చెరువా బాబూ! తెలియక నేనండి, కుర్రాడిమీద చేయిచేసుకుంట!"

"ఇదిగో దయాలూ! ఆయన్తో అలా అబద్ధాలాడకు. ఆ దౌర్భాగ్యుణ్ణి, నూరు కొంగల్లో కలికొంగ, వాణ్ణి వెనకేసుకొస్తావేం?"

తోడరుమల్లు ఒగురుస్తూ భార్యను ఊరుకోమని మాటల్ని దగ్గాడు: "ముందతన్ని చెప్పే దేదో చెప్పనీయే!"

"వాడు చెప్పేదేవిటో నాకు తెలీదటండీ! అన్నీ అబద్ధాలేకా! ఆ పుండాకోరుని, దగుల్బాజీని తగులనమ్మా అని పూసుకొస్తున్నాడు."

తోడరమల్లు గట్టిగా మాట్లాడితే దగ్గు వస్తుందని గొంతుక తగ్గించి దజ్జాగా కసబొమ్మ లెగరేస్తూ అక్షరం చదివి వినిపిస్తున్నట్టు "నీకు నేన్చేసిన మేలేవిటో అందరికీ తెలుసు. నీకూ తెల్సు. చెయ్యి యిరకాటంలో పడిం దన్నావ్. దచ్చిచ్చా. గది కావాలన్నావ్. సరేనన్నా. కంప్లెయింటు చేయొద్దన్నావ్. పోనీలే అని ఊరుకున్నా. ఇన్ని చేసినా అన్నం పెట్టిన చేయినే కరవచూస్తున్నావ్. కూచున్న కొమ్మనరుక్కోకు. ముందే చెబుతున్నా. అనకనిష్ఠూరంవేసి లాభంలేదు...డొక్కవాక్కలు చేయిస్తా...హెల్తాఫీసరు"

హెల్తాఫీసర్లేదు; ఏమీలేదు. అంతా వట్టిబెదిరింపు. మల్లు తన పిటీషను హెల్తాఫీసరు బుట్టదాఖలు చేశాడని మల్లుకు తెలుసును. కమిటీ మీటింగుకు వెడుతున్నప్పుడు దొర ఎదురై "ఆఁ దీన్లో ఏముందండీ! పొగపోడానికి చిమ్నీ పెట్టించేస్తేసరి!" అంటూ మరి నిలబడకుండా పోలోఆటకు పోయాడు. తను చెబుతున్న మాటైనా వినిపించుకోలేదు.

ప్రభుదయాలు కీసంగతి తెలియదుకనక యింకా ప్రాధేయపడు తున్నాడు; "దయతల్చండి బాబుగారూ! అయిందేదో అయిపోయింది. మరి రాకుండానే చూసుకుంటానుకదా! తమ పాదాలు..."

"జరగనీయనంటున్నావుకదా! ఆమాటా చూద్దాం. సరే వెళ్ళు. వెళ్ళి నీపన్చూసుకో. ఆవెధవ కింతగడ్డిపెట్టు కూకలేయ్; ఫో" అంటూ మల్లు వెళ్ళిపోయాడు. తోడరుమల్లు భార్య యింట్లోకి వెడుతూ వెడుతూ ఆగి వెనక్కి తిరిగి వీధిలోనుంచుని చూస్తున్న సాటిస్త్రీలకేసి చూసి చేతులుతిప్పుతూ అంది: "వీళ్ళకి సిగ్గూలజ్జా వుందనుకున్నారా ఏవిటి! తలవాచేటట్లు చివాట్లు వేయించానా, నాగుమ్మం ఎక్కితేనే కాని దినం గడవదు వెధవయ్యలకి."

దయాలు వెనక్కివెళ్ళి మున్నూ చెయ్యిపట్టుకుని తీసుకుకళ్ళాడు. బావి దగ్గరనుంచుని మహారాజ్ నీళ్లు తోడుకుంటున్నాడు. దయాల్ మున్నూను

చూపించి "వీడికి వొంటిమీద నీళ్ళుపోయి మహారాజ్ !"అని కేకేశాడు. 'దగ్గరకి రారమ్మని' మహారాజ్ మునూమీద నీళ్ళు దిమ్మరించాడు. గణపతికి తగిన శాస్తి అయిందని మునూకి ఖుషీగావుంది. వాడిమీద కసితీర్చుకోమని అందర్నీ విధి ప్రేరేపించింది. మంచిపనయింది; గొర్రెపొట్టేల్లా మొహం వీడూను. గణపతి చేత దెబ్బలు తిన్నప్పట్నుంచీ మునూ ఎవర్నీ మొహమెత్తి చూళ్ళేకపోయాడు. మానసం. నెత్తిమీద నాలుగు బాల్చీలనీళ్ళు పడగానే మనసు తేరుకుంది. ప్రాణం తెప్పరిల్లింది. పూర్వంకంటె యిప్పుడు పని చురుకుగా చేస్తున్నాడు. చకచకా పని చేసుకుపోతూ దయాలు గణపతులు మాట్లాడుకుంటున్న సంభాషణ వినబుద్ధేసింది. దయాళ్, అంతా నెమ్మదించాక మెల్లగా అంటున్నాడు: "ఇరుగు పొరుగుతో అలా కజ్జా పెట్టుకుంటే ఎలా గణపతీ ? ఎటా మెటీ వచ్చిందంటే, అప్పిచ్చారుకదా వాళ్ళు !"

"నాతో నంగిరి బింగిరి మాటలాడకు. బహుమతులూ, వల్లకాడూను. బిజినెస్ పాడు పాడు చేస్తున్నావు ... అప్పిచ్చారేమో గోళ్ళూడగొట్టి వడ్డీ పుచ్చుకుంటారేమో !"

"వడ్డీ యివ్వందే బ్రహ్మదేవుడైనా మాట్లాడ్డు."

"అందుకేనోయ్, ప్రెజంట్లూగట్రా మప్పు ! నిన్ను కొట్టలేదుకదా వాళ్ళు. తన్నింది నన్నూ ... తుత్ ... బటాభోర్లకి 'మేవా'లు మేపు తాట్ట ! మేవాలు !"

"అరరె ! ఏం చెయ్యమంటావయ్యా బాబూ ! అన్న గడువుదాటి వీనాడో అయింది. నువ్వు రాగానే చెల్లుబెడతానన్నా. అప్పు తీర్చక 'బాబూ నాయ్నా' అని మంచీ చేసుకోక ఎలా గడుపుకొస్తావని ?"

"వాళ్ళు మనకేవన్నా దాయాదులా ? భాగార్లా ? గడుపుకొస్తాట్ట ! గడుపురురాడం !"

"గడుపురా కేం చేయమంటావ్? ఎక్కడా డబ్బుపుట్టలేదూ; బంగారం మీదే పలకలేదాయె ! చావనామరి ? అప్పు తెచ్చాను. పోనీ వసూలైన బాకీలు నువ్వైనా పంపించావూ, నీ సిగ తరిగిరి ! అతీ గతీ లేదు ! ఇంతకీ ఎంత వసూలయింది ? ఇలా పారేయ్. వీళ్ళ మొహాన్నా, ఆ దేవీదయాల్ మొహాన గిరవాటేసొస్తాను. గణేశ్ దాస్ అప్పుమాట తర్వాత చూద్దాం."

"ఇంతమంది కీయడానికి నా దగ్గ రెక్కడుందీ డబ్బు ?"

"వసూలు కాలేదూ ?"

"ఆఁ! వసూలయింది ముందా ఏభై !"

"ఏభయ్యా వసూలవుత ? రెండువేల పై చిలుకు చేతికందాలే!"

"ఒకళ్ళిస్తేనూ చేతికందడం ! అప్పవనుకురాదని, ఎంత గిజామన్నా మూడొందలు దాటందే! నిరుడు నా లాభం నా కియ్యరా బ్రహ్మదేవుడా అంటే నువ్వివుపించికుంటేనా ? నా వాటా రెండొందలేభై మినహాయించు కున్నా. ఇదిగో, మిగిలిందేభై."

"మినహాయించుకునా, లెక్కచెబుతున్నావ్ ! హోరి, నీతసలరవల ! ఏభయ్యే వసూలయ్యే యంటేనూ, గుండె తారత్తిందిలే !"

ఇద్దరూ చస్టామీద కూర్చున్నారు. కొంత సేపు ఎవరూ మాట్లాడలేదు. ఒకర్నొకరు తలెత్తి చూసుకోనూలేదు. గణపతి మామూలు గ్రంథం విప్పేడు: "పదిమందిలోనూ నువ్విలా, నాపరువు తీస్తావనుకోలేదులే; ఏమిటో అమాయి కంగా నమ్మేశాన్నునిన్ను !" ఈ మాట అని తన వాటాదారుణ్ణి రొష్టా యిద్దామనుకున్నాడే కాని గణపతికి మొహం చెల్లిందికాదు; చాటు చేసు కున్నాడు. దయాలు అతనికేసి తిరిగి చూశాడు. గణపతి దొంగతనం చేసిన వాడిలా వెలవెలబోయాడు. తత్తరబాటును గ్రహించి దయాలు బుర్రడూపాడు. ఆఖరుసారి గణపతి మోములో కనిపించిన భావం, వైఖరి అతనికసహ్యమనిపిం చింది. స్పష్టంగా అచ్చుగుద్దినట్లు అక్షరాలు వ్రాసినట్లు అతన్లో కుళ్ళు మోత్తనం కనిపించింది. గణపతికి తనంటే ఎందుకింత అక్కసు ! అతనికి తెలియ కుండా ఏ రహస్యమూ తనుదాచలేదే! తన వాటాదారుణ్ణి తానెన్నడూ దగా చేయలేదు. కించె పరచలేదు. ఇప్పటికీ అతన్ని ఒకమిత్రునిగా తన కుటుం బంలో ఒకణ్ణిగా చూస్తున్నా గణపతి ఎరుసెరుగానే వుంటున్నాడు. అతను వట్టి స్వలాభపరుడు. తనపొట్టా తనబట్టా తప్ప యింకేమీ అక్కర్లేదు. గణపతి స్వార్థం ఎంతటిదో దయాలుకు జ్ఞాపకం రాసాగింది. ఇదివరకతను చేసిన చేష్టలన్నీ తరచి తరచి తలుచుకుంటున్నాడు. ప్రయత్నంచేసి మాట్లాడు తున్నట్లు దయాలు " ఊఁ; ఇలా చూడు ! ఓ పనిచేద్దాం.........అప్పులు నెత్తిని తన్నుతున్నాయ్. రుణం వ్రణం ఒకటేనన్నారుకదా పెద్దలు...... దేవీదయాలూకుకు నే ఘుటం కాదాయె ! వాడిబొడ్డుపాక్కా, రోజూ పీకెల మీదకి వావాలా ! మల్లుగారు సరేసరి ! అడిగావా ఆయనన్సంగతీ ...... ముందా రెండు పద్దులూ తీర్చేశామా, ప్రాణం ఓ గూటిని పడుతుంది. "

"తీర్చేసేయ్!"

"హాఁ! అదే నేనూ చూస్తోంట!......నీ దగ్గరెంతుందన్నావ్?... రెండువందలు కంపెనీపేర బదులియ్యి. నువ్వో ఏభై అందాకా ఖర్చుల కుంచుకో. పై వొచ్చేవారం లాహోరెళ్ళి బాకీలు వసూలుచేసుకొస్తా.,.... అక్కడ మనకో ఐదారువందలు రావాలి; మనమూ యియ్యాలి. విరియా వేసు కొచ్చేస్తా".

ఈ మాటలు వినడంతోనే, గణపతికి నెత్తిమీద పిడుగుపడ్డట్లయింది. నిజానికి తాను లాహోరు వెళ్ళి వసూలు చేసింది ఎనిమివందలు కరుకులు. లాహోరులో రావలసిన బాకీలన్నీ ముక్కపిండి వసూలు చేసుకొచ్చాడు. అయితే అవి అక్కడే ముండలకీ ముసుగులికీ ఖర్చయిపోయాయి. లాహోరు కమానుకెళ్ళడమంటే గణపతికి కోతికి కొబ్బరికాయ దొరికినట్లే. అతనికి ఓ చిన్న 'లంపటం' వుంది. వేశ్యయింట్లోవున్న సుఖం యింట్లో వుండదు. అది అతని అనుభవం. కనకనే డబ్బంతా అక్కడే జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణ మయింది.

"నా దగ్గి రేం మిగలందే!...లాహోర్లోమాత్రం ఏంవసూలై ఏడుస్తుంది? హాత్తేరి యిస్తేనేకాని వీల్లేదనికూచుంటే ఏదో నాలుగురాళ్ళువసూలయాయి... ఇక నువ్వెళ్ళిమాత్రం చేసే దేమిట్లే? నాకిచ్చేంది, నీ కెలా యిస్తారు?"

దయాలు కీ మాటలు అనుమానం వేశాయి. ఒక పెద్దన్నగారు తన తమ్ముణ్ణి అడిగేతీరున అతను "డబ్బుకేంలే. ఏదో కిందా మీదా పడదాం. ముందు ఖాతాలు సరిచూచుకుంటే చివరికి మన మెంతివ్వాలో, మనకి వాళ్లెంతివ్వాలో కరాఖండీగా తేలిపోతుంది... ఏ యే బాకీలు వసూ లయాయో చెప్పు" మునూను కాగితం కలం తీసుకురమ్మని "గణపతి చెబుతూ వుంటాడు; నువ్వు కూడుతూ వుండు. తప్పురానీయకేం?"

ఇంతసేపట్నుంచీ మునూ పొంచుండి వాళ్ళసంభాషణంతా వింటూనే వున్నాడు. దయాలు పిలుపు విని తల నిగిడించాడు. "ఎక్కౌంటు పుస్త కాలు పట్రా" అనేమాట వినిపించడం తరువాయి గబగబ చేతులు కడుక్కుని మరీ పట్టుకొచ్చాడు. గణపతికి తోక తొక్కినట్లయింది. కస్సుమని లేచాడు: "కూలి వెధవలముందు వ్యాపార రహస్యాలు, ఖాతాలు చర్చిస్తా నను కున్నావా? నే నేం మూర్ఖుణ్ణికాదు... ఆ కూలి వెధవ ఎక్కౌంటు పుస్త

కాలు ముట్టుకోవడవే? నేను చెప్పేవాణ్ణి; వాడు రానేవాడూ! హాఁహాఁహాఁ! నీకంత బులుపుగావుంటే నెత్తిమీద కెక్కించుకుని పిండి దంపించుకో".

"వాడిమీద నీ కెందుకంత కోపం? అక్క-పక్షి. తల్లీతండ్రీ లేరాయె. మనల్ని నమ్మి మన్తో వచ్చేశాడు. ఇహం పరం చూసుకోవాల్రా అబ్బాయ్! కుర్రాడి చలాకీచూస్తే కూలిపనిచెప్ప మనసు పుట్టడంలేదు. మనం కాస్త తర్ఫీదిస్తే కాతాలు రాసేస్తాడు. ఇంతకీ వాడు వింటే మన కొంపేం మునిగి పోదు. మిగతా కూలీలా, వాళ్ళు విన్నా ఏమీ బోధపడదు!"

"మహా చెప్పొచ్చావ్ లే, వీడి తెలివి! నాలు గంకెలు రాగానేసరా, కూడికలు చేసేయగానే అయి పోయిందా? ఎక్కౌంట్లు మజాకాలు కావు, బొడ్డూడని వెధవకి గుమాస్తాపని!".

"నీకు ముక్కుమీదుంది కోపం!".

"వాణ్ణి నాదగ్గిరకి రానీయకు; వచ్చాడా, మెడలు విరిచేస్తాను తొత్తు కొడుక్కి!".

దయాలేమీ మాట్లాడక తిన్నగా కాతాపుస్తకాల ద్గ్గరకు వెడు తున్నాడు. చట్టాదగ్గరకు వెళ్ళనా, మాననా అని మునూ అనుమానంపడి అక్కడే నిల్చుండి పోయాడు. గణపతి గుండె బితుకూ బితుకూ మంటున్నది. బాకీలు జమకట్టించుకుని తాను వాటిని అద్వైతభావంతో కైంకర్యం చేసినసంగతి బయటు పడిపోయింది. జమాఖర్చులనుంచి దయాలు దృష్టి మళ్ళించాలని గణపతి ప్రయత్నిస్తూ "నా దో ప్రశ్న. జాగర్తగా ఆలోచించి మరీచెప్ప సమాధానం. మిగతా వాళ్ళందరికంటే వీణ్ణి మనం ఎందు కింత నెత్తికెక్కించుకోవాలీ అని?".

దయాలు ఎక్కౌంటు పుస్తకాలు తిరగేస్తూ "వాణ్ణి మనమేం నెత్తి కెక్కించుకున్నాం?" సమాధానం ప్రశ్నరూపంలో వచ్చేసరికి గణపతికి అదురు పుట్టింది. చిట్టా ఆవర్జాలు దయాలు తిరగేస్తున్నాడు. సమాధానం చెప్పవలసిన సమయం వచ్చేసింది.

ఊరుకోక గణపతి రెట్టించాడు: "జాం తీసుకెళ్ళి కొంపలమీదికి తెచ్చాడు. ఈ సాయింత్రం జరిగిన అల్లరికంతా వీడే కారణం!"

"అందర్నీ ఎందుకుచెప్పు అలా ఆడిపోసుకుంటావ్? నోటి దురుసుతనం కానీ నీకు! పంపించింది నేను; పట్టుకెళ్ళింది వాడూ. వాళ్ళ తప్పూకాదు; వీడి తప్పూ కాదు. ఈ తగువులు సద్దేసరికి నా తలప్రాణం తోక్కొస్తోంది!"

"అయితే తప్పంతా నీదే అంటాన్. లంచం యియ్యాడమెందుకు?"

"ఎందుకా? పుచ్చుకున్న బాకీ తీర్చకపోతే చెవంఁడా లూడతీస్తారు. మంచి చేసుకున్నాను. తప్పేమిటీ?"

"నోటు రాసి బదులు తెమ్మనమని ఎవడు చెప్పాడు? అంతగా కావాలంటే బదులు తెచ్చుకుంటాం. కాని, రాతలూ కోతలూనా? కాయితం నలుపు చేస్తే బలికోరుతుంది. నోటితో ఓ మాటంటాం, వుందీ తీరుస్తాం, లేదూ గప్‌చిప్‌గా వూరుకుంటాం. నోటిమాట మంచిదా, నోట్లుల్లో మాటలు మంచివా ?"

"ఏది మంచో, ఏది చెడ్డో నాకు తెలీదుకాని, అప్పు పుచ్చుకుని మాట తప్పడంమాత్రం మంచిది కాదు. నోటు రాస్తే అంతా ఖరారుగా వుంటుంది. మనం అబద్ధమాడినా నో టబద్ధంవాడదు."

"అది బిజినెస్ పద్ధతికానేకాదు".

"పరపతి పోతే బిజినెస్సేలేదు. పరపతే బిజినెస్సు".

"ఆఁ చెప్పొచ్చావ్‌మహాఁ! పరపతి! పరప......తి!.

"ఇలా చేస్తే అయ్యా తిరపతికీ, అమ్మ ప...ర...ప...తి కీ".

"ఝూటాకోరుతనమంటే......"

"ఎవర్ది? నీదా, నాదా?" దయాలు గణపతి నుద్దేశించి ఏమీ అనలేదు. వ్యాపార సరళిని గురించి ముచ్చటిస్తున్నాడు. ఎలాగైనా గిల్లికజ్జా తెచ్చుకుని ఎక్కౌంట్లు గొడవతప్పించుకోవాలని కయ్యానికి కాలుదువ్వేడు.

"నేను నిన్నన్లేదోయ్ గణపతీ! వ్యాపారానికి పరపతుండాలంటున్నాను".

"అంటే నాకు లేదనేగా నీ ఉద్దేశం ?".

"నేనన్లేదోయ్ బ్రమ్మదేవుడా !".

"నీసంగతి నాకు తెలవదూ? మల్లు పెళ్ళాం అలా దుమ్మెత్తిపోసిందే! పల్లెత్తుమాటనక పైపెచ్చు లంచాలు మేపావ్! ఎవడబ్బసొమ్మనీ? నీదగ్గిర నాకేం భయంలేదు. నేనేం బానిసనుకున్నావా నీమటుక్కి? నువ్వేదంటే అది పడ్డానికి నీ గులామునను కున్నావా?......నాయిష్టం. నాకుహక్కుంది. రెండ్రొందలేభై కాదు......ఎనిమిదొందలు వసూలుచేశా. అంతాఖర్చయింది.

ఏళ్లై మిగిలాయ్. ఆఁ. అమీర్ జాన్ ఒళ్లో పోసేశా. అత్తరువులు కొనుక్కున్నా. అనుభవించా. కాదనే మాదన్నె వడని !"

"డబ్బంటే ఖర్చుకాక ఏమవుతుందోయ్ ! ఆమా టెవడడిగాడూ నిన్ను ?......ఉహుఁ ఇంకా పెళ్ళికావల్సినవాడివీ......పైలా పచ్చీసుగా తిరగడం ఏవంత మంచిదీ ? ఋణంమాటూ, ఏదో కిందామీదా పడదాం... చెప్పావ్, సంతోషం !".

"పెద్ద మహరుషిలా మాట్టాడి నన్ను తొక్కి—పెడదామనుకుంటున్నావ్ ? నీనంగనాచికబుర్లు నాదగ్గిరా ! తాతకి దగ్గులా...... ".

"అనవసరంగా కరవొస్తా వెందుకు గణపతీ ?".

"తడిగుడ్డతో పీకెలుఁకోయడం నాకు తెలియదులే. నేనేమో వుండా కోరుని. నువ్వేమో తగుమనిషివి?".

"ఎవరన్నారామాట ? నీకు నువ్వే అనుకుంటున్నావుకానీ !".

"నువ్వేమో మడికట్టుకున్నట్టు మాట్టాడుతున్నావులే మరి !".

"నే నేం శుకమహాఋషినని చెప్పానా ? నేనూనీలాగే పెళ్ళికాకుండా వుంటే ఏం చేసేవాడినో ! ఇంతకీ నీ నడతగురించి నేనేం అన్లేదే. నా గురించి నువ్వేమన్నా అనుకుం టుకో. ఆపాపంనీదే. నాజీవితంలో వొకర్నికోప్పడేది లేదు ; ఒక్కసారంటే ఒక్కసారి తప్ప...అప్పుడే రెండుమూడేళ్ళవొస్తోంది. మోగా వెళ్ళి బాకీలు వసూలుచేసుకొచ్చి చెప్పనన్నా చెప్పేవుకావు. అప్పు డైనా నాతో చెప్పనందుకే నీమీద కోప మొస్తే, జ్ఞాపకంవుందా ? ".

"నువ్వా నువ్వు ! విషప్పుచ్చివి. తేనెపూసిన కత్తివి. దారం పోగుతో మెడకాయి కోసేస్తావు కదరా !".

"అబ్బాయ్, నా సంగతి తెలుసుండీ ఎందుకలా అంటావ్ ! ముక్కుకు సూటిగా పోవడం తప్ప నాకేం తెలియదు".

"ఒసోస్సీ ! బయల్దేరాడ్రా బస్తీలోకల్లా పెద్దమనిషీ. నోట్లో చెయ్యిపెడితే కొరకలేడూ, వెన్నపెడితే మింగలేడూ !".

"ఒకరిచేతులు కొరకనూలేదు ; వెన్నముద్దలు మింగనూలేదు. బతుకులో కష్టపడడమే నాపని. అలాగనే కష్టపడుతున్నాను. ఈ బస్తీ పోకిళ్ళంటావా, నాకేం తెలీదు. ఇప్పటికీ నేను కూలాణ్ణనేమాట మర్చిపోలేదు ; ఎప్పుడూ మర్చిపోను. మర్చిపోలేను."

"పశేసిన్నీ, పల్లెటూరు ముండాకొడకా! పందిలా అరుస్తావ్!"

"మితిమీరిపోకు గణపతీ. మనం జాయింటుదార్లం. ఆమాట మర్చిపోతే ఎలా?"

"జాయింటూ గీయింటూ జాన్తానై. నావాటా నాకు పారేయి. చిప్ప చేతికిచ్చి పంపిస్తా. కూలిగాడిద! నీబతుకే అంత...కుక్కని అందలమెక్కిస్తే అందలమల్లా తెగకొరికిందట!"

గణపతి అసలేకోతి. నిప్పుతొక్కాడు. దయాలు అలుసుచూసి కల్లు తాగినట్లయింది అతని బుద్ధి: "నీకూ నాకూ ఇవాళితో సరి" అంటూ దూకుడుగా కాతా పుస్తకాలు భుజంమీద పెట్టుకున్నాడు. మళ్ళీ తిన్నె దగ్గర కొచ్చి జోళ్ళు తొడుక్కోబోతూ "తెగ నీలుగుతున్నావ్!" దయాలు గణపతి జోడు తీసుకొచ్చి అతని కందిస్తూ "నీ జోడుచ్చుకునే తన్ను నన్ను. తప్పుంటే మందలించాలి కాని అంతాగ్రహమైతే ఎలాగ? రెండేళ్ళనుంచి అన్నదమ్ముల్లా వ్యాపారం చేసుకొచ్చాం. వృద్ధిలోకొచ్చాం."

"ఏడిశాం; నా జోడిలా పారేయి"

"తిట్టు నీ ఇష్టమొచ్చినట్లు తిట్టు...కాని, పోవడం దేనికీ, వ్యాపారమెందుకొని?"

"నీతోనా నాకు వ్యాపారం? కూలి ముండాకొడుకుతో? నాపరువు ప్రతిష్టలు తక్కాలా?"

"శాంతించు గణపతీ!"

"ఊరుకోరా, ముక్కుకోస్తే నెత్తురు తాగుతావ్, మొండి ముండాకొడకా!"

గణపతి దూబరాగా మాటల్ని ఖర్చుపెడుతూ విసురుగా వెళ్ళిపోబోతున్నాడు. దయాలుకూ గణపతికీ మధ్య చెలరేగిన గాలిదుమారం మునూ గుండెను బేజా రెత్తించింది. వెళ్ళిపోతున్న గణపతి పంచె పట్టుకుని మునూ దీనంగా "వెళ్ళిపోకండి .బాబూ!" అని బతిమాల జొచ్చాడు. తులశీ, బొంగా, చివరకి మహారాజ్ సైతం చేతులూపుకుంటూ పరుగెత్తుకువచ్చి అడ్డంపడ్డారు. గణపతి రోషంతో "పొండి లంజ కొడకల్లారా!" అని అరిచి చేతని విదిలించాడు. మునూను అవతలకి తోసివేశాడు. గణపతిచేయి సుత్తి దెబ్బలా తగిలింది. కుర్రవాళ్ళదరిపడి దూరంగా తొలగిపోయారు. రెండు చేతులతోను బుర్రపట్టుకుని కూలబడి పోయాడు దయాలు.

"అన్యాయం. ఇది నీకు తగదు" పోతున్న గణపతి దారికడ్డం నిలచి "వెనక్కిరా గణపతీ! అయిందేదో అయింది" దయాలును గణపతి ఒక్క తోపు తోశాడు. "హాఁ హాఁ" అంటూ ఒరిగి నేలపై పడపోయాడు దయాలు. "పోరా కొండముచ్చు వెధవా! నీతో నాకేం పని?" ఒక అడుగు గుమ్మం అవతలకు వేసి "కుక్కలా మొరక్కు. కపడ్దార్. నాతో తమాషాలు కాదు. థూ థూ."

గణపతి కాండ్రించి ఉమ్మి బయటకు పోయాడు. బయటకు వెళ్ళి పోయినవాడు ఊరుకుంటే బాగానే వుండును. ఇంటింటికీ పోయి "ఇం కేముంది, మీ కొంప లార్పేస్తున్నాడు. నాలుగయిదు రోజుల్లో దయాలు గాడు దివాలా.... ఎవరి ఋణాలు వాళ్ళు, దీపం వుండగానే ఇల్లు చక్క బెట్టుకోండ"ని దప్పుకొడుతున్నాడు. అడిగిన వాడితోటీ అడగనివాడితోటీ ఇదే ప్రచారం. పాత కాతాలను తాను తిప్పుకుని తనే ఎసెన్సులు తయారు చేసి సరుకు సప్లయి చేస్తున్నాడు. చిన్నకొంప ఒకటి అద్దెకు తీసుకున్నాడు. పూలరంగళ్లా వ్యాపారం సాగిస్తున్నాడు. దయాలు దివాలా తీస్తున్నాడనే భావం అందరికీ దృఢపడింది. అతను బెంగపడి మంచం పట్టడంవలన ఫ్యాక్టరీకి వెళ్ళడం లేదు. గణపతి అతన్ని ఒదిలి వెళ్ళిపోవడం బెంగనిపిం చింది. అందుపై తాను దివాలా తీస్తున్నాననే ప్రచారం అతన్ని క్రుంగదీయ జొచ్చింది. అప్పు లెలా తీర్చగలననే దిగులు పట్టుకుని పీడించ సాగింది. మనసు మనసులో లేదు.

ఋణదాతలు ఒకళ్ళ తరవాతింకొకళ్ళు గుమ్మం తట్టుతూ "రా, ఇవత లకి రా! కనిపించకుండా మొహం చాటేసుకుంటావేం?" అని ఒకరూ "నువ్వుదాక్కున్నా నోటు దాక్కోదు. కాకాసురుణ్ణి తిప్పినట్లు నిన్ను మూడుకోర్టులూ తిప్పి మూడుచెరువుల నీళ్ళు తాగిస్తుంది." అని ఇంకొకరూ అతన్ని వేధించసాగారు. దయాలు కి కేకలు వినిపించడంలేదు. ఇంట్లో మంచం మీద స్పృహతప్పి మూలుగుతున్నాడు. ఋణదాతలు తలుపు దబదబ కొడు తున్నప్పటికీ లోపలవున్న కూలివాళ్ళలో ఎవరూ తలపుతీయసాహసించలేదు. దయాలు భార్య తన భర్తమంచంమీద కూర్చుని కాళ్ళు పడుతున్నది. దూరం నుంచి కేకలు వినిపిస్తున్నాయి. తలుపు తెరచి తన భర్తకు జ్వరంగా వుందని చెప్పి వాళ్ళని పంపిద్దామనుకుంది. కాని వాళ్ళేమో కొత్తవాళ్ళు; తనేమో యింట్లో పడివుండవలసిన స్త్రీ. ఫ్యాక్టరీ తలుపు తెరచి "ఒరే తులశీ! ఒక్క

సారి, బాబ్బాబూ! బయటకెళ్ళి ఆయనకి వొంట్లో నింపాదిగాలేదని చెప్పి రామ్మా! రేపొచ్చి కలుసు కుంటారని చెప్పేం!" అన్నది. అమ్మగారి ఆజ్ఞ అందుకుని తులశి "మునా! వెళ్ళి బాబుగారికి ఉష్టంవచ్చిందని చెప్పిరారా", అని తన పని వాడికి బదిలీచేశాడు. వాడి కేం చెప్పినా ఇంతే. పిల్లికి చెబితే ఎలక్కీ, ఎలక్కి చెబితే దాని తోకకీ.

మునా అవతలకి నాలుగడుగులు వేశాడు. మహారాజ్ నీళ్ళు తోడు కుంటున్నాడు. నూతిమీది నిల్చునిగోడమీంచి సందులోకి ముంగిసలా తొంగి చూస్తూ మునా "లల్లాగారూ! అయ్యగారికివొంట్లో నలతగావుందండీ! వాంతులవీని! రేపటికి జ్వరం తగ్గిపోతే వచ్చి మిమ్మల్ని కలుసుకుంటాడు."

లల్లాలు గోడకేసి తలఎత్తి పరకాయించారు. తెల్లనిలాల్చీ వేసుకున్న పొట్టి బుడంకాయ "ఏమి టేమిటీ? జ్వరమని చెప్పమన్నాడా నిన్ను?"

"లేదండి లల్లాజీ! నిజంగా వొంటిమీద స్పృహలేదండి" "ఎందుకుంటుంది? తిన్నసొమ్మరక్క తొత్తుకొడుకు ఆపశోపాలు పడుతున్నాడు. ఇవతలకి వస్తాడా? మమ్మల్నొచ్చి యీడ్చుకు రమ్మంటాడా?"

"ఈపూటకూరుకోండి బాబూ! రేపాయనే వస్తారు!"

"ఈపూట కూరుకోండా? హారి లంజకొడకా! వెళ్లి ఈడ్చుకురా, ఘోషా" సిల్కు లాల్చీవేసుకుని పెద్దబానలాటి బొజ్జ ముందరికి తోసుకొస్తూంటే, జారిపోతున్న బుట్ట తలపాగా సరిచేసుకుంటూ ఒక లల్లాముందు కొచ్చి 'తంతానుండ'ని మునాను బెదిరించాడు. మునా లోపలకి పారిపోయాడు.

లల్లాలు ఇంటిముందర నించున్నారు. సరిగ్గా ఆదేసమయానికి తోడరుమల్లుభార్య మేడమీద వంటిల్లు కడుక్కుంటున్నది. ఆవిడకీ గొడవేదీ వినిపించలేదు. తన గొడవేదో తనది. కడిగిన మురికినీరు లల్లాల బుట్టితలపాగాల మీద జర్రిపోతులా సాగి దబదబ పడసాగింది.

"ఏవమ్మోయ్! నువ్వెవరువో కాని, మహాతల్లివి! మగాళ్ళమనైనా మన్నాపనలేకుండా ... అరరె ... బట్టలన్నీ ... ఏ మమ్మోయ్! తల్లీ! ... నీకే ... అరరె ... ".

"అయ్యయ్యో! నే చూసుకోలేదయ్యా! పాపం! ఎంతపనయింది!... ఇంతకీ ఎందుకలా మా గుమ్మాలముందు దేకుతున్నారు. ?".

"మీ ఇంటికాక్కాదమ్మా! మా కొంప లార్చేశాడు ఈ దయాలుగాడు!"

"హాఁ హాఁ".

"ఐ. పీ. పెట్టేశాడమ్మా !".

ఈ మాటలు విని తోడరుమల్లుభార్య మేడదిగి క్రిందకు దబ్బుదబ్బున పతిగెత్తుకు వచ్చేసింది. "అయ్యో, అయ్యో ! నేనేం చేతునే నాతల్లీ! వీడి మొహంమొద్దులకెత్తా, మాదగ్గిర ఐదొందలు ... అయిదొందలు ... కరుకులు ... వీడెదాన కొట్టారమ్మా ఆయన. ఒద్దయ్యా బాబూ అంటూనే వున్నా. విన్నారా ఆయన ? ఏం చేతునే, నేనేం చేతునమ్మా ! ...... గప్‌చిప్‌గా దివాలాతీస్తావా ! నిన్ను దిబ్బలమీదకెత్తా ... పామైనా కరవదరా నిన్ను!"

"మీకే ... ఎగనాం పెట్టాడమ్మా ? ".

"హాఁ... ఆయనకే...అంత ఉద్యోగమా...అయన్నే బుట్టలో వేసు కున్నాడమ్మా బోడి వెధవ. నంగిరోడుతూ వచ్చాడూ. ఆయన కేంతెల్సూ పాపం, అవుగు కామోసనుకున్నారు...ఐదొందలు... కరుకులు...మా ఉసు రెప్పుడు తగులుతుందో కాని వెధవకి! "

దయాలుకి వొంటిమీద చైతన్యంలేదు. అతని మంచంపక్కనే మంచం వేసుకుని దయాలుభార్య పడుకుంది. ఆమె చెంత మునూ చేరబడ్డాడు. వీధిలోనుంచి గొంతుకలు వినిపిస్తున్నాయి. మల్లుభార్య తిడుతూనేవుంది. "ఇవతలకి రారా పీనుగా ! తలుపు తెరు!"

మునూ భయంతో వణకిపోతున్నాడు. దయాలు భార్య అతని తల నిమిరింది. ఉండి ఉండి ఒక్కసారి బావురుమని ఏడిచింది. మునూ వెక్కి వెక్కి బావురుమన్నాడు. పొట్టి లల్లా "ఇక లాభంలేదు. పోలీసుల్ని లాక్కొద్దాం రండయ్యా!"

"వుండండుండండి! మావాడు ఇనస్పెక్టరూ! లోపల కెళ్ళి తీసు కొస్తాను" తోడరుమల్లు భార్య మేడపైకి వెళ్లింది.

తన భార్య ఏడుపు విని ప్రభుదయాలు లేచాడు. కళ్లు విప్పి భార్యకేసి చూసి "ఎందు కేడుస్తున్నావ్ ? " మునూ బొంగురుగొంతుతో "లల్లాలు అల్లరి చేస్తున్నారు బాబూ!" దయాలు నెమ్మదిగా ఆనుకుని లేచి నిల బడ్డాడు. కిటికీ దగ్గరకు వెళ్లి వీధిలోకి తొంగిచూశాడు. మనిషి నీరసంగా వున్నాడేమో, కాళ్లు తేలిపోతున్నాయి. చేతులు గజగజమంటున్నవి. నమస్కారం చేస్తూ "క్షమించండి లల్లాజీ. ఎవర్నీ వుంచుకోను. వడ్డీపైసల్తో సహా యిచ్చుకుంటాను. తల తాకట్టుపెట్టయినాసరే..."

"ఆఁ ఆఁ తీరుద్దువుగాని...తీరుద్దువుగాని...ముం దివతలకి రా"

"ఇంతసేపాయి, అరుచుకుని చస్తున్నాంకదా, వినిపించుకోవేం?"

దయాలు చేతులురెండూ జోడించి "నాకు జ్వరమండి...మంచంమీద పడిపోయాను...వినిపించలేదు."

"వినిపించవులే, ఎందుకు వినిపిస్తాయ్ నాన్నా, మామాటలు? ఏదో అరుచు కరచుకు ఆ కాకే చస్తుందని నీ ఎత్తు! హాఁ"

దయాలు గొంతుక విని మెరుపులా తోడరుమల్లుభార్య ఇవతల కూడి పడింది. ఆవిడ వెనకాలే కొడుకురామనాధ్ ఎంతోగర్వంగా భుజా లాడించు కుంటూ వస్తున్నాడు. మెడ వలంగావుంది. మనిషి ఊరిపోయాడు. కాకి యూనిఫారం వేసుకుని నల్లనిబెల్టు బిగించుకున్నాడు. పిస్టలూ, విజిలూ తగి లించుకునే వున్నాడు. భయంతో గజగజలాడుతూ దయాల్ "క్షమించం డినస్పెక్టరుగారూ! దాసుణ్ణి."

"హుఁ దాసుడి తప్పులు దండాలుతో సరనుకున్నావా? బంఛత్! తొక్కవొల్చేస్తాను. దిగు; దిగి యిలా రా."

"వస్తాను దొరగారూ, అక్కడకే వస్తాను." దయాలుకి నోట మాట పెగలడంలేదు. తనను గణపతి దగాచేసి యింత రొష్టుపాల్చేశాడనే చెప్పా లనుకున్నాడు. కాని మాట జంకింది.

ఇన్‌స్పెక్టరు క్రోధంగా "రావా? రాకు రాకు. పోలీసుల్ని పిలిపించి అరదండాలువేయిస్తా."

"అరదండా లెందుకు దొరగారూ! తమ దాసుణ్ణి, తమ చెప్పు చేతల్లో తిరిగే కూలాణ్ణి...గణపతి నా కొంప..."

బానలాటి కడుపు నిమురుకుంటూ ఏక లల్లా దయాలుమాట కడ్డం వచ్చాడు: "తెలుసురా...అవన్నీ తెలుసు...మాలాగే నువ్వూ కుబేరుడివై పోవాలని నీ ఆశ?"

పొట్టి లల్లా యింకోకమాట అందిచ్చాడు: "ముందు వాణ్ణివతలకి లాగి ఆ ఫ్యాక్టరీకి తాళం వేసేద్దాం...ఉన్న లొడ్డూ లొసుగూ అమ్మితే మన బాకీ కొంతకాకపోయినా కొంతైనా తీరుతుంది."

తోడరుమల్లు భార్య వ్యవహారం చెయ్యిదాటిపోనీక "ముందు మా బాకీ విరియా వేసుకుంటేనేకాని సామాను తియ్యాస్తికాదు, మా కయిదొంద

లీయాలి. ముందు నే నమ్మించేస్తాను. వుండండి...ఇన్నాళ్లూ పొగల్తో చంపేశాడు మమ్మల్ని."

వీధంతా గోలగోలగా వుంది. ఈ గోల విని యింటియజమాని బాబూ దేవదత్తు పరుగెత్తుకొచ్చాడు. నల్లగా మసిబొగ్గులా వుంది మొహం. పంట్లాం వేసుకుని లోపల చొక్కా పెట్టుకుని దొరటోపీ ఆడించుకుంటూ షోగ్గా వస్తున్నాడు. వస్తూనే "హేయ్ దయాల్! అద్దె యిచ్చేయ్;" దారి కడ్డుగా నించున్న పిల్లల్ని ఒక ముసలిది "దారి యియ్యండి దొరగారి కం"టూ పక్కకు నెట్టుతున్నది. మళ్ళీ దత్తు కోతిలా పళ్ళికిలించి "అద్దె కట్రా !" అని హుంకరించాడు. దయాలు చేతులు జోడించి "మీ బాకీ తీర్మానం చేస్తా బాబుగారూ !"

"ఎప్పుడ్రా? తక్షణం."

"కొంచెం చెయి మార్చుకోనీయం డయ్యగారు".

"ఈ వెర్రి మొర్రివేషాలు నాదగ్గిర పనికిరావు. పోయి ముందు నాఅద్దె నాకు కట్టు."

"చిత్తం చిత్తం." దయాలు లోపలకు వెళ్ళిపోయాడు. ఈ లోపున దూరంగా ఒకసిక్కు మరొక మహమ్మదీయుడూ జనాన్ని తోసుకుంటూ యిటే వస్తున్నారు. ఎర్ర టోపీపెట్టుకుని, నీలిపాగాచుట్టి చేతిలోని కొరడా విసురుతూ "హేయ్, హేయ్" అని దారి చేస్తున్నారు. వాళ్ళ వెనకాల పోలీసు సర్కిలు తూలుతూ నడిచివచ్చాడు. సర్కిల్ పక్కనే తోడరుమల్లు కొడుకు. సర్కిలు పేరుమోసిన ఇంగ్లీషువాడు. కొడుకు గొప్పతనంచూసి తోడరుమల్లు భార్య మొహం నివాళిప్పళ్ళే మంతయింది. దొరను చూసి సిగ్గును నటిస్తూ జారిపోతున్న పమిటెను సర్దుకుంది. పెదాలమీద నవ్వొచిందు తూండగా తలుపుచాటుకు తప్పుకుంది. మరి, తనకొడుకు దొరచేతికింద పని చేస్తున్నాడు కదా !

"హేయ్ తేజ్ సింగ్! యార్ మహమ్మద్! వెళ్ళివాణ్ణిలా యీడ్చుకు రండ్రా" తోడరుమల్లు కొడుకు రామనాథ్ సబ్ ఇనస్పెక్టరు రాఫ్ పోలీసు ఆజ్ఞాపించాడు.

పోలీసులు వెళ్ళి ఫ్యాక్టరీ తలుపులు తీయబోయేసరికి, దయాలు ఎదురుగా ప్రత్యక్షమయాడు. పోలీసులు దుయ్యబట్టుకుని "ఏరా! కుక్కల కొడకా!" పోలీసు లీసారి కొరడా విసిరి, మీద విదలించారు. దయాలు

మెడపట్టుకుని గెంటారు. సర్కిలు బుర్ర టకాయించి రిట్టకన్నుతో దయా లును పరిశీలనగా చూసి "స్టేషన్‌కి లాక్కెళ్ళండి. ...వీడి వాలకం చూస్తే వట్టి స్కౌండ్రల్లా వున్నాడే!"

"అయ్యయ్యో! రోగ్ నెంబర్ వన్ కదండీ!" అని అందిచ్చాడు రామ నాథ్. "తెగులు కుదిరింది పీనుక్కి" అనే తల్లిమాటలు వినిపించి, రామనాథ్ "నే నొచ్చేవరకూ ఆ ఫ్యాక్టరీ తాళం వేసుంచమ్మా" లల్లాలు కొయ్యబారి పోయి నించున్నారు. ఇనస్పెక్టరు హోదాలో "రేపు స్టేషనుకి రండి. వాంగ్మూలా లిద్దురుగాని వెళ్ళండి. మీ పన్లు మీరు చూసుకోండి...వ్యవహార మంతా పోలీసు చూసుకుంటుంది లెండి!" ప్రపంచంలో లల్లాలను భయ పెట్టేది ఏదైనా వుంటే అది పోలీసు బుట్ట తలపాగాలే; ఇంకొక ఏదన్నా వాళ్ళకి భయమూ లేదు; భక్తీ లేదు. ఇనస్పెక్టరు ఆజ్ఞను అందుకుని వర్తకులు చేతులు జోడించారు. "అలాగే జనాబ్! రేపొద్దున్నే హాజరవుతాం."

దయాలు మెడపట్టుకుని తేజ్ సింగ్ ఒక్క తోపు తోశాడు. జబ్బలు పట్టుకుని యూరు మహమ్మదు గొర గొర లాక్కుపోతున్నాడు. జనం యిసక వేస్తే రాలనంత. గుసగుసలాడుకుంటూ ఆడవాళ్ళేదో చెప్పుకుంటున్నారు. గది కిటికీలోంచి దయాలు భార్య జాలిచూపులతో భర్తకేసి చూస్తున్నది. కళ్ళవెంట నీళ్ళు జల జల రాలిపడుతున్నాయి. కొంతదూరం వెళ్ళాక, దయాలు తన ఇంటివంక ఒక్కసారిచూశాడు. కిటికీ పక్కన నించుని వల వల ఏడుస్తున్న తన భార్య కనిపించింది. అతనికి ఆపుకోలేని దుఃఖం ముంచు కొచ్చింది. చెక్కిళ్ళనిండా కన్నీటిచారలు.

"వెనక్కి తిరిగి దిక్కు దిక్కులు చూస్తాడూ; స్కౌండ్రల్!" రామ నాథ్ గట్టిగా అరిచాడు. దొరగారూ, పోలీసులు 'అంతే అంతే' అన్నట్లు తలలు ఊపేరు.

దయాలువెంట కొంచెందూరంలో మునూ, బొంగా, తులశీ, మహా రాజ్‌లు వెలవెలబోతూ, బిక్కచచ్చిపోయి, బెగిలిపోయి తడబడుతూ అడుగులు వేస్తున్నారు. మునూకేదో మాట్లాడాలనిపించింది. గొంతుక పుండు వేసినంతబాధ!

కేట్‌కిల్లర్సు లేన్ దాటి పోలీసులు బుక్‌బజారుకు మళ్ళేరు. బజారు నిండా జనం ఇరువంకలా పోగయి ఊరేగింపులాగ పోలీసులవెంట పడ్డారు. మళ్ళీ గుసగుసలు, పళ్ళికిలింతలు; తామిదివరకు గౌరవించిన దయాలును అమ్మా

ఆలీ అని తిట్లు. పోలీసులు గంటస్తంభందగ్గరకు చేరారు. పక్కనేవుంది స్టేషను. ఆవరణలో బోషాణంమీద ఒక సిక్కుసార్జెంటు గుడుగుడు పీలుస్తూ మధ్యమధ్య "హేయ్ హేయ్" అంటున్నాడు. దొరగారిని చూడగానే ఠక్కున లేచి నిలబడి సలాంకొట్టాడు. "హుజూర్! హుజూర్!" సార్జెంటు లోనికి వెళ్లి బెత్తం పట్టుకువచ్చాడు. సబినస్పెక్టరు "హేయ్ పండేఖాన్! నేరం వొప్పుకునేదాకా వీణ్ణికావకొట్టు." దయాలును చెరో రెక్కా పట్టుకుని యార్‌మహమ్మదు, తేజ్‌సింగూ గోడకు నిలబెట్టేరు. సార్జెంటు బెత్తం ఊపుతూ దయాలుదగ్గరకు వెళ్ళేడు. "చెప్పు బ్లడీఫకర్! చెప్పు. ఊం దబ్బున...డబ్బెక్కడా...ఎక్కడ దాచేవ్?"

"లేదు సాహేబ్! నేనెక్కడా దాచలేదు. ఇంట్లో పుస్తీపూసైనా అమ్మి బాకీలు తీర్చేస్తాను"

"ఆక్టే మొరక్కు. పళ్ళూడదీస్తాం నిజంచెప్పు...ఎక్కడ?" ఛళ్ మని ఒక్కదెబ్బ; చుర్రుమని ఇంకొకటి.

"నిజం నా మాట నిజం. నమ్మండి హుజూర్!"

"నువ్వు ధర్మరాజువిట్రా చుప్పనాతి లంజకొడకా!" బెత్తంతో మళ్ళీ ఇంకొకటి మొహంమీద వడ్డించాడు.

సంకెళ్ళు తగిలించిన చేతులను మొహాని కడ్డంపెట్టుకుని దయాలు "లేదు సర్కార్. లేదు హుజూర్!" ఈసారి అతని దుఃఖం ఆగిందికాదు. "నువ్వన్నదే నిజమట్రా! మా దొరగారిది అబద్ధమా?" సార్జెంటు మానవ మాత్రుడు కాదు. మరమనిషివలె బెత్తంతో దబ దబ బాదడమే పని. మొహం బిర్రబిగిసిపోతుంది. ఎప్పుడెక్కన్లో నిలబడ్డాడు, బెత్తం ఊరికే ఊపుకు పోతున్నాడు. మునూ, తులశీ వెక్కి వెక్కి ఏడుస్తూ "ఆయనేమీ ఎరగ డండి! అంతా గణపతే!" సార్జెంటుకు ఆయాసం హెచ్చింది. కొంచెం సేపు సేద తీర్చుకుందుకు ఆగాడు. కొట్టడం మాని అలసట తీర్చుకుంటున్న సార్జెంటును చూసి ఇనస్పెక్టరు అగ్గిరుద్రుడై "కొట్టడ మెలాగో చూపిస్తా నుండు!" సార్జెంటు వీపుమీద నాలుగువేసి చూపించాడు. దూరంగా మునూ వాళ్ళూ ఈ దృశ్యమంతటినీ దీన వదనాలతో చూస్తున్నారు. దొర వీళ్ళని చూసి "పొండిరా పొండి!" దొర కేక విని ఇనస్పెక్టరు "తన్నండి నాలుగు" బెత్తం వూపుకుంటూ కాళ్ళమీదా, చేతులమీదా తనే బాదాడు. "లంజకొడకల్లారా! యిది చేపలబజారనుకున్నారట్రా?"

"బాబూ! కుర్రాళ్ళు; దిక్కులేని పక్షులు. కొట్టకండిబాబూ! నన్నే శిక్షించండి" దయాలు గొంతు జాలిగ పలికింది. సార్జెంటు దయాలు మీదకు పరుగెత్తుకెళ్లి "ఏమిట్రా పేలుతున్నావ్ పేలుడుగాయవెధవా!" యాదలు కంఠం బొంగురుపోయింది.

"ముందు నీ తొక్క ఊడకుండా చూసుకో ... సంతనుకున్నావురా స్నేహమంటే ... చెవకోసిన మేకలా అరుస్తున్నావ్! నాది జాలిగుండెరా ... అందుకే నేరం వొప్పుకోకుండా వున్నావ్!" సార్జెంటు జువ్వ పుచ్చుకుని మళ్ళీ వీపుమీదా, కాళ్ళమీదా, చేతులమీదా పల్చపల్చగా వడ్డించాడు. నెత్తిని చితక పొడిచాడు. జువ్వ గాలిలో జువ్వుజువ్వున శబ్దమిస్తున్నది. "చెప్పుకో నీ తాతో చెప్పుకో" మళ్ళీ ఒకటి. ఛప్పుమని చరుపు. అమ్మో అని అరుపు. తిరిగి యింకొకటి. భగవంతుడా, తండ్రీ అనే కేక.

మునూ హృదయం ద్రవించి పోతున్నది. తులశీ బొంగాలు నిర్విణ్ణులై నిలబడ్డారు. ఏడుద్దామన్నా కంటనీరు రావడంలేదు. దయాలుకేసి రెప్పవాల్చకుండా చూశారు. పైన ఆకాశంవంక తెల్లబోయి చూస్తున్నారు. గుండె, సెలవేసినట్లుంది. సిగ్గువేసింది. మొహం తిప్పేసుకున్నారు. తమ ఆత్మలలో దాచుకుని బరువుగా క్రుంగదీస్తున్న బాధలను ఎవరితో చెప్పుకోవడం! వినడాని కెవరున్నారు!.

సార్జెంటు పిల్లలవైపు రువ్వ విసురుతూ దూసుకొస్తున్నాడు. భయంతో కుర్రాళ్ళు యింటివైపు పారిపోయారు.

ఇంటికి వెళ్ళిచూసేసరికి యిల్లంతా శూన్యంగా దిగులుగా కనిపించింది. ఇంట్లో ఎవరో చనిపోయినట్లు, ఏడ్చిఏడ్చి ఊరుకున్నంత నిశ్శబ్దం. ముందు నడవలోనికి అడుగువేసే సరికే గది జీబురుమంటున్నది. నిశ్శబ్దం. నిద్రపోతున్న నిశ్శబ్దాన్ని లేపుతామేమోనన్నంత భయంగా పిల్లలు అడుగులు వేస్తున్నారు. బొంగా అడుగులు గట్టిగా చప్పుడవుతున్నవి. మహారాజ్ చీలమండలు చిటపటమని విరుగుతున్నాయి. మునివేళ్ళమీద నడుస్తున్నాడు మునూ. మూల గదిలో చీకటిలో దయాలు భార్యపడుకుని వెక్కివెక్కి ఏడుస్తున్నది. ఇంటి నిశ్చల వాతావరణం ఆమె కన్నీటి జాలుకు వణికిపోతున్నదా అనిపిస్తున్నది.

లేని స్పృహ తెచ్చుకుని తెప్పరిల్లి తులశి ఏడుపు గొంతుతోనే "కూర్చోండిరా, కూర్చోండి!" అంతా కూర్చున్నారు. కాని మునూ, కిటికీ వూచలు పట్టుకుని గదిలోనికి తొంగిచూశాడు. గది అంతా చీకటి. మూల

మూటలా పడివుంది దయాలు భార్య. విడిపోయి ఆవిడ తల నేలమీద నలు ప్రక్కలకు చెదరింది. మునూగుండె దుఃఖంతో నిండింది. ఆమె దగ్గరకు వెళ్ళాలి. తప్పదు. వెళ్ళి ఓదార్చాలి. తన తల్లీ ఇలాగే. అస్తమానూ విచారమే. సాయంకాలం ఆడుకుని యింటికొచ్చి చూసేసరికి తన తల్లి ఎందుకో ఏడుస్తూ కనిపించేది. దగ్గరకు వెళ్ళి ఏడుస్తున్న అమ్మ, తనను పెంచి పెద్ద చేసిన అమ్మ, కొడుకు సుఖమే తనసుఖంగా చూచుకునే అమ్మ చేతులు పట్టుకుని నిలబడేవాడు కొడుకు. తొందరగ నాలుగడుగులు వేశాడు. గది జరిగిపోతున్నట్లు కనిపించింది. గది మధ్యకు వచ్చి ఆగిపోయాడు. ముందుకు అడుగు పడిందికాదు. వెళ్ళనా మాననా అనే మీమాంస ఎదురైంది. ఒక కొత్తభావం అతనికి తెలియకుండానే అతనిలో ప్రవేశించింది. భావం చైతన్యమై నిలవేసింది. చిన్నతనంలోని ఉద్రేకాలు పోయి యావ్వనం పొటమరించినదనే విషయం జ్ఞప్తికిరాగానే, ఆమె దగ్గరకిక వెళ్ళలేకపోయాడు.

పరమ రహస్యమేదో కనుక్కున్నట్లు తులశి గబ గబ వచ్చి "ఒరేయ్ మునూ! పోనీ మనం ఓపనిచేస్తే! వెళ్ళి గణపతిని జెయిలిమ్మందాం" అన్నాడు. మునూ కర్థంకాక 'అంటే' అని కళ్ళతోనే ప్రశ్నించాడు. "ఏం లేదూ! జెయిలిస్తే ప్రభ బాబుని వొదిలేస్తార్రా!"

మునూ 'మహాబాగని' తల ఊపాడు. తులశి అట్నుంచి బయటకు నడుస్తూ "ఒరేయ్ మహారాజ్! బొంగా! బయటకు రండి! ఉక్కయినా తగ్గుతుంది" చిన్నపిల్లల్ని వెంటవేసుకుని నడిచే పెద్దమనిషిలా కుర్రవాళ్ళను తులశి బయటకు తీసుకుపోయాడు. మునూ మాత్రం నించున్నచోటునుంచి కదల్లేదు. కిటికీ ఊచలు పట్టుకుని అలాగే చూస్తున్నాడు, ఆమె సన్నని మూలుగులు గాలినిసైతం కరిగిస్తున్నాయి. మునూకు మతిస్థిరం పోయింది. అలాగే చూస్తూ నించున్నాడు. త్రుటికాలం నిశ్శబ్దం మళ్ళీ, సన్నని వెలుగు. గది ఏడుస్తున్నట్టు మూలుగు. మునూ కళ్ళు చీకట్లుకమ్మాయి. ఏమీ కనిపించడం లేదు. ఉద్రేకాలు బుసలుకొట్టాయి.

దుఃఖం వచ్చేముందు వుండే నిశ్శబ్దం. కష్టాలతో బరువెక్కిన దుఃఖం, మూలుగు మునూగుండె పగిలినట్లయింది. ఒళ్ళు ఝల్లుమంది. అడుగులు నడిచాయి. చుట్టూ చూశాడు. గదిలో వస్తువులన్నీ చింపరవందరగా పడి వున్నాయి. తెల్లని పిండిచుక్కలతో ముగ్గులుపెట్టిన కుండలు. దండేనికి

దుప్పట్లు, బూనీసులు, చీరెలు, రవికెలు వేళ్ళాడుతున్నాయి. మామిడిఆకుల డిజైన్లతో వున్న చీరె కనిపించింది.

ఆమె మళ్ళీ మూలిగింది. ఏడిచింది. ఆమె పడుకున్న మూలకు తన కాళ్ళు యీడ్చుకుపోయాయి. పక్కను నించుని ఆవిడ మొహంలోనికి ముందుకువంగి చూశాడు: "అమ్మా! లే! అమ్మా!" ఆవిడికీ ఓదార్పు చేతులతో బాధను తీసివేసినట్లయింది. పిల్లవాడు ముందుకువంగి ఆమె చేతులు పట్టుకుని కూర్చోబెట్టేందుకు ప్రయత్నించాడు. "లేమ్మా! లే!" ఈసారి ఆమె దుఃఖం ఆగిందికాదు. పూర్వాంకంలే దుఃఖం పొంగి పొంగి వచ్చింది: "ఎక్కడికి పోవాలో తెలీయడంలేదురా బాబూ! ఎవరాదుకుంటారు?" మెల్లగా తల యెత్తింది. అతని భుజాలపై వాల్చింది. తల బరువుగా, వేడిగా వుంది. చెంపలు తడిసిపోయి చల్లగా మంచులా వున్నాయి. ఊపిరి గాలుపు.

మునూకు అంతా అయోమయంగా కనిపించింది. ఎబ్బెట్టుగావుంది. ఆమె వణకుతున్న పెదవులు చెవిలోఏవో రహస్యం చెబుతున్నట్లు, నిద్రలో స్వాప్నికానుభూతులను, విస్మరించిన జీవితానుభూతులను స్మృతిపథంలోనికి తెస్తున్నట్లు పెదవులవణకు, గుసగుసలు!

నల్లని ఆమె మోమును తిలకించాడు. విల్లువలె కనుబొమలు వంగి వున్నాయి. నుదురుమీద చీకటిలాంటి జుత్తుపడింది. జుత్తులో రోజుమల్లె పూవులులేవు. తలనిండా ప్రతి ఉదయం నీలాంబరాలను తురుముకునేదిపాపం! నల్లనికళ్ళల్లో నిండిన కన్నీటిచుక్కలు మిలమిలమెరుస్తున్నాయి.

స్మృతిలో, తనకు జబ్బుచేసిననాటి ఉదయం గిర్రునతిరిగింది. ఆమె దగ్గరగావచ్చింది. దగ్గరకు చేరదీసింది. వొంటిమీద చేయివేసింది. నుదురు నిమిరింది. చెక్కిళ్లు ముద్దుబెట్టుకుంది. జ్వరంపోయేందుకు దగ్గరగా పడుకుంది. పాటపాడింది; పాడుతూ ఓదార్చింది.

మునూ ఆమెను దగ్గరగా తీసుకున్నాడు. అదుముకున్నాడు. ఆమె వణకుతున్నట్లు కనిపించింది. ఇన్నాళ్ళూ బరువుగావున్న తన మూగచైతన్యం దింపుకున్నట్లయి తేలికయింది. ఏవో స్వేచ్ఛఅనుభవిస్తున్నట్లు గొలుసులు విడిపోయినట్లు మనసు! ఒక త్రుటికాలం ఆమెవెచ్చదనంలో తనను తాను మర్చిపోయాడు. కనులముందు చీకటి, చిమ్మచీకటి అలముకుంది. నానాహింసలూ పెట్టిన ప్రేమ రక్తమల్లా పొంగింది. వెచ్చని కన్నీటిబొట్టులో నిప్పుసెగలు!

విచారం, విషాదం అతన్ని ఆవరించి యిదివర కెప్పుడూ ఎరగనంతగా, గుండెను కోతపెట్టసాగాయి, "ఏడుపెందుకు? ఏడిస్తే లాభమేమిటమ్మా!"

"ఏడవరుబాబూ ! ఏడవకు నువ్వేడవకూడదు "

బయటనుంచి అడుగులసవ్వడి వినిపించింది. పాదాలధ్వని దగ్గరపడింది. ఎవరో గబగబ నడుస్తున్న అడుగుల దబదబ! " ఒరేయ్ మునూ! మునూ! మునోయ్! వచ్చాశార్రోయ్, వచ్చాశారు" అనే తులశి అరుపులు వినవచ్చాయి. దయాలు గదిని సమీపించాడు. జంబుఖానామీద వాలుతూ "ఎందుకర్రా ఇద్దరూ అలా ఏడుస్తున్నారు? నేను మరి తిరిగిరాననుకున్నారా? చచ్చిపోయాననుకున్నారా ?" అతని స్వరం వణకసాగింది. నీరస పడింది. మొహం వెడవెడలాడుతూ, పాలిపోయింది.

మునూ చటాల్న లేచి దయాలు చెంతకు పరుగుపరుగున వెళ్ళాడు. "అయితే మిమ్మల్ని వొదిలేశారుకదా బాబయ్యా!".

"అసలు నామీద కేసేం లేదుకదా! వారంటు లేనిదే అరెస్టు చేశారు!" మునూ అడిగిన ప్రశ్నకు సమాధానం భార్యకు చెబుతూ దయాలు "నేనేం నీతిమాలిన వాడినా? అప్పు అంతా కాకపోయినా సగమైనా యిప్పుడు చెల్లుపెట్టేస్తాను. ఎవడిదీ వొక్క కోళీ వుంచుకోను! ఎంత చెప్పినా వింటేనా పోలీసులు? చూడు ఎలా కొట్టేరో. అబ్బ! వొళ్ళంతా సలుపు. జబ్బలు పీకుతున్నాయి!"

దయాలు భార్య కళ్ళనీళ్ళతో జాలిగా చూసింది. అతను స్పృహతప్పి పడిపోయాడు. కట్టుకున్న పంచె, తొడుక్కున్న చొక్కా చిరిగిపోయాయి. చిరుగుల్లోంచి శరీరం కనిపించింది. కనిపించినచోటల్లా శరీరం తట్లు తేలివుంది. నెత్తురు మరకలతో బట్టలు కంపుకొడుతున్నాయి. గాయాలు ఎర్రగా కదుం కట్టి సలుపు పెడుతున్నాయి.

భార్య భర్త కాళ్ళవద్దకువచ్చి కూర్చుంది. కూర్చుని వొళ్ళంతా పడుతున్నది. ఏడుపు ముంచుకొచ్చింది. తలమీద ముసుగుచాటు చేసుకుని కొద్దిగా పక్కకు వొత్తిగిలింది.

మునూ ఇంట్లోంచి వొక దుప్పటి తీసుకువచ్చి దయాలుకు కప్పాడు. తులశి డాక్టరు వద్దకు వెళ్ళాడు. ఇల్లు చాలాదూరం. కేట్ కిల్లర్ లేన్‌లో వుంది...

డాక్టరు వచ్చి దయాలును పరీక్షించాడు. మందులు కొనుక్కోమని చీటీ రాసిచ్చాడు. చీటీ పుచ్చుకుని తులశీ, మునూ బజారుకెళ్ళారు. చీకటి జీబుమంటోంది. నెల్లగా బట్టల బజారుకి వచ్చారు. సందు మళ్ళారు. ఇంత వరకూ వొకళ్ళతో వొకళ్ళు మాట్లాడుకోలేదు. సందమ్మటపోగా శైనుదాసు గుడీ, చర్చీ ఎదురయాయి. టౌనుహాలుదగ్గర యిద్దరూ పక్కకుమళ్ళారు. షేర్‌ఖాన్ మసీదుదాటి మెయిన్‌బజారులో పడ్డారు. బజారు దాటాక యూరోపియను పద్ధతుల్లో కట్టిన యిళ్లు కనిపించాయి. ఇద్దరికీ తమ యజమానిస్థితి జ్ఞాపకం వచ్చింది. బతుకుతాడో బతకడో అనే భయం పుట్టింది. గబ గబ మందుకోసం పరుగు పరుగున ముందుకు పోయారు.

మందుల షాపులో మందు కొనుక్కుని యిద్దరూ యింటిముఖం పట్టారు. మందు సీసా చుట్టూ కాగితాలు చుట్టి వున్నాయి. బిరడా దిట్టంగా వుంది. మందును చూసేసరికి ధైర్యం వచ్చింది. ఇంత పటాటోపంగావున్న మందుకి, భయంలేదు, జబ్బు నిమ్మళిస్తుందని కుర్రవాళ్లిద్దరూ ధైర్యం తెచ్చుకున్నారు.

"మహారాజు బోంగాలు కనిపించలేదేంరా" అన్నాడు మునూ.

"గణపతి బెదిరించి ఫ్యాక్టరీలోనే అట్టే పెట్టేశాడుకదట్రా వాళ్లని! నానా బూతులూ తిట్టేడు అమ్మా ఆలీ అని! విన్లేక -పోయాననుకో నేను! పనిమానేశి వెళ్లిపోవచ్చేద్దామంటే ఎలాగ పాపం! భయంకద!"

తులశి చెబుతున్న భోగట్టా విని 'ఊఁ' కొట్టడమేకాని మునూ ఏమీ మాట్లాడలేదు. గణపతంటే వాడికి వొళ్ళుమంట! నోరుతెరచి ఏదైనా అనడానిక్కూడా వాడికి విసుపుగావుంది. పొద్దున్నలేచింది మొదలు యీ నిమిషంవరకూ అంతా అల్లరేమరి! పోలీసులు, దెబ్బలాటలు, తిట్లు నెత్తురు, జైలు, మందులూ, మాకులు, ఏడుపులూ ఏమిటీ జీవితం, గుడ్డెద్దు చేలో పడ్డట్టు. మునూ వొంటరిగా అంధకారంలోనికి నడుచుకుపోతున్నట్టు ముందుకు పోతున్నాడు. వీథంతా చిమ్మచీకటి. దారిలో రోడ్డుపక్క సైడుకాలువ దగ్గర చేతిని తలగడగా చేసుకుని ఎవరో నిద్రపోతున్నారు. వుండచుట్టుకు పోయి రోడ్డుమీద పారవేసినట్లు పడివున్న ఆ మానవశరీరం మునూ పాదాలకు తగిలింది. ఎవరీ మానవుడు, పాపం!

మూసిన వొకషాపు అరుగుమీద ఎవరోకాని చింతమనిషే గుడుగుడు పీలుస్తూ కూచున్నాడు. గాలికి నిప్పురవ్వలు ఉప్పుపొట్లంలా పువ్వులు రాలు

స్తున్నాయి. నిప్పుపూవుల వెలుగుకి ఆ పక్కనే పడివున్న మరొక మానవాకృతి కనిపించింది. తమ ఆలుబిడ్డల్నీ, ఇల్లువాకిళ్ళనూ వొదులుకుని చివరకు తమ వొంటిమీదస్మారకమే లేకుండా నిద్రపోతున్న యీ మానవు లెవరు ? మునూ తనలోతాను వేసుకున్న యీ ప్రశ్నకు ఎవరూ సమాధానమీయలేదు.

మునూ మౌనంగా నడుస్తున్నప్పటికీ అతని ఆలోచనలను యిట్టేపోల్చుకున్నట్లు తులశి "రేపట్నుంచీ మనక్కూడా యిదేగతి. బజార్లో మూటలు మోయకపోతే తిండికష్టం. పగలల్లా సామాన్లుమోయడం, రాత్రిళ్లు యీ మార్కెట్లో నిద్రపోవడం."

మునూ దీనికి సమాధాన మీయలేదు.

ఇంటికి వెళ్ళి దయాలుకు మందుయిచ్చారు. మందుతాగి అతను నిద్రపోయాడు. శరీరం చెమటపట్టింది. ఊపిరి బరువు తగ్గింది. భార్యచెంతనే కూర్చుంది. ఆవిడ తన భర్తను ఎలాగూ కనిపెట్టుకు కూర్చుంటుంది కనుక మునూ, తులశీ బయటకు వెళ్ళిపోయారు. చీకట్లో మళ్ళీ ధాన్యపుమార్కెట్టుకు బయలుదేరారు. రాత్రుళ్లు రోజూ అక్కడే పడుకుంటే పొద్దున్నే పనులు దొరుకుతాయి. అక్కడే కనిపెట్టుకుని వుండడం మంచిది.

కేట్ కిల్లర్స్ వీధినుంచి పాపడుం బజారుకు తోవదీశారు; బజారులో కుళ్ళిపోయిన కూరగాయలవాసన తలదిమ్మెక్కిస్తున్నది. మసాలావాసన కడుపులో తిప్పుతోంది. వెదుర్లమ్మే మార్కెట్టునుదాటి ఉప్పుఅంగడిని సమీపించారు. షాపులన్నీ మూసివేసివున్నాయి. షాపులముందు షాహుకార్లు పోసిన ఉప్పును ఆబోతులు తింటున్నవి. ఇక్కడికింకా బియ్యంమార్కెట్టు ఖందగజాలదూరంలోవుంది. హనుమాన్‌వీధి దాటితేనేకానీ దిక్కుమాలిన బజారు రాదు !

రాత్రి. ఆకాశంమీద గుడ్డిదీపంవలె చంద్రుడు ప్రకాశిస్తున్నాడు. ఇంకా గాలుపుగానే వుంది. నిద్ర ఆపుకోలేనంతగా కళ్ళమీద తూగుతోంది. సగంసగం నిద్రపోతూనే కాళ్ళీడ్చుకుంటూ, విసుక్కుంటూ కుర్రవాళ్ళిద్దరూ అడుగులు వేస్తున్నారు. కాని అడుగుముందుకు పడడంలేదు. ఎక్కడైనా నడుంజేరవేసుకుంటే బాగుండును! దారిలో నడుస్తూంటే వీధికిరుపక్కలా వున్న ఇళ్ళల్లోంచి "హాహాహః" అనే దగ్గులూ, ఉమ్ములూ 'హాః' అనే ఆవులింతలూ వినిపిస్తున్నాయి. కిటికీతలుపులు తెరచి ఇవతలకి గృహస్థులు ఉమ్ముకుంటున్నారు. దూరంగా దేవాలయప్రాంగణంవద్ద మిణుగురులు చిన్న చిన్న

దీపాలవలె వెలుగుతున్నాయి. ఆరిపోతున్నాయి. కీచురాళ్ళు గుయ్ మని గీపెడుతున్నాయి. ఆకలికి కాబోలును కుక్క మోరఎత్తి "భోఁయ్ భోఁయ్" మని అరుస్తోంది. అరుస్తోన్న కుక్క ఎదుటపడిన పిల్లిని వెంట తరిమింది. పిల్లి భయంతో ఒక్కదుముకుదుమికి అవతలకి గంతువేసింది. రాత్రిళ్లు దెయ్యాలూ, భూతాలూ సంచరిస్తూ వుంటాయని కుర్రవాళ్ళు చిన్నప్పుడే కథలుచెప్పగా విన్నారు. చనిపోయిన మనుష్యుల జీవాలు రాత్రివేళ భూలోకంలోకి వచ్చి తమ తమ బంధువులు ఏమిచేస్తున్నారో అని చూసి పోతాయట. తమ యిళ్ళన్నీ వొకసారి తిరిగి పరీక్షించి 'కథాకమామిషూ' తెలుసుకుని మరీవెడతాయట! మునూగుండెలు గుండెల్లో లేవు. తులశి ముందే బేజారెత్తిపోయాడు! దారి గతుకులుగావుంది. దారిలో బురదవుందే! గతుకులేకాదు; బంటాలు. అమ్మో! గోతిలోకాలు దిగబడిపోయింది. కష్టం మీద బురదలోంచి కాలుతీసుకుని బయటకు తప్పుకున్నాడు మునూ. దారి యిప్పుడు వంకరలు తిరిగింది. సన్నంగా చీలిపోయి అది దాటగానే బియ్యం మార్కెట్టు కనిపించింది. ఇక్కడ యింకా కంగాళీ! మరీరోత! ఛీఛీ!

భూమినానుకుని దుకాణాలు వున్నాయి. షాపులు కావురాబాటూ యివి కుండలు బోర్లించినట్లు! మట్టికొంపలు; అసహ్యంగా చిన్న చిన్న పాకలు. ఆవరణలో పెద్ద అయిదంతస్తులమేడవుంది, సిమ్మెంటు ఆర్చీలు; పెద్దపెద్ద స్తంభాలు, ద్వారాలు పెద్దలోగిలే. ఆవరణలో బళ్ళూ, ఎద్దులూ పొముల్లా మెలికలుతిరిగిన కొమ్ము లాడించుకుంటూ ముందుపడేసి వున్నగడ్డిని మేస్తున్నాయి. ఎంతంతలేసి ఎద్దులు; కొండంత ఎద్దులు. గోపురాల్లామూపులు. దూడలు పేడను గిట్టలతో కుమ్ముతున్నాయి. పడుకునికొన్నీ, నించునికొన్నీ, పడుకునే బుర్ర ఆడిస్తూ గడ్డిపరకలను మేస్తున్నాయి. మరికొన్ని ఎద్దులు నెమరవేస్తూంటే నురుగు మూతులమీద తెల్లగా కనిపిస్తోంది. చాలామంది కుర్రవాళ్లు అక్కడే నిద్రపోతున్నారు. కుళ్లు కాలవకంపు. బురదవాసన. రొచ్చు; రోత. ఎద్దులవుచ్చా, పేడా. ముక్కు శోణాలను బద్దలు చేస్తోంది. ముగిగిపోయిన చెత్తా చెదారం అక్కడ నిలవనీయడంలేదు. మనుష్యులు గుర్రుపెట్టి మరీ నిద్రపోతున్నారు. దూరంగా పిడకలదాలి పొగ చిమ్ముతోంది. ఆవరణంతా పరమ ఛండాలంగా వుంది. ఈ వాతావరణంలో మసలడానికి మనిషి అలవాటుపడైనావుండాలి. లేదా అతని ముక్కు దిమ్మెత్తి వాసననేది ఏమిటో పోల్చుకోలేనిస్థితిలోనైనా వుండాలి. చీకటిలో ప్లేగువలె వాతావరణంలోనికి భీభత్సం వ్యాపిస్తోంది.

దోమలు సంగీతం ఆరంభించాయి. గుడ్డి యీగలు, జోరీగలు వొంటిమీదవాలి గంగవెర్రులెత్తిస్తున్నాయి. మనుష్యులు వొంటిమీదబట్టలు తొలగిపోయినా, ఏమాత్రం చైతన్యం లేకుండా సైమరచి సుషుప్తావస్థలో వున్నారు.

ఆవరణలోనికి అడుగుపెట్టగానే కాలి అలికిడికి జుయ్యిమని పేడరుప్పల మీంచి దోమలులేచి సంగీతం ఆరంభించాయి. సంగీతంతో వూరుకుంటే బాగానే వుండును. వొళ్ళంతా తెగకుట్టడ మారంభించాయి. చిటుకూ, చిటుకూ పొడుస్తున్నాయి. నడుస్తోన్న మనిషి ఠక్కున ఆగిపోయి వేసిన కాలు వెనక్కిలాగుకుని పిక్కలమీద ఒక్క చరుపు చరుచుకుని మునూ "అమ్మ వీట్లల్లీ ముండా మొయ్యా! కాట్లకుక్కల్లా తగులు కున్నాయిరా!"

కూలీల గుంపులోంచి గద్దింపుస్వరం వినవచ్చింది. "ఎవరాబూతులు తిడుతున్నదీ! ఎవరు నువ్వు?".

మునూ, తులశీ గాభరా పడ్డారు. సర్దుకుని "ఎవర్నీలేదు ... ఈ దోమలూ ...".

"ఎవరు నువు?".

"కూలివాళ్ళం!"

"ఎవరయితేనేం? ఇక్కడ పడుకుంటుకు చోటులేదు పో పో". గద్దిస్తున్న కూలివాడు దోమలు కుట్టకుండా నూనెతీసి కాళ్ళకు మర్దనాచేసు కుంటున్నాడు. వొంటిమీద బట్టలేమీ లేవు. చిన్న గోచీపెట్టుకుని గొంతుక పడి కూచున్నాడు.

అవును. నిజంగా యిక్కడ జాగాలేదు. అంతా ఆక్రమించుకుని కూలీలు పడుకున్నారు. చెట్టురాల్చిన ఆకులవలె పోగుబడి అటూ, ఇటూ దొర్లుతూ ఆపశోపాలు పడుతున్నారు. దూలాలమీద కొందరూ, బడ్డీలమీద కొందరూ, నాపరాళ్ళమీద మరికొందరూ!

మునూ, తులశీ యిద్దరూ కాస్త పక్కకు తిరిగి చూశారు. బండిచుట్టూ పురుగుల్లాగ మనుష్యులు. నేలమీద, కటిక నేలమీద, రాళ్ళమీద, బండరాళ్ళ మీద। నిద్రపోతున్న కూలీలు. ఆకలి రుచిఎరగదు, నిద్ర సుఖమెరగదు! శవాలవలె పడివున్న కూలీలు యీ రెండూ ఎరగరు! దారిలో ఊక పోగు పడివుంది. ఊకమీంచి అడుగులు చప్పుడు కాకుండా యిద్దరూ మెల్లిగా పిల్లుల్లా నడుస్తున్నారు.

బండీకి అవతల కొద్దిదూరంలో పక్కపరుచుకుని కాపలావాడు పడుకున్నాడు. పడుకున్నాడు కాని నిద్రపట్టలేదు. చేతిలో కర్ర పట్టుకునే నడుం వాల్చాడు. మనుష్యుల అలికిడి విని "ఎవర్రా అదీ? దొంగలు కారుకదా!"

"కాదు బాబూ కాదు; కూలీలం"

"ఎవరయితేనేం? ఎందుకీ అర్థరాత్రి; పొండి!"

"పడుకుందుకు కొంచెం జాగా దొరుకుతుందేమో అని!"

"అనీ గినీ! లాలా తోటరాం విన్నాడంటే మక్కెలు విరగతంతాడు! పడుకోడం వొదిలిపోతుంది! పడుకోడం!"

"నిద్రొస్తోంది బాబూ, కుర్రాళ్ళం"

"నిద్రా గిద్రా! తోట్రాంగారి యినస్పెక్టరు షాపులోనే వుంది! గాడిదకొడుకులు మిమ్మల్ని నమ్మమని ఎవడు చెప్పాడు? పొండి పొండి."

"పోతాం మహరాజ్ అలాగే పోతాం! తిట్టకండి!"

ఈ మాటలని తులశి ఉత్తరదిశకు మళ్ళజొచ్చాడు. కాస్త దూరం నడిచి అటూ ఇటూ పరికించాడు. నిద్రపోతోన్న మనుష్యులు రెండు కాళ్ళూ చాచుకుని పడుకున్నారు. మరికొందరు వొకపక్కకు వొత్తిగిలి నిద్ర పోతున్నారు. బాగానే వుంది. పక్కకు వొత్తిగిలితే కాస్త జాగా దొరుకు తుంది. ఆ జాగాలో మెల్లిగా సర్దుకుంటే ఆ పైని చూసుకోవచ్చు.

పక్కకు వొత్తిగిలిన మనుష్యులు దగ్గుతున్నారు. గుంపులోంచి ఎప్పుడూ ఏవోధ్వనులు! దగ్గులు, ఉమ్ములూ "అమ్మ అమ్మమ్మ వెధవ దోమలు చీటుకూపటుకూ" అనే కేకలు, దోమల్ని తోలుకుందుకు ఎవరి వొంటిమీద వాళ్ళు చరుచుకునే చప్పుడూ ... ఉండ చుట్టుకుని నేలమీద దొర్లుతున్నారేకాని ఎవరికీ కునుకుపట్టనట్టే వుంది. "రామయ్యతండ్రీ రామయ్య తండ్రీ! హరేరామ హరేరామ ... భద్రాద్రి రామా! హరేకృష్ణ హరేకృష్ణ ... ద్వారకావాసా" అనే గొంతుకలు వినిపిస్తూనే వున్నాయి. మునూరు నిద్ర జోగుతోంది. దోమలు కుడుతున్నాయి. పడుకుందుకు జాగాదొరకడం లేదు. దొరికినా ఈ గోలలో నిద్రపడుతుందన్న ఆశలేదు. చికాకు హెచ్చింది, వోర్మి నశించింది. శక్తి సన్నగిల్లింది. "రామయ్య తండ్రి; భద్రాచలవాసా" అనే మాటలు మళ్ళీ వినిపించసాగాయి. "ఆఁ భద్రాచలవాసుడు! మంచి దేవుడే! దేవుడంటే అంత భక్తికదా ప్రభుదయాలుకి, దేవు డేం అడ్డుపడ్డాడు? "భక్తవరదా కావవే శ్రీనివాసా" అనే ముసలిగొంతుక మళ్ళీ వినిపించింది.

ఆఁ! భక్తవరముడు! ...... ప్రభు దయాలు నానా తిప్పలూ పడ్డాడు! పాపం!"

మునూ గబగబ తులశి చెయ్యిపట్టుకుని అవతలకు లాక్కుపోయాడు. ఆవరణమధ్యకి వచ్చి నిలబడ్డాడు. మధ్యను గోనె సంచులు ఎత్తుగా కుప్పగా పడివున్నాయి. గోనెలమీద కాన్వాసుగుడ్డ కప్పబడి వుంది.

బాగుంది. యిది యిమిడిగ్గానే వుంది. ముందే యిది కనిపిస్తే యింత గొడవ లేకపోను. ఈపాటికి హాయిగా నిద్రపోదును! గోనెగుడ్డ చుట్టూ కలయచూసి కొంపదీసి చౌకీదారు లేడుకదా అనుకున్నారు. ఊహుఁ! లేడు రక్షించాడు తొత్తుకొడుకు! నారసంచులమీద తీవిణీవేస్తే మహాఁ బాగుంటుంది. ఇది ఎక్కేందుకు ఏమైఁనా కింద ఎత్తుగా రాయీ రప్పా లేదే! కొన్ని గజాల దూరాన గెడవుంది. గెడమీద వెదురుగూడు. గూడులో పావురాలు "ఆ గెడ తెచ్చి దీనికి చేరవేసి మెల్లిగా గోనెలగుట్టలమీదకు పాకితేనో."

"అహాఁ! వొద్దొద్దు...నేను గుర్రంలా వొంగుంటాను. నా వీపు మీంచి మీదికి పాకు. ఆ తర్వాత చెయ్యి అందిస్తాను. మీదికి లాగు."

తులశి వంగున్నాడు. వీపుమీదికి మెల్లగా పాకి పడిపోకుండా చేతులతో ఆపుకుని గుట్టమీదకు ఎగబ్రాకేడు. సంచులగుట్టమీద నిలబడి చేతులకు పట్టిన చిరు చెమట తుడుచుకున్నాడు. కుడిచెయ్యి కిందకు చాచి తులశికి అందిచ్చి వాణ్ణిమీదకు లాగాడు. గోనెసంచులమధ్య కాళ్ళురెండూ తన్నిపెట్టి మీదకు లాగుతున్నాడేమో తులశి రావడమైతే వచ్చాడు; కాని శరీరం మాత్రం పెటపెట మంది. అబ్బ! దుక్కలా ఎనుపోతులా వీడి తల్లికడుపు మాడా! ఎంత బరువు! మునూ ఒక్క దీర్ఘ నిట్టూర్పు విడిచి 'హమ్మా!' అని సేద తీర్చుకున్నాడు. కుప్పమీదనించుని అటు ఇటూ మళ్ళీ పరికించాడు. కాని గుండెకు ధైర్యం చిక్కిందికాదు. కొంపతీసి కాపలావాడు యిద్దరినీ చూశాడా అమ్మకి కొడుకులుకారు! పులుసులోకి ఎముకలేకుండా తంతాడు! మనుష్యులు, చిత్రమేమరి. ఇంత యిరుగ్గావొకళ్ళకొకళ్లు రాసుకుని రాసుకుని గుట్టలుగా శవాలకుమల్లే నిద్రపోవడం! బోర్లా పడుకున్నవాళ్ళూ, వెల్లకిలా పడుకున్నవాళ్ళు, మూడంకవేసి నిద్రపోతున్నవాళ్ళూ! ఇది లోకంకాదురా, నాయనా యమలోకం!

తులశి కిక నిద్ర ఆగిందికాదు. "నీకు నిద్రరావడంలేదురా!" రోజల్లా వొళ్ళుహున్నంచేసుకుని పనిచేసి అలసలసి వున్నాడు. నిద్ర ఊపేస్తోంది.

"పూస్తోందిరా బాబూ! ఎలాగోకాని" శూన్యంగా దిక్కులను కలయజూస్తూ తనచుట్టూ ఏవేవో ధ్వనులు వినిపిస్తున్నాయనే మాటేమర్చిపోయాడు. కప్పలు బెకబెక లాడుతున్నాయి. ఎవరో మాట్లాడుకుంటున్న గుసగుసలు. హుక్కా పీలుస్తున్న గుడగుడ. కీచురాయి గోల. వాతావరణం భయంకరం.

"ఏమిటి మునూ అలా చూస్తున్నావ్?"

"ఏమీలేదు!"

మునూ గోనెసంచులమీద వెల్లకిలపడ్డాడు. పరుపుల్లావున్నాయి. మెత్తగా హాయిగావుంది. మీద ఆకాశం. నెలవంక కత్తిలాగా వుంది. కత్తితో పొడిచి నక్షత్రాలను కిందకు రాలుస్తున్నది.

ఇంతకంటే ఆకాశంలో కనిపించే దేముంది! కళ్ళు మూసుకున్నాడు. మూసీ మూయగానే తన యజమాని యింటికప్పు స్మృతిపథంలో తిరిగింది. గదిలో తన పక్క జంబుఖానా పరుచుకున్న తను; తను తనకే జ్ఞాపకం వచ్చాడు!

"అప్పుడు అక్కడ. ఇప్పుడు యిక్కడ! పాపం దయాలు జబ్బుతో బాధపడుతున్నాడు. గణపతి బస్తీలో యింకోచోట మహారాజులా దర్జాగా వున్నాడు. బోంగా, మహారాజ్ లు యీపాటికి ఫ్యాక్టరీలో వొళ్ళుమరిచి నిద్రపోతూ వుంటారు! దయాలుభార్య మేం ఎక్కడికి పోయామో అని దిగులుపడుతూ వుంటుంది. మేం ఆవిడతో చెప్పకుండా ఎందుకొచ్చేశాం? ఆవిడ కిక దుఃఖం ఆగదు! ఊహుఁ ఆగదు! మేం అక్కడే వుండవల్సింది. కొంపతీసి...దయాలు చనిపోతే...!" మునూ తనలో తాను తర్కించుకుంటున్నాడు. సంశయాలతో ఉక్కిరిబిక్కిరవుతున్నాడు. దయాలు చనిపోతే... మరణవేదన పడుతూ జాలిచూపులు చూస్తూ దయాలు నేలమీద దొర్లుతున్నట్లు కనిపించాడు. ఘోరం! మునూ యిక ఆలోచించలేకపోయాడు! ఆలోచనలను మళ్ళించుకునేలోపున మగత నిద్ర అతన్ని తన వొడిలోనికి తీసుకుంది. కళ్ళు వాటంతటవే మూతలు పడ్డాయి. నిద్ర ఆవేశించింది.

నదిలో ములిగిపోతున్నపుడు చేతికి దొరికిన గడ్డిబుబ్బును గట్టిగా పట్టుకున్నట్టు నిద్రలో ములిగిపోతున్న మునూ చేతులు రెండూ చాచుకుని పిడికిలి బిగించుకున్నాడు. పిడికిలిలో ఏమీలేదు! కాని ఏదోవున్నట్లు మూసుకున్నాడు. పక్కకు వొత్తిగిల్లాడు. శరీరం ముడుచుకుపోయింది. ఊపిరి గట్టిగా పీలుస్తున్నాడు; ముక్కు విడిపోయినట్లు పెద్దదైంది. నిద్రలో మూలిగాడు.

పలవరించాడు. కలవరించాడు. భయంకరమైన జ్ఞాపకాలేవో వచ్చి కలలుగా విరుచుకుపడి ఆత్మను మారుమెడలువేసి పిసుకుతున్నట్లు! ఆత్మ క్షోభించి పోయింది. కోడిలా గిలగిల కొట్టుకుంది. నిద్రలో గొంతుక ఎండిపోయింది. దాహం వేసింది.

రాత్రి వేడి తగ్గింది. తెల్లవారుతున్నది. మునూ గోనెసంచిని గట్టిగాపట్టు కుని దగ్గరకు తీసుకుని వొంటి కదుముకుని పడుకున్నాడు. కోడికూస్తున్నది. పిచికలు కిచకిచమంటున్నవి. కాకులు అరుస్తున్నాయి. కూలీలు వొకరొక్కరే లేస్తున్నారు. ఎద్దుల బళ్ళు చప్పుడవుతున్నాయి. కుక్కలు సందుచివరున మొరుగుతున్నాయి.

కరకర ప్రొద్దుపొడిచింది. సూర్యకిరణాలు కుంకుమపొడిలాగ ఎర్రగా మెరుస్తున్నాయి. బుక్కాగుండ జల్లినట్లు ఎండ. శరీరం సూదుల్లాగ గుచ్చుకో గాసే ఎండకు మునూ కళ్ళునులుపుకుంటూ లేచాడు. యింకా తులశిని నిద్ర పోతూనే వున్నాడు. నోరు అసహ్యంగా వుంది. మునూ తులశిని పట్టుకుని గుంజుతూ "తులశీ! లే! లే! పొద్దెక్కింది."

గుతుక్కుమని తులశి నిద్రనుంచి లేచాడు. మునూ చుట్టూవున్న ప్రకృ తిని, వీధుల్ని, సందుల్ని మళ్ళీ కలయచూస్తున్నాడు. కొట్లముందు ఆగిన బళ్ళ మీంచి బస్తాలను దింపుతూ మూపున పడవేసుకుని కూలీలు గుదాం లోనికి మోసుకుపోతున్నారు. చెట్టుక్రింద కూచుని కొందరు కూలీలు బీడీలు, మరికొందరు గుడుగుడు తాగుతున్నారు. కుళాయికద్ద జనం ఈగల్లాగ ముసిరేరు. కాళ్ళూ, చేతులూ కడుక్కుంటున్నారు. మరికొందరు ఎంత పొద్దె క్కినా, చుట్టూ కిలకలధ్వనివినిపిస్తున్నా, చెవులను చిల్లులుపెట్టే రొదచెలరేగు తున్నా యింకా నిద్రలోనే వున్నారు. మరణించినట్లు వొంటిమీద చైతన్యం లేనినిద్ర! ఇంకా దుకాణాలు తీయనేలేదు. అయితేనేమి మనుష్యులు అటు యిటూ మసులుతున్నారు. బళ్ళువస్తున్నాయి. పోతున్నాయి. కెరటాల జోరు మెల్లమెల్లగా హెచ్చినట్లు జనంసందడి హెచ్చవుతూంది. లల్లాలు మంచిమంచి దుస్తులువేసుకుని, రంగురంగుల పగిడీలు ధరించి దేవాలయానికి వెడుతున్నారు. దేవాలయంనుంచి పాపులకు వస్తున్నారు. "హరేరామ హరే రామ రామరామ హరేహరే!"

జనం మెల్లమెల్లగా కూడుతున్నారు. చప్పట్లు చరిచి ముందుపోతున్న వాళ్ళని పిల్చేవాళ్ళూ, బిగ్గరగా గొంతెత్తి మాట్లాడుతున్నవాళ్ళూ, ఆవులించే

వాళ్ళు యింత కోలాహలం వున్నా యింకా నిద్రపోతున్న మనుష్యులూ... ఈ సందడీగోల, చికాకు, నిత్యం మునూ జీవితంలో అడుగడుగునా తారసిల్లు తున్నవే. వీటిల్లో విచిత్రమైనవీ, వింతైనవీ ఏవీలేవు. అంతా పాతే. అన్నిటికీ అతను అలవాటుపడిపోయాడు. అయితే వొకటే. ఇన్ని తరహాల మనుష్యుల్ని యిదివరకతను చూళ్ళేదు. హిందూకూలీలలను, కొండజాతులవాళ్ళని మన్య ప్రాంతాలవాళ్ళనైతే చూసేడుకాని కాశ్మీరమహమ్మదీయుల్నీ, సిక్కుకూలీ లనూ మాత్రం చూళ్ళేదు. హిందూకూలీలు, మహమ్మదీయులు కలసిమెలసి తిరుగుతున్నారుకదా, హిందూమతం అందుకొప్పుకుంటుందా అనే ప్రశ్న మునూకి కలగకపోలేదు. బాధలేదనుకున్నాడు. మతం చెడిపోదనుకున్నాడు. ఒకరోజున బజారున వస్తూంటే మహమ్మదీయుల కాకాహోటల్లో ఘుమ ఘుమ పరిమళంవేసుకొచ్చింది. ఏమిటీ సువాసనాఅని వెదుకుతూ చూశాడు. కాకాహోటల్లో పొయ్యిమీద మసాలా ఘుమఘుమ! మజాగావుంది పరిమళం! నోరూరింది. గబగబావెళ్ళి యింత మాంసం కొనుక్కుని తినేశాడు! కొంప మునిగిపోయిందేం ముండామతం! పోతేపోనీ! చురుకు, హుషారుపుట్టి కాకా హోటల్లోకి జొరబడ్డాడేకాని గుండెల్లో ఓతుకుపోవడంలేదు. ఏహిందూవైనా తను అలాగ ముస్లిం హోటల్లోనికి వెళ్ళడంచూశాడా నాలికమీద చురక వేస్తాడనుకుని భయపడసాగేడు. కానీ తీరా రుచిచూస్తే హిందూవుల వంటల కంటె వీళ్ళవే బాగున్నాయే! అందుకే రుచిమరిగితే వొదల్లేకపోవడం! మతం గితం ఈమాటలన్నీ తీసి వొడ్డునపెట్టు.

ఎదురుగా ఒక సిక్కుకూలీ, ముస్లింకూలీ గుడుగుడు పీలుస్తున్నారు. వీళ్ళకి లేనిమతం తనకెందుకు! ఇవి మతాన్ని వ్యతిరేకించడమే అయితే, కూలీలకి మతమన్నదేలేదు. వీటిమాటకేమి; ముందు తనకు ఎక్కడైనా కూలి పని దొరికితేనేకాని లాభంలేదు. బాగా పొద్దెక్కింది. ఆకలివేస్తోంది. భయంతో మునూ గాభరాగా "తులశీ, తులశీ" అని కేకవేశాడు. "త్వరగా లేరాబాబు, వాళ్ళంతా పోతున్నారు. మందికూడితే మతానికిచేటు. అంతా వచ్చేస్తే ఆనక పన్దొరకదు! పదపద!"

మునూ గభాల్న కోతిలాగ కిందకొక కుప్పిగంతువేశాడు. జనంమధ్య పడ్డాడు. కూలీలు చీమలబారుల్లా కొట్లవద్ద సర్దుకుంటున్నారు. నాలుగంతస్తుల భవంతినానుకుని ఒకపెద్ద గోదాంవుంది. గోదాంవద్ద కూలికోసం కాసుక్కూ చున్న కూలివాళ్ళను తోసుకుంటూ మునూ ముందుకుపోయాడు. తులశి

వాడిని అనుసరించాడు. ముందుకు చొచ్చుకుపోవడం కష్టంగానే వుంది. ఇంతమంది కూలీలు వొలంగా జబారుగా పెద్ద పెద్ద వాళ్ళునించున్నారు. వీళ్ళని తోసుకుని ముందుకు వెళ్ళడం మాటలుకాదు. కూలివాళ్ళ కాళ్ళ సందునించిదూరి చేతులను వొత్తిగించుకుని పక్కన సందుచేసుకుని మునూ ముందుకు దారితీశాడు. మోటుగా మోచేతులతో పొడుస్తూ ఎవరికివారే తొందర పడుతున్నారు. మునూకు వొళ్ళంతా చెమట పోసింది. మరి ముందుకు పోవడానికి జాగాదొరకలేదు. గుంపులో మనుష్యులు వొకర్నొకరు తోసుకుంటున్నారు. "సరకాయించు. కొంచెం చోటెట్టు... ముందుకు తోసుకొచ్చేస్తున్నావే!... అరెరె... కళ్ళు మూసుకుపోయి ఏడుస్తున్నాడు వీడెవడో!..." అనే గద్దింపులు, బెదిరింపులు వినవస్తున్నాయి.

ఇనప్పెట్టెవద్ద కర్రపుచ్చుకుని సాహుకారు నించున్నాడు. ముందుకు తోసుకువస్తోన్న గుంపును అదిలిస్తూ "అసుంటా పోతారా పోరా?...ప్రాణం ఉక్కిరిబిక్కిరి చేస్తున్నారే వీళ్ళు ... అసుంటా అసుంటా... పోతేనే, కూలీ...లేకుంటే ఎవరికీ లేదు!"

"లేదు బాబూ లేదు. నన్ను నిన్ననే పన్లో వేశారు తమరు" ముందుకు తోసుకొచ్చి వొక మహమ్మదీయ కూలీ బతిమాలుతున్నాడు.

"పోరా తొత్తుకొడకా!"

"అదేటిబాబూ! అలా అంటారు తమరు! నా నవలీల్లగా పెద్ద పెద్ద మూటలు యిసిరిపారేయగల్నకందా."

"నాను కాటాబస్తా ఎత్తేసుకోగల్ను బాబూ!"

"అణా కూలి సాలుబాబు!"

"లల్లాజీ లల్లాజీ!" కూలివాళ్ళ కేకలకు అంతులేదు. గుంపు గుణగుణమంటున్నది. కొట్టుముందుకు కూలీ గుంపు తోసుకుపోతున్నది. సాహుకారు చేతిలోని కర్రను విసురుతున్నాడు. చెదురువాటుగా కర్ర తగులుతూంటే జనం తప్పించుకుందుకు పక్కలకు వొదుగుతున్నారు. ఫట్ ఫట్ మనే కర్రదెబ్బలు వినిపిస్తున్నాయి. పరుగెడుతున్న పాదాలు ధ్వని. దెబ్బ తప్పించుకుందుకు కూలి జనం కెరటంలాగ ముందుకూ, వెనకకూ ఊగుతున్నది.

"రండర్రా రండి రండి! ఠాకూర్ దాసుగారి పాపు తెరుస్తున్నార" నే కేక వినిపించింది. కూలీలు అటువైపు పరుగు ప్రారంభించారు. ఠాకూర్ దాసు

షాపు అంగట్లోకల్లా పెద్దది. ముందు ఇనప కవాటాల బందోబస్తు జాస్తీగా వుంది. మునూ, తులశీ మరి అయిదారుగురు కూలీలు అక్కడనే వుండిపోయారు. మిగతా కూలీలు శాంకూర్‌దాసు షాపుకేసి పరుగులెత్తారు.

షాహుకారు మునూనుచూసి అదిలించాడు. "రారా! బద్మాష్ ముండా కొడకా! రండి వెధవల్లారా! ఇంతసేపూ నా ప్రాణం కొరుక్కుతిన్నారు... ఇదిగో ఈ బస్తాలెత్తండి. బండిలో పడేయండి. రహమత్‌ఖాన్! ఎద్దుబండి ఏదీ? ... స్టేషనుకు తోలికెళ్ళండి".

గోధుమ బస్తాలపై ఆకుపచ్చని అక్షరాలు తాటికాయంతలేసి కనిపించే సరికి మునూ కూడబలుక్కుని చదివాడు. "గోకుల్‌చంద్, మోహన్‌లాల్ నుంచి ర్యాలీ బ్రదర్సు కరాచీ" అనే అక్షరాలు కొట్టవచ్చినట్లు రాసి వున్నాయి.

'ర్యాలీ ర్యాలీ ర్యాలీ' అని పలుసార్లు మంత్రంలాగ స్మరించాడు. పేరు వింతగావుంది. చెవికి యింపుగావుంది. నోట చక్కగాతిరుగుతోంది. కాని దీని అర్ధమేమిటో మునూకు అవగతం కాలేదు. గోధుమలు యిండియా నుంచి యింగ్లండుకు యెగుమతి చేస్తారని, యీ యెగుమతుల్లో యెంతో రాజకీయ ఆర్ధికశాస్త్రం యిమిడివుందని అతని కేం తెలుసును! ర్యాలీ అనే పేరు విన ముచ్చటగా వుంది; అన సులువుగా వుంది! తన చిన్నతనంలో స్కూలుపుస్తకాల్లో యిలాగే మంచిపేరు చెవినిపడగానే దాన్ని పదే పదే స్మరించేవాడు!

షాహుకారు చెప్పినవిధంగా కూలీలు బస్తాలను భుజాల కెత్తుకుంటు న్నారు. బల్లమీద ఎత్తుగావున్న బస్తాకి మూపు మోపి తులశికూడా "ఐసర బజ్జ!" అని ఎత్తుకున్నాడు. అణగారిపోయి భారంగా నడుస్తున్నారు కూలీలు.

బస్తాలను ఎలాగ ఎత్తుకోవాలో సులువు బోధపడక మునూ పరీక్షగా చూస్తున్నాడు. ఒడుపుగా వొంగుని తమాషాగా మూపుమీదకు దొర్లించుకుని పోతున్నారే! అసలు పట్టులోనేవుంది మజా! పట్టు పట్టుబడితే సునువే! ఆ కూలీలమల్లే తనూ వంగుని బస్తాలను కదిపాడు. పేగులు తెగుతున్నాయి కాని అవిమాత్రం కదలడంలేదు. ఇక లాభంలేదు!

మళ్ళీ రెండవసారి కూలీలు వచ్చారు. ఇంకా మునూ బస్తాలతో కిందా మీదా పడుతున్నాడు. "పోరా కుర్రనాగమ్మా! బస్తాలెత్తుతావటా బస్తాలు! పోపో! కూర్లబజారుకి పోయి మూటలుమోసుకోక!"

కూరలబజారుకి పోతే ఎలాగ? కూలి దొరకద్దూ; దొరికినా చాలద్దా? తనకీ, తన యజమానికీ సరిపోయేటంత కూలీ ఆర్జించి మరీ వెళ్ళాలికదా!

"ఒరే తులశీ! నాక్కొంచెం యెత్తరా!".

తులశి వచ్చాడు. బస్తా మునూ వీపుమీదకు యెత్తాడు. మునూ తాబేలులా కుంగిపోయాడు. మోకాళ్ళు వంచి కొద్దిగా మూపు ఎత్తడానికి ప్రయత్నించాడు. కాళ్ళు వణుకుతున్నాయి. అడుగు అడుసులో దిగబడినట్లు పైకి రావడంలేదు. ముందుకొక అడుగు వేశాడు. రెండడుగులు. మూడవ అడుగు. దాగ్లో చిన్నగతుకులో అడుగుపడింది. కాళ్ళు వొకదానికొకటి తగులుతున్నాయి. పడిపోబోయాడు. కాని పడిపోకుండా ఆపుకున్నాడు. శరీరం చెమటెక్కింది. ఒగుప్పు హెచ్చింది. బస్తామోస్తూ మెల్లమెల్లగా అడుగులు వేస్తున్నపుడు చూడ్డానికెంతో అందంగా కనిపించాడు. శరీరం తీర్చి దిద్దినట్లు అగుపించింది. కండలుమీదకువచ్చాయి. భుజాలు పొంగాయి. గుండెల యెగువను కండలు సుళ్లు తిరిగాయి. గుమ్మంవద్దకు వొక్కొక్క అడుగేవేసి ఎలాగైతేనేమి, సమీపించాడు. గుమ్మంమీద అడుగువేసి దాటడడమా, వొక్క అడుగు అవతలకే వేయడమా అనే శంక కలిగింది. ఇంకా ఏమీ నిర్ధారించుకోకుండానే యెడంకాలు ముందుకువేసి కుడికాలు ఎత్తాడు. అడుగులు తడబడడమేకాదు వొకదానికొకటి తగిలి కిందపడిపోయాడు; బస్తా దభేలున కిందపడింది.

మునూ తూలడం; బస్తాకిందపడడం చిత్తాచూసుకుంటున సాహుకారు చూడ్డమేమిటి, గొంతుక పెగలదీసుకుని అరవడమేమిటి: "నీతల్లి ముండా మొయ్యా...నిన్నెవరది ఎత్తుకోమన్నార్రా లమ్డికొడకా! వేలెడంతలేవ్ లంజకొడకా! అప్పుడే బస్తాలకు బస్తాలే మోసేస్తావుట్రా! ఆశపోతు వెధవా! పీక సన్నం; ఆశలావు; గాడిదకొడుక్కి!" సాహుకారు కూర్చున్న దిమ్మమీంచి కింద కురికాడు. "నేనూచూసుంటే యీ తొత్తుకొడుకుని ఎత్తుకోనిద్దునా! ఖూనీకోరు లంజకొడకా!"

కింద పడీపడగానే మునూ గబుక్కునలేచాడు. కాని సాహుకారు తిట్లకులంకించుకున్నాడు. అందులోనూ పదిమందిలో! సాహుకార్లు తమ తమ

కొట్లు తలుపులు తీసి లక్ష్మీపటం ముందర ఊదొత్తులూ కర్పూరం వెలిగిస్తున్నారు. కుంకుమ బొట్లు పెట్టుకుంటున్నారు. తన షాహుకారు బొబ్బరింతలకు అందరూ యిట్టే చూస్తున్నారు. ఇది తన కవమానంకదూ! ఆదిక్కుమాలిన షాహుకారులు అలాగ చూసి వూరుకున్నా బాగుండును. వాళ్ళు తిట్లు తిడుతున్నారు! పొద్దున్నే వీళ్ళ నోట్లో పడడం! కర్మ!

పచ్చి దొంగను తిడుతున్నట్టు "పోరా దౌర్భాగ్యపు వెధవా! పొద్దున్నే నువ్వెక్కడ దాపరించావ్! శివామని కిందపారేశావ్ బస్తా...ఇం కీవేళ బేరం సాగినట్టే."

మునా మరి వెనక్కి తిరిగిచూడకుండా పరుగెత్తుతున్నాడు. కొన్ని గజాలదూరం పరుగెత్తాక వేగం తగ్గించాడు. మొహమంతా చెమటపోసింది. గుండె దడ దడ లాడుతోంది. తల విసిరేస్తోంది. తల తుడుచుకున్నాడు. చేతులు చూసుకునేవఱకూ తలమ్మట నెత్తురు కారుతున్నదని తెలియనేలేదు!

చేతికంటుకున్న నెత్తురు చెక్కిళ్ళ కంటుకున్నది. కాని, లెక్కచేయకుండా పరుగు ప్రారంభించాడు. కొంతదూరం వెళ్ళాక సందుచివరున ప్రవహిస్తున్న చిన్నకాలువ, సందుముందు పెద్ద మేడ కనబడ్డాయి. మేడనీడను ఆగి ఆలోచిస్తున్నాడు. జరిగినదానిని జ్ఞాపకం తెచ్చుకుంటున్నాడు. తను ఎవరనే అనుమానం వేసింది. తను తను కాకపోతే!

తులశి మనసులో మసులుతున్నాడు, ఈపాటికి బస్తాలెత్తుకుని మోస్తూవుంటాడుకాబోలును! వాడి కీరోజు పావలా కూలి దొరుకుతుంది. అదృష్టవంతుడు! అదృష్టవంతుణ్ణి చెరిపేవాడూలేడు, నిర్భాగ్యుణ్ణి బాగుచేసేవాడూ లేడు! తనకు వొక్క కాణ్ణబ్బు కూలీ దొరకలేదు. లేదు సరికదా పైపెచ్చు తిట్లు పొద్దున్నే! దెబ్బకూడా తగిలింది. పొద్దున్నే నెత్తురు కళ్ళబడింది. తనూ నాలుగుడబ్బులు సంపాదించి తీసుకెడితే ప్రభుదయాలూ, అతని భార్యా సంతోషింతురు!

కూలికోసం అంతమంది తోసుకొస్తూంటే నిలబల్లేక తులశి 'పోదాంపద' న్నాడు. తను మోచేత్తో వాణ్ణి పొడిచి 'వుండేస్సి' అన్నాడు. లేకపోతేనా, వాడికీ దొరికేదికాదు కూలీ!

మునాకి తనమీద తనకే తట్టుకాలేసుకొచ్చింది. కోపం ముంచుకొచ్చింది; ఓర్మి సన్నగిల్లింది. చికాకు హెచ్చింది. "బలంవస్తే

బాగున్నా... వెధవది యింకెప్పుడు పెద్దవాణ్ణవుతానో!" ఏకాకిగా నుంచుని ఆలోచిస్తున్న అతన్ని దారమ్మటపోయే జనం పరీక్షగా చూశారు. వెంటనే మునూకు తానక్కడ నిలబడ్డాననే స్పృహ వచ్చింది. కాలవలో నీరు పట్టుకుందుకు ఎవరో మనిషి వొకడు వచ్చి ఆగి మునూకు చూశాడు.

"ఇంక వెళ్లిపోదాం మనమెందు కిక్కడ నిలవోడం?......ఎంతో కొంత...కూలి సంపాదిస్తేనే కాని యింటికి, ఊహుఁ! వెళ్లను" తననుతానే, మన్నాపన చేసుకుంటూ మునూ వితర్కించుకున్నాడు.

తల యింకా తిరగలిలా విసిరేస్తూనేవుంది. గుండెకొట్టుకుంటూనే వుంది. నరాలన్నీ పొంగినట్లున్నాయి. మొహం ఉబ్బినట్లుంది. సందులోనికి పెద్దబండీ కిర్రుకిర్రుమని చప్పుడు చేసుకుంటూ వస్తోంది. బండినిండా బస్తాలు బరువుగా వున్నాయి. ఎద్దులు తలలు దించేసుకుని లాగలేక యీడిగలుపడు తున్నాయి. బండివాడు చక్రాలను తోస్తున్నాడు...బండీ ఆగిపోయింది. దాపలెద్దు నేలకుమొక్కింది. బండివాడు ఎద్దుతోకను కరుస్తున్నాడు. ఇక యిక్కడవుంటే బండీ బోర్లాపడుతుందని మునూ ముందుకు తొలగిపోయాడు. యథాలాపంగా దారమ్మట నడిచిపోతున్నాడు. కొంతసేపు నడిచాక నడు స్తున్న మనిషి చటాల్న ఆగిపోయాడు. ఆగిపోయి "నేనెక్కడికిపోతున్నాను?" అని ప్రశ్నించుకున్నాడు. కారుచీకటిలో కాంతిరేఖలాగ సమాధానం హృదంత రాళాల్లోంచి వినిపించింది. "ఎక్కడికా? కూరలమార్కెట్టుకి! ముసలి కూలీలు చెప్పారుకదూ నిన్నక్కడకు పొమ్మని! చిన్న చిన్న మూటలయితే మోయడానికి సులువూ!"

మునూ నడకసాగించాడు. మళ్ళీ మనసు తర్కంలోపడింది. "ఒకొక్కప్పుడు ఏమీ ఆలోచించలేక పోతున్నానే, ఏదీచూళ్ళేక పోతున్నానే, వింటున్నదేమిటో బోధపడదుకదా, దీనర్థంఏమిటి? నేను చచ్చి పోలేదుకదా! చచ్చిపోతే ఎక్కడైనా ఇలాగ నడవగలుగుతానూ? ఇంతకీ చనిపోవడమంటే ఏమిటి? నేను చూస్తున్నానే, ఎదటువస్తువుల్ని గుర్తుపడు తున్నానే! చచ్చిపోయినవాళ్ళని దహనం చేస్తారు. దహనం చేస్తే యీ శరీరం మిగలదు. బూడిదవుతుంది. గుండె టకటక లాడుతున్నదికదా ఏమిటో దీని గమ్మత్తు!".

పుట్టిన సమస్యల అంతు తేలడంలేదు. తలమాత్రం గిర్రున తిరిగింది. మెదడు వేడెక్కింది. ఆలోచనల బొమ్మలు ముక్కలుముక్కలుగా పగిలి

యిసక రేణువులకంటె చిన్నవయి పోయినాయి. కనులముందు వీధి. వీధిలో మనుష్యులు. షాపులలో వేలాడుతున్న తోలుపటకాలు, రబ్బరు బెలూన్లు, అద్దాలు, బొమ్మలు ... ఇవి కనిపించి మళ్ళీ అతన్ని జగత్తులోనికి విడిచి పెట్టాయి. వీధి పక్కనే నడుచుకుపోతున్న కూలివాడికెదురుగ వెళ్ళి "కూరల మార్కెట్టెక్కడ అన్నా!" అన్నాడు. ఆశ్చర్యంతో ఆమనిషి ఆగి పరకాయించి చూశాడు. "అదిగో అలా తిన్నగాపో. కుడిచేతి పక్కకిమళ్ళు."

దారి చెప్పినందుకు తన సంతోషాన్నైనా తెలియచేయకుండా మళ్ళీ యెనక్కి తిరిగి చూడకుండా ఆంజనేయుడిలా అటుప్రక్కకు గంతువేశాడు. డబ్బు. డబ్బు. సంపాదించాలి. ఇదేవాడి ధ్యాస!.

కూరల బజారు కోలాహలంగా వుంది. సందడి జోరుగావుంది. మిగిలిన బజార్లకంటె ముందుగానే కూరలబజారు కలకలలాడుతూ వుంటుంది. కావిళ్ళతో కూరలు తీసుకొచ్చి పోగులుపెట్టి అమ్ముకుంటారు. ఎంతదబ్బున అమ్ముకుని యిళ్ళకు పోతామా అని దుకాణదారులు బేరగాళ్ళకోసం ఎదురు చూస్తుంటారు. ఎంత త్వరగా కూరలు కొనుక్కుని యిళ్ళకు పోదామా అని, సంసారులుతొందరపడతారు. పచ్చిమిరపకాయలు, అల్లం, కేబేజీ, టొమాటో పళ్ళు,వంకాయలు,దోసకాయలు,రంగురంగులశోభనిస్తున్నాయి.ఎర్రనిబుగ్గలతో మామిడిపళ్ళు కుప్పలుగా పోసివున్నాయి. బుట్టలతో రకరకాలకూరగాయలు కొట్లు కిరువంకలా పొడుగూతా అమర్చివున్నాయి. గులాబీలు, మల్లెలు, చామంతులు, వివిధ పరిమళాలనిచ్చే పూలరాసులు! ఎండెక్కితే పూవు వాడిపోయి రేకు రాలిపోతుంది కనక అందరికంటే వేగంగా యింకా తెల్లవారకుండానే పూలమ్ముకునే వాళ్ళు బుట్టలతో, సజ్జలతో, బజారు కొచ్చేస్తారు!

చినిగిపోయిన గుడ్డపేలికలతో, నూనె మరకలతో, కూలివాళ్ల పిల్లలు వీధిలో తచ్చాడుతున్నారు. దాసీలు సంచులు పట్టుకుని బజారు చేస్తున్నారు. సిల్కుచీరెలు తళతళమంటూ భుజాలమీదనుంచి జారిపోతూంటే, వేళ్లకు రంగులు వేసుకున్న పెద్దింటిపిల్లలు, గజ్జెలగుర్రాలు, కొట్లముందునించుని బేరాలాడుతున్నారు. గౌనులు తొడుక్కుని, జుత్తుదువ్వుకుని, చిన్నపిల్లలు, తల్లుల చిటికెనవేళ్ళు పట్టుకుని, నడుస్తున్నారు. పొడ్గా, ఠీవిగా, ఎత్తుమడమల టపటపాలజోడు తొడుక్కొని, దానిమీద లేసు ఎండకు మెరుస్తూంటే, వయ్యారిభామలు పూలు బేరమాడుతున్నారు. కూడా వస్తున్న వాళ్ళు

మరి వాళ్ళ కూతుళ్లో కోడళ్లో కాని, వాళ్లకేసి తిరిగి ఊరికే కిచ కిచ మని వొకటే నవ్వు! మెడనిండా హారాలూ చేతినిండా గాజులూ ఏవరో ఆవిడ! రూపాయి బంగాళీదుంపలు పావలా కడిగింది. "ఎల్లమ్మా శాన శాన! చేశావ్ బేరం!" అంటున్నాడు షాహుకారు!

గుణ గుణ మనే ధ్వనిమధ్య కళ్ళు చెదిరిపోయే దృశ్యాలమధ్య, సువాసనలు మొహంమొత్తుతూంటే, ఎటు వెళ్ళాలో తోచక మునూ నుంచున్న చోటనే, నుంచుండిపోయాడు. ఆకులు చుట్టూపరచి, రక రకాల పళ్ళను అమర్చివుంచారు. తట్టనిండా పళ్ళే! బుట్టలలోపళ్ళు మరీ వాసన వేస్తు న్నాయి. వాసనల కిక మనసు వుండబట్టక, అక్కడ వుండలేక, బుట్టలదగ్గరకు వెళ్ళాడు. చిన్న చిన్న రంగు రంగుల, దోరదోరపళ్లు, మిఠాయి వుండలవంటి పళ్ళు, నోరూరిస్తున్నాయి. ఊటలూరిస్తున్నాయి. ఇంచక్కని పళ్ళు! చెరుకు రసాలు! మిఠాయి మావిడి!

"ఓరి నీ అమ్మకడిసిగ్గొయ్యా! కుర్రలంజకొడకా! తట్టెత్తుకో! అర్ధణా యిస్తా."

"ఓ! అలాగే బాబూ! అలాగే!" అయిదు గొంతుకలూ కేసారి అరి సాయి. అప్పటికప్పుడే మునూ గెద్దలాగ దూసుకుపోయి ఆ పెద్దమనిషి చేతిలో బుట్ట ఎత్తుకున్నాడు. బుట్టబరువు లేదనేమాట నిజమేకాని కూలి అర్ధణా! ఎంతయితే అంతే అయిరి! దంపినమ్మకి బొక్కెందేకూలి! మెల్లిగా బుట్ట లోంచి వొక్కపండు వొక్కటంటే వొక్కటే తీసుకు తింటే!

రోజూ, మునూ తెల తెలవారుతుంటే కూరలమార్కెట్టుకి వెడు తున్నాడు. తులసి బియ్యం మార్కెట్టుకి పోతున్నాడు. మునూ రోజు సంపా దన బేడబ్బులు. తులసి ఆర్జన అరణాలు! దేనికైనా అదృష్టం వుండాలి. రోజులు కలిసి రావాలి!

పుట్టదగ్గర చీమల్లాగ మార్కెట్లనిండా కూలిజనమే! బేరగాళ్ళకన్న కూలివాళ్ళే ఎక్కువ. ఇంత పడిగాపులు కాసినా ఎన్ని పుర్రాకులు పడినా దారిని పోయే ప్రతివారినీ "గంపేస్తారా బాబూ! గంప!" అని వెంటపడు తున్నా సాయంత్రం రిక్త హస్తాలతో గుడిశ చేరుకోవలసి వస్తుందేమోనని కూలీల దిగులు! గుడిశ చేరుకుంటే గుక్కెడు గంజి దొరకదు! ఆకలి కడుపులో రంపపు కోత పెడుతుంది. అందుకని షాపులముందు "నేనొస్తానంటే నే నొస్తానని" వొకళ్ళ నొకళ్ళు తోసుకుంటూ, తిట్టుకుంటూ కసురుకుంటూ,

కొట్టుకుంటూఅర్ధణాకూలికోసంఎగబడతారు. కూలివాళ్ళు,షాపులముందుకొట్టు కుంటూంటే, ఒకరి జుత్తు వొకరు పీక్కుంటూంటే, షావుకారు కర్రపుచ్చుకుని గుంపును అదిలిస్తాడు. కొందరికి పన్ను ఊడుతుంది. మరికొందరికి వీపు చిట్లు తుంది. ఇంకొందరికి తల పగులుతుంది. అంతే! అమ్మపెట్టేవి రెండూ పెడి తేనే కాని అయ్యకి బుద్ధిరాదు! అంతటితో ఎవరిలిన్నవాళ్ళు, కూలీలు తలోచోటికీ పోతారు. కూలివాళ్ళలో దుక్కలావున్నవాళ్ళకి కూలి దొరుకుం దనీ, సన్నంగా వున్నవాళ్ళకి దొరకదనీ చెప్పలేం. కూలివాళ్ళ వొంటిశక్తికంటె షావుకార్ల దయా ధర్మభిక్షపై కూలి ఆధారపడుతుంది. తప్పేలారి, వోగంపో మూటో, బస్తావో, భుజానవేసుకుంటే బరువున్నా ఎన్నిమైళ్ళుమోసినా కూలీ అర్ధణాడబ్బులే! బేరగాళ్ళకి కూలివాళ్ళ దగ్గరకొచ్చేసరికే కూడిక వస్తుంది. బేడ దగ్గర ఆరంభించి అర్ధణాదగ్గరకు దిగుతుంది బేరం. ఇంతలో షావుకారు అందుకుని "ఇక్కడేకాదురా ఆరియిల్లు! అర్ధణా యిచ్చేండి బాబూ!" అని "సెటిల్" చేస్తాడు. ఈ కూలికూడా వొకకూలీ కంటె యింకోకూలీ ముందుకొస్తాడు. అల్లంతదూరంలోనే మనిషి కనిపించేసరికి పరుగు పరుగున ఆయన వెంటపడతాడు. మాటల్లోకూడా గమ్మత్తూ మర్యాదా వుంటేనే కాని ఆయన కూలి ప్రకమాయించడు! వోరిబాబు! అర్ధణా డబ్బు లుకి, యింతోటి శ్రమ దమాదులా!

మునూకు, ఎలాగవొడుపువేయాలో బాగానే తెలిసిపోయింది. రోజూకూలి దొరక్కుండా యింటికి పోవడంలేదు. మార్కెట్లలో పోటీ లావు. పెద్దవాళ్ళతో సమంగా నుంచుంటే తను కుర్రాడేమో, మరీ అనువుగా కనిపించిపోతాడు. అందరితోటీవుంటే ఆ దొరికే కూలేవో, అదీ దొరకదు! అర్ధణాడబ్బులకి పెద్దముండాకొడుకే 'సై' అంటూంటే 'గిట్టి క్కాయం' తలేదు తననెవడు చూస్తాడు. మునూ మార్కెట్టు పక్కవీథులు కాశాడు. అమాయకంగా జాలిగా చూస్తూవచ్చే పోయేవారిని బతిమాలు తున్నట్లుకుగుతూ పక్కవీథులన్నీ గాలించేస్తున్నాడు. మార్కెట్టు ఆమడ దూరం వుందనగానే తను హాజరు! కొత్తవాళ్ళు కనిపించగానే కొంచెం లజ్జ వేసి మాట్లాడడం నేర్చుకున్నాడీ మధ్య. వీథమ్మట మార్కెట్టుకు ఎవరైనా ఆడవి రాభయం ఆవిడవెనకాల" కూరలు కొంటారేమిటి తల్లీ! "అమ్మగారూ నేనొచ్చేదా!"

"అర్ధణా కయితే రా!"

"లేదమ్మగారూ! శానాకష్టం తల్లీ!" 'అమ్మగారూ తల్లీ' అనే మాటలను కొంచెం వొత్తి వొత్తి పలకడం పలుకులో జాలి పుట్టిపడేటట్లు వేడుకుంటున్నట్టు... నేర్పుగా మునూ అభ్యసించాడు. కాని ఏం లాభం. 'అమ్మా' 'తల్లీ' అని బతిమాలినా ఆవిడమనసు కరగక పోయాక? "వస్తేరా పోతేపో! అంతేనే కాని వొంటుపుల కుక్కలా వెంటపడకు!"

కుక్కలా వెంటపడకపోతే లాభంలేదు. వెంటపడి వూరుకున్నా లాభం లేదు. ఆవిడ చేతిలోని సామాను యేదుంటే అది, చేత్తో పట్టుకుని తానొక యింటి నౌకరులాగ నటించకపోతే, మిగిలిన కూలీలు పోటీకొస్తారు. ముందే తన హక్కు భుక్తం చేసుకుంటే ఆనకతకరులేదు. మునూ ఆమెచేతిలోని సంచీ "యిలా తెండమ్మా! నేను పట్టుకుంటాన"ని యిచ్చకం చేస్తూ వెంటపడతాడు. కూలి సంపాదిస్తాడు. మిగిలిన కూలీల కీ కిటుకు తెలిసివాళ్ళూ అవలంబిస్తారు. మునూ యీ పద్ధతి మార్చివేసి యింకో కిటుకు కనిపెడతాడు!

అసలువాణ్ణే మచ్చికచేసుకుంటే యీ గొడవే వుండదు. షాహుకారులను బుట్టలోవేసుకుంటే తనకు ఎక్కడవున్నా కూలీ పురమాయిస్తారు. వడ్డించేవాడు మనవాడైతే సరీ! దుకాణదారుల దగ్గరకుపోయి ఆ వూసూ యీ వూసూ చెబుతూ మంచి చేసుకుంటున్నాడు. కాని షాహుకార్ల గొడవ షాహుకార్లదే! వ్యాపారం, లాభం, సరుకులు, ఎప్పుడూ ఇవే కబుర్లు. తనకేసి వో చూపు చూశారుకారు! వాళ్ళదృష్టిలో కూలీలంటే పశువులకన్నా కనికిష్టం. పందులకంటే హీనాతిహీనం. కూలీలను నోటికొచ్చిన బూతులు తిట్టినా, చేతికొచ్చిన తన్నులు తన్నినా అడిగేవాడెవడూలేడు! చాకలి గాడిదను బాదినట్టు బాదినా వీళ్ళకి బుద్ధిరాదుట!

మునూ వుండుండి వొక పుకారు పుట్టించాడు. "రేపు మార్కెట్టు కట్టేస్తారుట. షాహుకారెవరో పోయారట్ట!" కూలీలు వొకటి రెండుసార్లు వాడి బుట్టలోపడ్డారు. తరవాత వాడిమాటలు నమ్మడం మానేశారు. ఇక కూలీలు యిళ్ళకు వెనుతున్నట్టేలేదు. అంతా అక్కడే. రాత్రీ పగలూ జబ్బుమనిషిని కనిపెట్టుకూచున్నట్టు మార్కెట్టులో పడిగాపులు పడుతున్నారు. అక్కడే కూడు; అక్కడే నిద్ర;

ఈ ఎత్తు ఆట్టేకాలం సాగకపోయేసరికి మామూలు ప్రయత్నానికి వచ్చాడు. ఈసారి మార్కెట్టువదిలి దారికాయడం మానేశాడు. అందరితో పాటూ తనూ మార్కెట్టులోనే కాసుకూచుంటున్నాడు. కానైతే చిన్న

మడతపేచీ కనిపెట్టగలిగాడు. బజారున అందమైన ఆడపిల్లలు ముచ్చటగా, వయ్యారంగా వస్తూంటే, కూలివాళ్ళు ఆ వయ్యారాన్నీ ఆనందాన్ని మెచ్చుకోవడం కద్దు. వాళ్ళు కాస్త తన్మయీభావంలో వుంటున్నప్పుడు మునూ, అటు చూడమన్నా చూసేవాడు కాదు. వాడిదృష్టి ఎప్పుడూ ముసలమ్మకేసే. కాస్త వయసు మళ్ళినవాళ్ళూ, తలనెరసినవాళ్ళూ, నీరసంగావున్నవాళ్ళూ ఐతే తప్పకుండా కూలిచెప్తారు. వాళ్లని దేవుకిస్తే నాల్గుడబ్బులు రాలతాయి. కనక దబ్బున మునూవాళ్ళ చెంతకు పరుగెత్తేవాడు; కాని వాళ్ళింటా పటారంగానూ గోనెపేచు వ్యవహారం. అర్ధణాడబ్బులికి అరగంటుబేరం. కార్పణ్యం. చెయ్యి విదపరు. ఆడిన బేరమే పదిసార్లాడతారు. వొప్పుకున్న బేరంలో మళ్ళీతగ్గింపు. కూలి ఓ పైసా పరకా తక్కువయినప్పటికీ వీళ్ళదగ్గిర మాత్రం కూలి దొరుకుతుంది. అది చాలును! కాని వీళ్ళతో పని వొకంతకు తెమలదురా బాబూ! తెమలదు! వెళ్ళిన కొట్టుకే వెళ్ళడం, చూసిన వస్తువే చూడ్డం, బేరమాడ్డం. కొట్టువాడు వీశ వంకాయలు అర్ధ రూపాయంటాడు. వీళ్లు బేడ కడుగుతారు. బేడ నుంచి బేరం: "అమ్మా! తల్లీ! పొద్దున్నే మీ బేరం...ఇందులో మిగిలేదేం లేదమ్మా! వీశకీ కాణీ మీ చేతి బోణీ..." అంటూ అర్ధణా దిగుతాడు షాహుకారు. ముసలది మరో రెండు మెట్లు దిగమంటుంది... పొద్దున్నే బుట్ట పుచ్చుకుని బయల్దేరితే ఆ పూటల్లా బేరమే. "పని నూరుగుళ్ళవుతందమ్మా! దబ్బుని రండమ్మా" అంటాడు మునూ. ముసలిది "వుండుండు ఈ వొక్క కొట్టూ చూసుకుని పోదాం" అంటుంది. వొక్క కొట్టు కాదు. అన్ని కొట్లూ చూసి పక్క బేరగాళ్ళెలా కొంటున్నారో వాకబు చేస్తూ చివరకు ఏమీ కొనకుండానే ముసలిది బజారల్లా తిప్పుతుంది. దీని బేరం మండా! పుచ్చు వంకాయలూ, గుడ్డి వంకాయలూ పోగులు బేరమాడి గంపలో వేయించుకుంటుంది. ఇల్లు చూస్తిమా, క్రోసుడుదూరం. ఇచ్చేకూలీ అంటామా అణా పరకా! కార్పణ్యం ముండ!

మునూ వచ్చిన ముహూర్త బలమేమిటో కానీ, వాడికి దొరికేవాళ్ళంతా యిలాటివాళ్ళే. రోజల్లా తిరిగి తిరిగి చచ్చినా కళ్ళచూసేది పావలా డబ్బులు. తులశిమాత్రం అర్ధరూపాయి పైచిలుకు ఆర్జిస్తున్నాడు. రెండూ కలిపితే యింతా చేసి రూపాయికి తక్కువే. ధరలు పెరిగిపోతున్నాయి. రూపాయి మారిస్తే మనదికాదు. పప్పులాగయిపోతోంది చిల్లర. బియ్యం, ఉల్లిపాయలు, నూనె

కొనేసరికి హాళ్ళీకి హాళ్ళీ సున్నాకు సున్నా! ఇక మిగిలేదేముంది. దిబ్బా దిరుగుండం!

పోనీ, ఇదీ నయమే. కొంతలో కొంత సంతోషం. దయాలుకి జ్వరం నిమ్మళించింది. గాయాలు మానినట్లే! పథ్యంపెట్టారు. కాని పాపం పూర్తిగా నీరసించిపోయాడు. గుండె బెగిలిపోయింది. నరాలన్నీ వణకు, సత్తువలేదు. ఫ్యాక్టరీలోని సామానంతా వేలం వేసేశారు. తీర్చవలసిన అప్పులు యింకా బోలెడున్నాయి. పరపతి పోయింది. నలుగురిలోకీ రావడమంటే బిడియం, భయం. అప్పులన్నీ 'నివాడా' చేస్తేనేకాని ఆబోరు తక్కదు. ఏమైనాసరే, అప్పులన్నీ చెల్లుబెట్ట నిశ్చయించుకున్నాడు. తన ఆస్తిపాస్తులు పోయాయనే దిగులు. అప్పులు ఎలా తీర్చాలనేఆందోళన. వీటికితోడు అతకినింకొక విచారం పట్టుకుంది. రోజూ పిల్లలిద్దరూ మార్కెట్టుకు పోయి నానాకష్టాలూపడి నాలుగు డబ్బులు తెస్తున్నారు. తనూ చిన్నప్పుడు యిలాగే కష్టించాడు. మోయలేని బరువులు మోశాడు. పట్టరానివాళ్ళ కాళ్ళు పట్టాడు. ఇప్పుడీ పిల్లలగతేం కాను! జ్వరం నిమ్మళించిందనే మాట నిజమే కాని బెంగమాత్రం వదల్లేదు. రాను రాను మరీ ఎక్కువవుతోంది.

"అబ్బాయ్, చెబుతున్నాను విను! మనోవ్యాధికి మందులేదు! నీకు బతికి బట్టకట్టాలని వుందా, వెంటనే మీ గ్రామం వెళ్ళిపో. నాల్నాళ్ళు అక్కడుంటివా కాస్త బాగుంటుంది ఆరోగ్యం!" అని హెచ్చరించాడు డాక్టరు. ఊరుకుపోదామంటే అప్పులు పోగా మిగిలిందేమీలేదు. తనకూ తన భార్యకూ టిక్కెట్టుకే మాత్రమేవుంది. మిగిలిన డబ్బు సామాను లగేజి చేయించేందు కయిపోతుంది. మునూగతేమిటి?

"భయంలేదు; నేను తర్వాత వొస్తాన"న్నాడు మునూ! వెర్రిమునూ! "ఇంటికి వెళ్ళాక డబ్బు పంపిస్తాను రా!" అన్నాడు దయాలు.

ప్రయాణ సన్నాహాలన్నీ పూర్తిచేసుకున్నారు. పఠాన్‌కోట వరకూ వచ్చి సామాను రైల్లోంచి దింపి బండి ఎక్కిస్తానన్నాడు తులశి.

ఎడబాటు దుఃఖకరమైనది. ప్రభుదయాలూ, అతనిభార్యా యీ వియోగాన్ని భరించలేకపోయారు. దయాలు వయస్సులో పెద్దకదా చిన్నకుర్రవాడిలా బావురుమని ఏడుస్తున్నాడేమి! ఇంత పెద్దవయసులోవున్న మనిషి జీవితంలో సర్వమూ కోల్పోయినట్లు దుఃఖించడం యింతవరకెప్పుడూ మునూ చూళ్ళేదు. ఎప్పుడూ కలకలలాడే మోము వివర్ణమయింది. కళ్ళల్లో దాగుకున్న నవ్వున

తరిమికొట్టి దుఃఖం ఆ స్థానాన్ని ఆక్రమించుకుంది. అతని చెంతకు వెళ్ళి నిల బడాలనివుంది. కాని మునూకు భయం వేసుకొచ్చింది. దూరంనుంచే తనలో తాను గొణుగుకుంటున్నట్లు అనుకోసాగేడు: "ఆయన దగ్గరకు వెళ్ళలేక పోతున్నానేం? కాళ్ళు తడబడుతున్నాయేం? ఇన్నాళ్ళూ చనువుగా దగ్గ రకు తీసి నన్ను పెంచాడుకదా!"

దయాలుకంటే, దయాలు భార్యదగ్గర వాడికి చనువు లావు. సామా నంతా ఆవిడ సర్దుకుంటున్నది. పెట్టెలన్నీ తాళాలు వేసుకుని సిద్ధంచేసుకుంది. గదిలో కిటికీదగ్గర కూచుని కిటికీలోంచి దిగులుగా దీనంగా పరి పరి విధాల పోతున్న మనస్సును పట్టుకోలేక శూన్యంగా చూస్తున్నది. మునూ గబ గబ ఆవిడ చెంతకు వెళ్లాడు. ఆమె అతని తలనిమురుతూ దగ్గరకుతీసింది. అతను ఆవిడ వొళ్లో తల పెట్టుకుని మోమెత్తి చూచాడు. సజల నయనాలతో ఆమె కనిపించింది. రెండు మూడు కన్నీటిబొట్లు మునూ బుగ్గలపై బొట బొటరాలాయి. వడగళ్ళవంటి కన్నీటిబొట్లు. కన్నీటిచుక్కలు చూపులకు అలముకుని ఆమె విగ్రహాన్ని కలలో చూసినట్లు నీడవలె మార్చాయి. అలికినట్టు చెదిరినట్లు ఆమె మోము కనపడసాగింది. తను బీబీజీ యిల్లువిడిచి దయాలుయింట కాలు మోపగానే కళ్యాణ మంటపంలో అడుగువేసినట్లనిపించింది. తన జీవితంలో ఎన్నడూ ఎరగని వొక మాతృహృదయం, నిండు ప్రేమతో, తనను లాలించి దగ్గరకు తీసుకోవడం యిదివరకెన్నడూ యెరగడు. దయాలుభార్య తనకాతొరత తీర్చింది. చీకటిలో మబ్బుల ఆకాశంలో చిన్నమెరుపు మెరసి నలుమూలలకు కాంతిని పరుగెత్తించినట్లు తన జీవితంలో ఆమె ఆదరిత, మాతృప్రేమ దివ్యజ్యోతులను వెలిగించాయి. ఆవేళ; అవును. ఆ సాయం కాలం; తనకు జ్వరం వచ్చింది. శరీరం సలసల కాగిపోయింది. తలనొప్పి. కాళ్ళపీకు. ఆమె తన దగ్గరకు తీసుకుని ప్రేమతో బుజ్జగించి తల నిమిరింది. ఇలాగే తన తలను వొళ్ళోకి తీసుకుని. "పోతుందిలే భయపడకు మందు తాగు."

ఇవ్వాళ యిక ఆమెతనకు దూరమై పోతున్నది. ఆవేళవున్న ఆనందం తృప్తి ఇవ్వాళ లేదు. ఆవిడ ఏడవ జొచ్చింది. దుఃఖం దిగమింగ లేక చీర కొంగు నోట్లో అడ్డంపెట్టుకుంది. కాని దుఃఖం ఆగిందికాదు. వెక్కి వెక్కి ఏడుస్తున్నది. దిగ్గున లేచి మునూ అదరిపడి నించున్నాడు. ఎందుకు అమ్మ ఏడుస్తున్నది!

తులశి బండికి టైమయిపోతోందని గబగబ లోనికివస్తున్నాడు. స్టేషనుకి వంపెద్దుబండీ బేరమాడి తీసుకొచ్చాడు. సామాను బండిలో పెట్టడానికి ఇద్దరు కూలీలను వెంటబెట్టుకు వచ్చాడు. ఈ ఇద్దరు కూలీలు తులశికి స్నేహితులే. సహాయం చేస్తామని, చేయి ఆసరా కని, కూడా వచ్చారు. సామాను ఏమంత ఎక్కువలేదు.

ప్రభుదయాలు మొదలుకొట్టేసిన మానులా కూలబడి పోయాడు. కూలబడి మర లేవలేక పోతున్నాడు. తులశీ మునూ అతని చెంతకు వెళ్ళి చెయ్యి అందిచ్చారు. వాళ్ళ భుజాల కానుకుని దయాలు మెల్లగా లేచాడు. గది శూన్యంగా వుంది. ఇల్లు చిన్నబోయింది. కూలీలు పెట్టెల్ని ఎత్తుకుంటు న్నారు. ఈ నాలుగు పెట్టెలతోనే ఈవూరు వచ్చాడు. వీటితోనే ఈ వూరు నించి వెళ్ళిపోతున్నాడు. దీర్ఘంగా నిట్టూర్చి "జన్మంటేనే అంత! మనం పుట్టే టప్పుడు వెంట తెచ్చేదీ లేదు. చనిపోయేటప్పుడు, కూడా పట్టుకుపోయేదీ లేదు!" అనుకున్నాడు దయాలు.

సంజచీకటి పడేముందు ఆఖరిసారి సూర్యకాంతి కిటికీలోంచి గదిలోనికి ప్రసరిస్తున్నది. గది అంతా తోపురంగుతో ప్రకాశిస్తున్నది. గది వొక చిన్న ప్రపంచంలావుంది. కారుణ్యా మొలికే చూపులతో మాటిమాటికీ చూసిన వస్తువునే చూస్తూ దుఃఖం ఆపుకోలేక దయాలు ఇల్లువదలి మెల్లగా అడుగులు వేయ జొచ్చాడు. అడుగులు తడబడుతున్నాయి. కాళ్ళు వణకుతున్నాయి. జారిపోతున్న కొంగును తీసుకుని తలమీద ముసుగు సరిచేసుకుని బెదరి పోతున్న లేడివలె దయాలుభార్య మగనిని అనుసరించింది. ఇరుగు పొరుగు స్నేహితులు, యిరతలకు వచ్చి దయాలును సాగనంపుతున్నారు.

స్త్రీలు దయాలు భార్యను ఊరడిస్తున్నారు.

"ఫరవాలేదమ్మా ఫరవాలేదు. ఎలా వొచ్చినకష్టాలు అలాగే పోతాయి! కష్టాలు కలకాలం కాపరం వుంటాయటమ్మా, నీ వెర్రి కానీ!"

"ఇలాంటప్పుడే ధైర్యం వహించాలోయ్ దయాల్! చేతిలో డబ్బుంటే అంతా మొనగాళ్ళే...ఓడలు బళ్ళవుతాయి. బళ్లు ఓడలవు తాయ్!

"మళ్లీ పట్నం నిక్షేపంలా వస్తువుగాని! వొంట్లో కాస్త నయమయాక అన్నీ అవే కుదుట బడతాయి."

“పోనిద్దురూ బాబయ్యా! చావలేక బతుకుతున్నాను. ఏం జన్మ, దిక్కుమాలిన జన్మ! నలుగురిలోనూ ఛీ ఛీ అనిపించుకున్న తర్వాత! చస్తే యేం బతికితేయేం! ఛా ఛా” ప్రభుదయాలు తనను తానే క్షూణత పరుచుకుంటూ దూషించుకున్నాడు. మళ్ళీ తనను తానే “దాలి గుంటలో పడుకుని వున్నప్పుడే కుక్కబుద్ధి! తర్వాత అంతా మామూలే బాబూ!” అన్నాడు దీనంగా. కళ్ళనీళ్లు గిర్రున తిరిగింది. గొంతుక బొంగురపోయింది.

ప్రభుదయాలు జండాఎత్తేసేడని కొందరు గుసగుసలాడుకుంటున్నారు. మరికొందరు: మొగుడు చస్తేనేకాని ముండకి బుద్ధిరాదు! మా: ఎగిరి పడ్డాడు. మా:ఎగిరిపడ్డాడు! డబ్బున్నవాళ్ళు ఇంద్రుడూ చంద్రుడూ లక్ష్యం లేదు కదా!’ అని వదరేరు. అమ్మలక్కలు కిటికీ తలుపులు తెరుచుకుని గదిలోంచి తొంగి తొంగి చూస్తున్నారు. బాతాఖానీకి పిచ్చాపాటీకీ అమ్మలక్కలకి కొత్తడోసు దొరికింది. బండివచ్చి ప్రభుదయాలునీ, అతని భార్యనూ ఎక్కించుకుని తీసుకువెళ్ళేవరకూ వాళ్ళు కనుచూపుమేర వెళ్ళేవరకూ యిరుగు పొరుగమ్మల యికిలింతలు పకపకలూ ఆగేయికావు.

బండివాడు వచ్చాడు. చిరిగిపోయిన బట్టలతో నించున్న బికారివాళ్లను చూసి దిగ్భ్రాంతిచెందాడు. ఎవరో డబ్బున్న మారాజులబేరం అనుకుని ఎద్దుని దౌడు తీయిస్తూ మరీ తోలుకొచ్చాడు బండిని. కాని తీరాచూస్తే తలకు మాసినబేరం. చప్పున రైలుస్టేషను దగ్గర దింపేసి యీ దిక్కుమాలిన బేరాన్ని వొదుల్చుకుంటే మంచిబేరం దొరుకుతుంది. బండివాడు ఎద్దును కొరడాతో బాదుతున్నాడు. ఎద్దు గబగబ పరుగులు తీస్తోంది. చక్రాలకు నారవేసి ఎన్నాళ్ళయిందో లొడలొడమంటున్నాయి. గూడువిరిగి మీదపడుతుందా అన్నట్లు ఊగుతోంది. దెయ్యంపూనిన మనుష్యులకుమల్లే బండిలో కూచున్నవాళ్ళు తూలిపోతున్నారు. కడుపుకు వెన్నముక పొడుస్తోంది.

మునూ బండివాణ్ణి మచ్చిక చేసుకుందుకు “షేక్ సాహెబ్జీ! కొంచెం మెల్లిగా తోలుదురూ! పాపం ఆయనకి ఊష్టం!”

“నేను నీ తాతగారి నౌకర్నేంకాను! మెల్లిగా తోలాల్ట, మెల్లిగా! ఆనక బేరం దొరక్కపోతే వీడి బాబవడిస్తాడనో అద్దె!”

బండిఅబ్బి మాటలు వినగానే మునూకు చిర్రెత్తుకొచ్చింది. మాలీ మేకవంటి దయాలును బాధపెట్టడానికి వీడికి చేతు లెలా వచ్చాయి చెప్మా అని విభ్రాంతి పడ్డాడు.

స్టేషను వచ్చింది. ఎడబాటు దగ్గిరపడుతున్న కొద్దీ వ్యధ హెచ్చు కాజొచ్చింది. ఇదివరటికంటే దుఃఖం పొంగుకు వచ్చింది. దౌలత్ పూరు రైల్వే జంక్షను. రైలు యింక అయిదారు నిమిషాలకు కదులుతుందనగా ప్లాటుఫారం గేటు తెరిచారు. ఇంతవరకూ మూడవతరగతి ప్రయాణీకులు పసువుల మంద లాగ అవతల షెడ్డులో బిలబిలలాడుతూ నిరీక్షిస్తున్నారు. వొకరినొకరు తోసుకుంటూ తిట్టుకుంటూ వొకరిమీద వొకరు పడుతూ కసురుకుంటూ ప్లాట్ ఫారం వద్దకు వస్తున్నారు. వెయిటింగు హాలు బందిఖానాలాగుంది. వందలాది ప్రయాణీకులకు తోడు వేలాది దోమలు, ఈగలు, సైనికులు కవాతు చేస్తున్నట్టు దుకాణాలమీద బారులు బారులుగా ఎగురుతున్నాయి. - విమానాల మాదిరి గుఁయ్ మంటున్నాయి. కూచున్న ప్రయాణీకులు చేతులమీద అనుకుని లేస్తున్నారు. మాటిమాటికీ మళ్లీ సర్దుకుంటున్నారు. ప్రభుదయాలు కిక గుండెలు లేవు. రైల్లో చోటుదొరుకుతుందా, దొరికితే ఏడుకొండలవాడికివే నమస్కారాలు! దేవుడి పుణ్యమా అని చోటుమాటకేం, నించుందుకు కాస్త జాగా; నించోడం మాట రైలు ఎక్కేకకదా! అసలు రైలుదగ్గరికి యీజనం వెళ్ళనిస్తారా తనని!

ఈజన ప్రవాహాన్ని తోసుకుని ముందుకు వెళ్ళడం మాటలతో పనికాదు. తొడదొక్కిడి లావుగావుంది. ఏదైనా సులువుమార్గంచూసి మెల్లిగా రైలుదగ్గిరపడితే తరవాత మాటా, ఆ భగవంతుడే వున్నాడను కున్నాడు మునూ. కొంచెం అటుఇటూ చూశాడు. గజాలకు చిన్నకంతవుంది. కంత లోంచి దూరగలిగితే అవతల పడొచ్చును. దూరి దాటేద్దామంటే టిక్కెట్టు కలెక్టరు జేబులో చేతులుపెట్టుకుని హాయిష్గా నడుస్తున్నాడు; వీడి దుంపతెగా, ఆ చూపులు...మునూవైపే చూశాడు. ఎవరైనా తలమాసిన ప్రయాణీకుడు కనిపిస్తే పావలా అర్ధా తడుముకో వచ్చునని టిక్కెట్టు కలెక్టరు చూపులు మునూ చూపులలోని అంతరార్థాన్ని అతను యిట్టే పోల్చుకున్నట్టు "ఇలా రండర్రా! ఇలా పొండి! ఒక్క బేడ..."

మునూదగ్గర ఖర్చులుపోను మిగిలింది ఆ వొక్క బేడే! ఈ బేడావాడి 'ఎదాన' కొడితే తీరా వెళ్ళనీయకుండా వాడిఖర్మానవాడుపోతే, తమగతేం కాను? కాని టిక్కెట్టు దొర నిజాయితీ మనిషే! అచ్చాణీలాటిమనిషి! పక్క దారమ్మట వాళ్ళని పోనియ్యాడ మేకాకుండా మూడవ తరగతి పెట్టెదగ్గరవిడిచి వచ్చాడు. మునూ చూస్తుండగానే, దయాలూ అతనిభార్యా రైలు ఎక్కారు

తులశి అంతకు ముందేలోపల వాటంగా సర్దుకున్నాడు. మునూతాను ఏకాకి అయిపోయినట్లు బాధపడ్డాడు. దయాళు వెళ్ళిపోతున్నాడు. ఇకతిరిగిరాడు !

"ఇంక యింటికి వెళ్లిపో మునూ ! చీకటి పడుతుందీ !" కిటికీ లోంచి తొంగిచూస్తూ దిగులుగా చూస్తున్న మునూ చేతిలో రూపాయి వుంచాడు. "ఏదైనా కొనుక్కో. అల్లరి చిల్లరగా అందరితోనూ తిరక్కు. ఇంట్లోనే పడుకో! నెలాఖర్న అద్దె యిచ్చేద్దాం !"

"బాబుగారూ !..." చేతులు రెండూ జోడించాడు. వణకుతున్న అరచేతిలో రూపాయి జాలిగాచూస్తోంది. మునూ పెదవులు కంపిస్తున్నాయి. కళ్ళనీరు తిరిగింది. మరి మాట్లాడలేక పోయాడు.

"దిగులు పడకమ్మా ! ధైర్యం..."

మునూ, దయాలు భార్యవంక తిరిగాడు, చేతులు మళ్ళీ జోడించాడు. ఆమె కళ్లమ్మట నీరు బొటబొటరాలింది. పిల్లవాడిని దగ్గరకు తీసుకునిచెక్కిళ్ళు నిమిరింది. జుత్తు వేళ్ళసందున పోనిచ్చి దువ్వింది. మునివ్రేళ్ళతో తల సవరించి "ఏడు పెందుకు మునూ ! వెర్రి పిల్లవాడా !" అని అతన్ని వోదారుస్తూ తానే ఏడిచింది !

"రెండురోజుల్లో వచ్చేనూ, నేను ! మంచివాడివే !" తులశి ధైర్యం చెబుతున్నాడు. "చప్పునొచ్చేయి !"

మునూ తడబడుతున్న అడుగులతో వెనక్కి వెనక్కి తిరిగిచూస్తూ యింటి మొహం పట్టేడు.

నడుస్తున్నాడేకాని అతన్ని ప్రభుదయాలు వెంటాడుతున్నట్టేవుంది. అతని విగ్రహం మనస్సులో ప్రతిష్టింపబడివుంది. మూర్తికనులకు కదుతున్నది. "మంచివాడు. దేవుడంటే ఎంతభక్తి ! ఎందుకంత మంచితనం ! ఎవరికీలేని మంచితనం అతనికెలా వచ్చింది ? అవును. రోజూ గుడికెడతాడు. పువ్వులూ పళ్ళూ స్వామివారి కర్పిస్తాడు. ధ్యానిస్తాడు. ఎప్పుడూ భగవంతుడిమీదే అతని మనస్సు. పాపభీతిలావు. పుణ్యం ఎలా వస్తుందనే ఆలోచన... నేనూ వెడతానుకోవెలకి ! అన్నట్టు భగత్ హరిదాస్ గుడిలో భోజనం వుత్తినే దొరుకుతుందే ! మర్చిపోయానామాట ! అక్కడికే వెడతాను. వెళితే తిండికి దమ్మిడీ ఖర్చుండదు, రోజూ డబ్బు కుండపిడతలో పోగుచేస్తే సరి !"

ఇప్పటికి గేటు తీశారేమో జనం బిల బిలలాడుతూ ప్లాటుఫారంమీద ...కున్నారు. మళ్ళీతోపులాట. మునూ ఆలోచనలుఆగిపోయాయి. 'ట్రెయిన్

మనకోసంవుండదురోయ్‌బాబూ' అనే కేకలు.విజిలేసింది. గార్డు యీాల వేశాడు. "అదిగో పచ్చలాంతరూ! రారా!" అనే పిలుపులు మిన్నుముడుతున్నాయి. స్టేషను కటకటాల కింతల్లోంచి మాటను దొర్లించినట్లు శరీరాన్ని బయటకు నెట్టుకుని మునూ యివతల పడ్డాడు. స్టేషను యివతల బళ్ళవాళ్ళు రకరకాల గొంతులతో అరుస్తున్నారు:" "గంట స్తంభ కాడికిబాబూ! నాగుర్రబ్బండీ బేగిపోద్ది! పంచకల్యాణీ గుర్రం కదటండీ బాబూ!"

"విష్ణుకోవిలికి బండీ! కొత్తబండీలడీ చేశానుసార్!"

"నా బండికి పరుపులేయించాను బాబూ!"

బండివాళ్ళ మొర ఆలకించకుండా వొక మహిళామణి పెట్టె చేత్తో పట్టుకుని ఆపసోపాలు పడుతోంది. మునూ అక్కడే నించుని సానుభూతిని ప్రకటిస్తున్నట్లు ఆమెకేసి చూశాడు. "ఏమిరా గుంటడా! ఆస్పత్రికి వస్తావుట్రా?"

"వస్తానండమ్మా వస్తానండి!"

"డాక్టర్ సాహెబ్ సింగ్ బంగాళా తెలుసూ నీకు?"

"మీరు చూపిస్తే వచ్చేస్తానండి!"

"ఎత్తుకో. జాగ్రత్తరోయ్! పెట్టేకానీ కింద ఎత్తేశావ్ కొంపతీసి! సిల్కుబట్టలు కిందపడి దుమ్ము..."

"ఎంత దూరమండమ్మగారూ?"

"ఆఁ ఇక్కడేకదూ! వో ఫర్లాంగుంటుందోవుండవో...పద...ఎందుకా చూపూ? బేడబ్బులిస్తాన్లే!"

"అలాగేనండమ్మగారూ!"

మునూ తలమీద పెట్టె ఎత్తుకున్నాడు. అడుగులు వేస్తున్నకొద్దీ ఆలోచనలు పుడుతున్నాయి. పుడుతున్నవి ఆలోచనలు కాదు, కోర్కెలు. "ఈ పని మామంచి సులువు. ఆ మార్కెట్లో ఏం నొల్లుకుతింటాం గడ్డిగాదం తప్ప! చిన్న ట్రంకుపెట్టె నెత్తిన పెట్టుకుంటే బేడబ్బులు! బాస్! ఇక్కడేమాటు వేద్దాం!"

ఇట్టే వచ్చేసింది వెళ్ళవలసినచోటు. ఆస్పత్రికి దగ్గరగా సందులో వుంది డాక్టర్ సింగ్ బంగాళా. లోపల పెట్టె దింపించుకుని ఆవిడ మునూ చేతిలో రెండణాలు పెట్టింది.

ఇక మునూకు చేయవలసిన పనేమిటో బోధపడిందికాదు. దేవాలయం శిఖరాలు స్మృతిపథంలో మెరియజొచ్చాయి. విష్ణు దేవాలయంలో భోజనం వృత్తినే పెడతారుట! దేవుడిగుడికెడితే పుణ్యానికి పుణ్యమూ వస్తుంది. సాపాటూదొరుకుతుంది. దారి అతనికి తెలుసును. దారితప్పిపోతానేమోననే భయంలేదు. ఇదివరకు ప్రభుదయాలుతో వొకసారి వెళ్ళివచ్చాడు.

ఆకాశంలో చందమామ గుడికట్టుకున్నాడు. బల్బులాగ ధగధగ మెరుస్తూ దేవాలయ శిఖరంమీద వెన్నెలను వొంపుతున్నాడు. దేవాలయ 'చిగిలం' ఎంతబాగుందో! ఆ కోనేటిలో చందమామ ప్రతిబింబించి కదితే చిన్నచిన్న అలలకు ఉయ్యాల ఊగుతున్నది. ఉయ్యాలలో ఊగుతున్న చందమామ పాలకాంతి నలుగుపెడుతున్న మేడలను చూసుకుంటూ గుడిలోకి అడుగుపెట్టాడు.

దేవాలయంలో భక్తుల సమూహానికి కొదువలేదు. చక్కని దుస్తులను వేసుకుని మనుష్యులు మసులుతున్నారు. మరికొందరు గుడిచుట్టూ ప్రదక్షణ చేస్తున్నారు.

మునూ భక్తకోటిలోచేరి గుడిచుట్టూ ప్రదక్షిణ చేస్తున్నాడు. పుష్కరణి గట్టున చిన్న కోనెలవొకటివుంది. మార్బులురాళ్ళు వెన్నెలకాంతికి మెరుస్తున్నాయి. గుడిలో యింతసేపూ కనిపెట్టుకుకూచున్న పేదలకి రొట్టె, పప్పు పంచిపెడతారు. పులిహోర, చక్రపొంగలి, మిడిపొంగలి, శనగలూ స్వామివారికి ఆరగింపు పెట్టినతరువాత గర్భగుడిలో నించున్నభక్తులకు వినియోగం చేస్తారు. రోజూ కుంచాలకొద్దీ బియ్యం వారుతుంది. వినియోగమవుతుంది.

ప్రసాదాలిచ్చే వేళెప్పుడు వస్తుందాఅని మునూ మిడుతూ మిడుతూ చూస్తూ కూచున్నాడు. ఉండ్రాళ్ళమీదవున్న భక్తి దేవుడిమీద యింకా కుదరలేదు కుర్రవాడికి!

భక్తి అలవర్చుకోవాలనే కోరిక మొదట జనించినప్పటికీ ఆకోరిక అతనిలో బలంగా పాతుకుపోలేదు. కోనేటి అలలమీద చందమామ తన అందాన్ని దిద్దుకుంటున్నది. తన సౌందర్యాన్ని చూసుకుని మురిసిపోతున్నట్లు కదలాడుతున్నది. తోటలోని పూల చెట్లు అత్తరవుల వొంటికి పూసుకుని గుబాళిస్తున్నవి. పూలు రెమ్మలతో గుసగుస లాడుతున్నట్లు ముందు కొకసారి తొంగి చూసి మళ్ళీ మటుమాయమవుతున్నవి. వెన్నెల పుచ్చపువ్వులావుంది. ప్రకృతి

పరచిన అందచందాలను చూసిన వెంటనే మునూ మనస్సు చెదిరిపోయింది. దేవుడి కోవెలలోనికి వెళ్ళేముందు పూలు పళ్లూ తీసుకువెళ్ళాలనే మాటే మరచిపోయాడు. మానవుల చూపులకు అందని దేవుడు, కనిపించని దేవుడు తనకు దైవభీతిని కలిగిస్తున్నట్లు తోచింది. గబ గబ నడుచుకుంటూ ఎదురవుతున్న జనాన్ని తప్పించుకుంటూ గర్భగుడిలోనికి వచ్చాడు. జేగంట మ్రోగుతున్నది. ఆచార్యులగారు ఒక చేత్తో శఠగోపం పట్టుకుని మరొకచేత తీర్థప్పడియ పట్టుకుని ఉద్ధరిణితో తీర్థం భక్తుల చేతులలో పోస్తున్నాడు. భక్తులు తీర్థం స్వీకరిస్తున్నారు. తీర్థం పుచ్చుకున్నాక మరికొందరు తలకు అరచేతిని వొత్తుకుంటున్నారు.

భక్తులుతీర్థం పుచ్చుకున్నాక రొంటినవున్న పైసాపరకాతీసి ఆచార్యుల వారి చేతిలోవున్న పళ్లెంలో పడవేస్తున్నారు. డబ్బులు రాగిపళ్ళెనికి తగిలి ఘళ్ ఘళ్ మంటున్నవి.

ఆచార్యులవారిచ్చిన తీర్థం పుచ్చుకుంటూ మునూ పళ్ళెంలో దక్షిణ వేయలేదు.

పెద్దబుట్టతో పులిహోరపట్టుకుని మరొక అర్చకుడు యివతలకివచ్చాడు. రావడం భయం, భక్తులు దోసెరెపి లేకుండా చుట్టూ మూగేరు. "అందరూ కూచోండర్రా ! ప్రసాదం యిస్తాను !" అంటూనే వున్నాడుస్వామి, కాని వినేవాళ్ళేవరు ! ఒకరినొకరు తోసుకుంటూ మోచేతులతో పొడుచుకుంటూ మెడ పట్టుకునెట్టుకుంటూ ఈగల్లాగ వాలారు. కోవిల బేడా కవతల బిచ్చమెత్తుకుంటున్న ముష్టివాళ్ళుకూడా ప్రసాదానికి ఎగబడుతున్నారు. ఇక మునూకు, చోటెక్కడ !

"కాస్త చోటుపెట్టండర్రా !" అంటున్నాడు ఆచార్యులుగారు. మునూ ముందుకువచ్చి చేతులు చాచాడు. పులిహోర, పంపకమయిన తరువాత చపాతీలు పంచారు. మునూ వాటిని జాగ్రత్తగా ఆకులో చుట్టబెట్టుకుని ఆకలితో వున్న వేటకుక్కలాగ అవతలకి వెళ్ళిపోయాడు. నోరు ఊరింది. వేడి వేడి పులిహోర ! ఎప్పుడు తిందామా అనే ఆతృత.

ఆతృతతో కోనేటి వొడ్డుకు వెళ్ళి పూల పొదచాటున కుక్కపిల్లలా చతికిలబడ్డాడు. బొండుమల్లెల వాసన నైట్క్వీన్ పరిమళం! సకల సంపెంగ వెలగపండులా గుమగుమ! ఎర్ర సంపెంగలు తలనిండా. తురుముకుని చెట్లు ఎంత వొయ్యారంగా నించున్నాయి!

మాలతీలత పందిరినిండా అలుముకుని వెర్రి వాసన కొడుతున్నది. పుష్కరిణిలో తన అందం చూచుకుంటున్న చందమామ! నిండు జాబిల్లి! వెన్నెల! ఆకాశం పొడుగునుంచి వెన్నెల పాలధారవలె నేలను పడుతున్నది.

ఆకువిప్పివున్నవన్నీ యిట్టే తినేశాడు. కారం ఎక్కువై నోరుమండింది. కోనేటిలోదిగి పుక్కిళ్ళుకొద్దీ నీరు త్రాగేడు. తోటలో చిన్న తీరైన చక్కని మంటపం వుంది. వెన్నెల దానిమీద పడి మరీ శోభిస్తోంది. పుష్కరిణిలో జాబిల్లి సగమే కనిపించాడు. మబ్బు తెరకమ్మి జాబిల్లిని తన వొడిలోనికి దాచుకుంటున్నది. కోనేటి మెట్లు ఎక్కి మెల్లిగా మీదకు వచ్చాడు. ఎదురుగా దూరాన చిన్న మందిరం కనిపించింది. మందిరంముందు నీళ్లకుండీవుంది. మందిరం వాకిలిలో సాధుపుంగవు డొకడు యోగాసనం వేసి అర్థ నిమీలిత నేత్రాలతో ధ్యాన నిమగ్నుడై తావళం తిప్పుతున్నాడు. యోగికి ఎదురుగా ముసలామె కూర్చుంది. ఆమె పక్క మరొక యువతి ఆసీనురాలైవుంది. చక్కని వాయిలుచీరె కట్టుకుని జడలో పువ్వులు తురుముకుని దేవకన్యవలె చూడముచ్చటగావుంది పిల్ల.

మునూ కళ్ళకు యోగిపుంగవుడు కనిపించిన వెంటనే తొందర తొందరగా మందిరం వైపుకు దారితీశాడు. యోగి ముందుకువచ్చి సాష్టాంగపడ్డాడు. యోగి కనులు తెరచి గంభీరంగా అటు చూడకుండానే "ఇలా ఎందుకొచ్చినట్టు బిడ్డా! నీది తపస్సు చేసుకునే వయస్సు కాదుకదా!"

"తమ దర్శనం..."

కూర్చున్న ముసలామె చికాకుగా మునూను కసిరికొట్టింది: "వెళ్లు! ఆడుకునే యీడు నీది! ఫో."

యోగి అభయముద్రపెట్టి "తన కోపమే తన శత్రువని ఎరగవా తల్లీ! పసిపిల్లలపై నీకంతకోపం కూడదు. కామక్రోధలోభమోహ మదమాత్సర్యములనే అరిషడ్వర్గములను జయించవలె!...ఆ కుర్రడు భగవంతుని సృష్టికదా!

"నాకూ దేవుణ్ణి చూడాలనివుంది. గురూజీ! నేనూ మీ లాగే ధ్యానిస్తాను.

"శాంతి! శాంతి! అటులనే బిడ్డా!"

గురూజీ చిరునవ్వునవ్వి "కుర్రవాడవు; ముందు గురు శుశ్రూష చేయవలె!"

"చేస్తాను స్వామీ! చేస్తాను!"

"పిమ్మట యోగాభ్యాసము నేర్పవలె"

"చిత్తం గురూజీ! చిత్తం!

మందిరంలో ఒకమూల మంచిమంచి పళ్ళు కుప్పపోసివున్నాయి. గురూజీ వేలుతో వాటినిచూపిస్తూ "శాంతి! శాంతి! బిడ్డా! ఆ ఫలాలను నా వెంట తీసుకురమ్మా!"

పనిచెప్పడమే తడవుగ మునూ పళ్ళపోగువద్దకు వెళ్ళిపోయాడు. యోగి ముసలామెచెవిలో గుసగుసమన్నాడు. "నిండుపూర్ణిమ. తిథిమంచిదే; నేను ముందు నిష్క్రమిస్తాను. నువ్వు ఆ కుర్రవాని వెంటరా!"

"మా కోడలు గురూజీ!"

"తీసుకురా! ఉపదేశము చేస్తాము!"

"పుత్రులులేనివారికి పున్నామ నరకంకదా స్వామీ!"

"అని శాస్త్రము చెబుతున్నది బిడ్డా!"

"మా కోడలకు సంతానయోగం లేదా గురూజీ!"

"మంత్రోపదేశము చేస్తామంటిమికదా!"

గురూజీ తన శిష్యపరమాణువైన మునూవంక తదేక ధ్యానంతో చూశారు. "ఈ ఇద్దరి స్త్రీలను మన ఆశ్రమానికి తీసుకురా! నేను ముందు వెడుతూ వుంటాను. నా వెనకాల రా. కొంచెం దూరంగా నడు. లోకం మహాచెడ్డది బిడ్డా!"

గురువుగారి మాటలలోని అంతరార్థమేమిటో మునూకుఅవగతమయినట్లు తోచదు. కాని వాడిదృష్టి సంచిలోని పళ్ళపైవుంది. పళ్ళు ఆరముగ్గివున్నాయి. దోర దోరని పళ్లు. చక్కగా పండిన మామిడిపళ్ళు. సంచీ మామిడిపళ్ళకావు వేసినట్లు వాసన కొడుతున్నది. మునూకు నోరూరింది. మాటి మాటికీ లొట్టలు వేసుకుంటూ గురూజీ చెప్పినట్లు భక్తురాళ్ళను వెంట బెట్టుకుని వస్తున్నాడు. యోగిపుంగవుడు వీళ్ళెవరితోనూ సంబంధంలేనట్లు ముందు నడుస్తున్నాడు. దారి తప్పుతానేమోననే భయంతో మునూ గురూజీని చూస్తూ ఆయనపోయిన తోవమ్మటే నడుస్తున్నాడు.

ఆశ్రమం సమీపించింది. ఆశ్రమం ముందు చిన్న తోటవుంది. గురూజీ పెరటి దారిని ఆశ్రమంలోనికి ప్రవేశించాడు. కాని యీలోపునే తన వెనక

వస్తున్న ఆడవాళ్ళు కనిపించలేదు. మునూ ఆగి వెనక్కి తిరిగి చూశాడు. బజారు జనంతో కిట కిటలాడుతున్నది. పూవులు అమ్మే కుర్రవాళ్ళు కాకి గోలగా అరుస్తున్నారు. ఇక్కడే గురువుగారు ఆగి పక్క సందులోనికి వెళ్ళారు. సందు మొగిని కిళ్లీకొట్టు కనిపించింది. కిళ్లీ కొనుక్కొని వేసుకుంటే నోరు లక్కలాగ పండి ఎర్రగా యించక్కా వుంటుందనుకున్నాడు. కిళ్లీ కొట్టుమీదవున్న నిలువు టద్దం నాలుగురోడ్ల జంక్షన్‌ను ప్రతిబింబిస్తోంది. వచ్చీ పోయే జనం అద్దంలో కనిపిస్తున్నారు. కిళ్లీకొట్టు సమీపించేసరికి ఆ ఇద్దరు ఆడవాళ్ళు మెల్లగా వచ్చేశారు. మునూ పక్కసందులోకి మళ్ళాడు.

ఆశ్రమం పూరియిల్లుకాదు. అందమైన చిన్న భవంతి. పైన మేడ. చిన్న గదులు. స్వామిజీ తన భక్తులు చీకట్లో పడిపోతారేమోనని హరికేన్ లాంతరు పట్టుకుని మెట్లవద్ద నుంచున్నారు. భక్తులు వెంటరాగా గురూజీ "శాంతి! శాంతి!" అంటూ మేడమీదకు వెళ్ళారు. మేడమీద గది దివ్యంగా వుంది. గదిలో కుర్చీలు పులిచర్మం వొక మూల గుడు గుడు మరొక మూల పట్టెమంచం కుబేరుడి బసలా వుంది. యోగి, వసంతుడులా కనిపించాడు.

"సెలవిప్పించండిమహాత్మా! మళ్ళీ ఉదయం తమ దర్శనం చేసు కుంటాను!" అన్నది ముసలిది. యోగి అర్ధనిమీలిత నేత్రాలతో పరికించి అలాగే అన్నట్లు తల ఆడించి అనుజ్ఞదయ చేశారు.

ముసలామె తన దారిని తాను చక్కా పోయింది. మునూ విశ్రాం తితో గదిలో నిలబడ్డాడు. సాధుపుంగవుడు "బిడ్డా! మేడకింద వసారాలో నేను వచ్చేవరకూ వుండు. మాకోసం ఎవరైనా వస్తే, గురువుగారు సమా ధిలోవున్నారని, మామాటగాచెప్పు."

మూనూ మేడమెట్లు దిగి కిందకు వెళ్ళిపోయాడు. గురువుగారు భక్త రాలిని అనుగ్రహించి "ప్రియా! జీవాత్మ పరమాత్మతో సంయోగముచెంద పరితపిస్తూవుంటుందికదా! ఇటురా!" అని దగ్గరకు తీసుకున్నారు.

గురువుగారు యోగిపుంగవులు. మంత్రోపదేశం ఏమిచేస్తున్నారో అనే కుతూహలంకొద్దీ మునూ మేడమీదకు పిల్లిలాగ వచ్చి గది గుమ్మం ముందు నక్కి నక్కి తలుపు సందులోంచి మెల్లిగా చూశాడు. తనకళ్ళను తానే నమ్మలేకపోయాడు. నిశ్చేష్టుడయాడు. సిగ్గు ముంచెత్తుకొచ్చింది. గబగబ కిందకుదిగి తానేమేటి చూశాడో యిందాకటి ముసలామెకు చెప్పా

లనుకున్నాడు. తలుపుతీసి చూస్తే ముసలామె అప్పటికే వెళ్లిపోయిందికదా! పాపం ముసలామెకు ఈ పిల్ల కోడలట! అవ్వ!

ముసలిదానికి యీ పిల్లకోడలు కాదని ముసలిది 'తారుపుగుల్ల' ని మనూ కేమితెలుసును! అతను ఖర్రవాడు!

కనకనే వీధిలోకి గెంతి మళ్ళీకంటికి కని పించకుండా పట్టణంలోనికి పారిపోయాడు. యోగి, సాధువు; అవ్వ! అవ్వవ్వ !!

తిన్నగాపోయి ప్రభుదయాలు యింట్లో మామూలుగా నిద్రపోదా మనుకున్నాడు కాని యింట్లో ఎవరూలేరే! భయంకదూ! దయ్యమేదైనా అర్థరాత్రివచ్చి పీకనొక్కితే. యింటిదగ్గరలోనే బజారులో షాపు అరుగుమీద నిద్రపోయాడు.

ఎప్పటిలాగే తెల్లవారింది. సరాసరి రైలుస్టేషనుకు బయలుదేరాడు. నిన్నటిలాగే ఇవ్వాళకూడా కూలిదొరుకుతుంది. పెట్టె ఆక్టేబరువు వుండదు. మార్కెట్టులోలాగ కూలికోసం జట్టీ ఆడక్కరలేదు.

స్టేషన్‌కు వచ్చేసరికి బారెడుపొద్దెక్కింది. పెట్టెలనిండా జనాన్ని మోస్తూ లాహోరునుంచి రైలుబండీ పొగలుకక్కుతూ స్టేషన్ చేరింది. జనాన్ని తప్పించుకుంటూ ఆడవాళ్ళు రైలుదిగి యివతలకు వస్తున్నారు. ఎర్రనిరంగు అద్దుకున్న పెదవులు, చేతిగోళ్ళు, కాలిగోళ్లు. సిల్కుచీరెలు కట్టుకుని చక్కనిసిగను ముడుచుకుని ఠీవిగానడుస్తూ నెమలిపురిపిట్టలా నాట్య మాడ్తున్నట్టు నడుస్తున్నారు ఆడవాళ్ళు.

గుర్రపుబళ్ళను బేరమాడుతున్నారు. టాంగాలపై కూచున్నారు. చక్రాలు నేలను గుండ్రంగా కొలుచుకుంటూ, బండి వెడుతుంటే వయ్యారంగా కూచున్నారు ప్రయాణీకులు. కాస్త పైసా పరకావున్న మారాజులు గుర్రబ్బళ్ళను కుదుర్చుకుంటే ఆపాటీ పాటినాదారు కుటుంబీకులు వొంటెద్దు బండిని బేరమాడుతున్నారు. బండిలో కూచునేది వొకరిద్దరుకారు. నలుగు రయిదుగురు. తమ వొక్కడికీ బండి కట్టించుకు నేందుకు ఏ సంసారీ యిష్ట పడడంలేదు. అయిదారుగుర్ని చూసుకుంటే నేకాని బండివాడికి అద్దెకిట్టదు. "రండీ! రండీ! మనిషికణా అణా! గంటస్తంభం కాడికణా!" అంటు న్నాడు బండి అబ్బి. ఆ అణాకూడా ఖర్చుపెట్టడం యిష్టంలేనివాళ్ళూ, అణా డబ్బులు రూపాయికంటే హెచ్చు విలువగా చూసుకుంటున్న పేదలూ తమ తమ భుజాలమీద పెట్టెల్నీ మూటల్నీ ఎత్తుకునికాలికి బుద్ధిచెబుతున్నారు.

వచ్చి పోయే జనం నలుపక్కలకు చెదిరిపోతున్న ప్రయాణీకుల గుంపు! మధ్యన నిలబడి మునూ అటుఇటూ దిక్కులు కలయచూస్తున్నాడు. మూటలు మోసుకుంటున్న మనుష్యుల వెంటపడి కనికరించమన్నట్లు, కూలి దొరక్కపోతే కష్టమన్నట్లు, ఈ కూలికోసమే యింత చిన్నవయసులో రాత్రీ పగలు స్టేషనువద్ద పడిగాపులు పడుతున్నట్లు, దీనంగా వేడుకుంటున్నాడు: "లల్లాజీ! ఆ పెట్టె నేను పట్టుకురానాండి? బాబుగారూ!"

"ఎంతదూరమైనా భయంలేదండి! మోయగల్నండీ కింద ఎత్తేస్తానను కుంటున్నారా?"

ఎంతమొత్తుకున్నా, మిరపకాయ తిన్న కాకిలా అరిచినా ఎవరూ కూలి చెప్పరే! తెచిన వేళావిశేషం! కూలి పురమాయించే మనుష్యులు ఎలా వుంటారు? ఏవిధంగా వాళ్ళ మనసును కలిగించాలి?

ఆమాత్రం ఈమాత్రం డబ్బున్నవాళ్లు బళ్ళమీదనే పోతారు. ఎక్కచ్చిగా బండీ కట్టించుకోలేనివాళ్ళకి వంపెద్దు బళ్ళు వుండనే వున్నవాయెను! పదిమంది ప్రయాణీకులు కలసి మొత్తంమీద కట్టించుకుంటే ఒక్కొక్కడికీ అణాపడుతుంది. ఇక ఆఅణాకు కూడా టికాణా లేనివాళ్ళేకదా నడిచి పోయేది! వాళ్లు కూలి వాణ్ణెందుకు కుదుర్చుకుంటారు! దేవుడిచ్చిన చేతు లున్నాయ. భుజాలున్నాయి. తలవుంది. మూటల్ని హాయిగా నెత్తినపెట్టుకుని ఎవరి దారిన వారు పోతారు. తానొక నిరుపేద. మూటలు మోసుకుపోతున్న ప్రయాణీకులూ అంతే! వాళ్ళవెంట పడి దేవురిస్తేమటుకు లాభమేముంది! జోగి జోగి రాసుకుంటే బూడిద రాల్తుంది!

"హేయ్ కూలీ! కూలీ" అనే కేక వినిపించింది. వినిపించిన దిక్కుకు తిరిగి చూశాడు. చూడడం కాదు. చూపులకన్న వేగంగా పరుగెత్తుకెళ్ళాడు. అప్పుడే కొత్త ప్రయాణీకుడికి కూలివాళ్లు కుదిరిపోయారు. నీలి నిక్కరూ చొక్కాతొడుక్కున్న కూలివాళ్ళద్దరు ట్రంకుల్నీ, బెడ్డింగుల్నీ నెత్తినపెట్టుకొని నడుస్తున్నారు.

విసిగి వేసారిన ప్రాణంతో మునూ అక్కడనేనిల్చుండిపోయాడు. ఎండకి నెత్తి మాడుతున్నది; కాళ్ళు కాలుతున్నాయి. అధికార దర్పంతో హాలులోంచి గద్దింపు వినవచ్చింది. "ఒరే గుంటడా! ఇలా, ఇలా! కమాన్!" కూలి దొరుకుతున్నదని మునూ భంగుభంగున పరుగెత్తాడు. తీరా వెళ్ళి చూస్తే కూలీలేదు; గీలీలేదు. యములాడిలాగ పోలీసువాడు ప్రత్యక్షం!

"చట్టారీలంజకొడకా ! నీ లైసెన్సు బిళ్ళేదిరా ?" పోలీసువాడు పళ్ళు పటపట కొరికాడు. గుడ్లురిమిచూశాడు. లాఠీతో నేలమీదకొట్టి బెదిరించాడు. పిల్లవాడిచొక్కా పట్టుకుని ఊపేడు. మెడపట్టుకొని గుంజాడు. మూగవాడిలా మునూ నిశ్చేష్టుడై నించున్నాడు. గుండె దడదడ లాడ జొచ్చింది. లాఠీనున్న యిత్తడికట్టు ఎండలో మెరుస్తుంటే దానినటూ, ఇటూ ఊపుతూ పోలీసు కీచుగొంతుకతో అరిచాడు. "సమాధానంచెప్పు. నేనడిగిందానికి సమాధానంచెప్పు. నెంబర్ వన్! నీ లైసెన్సు బిళ్ళేది ?"

"సర్కార్ !" మునూ సమాధానం చెప్పేందుకు ప్రయత్నించినా నోటమాట రావడంలేదు.

"సర్కార్ గిర్కార్ ! తీసిపెట్టివన్నీ ... నెంబర్ వన్ ప్రశ్న. నీ దగ్గర లైసెన్సుందా? లేదు...గాడిదకొడకా ! పందిముట్టెలా ముట్టేనువ్వా! రోజూ చూస్తున్నాను. నీ వేషం ! నెల్లాళ్ళబట్టి ఇదే నీ వ్యాపారం ! ఎవరి కళ్ళల్లో దుమ్ముకొట్టి తప్పించుకోగలవు కాని యీ 114 వ నెంబరు పోలీసాయన కళ్ళల్లో దుమ్ముకొట్టలేవు; తెలిసిందా ? ... నెల్లాళ్లై లైసెన్సూ గీసెన్సూ లేకుండా మూటలు మోస్తున్నావా లేదా?"

"లేదు హుజూర్! లేదులేదు! నేనెప్పుడూ రాలేదుసార్! నిన్నొక్క సారే !"

పోలీసు వెక్కిరింత గొంతుకతో "ఉ ! రాలేదు రాలేదు...నీ చేత నిజం పలికిస్తారా అబ్బీ ! నీతల్లో జేజిచేత చెప్పిస్తా ! నంటూ మునూ చేతిని దొరకపుచ్చుకున్నాడు. మెలికలుపెట్టాడు. "అమ్మో అమ్మో" అంటూ మునూ అరుస్తున్నాడు . పోలీసువాడు మెలికలు పెట్టడంమాని కోర్టువారి భాషలో నెల్లాళ్లై నువ్విక్కడ తిరుగుతున్నావని నేను అంటున్నాను నిజమా అబద్ధమా?"

"లేదు బాబూ ! లేదు"

"అయితే నేనే అబద్ధమాడుతున్నానన్నమాట !"

"ఎవర్నిచూసి నన్నునుకున్నారో తమరు! మా కూలాళ్ళందరూ నోలాగే వుంటారు కద !"

"మాయల మరాఠీ కొడక !" పోలీసాయన మళ్ళీ అతని చేతిని మెలికలు పెట్టడమారంభించాడు. మునూ కుయ్యో, మొర్రోమని గోలపెడుతున్నకొద్దీ హింసపెట్టడం ఎక్కువవుతున్నది. "వ్రాలెయిట్! నిన్నులాకప్పులో పడేస్తా!"

రెండు పిడిగుద్దులు వీపుమీద పడవేశాడు. డొక్కల్లో నాలుగు 'రుందా' పోట్లు పొడిచాడు.

"బాబోయ్ లేదు బాబోయ్".

ఒగురుస్తూ పోలీసు "లాకప్పులో పడేస్తా లాకప్పులో; పడేస్తా"నని బెదిరించాడు. లాకప్ పేరువింటేనే సింహస్వప్నం. ఇదివరకు దయాల్ లాకప్పులోపడ్డ అవస్థలన్నీ మునూకి జ్ఞాపకమొచ్చాయి. నెత్తిమీద ఒక్క లెంకిజెల్ల తగిలించి, "ఫో ఫో! మళ్ళీ కనిపించావా చూపిస్తా తడాఖా! ఇప్పుడు చూపించింది కేవలంమచ్చు ... ఫోరా ఫో! నెత్తిగోతల్లంజ కొడకా! ... నీ అమ్మ సిగ్గొయ్యా!"

పట్టు వదలగానే మునూ వొక్కటే దౌడు; మళ్ళీ వెనక్కి తిరిగి చూస్తే వొట్టు. యూనిఫారం దులుపుకుని ముడతలు సర్దుకుని బెల్టు సరిచేసుకుని బూటు కాలు నేలకేసిరక్కనకొట్టి పోలీసు జనంలోనికి నిష్క్రమించాడు.

పోలీసువాడి దెబ్బలు పైకి కనిపించకపోయినా వొళ్ళు హూనమైంది. మునూకి పౌరుషం, ఆత్మాభిమానం ముంచుకొచ్చాయి. పోలీసువాడు! ఎవడు వీడు? మునూ తనను తాను ప్రశ్నించుకుంటున్నాడు: "గాడిద కొడుకుని బుర్ర పగలకొట్టేవాళ్ళేక యేడుస్తున్నాడు! స్టేషన్నించి తరిమి కొట్టడానికి యీ వెధవెవడు? గవర్నమెంటు దిరేసు వేసుకున్నాడనా ఆ అధికారం; ఆ తలపాగరు! మా మామకీ వుంది దిరేసు. మా మావాఁ గవర్నమెంటు నౌకరే! అయితే...నన్ను కొడతాడూ వీడు! ఈసారి వీడిపని చెబుతా. చెబుతా. లాకప్‌లో పెడతాట్ట లాకప్‌లో! దయాలంటే వెర్రివాడు కనక ఎన్నికొట్టినా పడ్డాడు! నేను వెర్రిదయాల్‌నికాను కొడితే పడ్డానికి."

"పీక పిసికేస్తాను లండీ కొడుకుని" అనుకుంటూ కోపంతో పీకపిసుకుతున్నట్టు పిడికిలి బిగించాడు. పళ్ళు పటపట కొరికాడు. తనను తాను మరచి తన్మయీభావంలో మత్తు తూగుతున్నా ననే విషయం ఎదురుగుండా మరొక పోలీసు కనిపించేవరకూ తెలిసిందికాదు. వీధి చివరన పోలీసు కనిపించగానే చప్పబడిపోయాడు. అన్నగా సివిల్ లైన్స్‌లోకి బతుకు జీవుడా అని పరుగుచ్చుకున్నాడు. సివిల్ లైను కిరువంకలా యూరోపియను పద్ధతులలో షాపులు తీర్చి దిద్దివున్నాయి. పాశ్చాత్య నాగరికతతో తులతూగుతున్న యీ షాపుల ఠీవీ, హొయలూ కళ్ళు చెదరగొట్టేటట్టుంది. మామూలుగా బస్తీ యిరుకుసందులమయం. సందులలో యిల్లుమీద యిల్లు కుమ్మరి

ఆవాంవలె! యిక్కడలాగ కాదే! మంచిబంగాళా. ముందూ వెనకా పెద్ద విశాలమైన తోటా, ద్వారం, అంతా అందాలరాశి. గుండ్రని పోతపోసిన నునుపైన సిమెంటు స్తంభాలు. స్తంభాలకు చిన్న చిన్న లతలు; తెల్లని గోడలు. గోడలమీద కొంతభాగం పచ్చనిరంగు; పసుపురాసిన పేరంటాలు పచ్చని మెడ వొలెమధ్య వొక స్తంభం; వట్టి వేళ్ళ తడకలు: గేటు కెదురుగా చీడీ కిరువంకలా పూల చమనులు బంగాళాలు ఎంత దివ్యంగా వున్నాయి! కిటికీలో ఉల్లిపొర కాయితంలా గాజుతలుపులు. ఎక్కడా మరకన్నదిలేదు; మసిఅన్నది లేదు. అద్దంలా వుంది; వొక్కొక్క బంగాళా.

బంగాళా దాటగానే కొంచెందూరం నడిచివెడితే చాలు మందుల షాపు కనిపిస్తుంది. సీసాలు, గ్లాసులు, టిన్నులు బీరువాలు. ఇదీ విడ్డూరంగానే వుంది. మందులషాపు పక్కనే ఫోటో స్టూడియో. సూటువేసుకుని నెక్‌టై బిగించుకుని సిగరెట్టు కాలుస్తూ వొక పోజు; గౌనుతొడుక్కుని టిక్‌టాప్‌గా పేముకుర్చీలో కూచున్న దింకొక యువతి. టెన్నిస్ బేట్ పట్టుకుని అక్కడే బంతి ఆడుతున్నట్టు నటిస్తూ వొక యువకుడు. యువతీయువకులు సైకిళ్ళు. చిలిపికళ్ళనవ్వు. వారేవా!

ఇదొకవింతలోకం! యిందులో మసలడమే భయంకరం. స్టూడియో ముందు నిలువుటద్దం దారినపోయే వారిరాకపోకలను ప్రతిబింబిస్తున్నది. అద్దం ముందు వొకదొర, తెల్లని దొర, సఫేదువంటి దొర నీటుగా నిలబడి, నెక్‌టైసర్దుకుంటూ, మీసంకొరుక్కుంటూ, కనుబొమలు మీదకుఎత్తి మొహంవిప్పుకుని, మెడ నాలుగుసార్లుతిప్పి "యస్" అన్నాడు. యస్. నో. ఈరెండు మాటలు తను బీబీజీయింట డాక్టరుబాబు చెప్పగా నేర్చుకున్నాడు. తనూ వెళ్ళి ఫొటో పోతేపోయింది తీయించుకుంటే! మహారాజుకొడుకులా వుంటుంది. అయితే గుడ్డలు మురికి. చిరిగిన పేలికలు!

మునూ స్టూడియోదాటి రెండడుగులు వేశాడు. ఇద్దరు నల్లదొరలు సూట్లువేసుకుని వాడిని దూసుకుంటూ చేతులు, విసురుకుంటూ పోతున్నారు. తనను నిర్లక్ష్యంగా దాటివేసిన యిద్దర్నీ వెనక్కితిరిగి చూశాడు. సూట్లు కుట్టించుకుందుకు యెంతవుతుందోకద! సూట్లు ఎప్పుడు కుట్టించుకుంటాడో కద! పక్కనే మరివొకషాపు. షాపునిండాప్లేట్లు, సాసర్లు, కప్పులు, టీపాయ్‌లు; రకరకాల పింగాణిసామాను. కొట్టులోపల్లా, సూటువేసుకుని నెత్తిమీద పగిడీతో యిమిడికగా కూచున్నాడు.

ఇపుడు చిన్న మనసువచ్చింది. మళుపుతిరిగాడు. ఈ రోడ్డులో దుమ్ము అన్నది చూద్దామన్నా లేదు. ఎర్రబూడిద అసలే కనబడదు. అక్కడక్కడ వొంటిపిల్లి రాకాశిలా మేడలు, తోటలు, లతలు, నీళ్ళకుండీలు దారిపొడుగునా తెల్లని సున్నంవేసిన అందమైన వంకరలుగ తీర్చినరాళ్ళు. కాఫీపొడిరంగుతో చక్కని టాపుతో తళతలాడే అద్దాలతో కారులు, నీలిగా నల్లగా రంగురంగులగా - బఁయ్యమని వెడుతున్నవి. వస్తున్నవి. కుదుపులేదు. కూచుందుకు యించక్కా, దుమ్ముశేషపు; ధూళిరేగదు. చరచర బరబర గబగబ గమ్మత్తుగా! రంయ్యమని గాలి కన్న వేగంగా!

మెస్సర్స్ జంకిన్స్ జనరలుస్టోర్సు వచ్చింది. కేకులు, బిస్కట్లు రకరకాల తీపివస్తువులు. ఇవి తిందామన్నా డబ్బుకావాలికదా! ద్రాక్షపళ్లు; ఆపిల్, దానిమ్మ, మర్చత్తులు, దిల్ ఖుషీ!

దిల్ ఖుషీగా చూస్తున్న మునూను వొకగొంతుక హెచ్చరించింది. "హేయ్! నల్లమొద్దూ! ఎక్కడికిరా?" సన్ననిగొంతుక కీచుపెడుతోంది. నీరసంగా వుంది.

ఒకానొక దొరసానమ్మగారు కందిపోయినట్లు, కమిలిపోయినట్టు ఎర్రని నారింజపండువొంటి రంగుగల తల్లి, చల్లని తల్లి విసురుగా బయటుకు వచ్చింది. మురికి కంపు భరించలేనట్టు ముక్కు "హు హు హుఁ" మనిబూరా కొడుతూ "ఎక్కడికిరా?" అని హుంకరించింది. ఆతల్లి మాట్లాడుతున్న భాష హిందీఅని గ్రహించగలగాడు; కాని అర్థం మాత్రం తలకెక్కిందికాదు. వచ్చీరాని హిందీ; పైగాయాస. కీచుగొంతు. తను ఆ దారమ్మటరాకూడదని ఆవిడ అంటుయివుంటుందని మునూ గ్రహించాడు. దుష్టువాడిని చూసి అసహ్యించుకున్నట్లు భంగిమపెట్టడం పోపో అని చేతితో సౌజ్ఞ చేస్తూ కసిరికొట్టడం అర్థమయిందిగా!.

అయితే యిది తనకొక గొప్పఅవమానంగా మునూభావించలేదు. తెల్లతోక్క తెల్లతోక్కే. ఆసంగతి వాడికానాడే తెలిసిపోయింది. తెల్లదొరలు గొప్పవాళ్ళు. కనకనేఆనాడు బీబీజీ గారింటికి తెల్లదొరరాగానే దయారామ్ వంగివంగి సలాములు పెట్టాడు. బాబుగారుమాత్రం! అడుగులకు మడుగులొత్తలేదూ? ఎవరైనా అంతే! తెల్లదొరలకి జోహుకూం!

తెల్లదొరసాని కేకలకు అదిరింపులకు మునూ సిగ్గుపడలేదు. ...గా ఒక తెల్లదొరసాని తనతో మాట్లాడడం తనకు కితాబు కదూ!

దర్జాగా నడుచుకుంటూ తిన్నగా వెళ్ళిపోయాడు. దొరసాని కేకలకేమి! ఎవడికి లెక్క!

రైల్వేబ్రిడ్జి దాటి మళ్ళీ పట్నంలో పడ్డాడు. బ్రిడ్జవతలదారిలో బిచ్చగాళ్ళగుంపు. రోడ్డువార గుడ్డలు పరుచుకుని చెట్లనీడ కుష్టువాళ్ళు బండరాతి పగిదిగ కూచున్నారు. శరీరం పుళ్ళు. పుళ్ళేశరీరం. అర్ధణాకాసంత పుళ్ళు. బిచ్చగాళ్ళు వీధుల్లో గుడ్డివాళ్ళు దీనంగా బిచ్చమెత్తు కుంటున్నారు. 'కళ్లు లేని కబోదులం, అనాథులం, దిక్కులేని పక్షులం, దయగల బాబులు. కాణీ ధర్మం చేయిండి.' ఇవే మాటలు! ఇవే దీనాలాపాలు!

మునూ గుండె ద్రవించి పోయింది. కాళ్లు తడబడ్డాయి. భయంవేసింది.

కాని వెంటనే ధైర్యం వచ్చింది. అనాథులకంటే దిక్కూ, మొక్కూ లేని కళ్ళూ, కాళ్ళూలేని కబోదులకంటే తను నయం! కాళ్లు వున్నాయి. కళ్ళు వున్నాయి. ఒంట్లో శక్తివుంది. ఈ శక్తితో ప్రపంచంలో జీవించ గలననే ధైర్యం అతనిలో ప్రవేశించింది. "నాకు చదువు వచ్చును. అయిదో క్లాసువరకూ చదువు కున్నాను" అనే ఆత్మవిశ్వాసం, చైతన్యం అతనిలో జనించింది.

దూరంగా ఖైరాతీసత్రవు కెదురుగ వొక బండీ నిలబడింది. బండి చుట్టూ జనం, గుడగుడ వినవచ్చే కోలాహలం. మునూ బజారున వెడు తుంటే దృశ్యాలు, విచిత్రాలు అతణ్ణి విభ్రాంతుణ్ణి చేశాయి.

రైతులు వీపులమీద మూటలువేసుకుని రోడ్డు వారనించుని బస్సు కోసం ఎదురు చూస్తున్నారు, మొహాలు ఎండకి నల్లబడివున్నాయి. మోటు శరీరం. తలపాగాలు హోషుగ్గా చుట్టుకుని వెయిస్టుకోటు తొడుక్కుని చూస్తే భయంవేసేటంతటి దర్పంతో పఠానులు వీధుల్లో తిరుగుతూ, కత్తులూ, కఠార్లూ వనమూలికలూ అమ్ముకుంటున్నారు. మిఠాయి దుకాణాలలో వర సగా అందంగా కోలగా కాజాలు పేర్చి వున్నాయి. జిలేబీలు కోవాలు కర కజ్జం! వారేవా!

దొరలు సూట్లు వేసుకుని నడిచిపోతున్నారు. సాధువులు రోడ్డు వార హోమాగ్ని వేల్చి ధ్యాననిమగ్నులై వున్నారు. వంటినిండా బూడిద' బ్రహ్మచెముడు మట్టలమీద దిగంబరస్వామి నిద్ర. వీళ్లంతా బాగానేవున్నారు. తను ఎవరు? కూలీ! కాళ్ళకు చెప్పులైనా లేక జీవితయాత్ర సాగిస్తున్న కాళ్లు బొబ్బలెక్కుతున్న కూలీ!

మురికిబట్టలు, తలమీద చిన్న తలపాగా, పట్టెడు మెతుకులుకోసం పడరాని పాట్లు పడుతున్న కూలీ; అన్నం కావాలి. అన్నం! కావాలి పట్టెడన్నం! ... కావాలంటే డబ్బు;డబ్బు. డబ్బుఆర్జించాలి. ఆర్జించాలంటే కూలిదొరకాలి. రెక్కాడితేనే డొక్కాడుతుంది.

కూలిపని దొరకేదెలా? కూరల మార్కెట్టుకి మరి వెళ్ళ బుద్ధిపుట్టింది కాదు. కూలి దొరకడం పెద్దసమస్య. అసలు, తలదాచుకుందుకు చోటులేదు కదా! దయాలు యిల్లు యీ నెలాఖరుతో సరి. ఇంటివాడు వచ్చి తాళంవేసుకు పోతాడు. నెలాఖరులోగా పోనీ అక్కడే పడుకుందామంటే యింట్లో ఎవరూ లేరు. తులశి యింకా కమాన్నుంచి తిరిగి రాలేదు. పోనీ తిరిగొస్తాడనుకుందాం. అప్పుడుమాత్రం తలదాచుకుందుకు చోటులేదే! ఇల్లు ఖాళీచేయాలికదా! తులశికి భయంలేదు. ఓయ్యాంమార్కెటులో బస్తాలు మోసుకుని నాలుగు డబ్బులు సంపాదించుకో గలుగుతున్నాడు. వాడి రెక్కలకష్టం వాడిదే. మరి తను!

మునూ 'నేనంతలేసి బరువులు మోయలేను...మరి ఏమిటి చేస్తావు?...'

'వెళ్ళిపో' ఆత్మ సమాధానమిచ్చింది.

'ఎక్కడి' కని మునూ ప్రశ్న.

'శ్యాంనగరం'.

'మళ్ళీ యింటికా?'.

'ఏం! వెడితేనేం?'.

దయారామ్. శ్యాంనగరం! ఇంతవరకూ మామ కి తను ఉత్తరంముక్కయినా రాసి పడేయలేదు. తనకు సంబధంచినంతవరకూ దయారామ్ చచ్చిపోయినట్టే. దయారామ్‌కు సంబంధించినంతవరకూ తను చనిపోయినట్టే. ఇద్దరికీ 'టంగు' తెగిపోయింది. సంబంధ మేమిటి!.

తల వంచుకున్నాడు. నడకతోపాటుఆలోచనలు. ప్రశ్న, సమాధానం; మళ్ళీ ప్రశ్న సమాధానం - బజారులో నడుస్తున్నాననే చైతన్యంకూడా పోయింది. తన ఆలోచనలలో తాను మునిగిపోయాడు. లోతు నీళ్ళవంటి ఆలోచన. పాపం; యీతరాని మునూ! సుడిగుండంవంటి ఆలోచనా ప్రవాహంలో చిక్కుకుని మునిగిపోతూ గుటకలువేస్తున్నాడు.

జంక్షనుదగ్గరకు వచ్చాడు. ఉహూఁ! జంక్షనే అతనిదగ్గరకు వచ్చింది. నాలుగుగోడ్ల జంక్షన్. ఎటు పోవాలో తెలియని జంక్షను. కారు బయ్‌మంది.

ఒక్క గెంతు గెంతి తప్పుకున్నాడు. మళ్ళీ మామూలులోకంకేసి కళ్ళు విప్పి చూశాడు.

ధమ్ ధమ్ ధమ్! ధమ్ ధమ్ ధమ్! ధమ్ ధమ్ ధమ్! బాజా తాషా మార్ఫా డ్రం! అన్నీ కలవరపెడుతూ వింత వింతధ్వనులు.

తల యెత్తి చూశాడు. నగరం ఎప్పుడూ కోలాహలమే. బండిలో ధమ్ ధమ్ మనే డ్రం మోత పోస్టర్లు పేపర్లు సర్కసు బఫూన్ బండి ముందు నడుస్తున్నాడు. కుర్రవాళ్ళు చుట్టూ మూగుతున్నారు. గోడలమీద తడకలమీద అంటించిన పెద్ద పెద్ద పోస్టర్లు కనిపించాయి. పోస్టర్ల తడకలను కట్టుకుని బండిముందు యిద్దరు మనుషులు నించున్నారు. జంక్షనువద్ద బండి ఆగింది. బండిచుట్టూ జనం చేరారు.

ఒక స్త్రీ, సూటువేసుకుంది గుండెచుట్టూ కోటుమీద ఎన్నో మెడల్సు; ఛాతీఎంతో పెద్దది. చేతిలో పెద్దకొరడా పట్టుకుంది. చుట్టూ ఏనుగులు సింహాలు, పులులు. ఇది వొక బొమ్మ!.

పోస్టరులో మరొక బొమ్మ కనిపించింది. ఇది మరీ భయంకరం. ఏనుగు, పెద్ద ఏనుగు! ఫ్యాక్టరీ అంత ఏనుగు. ఏనుగు కింద మనిషి. మనిషి కాదు. ఇందాకటి బొమ్మలో కనిపించిన స్త్రీలే! ఓయిబాబో!

ఇది స్త్రీ కాదురా దేవుడా! బ్రహ్మ రాక్షసి.

"మిస్ తారాబాయ్! మిస్ తారాబాయ్! మిస్ తారాబాయ్! అద్భుతమైన ఫీట్లు. భయంకరమైన పులులు, సింహాలు, ఏనుగులు. ప్రపంచంలో సాటిలేని మేటి సర్కస్ నేటికి మీ ఊరు వచ్చింది. ప్రపంచంలో ఎక్కడా కనీవినీ ఎరుగని అమోఘ ఆశ్చర్యకర సాహస కృత్యాలు! దేశదేశాలలో రాజుల, రాణుల, చక్రవర్తుల మన్ననల పొందిన సర్కస్! తారాబాయ్ సర్కస్!.

పెద్దపెద్ద దొరలు మెచ్చి మెడల్సు యిచ్చి వున్నారు! ప్రపంచములో దీనికి సాటిలేదని చెప్పివున్నారు. పులీ, సింహమూ వొకపళ్ళెంలో నీరు త్రాగుట. మేక, పులి కెదురుగ నిలబడుట! లొటిపిటలు, గుర్రములు, మొసళ్లు వింతవింత వన్యమృగములు కొన్ని వందలు కలవు. రండు, రండు!"

బండిముందు నించుని సర్కస్సాయన అరుస్తున్నాడు: "ఆలసించిన ఆశాభంగము. నేటితో ఆఖరుఆట. రేపు బొంబాయి పోవును. అక్కడనుండి

సర్కస్ లండన్ పయనమగును! దౌలత్పూర్ కిదే తొలిసారి. ఆఖరుసారి! మిస్ తారాబాయ్! మిస్ తారాబాయ్! ప్రపంచమున సాటిలేని స్త్రీ. పెద్ద పెద్ద పహిల్వాన్లు కలరు."

ప్రకటన అయిపోయింది. బండీ కదిలింది. మళ్ళీ ధమ్ ధమ్ ధమ్ ధమ్ ధమ్ ధమ్ ధమ్ ధమ్ ధమ్!

బఫూను పేపర్లు పంచి పెడుతున్నాడు. చుట్టూ జనం మూగి అతని చేతు ల్లోని పేపర్లు గబగబ లాక్కుంటున్నారు. వొత్తిడికి తట్టుకోలేక పేపర్లను చేతులతో పైకెత్తి నించున్నాడు. జనం, చేతులు కిందకు లాగుతున్నారు. బఫూను పేపర్లను రోడ్డుమీదికి విసిరివేసాడు. పిట్టల్లా కాగితాలు నలు మూలలా గాలిలో ఎగురుతున్నాయి. నేలమీద వాలుతున్నాయి. ధమ్ ధమ్ ధమ్!

గబగబ మునూ పరుగెత్తి ఒక పేపరు తీసుకొన్నాడు.

మా మంచి సర్కస్. పులులు, ఏనుగులు. సింహాలు. 'చూసితీరాలి' అనుకున్నాడు మునూ. మనసు ఉవ్విళ్ళూరిపోతున్నది. 'చూచి ఊరుకుం టానూ? నేనూ వెడతాను, బొంబాయి.'

తల వొక్కసారిగ రేసి చరచరా వెడుతున్నాడు. ఏభై గజాల దూరంలో హాలు పెద్దదే ఎదురుగా కనిపించింది. ఇటికగోడల హాలు. అక్కడి కరఫర్లాంగు దూరంలో మదన్లాల్ సినీమాహాలు. అక్కడి కొక ఫర్లాంగు దూరంలో అదిగ్గో అక్కడే అప్పుడే సర్కస్ టెంటు వచ్చేసిందే! "ఊఁ! సర్కస్ చూద్దాం...బొంబాయివెడితే అంతా రఝుగా వుంటుంది!"

'బొంబాయి బొంబాయి బొంబాయి' ఇదేమాట. ఇదే వేదమంత్రం. పదే పదే అతని చెవులలో గింగురులు తీస్తోంది.

అవును; బొంబాయిలో పెద్ద పెద్ద ఫ్యాక్టరీలున్నాయి. ఇక్క డేముంది. మన్నామశానం! అక్కడయితే యిట్టే పని దొరుకుతుంది. నెలకీ డెభ్భైఎనభైరూపాయలు సంపాదించుకోవచ్చును. పని యిట్టే దొరుకుతుందిట!

'నువ్వెళితే మంచిదే. మా అన్న నెలకీ ఎనభై రూపాయలు సంపా దిస్తున్నాడు' అన్నాడు కూరల మార్కెట్టులో తన కూలీ నేస్తం 'బొంబాయిలో అడుగుపెట్టావా, నీ కిక తిరుగులేదబ్బాయ్! చేయగలగాలి కానీ, చేతనిండా పనే!'

బొంబాయి మంచిరేవుపట్నం ఓడలు విదేశాలనుంచి వస్తూ పోతూ వుంటాయి. 'రేవుదగ్గర కాసుక్కూచో. అప్పుడు చూడు పనిదొరక్కపోతే నాచెవికదపాయిస్తా'నని పందెం చరిచాడు తన నేస్తం!

'వెడతాను బొంబాయి వెడతా' ననుకుంటూ మునూ గబగబ సర్కస్ వుండే మైదానంవైపు నడక పుచ్చుకున్నాడు. అదిగో అదే సర్కస్. తారా బాయ్ సర్కస్!

ప్రాణం కుదుటబడింది. చేతిలోని పేపరుమడత మెల్లగా విప్పిచదివాడు. రేట్లు జాగ్రత్తగా గమనించాడు. కారుచౌక టిక్కట్టు ఆఖరుటిక్కట్టుఎంత? ఎంతా, ఎనిమిదణాలా! అమ్మో ఎనిమిదణాలు!

ప్రభుదయాలు వెడుతూవెడుతూ అతని చేతిలో రూపాయికాసుంచి 'జాగర్తగా ఖర్చుచేసుకో' అన్నాడు. ఇంతవరకూ మునూ రూపాయి మార్చ లేదు. ఆకలివేసినా నాప్రాణం అవురావురుమంటున్నా ఆ రూపాయి అలాగే వుంది. మారిస్తే మనది కాదనుకుని పదిలంగా పంచెను మూటకట్టాడు. ఆకలి వేస్తేనే మార్చనపుడు సర్కసు కెందుకు మార్చాలి! 'ఉహుం మార్చను గాక మార్చన' ని నిశ్చయించుకున్నాడు మునూ.

అయితే సర్కస్ చూసేది ఎలాగ? గుండె ధైర్యంవుంటే సరి, యిలచక్కా చూడొచ్చును! ఆలోచిస్తే ఉపాయాలే దొరకక పోతాయా? శతకోటి దరిద్రాలకు అనంతకోటి ఉపాయాలు!

ఎర్రని; ఉహుం, గోధుమవర్ణపు గుర్రం. ఇంకొకఆడగుర్రం. నీటిగుర్రం. చారలగుర్రం. వరసవరసగా సర్కసుడేరాలో పచ్చగడ్డిమేస్తున్నాయి. గుర్రా లకు ఎదురుగ ఒక పొట్టిబుడంకాయ మీసాలు దువ్వుకుంటూ నిలబడ్డాడు.

డేరా కన్నం వొత్తిగించి నేలమీద కూచుని గుర్రాలను పరికిస్తున్నాడు మునూ. సర్కసు గేటుముందు కోలాహలం వినిపించింది. తుర్రున పరుగెత్తె కెళ్ళాడు. సర్కసు డేరాలోంచి ఏనుగొకటి మెల్లగా వస్తోంది. ఏనుగు చుట్టూ కుర్రవాళ్ళు చేరారు. ఏనుగు వెంటపడ్డారు. ఏనుగు కుంభస్థలం అవతల మావటివాడు అంకుశం పట్టుకుని కూచున్నాడు. అబ్బ! ఏనుగు చెవులు చేటలంతేసి!

ఏనుగు, తొండం కదుపుకుంటూ, ఊపుకుంటూ ఒక్కొక్క అడుగే వేస్తోంది. పర్వతంలాంటి ఏనుగు. పిల్లకాయలు గోలచేసుకుంటూ, సంతో

షంతో గెంతుతూ, నవ్వుకుంటూ ఏనుగు వెనక బయల్దేరారు. ఒక కుర్రవాడు పక్కనున్న తన స్నేహితుణ్ణి మోచేత్తో పొడిచి "ఒరేయ్! నీకు తెలుసా అదేం చేస్తుందో?"

"తెలుసురా; నీకే మహా అన్నీ తెలుసున్నట్టు."

"డ్యాన్సు చేస్తుందిరా! నిచ్చెనెక్కుతుందీ నిచ్చెన!"

"బూరాకూడా ఊదుతుంది!"

"అహాఁ! అమ్మ, లంజముండా!"

మునూ కుర్రవాళ్ళ గుంపులో కలిసిపోయి తానూ వాళ్ళల్లో వొకడై పోయాడు. మునూ తలపాగా గోపురంలా వుంది. ఠీవిగా నిలబడి ఏనుగును చిత్తగిస్తున్నాడు; వెనకనించున్న కుర్రకుంక గడుగ్గాయికి సరదా అనిపించిందికాబోలును గబుక్కున మునూ తలపాగా గద్దతన్నుకుపోయినట్టు తన్నుకుపోయి ఏనుగు తొండంమీద పడేటట్టు విసిరేశాడు. ఏనుగు తొండం ఎత్తి కృతజ్ఞతాపూర్వకంగా అభివాదంచేసి లటుక్కున మునూ తలపాగాను లుంగచుట్టి రావిరొట్టలా అరిగించేసుకుంది.

మునూ వెనక్కి తిరిగి ఆ పిల్లవాడి నెత్తిమీద టోపీ తీసేసి ఏనుగు మీదికి విసిరేశాడు. దెబ్బకు దెబ్బ! చూడు మునూ...తడాఖా! టోపీ పోయిన కుర్రాడు మునూ పీక దొరకపుచ్చుకున్నాడు. పట్టు తప్పించుకుని కుర్రాణ్ణి పట్టుకుని మునూ మెల్లగా సైడుకాలువలోకి తోసివేశాడు. కుర్రాడి వొళ్ళంతా ముకికి మురికయింది. తోటి పిల్లలంతా గొల్లున నవ్వుతున్నారు. బిగ్గరగా అరిచారు. చప్పట్లు కొడుతున్నారు. ఏనుగు కొద్దిగా బెదిరింగి. మావటివాడు అంకుశంతో వొక్కపోటు పొడిచాడు. కింద కురిశాడు. మునూ చెవిపట్టుకుని నులిపాడు.

"వాడే ముందు నా తలపాగా తీసేశాడు!" మునూ చెబుతున్న సంజాయిషీ వినిపించుకోకుండా మావటి అతని చెవిపట్టుకుని ఏనుగుదగ్గరకు తీసుకు వెళ్ళాడు. ఏనుగు తొండం ఊపుతోంది. మునూ గుండెలు గుండెల్లో లేవు. కుర్రవాళ్ళంతా గప్‌చిప్!

ఏనుగు తొండం ఊపుతున్నకొద్దీ, మావటివాడు తనను ఏనుగుదగ్గిరకి తీసుకువెడుతున్నకొద్దీ, మునూ భయం విపరీతం కాజొచ్చింది. ఈ భూమ్మీద యిక తనకు నూకగింజలు లేవనుకున్నాడు. ఏనుగుదగ్గరకు తీసుకువెళ్ళి

మునూను మావటి నిలబెట్టాడు. ఏనుగు దీవిస్తున్నట్లు మునూ తనమీద తొండం విప్పి వెళ్ళిపోయింది.

సంతోషంతో మునూ "నాకేంభయంలేద"న్నాడు. మావటి చిరునవ్వు నవ్వి "ఒహో ! అలాగా !"

"అవును: నాకేంభయం ?"

"ఆల్రైట్ ! అదిగోచూడు ! ఆగడ్డిమోపబ్బిని యిలా పిలూ!"అన్నాడు మావటి.

మావటివాడి ఆర్డరు మహారాజు ఆర్డరు. గడ్డిమోపువాడితో తనూ వుత్తినే టిక్కెట్టులేకుండా సర్కస్‌లోకి పోవచ్చును. అదీకాక సర్కసువాడి స్నేహం వూరికె నేపోదు !.

గబగబా పరుగెత్తి కెళ్ళి మునూ గడ్డిమోపువాణ్ణి యిట్టేలాక్కొచ్చాడు. మావటివాడు సర్కసుగుడారం వెనకవైపుకు వెడుతున్నాడు. చేతులు ముడుచుకుని జాలిచూపమన్నట్లు మొహంపెట్టి మెల్లగా "నాకు సర్కస్ చూపించరండీ !" అని బతిమలాడుతున్నాడు.

"పా పా ; పోరా! బోషిడీకే!".

"అమ్మ మ్మ మ్మ ! అలా అంటే ఎలాగసార్ !".

"టిక్కెట్టో ?".

"ఈవొక్కసారే సార్ ! మరడిగితే వొట్టూ !"

"వొట్టు తీసి గట్టుమీదపెట్టు ! పదపద."

మునూ మావటివెంటపడి "అలాకాదుసార్ ! ఈ వొక్కసారే కదండీ !"

"ఒరేయ్ అబ్బీ ! నా ప్రాణం కొరుక్కుతినక అదిగో ఆమూల కన్నం వుంది అందులోంచి చూడు !"

"డేరా అడ్డుసార్ ?"

"అదిగో కన్నంవుందికదూ ! అక్కణ్ణించి చూశాయ్ సర్కస్‌ని !"

మావటివాడు గడ్డిమోపులతన్ని వెంటబెట్టుకుని వెళ్ళిపోయాడు. మావటివాడు తనను గొప్పబురిడీయే తినిపించాడు. దొంగతత్తుకొడుకాని ! అప్పనంగా పనిచేయించుకునీ, తనదారిన తాను పోతాడూ ?

డేరాకు కన్నం ఏమూలవుందో కనిపించడంలేదు. కనక ఏదోమూలకు వెళ్ళి డేరాను కాస్త పైకెత్తి సర్కసు చూడడమే దీనికి మందు.

మావటివాడు వెనక్కి తిరిగి కేక వేశాడు: "ఆ పనిమాత్రం చేయకు. ఒత్తిగించిచూశావా మొత్తం డేరాయే కూలుతుంది." మావటివాడు యిలా రమ్మని ఆజ్ఞచేశాడు.

డేరాకు వోకమూల కూచోబెట్టి "యిదిగో యీ కంతలోంచి లోపలికి చూడు. సర్కస్ ఫస్టుగా కనిపిస్తుంద"న్నాడు. ఓ! ఫస్టాసుగా కనిపిస్తుంది సర్కస్! "అలాగే సార్".

విశాలమైన స్థలాన్ని సున్నాలాగా చుట్టి చుట్టూ కుర్చీలను వేశారు. మెట్టుమీద మెట్టు నిచ్చెనమెట్లు గ్యాలరీ: జనం నిండిపోయారు. సర్కస్ ఆరంభమవుతోంది. పక్కనే బ్యాండువాళ్ళు పాశ్చాత్య సంగీతాన్ని విని పిస్తున్నారు. నక్షత్రాకారంగా కొంతమంది స్త్రీలు సర్కసు రింగులోనికి గబగబ వచ్చారు. సంగీతం వినిపిస్తోంది. నృత్యం ప్రారంభమయింది. నృత్య మయిపోయినతరువాత ప్రేక్షకులు హర్షధ్వానాలు చేశారు.

ప్రేక్షకుల చప్పట్లు ఆగిపోయాయి. సంగీతం మెల్లగా వినిపిస్తోంది. మళ్ళీ ప్రేక్షకులు సముద్రఘోషలాగ చప్పట్లు చరిచారు. సంతోషాతి శయంతో మిన్నుముట్టేటట్టు కేకలు వేస్తున్నారు. దబ దబ దబ, కుండపోత లాగ వాన కురుస్తున్నట్టు మళ్ళీ హర్షధ్వనులు. మునూ హృదయం హాయ్ హాయ్ అంది. తేరిపార చూశాడు. బ్యాండు ధన్ ధన్ ధన్ మని మోగు తోంది. మిస్, తారాబాయి యిందాక తన తలపాగా మింగేసిన ఏనుగంత మనిషి, దర్జాగా నడుచుకుంటూ సర్కస్ రింగ్ లోకి వచ్చింది. ప్రేక్షకుల చప్పట్లు ఆగిపోయాయి. అంతా నిశ్శబ్దం!

డేరా కన్నంలోంచి చూస్తున్నాడే కాని మిస్, తారాబాయి మోము స్పష్టంగా కనిపించడంలేదు. ఆమె ముక్కు ఎలాగ వుంటుందీ, నుదురు ఏ తీరున వుందీ బుగ్గలు ఎంత వలంగా వున్నవీ పరిశీలనకు కనిపించడంలేదు.

మిస్ తారాబాయ్ ఏనుగుపిల్లలా గునగున లాడుతూ వచ్చి ప్రేక్షకు లకు నమస్కరించింది. మెరుపుతీగలాగ తళతళ మెరసిపోతున్నది. నేలమీద పెద్దబండరాయి ఛాతీమీద వేసుకుని నిశ్చింతగా వెల్లకిల పడుకుంది. రెండు సుత్తులు పట్టుకుని యిద్దరు మనుష్యులు బండరాయిని పగులకొడుతున్నారు. అబ్బ! కూలీలు పెద్దపెద్ద కొండలను చిన్న చిన్న కంకరరాళ్ళగ బద్దలు కొడు తున్నట్టు! అమ్మ! ఏమి టా స్త్రీ సాహసం!

రాయి, ముక్కముక్కలయింది. తారాబాయి అవలీలగ్గ గబుక్కునలేచి నిలబడింది. వంగి నమస్కరించింది. ప్రేక్షకులు వర్షంలా కరతాళ ధ్వనులు!.

మునూ మోళీకట్టిన పాములాగ నేలమీద పడుకుని సర్కసు చూస్తున్నాడు. తారాబాయ్ ఫీట్లు అద్భుతం! అత్యద్భుతం!

గుడ్లు వప్పగించి తదేకదృష్టితో పరిశీలిస్తున్నాడు.

సర్కస్‌రింగులోకి గుర్రంవొకటి ఛంగ్ ఛంగ్ న దుముకుతూ రాగా దానివెంట వొకతను యింగ్లీషువాడిలా ట్రౌజరువేసుకుని పరుగెత్తుకొచ్చాడు. మరి అదేం విద్యో వాడితల్లికడుపు బంగారంకానూ, పరుగెడుతున్న గుర్రం మూపుమీదనుంచి కిందకీమీదకీ రింగటాలు కొడుతున్నాడు. పరుగెడుతున్న గుర్రంమీద కాస్సేపు నిలబడ్డాడు. మరికాస్సేపటిలో తలకిందకీ, కాళ్ళు మీదకీపెట్టి స్వారీచేశాడు. అంతట్లోనే దానికడుపుమీంచి వీపుమీదకీ, మూపు మీంచి కడుపుకిందకీ గబగబ చకచక తూనీగలా ఎగురుతూన్నాడు. మనిషి రబ్బరుబొమ్మలా వున్నాడే! నేలమీద కొక్కగెంతు గెంతి నిలబడి మళ్ళీ పరుగెడుతున్న గుర్రంమీదకి దూకాడు! హారి వీడిముండామొయ్యని ఫీటు?

మునూ మెదడు సుడిగుండాలు తిరిగింది. గుర్రంలాగే అదీ పరుగెత్తింది!

"నాకూ చేయాల్నుంది ఫీటు?" తనలో తానే అనుకుని ఆశ్చర్యంగా చూస్తున్నాడు. "కాని కష్టం! సార్వీసుండాలి!" సమాధానం చెప్పుకున్నాడు. సంతృప్తి కుదరలేదు.

బొంబాయిమాట మళ్ళీ జ్ఞాపకమొచ్చింది. 'వెడదాం దీని కింత ఆలోచనెందుకు'.

సర్కసుడేరాలో మళ్ళీ చప్పట్లు వినిపించాయి. ఇద్దరు బఫూనులు రింగులోకి ప్రవేశించారు. తలమీద టోపీలు మూకుళ్ళవలె బోర్లించి వున్నాయి. తెల్లగా ఎర్రగా, పచ్చగా, నీలిగా రంగురంగులవదులు పరాయిలు గౌన్లు తొడుక్కున్నారు. మొహమేమిటీ అలావుంది! నల్లరంగు ఎరుపురంగు పులుముకున్నారే! ఆకతాయి ముండాకొడుకులు! అంతా నవ్వే! పొడుగ్గా ముక్కుల కేమిటో తగిలించుకున్నారు. ఎర్రటి బంతిని ముక్కుమీద నృత్యం చేయిస్తున్నారు. కోతులవలె నృత్యం చేస్తున్నారు. మునూకి తన కోతినృత్యం జ్ఞాపకంవచ్చింది....యించక్కటి డ్యాన్సు!

బఫూను వెళ్ళిపోగానే గాండ్రు గాండ్రు మనే బొబ్బరింతలు వినిపించాయి. బోనులు నడిచేసి వెళ్ళిపోవస్తున్నాయి.

బోనుల్లో సింహాలు! హాత్తేరీ!

పీక్లు గుండాన పడ్డాయి. సర్కసు, రసకందాయంలోపడింది. అమ్మయ్య! మునూ జాగ్రత్తగా కళ్ళు వప్పగించి 'వయినంగా చూడాలి' అనుకుని బాగా కిందకు వంగున్నాడు.

కాని...పాపం...మావటివాడు వాడి పక్కగా పోతూ ఆగేడు: "ఊఁ ఇంక లే! లేచి నా వెంటరా!"

"అమ్మమ్మమ్మ...సింహాలు సార్! ఈ వొక్క ఫీటే!"

"నో, నో, నో! చూసింది చాలు...ఈ నీళ్ళు కాస్తంత లోపలకి పట్రా! ఇదిగో బాల్చీ!"

"తర్వాత చేసిపెడతా సార్?"

మావటివానివెంట మునూ వెళ్ళకతప్పిందికాదు. బాల్చీతో నీళ్ళుపట్టుకుని మావటివాడూ అతనివెంట మరొక బాల్చీనీళ్ళతో మునూ.

"ఎందుకుసార్ యీ నీళ్ళు?

"ఏనుక్కి!"

"అమ్మబాబో! చాలానీళ్లు తాగేస్తుంది సార్! అంతసేపే!"

"ఆఁ! తాగేస్తుంది!"

"మరీ లాగా సర్కస్సయిపోదూ?"

"అయిపోదులే; ఏనుగుల్ని కడుగుదాం!"

"అంతేకదా!"

మావటివాడు ఏనుగుచెంత నించున్నాడు. మునూ బాల్చీలతో అక్కడే వున్న కుళాయికింద నీరుపట్టి, మోస్తున్నాడు. ఏనుగు రొట్టె తింటూంది. మావటివాడు దాని తోకా కాళ్ళూ కడుగుతున్నాడు.

బాల్చీలతో నీరును మీద గుమ్మరిస్తున్నకొద్దీ ఏనుగు యింకా పొయ్యమన్నట్టు తొండం ఎత్తి యిటూ అటూ, ఊపుతోందే! మావటివాడు 'చాల్లే' అనడుకద!

'ఇంతకీ నన్ను చూడగానే ప్రతివాడికీ పని చెప్పబుద్ధేస్తుందేమిటి చెప్మా! నేను కూలివాణ్ణని యిట్టే తెలిసిపోతానుకామోసు?'

మునూ బాల్చీ పంపుకిందపెట్టి ఆలోచిస్తున్నాడు. బొంబాయి అనే మాట మళ్ళీ చెవుల్లో గింగురుమంది. 'వెడతాను అబ్బురమా 'ఏమిటి, యింతోటిదీని !'

బొంబాయి చాలాదూరం. వెళ్ళాలనేవుంది. ఎవరుతీసుకెడతారు ?

'అడుగుతాను. మావటివాణ్ణి మెల్లిగా బుట్టలోవేస్తాను'

బాల్చీతో నీళ్ళు మోస్తున్నకొద్దీ యింకా తెమ్మంటున్నాడు మావటివాడు. ఎముకలు సున్నమవుతున్నాయి. గూళ్ళు కదిలిపోతున్నాయి. పేగులు తెగిపోతున్నాయి.

చెమట తుడుచుకుంటూ మెల్లిగా బాల్చీదింపి మావటివాణ్ణి "అన్నా!" అని 'కత్తు' కలిపేశాడు.

"ఏం తమ్ముడూ ? ఏమిటి కథ?"

"నే నొకటడుగుతా , దెబ్బలాడరుకద ?"

"నో, నో, నో బ్రదర్ !"

"మరి నాకు మీవెంట వచ్చేయాలన్నుంది !".

"ఎక్కడికి ? బొంబాయా ! ".

"వూ ... అక్కడికే!".

"మరి నీకు తిండి ?".

"మీ దాన్లో చిన్న ఉద్యోగం వేయించండి !".

"ఉద్యోగం దొరకదు కానీ, తమ్ముడూ ! ట్రెయిన్లో వచ్చేయ్ మా వెంట ! ఎవరికీ తెలీకుండా ఓమూల పెట్లో దాక్కో".

"ఏనుగుల్ని తరిఫీదు ...".

"కష్టం ... అబ్బో ! ఎంతోకష్టం !".

మావటివాడు తను వొకొక్క ఏనుగును లొంగదీసుకుందుకు ఎంత కష్టించిందీ, ఎన్నిశ్రమదమాదులకు ప్రమాదాలకులోనయిందీ చెప్పుకొస్తున్నాడు. ఏనుగుల్లో కొన్ని వెర్రి ఏనుగులున్నాయట ! వాటిని అదుపులో పెట్టుకోడం మరీ కష్టమట ! ప్రాణానిక్కూడా తెగించాలిట ! .

"మరి నన్ను మీరైల్లో దాక్కోనిస్తారూ?"

"ఓరి వెర్రికుట్టే! నీలాగా నేను? చిన్నప్పుడు యింట్లో చెప్పకుండా గుడ్సుబళ్ళు ఎక్కేసి దేశాలన్నీ చుట్టబెట్టేశాను!"

మునూ మావటివాడు చేసిన వాగ్దానం మళ్ళీ వొకసారి జ్ఞాపకం చేశాడు. "నిజంగా నన్ను మీ వెంట తీసుకెడతారు కదూ!"

"నిజం రా బ్రమ్మదేముడా! నమ్ము నా మాట! రేపు టెంటు పీకేస్తాం. సామాను బళ్ళ కెత్తించేస్తాం. నాతో వుంటే నీకు కూలీ దొరుకుతుంది. డబ్బులూ దొరుకుతాయి! రాత్రి ఎలాగో ఓలాగ మా స్పెషల్ ట్రెయిన్లో నిన్నోమూల దూర్చేస్తాను. రింగ్ రంగాని కూచో" మునూ నెత్తు రుబికింది:

"అలాగే! రైల్లో...మీతో ... సర్కస్‌తో ... హాయ్ హాయ్"

"ఉ...స్స...ఊరుకో! ఎవరైనా వింటే కొంపలంటుకుంటాయ్!" మునూ గప్ చిప్!

"ఇదిగో నీ పేరు?"

"మునూ" !"

"హేయ్ మునూ! ఆమూల గడ్డిలాపట్రా! ఏనుక్కి వేద్దాం...మన జంబూగాడికి !"

"ఓయస్స సార్! ఓయస్స !"

## ౪

చెవులు చిల్లులుపడేటట్టు కూతకూసి స్పెషల్ సర్కస్ ట్రెయిన్ ఝుష్ఝుష్‌మని బయలుదేరింది.

పైన టాపులేని పెట్టెలో సర్కసు టెంటుమీద ముడుచుకుని ముడుచుకుని పడుకున్నాడు. టెంటు చుట్టబెట్టివుంది. మునూ మనసుకూడా చుట్టుకుపోతోంది. మనసు మనసులోలేదు. గాభరాగా డోకువస్తున్నట్టు కడుపులో తిప్పుతోంది. వాంతి వస్తుందనుకున్నాడు. వస్తే బాగానేవుండును. రాలేదు.

చిమ్మచీకటి; రైలువెళ్ళిపోతున్నది. ఆకాశంలో నక్షత్రాలు రైలుతో పాటు పరుగులు పెడుతున్నాయి. తను యిన్నాళ్ళూ మసలి యిప్పుడు దౌలత్‌పూర్, వదిలివెళ్ళడం మనసుకిష్టంలేదు. దిగులుగావుంది . ఏమిటో పోయినట్లనిపించింది. భయంవేసింది.

శ్యాం నగరం విడిచిపెట్టి వచ్చినరాత్రి జ్ఞాపకం వచ్చింది. ఆవేళ లాగే ఇవాళకూడా. అయితే భేదం లేకపోలేదు. ఆనాడు శరీరం ఊరికే చెమటలు కక్కింది. ఏదో నేరం చేసినట్లనిపించింది. ఇవ్వాళ అలాగ కాదు.

సర్కస్‌వాళ్ళు పొద్దుట్నుంచీ గుడారం పీకుతూనే వున్నారు. ఏను గుల్ని సింహాల్ని రైలు కెక్కించారు. పెద్ద పెద్ద స్తంభాల్ని తీయించేసి రింగు ల్నూడతీసి గుడారాన్ని చుట్టబెట్టుకున్నారు. సామానంతట్నీ బళ్ళ కెక్కించాడు. స్తంభాల కెగబాకి తాళ్ళు ఊడదీశాడు. రింగులు ఊడ బెరికాడు. గెడలు లాగేశాడు. అంత ఎత్తుకెక్కి స్తంభాలతాళ్ళు తీసేస్తుంటే తనకి ఏమనిపించిందీ!

తనకీ సర్కస్ చేస్తున్నట్టే అనిపించింది. సామాను రైల్లో పారేశాక ట్రక్కులో చతికిలబడ్డాడు. పూర్వం శ్యాంనగరంనుంచి యిలాగే రాత్రి రైల్లో ప్రయాణం చేశాడు. అప్పుడు తాను వొంటరిగాడు. ఇప్పుడు మావటివాడు తనకు తోడునీడ. మావటివాడు నాలుగ్గు కూచునే పెట్టెలో పడుకున్నాడు.

దిగులు లేదని ఎంత అనుకుంటున్నా కాస్త దిగులులేక పోలేదు. ఆవేళకు మల్లే ఇవాళకూడా రైలు రాక్షసికిమల్లే కూస్తోంది. కూత చెవినిపడేసరికి భయం! చిమ్మ చీకటి. గాలిహోరు. నక్షత్రాల పయనం. రైలు దబదబ !.

ఇపుడు మునూ వెడుతున్న దింకొక ప్రపంచంలోకి. ఇది యిదివరకటి లోకం కాదు. పూర్తిగా భిన్నమైనట్టిది. దాని పోక డేమో అతనికి తెలియదు. కాని దౌలత్‌పూర్ వంటిదిమాత్రం కాబోదని అతనికి తెలుసును.

శ్యాంనగరం, దౌలత్‌పూర్ రెండూ రెండు రాక్షసులు. వీటిని ఎంత వేగం మర్చిపోగలిగితే అంత మంచిది. రెండూ అతన్ని హింసించిన నగరాలే!.

అత నొక నవీన ప్రపంచంలోనికి, అవునవును, వినూత్న లోకానికి పయనమవుతున్నాడు. బొంబాయి ... అద్భుత నగరం! నౌకలు, కార్లు, గొప్పగొప్ప మేడలు, చిత్రవిచిత్రమైన రహదారులు అందమైన తోటలు ... బొంబాయి ... కూలికి కొదవలేదు... డబ్బున్న ధర్మరాజులు తిరిగే నగరం! ఇట్టే జేబుల్లోంచి డబ్బు ఖాతరులేకుండా యివతల విసిరిపారేస్తారు...

రైలు మెల్ల మెల్లగా వెడుతున్నది! బర్మా ఆయిల్ కంపెనీని దాటి పోయింది. ఇదివరకుకంటే రైలు వేగం హెచ్చింది. చక్రాలు గిర గిర తిరుగుతున్నాయి. ఇంజనుపొగ రుఘుప్‌రుఘుప్‌మని వదులుతోంది. దౌలత్‌పూర్ వెనకబడిపోయింది!

ఎండాకాలం పగలుకాసిన ఎండ రాత్రి గాలుపుగా మారింది. ఈ చెవిగాలుపు ఆ చెవికి కొడుతోంది. రాత్రికూడా గాలుపే! దీని తల్లికడుపు మాడిన గాలుపు! దూరంగా కుక్కలు 'భొయ్ భొయ్' మంటున్నాయి. ఇంజను చప్పుడికి కుక్కల 'భొయ్ భొయ్' మరుగున పడిపోయింది.

కాన్వాసుగుడ్డమీద మునూ కూచున్నాడు. చుట్టూ చూస్తున్నాడు! భూమీ, ఆకాశం, చెట్లూ, చెట్టపట్టాల్ కట్టుకుని గిరగిర తిరుగుతూ 'వానా వానావల్లప్ప' ఆడుతున్నాయి. చీకటి నోరు తెరిచి దెయ్యంలా వొక్కొక్క యింటినే 'ఉపారం'పుచ్చుకుంటున్నదా అనిపించింది. మశీదు శిఖరాలు, దేవాలయ గోపురాలు, కొండలూ, కోనలూ ఒక్కొక్కటే అదృశ్యమై పోయాయి.

కనిపించకుండా చీకటిలో మటుమాయమయాయికాని, లేకుంటే వాటిని చూస్తూ అత నింకా ఏదో ఏదేదో ఆలోచిస్తూ దిగులుపడేవాడు. తను మసలిన వీధులు. షికార్లు తిరిగిన సందులు...దయాల్ యిల్లు...ఫ్యాక్టరీ! అన్నీ అమాంతం అతన్ని కలవరపెట్టును! కాని మెల్లగా నిద్రాదేవత అతన్ని తన ఒడిలోకి తీసుకుని చల్లగా శరీరం నిమిరింది...

తెలతెలవారుతున్నది. రైలు ఆగింది. పక్కనున్న ప్లాట్ ఫారంమీద ప్రయాణీకులు గుంపులుగుంపులుగ ముసురుతున్నారు. అరుపులు, తొందరగా వెడుతున్న పరుగులు, చప్పట్లు వినిపించాయి. మునూ నిద్రలేచాడు. సగం సగం నిద్రపోతూనే 'ఏమిటిచెస్తాం యీ స్టేషను,' కాని కళ్ళుమాత్రం తెరవనే లేదు. నిద్ర ఊరికే జోగిపోతోంది. ప్లాట్ ఫారంమీద కురాళ్ళు.

"మిఠాయి, హిందూమిఠాయి!"

"వేడివేడి చా, ముస్లిం చా"

"మంచినీళ్ళూ, మంచినీళ్ళూ"

ఎవరిదో కేక వినిపించింది "అంబాలాస్టేషన్ ! అంబాలాస్టేషన్ !"

తెల్లవారింది. రాత్రిచీకటిలో మరుగుపడ్డ ప్రపంచం కళ్ళఎదుట ప్రత్యక్షమయింది. చల్లనిగాలి శరీరానికి తాకిపోయిన ప్రాణం లేచివచ్చింది...

ఢిల్లీ సెంట్రల్ స్టేషనుకొచ్చేసరికి అతనికి పూర్తిమెళకువ వచ్చింది. ఢిల్లీనిగురించి తన క్లాసుపుస్తకంలో చదివాడు : 'ఢిల్లీ అతి సుందరమైన పట్టణం'. తను చదివినదానికీ చూసినదానికీ చాలా భేదం వుందనుకున్నాడు.

ప్లాట్ ఫారంమీద జనం వొకళ్ళ నొకళ్లు తోసుకుంటున్నారు. తోపుళ్ళాట జోరుగావుంది. రైలుపెట్టెలన్నీ నిండిపోయి క్రిక్కిరిసి కనిపించాయి.

ఇటుపక్క జనం ఎవరూ లేరు. జాగా దొరికింది. మునూ పెట్టెలోంచి దుమికాడు. కుళాయికి దూరంగా కూచుని కడుపు నొక్కుతూంటే పీడ వొదిలించుకున్నాడు.

మళ్ళీ తన పెట్టెలోకి ఎక్కి పడుకున్నాడు. నిద్ర మత్తింకా వదల్లేదు.

"హేయ్ మునూ! దిగు! పగలు ఎండజాస్తి. ఇంకో పెట్టెలో కెక్కిస్తా" మావటివాడు చాలా మంచివాడు...

మునూ కిందకు దూకి అతనివెంట బయలుదేరాడు. మావటి అతన్ని టాపువున్న యింకో పెట్టెలోకి తోశాడు. పెట్టెనిండా వెదురుగడలు, రాటలు స్తంభాలు పేర్చివున్నాయి. మునూ వాటిమీద చతికిలబడ్డాడు. మావటివాడు "కమాన్...అదిగో ఆమూల టిఫినుంది తిను!"

"ఓయస్స్ ఓయస్సార్ !".

"హాయిగా బైఠాయించు... నేను మళ్ళీవస్తాయింకోస్టేష నొచ్చాక!".

"యస్సార్ ; యస్సార్ !".

మునూ ఫలహారం చేస్తుంటే రైలు కదలజొచ్చింది ... స్టేషను దాటి పోయింది! టిఫిన్ మాబాగుంది. రొట్టె, ఆనపకాయముక్కలూ నోటికి రుచిగా తగిలాయి. మావటివాడు మహా దొడ్డమనిషి. ఏనుగువంటి గొప్పమనసు. మునూ అనుకున్నాడు 'కొందరు మనుష్యులు మంచి వాళ్ళు. మరి కొందరు చెడ్డవాళ్ళు. ప్రభుదయాళూ, మావటివాడూ మంచిగావుండడమేమి? తనను స్టేషన్లో కొట్టిన పోలీసువాడూ, ప్రభను ఏడిపించుకు తిన్న గణపతీ కర్కోటకు లుగా వుండడ మేమిటి?'.

మనుష్యులలో ఎందుకీ వ్యత్యాసం కనిపిస్తోందో మునూ తలకెక్కింది కాదు. ఆలోచన ఒకంతకు ఎటూ తెగకుండావుంది. అతనికి తెలియకుండానే ఆలోచన తన దారిని తాను పోయింది.

మునూ పెట్టెలోంచి తల బయటకుపెట్టి చూశాడు. పడిపోయిన యిళ్ళు, పాడైపోయివున్న మేడలు, శిథిలమైవున్న కోటలూ, గోపురాలూ కనిపించాయి. వృక్షశిఖరాల చాటున తోటలసందున ఎన్నెన్నో మేడలు! ఢిల్లీ మనకు ప్రధాననగరం. ఈవిషయం అతని క్లాసుపుస్తకంలో వుంది. సరే బాగానేవుంది. దీన్ని కట్టినరాజు సూర్యవంశజుడు. రాజులు సూర్యుని బిడ్డ లన్నమాట! వీళ్ళని మహమ్మదీయులు వోడించారు. ఇప్పుడు యీ సూర్యుడు నగరాన్ని ఎండవేడితో ముంచెత్తుతున్నాడు.

మళ్ళీ సుందరమైన, తీరైన భవనాలు కనిపించాయి. ఈ భవనాల్లో ఎండరాదు. బహుశా యివి తెల్లదొరలవికాబోలును? మరి సూర్యుడు యీ భవనాల్లో ఎందుకు ఎండను కాయడు? ఇవి చల్లగా భద్రంగా వుంటాయి. సూర్యుడు అంటే రవి; 'రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యం!' ఈ మాటా తను చదివాడు. తెల్లవాళ్ళరాజ్యంలో సూర్యుడు నిజంగా అస్త మించడూ?

రైలు పోతోంది. భూమి తిరుగుతోంది. ఎదుట విశాలమైన మైదానం. అక్కడక్కడ చెట్లు. నేల కంకరగుట్టలతో నిండివుంది. కంకర రాళ్లతో నిండిన భూమిని దున్నుకుంటున్నారు రైతులు. ఇద్దరు కుర్రాళ్ళు రైతుల్లాగే వున్నారు; నాగలి దున్నలకు పూన్చి అదిలిస్తున్నారు. 'కంకరనేల ఇందులో ఏం పండుతుంది?' జీవించాలి. ఏదో యింత పండించుకుని గాను గలో గరిటెడు మిగిలితే అదే మహాప్రసాదమనుకుని యీ రైతులు జీవిస్తున్నారు!

కొండలు పోయి పాక్కుళ్ళలాగ వొకదానిమీద వొకటి పేర్చినట్టు కనిపించాయి. రాళ్లు అరిగిపోయినట్టు ఎర్రని దుమ్ము వంటినిండా పులుముకుని వికారంగా కంటికి ఎదురయాయి. కొండలు దాటింది రైలు; విశాల మైదానం చేరుకుంది; మైదానం నిండా ఇసక. మైళ్ళ పొడవునా యిసక. ఎడారి కాదుకద! ఎండ కరిగించిన ఉక్కులా వుంది. అంతా మైదానమే! ఇసకే. ఎక్కడో ఓచోటమాత్రం పచ్చని దుబ్బులు అవుపిస్తున్నాయి! ఈ ఎడారి దున్ని రైతుని బతకమంటే ఎలా బతుకుతాడు! 'కష్టమే' అనుకున్నాడు మునూ.

పెద్ద సుడిగాలి లేచింది. దుమ్ము, ఇసక రేగగొట్టింది. సున్నాలుగా తిరిగింది. ప్రళయంలా విరుచుకుపడింది. విరుచుకుపడి దూరంగా పరుగెత్తి పెద్దలోయలోకి విరిగి వొరిగి పడిపోయింది.

ఈ సుడిగాలి బహుశా దెయ్యమైవుంటుంది. అప్పుడప్పుడు బ్రహ్మ రాక్షసిదయ్యాలు యిలాగ సుడిగాలి రూపంలో విరుచుకుపడుతూ వుంటాయి. ఈ సంగతి ఎన్నోసార్లు వాళ్ళత్తయ్య చెప్పగా విన్నాడు. ఆమాటకొస్తే తను కొరివి దయ్యాల్నికూడా చూశాడు. పొలాల్లో కొరకంచులు పట్టుకుని వాటమ్మకడుపుకాలా; నిర్భయంగా తిరుగుతూంటాయి!

తన కిప్పుడేమీ ప్రమాదంరాదు. రైలు వీటిని లెక్కచేయదు. సుడి గుండాలూ, చెట్లూచేమలూ, గుట్టలూపుట్టలూ, పర్వతాలూ దానికి లోకువ! వొక్కొక్కదాన్నీ అవతలకి విసిరి పారేస్తోంది!.

'రైలెలాగా మాకానిముండ!' మునూ తనలోతాను అనేక భావా లను అల్లుకుపోతున్నాడు. "ఇనోన్నటి పెట్టెన్ని వెనక తగిలించుకుని రైలింజను చర చర వెళ్ళిపోతున్నదే; గుట్ట లెక్కుతూ దిగుతూ, నదులు దాటుతూ, ఎత్తుపల్లాల్ని లెక్కచేయకుండా దబ దబ వొకటే పరుగు! రైలింజను లేకపోతే నేను శ్యాంనగరంనుంచి దౌలత్‌పూరు వచ్చేవాడినా? ఇప్పుడీ రైల్లో కులాసాగా కూచుందునా?'

'కాని...' మునూకు యింకొకప్రశ్న; సమాధానం తేల్చుకోవలసిన ప్రశ్న. 'సరే; నేను బొంబాయి వెడతాను! వెళ్ళి...ఏం చేస్తాను? అక్కడ నా కెవరూ తెలీదే!... ఓయస్స్!... మార్కెటులో చెప్పాడు కదా మన నేస్తం! బొంబాయిలో సునాయాసంగా రోజూ రెండ్రూపాయలు కళ్ళ

చూడొచ్చునని!...నో...నో...నో... నేను నా రెక్కల కష్టంమీద బతుకుతాను, అంతేకాని వీధుల్లో అడుక్కుతింటానూ! ఛా ఛా!'

బిచ్చమెత్తుకోవడం! చాలా నీచం! దౌలత్‌పూర్‌లో వీధుల్లో బిచ్చగాళ్ళు చింపిరి జుత్తులతో అస్థిపంజరాల్లా తిరుగుతారు... తనకి కొంప దీసి బొంబాయిలో నౌకరీ దొరక్కపోతే! ఉహుఁ; దొరుకుతుంది! దొరుకుతాయిరా పనులకేంలోటూ?" అన్లేదూ తననేస్తం.

మునూకి తాను అష్టదరిద్రుడననే భావం ఉదయించింది. కళ్ళమ్మట నీరు గిర్రున తిరిగింది పంచెకొంగున కట్టుకున్న రూపాయి జ్ఞాపకమొచ్చి ఊరట చెందాడు!

తాను వెళ్ళబోతున్నది బొంబాయి. సముద్రమంత పట్నం! వీధులు మేడలు బజారులు ఎలావుంటాయో మనస్సులో ఊహించుకుంటున్నాడు. అతని భావనాజగత్తులోనికి తెల్లని దంతపు మేడలు వచ్చి నిలుచున్నాయి. దౌలత్‌పూర్‌లో తెల్లదొరల బంగాళాలు... ఉహుఁ వాటినిమించినవే. పెద్దపెద్ద మేడలు, ఆకాశం పొడుగునా కనిపించాయి.

బొంబాయినగర సౌందర్యాన్ని అతని భావనాబలం రూపకల్పన చేసుకుంటున్నది. కాని యింతకు మించిన యోజనం అడపోలేదు.

రైలు దాట్లువేస్తోంది. గుప్‌గుప్‌న పొగ వదులుతోంది. ప్రయాణం విసుగ్గావుంది. బయట ఎండ; లోపల ఉక్క; ప్రాణం ఉక్కిరిబిక్కిరవుతోంది. నిద్ర మళ్లీ తూగుకొస్తోంది. అస్తమానూ నిద్రే కుంభకర్ణుడిలాగ ?

నిద్రపోకూడదనుకుని పెట్టెలోంచి బయటకు తలపెట్టి తొంగితొంగి చూస్తున్నాడు. గాలుపు. నాలిక పిడచకట్టుకుపోతోంది. ఎండ ఫెళ్లున కాస్తోంది. తల కుత కుత ఉడికెత్తిపోతోంది. రిమ్మ రిమ్మ మంటోంది. ఎంతాపుకుందామన్నా నిద్ర ఆగిందికాదు. కళ్ళు వాటంతటవే, మూతలు పడుతున్నాయి. వెదురుబొంగులమీద మెల్లగా జారిగిలబడ్డాడు. నిద్ర పట్టేసింది. రైలు ఉయ్యాల ఊపుతోంది. తొట్టెలోని పసిపిల్లవానిలా మునూ నిద్రపోతున్నాడు...

రైలు హఠాత్తుగా ఆగింది. సాయంకాలంపడింది. 'కోటా జంక్షన్' అనే అక్షరాలు హిందూస్థానీలో ఎదురుగ కనిపించాయి. వెదురుబొంగుల మీద యింతసేపూ తానూ ఒక వెదురు గెడలాగ పడుకుండిపోయాడు. యింకా నిద్రే! దిక్కుమాలిననిద్ర!

తూగుతూనే తూలుతూనే లేచాడు. వొళ్ళంతా చెమటకు తడిసి పోయింది. 'హమ్మయ్య'!.

"హేయ్, మునూ ! ఇలారా !".

"యస్‌స్సార్ ! ఓయస్సార్!".

"ఇదిగో, మిఠాయీ, పాలూ!".

"మిఠాయా సార్!".

"తిను ... ఇదిగో యింద ...గట్టిగా పట్టుకో ... కిందపడిపోతుం దిస్మా ... యిదిగో గోనెపట్టా".

మావటివాడు గోనెపట్టా విసిరేసి అక్కడే నిలబడ్డాడు : "భయపడ కురా భాయ్ ! నేను నీఅంత వున్నప్పుడు కలకత్తానుంచి మెడ్రాస్ యిలాగే ఉడాయించేశాను ... మామంచి నేస్తంలే! ఒకనేస్తం ... యిలాగే ఆసరా యిచ్చాడు ... !".

మావటియిస్తున్న భరవసాచూసి మునూ కాస్త ధైర్యం తెచ్చుకున్నాడు: "ఈ పెట్లో ఉక్కపోస్తోంది సార్!".

"మరేంచేయడం! టాపూ గీపూలేని ట్రక్కులో పడుకోబెడదామంటే మా పెద్దదొర యిప్పుడే యిటువచ్చాడే !".

"ఉహుహు...అయితే వొద్దండి సార్!"

మావటివాడికి మునూనుచూసి ముచ్చటనిపించింది కాబోలును : "తత్తి కొడకా! నా ఏనుక్కూడా యింత చాకిరీ చేయడంలేదురా! ఊఁ ! కానియ్! చూస్తావేం! తాగు, పాలు!"

"అలాగే సార్! తాగేస్తాను!" ఇదెంతపని అన్నట్లు మునూ మిఠాయి కేసి, పాలవంకా చూశాడు......

రైలు మళ్ళీ కదిలింది. విశాలమైన అగాధాలలోంచి ఎడారిని దాటు తోంది. బ్రహ్మాండమైన యింజను రాక్షసిలాగ కూత కూస్తూ మధ్య మధ్య ఎదురుగ మరొక పట్టాలమీదినుంచి వచ్చే రైళ్ళను తప్పించుకుంటూ మెరుపు తీగలాగ, తుపానులాగ పెట్టెలను తనతో లాక్కుపోతుంది.

పగలు ఎడారిని చూడ్డానికి భయంలాగావుంది. భయంతోపాటు ఉత్సాహంగానూవుంది. దూరంగా తమాషాగా కంటికింపుగా ఎండమావులు! సముద్రంలాగ యిసక. ఒక దానివెంట యింకొకటి; ఒంటెలు రైలింజనుమీద

వున్న గొప్పిలాంటి మూపులతో, తోకలాడించుకుంటూ, నాలికలు చాపుకుంటూ గజగబ అడుగులు వేసుకుంటూ ... అహా! ఒంటెలవెంట ఆకలీ, దప్పికా లెక్కచేయకుండా బిడార్లు!

ఎడారిలో అక్కడక్కడ జౌత్‌ఖానాలు కనిపించాయి. గుడారాలు, ఒంటెలు, మనుష్యులు ... సూర్యమండలం ఎర్రగావుంది. ఆకాశంమీద పేదరాసి పెద్దమ్మ కుంకుమ అరబోసుకుంది! భూమీ, ఆకాశమూ కలుసుకునే చోట ... చిన్న చిన్న మబ్బులు ఏనుగుల్లాటి, ఒంటెల్లాటి, రైలింజనులాంటి మబ్బుతునకలు, బొమ్మలు కడుతున్నాయి!

చూస్తున్నకొద్దీ చూడాలనేవుంది యించక్కా; కాని కణతలు నొప్పి!

సాయంత్రం, నేల పరిచినబల్లలావుంది. ఎడారిదాటి, బల్లపరవు నేలదాటి రైలు యివతల పడింది. కొండశిఖరాలు, శిఖరాలమీద కోటలు, కిందను పర్వతాల అంచులను పచ్చికబయలు ఎంత అందంగావుందో! కుంకుమపొడి చల్లినట్టు నీరెండ తోటలమీద పడుతోంది. చిన్న చిన్న పచ్చికమబ్బులమీద ఎవరో వసంతం చిలుకుతున్నారు! గొర్రెలు, అమాయకమైన మేకపిల్లలు పచ్చికను మేస్తున్నాయి. చిన్ని చిన్ని నోళ్ళు "మే మే వే...మా..." అని అరుస్తున్నాయి.

ఒంటెలు వొకటింకిలాగ పెద్దపెద్ద మెడలు చాపుకుని వెళ్ళిపోతున్నాయి. రైలు బ్రిడ్జిదాటింది. ఏరుఅవతల చిన్నచిన్న వెన్నెల కుప్పలవంటి గుడిశెలు కనిపించాయి.

రైలు గబగబ వెళ్ళిపోతోంది. గుడిశెల్లోని కుర్రాళ్ళు బయటికొచ్చి రైలుకి 'గుడ్‌యీవినింగ్' పెడుతున్నారు. నెత్తిమీద 'సుమ్మచుట్టు' పెట్టుకుని పాలకడవలతో మెల్లగా, వయ్యారంగా వెళ్ళుతున్న ఆడవాళ్ళు! ఆశ్చర్యంగా పిల్లలు నోరుతెరుచుకుని నోట్లోవేళ్ళుపెట్టుకుని పోతున్న రైలు వంకచూస్తున్నారు.

మనూవు తనచిన్ననాటి ముచ్చట్లు జ్ఞాపకంవచ్చాయి. బిమన్, బానలాటి కడుపుతో ... సన్నగా రివటలావుండే బిమంబరు ... కోతలుకోస్తూ గొప్పగా ... బడాయిలు చెప్పుకునే జయసింగు! అంతాకలసి మామిడి తోపులో నీడలమధ్య ... బీస్‌నదీతీరాన యిసుకతిన్నెలమీద ... చెరువులో గేదెలు...గోళీకాయలు...చెడుగుడు...గోణీబిళ్ళ ... కోతికొమ్మచ్చి...

ఎర్రని పళ్ళు... దోరదోరని పళ్ళు... చెరుకుకర్రలు విరుచుకుంటూ గెడలకు గెడలే తింటూ పిప్పి వుమ్మేస్తూ......

అయితేనేమి? కాంగ్రాకొండలు ఎంతబాగున్నా అక్కడ రైలులేదు! "రైలూలేదు! బజార్లూలేవు! నేను బొంబాయి వెడుతున్నాను. బొంబాయి ఆ యమలోకంకంటె నయంకదూ!" మునూ తననుతాను ఊరడించుకున్నాడు.

మునూ ఆలోచిస్తూనేవున్నాడు. రైలు వెళ్లిపోతున్నది, మట్టిదిబ్బలు దిబ్బలమీద పచ్చని ఎర్రని నీలిపూలు, కాశీరత్నం తీగెలు కలకల్లాడుతున్నాయి. జరీలాగ ప్రకృతి మెరిసిపోతోంది. పర్వతాలు జలతారు తలపాగాలను చుట్టుకున్నట్లు ప్రకాశిస్తున్నాయి. పర్వతాల అవతల కోట కనిపించింది. మావటివాడు "దార్లో పెద్ద కోట కనపడుతుంది; తప్పక చూడమన్నాడు. ఈ కోటే అయివుంటుంది." చిత్తూర్ కోట. పద్మిని అల్లాఉద్దీన్‌తో యుద్ధంచేసిన దిక్కడే. మేవాడ్ రాజపుత్రులు పసుప్పచ్చని బట్టలు కట్టుకొని చితిలో ప్రవేశించిన స్థలం. రాణితోపాటు మిగిలినస్త్రీలు అగ్నిప్రవేశం చేశారు! హిస్టరీ పుస్తకంలో చదివినపాఠం జ్ఞాపకంచేసుకుంటూ మునూ 'రైలిక్కడాగితే బాగుండు' ననుకున్నాడు. "ఎందుకిక్కడా? బొంబాయి... పని... పని... బొంబాయి !"

రైలు 'రవలా' స్టేషనికొచ్చి ఆవిరివొదిలింది. సాయంత్రం పడింది. చీకటితెరలు కప్పివేస్తున్నాయి. చీకటితెరలను చీల్చుకుంటూ టెలిగ్రాఫ్ స్తంభాలను దాటుకుంటూ రైలు బయలుదేరింది. ... ఒకటి రెండూ మూడూ ... స్తంభాల్ని మునూ లెక్కపెడుతున్నాడు. స్టేషన్లోనే మావటివాడొచ్చి మిఠాయీ, సాలూ యిచ్చివెళ్ళాడు. మునూ పొట్లాం విప్పి తింటున్నాడు. ఇసుకదిబ్బలమీద లాంతరువెలుతురు పడుతోంది. కొండలోయల్లో గుడిశలదగ్గరదీపాలు మెరుస్తున్నాయి. నీలిమందుకలిపిన నీళ్ళలావుంది ఆకాశం. ఆకాశంలో మెరుపుతీగల్లాగ, వెండితీగల్లాగ నక్షత్రాలు ప్రకాశిస్తున్నాయి. ప్రపంచమే వొకవింతగా వుంది. ఆశ్చర్యంగావుంది. అద్భుతావహంగావుంది. నీడలు, జాడలు, వెలుతురు, చీకటి, గమ్మత్తుగా !

నిశ్శబ్దం. రైలుపోతుంది. ఎక్కడా వేటికీ చలనం కనిపించదు. చెట్లు కదలడంలేదు. రైలువేగానికి గాలిమాత్రం రువ్వుకొస్తోంది. వెదురు బొంగుల మీద గోనెగుడ్డ పరుచుకుని రివ్వున వీచేగాలికి కితకితలు పెడుతూంటే మునూ నిద్రపోయాడు !...

బరోడావచ్చింది. తాటిచెట్లు, వేపచెట్లు, సరుగుడుతోటలు, గుబురు గుబురుగా గుంభనగా సంగీతం ఆలాపిస్తూ ఎదురయాయి. స్టేషనువచ్చింది. రైలు ఆగింది!

బరోడా మహారాజు స్పెషలురైలు తెల్లని రంగులో తళతళలాడుతూ, తళుక్కుతూ, తారుతూవచ్చి ప్లాట్ ఫారంమీద నిలబడింది. మిగిలిన రైలుబళ్ళు దానిముందు వెలవెలబోతున్నాయి. క్యాంపునగరంలో బాబుగారు వేసుకునే నల్లని బూట్లను తొడుక్కొని, తెల్లని యిజారులు కోట్లూ ధరించి తలమీద బంగరు జలతారు టోపీలతో ప్రత్యక్షం మహారాజు నౌకర్లు! "ఇలాంటి బూట్లు నేనూ కొనుక్కుంటాను. బొంబాయిలో పనిదొరికీ దొరగ్గానే ఫస్టుక్లాసైన బూట్లు కొనేయ్యనూ!"

రైలు మామూలుగాం కూతకూసింది. నల్లటిపొగ ఉంగరాలుగా చుట్టి మీదకు విసిరేస్తూంది. ఝుప్ఝుప్ మని బయలుదేరింది......

మైళ్ళపొడవున పంటచేలు పచ్చనిపొలాలు కనిపించాయి. అక్కడ క్కడ చుక్కలవలె కొండలు, దేవాలయాలు, పెద్ద పెద్ద మేడలు, పొగలు కక్కుతున్న మిల్లులు! మునూ నరాలలోని రక్తం పైకుబికింది; బొంబాయి దగ్గర పడుతోందిలావుంది. వచ్చేస్తోంది బొంబాయి!

తాను రైల్లోచూసిన ఎడారిలాటి ఎడారి, ఇసుక ఎడారికాదు; నీటి ఎడారి. ఓహో! సముద్రమా అంటారు దీన్ని? సరి సరి!

సముద్రం ఎలావుంటుందో యింతవరకూ మునూ తనజన్మలో చూసి ఎరగడు; తరంగాలు తళతళలాడు వెండిరేకులవలె విరుచుకుపడుతున్నాయి. తానిదివరకు ఎన్నడూచూడని సముద్రం కంటికికనిపించినంతనే మునూ ఆనందానికి అంతులేదు. ఉద్రేకం పొంగులుపారింది. ఆనందోద్రేకాలకుతోడు భయాందోళనలు ఆవరించాయి. ఆత్మ బరువుగా, బాధగా, భయంభయంగా కొట్టుకుంటోంది. గబుక్కునలేచి వొళ్ళు విరుచుకున్నాడు. కిటికీదగ్గరకొచ్చి నిలబడ్డాడు. అవతలకి తొంగితొంగి చూశాడు. సముద్రగాలి మొహాన్ని తాకింది. విసనికర్రతో విసిరినట్లుంది సముద్రం. అమ్మ! చల్లగా హాయిగా కులాసాగావుంది! మొహంనిండా చిరుచెమట్లు పోశాయి. తొడుక్కున్న కమీజునీ కుళ్ళుకంపు కొడుతుంది. చొక్కాతో మొహం తుడుచుకున్నాడు. మెత్తని నునువెచ్చని బుగ్గలకు చొక్కాకున్నదుమ్ము

అంటుకుని కరకరలాడింది. తల వేళ్ళతో నిమురుకున్నాడు. మునివేళ్ళతో దువ్వుకున్నాడు. అరచేతినిండాబొగ్గునుసుసులు అంటుకొన్నాయి. సేదతీర్చు కున్నట్లనిపించింది; ఉస్సురుస్సురుమని నిట్టూర్చాడు. తాను వొంటరిగా వున్నట్లుయిప్పుడుతోచింది. గొంతుక ఉక్కిరిబిక్కిరయింది. గట్టిగా అరవాలను కున్నాడు. సముదాయించుకుని ఊరుకున్నాడు.

మహా జాగ్రత్తగానే కూచున్నాడు. కూచుని ఆలోచిస్తున్నాడు. ఇటు పచ్చనిపైరులతో చేలు బంగారంలా మెరుస్తున్నాయి. అటు సముద్రం ఘోషిస్తుంది. చెట్లూ, చేమలూ, గట్లూ, పుట్టలూ మంచునీటిబిందువులతో పాదరసంలాగ మెరిసిపోతున్నాయి.

"బొంబాయిలో మనసైడువాడెవడైనా కనిపిస్తాడా అని ?" తనను తానేప్రశ్న; తానే సమాధానం !

"కనిపిస్తే ?

"కాస్త మాటసాయం చేయమంటాను !"

"కనిపించకపోతే ?"

"అవునవును; బొంబాయి పెద్దపట్ణం ! అంతపెద్దపట్ణంలో మనసైడు వాళ్ళని గుర్తేపట్టలేం !"......

బొంబాయినగరం సమీపిస్తోంది. ఫ్యాక్టరీముందు బోర్డులమీద నల్లని యింగ్లీషు అక్షరాలు కూడబలుకుని చదువుకుంటున్నాడు. రుస్తుంజీ...కరీం భాయి ! బొంబాయి, అనే అక్షరాల్లు ! రెండువేలమైళ్ళు ఉత్తరదిశనుంచి దక్షిణానికి రైల్లో ప్రయాణం చేశాడుకదా; యింతోటి పెద్దపట్ణం ఇన్నిమైళ్ళ పొడవుగల నగరం యింతవరకుతారసిల్లలేదు. ! ఈ నగరమే ఒక పెద్ద ప్రపంచం !

కర్పూరపుతోటలు, తాటివనాలు, దేవాలయగోపురాలు, మసీదుశిఖరాలు, చర్చిగోడలు, విశాలమైనభవంతులు, యిళ్ళు, పూలఘాట్లు, స్మశానాలూ, సంతస్థలాలూ, అద్దకాలువేసి ఆరబెడుతున్న చిన్నచిన్న పారిశ్రామిక కుటీరాలు, గొర్రెలమందలూ పశువుల మందలూ ... ఒక్కొక్కటే గిరగిర దాటుకుపోతున్నాయి. రంగురంగుల సిల్కుబట్టలు కట్టుకున్న పిల్లలు, కిలకిల యనినవ్వే పిల్లలు రైలునుచూసి ఆనందంతో గెంతుతున్నారు.

ఆకలి దహిస్తోంది. మనసు ఆందోళనతో నిండింది. నోరు ఊటలు ఊరింది. ఏది కనిపిస్తేఅది తినేయాలని బుద్ధిపుట్టింది. కళ్లు అటూ ఇటూ చంచ

లంగా చూస్తున్నాయి. కూచున్న సీటులోంచి కాళ్ళుజాపాడు. లేచి కాలు విదిలించాడు. కాలు తిమ్మిరెక్కింది. ఆలోచనలు సుడిగుండాలుగా తిరుగుతున్నాయి. నెత్తురు నరాలలో గబగబ పరుగెత్తుతున్నది. మొహం వెలవెలబోయింది. కంగారు హెచ్చింది. శరీరమంతా చెమటలుపోసింది. తలలో ఆలోచన లేమీ మిగల్లేదు.

చిన్న చిన్న స్టేషన్లుదాటి రైలు గబగబ గబగబదాట్లు వేస్తోంది. వుండుండి వొక్కకూత, గింకురుమనే కూతకూసింది. గుప్‌గుప్‌న పొగ వొదిలింది. బ్రేకులు కీచుమన్నాయి. ఒక్క కుదుపుకుదిపింది. పొగ వదులుతూ నిట్టూరుస్తూ వొగరుస్తూ, విక్టోరియాస్టేషన్లో ఆగింది.

ప్లాటుఫారం అవతల గూడ్సుబండి గెడతాడిలా నిలబడివుంది. రైలు ఆగిందికదా, బొంబాయి వచ్చిందికదా యిటెదిగి తనమానాన తాను ఎలాగో వోలాగ తప్పించుకుని ఊళ్ళోపడడమా? లేక మావటివాడు వచ్చేవరకూ ఆగి అతనేమంటాడో చూద్దామా? అని మునూ సంశయంలో పడ్డాడు.

మాటల్లోనే వచ్చాడు మావటివాడు. వెయ్యేళ్ళాయుష్షు. మహామంచి వాడు "మునూ! చంపుకుతిన్నావురా? బొంబాయి బొంబాయి అని! వచ్చేసిందిఽ; ఇక దిగు."

"దిగి యేంచేయను సార్?"

"నన్నడిగితే నే నేంచెప్పను భాయ్! ఈ ట్రెయిను యిక్కడింక ఆగదు...రేవుదగ్గరకుపోయి సామానెక్కించేస్తాం! మరీ వూళ్ళో వుండం కదా! విదేశాలకి ప్రయాణంరాభాయ్! విదేశాలకి!"

"టిక్కట్టు కలెక్టరు సార్..."

"నేను దాటిస్తాకదా! ఎవరూ చూడకుండా అవతలకి పంపిస్తా! ముందీ మిఠాయి తిను!"

మునూ పెట్టెలోంచి కింద కురికాడు. మావటివాడు మంచివాడు. అతనుండగానే అవతలకి దాటేయాలి. అతనివెంట బయలుదేరాడు.

మావటివాడు పక్క ప్లాటుఫారం మీదవున్న గూడ్సుబండివద్దకు మునూను తీసుకెళ్ళాడు. పెట్టెకూ పెట్టెకూ మధ్యనవున్న కాళీజాగామధ్య దూరాడు.

"మునూ! యిలా దూరు!"

"యస్సార్ ! ఓ యస్ !"

"పట్నం ఎంతపెద్దదైతే బతకడం అంతకష్టం !"

"ఉహూఁ?"

"మరేమిటనుకున్నావ్? నువ్వు తీసే ఊపిరికూడా దబ్బిచ్చుకోవాలి. భయంలేదులే! ధైర్యం ధైర్యం! సాహసేలక్ష్మీ! అన్నారు పెద్దలు...నువ్వు గడుగ్గాయివేలే! పరవాలేదు!"

ఇద్దరూ గోదాందగ్గర వొచ్చారు.

"మామూలు మనిషిలా చెక్కేయి! దిక్కులు చూడకు! తిన్నగా ముక్కుసూటిగా దర్జాగా ఉడాయించేయ్".

"గుడ్‌మార్నింగు సార్!"

"అచ్ఛా! అచ్ఛా! నీలాటివాళ్ళకి భగవంతుడే వున్నాళ్ళే......"

మునూ ఆఖరుసారి మావటి వానికేసిచూశాడు. కళ్ళు చెమ్మగిల్లాయి. "హోహో...ధైర్యం ధైర్యం" మావటి వెనక్కిమళ్లేడు. మునూ ముందుకు సాగేడు. అతనుచెప్పినట్టే టికట్టువున్నట్లే దర్జాగా దిక్కులు చూడకుండా ఈ హెగాలన్నీ ఎన్నాళ్ళనుంచో మసలినవాడిలా మునూ నడక పుచ్చు కున్నాడు. కృతజ్ఞతతో హృదయం సంతోషంతో నిండింది.

విక్టోరియా స్టేషనునుంచి యివతలకొచ్చాడు. అతనిముందు బొంబాయి నగరం! వింతగా కొత్తగా రకరకాల మనుష్యులతో, భవనాలతో అందంగా అలంకరించుకున్న బొంబాయి! వీధులలో తెల్లదొరలు తిరుగుతున్నారు. సూట్లూ బూట్లూ హేట్లూ! పొడుగైన ముక్కులతో సొగసైన పార్సీ స్త్రీలు! లేగదూడులవంటి చూపులతో, మహమ్మదీయులు తెల్లని యిజార్లువేసు కుని నడుస్తున్నారు. నెత్తిమీద నల్లని టోపీలు, లాంకోట్లు, షేర్వాణీలు; ట్రాంబళ్ళు జరుజరున వెడుతున్నాయి. గంటలు గణగణ మ్రోగుతున్నాయి. ట్రాముల్లో అనేకమంది పార్సీలు, చైనాస్త్రీలు, హిందువులు, మహమ్మదీయులు కూచున్నారు. వొక భాషకాదు; వొక లోకంకాదు. అనేక భాషలు! అనేక లోకాలు!

ఇదివరకటి ప్రపంచం కాదిది. అనేకరంగులు రంగురంగుల వస్తువులు పరిమళాలు వింతవింతలు. పూలవాసన, దుమ్ము, ఎండ, ఉల్లిపాయలు, పేడ, మురికికంపు! వేస్తున్న అడుగులు తడబడుతున్నాయి. మనస్సు గతి తప్పింది.

పేవుమెంటుమీదకు వచ్చాడు. ఈ వింత ప్రపంచంకేసి కన్నెత్తి చూశాడు. తన శక్తిసామర్థ్యాలను కొలుచుకుంటున్నాడు. జనరల్ పోస్టాఫీసు భవనం ఎత్తుగావుంది. అటుపక్క రైల్వేస్టేషను, యిటుపక్క యూనివర్సిటీ, లా కాలేజీ భవనాలు ఆకాశానికంటుతున్నాయి. 'మాలో ఎవరు గొప్ప' అన్నట్లు మునూకేసి తీవిగా చూశాయి. ఈ ఎత్తైన భవనాలముందు తనొక మరుగుజ్జు!

మొహానికి పట్టినచెమటను తుడుచుకున్నాడు. నగరం అతన్ని వెలివేస్తున్నట్లు భారంగా మీదపడి నొక్కుతున్నట్లు అనిపించింది. స్క్వేరుగుండా నడిచివెడుతున్నాడు. స్క్వేరులో వొకమార్బుల్ విగ్రహం శిలాప్రతిమ కనిపించింది. ఎవరిదీ, పాలరాతిప్రతిమ! చేతిలో ఏదోవుంది. తలమీదకిరీటం; మొహం వుబ్బినట్లుంది. విక్టోరియా విగ్రహం! విగ్రహం తలమీద కాకి వాలింది. రెట్టవేసి రెక్కలు టపటపకొట్టి ఎగిరిపోయింది. ఆ పక్కనే బెంచీ కనిపిస్తే మునూ దానిమీద చతికిలబడ్డాడు.

మూలనున్న బెంచీమీద చతికిలబడి వీథిలోని మనుష్యులకు మొహం చాటుచేసుకుని ఆలోచిస్తున్నాడు. వీథిలో మనుష్యులు ట్రాం కోసం నిరీక్షిస్తున్నారు, ట్రాం గరగరమంది. రైలు కంటె యిదిమరీ విచిత్రం. దీనికి యింజ నేలేదు.

మావటి యిచ్చిన పొట్లాంవిప్పి మిఠాయివుండలు వొక్కొక్కటే తింటున్నాడు. మిఠాయిఅయిపోయింది. దాహంవేసింది. కుళాయి ఎక్కడేనా వుందేమోనని పరికించాడు. అవన్నీ తినేశాక మంచినీళ్ళు తాగవచ్చును కున్నాడు.

పొట్లాంనిండా రసగుల్లాలు, బూందీ, చిన్న చిన్న బిస్కత్తులూ వున్నాయి. పొట్లాం.విప్పి అరచేతిలో పరుచుకుని వొక్కొక్కటే తింటూంటే విక్టోరియా విగ్రహంమీదున్న కాకి రివ్వున ఎగిరివచ్చి తన్నుకుపోయింది. పొట్లాం బరువుగా వుందేమో పేవ్ మెంటు మీదనే పడిపోయింది.

మునూకు చెప్పలేనంత కోపమూవచ్చింది; ఎంతో సరదాగానూ వుంది: "అమ్మ! గడుసుముండా! యిట్టే తన్నుకుపోయిందే!"

లేచి నిలబడ్డాడు. కుళాయికేసి తిరిగాడు. అతని నెత్తిమీద గాలిలో "కావు కావు" మంటూ కాకుల గుంపు రింగటాలు తిరుగుతోంది. తిరిగి తిరిగి

పేవ్ మెంటుమీద పడివున్న మిఠాయిపొట్లం దగ్గరవాలి ముక్కులతో తలొక వుండా కరుచుకు పోతున్నాయి. విక్టోరియా తలమీదకు కాకులన్నీ చేరాయి.

చేతిలోని పొట్లాం ఎగిరి చక్కాపోయేసరికి మునూ ఆశ్చర్యపోయాడు! "చేతిలో పొట్లాం యిట్టే 'కాటేసు' కు పోయాయ్! కిందపడ్డ మిఠాయి నేను తీసుకోనని తెలుసుకాబోసు! ఎప్పుడు నేను వెళ్ళిపోతానా, ఏరుకు తిందామా అని మిడుతూ మిడుతూ చూస్తున్నాయ్!"

పేవ్ మెంటుమీదకొచ్చాడు. ఒక మూల జ్యోతిష్కుడు కూర్చుని వున్నాడు. నుదుటను మూడు పెద్దపెద్దచారలు, మధ్యన రూపాయకాసంత కుంకుమ బొట్టు, తీవిగ్గా కూచుని గుజరాతీ గుమాస్తాకు సాముద్రికం చెబుతున్నాడు. జ్యోతిష్కుడు చెప్పేది బహు శ్రద్ధతో గుమాస్తా వింటూ తల ఎగరేస్తున్నాడు. కాస్త దాటేక మంగలిషాపు కనిపించింది. పెద్ద నిలువుటద్దం ముందు బల్లమీద కత్తులూ, మిషన్లూ, కత్తెరలూ పడేసి వున్నాయి. లోపల బేరగాళ్ళెవరూలేరు. మంగలి గుడుగుడు పీలుస్తూ కూనిరాగంతీస్తూ మాసినగడ్డం పెరిగిన క్రాపు దారమ్మట పోతున్నదేమోనని ఎదురుచూస్తున్నాడు. క్షవరశాల దాటేక పుస్తకాలషాపు. తోరణాలలాగ పత్రికలు వేల్లాడుతున్నాయి. స్నానం చేస్తున్నట్లు రవికెలు విప్పుతున్న గౌన్లులేని తెల్లదొరసానుల బొమ్మలు కొట్టవచ్చినట్లు పత్రికల కవరుపేజీలమీద కనిపించాయి. ఆ పక్కనే చిన్న చిన్న పుస్తకాలు సతీపతి కుతూహాల రహస్యం పడకటింటి ముచ్చట్లు అనే అక్షరాలతో పుస్తకాల దొంతరులు పేర్చివున్నాయి. పుస్తకాలషాపు పక్కనే పళ్ళదుకాణం; దానికానుకుని మిఠాయికొట్టు దారిచివరున ఒక మూలను ఏవరో కూలీ, తనవంటి నిర్భాగ్యుడే, ముడుచుకుని మూటవలె పడుకుని నిద్రపోతున్నాడు. చేతులు రెండూ తలదిండుగ చేసుకుని ఆట్టే జాగా ఆక్రమిస్తే ప్రమాదమన్నట్లు కాస్తంత స్థలంలోనే సర్దుకున్నాడు.

'ఒహో! ఇక్కడకూడా కూలీలు యిలా దొర్లుతూవుంటారన్నమాట!' వుండచుట్టుకొని పడుకున్నకూలీని చూసేసరికి మునూ గుండె చెరువయింది. 'బొంబాయిలో డబ్బుకేంకొదవలేదు. వీధుల్లో విసిరిపారేస్తారు వెధవడబ్బు!' అన్నాడుకదా దౌలత్పూర్‌లో తననేస్తం! డబ్బంత సులువుగా దొరుకుతూంటే మరి యీ కూలీలకీ దౌర్భాగ్యమేమి? గొంతుక ఎండిపోయింది. దాహంవేస్తుంది. అవయవాల పీకుతున్నాయి. ఇది పగలుకనక భయంలేదు. ఇంక రాత్రిపడుతుంది. తనుఏకాకి. ఎక్కడపడుకోవడమో దారీతెన్నూ కన

పడడంలేదు. మనూరు భీతివొచ్చింది. ఎప్పుడో రాత్రిపడుతుందని యిప్ప ట్నుంచీ ఎందుకీభయం! 'ధైర్యం ధైర్యం' అన్నాడుకదా మావటివాడు.

రోడ్డుచివరకు వచ్చాడు. ఇరువంకలా ఎత్తైన ఏడంతస్తుల మేడలు హడలేస్తున్నాయి. దౌలత్‌పూర్‌లో తెల్లదొరల మేడలున్నాయి కాని, అవి యింత పెద్దవికావు; యిన్నోటిలేనూలేవు!

నీలవేసిబిగించినట్లు దారిమధ్య నిలబడిపోయాడు. నాలుగురోడ్లకూడలిలో ఎటుపోవాలో తోచటంలేదు. మంచిమంచి దుస్తులు వేసుకుని మనుష్యులు ప్రవాహంలా పోతున్నారు. పక్కనే మరొక పేవ్‌మెంటు కనిపించింది. అటు తిరిగిచూశాడు. ముందు పంచలు కట్టుకున్న విలాసపురుషులు నడుస్తున్నారు. వెనకాల కూలివాళ్ళు వెడుతున్నారు. కూలీలను చూశాడు. ప్రాణం లేచి వచ్చింది. ఈ కూలీలగుడ్డలు తనబట్టలకంటె మాసిపోయాయే!

ఎదురుగ పోలీసునించుని దారిచూపిస్తున్నాడు. వచ్చీపోయే బస్సుల్ని ఆపుతున్నాడు. కాస్సేపుంచి విడిచిపెడుతున్నాడు. ఈ పోలీసు యిదివరకు తను చూసిన పోలీసుకు మల్లేలేడు. టోపీ ఒకపక్కకు వంగివుంది. చేతలో లాఠీ లేదు. పెద్దభవనం కనిపించింది. ముందు గేటు. గేటుమీద బోర్డు "కాక్స్ అండ్ కో!" మెల్లిగా చదువుకున్నాడు. ఇటువెడితే తెల్లదొరలూరు కోరు. దౌలత్‌పూర్‌లో తనను ఇంగ్లీషుదొరసాని తిట్టి తిట్టి దిగబాంబోసింది. ఇంగ్లీషు వాళ్ళిద్దరు ముగ్గురు ఆ దారినే పోతున్నారు. అయితే అటు అసలే వెళ్ళకూడ్దూ!

కాని మామూలుగా మనవాళ్ళే భారతీయులే మసులుతున్నారుకద!... ధైర్యంవచ్చింది. అటుదాటిపోశాడు. ఇందాకటికంటె మరీ ఎండిపోతోంది గొంతుక; గొంతుక పిడచకట్టుకుపోతోంది. బజారు తగిలింది. వెనక్కీ ముందుకీ చూశాడు. మంచినీళ్ళపత్రివు కనిపించదేం? ఇంతకంటె దౌలత్‌పూరేనయం కాసిన్ని మంచినీళ్ళయినా దొరుకుతాయి.

బ్యాంకులు, అద్దాల తలుపులతోవున్న షాపులు ఆకాశాని కంటుకున్న మేడలు గిరగిర ఎటుచూసినా అవే! అన్నీ వున్నాయికాని కుళాయి లేదు; కుళాయి లేకుంటేపోయె! పోనీ బావైనా లేదు! చచ్చినచావొచ్చి పడింది!.

చిట్టచివరకు వొక సోడాషాపు కనిపించింది. రంగురంగుల పానీయాలు తాగుతూ కుర్చీలలో చతికిలబడి పేపరుచూస్తూ మధ్యమధ్య సిగరెట్లుపీలుస్తూ

కాలిమీద కాలువేసుకుని ఊపుకుంటూ షాపులో చాలామంది మనుష్యులు! ఇదివరకు దౌలత్‌పూర్‌లో ఐసమ్మే షాపులో వాడూ తాగేడు సోడా! కాని ఆ షాపుకంటె ఇది పెద్దది. గాజు తలుపులు నిగనిగ లాడుతున్నాయి. ఇందులో నుంచున్న మనుష్యులు తెల్లని దుస్తులు వేసుకున్నారు. 'డబ్బున్న మారాజులు, వారికేం!'

'సోడా ఎంత? ఒక అణా! నాదగ్గిరో రూపాయివుంది ... అణా పోతే పదిహేనణా లుంటాయి ...' షాపులోకి అడుగువేస్తూ ద్వారంవద్ద తూలిపోయాడు. కింద పడకుండా నిలువరించుకుని లోపలకుపోయి నించు న్నాడు. షాపునిండా వస్తువులే. ఏం అడగాలో నోటమాట పెగిలిందికాదు. కాస్తంత సముదాయించుకున్నాడు. ధైర్యం చిక్కబట్టుకుని ఖాళీగావున్న కుర్చీమీద బెంచీముందు కూలబడ్డాడు. నుదుటనుపట్టిన చెమటనుచొక్కాతో తుడుచుకున్నాడు. చుట్టూ వొకసారిచూస్తే అందరూ మనుష్యులే! తాగుతూ సిగరెట్టు పొగవదుల్తూ పిచ్చాపాటీ చెప్పుకుంటున్నారు.

హఠాద్గా ఎవరో మనిషి అతనిదగ్గర కొచ్చేవరకు తా నెక్కడవున్నదీ అతనికే తెలియలేదు. "కూలీవేనా నువ్వు?"

"అవును" మునూ నేరం వొప్పుకున్నవాడిలా బుర్ర ఊపేడు. గుండె కొట్టుకోవడం మానివేసింది.

"అయితే కింద కూచో......ఏం కావాలి నీకు?"

కుర్చీమీంచి మాళీమేకలా లేచి కింద కూచున్నాడు. భయం ఆవరించింది. గుటకలు మింగాడు. నోరు తెరుచుకుంది

"ఏమిటి కావాలి నీకు? త్వరగా చెప్పు!"

సాసర్లలో 'టీ' వేడివేడి 'టీ' పోసుకుని ఉఫ్‌న ఊదుతూ కొంచెం కొంచెం చప్పరిస్తూ- మనుష్యులు అతనివంక తేరిపారచూశారు! కుష్టువాణ్ణి చూస్తున్నట్టు! అసహ్యించుకుంటున్నట్టు! కుమ్మరిపురుగులవంటి చూపులు! గొప్పవారి చూపులు!

"వో సోడాకాయి!"

సోడా కావాలని అన్నాడేకాని మునూకు కోపం ఆగిందికాదు. కాని గొప్పవాళ్ళ పోకిడే అంత. గొప్పవాళ్ళని గౌరవించాలని చిన్నప్పుడు బోధించారు. "డబ్బున్నమారాజులు వారికేం ఏంచేసినా చెల్లుతుంది!" అన్నమాటలు చిన్నతనంలో చెప్పినమాటలు గింగురుమన్నాయి.

బుర్ర అటుతిప్పుకుని అద్దాలతలుపుల్లోంచి వీధిలోకిచూశాడు.

సోడా పట్టుకొచ్చి దుకాణపు అబ్బి "బేడ" అన్నాడు. మునూ తుళుక్కుపడి, కొంగునవున్న మూటవిప్పి రూపాయితీసి అతనిచేతిలో వుంచాడు. ఆ అబ్బి రూపాయితీసుకుని బల్లమీద ఠంగునకొట్టి మిగిలిన పధ్నాలుగుఅణాలు మునూ చేతిలో పెట్టాడు.

సోడానీళ్లు తీయగా చల్లగా వున్నాయి. ఏసిడ్‌ఘాటు ముక్కులోకి వెళ్ళి కళ్ళమ్మట నీరుకారింది. కొంచెం కొంచెంతాగి ఘాటు భరిద్దామను కున్నాడు కాని ఆలస్యమయితే అక్కడ కూచున్నబాబులు ఏమన్నా అంటా రని జంకేడు. రెండుమూడు గుటకల్లో సోడా అంతా తాగేశాడు. ఒకమూల గ్లాసుపెట్టి తనమానాన తాను బయటుకుపోతే గొడవేమీ వుండదు. ఎందు కొచ్చినతంటా! డబ్బున్న వాళ్ళతోటి! లేనిపోనితగవు! సోడా ఘాటుకు తలదిమ్మెక్కింది. కడుపుతిప్పింది. డోకులు వస్తున్నాయి.

"ఏక్! ఏక్! క్క్ క్క్ క్క్ క్క్..."

"అరరెరె...డోక్కురా పీనుగా!"

దుకాణదారుడు కసిరి కొట్టేడు. వెంటపడ్డాడు. మునూ దౌడుతీశాడు. వందగజాల మేరవరకూ ఒకటే దౌడు... ఒగుర్చుస్తూ నిలబడి వెనక్కి తిరిగి చూశాడు. దుకాణదారు వెంట తగల్లేదు! నయమే మరి! రక్షించాడు!

'ఛ ఛ! ఎందుకు వెళ్ళాలి. అటువంటి దిక్కుమాలిన షాపులోకి? డబ్బు శుద్ధ దండుగయింది తప్ప సోడా రుచీలేదు; పచీలేదు. దుకాణ దారుడు కర్కోటకపు ముండాకొడుకు! అయినకాటికి బేడ 'కా' జేశాడు; వెంట తగిలేడు!' మళ్ళీ డోకువచ్చింది. నవ్వూ వచ్చింది. ఎందుకో ఆగంకాని నవ్వు! విరగబడి పొట్టచేత్తోపట్టుకుని వెర్రిబాగుల మునూ, మాళీ మేకవంటి మానవుడు వొకటేనవ్వు!

'జాగానే తప్పించుకున్నాను కాని, అసలు 'నన్ను తగిలేయడానికి వాడికేం హక్కుంది? మీదకొచ్చాడు కాదు...రానీయవల్సింది... రానిచ్చి పదహారుపళ్లూ గవ్వల్లా రాలిపడేటట్లు ఊచిపుచ్చుకుని వొక్కటి తగిలించ వల్సింది...తప్పు పనిజేశాను ... అక్కడేవుండిపోవల్సింది!' మునూఆత్మ తిరుగుబాటు కవిత్వం అల్లుకుంటున్నది: "నువ్వేమన్నా మాలాడివా? కుష్టు రోగివా! సోడాకి అందరూ యిచ్చినట్టే నువ్వూ యిచ్చావ్ డబ్బు!...మరి

కుర్చీమీదనుంచి ఎందుకు లేచిపోయావ్...వాడు గద్దిస్తే హడిలిపోతావూ ? వెర్రివాడా ! కుర్రవాడా !"

"అవును నేను రాజులకుర్రవాడిని! హిందూవుని! కూలివాణ్ణయితేనేం? దబ్బివ్వ లేదూ ?".

మునూ తానొక అజేయమైన వ్యక్తిననుకున్నాడు. బలమైన శక్తిగల కుర్రవాడిననే భావం ఆనందమిచ్చింది. ఉద్రేకపరిచింది; నడుస్తున్నాడు. ఉద్రేకపు ఊపులో చరచర చకచక అడుగులు వడిగా వేస్తున్నాడు. గోడమీద ఎదురుగా మార్లేన్ డిట్రిచ్ బొమ్మ అర్ధనగ్నంగా మహోల్లాసంగా నవ్వుతూ కులుకుతూ కనిపించింది. ముత్యాల దండ వేసుకుని ముసిముసి నవ్వులు వొలకబోస్తున్నవనిత ఎదురుగా కాగితంలో అంటించి వుంది! విచిత్రంగావున్న ఈ బొమ్మ ఎట్నుంచి బాగా కనబడుతుందో పరికించి దగ్గరకు వెళ్ళి ఎడంపక్కకు మళ్ళీ చూపులతో బొమ్మను కొలుస్తున్నాడు. హఠాత్తుగా బయంమవే కారుధ్వని వినిపించింది. బూరాకొట్టి కారుబుర్రున పారిపోయింది. ట్రాంలు గరగర మంటున్నాయి. గంటలు గణగణ మోగుతున్నాయి. 'డేమ్‌ఫూల్!' అనే కేక వినిపించింది. తుళ్ళిపడి పక్కకు వొత్తిగిల్లాడు.

వొత్తిగిలి అటుచూశాడు. తన ప్రాణానికే మీ అపాయం రాలేదు కాని అరరె ... ఒకాయన వీపుమీద మూటవేసుకుని నడుచుకువస్తున్నాడు. వెనకాల అతని భార్య బరువైన సంచీ పట్టుకుని నడుస్తోంది. తల్లిచెంతనే యింతసేపూ వస్తున్న పిల్ల, చిన్నపిల్ల రోడ్డుమధ్యన వుండిపోయింది. తల్లీ తండ్రీ కనిపించకపోగా బిక్కమొహంపెట్టి దిక్కులు చూస్తోంది. రస్తాలో వచ్చేజనం పోయేజనం. కార్లు ; బళ్ళు ; ట్రాములు !

పేవ్‌మెంటుమీద నిలబడిపోయి హడలెత్తిపోయి తల్లిదండ్రులు పిల్లవంక చూస్తున్నారు. పిల్ల గాభరా పడుతున్నది. కారువేగంగా మీదకు వస్తోంది.

మునూ అతి సాహసి. ఒడుపుమాసి గబుక్కున దుమికి యిట్టే పిల్లను ఎత్తుకుని అవలీలగా తల్లిదండ్రులకు వప్పగించాడు. తల్లి, పిల్లను తీసుకుని రెండుచేతులూ ఎత్తి మునూకు నమస్కరించింది : "చిన్నాడివైతే అయేవు కాని ... నాయన్నాయన ! వెయ్యివేల నమస్కారాలునీకు!"

పిల్లతల్లి, తన భర్త కేసి కొరకొరచూసి "మాంచివారే! యింకాసయం! ఈ వెధవవార్ని తీసుకొచ్చారేం ?".

"ఊరుకో నోర్మూసుకుని! కుర్రదాన్నొదిలిపెట్టి యింకా పైపెచ్చు నన్నే ... మొగుణ్ణికొట్టి మొగసాల కెక్కిందిట!"

"నడిరోడ్డులో మీతో నాకెందుకు జట్టీ! నన్నక్కడొదిలేసి మీ దారిని మీరుపోతారూ? మీ ప్రాణం ఎలాటిదో యివతలవాళ్ళ ప్రాణం అలాటిది కాదేం?...ఒహ్హో ఇలాటి తండ్రివెనక బయల్దేరండిరా కుర్రాళ్ళూ!"

"ఊరుకోండమ్మా! ఊరుకోండి!" మునూ కాస్తశీవిగా హుందాగా ఆమెను శాంతించమన్నాడు. మునూ వీపునిమురుతూ ముసలాయన "తమ్ముడూ! నీ ఉపకారం మర్చిపోలేను! నువ్వే ఆపద్బాంధవుడిలా అడ్డకపోతే మాపిల్ల మాకు దక్కేదికాదు!...వెధవకార్లూ, బళ్ళూ, ట్రాములూ...దయ్యాల్లాగ!"

"బాబుగారూ! ఎక్కడకెడుతున్నారు మీరు?

"ఎక్కడకేవిఁటి బాబూ!"

"నేను కాస్తంత సామాను పట్టుకోనా?

"అక్కర్లేదులే" అంటూ ఆ వ్యక్తి మునూ చేతికి సంచి అందిచ్చాడు. ఇద్దరూ నడుస్తున్నారు.

"మీ రెక్కడ పనిచేస్తున్నారు?"

"పనిచేసే వాణ్ణి యిదివరకు...ఆర్నెల్లయింది...వీళ్ళని తీసుకొద్దాం కదా అని మా ఊరెళ్ళాను....పనులు తెమలక ఆలస్యమయింది రావడం..."

"ఎక్కడ పనిచేసేవార్రో?"

"సర్ జాన్జికైట్ కాటన్ ఫ్యాక్టరీ అని! అందులోపనీ...పొద్దున్నే లేచి ఫ్యాక్టరీకి పోతాను మళ్ళీ!...ఏంచేస్తాం బ్రదర్."

"మరి మీ కీ ఊళ్లో యిల్లులేదా?"

"సరి సరి! ఇల్లుకూడానా భయ్యా!......మనలాంటివాళ్ళ కెలా వస్తాయోయ్ యింతింతలేసి బస్తీల్లో, యిళ్ళు?...ఈ పూటకి ఘున్ని నీళ్ళు తాగేదీ...ఎక్కడో పడుకు నేదీను!...పొద్దున్నే లేచి మిల్లుకి పోతా...... తరవాత ఇంటిసంగతి? హూ హూఁ!"

"నాకూ యీ ఊరు కొత్తేనండి!"

"నాల్రోజులుంటే అదే పాత పడిపోతుంది....కూలిపని కొచ్చావా?"

"మరేనండి! పెద్దబస్తీకదా దొరక్కపోతుందా?...దేవుళ్ళా మీరు తారసపడ్డారు."

"అలాగే...పొద్దున్నే నా వెంటరా! మేస్త్రీకి చూపిస్తాను! నీకో పని ఎలాగా దొరుకుతుంది! అక్కడే చిన్నగుడిశ దొరుకుతుంది! మాతో పాటు నువ్వూ వుందువుగాని!"

మునూ ఆనందానికి మేరలేదు. ఎంతో ఆసక్తి కనబరుస్తూ యింత కాలం అందుకే వేచివున్నట్లు "వస్తానండి! వస్తాను."

విదేశవ్యాపారస్థుల యిళ్లు ఒకే 'వాసు'లో వున్నాయి. ఇళ్ళ వరసలు దాటి మేడలనీడలు చూసుకొంటూ ఆటస్థలంవైపుకు మళ్ళారు. మునూ వొక భుజంమీద ఒకపిల్లను, యింకొక భుజంమీద పిల్లణ్ణి ఎక్కించుకుని ఛంగుఛంగున వాట్లువేస్తున్నాడు. తనువిన్న రామాయణకథ జ్ఞప్తికి వచ్చింది. రాముణ్ణీ, సీతనూ చెరొక భుజంమీదనూ వేసుకొని వీరహనుమంతుడు లంకనుంచి అయోధ్యకు ఆకాశమార్గంలో ఎగిరిపోయాడుట! ఇప్పుడిక తను ఏకాకిగాదు; తోడు దొరికింది.

ముసలాయనకేసి వెళ్ళి అతనితో కత్తుకలిపాడు. "అన్నా! నీపేరేమిటో చెప్పావ్ కావు?"

"నాపేరా? హరిహరుడు బ్రదర్! కాని అంతా హరిఅనే పిలుస్తారు!" ముసలతనుఆగి మొహానికిపట్టిన చెమటను తుడుచుకున్నాడు. నుదురుపెద్దది. మీసాలు పచ్చికదుబ్బులకుమల్లే దట్టంగా పెరిగాయి. మాట డింపుకుని కాస్సేపు సేద తీర్చుకుని వేడివేడిగాలినోటమ్మట విడిచిపెట్టాడు.

"ఇంకా మనం ఎంతదూరం వెళ్ళాలో?" ముసలివాని అలసటచూసి జాలిపడుతున్న కంఠంతో మునూ ప్రశ్నించాడు. మునూ భుజాలమీద పిల్లలిద్దరూ కునుకుతున్నారు.

"అట్టేదూరం లేదులే! వచ్చేశాం! ఛండీబజారు దాటేశామా, చాపతి వచ్చేనేమే అనుకో!"

ముసలతను వెనకబడుతున్న భార్యకేసి తిరిగి "కూవోవే! కాస్సేపు!"

ఎడంచేత్తో చిన్న ట్రంకుపట్టుకుని భార్య వస్తోంది. మగని కేకవిని సిగ్గుపడినట్లు మేలిముసుగు సవరించుకుని నాలుగడుగులు తొందరగా వేసి భర్తను కలిసింది.

"అప్పుడే సాయంత్రం పడుతోందే! చప్పున పోదాం! కుర్రాళ్లు నిద్రోతున్నారు భుజంమీద!"

"నడు, బ్రదర్, నడు! చీకటిపడితే భగవంతుడే వున్నాడు! అడ్డు దార్ని పోదాం. పద!".

గబగబ అడ్డుదారిని దిగి చిన్నసందులోకి వచ్చారు. సందు దాటేరు. ఇళ్ళు వొకదానిమీద వొకటి క్రిక్కిరిసి ఇటికాంలోని ఇటుకలవలె పేర్చి వున్నాయి. తెరిచిన కిటికీలలో సాయంకాలపు ఎండపడుతోంది. చిన్న చిన్న షాపులు. బాల్కనీలమీద మనుష్యులు. ఒకజాతి కాదు; ఒక రకం కాదు. వివిధ జాతుల వింతవింత దుస్తుల మనుష్యులు.

'దౌలత్‌పూర్‌కూ దీనికీ ఆట్టే తేడాలేదు. ఇది మరీ కంగారుగావుంది! అంతే!' అనుకున్నాడు మునూ. భుజాన జారిపోతోన్న పిల్లల్ని కుదిపి సర్దుకున్నాడు. నారింజపండు, వంగపండు, ఆకాశపురంగు బంగారు జలతారు చీరెలూ, లంగాలూ, గౌన్లూ వేసుకున్న ఆడవాళ్లూ, సూట్లూ, పంచెలూ, యిజార్లూ, నిక్కర్లూ తొడుక్కున్న మగవాళ్ళూ అలంకరించుకొని అందాలొలకబోస్తూ నెమళ్ళలాగ, వయ్యారంగా కోడిపుంజులలాగ వీధులలో వెడుతున్నారు. ఈసారి మునూ ఈ గుంపుకేసి చూడలేదు. ఇంగ్లీషువాళ్లూ పార్శీలూ, సిక్కులూ, ముస్లింలూ, హిందువులు, అరబ్బులూ, యూదులూ అంతా వాడి కంటికి ఒకలాగే మామూలుగానే కనిపిస్తున్నారు.

రోడ్డు మొగలో యిళ్ళల్లో, షాపుల్లో ఒక్కసారి గుప్పున లైట్లు వెలిగాయి. విద్యుద్దీపాల కాంతికి వీధంతా మెరిసిపోతోంది. ఎర్రని నీలి, ఆకు పచ్చని బల్బులు రంగు రంగుల కాంతిని వీధుల్లోకి చిమ్ముతున్నాయి. పేవ్‌మెంటుమీద తనతోపాటు మనుష్యులు చాలామంది నడుస్తున్నారు. భుజాలమీద పిల్లకాయలు గుడ్లగూబల్లా చూస్తూ కూచున్నారు. బల్బుల కాంతికి మునూ మనస్సు ఉల్లాసమైంది. ఆడవాళ్ళు, మగవాళ్లు షాపులముందు నుంచుని బేరా లాడుతున్నారు. నెత్తురు ఉడికింది. చైతన్యం వికసించింది.

షాపులు కన్ను చెదరగొడుతున్నాయి. బొమ్మలు, బహుచక్కని రబ్బరుబొమ్మలు. గాజుసామాను, షాపుల్లో తీరుతీరులుగా పేర్చివున్నాయి. మామిడిపళ్లు చేతిపట్టుకు దొరకనంత పెద్దపెద్ద మామిడిపండ్లు, లైట్లవెలుగులో మిసమిసలాడుతూ దోరగా తీపితీపిగా పచ్చగా ఎర్రగా బేరగాళ్ళ నోరు ఊరిస్తున్నాయి. తానిదివరకు తనఊళ్ళో తోటల్లో చెట్లుఎక్కి తెంపిన పళ్ళ కంటె, దౌలత్‌పూరులో ఫ్యాక్టరీలో గుమ్మరించిన పండ్లకన్న ఈ మామిడి

ఫలాలు పెద్దవి ! గుమగుమ మంటున్నాయి. గుమ్మగావున్నాయి. 'డజనెంత ఖరీదో !'

'కొంచెం తగ్గించవోయ్ !'

'యింకోమాట చెప్పు !'

బేరగాళ్ళు మామిడిపళ్లు పట్టుకొని చేతులతో ఎగరేస్తూ పిసుకుతూ ముక్కుదగ్గర పెట్టుకొని వాసనచూస్తూ కళ్ళతో నవ్వుతూ కొనలేక మాన లేక దుకాణాలచెంతనే నిలబడ్డారు. బుట్టలతో పళ్ళుపట్టుకొని మరికొందరు యిళ్ళకు వెళ్ళిపోతున్నారు, మునూ కాయకేసేచూస్తూ ఊటలూరుతున్న నోరును కట్టుకుని ముందుకు సాగిపోతున్నాడు.

పక్షవాతంవచ్చింది కాబోలును చేతులువణుకుతున్నాయి. మనిషి అస్థిపంజరమల్లేవున్నాడు. కళ్ళు లోతుకు పీక్కుపోయివున్నాయి. డేకుతూ పేవ్‌మెంటుమీద పోయే మనుష్యులను దీనంగా అడుక్కుంటున్నాడు: "బాబూ! వొక్క రాగిపైసా ! ఆకలిబాబూ!"

పక్షవాతంవాడు డేకుతూ షాపుముంగుకు వెళ్ళాడు. ముందువేసిన గోనె, పందిరకున్న వెదురుకర్ర ఊడలాగి షాపు యజమాని "ఫో ! ఫో ! కుక్కలకొడకా !" అని తరిమి తరిమి కొట్టేడు. డేకుతూ బిచ్చగాడు వొకటే విసురు !

బట్టల షాపులో తీరుబడిగా కూచుని చప్పట్లు చరుస్తూ దోమల్ని చంపుకుంటూ కాలక్షేపంచేస్తోన్న షాపువాడు ఎదురుగా కుప్పగా కూలబడి అడుక్కుంటున్న బిచ్చగాణ్ణి "పోరా! పో!" అని గదిమేడు. ఈ ఊళ్ళోనూ బిచ్చగాళ్ళే! తాటిపీచులావున్న జుత్తు. అట్టకట్టుకుపోయి వికారంగావున్న జుత్తు. నల్లటి మనిషి. ఓ చేత్తో కర్రపట్టుకుని యింకోపక్క కూతురు భుజాలపై ఆనుకుని 'కళ్ళులేని కబోదిని బాబయ్యా! చేసినధర్మం ఊరికేపోదు!' అంటూ షాపుముందు నించున్నాడు. అంధుడు కేకలుపెడుతున్నాడు. అతని కూతురు పాపం నీరసించిపోయింది. కళ్ళు పాడుపడిన నూతుల్లాగవున్నాయి. రెండుచేతులనూ ఎత్తి నమస్కరించింది. ఇక్కడసైతం కాళ్ళూ కళ్ళూలేని కబోదులే! తిండికి యీ ఊళ్ళోనూ కరువే! బిచ్చగాళ్ళు యిక్కడకూడా వున్నారే !.

"బొంబాయి వీధుల్లో డబ్బు డబ్బు ... యిట్టేదొరుకుతుందన్నాడే! ఎక్కడచూసినా రూపాయలే అన్నాడే తన నేస్తం!" ఆశ్చర్యం, భయం, అల

సట గలిగాయి. ఆకాశం కేసి చూశాడు. నీలి ఆకాశం తెల్లని నక్షత్రాలతో ధగధగ మెరుస్తోంది.

మునూ రెండడుగులు వేస్తుంటే హరి పదిఅడుగులు వేస్తున్నాడు. ముందు పోతున్న హరిని కలియాలనే ఆతృతతో మునూ అడుగులు తొందరగ వేశాడు.

"త్వరగాపోదాం. ఉక్కపోస్తోంది" అన్నాడు మునూ. ముసలి హరికి తనభార్య చటుక్కన జ్ఞాపకంవచ్చి కుర్రాళ్ళని చూపిస్తూ "వీళ్ళ అమ్మేదీ?" అని ప్రశ్నించాడు. తనవెంట భార్యవస్తున్నదో లేదో యింతసేపూ మర్చి పోయాడు. మునూకి అంతకంటె జ్ఞాపకం లేదు.

ఇద్దరూ వెనక్కితిరిగి చూశారు. భార్య కనుచూపుమేరలోకూడా కనిపించలేదు. గాభరా ఎత్తేడు. నిలువునా వణకిపోయాడు. జనాన్ని తోసు కుంటూ విసురుగా వెనక్కి పరుగెత్తి వెదుకుతూ నిలబడ్డాడు.

అతనిభార్య దుకాణంచెంత నిలబడి అరటిపళ్లఅత్తం బేరమాడు తోంది. "బాగానేవుంది నీ వరస? ఇది మనూరనుకున్నావా, తప్పిపోతే యింటికి పోడానికి?

"ఏవిటండీ ఆ దూకుడు? నాకు తెలీ కడుగుతా; రాత్రి పస్తు పడుకోనేదా? తిండానికి అరిటిపళ్ళు కొంటున్నా ఆటొస్తాయికదాని!"

"ఏడిశావ్ లే! పద! పద!"

"పళ్ళిక్కడ చవకా! రోజూ యిక్కడికే వస్తా."

"మొదటి దానికి మొగుల్లేడు, కడదానికి కల్యాణం! ఇంకా ఇక్కడ యిల్లూ వాకిలీ లేదు; సంసారం అప్పుడే నీకు!"

మునూ వాళ్ళిద్దరికోసం ఆగిపోయాడు. ఇంతలోనే రోడ్డుమీద యిద్దరు రిక్షావాళ్లు కుమ్ములాడుకుంటున్నారు. "చూసుకుని తోల్లేవ్?"

"నువ్వు తప్పుకోలేవ్?".

దారిలో రెండుబళ్ళ మధ్య పార్సీయువతులు చిక్కుకున్నారు. తప్పించుకుని ఎలాగో బయటపడ్డారు. 'నువ్వుకారణమంటే నువ్వుకారణమని' బళ్ళవాళ్ళు జుత్తూ జుత్తూ పట్టుకున్నారు. మాటకు మాటా పెరిగింది. శిగపట్లు గోత్రంవరకూ వచ్చింది.

ముసిలాడూ, అతని భార్యా గబగబ ఉరకలమీద వచ్చేశారు. వీధి శృంగారంగా అలంకరించివుంది. వీధి చివరున సినీమాహాలు గుత్తుగుత్తుల రంగురంగుల దీపాలతో ప్రకాశిస్తోంది. అతని భార్య తొందరగా అడుగులు వేస్తోంది. రోడ్డుకు ఎడమపక్క గాజులదుకాణం చూసింది. గాజుల మలారం చూసేసరికి ఆడదాని కోరిక లిక ఆగేవికావు. చిన్నచిన్న పాత్ర సామాను, దంతపు బొమ్మలు, బొగ్గులకుంపటీ, అట్లకాడలూ ఒకటేమిటి, అన్నీ కొనా లనిపించిందామెకు !

"వంటుగిన్నెలు లేవు ! అట్లకాడ బాగుంది !" "ఇంకా యిక్కడ మనువు స్థిరపడందే ! స్థిరపడ్డాక కొందువుగాన్లే !"

వీధిలో పెద్దపెద్ద భవంతులు, భవంతుల ముందు లతల పందిళ్లు ... ఘుమఘుమ వాసనలు.

బజారు దాటి వీధిలోకివచ్చేరు. వీధినిండా కలకలలాడే మేడలే! గొప్ప వారిలోగిళ్ళు ! భవనాలు !

"ఇక్కడ మన మీ రాత్రి పడుకోవచ్చేమో ?" సందేహంతోనే ప్రశ్నించాడు మునూ.

కూడదు కూడదు అన్నట్లు తల ఊపి హరి "ఇవి డబ్బున్న మారాజుల ఇళ్లు. రాత్రి క్కిక్కడ రోజూ దొంగతనాలే ! మనం పడుకుంటే తెల్లారేసరికి శ్రీ కృష్ణజన్మస్థానంలో వుంటాం...."

"అయితే ఎక్కడికిపోదాం ?"

"మనలాంటి నిరుపేదలకి వున్నాయిగా ! షాపులు మూసేశాక అరుగుల మీద నిద్రపోదాం !"

ఇరవై అలసినఅడుగులు...వేసి హరి హఠాత్తుగా ఆగిపోయాడు. కుడి పక్కకు పోవాలో ఎడంసందుకు మళ్ళాలో మనసుకు తోచలేదు. దారి తికమకగావుంది. మునూ తన భుజాలమీద కునుకుపాట్లుపడుతున్న పిల్లల్ని మూటలు దింపినట్లు కిందకు దింపేడు. హరి కాస్సేపాగి ఒక్క దూకుదూకి పిచ్చివాడిలా ఎడంపక్క సందులోకి మళ్లి చిక్కని చీకట్లలో అంతర్థాన మయాడు ...

కుర్రవాళ్ళు ఏడుస్తున్నారు. తల్లి మేలిముసుగు సవరించుకుంటూ వెనక నించుంది. హరి ఎక్కడకు పోయాడో ! మునూ పిలిచాడు. హరి 'హరీ లేదు అచ్యుతా' లేదు !

సినీమాహాలుమీద దీపాలతోరణాలు కాంతులను ప్రసరిస్తున్నాయి! పూవులగుత్తులవంటి దీపాలు కళ్ళముందు మెరుస్తున్నాయి. ఆహ్లాదంగా వుంది కాని ముసలి హరి ఎక్కడకు పోయినట్టు ...

చీకటిలోంచి వెలుతురులావచ్చి హరి ఎదుట నిలబడ్డాడు. "ఏం అన్నా ! దారి మర్చిపోయావా ?"

"అహాహాఁ లేదు లేదు ! ... దిక్కుమాలింది లేటయిపోయిందోయ్ భయ్యా !"

"జాగా దొరకదా ?"

"ఏం దొరికేటట్టుంది! చూశావా సందంతా! అప్పుడే ఈళ్ళా మనుషులు ముసురుతూంటేనే !"

"మరెక్కడికిపోదాం అన్నా ?"

"మళ్ళీ వెనక్కి ... బజార్లోకి ... మాటుమశిగిందాకా వుండడం ... చాపచుట్టలా పడుకోడం! పాపులేగతిరా బాబూ! పాపులేగతి, మనరాత !"

"మళ్ళీ అంతదూరం వెనక్కి ఎవడెడతాడన్నయ్యా ?" మునూ పిల్లల్ని భుజాన వేసుకున్నాడు. "అక్కడే కాస్తంత చోటు దొరక్కపోదు! ఈరాత్రి ఎలాగో గడిపేద్దాం !"

వీధిలో అప్పుడప్పుడు దీపాలకాంతిం యిళ్ళకిటికీల్లోంచి పడుతోంది. వీధులపక్క అరుగులమీద కూలివాళ్ళు బిచ్చగాళ్ళు వొకళ్ళమీద వొకళ్ళు పడుతూ ముడుచుకుని కొందరూ, వెల్లకిలా బోర్లా మరికొందరూ పడుకున్నారు. బిచ్చగాడొకడు అరుగు మూల కిటికీకింద నక్కినక్కి కూమని చిలుం పీలుస్తున్నాడు! నిప్పు రవ్వలు గాలికి కొంచెం మీదకు లేస్తున్నాయి. గుప్పు గుప్పున పొగ వదుల్తున్నాడు. చిక్కుపడ్డ చేంతాడు ముళ్ళలాగ పడుకున్న కూలిజనం! గుండెలమీద చేతులు వేసుకుని, తలకింద చేతులు తలగడలా పెట్టుకుని, మోకాళ్ళకి వేసుకొని ముడతలుగా ముడతలుగా శరీరాన్ని కాగితంలా చుట్టుకుని బుసలుకొడుతూ, దోమల్ని తిట్టుకుంటూ 'అమ్మయ్య ఉస్స" మంటూ నిద్రపట్టక అటు యిటు దొర్లుతున్న కూలిజనం! పేదజనం! బిచ్చగాళ్ళ సమూహం!

"మనం కాస్తమేర వెళ్ళామా జాగా దొరక్కపోదు!" సముద్రం గాలి రివ్వున వచ్చి పాము నాలుకతో మునూ శరీరాన్ని తాకింది; కిత కితలు పెట్టింది. చల్లని తడిగాలి ! ప్రాణం లేచివచ్చింది. అమ్మయ్య !

మునూ అతధైర్యంగా ముందు నడుస్తున్నాడు. హారీ, అతని భార్యా వెనక వస్తున్నారు. తేలుకుట్టినట్లు భయం గుండెల్లో పొడిచింది. కుష్టువాడు దారిలో కాళ్లూ చేతులూ చాపుకుని కట్టుకట్టిన కురుపుల్ని భరించలేక అరుస్తున్నాడు. చీకట్లో వాడిమీద పడి పక్కకు వొత్తిగిల్లేడు మునూ.

మునూకు చికాకువేసింది. కోపంపుట్టుకొచ్చింది. పక్కకు మళ్ళినకొద్దీ మనుష్యులే! బిచ్చగత్తె ఒకతె పడుకున్న తన పిల్లను దగ్గరకు గుండెల కదుముకుని మూలుగుతోంది. 'మూలుగులు కావురా బాబూ మూలుకులు!' గుండెలకు పిల్లను అదుముకుని రొమ్ముల్లోలేని పాలను చంటిదాని నోటి కందిస్తూంటే బిడ్డ చనుకట్లను పీకుతోంది. నోటికి పాలందడం లేదు. కుర్రది కింక పెట్టింది. అప్పుడే యీనిన ఆడపులిలా చూస్తూ బిచ్చగత్తె కుర్రదాని వీపుమీద చరిచి గుండెల కింకా దగ్గర కదుముకుంది.

మునూ సిగ్గుపడిపోయి వొళ్ళు చచ్చినంతపనయి వణకుతున్న పెదవులపై నీరసంగా నవ్వుతూ దవడలను చాపి "ఏమి టిదంతా అన్నా?"

"నువ్వు నా వెంటరా. ముందు వెళ్లకు. నీకీ వూరుకొత్త!...మనుష్యుల మీద పడితే జట్టీ లొస్తాయ్! ఎందుకొచ్చిన గొడవ!"

తను పక్కకు వొత్తిగిలి హారికి చోటు యిచ్చాడు. ముసలతను ముందు దారి తీస్తున్నాడు. భుజాలమీదవున్న పిల్లలు పడిపోకుండాను కాసుకుంటూ చూసుకుని చూసుకుని మరీ అడుగులు వేస్తున్నాడు మునూ. చిమ్మ చీకటి. కళ్ళు పొడుచుకున్నా కనిపించని చీకటి. హారి భార్య యింకా ముసుగును తలమీదనే వుంచుకుంది. కళ్ల కడ్డంపడుతున్న ముసుగులోంచి దారేం కనిపిస్తుంది? ఆలోచిస్తున్నకొద్దీ మునూకి ఆశ్చర్యంగానేవుంది. ఆవిడ దగ్గరి కెళ్ళి "ముసుగుతీసేవమ్మా తల్లీ!" అందా మనుకున్నాడు. కాని ఆ పిల్ల చిన్నది. ఇరవైయేళ్ళయినా నిండని వయస్సు. చిన్నపిల్లతో మాట్లాడం మొహమ్మాటం! ఏమంటే ఆపిల్లకే హారికున్న వయస్సుంటే, మొహమ్మాటంగిహంమ్మాటం నహీ!

"అయినా అడిగేద్దాం; మనసులోమాట చెప్పేద్దాం!" అనుకుని ఆమె వస్తున్న దారివంక చూశాడు. ఆ లోపునే "అమ్మోయ్ బాబోయ్"మనే గోల వినవచ్చింది. వీధిలో ఒక యింటి అరుగుమీదనుంచి యిద్దరు కూలీలు దొర్లుతూ మెట్లమీదనించి కిందపడ్డారు. ఇంటి కాపలావాడు అరుగుమీద కూచున్న కూలీలను డొక్కలో ఒక్కతాపుతన్ని కుక్కపిల్లను తోసినట్లు మెట్లమీదికి

తోసేశాడు. ఇద్దరూ గిరగిర రింగులుతిరుగుతూ దొర్లు పుచ్చకాయల్లా దొర్లారు. "దొంగ లంజాకొడకల్లారా! వొడుపుచూసి యిళ్ళల్లో దూరుదురు గాని...తొత్తుకొడకల్లారా!"

ఇతర కూలీలు తిట్టుకున్నారు; లోలోన నసుగుతున్నారు. నిట్టూర్చారు. అరుగుమీదవున్న మూలమూలల పడుకున్న కూలీలు బిలబిల లేచి కిందకు దిగిపోయారు. "ఎందుకొచ్చిన తిప్పలు! దుష్టుడికి దూరంగావుండమని ఊరకే నే చెప్పలేదు పెద్దలు."

"ఇంకిక్కడొద్దు! పద! రోడ్డువార కాస్త జాగా దొరక్కపోదు!" మునూ బిగిలిపోయి గుడ్లు మిటకరిస్తూ నిలబడ్డాడు. హరి అతన్ని వెంటబెట్టుకుని ముందుకు తోవ తీశాడు. పేవ్ మెంటుమీద చిందర వందరగా పడేసిన పుల్లలలాగ కూలీలు పడుకుని అటూ యిటూ దొర్లుతూ కాళ్ళాడిస్తూ 'హరే రాం హరే రామ'ని భగవంతుణ్ణి ధ్యానిస్తూ, మధ్య మధ్య లేస్తూ వొకరితో వొకరు ఊసులాడుకుంటూ సందడిగానే వున్నారు. ఈ కూలీలు చాలా బలహీనులు. వీళ్ళ వొంట్లో శక్తిలేదు. తను దౌలత్ పూర్ లో చూసిన కూలీలు, కొండవాళ్ళు. కాశ్మీరు ప్రజలు, దృఢకాయులు. ఉఫ్ న ఊదేస్తే ఎగిరిపోయేటట్టు చీపురుపుల్లలా పాపం ఈ కూలీలు ఎన్ని అవస్థలు పడుతున్నారు! వీళ్ళకు గస్తీవాళ్ళంటే ఎంత భయమో! ... ఆనాడు దౌలత్ పూర్ లో కూరల మార్కెట్టులో సంచులమీద పడుకున్నపుడు చౌకీదారు చూస్తాడేమోనని తానూ భయపడ్డాడు!

రోడ్డు కవతలపక్క జోళ్ళషాపు కట్టేస్తున్నారు. జోళ్ళస్టాండు తీసి కొట్లోని కుర్రాడు లోపల పెడుతున్నాడు. తలుపులు భడేలుమనిన వేస్తున్న చప్పుడయింది.

మునూ హరివెంట అడుగులు వేస్తున్నాడు. దారిలో జోళ్ళషాపు ముందు ఒక ఆడది కూచుని తల రెండు చేతులతోనూ మొత్తుకుంటున్నది.

"నా మారాజు నా క్కాకుండా పోయాడర్రో! దిక్కుమాలినదాన్ని చేసేసి తనదార్న తాను..."

"మంచిపని చేశాడు! పీడ వొదిలించుకున్నాడు!" అన్నాడు హరి.

"నాయనా! అక్కడే, ఆ మూలనే, నా మారాజు, చచ్చిపోయాడు బాబూ!"

"మరేం భయంలేదు ! దయ్యాలై మమ్మల్ని పట్టుకోదులే !"

మరణం, దయ్యం అనే మాటలు మునూ చెవికి సోకగానే ఒకవిధమైన భావం అతనికి జనించింది. దౌలత్‌పూర్‌లో పటాలమ్మ కొట్టులో యముడి చిత్తరువును మునూ కళ్లారా చూశాడు. అది ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది. యముడు, నరకం, మృత్యుపాశం, వైతరిణి, చిత్రగుప్తుడు, నరకంలో పాపాత్ములను నానా హింసలూ పెట్టడం! అతని నరాలలో రక్తం ఆవిరులుగా యిగిరిపోనారంభించింది. భుజాలమీద కూచున్న పిల్లలవేడి బుగ్గలు తన బుగ్గలను తాకుతున్నాయి. మునూ మనస్సు కనిపెట్టినవాడిలాగ హరి ధైర్యం చెప్పేడు.

"మనకి దయ్యం గియ్యం జాన్తానై"

ఆ మూలను తనభర్త చనిపోయేడని అక్కడ దయ్యాలు కాపురమున్నాయని అపరిచిత స్త్రీ చెబుతున్న మాటలను హరి భార్య వినలేదు. వింటే ఆమూలకు భర్తను వెళ్ళనిచ్చేదికాదు. ఆమె బరువును మోయలేక వెనకబడింది. భర్త ముందుకు పోతున్నాడు.

భుజాలనున్న మూటా ముల్లె కిందపెట్టి "రా! లక్ష్మి! ఇక్కడ కాస్త జాగా దొరికింది" అన్నాడు హరి. "లక్ష్మి యిక్కడ పడుకుంటుంది. మనం పేవ్‌మెంటుమీద నిద్రపోదాం ... యింకా దింపుకోలేదూ? ... దింపు పిల్లల్ని ... పాపం!" మునూ వీపు నిమిరి ఆనందంతో తట్టి హరి అక్కడే నించున్నాడు. "పిల్లలు వాళ్ళమ్మదగ్గరే పడుకుంటార్లె!"

లక్ష్మి పరుపుచుట్ట విప్పింది. మునూ పిల్లల్ని దానిమీద కుదేశాడు. గోడపక్క పేవ్‌మెంటుకు కొద్దిదూరంలో హరితోపాటు తనూ చతికిలబడ్డాడు. కాంక్రీటుగోడ మధ్యాహ్నంకాసిన ఎండను వేడివేడిగా వదులుతున్నది. గోడకు చేరగిలపడి మునూ పేవ్‌మెంటుకేసి నిఘాగా చూశాడు. పేవ్‌మెంటుమీద మనుష్యులు పడుకున్నారు: "ఈ దురవస్థలకి వీళ్ళు అలవాటుపడిపోయారు! నాకు కొత్త. పాతబడితే నాకూ కష్టమనిపించదు."

దక్షిణదిశను ఆకాశం, గుడిశ కొంజావలె నేలమీదకు వాలివుంది. చిమ్మచీకటి ఆకాశంలో; మిణుగురులవలె మెరుస్తున్న నక్షత్రాలతో వాతావరణం గంభీరంగా భయంకరంగా నిశ్చలంగావుంది. గాలికూడా వేయడంలేదు. ఆకులు అల్లల్లాడ్డంలేదు. ఎత్తయిన భవనాల అరుగులమీద వీధిపక్క

కూలీలు చీమల్లా పడుకున్నారు. ఊపిరిసైతం వినబడనంత నిశ్శబ్దం. అంతా చచ్చిపోయినట్టు చలనంలేని వాతావరణం!

తాను ఏకాకినన్నే విషయం మళ్ళీ స్ఫురించింది...ఆకులు అల్లల్లాడాయి. వేడి గాలి నిట్టూర్చింది. గాలితో పాటు నేతివాసన, జబ్బుమనిషి వాసన కొట్టుకొచ్చింది. కుళ్ళిపోయిన పళ్లు కంపుకొడుతున్నాయి. చేపలవాసన! మురికీ... మూర్ఛవస్తున్నట్లుంది.

కంపుకొడుతున్న దిక్కుకేసి చూశాడు. సన్ననిగాలి. మెల్లని స్వరం. తుంచుకుపోతున్న మూలుగు. ఇవే వినిపించాయి. దుప్పటిలో చుట్టుకునివున్న వొక శవం, శవమే కాబోలును పడివున్నట్లు కనిపించింది!...మునూ మరివొక పక్కకు తలతిప్పేడు. యమబాధపడుతూ వొడ్డునపడివున్న చేపవలె ఒక కూలీ గిలగిల కొట్టుకుంటున్నాడు. అబ్బ! ఎందుకా గిలగిల, ఆ మూలుగులు!

గబుక్కున కళ్ళు మూసుకుని మెడలు యిటు తిప్పేసుకుని కళ్ళు మెల్లగా తెరిచాడు. మళ్ళీ యిందాకటి ఆడది మోకాళ్ళమీద తల దించుకుని అనంతమైన బాధలలో యీదలేక కొట్టుకుంటున్న ప్రాణిలాగ నీళ్ళు మింగుతున్నట్టు గొంతుక నీళ్ళల్లో మునిగిపోయినట్టు మూలుగుతూ, అరుస్తూ ఏడుస్తోంది. ప్లేట్ ఫారంమీద అంతా కూలీలే! ఎందరో బిచ్చగాళ్ళు! రాత్రి మరణించి, పగలు బతికే ఎవరిపనుల్లోకి వాళ్ళు పోతారుకాబోల్సు!

హరి తన ఎడంపక్కను నక్కలాగ గొంతుకపడి కూచున్నాడు. స్త్రీ ఏడుస్తోంది. కూలీలు అటూ ఇటూ ఆపశోపాలు పడుతూ దొర్లుతున్నారు. మునూను ఎందుకో చెప్పలేనంత భయం ఆవరించి తనకు తెలియకుండానే మనస్సును ఆవహించింది. మరణించిన జీవుళ్ళు దయ్యాలై మనుష్యుల్ని పీడిస్తాయని విన్నాడు. దయ్యాలు మూలుగుతున్నట్టు ఎర్రని నెత్తురుకనులను తెరచుకుని భయపెడుతున్నట్టు, పళ్ళుపటపట కొరుకుతున్నట్లు, నిశ్శబ్దంలో వికటాట్టహాసం చేస్తున్నట్లు మనసు పిరికిపారింది. ఇవి దయ్యాలుకాదు. కూలీలు! ఈ మూలుగులూ, రోదనలు, గిలగిలలు, దిక్కూమొక్కూలేని కూలీలవి! పాపం! తన వలె వీళ్ళూ గాలికి పుట్టేరు; ధూళికి పెరుగుతున్నారు!

మౌనంగా మాటమాట్లాడకుండా, మళ్ళీ అటుచూడకుండా కాళ్లు చాపుకుని, శరీరాన్ని ముడుచుకుని, కళ్ళు మూతలు పడుతుంటే, వీళ్లంతా దయ్యాలు కాగనుకుని, తన వలెనే మానవులే ననుకుని, ఒక నిట్టూర్పు విడిచి కటిక నేలమీద మునూ అలానే వొరిగిపోయాడు. "వీళ్ళూ నాలాగే కూలిపని

కోసం వచ్చివుంటారు. రైళ్ళమీద నాలాగే డబ్బూ దస్కం యివ్వకుండా వచ్చారా ? లేక టిక్కెట్టు కొనే వచ్చారా?... అరరెరె ! మావటివాడు ఈ పాటికి సముద్రంమీద ఓడలో...ఎంతమంచి మావటి!... ప్రభు దయాలో ! అంత మంచివాడు మళ్ళీ దొరుకుతాడూ?..."

మనూ భావాలు దొంతరలు దొంతరలుగ ఎన్నెన్నో ! "మావటివాడూ ప్రభూ మహాఁ మంచివాళ్ళు...రేపు నా వుద్యోగం దొరుకుతుందని వాళ్ళకి తెలిస్తే ఎంత సంతోషిద్దురోకదా ! ఇన్నోటిమందితో నేను స్నేహం చేస్తున్నందుకు వాళ్లెంత ఆనందించేవారో మరి ! ......నేను ధైర్యవంతుణ్ణని వాళ్ళకి తెలుసున్లే...నీ కేం భయంలేదు; బతికేస్తావ్ ! భయంలేగు! అన్నారు కదూ వాళ్ళు !...అవునూ...నేను చేయలేని పనేమి టీలోకంలో !"

అతనికీ భావం ఉదయించీ ఉదయించగనే ఒక ప్రశ్న బయలుదేరింది. "అహాహాఁ! మాటసంగతికే అనుకుందాం ... మరీ ... లోకంలో అందరూ గణపతిలాగే, నన్ను కొట్టిన పోలీసువాళ్ళాగే, యిందాకా తగిలేసిన పర్వత్తు కొట్టువాళ్ళాగే వుంటే ... లోకం అంత చెడ్డదంటావా ?... హరి ఏమంటాడో! విచిత్రం! అతని కథ రేపు అడుగుతాను. ... అదేమిటది హరి భార్య ... మొఖాని కా ముసుగు ! ఆపిల్ల ఎలా వుంటుందో ... రేపు చూద్దాంగా !"

ఒకభావం వెనక యింకొకటి ఏడతెరిపిలేని వాగులాగ ప్రవహిస్తూ మనిషిని కవ్విస్తున్నాయి. నిద్రపట్టనీయవు. స్థిమితంగా కూచోనీయవు. "నిద్రకూడా కరువైపోయిందే!" రా, తల్లీ, నిద్రా ! నువ్వైనా, రా !

జ్వరంవచ్చినట్లుంది వొళ్ళు. బలవంతంగా గట్టిగా కళ్ళుమూసుకున్నాడు. ఏవో ఆందోళన, చెప్పలేని ఆవేదన, అవ్యక్త అనుభూతులు మనిషిని నిలువునా కలవరపరుస్తున్నాయి. కంపరమెత్తిస్తున్నాయి. ఒక్కొక్క భావమూ చాకుల వలె మెదడులో మసలి తలను రెండు చెక్కలుగా ముక్క ముక్కలుగా తరుగుతున్నాయా, అనిపించింది ! మనసులోనే కలవరపడుతూ, కలత పడుతూ "నిద్ర ! నిద్రైనా రాదూ !" అని మాటి మాటికీ బాధపడుతున్నాడు. అతను అలసిపోయాడు. శరీరం, కళ్ళూ నీరసపడిపోయి, నిద్రకూడా చేరనంత అలసట, నీరసం అతన్ని ఆవరించాయి. శరీరం వణకింది. చెమటలు పోసింది. నోటితో గాలి పీల్చాడు. ఎగశ్వాస వచ్చింది. అటు తిరిగాడు; ఇటు తిరిగాడు. నిద్ర రాలేదు ... నిద్రపోతూ గుర్రులు పెడు

తున్న హరి శరీరం శవంవలె కనిపించింది. పేవ్ మెంటు మీద ఏ భంగిమలో శరీరాన్ని చేరవేస్తే నిద్ర వస్తుందో హరికి తెలుసన్లే వుంది...అతను పడు తున్నట్టు...సరిగ్గా అదే పద్ధతిలో శరీరాన్ని ముడుచుకుని కాస్సేపు ప్రమాశాడు. ఎంతసేపైనా నిద్రమాత్రం పట్టిందికాదు...కళ్ళు మూసుకున్నాడు. మూసు కున్న కళ్ళముందు ఎర్రని తెరమీద ముసుగుతో ఏదో తల, లక్కబొమ్మవలె మసలింది! కళ్ళు తెరిచాడు. ఊహుఁ! లాభం శూన్యం.

చటుక్కున లేద్దామనుకున్నాడు. లేచి దూరంగా ఎక్కడికో అక్క డికి, ఎవరూ లేనిచోటికి ఊరవతల చెట్లక్రింద ఏకాకిగా...పోదామను కున్నాడు. ఖైదు కొట్లలావున్న యీ వీధులు, సందులు, ఇళ్ళు, రోడ్లు వీటి బయటపడితే కాస్తంత ఊపిరి, పిసరంత గాలి! పోనీ కొసరినట్లు చెట్ల ఆకులు గలగల్లాడతాయి!

రాతిమీదనే పడుకుని పక్కలను మోపాడేమో ఎముకలు యిరుకుపట్టి ప్రాణం గిలగిలకొట్టుకుంది. బోర్లాపడుకుంటే గుండెల్లో నొప్పి. వెల్లకిలా పడు కుంటే వెన్నుపూస బెణికింది. అటూఇటూ దొర్లాడు. తొడలు కదుంకట్టాయి. బోర్లాపడుకుని దోసిలితో మొహం కప్పుకున్నాడు. చిమ్మచీకటి అతనిమీద జారిపడి వీపుమీద అడుగులునేసి తొక్కుతున్నట్లుంది!...

తూరుపు తెలతెలవారింది. చల్లనిగాలి వీచింది. యింకా నిద్రపోతున్న కూలీల, కుష్టురోగుల, బిచ్చగాళ్ళ శరీరాలను తట్టి లేపుతోంది. కాగితం అట్టలు కప్పుకొని కొందరు, చిరిగిపోయిన దుప్పట్లలో, గొంగళీలలో దూరి మరికొందరు నిద్రపోతున్నారు.

గాలి రివ్వున వీచింది. నిద్రపోతున్న వాళ్ళు కొంచెం కదిలారు. ఒకరిమీద ఒకరు పడుతున్నారు. ముళ్ళవలె ముడుచుకొని దొర్లుతున్నారు.

మళ్ళీ గాలి రివ్వుమంది. వొంటిమీద ఏ గుడ్డాలేని కుష్టురోగులు మూలి గారు. మరికొందరు తాము కప్పుకున్న దుప్పట్లను దగ్గరగా తీసుకున్నారు. గొడుగుల్లా ముడుచుకుపోయారు. ఇంకొంతమంది అప్పుడే లేచిపోయి చలిగిల బడి" రామ్ రామ్! శ్రీరామ్!" అంటున్నారు.

గుప్పెళ్లతో యిసక చల్లినట్లురివ్వు రివ్వుమని వచ్చే సముద్రగాలి రొప్పుకు రొప్పుకు వచ్చింది. కూలీలు బిచ్చగాళ్ళు "హరే రాం హరే రాం రాం రాం హరే హరే' 'హరేక్రిష్ణ హరే క్రిష్ణ క్రిష్ణ క్రిష్ణ హరే హరే! అని

మాటిమాటికి జపిస్తున్నారు. ఇది మన భారతదేశంలో మామూలే! దగ్గులమధ్య ఒగర్పుల మధ్య మూలుగులమధ్య యిదే ధ్యానం! శివుడి ఆజ్ఞలేనిదే చీమైనా కుట్టదని భారతీయుల్లో చాలామందికి విశ్వాసం. ఈ రోజు మంచొచ్చినా చెడ్డొచ్చినా ఆ భారం భగవంతుడిదే! భగవంతుడిమీదే భారమంతా వేసి యీ నికృష్ట నిర్భాగ్య జీవులు బతుకుతున్నారు!

దగ్గులు, నిట్టూర్పులు, మూలుగులు, ఒగర్పులు బిగ్గరగా కేకలు ఎంత వినిపిస్తున్నా కొందరింకా పేవ్‌మెంటుమీద నిద్రపోతూనే వున్నారు. పోలీసు లాఠీ చేతపుచ్చుకుని అటు వచ్చి "ఉస్‌ఉస్" అని కోళ్ళను తరిమినట్టు తరిమేవరకూ వాళ్ళకి 'లా' అంటూ వొకటున్నదని తెలిసిందికాదు. పోలీసు కేకలకు హడలెత్తి పడుకున్నవాళ్ళు లేచిపోయారు. అందులో మునూ ఒకడు! ఈసరికే హరి లేచి సిద్ధంగా వున్నాడు: "రావయ్యా నేస్తం! ఫ్యాక్టరీకి యీపాటికే బయల్దేరవల్సింది" "మర్రాళ్లు లేచారో లేదో!"

"లేచే వుంటార్లే"

"లేవకపోతే భుజాన వేసుకుంటాను!"

"అలాంటి గారం మాత్రం మప్పకు ... బొత్తిగా చిన్నాళ్ళేంకాదు; వాళ్లీడువాళ్లు యిప్పటికి ఏవో చిన్న చిన్న పనులు చేసుకుని బతుకుతున్నారు ... వీళ్ళనీ, పన్లో వేయిస్తాను"

"అప్పుడే ?"

"అప్పుడే! ... ఒహోహో! అప్పుడే! మంచిప్రశ్నే వేశావే! ఎవడికివాడు గడించుకపోతే ఎలాగోయ్ బతకడం ?"

హరి ముందుకు వెళ్ళి లక్ష్మిని కేకవేశాడు. లక్ష్మికి రాత్రల్లా నిద్రలేదు. ఆ వున్న జాగాలోనే పిల్లల్నిద్దర్నీ సర్ది పడుకోబెట్టి తను 'జాగరం' చేసింది.

"లక్ష్మీ! లేచారా వెధవలు ?"

లక్ష్మి పిల్లల్ని తట్టి లేపుతున్నది. లేపుతున్నకొద్దీ పిల్లలు బిర్రబిగుసుకు పోయి పడుకునిపోయారు. హరి దూసుకుంటూవచ్చి పిల్లల్ని ఎత్తి నిలబెట్ట బోయాడు. లక్ష్మి "ఏవిటండవీ! కర్కోటకుళ్లాగ!"ని అడ్డువచ్చింది. భార్యను భర్త దూషడు చేశాడు. లక్ష్మి అడ్డుగా గోడలాగ నిలబడి "మీకెందుకండి బాబూ! నేను లేపుకోలేనూ!"

"నీకు లాంగరే ఈగుంట వెధవలూ! ...హోహోహో! చెబితే విని పించుకోదూ యిది! ... ఒక్కొక్క వెధవకి ఎనిమిది, తొమ్మిదేళ్ళొచ్చాయి...ఇంకా నిద్రట!"

చిన్న పిల్లల్నిద్దర్నీ పట్టుకుని కుదిపేడు. చేతులు తోటకూర కాడల్లా వేలేసుకుని కుర్రవాళ్లు కళ్లైనా తెరిచేరు కారు. హరి యిద్దర్నీ నించోబెట్టేందుకు ప్రయత్నించాడు. కుర్రవాళ్ళు కూలబడిపోయి నేలమీదకు ఒరిగిపోయారు. భార్య భర్తవంక కొర కొర చూస్తోంది. ఇక యిద్దరూ చిన్న జట్టీ ఆరంభించక తప్పదనుకుని, మునూ "నే నో పిల్లాణ్ణి భుజాన వేసుకుంటా ల్లెండి" అన్నాడు.

హరి చిన్న ట్రంకు నెత్తికెత్తుకున్నాడు. మునూ పిల్లవాణ్ణి భుజాన వేసుకుంటూంటే లక్ష్మి పిల్లను లేపుతోంది. హరి పరుపు చుట్టబెట్టాడు. బిడారులవలె బయలుదేరారు.

వీధుల్లో జనసంచారం ఆరంభమయింది. తెల్లవాళ్ళు, నల్లనివాళ్ళు సూట్లతో, పంచెలతో, నిక్కర్లతో మామూలుగా, వున్నంతలో ముస్తాబయి బయలుదేరేరు. మోటారుకార్ల మీద షాహుకార్లు తిరుగుతున్నారు. స్కూలు పిల్లలు చక్కని దుస్తులు వేసుకుని వీధుల్లో వెడుతున్నారు. కొందరికి బడికెళ్ళడం సరదా; మరికొందరికి బడంటే భయం. మూతి బిగించుకొని, వెర్రిమొహాలు పెట్టి కాళ్ళీడుస్తూ బడిపిల్లలు ఎదురయ్యారు. ఆకాశంనుంచి సూర్యకాంతి భవనాలమీద పడుతోంది. భవనాలు నిగనిగ ప్రకాశిస్తున్నాయి.

భవనాలలోపల చీకటి. ఒకదానిమీద ఇంకొకటి; అంతస్తుపై అంతస్తు! ఇళ్లలోపల గదుల్లో మేడలమీద మనుష్యులు బిలబిల్లాడుతూ ఇరుక్కిరిసిన జీవితం గడుపుతున్నారు. పొద్దున్నే లేస్తారు. ఊళ్లోకి పోతారు. ఒకేచోట నివసిస్తున్నా వొకరి కొకరు ఎదురుపడ్డా ఒకర్నొకరు పలకరించుకోరు; ఎవరి బ్రతుకు వారిదే; ఎవరితోవ వారిదే!

"వింత మనుషులు! వీళ్ళు చాలా గమ్మత్తు మనుష్యులు! వొకరి కొకరికి సంబంధమే లేదు!" మునూ, హరీ, లక్ష్మి యింకా నిద్రలో జోగుతున్నట్టే నడుస్తున్నారు. మెల్లగా అడుగులు వేస్తున్నారు. అడుగులు తడబడుతున్నాయి. ఈ వాతావరణంలో మునూకు నల్లమందు వేసుకున్నట్లుంది. వొళ్ళు పుళ్ళు వేసినట్లుంది.

నిస్త్రాణగా నడుస్తూ ముందు అంగలువేస్తున్న హరికేసి చూశాడు. ఒక యంత్రంలాగ హరి, పురపుర వెళ్ళిపోతున్నాడు. తొందరగా వెళ్ళిపోతామనే

ప్రయత్నమే కాని నీరసంగా వున్న మోకాళ్లు ఒకదానితో వొకటి తగులుతూనే వున్నాయి. అయినా ఈడుపు కాళ్ళతో ముందుకు సాగిపోతున్నాడు.

లక్ష్మి అసలే ఆడది; చిన్నది. నీరసం. ఎత్తుకున్న కుర్రాడు బరువు. మోయలేక తలవేలేసి యీడిగలబడుతోంది. తలమీదవున్న ముసుగు కళ్ళకు గంతలు కడుతున్నట్లు మొహమంతా కప్పింది. నడవలేక, పిల్లను మోయలేక బాధపడుతున్న లక్ష్మిని చూసి మునూ "ఆ పిల్లనికూడా నా భుజాన వేసుకుంటే సరిపోయేదే!" అనుకున్నాడు. అతని భుజంమీద పిల్లాడి బరువు వుండనేవుంది!

భవనాలమీద సూర్యుడు ఎండను వొంపుతున్నాడు. ఆకలి కరకరలాడుతోంది. నోరు చేదుగావుంది. పేగులు తోడుతున్నట్టు నరాలు పీకుతున్నట్టు! గబగబ అడుగులు వేశాడు.

నేలంతా మంచుతో తడిసివుంది. మంచు సూర్యరశ్మికి కరిగిపోతోంది. పచ్చని వృక్షాల తలలను, లతలను ఎర్రని సూర్యకాంతి నిమురుతున్నది. బంగరు పూతపూసినట్లు వున్నాయి చెట్లు. మంటిదిబ్బలు; మలుపులుతిరుగుతున్న కాలిబాట; కాలిబాట కిరువంకల వృక్షాలు దూరంనుంచి చూడ్డానికి కంటికింపుగావున్నాయి.

మైదానం ఎడంప్రక్క మురికినీళ్ళ కాలువ వైతరణిలావుంది. కాలవలో తోళ్లు కడుగుతున్నారు. తోళ్ళవాసన ముక్కు బద్దలుకొడుతోంది. కడుపు త్రిప్పుతోంది. కుళ్లువాసన; మురికినీరు. కూలీలు ఆ మురికినీళ్ళల్లోనే తోళ్ళను కడుగుతూ, సాఫ్ చేస్తూ ఎండబెడుతున్నారు. కుడిపక్క బూడిదరంగు మట్టి గుడిశలు గడ్డికప్పుతో వేలకొద్దీ వరసలుతీర్చి వున్నాయి. గుడిశలకుపడ్డ కంతలకు జనప నారగుడ్డలు, చింకి పరదాపీలికలు కప్పీవుంచారు. గుడిశలకు దూరంగా కూలిపేటకు కాస్త అవతల ఎన్నో మిల్లులు రైలులాగ పొగలను చిమ్ముతున్నాయి. కార్ఖానాల పొగమబ్బులు ఆకాశాన్ని ఆవరించాయి.

ఇక నడవడం కష్టమన్నట్టు ఊపిరిపీలుస్తూ హరి "అట్టే దూరంలేదులే. దగ్గిరపడ్డాం! మరొక్క మైలే!" అంటూ కళ్ళగుడ్లు గిరగిరతిప్పేడు." ఏం మైలు? ఎంతకీ తెమలదు? మా సైడు మైలుకీ మీ సైడు మైలుకీ "చాలా" వారావుందే!" అంటూ ఆవులించాడు మునూ.

భర్తదగ్గరకు మెల్లగాచేరి పెదవులను తమాషాగా తిప్పుతూ "ఏమండీ! మీకే...మాట్లాడరేం!..."

"ఏమిటో గొణిగితే నాకేం తెలుస్తుంది?"

"అది కాదండీ. మనం...అలాటి పెంకుటింట్లో వుందామా? లేక కొంప తీసి పూరిల్లే తీసుకుంటారా."

సరి సరి! మొదటి దానికి మొగుడు లేడూ; కడదానికి కల్యాణంట!... దొరకనీ మంచి ఉద్యోగం! దొరికిందా, నీ అదృష్టమే!...మంచి కొంప లోనే వుందువుగాన్లే" హరికి నడక చికాగ్గానే వుంది. ఈ శ్రమకంటే కొద్ది సేపట్లో ఫోర్ మెను చూడబోతున్నాననే ఆందోళనీ, అతను యేమంటాడో అనే సంశయం హృదయాన్ని మరీ బరువెక్కించాయి.

చిన్న చిన్న పెంకుటియిళ్ళు, వందలకొద్దీ వున్న పూరిగుడిశలూ దాటి గుడిశల ముందున్న పెంటపోగులు దుర్గంధం కొడుతూంటే ముక్కు మూసు కుంటూ, గబగబ నడుస్తున్నారు. ఇక్కడా భవంతులు వున్నాయి కాని, అవి నగరంలోవున్న భవనాలవలె కళ్ళు చెదరగొట్టడంలేదు. భవంతుల గోడలు బీటలు వేశాయి. పైకప్పులు లేచిపోతున్నాయి. గోడలకున్న వెల్ల కరిగిపోయి యిటుకలు పెచ్చులు రాలుతున్నాయి.

"ఆ అదేంయ్యా! షిగ్గాబైబ్ ఫ్యాక్టరీ అంటే! హమ్మయ్య ... వచ్చేశాం!" వేలు పైకెత్తి హరి దూరంగావున్న పెద్ద ఫ్యాక్టరీని చూపిం చాడు. మిగిలిన కార్ఖానాలకంటె ఇది పెద్దది. పొగను లుంగలు లుంగలుగ తుట్టలు తుట్టలుగ ఫ్యాక్టరీ చిమ్నీ ఆకాశంలోకి వొదుల్తోంది.

హరి చూపిస్తున్న దిక్కుకేసి మురూ చూపు సారించేడు. కాని అనేక ఫ్యాక్టరీలు వుండడం వలన తాము వెళ్ళబోయే ఫ్యాక్టరీ ఎక్కడవుందో గుర్తుపట్టలేక పోయాడు.

ఇరుకైన సందుల కిరువైపుల గుడిశలు వొకదానిమీద వొకటి పడు తున్నట్టు క్రిక్కిరిసి వున్నాయి. సందులలో తడిబట్టలతోనే నుంచుని స్త్రీలు, పురుషులు సూర్యనమస్కారాలు చేస్తున్నారు. గాలిలో కాకులు "కావ్ కావ్" మని అరుస్తూ ఎగురుతున్నాయి. ఇక్కడకి ఆమడ దూరంలోకూడా కుళాయిలూలేవు; నూతులూలేవు. మరి వీళ్లెక్కడ స్నానం చేస్తున్నారనే ప్రశ్న మనూనకు కలిగి అటు ఇటూ పరికించాడు. దూరంగా కాళీ జాగాలో వున్న ఒక నీటిగుంట, గుంటలో దిగబడి హాయిగా పడుకున్న ఆవులూ, గేదెలూ, పశువుల మూపులపైవున్న పుళ్ళను ముక్కులతో పొడుస్తున్న కాకులూ కనిపించాయి. నీటిగుంట ఒడ్డున చిన్న రాతికొండ, కొండ దిగువను

పచ్చిక దుబ్బుల్లో తిరుగుతూన్న గేదెలు. గుంటలోని నీరు పచ్చగా తెట్టు కట్టింది. అక్కడక్కడ మూల మూలల దోమలు "ఝుయ్" మంటున్నాయి. కొండ దిగువను నీటివొడ్డున పిల్లలతో పశువుల కాపరులు ఆడుకొంటున్నారు.

ఆడుకుంటున్న పిల్లల్నీ, కర్రలుపారేసి గెంతుతున్న పశువులకాపరుల్నీ చూసేసరికి, తన చిన్ననాటి ముచ్చట్లు స్మృతిపథంలోకివచ్చి మునూ మనస్సును గింగురులెత్తించాయి. తనగ్రామం, బీస్‌నదీతీరం, గేదెలు, ఆవులు, మావిడితోపులు, ఎర్రనిపళ్లు, పచ్చికదుబ్బులు, పిల్లలు, యించక్కని కోతి కొమ్మచ్చి ఆటలు!

ఒక్కొక్క దృశ్యమే గిర్రుగిర్రున రంగులరాట్నంలోని ఏనుగులవలె ఎత్తిఎత్తి నడుస్తూ, గుర్రాలవలె దౌడుతీస్తూ, ఉయ్యాలలవలె కళ్ళముందు ఊగులాడుతున్నాయి. కట్టుకున్నపంచె వూడదీసి, గబుక్కున నీటిలోకి దుమికి, గెంతులాడుతూ, సరదాగా చేతులతో నీళ్ళను చిమ్ముతూ, నోటితో పుక్కిలిస్తూ కేరింతా లాడుకోవాలనేకోరిక అకస్మాత్తుగా పుట్టుకొచ్చింది.

"ఇందులో స్నానం చేద్దామా?"

"టైమ్‌లేదు బ్రదర్! త్వరగా పోవద్దూమరి! రేపట్నుంచి యిక్కడే మన స్నానం! నీ దయవల్ల ఉద్యోగం దొరకాలికాని, యిక అడిగేవా మన నసీబు! ఇక్కడే కొంపా గోడీ చూసుకుందాం."

నీటిగుంటమ్మటే నడుస్తూ, దిక్కులు చూస్తూ మునూ నడుస్తున్నాడు. హరి చెబుతున్న మాటలు వింటూ అలాగే అన్నట్టు తలూపుతూ ముందుకు సాగేడు. నీటిగుంట కవతల చెత్తా చెదారం, గాజుపెంకులూ, చిల్లపెంకులూ, కాగితాల గుట్టలు మేటవేసివున్నాయి. విసుగ్గా నడుస్తున్న భార్యకేసి తిరిగి హరి "ఇంకొక్కమైలే! దగ్గిరకొచ్చేశాంలే!"

"ఏం మైలు, దిక్కుమాలిన మైలు! నడవలేక చస్తున్నాం!"

లక్ష్మి ఊరికినే విసుక్కుంటున్నదే కాని యిక వెళ్ళవలసిన దూరం మైలుకూడాలేదు. అయిదువందల గజాల దూరంలో ఒక ప్రహారీ కనిపించింది. ప్రహారీగోడల చివరన సున్నంతో గాజుపెంకుల కంచె అమర్చారు. ప్రహారీ దాటితే ఫ్యాక్టరీ వచ్చేసినట్టే. ఇక ఆట్టే దూరంలేదు? అయిదువందల గజాలే.

రైలుపట్టాలు మైదానాన్ని రెండు సమానాంతర రేఖలులా విడదీసింది. దాగలండా రాక్షసిబొగ్గు గుట్టలుగా పడివుంది. మూలమూలల పాడైపోయిన

రైలుకమ్మీలు, పెట్టెలు తుప్పుపట్టి శిథిలావస్థలో వున్నాయి. ఫ్యాక్టరీ వదులుతున్న మురికీ, చెత్తాచెదారం అంతా యిక్కడే! గోడలకు పిడకలు చరిచి వున్నాయి.

మురికి కంపు, నీచువాసన కొడుతున్న యీ దారమ్మట నడవడమే కష్టమనిపించింది. కాళ్ళీడుస్తూ అలాగే నడుస్తూ గోడ దాటేసరికి పెద్ద యినప గేటులతో వున్న ఆవరణ కనిపించింది. గేటుమీద బోర్డు "సర్ జార్జి కాటన్ మిల్సు!"

హరి, లక్ష్మి, మునూ, గేటుదగ్గర కొచ్చేసరికి, చేతనున్న తుపాకీ ఠక్కున కిందకొడుతూ "ఆగు! ఆగు!" అని పఠాన్ గద్దించాడు. ఎర్రని వేస్టుకోటు వేసుకున్నాడు. చంకల దిగువను రొమ్ముకు కాసులా వేళ్లాడుతున్న పటకాలో కేట్రిడ్జిలు పెట్టుకున్నాడు. పెద్దబూటులు. చుట్టూ ధగ ధగ మెరిసే అంచుల సిల్కు తలపాగా చూడ్డానికి భయంకరంగా వున్నాడు. "ఆగు! ఆగు!" అనే గద్దింపుకి లక్ష్మి హడలిపోయింది. అధికారి గద్దింపులు ఎలాగ వుంటాయో మునూకు తెలుసును; అయితే ఫ్యాక్టరీముందు నించున్న యీ అధికారి ఇంగ్లీషుదొరమాత్రం కాడు. దొరలయితే ఆ టాకు టీకు వేరు. హరికి, ఈ పఠాన్‌ని బాగా తెలుసును కాబోలును. ఎంతో చనువుగా గౌరవంతో వంగి వంగి "సలాం, సలాం ఖాన్‌సాహేబ్!" అంటూ చేతులు జోడించాడు. తన నొక కాపలావాణ్ణిగా కాక గొప్ప ఉద్యోగిగా మన్నన చేస్తున్నందుకు నాదిర్‌ఖాన్ ఉబ్బి తబ్బిబ్బయాడు: "అచ్చా! నువ్వు హరివి కాదూ?"

"అవునవును ఖాన్‌సాహేబ్! నాలుగు నెలలేకదూ అయింది నేను వెళ్ళి?"

"అచ్చా! పెళ్ళాం పిల్లల్నికూడా తీసుకొచ్చావా?"

"వీళ్ళే సాహేబ్! వీళ్ళే!"

"సరే! ఏమిటి కథ?"

"ఫోర్‌మెన్ దొరగార్ని వొక్కసారి దర్శించి..."

"నువ్వు లోపల కెళ్ళడానికి వీల్లేదు! నేనే పిలుస్తాను. వుండుండు!"

ఫ్యాక్టరీ లోపల గేటుదగ్గర చిన్నబల్లమీద కుర్రవాడొకడు కూచుని కునికిపాట్లు పడుతున్నాడు. నాదిర్‌ఖాన్ కుర్రాణ్ణి బెదిరిస్తున్నట్టు "ఒరే

లడ్కాగా! వెళ్ళి చింటూ సాహెబ్ గార్ని తీసుకురారా! మీకోసం ముసిలాడెవడో వచ్చాడు; ఉద్యోగం కావాల్టని చెప్పు" అని ఆజ్ఞాపించాడు.

మునూ భుజాలమీద నిద్రపోతున్న కుర్రవాడు కళ్ళునులుపుకు లేచాడు. కుర్రవాడితోపాటు లక్ష్మి ఎత్తుకున్న పిల్లా లేచింది. కిందకు దింపి దింపడంతోటే పిల్లలిద్దరూ రోడ్డుమీద కూచుని ఆడుకుంటున్నారు. వొకళ్ళ నెత్తిమీద వొకళ్ళు యిసక పోసుకుంటున్నారు.

రోడ్డుమీద మైలురాయి తెల్లటి సున్నంపూసి 12 అనే అంకెను చూపిస్తోంది. మైలురాయిమీద చతికిలబడి ఫ్యాక్టరీకి పెదమొహంపెట్టి నేల ఎత్తుపల్లాలను, మూలమూలవున్న పేడకుప్పలను, తుప్పుపట్టిన ఇనపముక్కల్ని, రాక్షసిబొగ్గుల పోగుల్ని చూస్తున్నాడు. ఇన్నాళ్లై తాను చూస్తూవచ్చిన వింతవింత వస్తుసముదాయం అతని ఆత్మపై గాఢమైన ముద్రలను వేసింది. అయితే అవి, యింతసేపూ అతన్ని కలవరపెట్టలేదు. ఇప్పుడుమాత్రం వొకటొకటే ప్రవాహంలాగ, వెల్లువలాగ పైకుబికి అతన్ని ఉక్కిరిబిక్కిరి చేయసాగాయి. వాటికిందపడి తను నలిగి నుగ్గునుగ్గయి పోతున్నట్లనిపించింది. చుట్టూరా, యింతమంది జనం తిరుగుతున్నా తాను ఏకాకినని విషయం మళ్ళీ స్ఫురణకువచ్చింది. అవును! తను ఏకాకి. హృదయం పదే పదే అదే మాట చెబుతున్నది. ఇక ఎందుకిక్కడ? తిన్నగా పిట్టలా మళ్ళీ తన "కాంగ్రా" పర్వతాల లోయలలోకి, పోనీ శ్యాంనగర నడి బజారులలోనికి, కాదా, దౌలత్‌పూర్ సందులలోకి ఎగిరిపోయి వాలితే ఎంత బాగుండును!...అయితే మళ్ళీ మనసుకు ఒక ఊరింపు! హృదయంపై ఒక చక్కిలిగింత! ఇటు తిరిగి ఫ్యాక్టరీకేసి చూస్తే ఎందుకో ఏమో మరి అతని ఆత్మ అవ్యక్తానుభూతులను పొందుతోంది. పెద్దఫ్యాక్టరీ; ఆకాశం ఎత్తున చిమ్నీ; చిమ్నీలోంచి భుగభుగమని రొప్పుకొచ్చే నల్లని పొగమబ్బులు! ఇంతపెద్ద పొగగొట్టం వుండికదా, ఈ ఫ్యాక్టరీ నెగడి మరెంత పెద్దదోకదా! దౌలత్‌పూర్‌లో ప్రభుదయాలు ఫ్యాక్టరీ అతని హృదయాన్ని కితకితలుపెట్టి కేరింత లాడించింది. ఇది అంతకంటె పెద్దఫ్యాక్టరీ. మరీ దివ్యంగా వుంటుందనిపించింది. దీనికిమల్లే ప్రభుదయాలు తన మిల్లుకి పొగగొట్టం కట్టిస్తే ఆనాడు తోడరుమల్లు భార్యతో అంత కీచులాట వచ్చివుండేది కాదుకదా! ఆ కీచులాటే రాకుంటే రావుబహద్దర్ కొడుకు పోలీసు యినస్పెక్టర్ వాడి చేతులు పడిపోనూ, దయాలును అలాగ కొట్టివుండేవాడు కాదు! హుఁ!

అయితే దౌలత్‌పూర్‌లో యింతోటి పెద్దఫ్యాక్టరీలెందుకు ? దిక్కూ-దివాణంలేని ఊరు ! బొంబాయి సంగతి వేరు. దీనిది రాజఠీవి. అందాని కందం సుఖానికి సుఖం. ఆనందాని కానందం ! కూరల మార్కెట్టులో తన నేస్తం వర్ణించినట్టే అచ్చం అలాగేవుంది. "బొంబాయి మిల్లుల్లో ఎంతడబ్బు కావాలంటే అంతడబ్బూ గడించుకోవచ్చురా ! రెక్కల్లో శక్తుంటూ వుండాలి కాని" అని యిదివరకు చెప్పలేదూ; తన నేస్తం ! బహుశా యీ మిల్లులే కాబోలు; తన రెక్కల్లోనా, కావలసినంత శక్తివుంది. బద్ధకమనేది యింటా వంటా లేదు. ఇక గొచ్చెలు గొచ్చెలు గడించుకోవచ్చును. చేతిలో పైసా వుంటే శుభ్రమైన యిల్లు, యిల్లేం కర్మం ! మేడే, అద్దెకు పుచ్చుకోవచ్చును. గాలీ, వెలుతురూ, వచ్చే కిటికీలు. గాజు తలుపులు, అందులో కాపురం !

ఎవరూ ఒకరితో ఒకరు మాట్లాడుకోలేదు. ఇరవై నిమిషాలు మౌనంగా గడిచిపోయాయి. హరి "సాహేబ్ మాత్రం మాఁ మంచివాడ్రా మునూ !" సాహేబ్ మంచివాడనగానే, పరధ్యానంగా కూచున్న మునూ సంభ్రమంతో చకితుడయాడు. వెంటనే తనకు శ్యాంనగరులో బాబుగారి యిల్లూ, యింటి కొచ్చిన మిస్టరు ఇంగ్లండూ జ్ఞాపకం వచ్చారు. సంతోషానికి మేరలేదు. ఉప్పొంగి పోతున్నాడు. ఉప్పొంగి పోతున్న ఊహలు, జారుముడి వేసుకుని అతని మనసులో ఆశల బొంగరాలను గిర గిర తిప్పాయి.

దొరను యిక కొద్దిసేపట్లో చూస్తామనే సంతోషం మునూనే కాదు, అతనితోపాటు లక్ష్మికికూడా కలిగింది. ఆవిడ ఆనందానికి పట్టపగ్గాలే లేవు. తాను బజారున పోతున్నపుడు అనేకమంది తెల్లదొరలను రహస్యంగా తన మేలిముసుగు వొత్తిగించి చూసింది. అయినా దొరలతో తన భర్త మాట్లాడడం ఎప్పుడూ తాను చూసిఎరుగదు! ఇపుడు తనభర్త వొక దొరతో మాట్లాడబోతున్నాడు. మాటాడడమేకాదు. పెద్ద ఉద్యోగి కాబోతున్నాడు. దొర మంచివాడట! ఇకనేమి? తన భర్తకు గొప్పఉద్యోగమే యిస్తాడు. యిస్తే డబ్బుకేమికొదవ! తన కేమి లోటు! గడించినవాడిపెళ్ళాం గారీదేవి!

ఆనందంతో వుండబట్టలేక మగనిదగ్గరగా చేరి ఏదో అనబోయింది. కాని పెదవులు కంపించుకొని నోట మాటరాలేదు. కుర్రవాళ్ళకి చల్లన్నం జ్ఞాపకంవచ్చింది కాబోలును, తల్లికేసి మిడుతూ మిడుతూ చూస్తున్నారు. వాళ్ళని మరిపించేందుకు ఇన్ని గులకరాళ్ళు చిల్లంపెంకులూ ఏరి ముందరపోసి ఆడుకోమంది.

కుర్రవాళ్ళు రాళ్ళు అటూయిటూ విసురుతూ ఆడుకుంటున్నారు. ఆట లాడుకుంటూ నవ్వుకుంటున్నారు. నేలమీద తుపాకీని తక్కునకొట్టి నాదిర్‌ఖాన్ "ఏయ్! కుర్ర వెధవల్లారా! కోతుల్లా! హుఁ!" అని గుడ్లురిమి చూశాడు. కుర్రవాళ్ళు బిక్కచచ్చిపోయి తల్లి పవిట చాటున దాక్కున్నారు. నాదిర్‌ఖాన్‌ను సంతృప్తిపరచేందుకు హరి పిల్లల్ని కోప్పడ్డాడు. తల్లి, పిల్లల్ని గుండెకు అదుముకున్నది. సానుభూతిగా మునూ చిరునవ్వు నవ్వేడు.

ఇంతలో జిమ్మీ థామస్ ఫ్యాక్టరీలోంచి బయటకు దర్జాగా అడుగులు వేస్తూ, బుర్ర టకాయిస్తూ వచ్చాడు. మనిషి ఏనుగున్నలాగ వున్నాడు. తెల్లటి పంట్లాంమీద నూనె మరకలు. చొక్కానిండా నల్లని చుక్కలు. కుక్కపిల్లలాంటి మొహం. మెలికలుతిరిగిన మీసం. థామస్ లాంక్‌షైర్‌లో ఇదివరకు మెకానిక్‌గా పనిచేశాడు. ఇప్పుడు యిక్కడ ఫోర్‌మెన్. భారత దేశం వచ్చి పదిహేనేళ్ళయినా తానింకా లండనులోనే వున్నట్లు భావిస్తూ, మనిషి గర్వంగా అడుగులు వేస్తూ నడుస్తున్నాడు.

థామస్ పాదాలకు మొక్కి హరి "సలాం హుజూర్! హుజూర్!"

"హో! నువ్వా! హరి కదూ నీపేరు?...వచ్చేశావే మళ్ళీ! ఇక రావనుకున్నాన్లే"

వడవడ వణకుతూ రెండు చేతులూ జోడించి ఎదుట నిలబడ్డాడు హరి. "చిత్తం, హుజూర్! తమకి తెలియనిదేముంది హుజూర్! నాభార్య అదేనండి. అరుగో నాపిల్లలు. తీసుకొద్దామని వెళ్ళానండయ్యా. ఊరు..."

"ఐ సీ! వాడెవడు? ఆ కుర్రకుంక?"

"కూలి పనికొచ్చాడండి! పనిప్పించమని వెంటపడితేనూ, కాదన్లేక తీసుకొచ్చాను హుజూర్!"

"ఏడవలేక పోయావ్!...మీ ఊరందర్నీ తీసుకు రాకపోయావూ?"

థామస్ గొంతుకలోని వెటకారం మాటల్లోని చమత్కారం హరికి బోధపడలేక వినయంగా మళ్ళీ చేతులు జోడించి "అల్లాగే! హుజూర్! తమకవసరం పడితే లాక్కొచ్చేస్తానండి! అదెంతసేపు హుజూర్!"

"షట్! శుద్ధ ఎద్దుమొద్దూ! నేనంటోన్నదేమిటి, నువ్వంటోన్న దేమిటి?...తీసుకొస్తాట్ట! తీసుకురావడం! ఫూల్! ఇదేమన్నా సంతర్ప

అనుకున్నావా? ఉన్నవాళ్ళనే ఊడబెరికి పారేస్తుంటే వాడెందుకు, ఆ కుర్రకుంక? హుఁ!"

"తమకు అన్నదాతలు. తమరే అలాఅంటే ఎలా హుజూర్! తల్లీదండ్రీ అన్నీ మీరే. తిట్టినా కొట్టినా మీరే! మీ పాదాలదగ్గిర కనిపెట్టుకున్నాం. హుజూర్!"

"సరే! సరే! సోది కట్టిపెట్టు! హుఁ...మొత్తం నెలకీ ముప్పై..." థామస్ చేతి వేలితో లక్ష్మిని చూపిస్తూ "అదేం పనిచేస్తుందిరా!...దానికి సరే నెలకీ పది...ఆ కుర్ర వెధవలకి చెరో రెండున్నర...వాడికి పదీ, నీకో పదీ...మొత్తం ముప్పై...ఏం?" అంటూ గద్దించి గణిత శాస్త్రం చెప్పాడు.

ఘోరుమన్ బూట్లు చేతులతో తాకి కళ్ళకద్దుకుంటూ హరి విన్నపం చేసుకున్నాడు: "హమ్మమ్మా తమరలా సెలవిస్తే యీ దాసానుదాసుడిగతి యేంకాను? తమకు తెలియం దేముంది? ధరలుచూస్తే చుక్కల కంటుతున్నాయి. కుటుంబమా పెద్దది!"

ఒరే! నీ కుటుంబం నువ్వూ, వెధవమాటలు కట్టిపెట్టక! మంచీచెడ్డా ఆలోచించి పోనీ సదుపాయం చేదామంటే, చేసినదానికి కృతజ్ఞతేదిరా? ఏరుదాటగానే తెప్ప కాల్చేరకం! నాకు తెలియదూ మీ దొంగవేషాలు! ఇప్పుడే యీ హుజూర్ హుజూర్లు!"

"తమపట్ల అపరాధం ఏంచేశాను హుజూర్?"

"నోరుముయ్! నాలుగునెలలై పత్తాలేదు! వెళ్ళావు ఊరు. ఉత్తిచేతుల్తో నేకదా నువ్వొస్త?"

"క్షమించండి హుజూర్! క్షమించండి!"

"నేను నిన్ను క్షమించాలీ? నువ్వేమో తప్పులు చేస్తూనేవుండాలీ?... ఏమిట్రా యీ వేషాలు? మీసైడు అన్ని మావిడిపళ్ళు పండుతాయ్! ఒక్కపండు, ఒక్కటంటే వొక్కటి తెచ్చి 'ఇందండని' రుచైనా చూపించావుట్రా?... నీకు తెలుసునే, దొరసానమ్మకి మామిడిపళ్ళంటే యిష్టమని!"

థామస్ బుగ్గలదాకా మెలికలు తిరిగివున్న మీసాన్ని మెలిపెట్టి బుర్ర టకాయించాడు. హరి దీనంగా యింకా బతిమాలుతూనే వున్నాడు. "హుజూర్! తమ చెప్పుచేతుల్లో వుండవలసిన మనిషిని. గట్టిగా కళ్ళెర్ర చేస్తే హడిలిపోతాం...తృణమో, పణమో నాహోలుకి తగ్గంత..."

సగం మాటల్లోనే హరికి అడ్డువచ్చి థామస్ "నీయిష్టమొచ్చినప్పుడు రాడానికి, యిష్టం లేనపుడు పోడానికి యిది కోతుల భాగోత మనుకున్నావేం? ఫ్యాక్టరీ రూల్సు. రూల్సు రూల్సే. మళ్ళీ ఎవడొచ్చినా సరే పనిమానేశాక, ఫ్యాక్టరీ గడప తొక్కనీయను...పెద్ద దొరగారి ఆర్డర్ - ఆర్డరే. ఆరు నూరవనీ, నూ రారవనీ."

హరి బిత్తరపోయాడు. నోరు మెదపలేదు. థామస్ మళ్ళీ అందుకుని "పెద్దదొరగారి ఆర్డరేసినా సరే పోనీ ముసిలిముండాకొడుకువని, దయతలచి పన్లో వేస్తున్నందుకు యిదా నా కుపకారం ? హఁ!"

"హుజూర్! ఇదివరకు నాకు పదిహేనిచ్చేవారు హుజూర్!"

"హుజూర్, గిజూర్! భంచోత్!"

"నన్ను చూసి కాకపోయినా, ఆచిన్నపిల్లల్ని చూసైనా..."

"అందుకేన్రా, పన్లో వేస్తోంది నిన్ను!"

"అవును హుజూర్! పిల్లవాణ్ణి; నత్తా, నావా!"

"పందిలా కను; యింకాకను! నువ్వేకంటూండు, నీకు సరిపడా మేం జీతాలిస్తాం!"

థామస్ కోపం ఉపశమించింది. ఫ్యాక్టరీలోనుంచి నౌకరవాడు ఒక దస్తరం తీసుకొచ్చి ఫోర్‌మెన్ ముందుపుంచాడు. థామస్ సంతకంచేసి పుస్తకం మూసివేశాడు. మునూ మెల్లగ మాటల్లోమాటలు కలిపి "హుజూర్! నెలకి యిక్కడ ముప్పైఫయిస్తారని విన్నానే!"

"ఆఁ! నీ బాబుగారిమూట యిక్కడ దాచిపెట్టేవని వెధవా!"

హరి భుజాలదగ్గరచేరి మోచేత్తో పొడుస్తూ మునూ అతని చెవిలో "ఇంకెక్కడన్నా చూసుకుందా"మని గొణిగాడు; హరికి తెలుసును కూలి దొరకడం కష్టమని! ఫ్యాక్టరీలో పని దొరకడమంటే మాటలుకాదు. అడ్డమైన వాడి కాళ్ళూ పట్టుకున్నా ఫ్యాక్టరీలో ఉద్యోగం దొరకడం గగనం.

థామస్ విసురుగా చేతులెగరేస్తూ "అచ్చా! చెప్పు. కత్తో బద్దో తేల్చు; కావాలా, అక్కర్లేదా? నోటికాడకూడు చేతులారా పోగొట్టుకోకు! ఇంకెక్కడా నీకు దొరకదు!"

"లేదుదొరా, లేదు.కనికరించండి! రోజులు అడ్డసుడిగా వున్నాయికదా; తమకి తెలియం దేముంది ? బియ్యం మాచెడ్డగిరాకీ!"

"సరేలే; మామూలుగా నీ పని నువ్వు చేసుకుపో...ముసలి ముండా కొడుకువని దయదల్చాను... పెద్దదొరతో చెప్తాలే! హుం! ఇదివరకెంత నీ జీతం?"

"పదిహేను హుజూర్!"

"అచ్ఛా! సరే; అదే జీతం!"

"కూలాళ్ళమీద మా చెడ్డ కనికిరం!"

"ఏం లాభం? మాటలతో ఏం లాభం?"

"చిత్తం. చిత్తం. తృణమో పణమో..."

"డబ్బుందా?"

"లేదు దొరా!"

"పది రూపాయలు సరిపోతాయా?...సరే; తీసుకో. రూపాయికి పావలా వడ్డీ; అంతకు తక్కువ కిచ్చేదిలేదు. ఏం, ఇష్టమేనా? సరే...ఇస్తానుండు...సరే; సరే; నీ జీతంలో నా కమీషనో?" అంటూ థామస్ ఫ్యాక్టరీలోనికి నిష్క్రమించాడు.

హరి నించున్న చోటికి గబగబా వచ్చి నాదర్‌ఖాన్ "ఓరి పిచ్చివాడా! రూపాయికి పావలావడ్డీయే! పిల్లల గలవాడివి! రేపు నీ గతేంకాను?" హరి ఏం చేయగలనన్నట్లు చూశాడు. "ఏడిసినట్టుంది; నేనిస్తా! రా, నా వెంట! రూపాయికీ జేడేవడ్డీ!"

నాదిర్‌ఖాన్ కోప్పడతాడనే భయంతోనే హరి సవినయంగా సమాధాన మిచ్చాడు: "మరి వొప్పంద మయిపోయిందే! ముందైనా అన్నావు కావు ఆమాట!"

"నువ్వింత వెర్రిబాగులవాడివని నాకేం తెలుసు! దొర ఏదంటే అదే నీకు? డూ డూ బసవన్నా అంటే డూ డూ..." "విసుగ్గా నాదిర్‌ఖాన్ కేబిన్‌లోకి వెళ్ళిపోయాడు. మునూ యీ అవకాశం పురస్కరించుకుని హరి చెవిలో గుసగుసలాడేడు: "అదేమిటవీ? నిజమే! రూపాయికీ పావలా వడ్డీయే?" లక్ష్మి ముందరకొచ్చి చేతులు తిప్పుతూ "మీ తెలివి తెల్లారినట్టే వుంది! వడ్డీకాక, నెల నెలకీ వాడికి కమీషనా?" మునూ సైతం అదే ప్రశ్న వేశాడు.

"ఏం చేసేది నేను! ఇక్కడేకాదు; ఎక్కడైనా యింతే! ఫోర్ మెన్నంటే మజాకాలా! ఫ్యాక్టరీ అంతా వాడి చేతుల్లోనే వుంటుంది. వా డెంత చెబితే అంతా!"

హరిచెప్పినదంతా అక్షరాలా నిజమే అయివుంటుందని మునూ నమ్మేడు. ఫోర్ మెన్నంటే పెద్ద వుద్యోగమే! అయితే ఈ దొర బట్టలనిండా, ఆ డాగులేమిటి? శ్యాంపురంలో బ్యాంక్ మేనేజరు యిలా లేడే!

ఫోర్ మెన్ అనేపేరైతే విన్నాడు కాని అతని హోదా ఏమిటో మునూకు తెలియదు. కూలీలను పనిలో వేయగల తీసేయుగల కప్పావిప్పా గల సమర్థుడనీ, అతనితో పేచీ తెచ్చుకొని ఏ కూలీ ఒక్క నిముషం బతకలేడనీ మునూకింకా బోధపడలేదు. కూలీలు తమ పనులు నిలవాలంటే, ఫోర్ మెన్ను ఆశ్రయించక తప్పదు. అతని దయా, ధర్మ భిక్షాలమీద కార్మికుల బతుకు ఆధారపడివుంది. పని చేస్తున్న కూలీలను అదమాయించడం, ఆలస్యంగావచ్చే కార్మికులను బెదరించడం, అవసరమైతే పన్లోంచి ఊడపీకించడం, ఇవన్నీ ఫోర్ మెన్ అధికారాలు. యజమానులతో తమ కష్టసుఖాలు చెప్పుకోవాలంటే అవి ముందు ఫోర్ మెన్కు నివేదించుకోవాలి. అప్పుడైనా కార్మికులను యజమానులదగ్గిరకి పోనీయడు! తనే "సరే చూస్తాలే!" అంటాడు! అతడు ఆడింది ఆట; పాడిందిపాటా! అందువల్ల కార్మికులు ఫోర్ మెన్నంటే గడగడలాడుతారు. ఉద్యోగంకావాలంటే ఫోర్ మెను ముందు "ఊఁ" కొట్టాలి. కన్పీ లేనిదే ఫోర్ మెన్ మాట్లాడడు. ఇచ్చినలంచం పుచ్చుకుంటూనే ఎంతిచ్చినా చాలదంటాడు! దమ్మిడి, యాగాణీ కతుకుతాడు. ఇవ్వనివాళ్ళమీద పగబడతాడు. ఇచ్చినవాళ్ళ నింకా లోకువచేసి మళ్ళీమళ్ళీ ఏదో ఒక నెపంమీద తేతెమ్మంటాడు. ముద్దముద్దకీ బిస్మిల్లా!

థామస్కు కమిషన్లేకాదు. వడ్డీవ్యాపారం వుంది. రూపాయికి పావలా వడ్డీవేసి జీతాలనాడు పీకలమీద అవాలా! వడ్డీవ్యాపారానికి తోడు నాలుగయిదువందల పూరిగుడిశె లున్నాయి. వీటిమీద అడ్డకుపడ్డావేసి కూలీలకి అద్దెకిస్తాడు.

ఫ్యాక్టరీలోంచి బయటకు వస్తున్నపుడు నాదిర్ ఖాన్ ఫోరున్ హోదాలో రాలేదు; వడ్డీవ్యాపారస్థుడి ధీమాలోనూ లేడు; తనకు కొన్నివందల పూరిగుడిశె లున్నాయనే సంగతిని అతను మరవనుండానే వచ్చాడు. "సరే; ఊఁ సరే! ఇంద; పదీ; లెక్కచూసుకో...ఇల్లు కుదిరిందా?"

"లేదు హుజూర్ !"

"ఎక్కడో వుంటే లాభంలేదు; మిల్లు కూసేసరికి రావాలి కదా మరి!...సాహేబ్‌గారి సందులేదూ; సందుచివరన గుడిసొకటి ఖాళీగానే వుంది...త్వరగా ఫో! ఆలస్యమైతే మళ్ళీ నీకు దక్కదు!"

"అద్దెంత హుజూర్ ?"

"ఆఁ; ఎంతయితే నువ్వివ్వగలవురే! అయినాకన్న ఎక్కువివ్వలేవను కుంటాను! నాకు దండుగే అనుకో! ఏం చేయను...హుఁ! ముసలి ముండా కొడుకువి...పుట్టెడు సంసారం!"

"ఏలినవారే మాకు తల్లీ తండ్రీ! కనిపెట్టుకున్నాం హుజూర్ !"

"అచ్ఛా! ఫో! ఇక ఫో!"

హరి వచ్చినదారినే మెల్లగా వెళుతున్నాడు. మునూ, లక్ష్మీ హరి వెంట బయలుదేరేరు. వెళ్ళిపోతున్న హరిని హెచ్చరిస్తూ థామస్ కేకవేశాడు: "జాగ్రత్త! నీ పనేదో నీ గొడవేదో! ఆలస్యంగా వచ్చావా, కొంపలంటు కుంటాయ్! కూత వినబడి వినబడగానే యిక్కడ వుండాలి! తెలిసిందీ ?" హరి వెనక్కితిరిగి చేతులు జోడించి "చిత్తంహుజూర్! ఏలినవారి ఆజ్ఞ!"

తన వెనకవున్న మునూవంక తిరిగేడు హరి. మునూ గుడిశ ఎక్కడ వున్నదో అని దిక్కులు చూస్తున్నాడు. "దగ్గిరే! అదిగో సందు; ఆ చివర్నే మన గుడిశ!" హరి దూరంగావున్న ఒక గుడిశను చూపించాడు. సమానాంతరంగా రెండు బారులుగా గుడిశలు ఎన్నో కనిపిస్తున్నాయి. ఒక్కొక్కగుడిశ ఆరడుగుల పొడుగూ, అయిదడుగుల వెడల్పూ! ఈ గుడిశలు, ఈ నేల ఇక్కడున్న ప్రతిరాయినీ, రప్పనీ తెలుసున్నట్టు హరి చక చక నడిచిపో తున్నాడు. తన పల్లెవదలి యిక్కడ ఒక ఏడాదిపాటు కాపురం వున్నాడు. ఏడాదిలో అంతా కొట్టిన పిండే!

గుడిశ వచ్చింది. గుడిశముందు గోనెగుడ్డ వేలాడగట్టివుంది. తలకు తగులుతున్న ద్వారంలోనుంచి బుర్రవంచుకుని లోనికి వెళ్ళారు. లోపల గబ్బిలాలుండేందుకు వీలుగా చీకటి. చిన్న చిన్న గడ్డిచాపలతో కప్పిన గుడిశ కప్పు, చూడ్డానికి అసహ్యంగా వుంది. పుచ్చిపోయిన దూలాలు నెత్తిమీద ఎప్పుడు పడతాయో దేవుడికే యెరుక. గుడిశ లోపలనుంచుందుకు చోటే లేదు. తల వంచుకునే నించోవాలి. ఇద్దరుకంటె హెచ్చు పట్టదు. మూడో మనిషి నించుంటే వొకళ్ళమీద వొకళ్ళు పడవల్సిందే. లోపలనుంచి పొగ

పోయేందుకు, పైనుంచి గాలి వచ్చేందుకు ఒక్క కిటికీ అయినాలేదు. గుడిశ కవతలవున్న బాటకంటె గుడిశలోని నేల లోతు. హరి ఇవతలకు వచ్చి మిగిలిన గుడిశలు యింతకంటె నయమేమో అని పరకాయించి చూశాడు. రామ రామ! ఇదేనయం! గుడ్డిలో మెల్ల! దీనికి మీద చాపలైనా వున్నాయి. ముందు గోనెపరదా అయినా వుంది. వాటి కవీ లేవు. పైకప్పులన్నీ కన్నాలే. ఒక గుడ్డకాదు; ఒకలోకం కాదు; చాపలూ, చిన్న చిన్న డబ్బారేకులూ, ఇంటిపైకప్పులు! నిట్టూరుస్తూ లోనికివచ్చి "సరే! ఏదోఒకటి!...కూచోండి... నిలబడ్డారేం?"

"ఇదేమిటి నా శ్రాద్ధం! ఈ దెయ్యాలకొంప!"

"లేకపోతే మేడలూ, మిద్దెలూ కావాలా రాణీగారికి?"

మునూ ఈ చీకటి కోణంలోనికి అడుగుపెట్టేసరికి వున్న ఆ కాస్త మతీ పోయింది. శ్మశానంవంటి యిక్కడ కాపురం! కుళ్ళువాసన; మురికికొంప. చీకటి పాతాళగుహ! ఇంతవరకూ కనీసం తానొక మేడలో వుండబోతున్నానని కలలుకన్నాడు. బొంబాయిరాగానే డబ్బు కొల్లలుగా దొరుకుతుందనుకుని భావించాడు. ఎండమావులవంటి ఆశలు అతని హృదయాన్ని నిష్కారణం బాధింపసాగేయి. ముచ్చెమటలుపోసి మొహం జేవురించుకుపోయింది. మనసు కుంచుకుపోయింది. నమ్మించి మోసగించిన బొంబాయి! కుత్తుక కోస్తున్న బొంబాయి! తలపోటు, కళ్ళల్లో వొకవిధమైన భయం తెరలుతెరలుగావచ్చి దాక్కుంది. చీకటి కనురెప్పలలో ఒదిగి కూచుంది. కళ్ళు మూస్తే చీకటి, తెరిస్తే చీకటి; ఇక్కడికి వుండలేడు. ఉండక తప్పడంలేదు. వాతావరణం గుబురుగా పొమ్మనలేక పొగబెట్టినట్టు! దీర్ఘంగా నిట్టూరుస్తు నిట్టూర్పు మధ్య ఒగురుస్తూ నిలబడ్డాడు. అబ్బ! నిలబడ్డమే కష్టంగావుంది. మూర్ఛవస్తోన్నట్లు కళ్లు జుమాయించుకుపోయి శరీరం తూలింది. కింద పడకుండా తానే కింద కూచున్నాడు. ప్రాణం తెప్పరిల్లింది. పెదవులమీద వొక చిరునవ్వు వికసించింది. "లక్ష్మి! తిండానికేమైనా మిగిలాయేమో చూడు!" అనే భర్తమాట వినిపించేలోపునే లక్ష్మి ట్రంకుతీసి రొట్టెపట్టుకొని గబగబ మునూ చెంతకు వెళ్ళింది. ప్రయాణబడలిక కాబోలును, "మొహం వొడగొట్టింది కాబోలును!" మునూ కిందపడిపోయాడు. లక్ష్మి, మొహంమీద నీళ్ళు చల్లింది. కళ్ళు తెరచి చూశాడు మునూ. "కాఫీ తాగొద్దాం, రా!"

మునూ ఎప్పటికిమల్లే లేచాడు. గుక్కెడు మంచినీళ్ళుతాగి, హరివెంట బయలుదేరేడు. ఇక్కడికి బజారొక మైలుదూరం. సర్ జార్జి వైట్ మిల్లు దాటితే జమ్షెడ్జీ కొవాజీ ఫ్యాక్టరీల కవతల చిన్న బజారు తగులుతుంది. బజారునిండా షోల్లాయి దుకాణాలే! చిన్న చిన్న కత్తులు, చాకులు, యిమిటేషను ముత్యాలు, గాజుపూసల దండలు, బొమ్మలు, దుకాణాలముందు పెట్టుకుని బేరగాళ్ళకోసం షాహుకార్లు ఎదురు చూస్తూవుంటారు. ఈ రకరకాల వస్తువులతోనే యూరపియనులు ఆశియాను ఆక్రమించుకోగల్గారు. ఇవికాక మరొక పక్క కిల్లీకొట్లు, బీడీకొట్టు, సారాదుకాణం వున్నాయి. పార్శీవాడు సారాయికొట్టులో కూచున్నాడు. టక టక మని సింగరుమిషను తొక్కుతూ కూనిరాగం తీస్తూ బట్టలషాపులో దర్జీవాడు బీడీ కాల్చుకుంటున్నాడు. గడ్డం సవరించుకుంటూ సన్నగా ఒక సిక్కు మరొక షాపులో కూచున్నాడు. సిక్కు షాపులో అన్ని వస్తువులూ దొరుకుతాయి. సిక్కు కళ్ళు ఎగరేస్తూ తలమీద పగిడీ సవరించు కుంటున్నాడు. హరి చేతులెత్తి నమస్కరిస్తూ "సలాం! సర్దార్జీ! సలాం!" సిక్కు "ఎప్పుడొచ్చావు హరీ? ఏమిటిన్నాళ్ళు? పత్తాలేకుండా పోయావ్!" అంటూనే "ఒకటీ, రెండూ, మూళ్ళూ" అని బియ్యం కొలుస్తున్నాడు. షాపు ముందర కూలీలు చెంగులు పరచుకుని బియ్యం కొలిపించుకుంటున్నారు. సిక్కు వొక్కొక్కర్నే బియ్యం కొల్చి పంపించి వేస్తున్నాడు. మునూ దూరంలోనే చతికిలబడి బేరగాళ్ళవంక తదేక దీక్షతో చూస్తున్నాడు.

హరి వినయంగా సిక్కు అడిగిన ప్రశ్నకు సమాధాన మిచ్చాడు. "నిన్ననే వొచ్చాను"

"పిల్లా పాపా కులాసా?"

"కూడా తీసుకొచ్చేసాను, సర్దార్! వొక్కణ్ణీ వొండుకోడం కష్టం. పురాకులు పళ్ళేను!"

కూలీలు చీమలగుంపుల్లా వొక్కరొక్కరే వచ్చి దుకాణంముందు చేరేరు; గర్దీ ఎక్కువయింది! సిక్కు మరి మాట్లాడకుండా బేరం చూసుకుంటున్నాడు! "ఒకట్లూ, రెళ్ళూ, ఆఁ, మూళ్ళూ... గాడిదకొడకల్లారా! ఏమిటాగొణగొణ జొరిగల్లాగ... కాస్తనోర్మూసుకోలేరూ? ఇది మీ యిల్లను కొన్నారా, నా షాపనుకున్నారా! మీరు... పనిలేనివాళ్ళు పొండి! ఎందు

కిక్కడ యమదూతల్లా; పని మారుగుళ్ళవుతుంది. ఒకటి, రెండూ, మూడూ... ఎంతరా, కొలిచిందీ...హాఁ!"

కూలీలు నిశ్శబ్దంగా ఊరుకున్నారు. గొడవ అణగింది. గొర్రెల్లాగ తల లూపుతూ నమ్రతతో నవ్వుతూ బేరగాళ్లు ఈ తిట్లన్నీ ఎవరికివారే తమవి కావని పక్కవాళ్ళవని భావిస్తూ సంతసించసాగేరు. సిక్కు బేరగాళ్ళను త్వరగా పంపించివేస్తున్నాడు. "ఊఁ నీకేంకావాలి?...ఎవరది? ఫోర్ మెన్ దొర నౌకరువా? నీకేంకావాలి?"

"రెండు రొట్టెలు...డజను కోడిగుడ్లు; రెండు కోడిపిట్టలు!"

"అంతేనా! ఇంకా ఏమన్నా కావాలా?...ఇదిగో ఒకటీ, రెండూ, మూడూ ఆరున్నొకటీ..."పాట పాడుతూ కోరిన వస్తువులన్నీ ఫోర్ మెన్ నౌకరు తువ్వాలులో పోశాడు.

సిక్కు దృష్టి యింకొక కూలీపైకి పోయింది. "గుడ్లగూబలా అలా కూచుని చూస్తావేం? టకటక కావల్సిందేదో అడిగి పట్టుకుపో"

"నేనండి......శంభుదాసుని!"

"సరే, సరే! ఏం పట్టుకొచ్చావ్? ఎంత ఖరీదు?"

శంభుదాసు సిక్కు దగ్గరకు పోయి కండువాలోకప్పిన వస్తువును తీశాడు. అది వస్తువు కాదు. బట్ట ముసుగులోంచి "కక్కక్కక్క" అనే ధ్వని వినవచ్చింది. "బాగానే వుంది. సందట్లో సడేమియా ఇప్పుడేం బేరం! చేయి వూరుకోలేదు పోపో".

"అమ్మమ్మమ్మా అలా కాదండి! లెక్క చాలా జరూరు. ఏదో ఓకాడికి పుచ్చుకోండి!"

"ఎంత? ఊఁ! టకటక......చెప్పేసేయ్! నా దగ్గిరిన్ని బేరాల్లేవ్; ఖరాఖండి! తాడోపేడో వొకటేమాట? ఎంత?"

"ముందిది పట్టుకుచూడండి. ఎంత బరువుందో మరి!" శంభుదాసు చేతిలోంచి కోడిపెట్టనుతీసుకుని సిక్కు మెల్లిగా దాన్ని కుదిపి, కుదిపి ఎగరేసి పట్టుకున్నాడు. "అబ్బే! బరువొకటా దీనికి? బక్రువటు బరువు! ఉత్తి ఎముకలపోగు! ఎక్కడా నరంలేదురా భాయ్! ఎక్కడ దొరికిందో కాని!"

"అమ్మమ్మమ్మ! అలా అంటే ఎలాగ? ఒకటోరకమైన పెట్ట! మా కున్నా లేకపోయినా నా నా బాధలూపడి తవుడూ, గివుడూ కొని మేపాం!"

"తవుడుతిన్న పెట్ట వాలకం యిలా వుండదు! చూడగానే తెలుస్తుంది దాని చలాకీ!...సరే... చెప్పు...ఎంతకిస్తావ్?" సిక్కు కాస్త ఆగి ఇదింత ధరవస్తుందా అని ఎగతాళిగానవ్వుతూ చు కనచేస్తూ రెట్టకన్నుతో శంభుదాసు వంక చూస్తూనే వున్నాడు.

"తమ రలా సెలవిస్తే ఎలాగ సర్దార్! మీరేకదా మాకు తల్లీ తండ్రీ అన్నీ! ఎంతకో కొంతకి పుచ్చేసుకోండి! కొన్నందుకు మీకూ వొద్దు నష్టం; అమ్మినందుకు నాకూవద్దు లాభం! సిసలైనధర సెటిల్ మెంటు చేయండి! ఎందుకిన్ని బేరాలు!"

ఈ బేర సారాల్లో పడి అసలు బేరమే మర్చిపోయాడు సిక్కు. ఫోర్ మెన్ నౌకరు యింకా అలాగ నించునేవున్నాడు. రొట్టెలు, కోడిగ్రుడ్లు యిచ్చాడేకాని వాడడిగిన కోడిపెట్టల్ని యివ్వనేలేదు. గబుక్కున దుకాణదారుడు ఫోర్ మెన్ తైనాతీకేసితిరిగి "ఇదిగో, ఈపెట్ట పట్టుకుపో! దొరగారి పద్దులో రాసేస్తా!"

"ఎంత బాబూ!"

"ఎంతో కొంత! నువ్విస్తావా డబ్బు! నీకెందుకు?" సిక్కు మరొక పుంజును లోపలనుంచి తెచ్చి అతనికిచ్చి పంపించివేశాడు; వెళ్ళిపోతున్న ఫోర్ మెన్, నౌకరుని పిల్చి "ఇంద! ఈ లడ్డుండలు ధొరసానమ్మగారికియ్యి... పద్దు రేపు చూసుకుందాంలే!"

ఇక ఆట్టేసేపు పడిగాపులు పడడం శంభుదాసుకు కష్టమనిపించింది. "త్వొందరగా తోలెయండి నన్ను! పనుంది అవతల!"

"సరే; ఏదో ఒకటి! బియ్యం కావాలా, డబ్బే పట్టుకుపోతావా?"

"ధర ఎంతో తేల్చేరుకారు."

"ఏదో ధర...హుఁ! ఏం కావాలి?"

"కొంచెం డబ్బూకావాలి; బియ్యమూ కావాలి".

"ఒహో! అవ్వాకావాలి, బువ్వా కావాలీ? సరే...సరే...నాలు గణాలు పట్టుకుపో! శేరుబియ్యం తూచనా?"

"అయ్యబాబు ! అసల్లో ఆకోవంతు లేదు ధర ! బాబ్బాబూ !... పుణ్యముంటుంది !"

"తీసుకుపోవోయ్ ? ఎవడిక్కావాలీ అక్కుపక్షి !"

"చేతిలో చిల్లిగవ్వలేదు సర్దార్‌జీ ! నాలుగు రోజులనుంచి యింటిల్లి పాదీ పస్తు ! నేను కొనడమే రెండ్రూపాయలకి కొన్నాను !"

సిక్కు క్రోధంతో కళ్ళెర్రజేసి "దీనితో బంగారు మేడలు కడుతున్నానా ?...నీ వెధవ కోడి నిష్కారణం వృత్తినే పోయింది ! చూశావు కదా, నీకళ్ళతో ! ఫోర్‌మెన్‌దొరకి కాస్తంత నోరుతడపకపోతే నావ్యాపారం సాగదాయె ! అప్పుడప్పుడు 'మేవా' మేపుతూనే వుండాలి !... చూస్తున్నావ్ కదా ! నీ కళ్ళ ముందే దొరగారింటికి ప్రెజంటు పంపించేశానే కోడిని !"

శంభుదాసు వృత్తి పుణ్యానికి తన 'పిలక సిక్కుచేతి కందిచ్చానే' అని బాధపడసాగేడు. అతని చేతులోని కోడిని లాక్కుని, ఫోర్‌మెన్‌కు 'కప్పి' యిస్తున్నానంటున్నాడు. తనకిక కోడేలేదు; ఈ న్యాయమైన ధరారాదు: బతిమాలుతూ చేతులు జోడించి "మీరెన్నైనా బహుమతు లివ్వగలరు సర్దార్ ! డబ్బున్న మారాజులు ! నాకా కోడేగతి......అప్పులు పాలయి పోయాను ... నాలుగురోజులై తిండీ, తిప్పల్లేవ్ ! శేరు బియ్యం ఒక్కపూటకి రాదు. పావలాతో యీ బొంబాయిలో ఏం చేసుకుంటాను ?... కాస్త హెచ్చు ధర యిప్పించండి..."

"ఒక్కటే మాట; ఇన్ని మాటల్లేవ్ నాదగ్గిర...అన్నమాటకు తిరుగు లేదు !"

"అన్యాయం, అన్యాయం సర్దార్‌జీ !

సిక్కు వుగ్రనరసింహావతారందాల్చి చిరచిరలాడుతూ "నాది అన్యాయం ?...నీది న్యాయం ?...... అట్టే బిగుర్లు బిగరకు ! తల పరువు నోరు చెబుతుందనీ !...గాడిదకొడకా ! నే నన్యాయం చేస్తున్నానట్రా...యిచ్చిందేదో తీసుకెళ్ళు; తీసుకెళ్ళు !..."

అసలే శంభుదాసు నీరసంతో వణకెత్తిపోతున్నాడేమో, బుగ్గలు లొత్తలు పడ్డాయి. కళ్ళుగుంటలు పడ్డాయి. వణకిపోతూనే కోపంతో చిటపటలాడేడు. అయినా కోపం దిగమింగుకుందుకు ప్రయత్నిస్తూ "నే నడిగింది న్యాయమే కదా సర్దార్!"

"అయితే నే నంటోన్నది అన్యాయమా?"

"అడ్డకుపడ్డా ఇదేం ధర, సర్దార్! నా కోడి నాకిచ్చేయండి!"

"నీ కోడి నాదగ్గి రెక్కడుంది? ఇదుగో జట్టీలెందుకు......తీసుకో యింద, పావలా!" సిక్కు పావలా కాసు గల్లాపెట్టెలోంచితీసి గిరవాటేశాడు. బియ్యం తూచేందుకు కాటా దగ్గర కెళ్లాడు. శంభుదాసు తనకోడి తన కిమ్మంటున్నాడు. "నా దగ్గరలేదు; తీసుకుంటే తీసుకో; లేకపోతే పో."

శంభుదాసుకి పీకమొయ్యా కోపం వచ్చింది. సిక్కు ఆతన్ని ఖాతరు చేయకుండా "పోతావా! పోవా?...దేబిమొహం పెట్టుకుని! నా దుకాణం దగ్గిర నువ్వెందుకు? బేరానికడ్డు!".

"ఆఁ! అడ్డు! ఎవరిబాబుగారిదా కోడి! పుఃపురా యిచ్చేశావ్!"

"నువ్వునువ్వా! మాటలు తిన్నగా రానీయ్" అంటూనే సిక్కు, శంభుదాసుమీద కలియబడ్డాడు. కర్రపుచ్చుకుని తలమీద వొక్కటివేశాడు. శంభుదాసు కిందకు వొరిగిపోయాడు. సిక్కు, కర్ర మళ్ళీఎత్తి మూతిమీద కొట్టే లోపున లేచి నిలబడ్డాడు. రక్తం బొటబొట కారుతున్నది. చంటిపిల్లవాడిలాగ ఏడవడ మారంభించాడు. సిక్కు, కర్రపట్టుకుని శంభుదాసు తలమీదవెయడం, శంభుదాసు కిందపడడం మునూ యింతసేపై చూస్తునేవున్నాడు. కాని ఈ కుక్క జట్టీతో తనకేమి సంబంధం! అలాగనే ఊరుకున్నా తీరా శంభుదాసు తలమీద నెత్తురు చూసేసరికి మునూకు జాలికలిగింది. కాని అతనేమీ మాట్లాడ లేదు.

హాఁ, మిగిలిన కూలీలు, ఏడుస్తున్న శంభుదాసుని ఊరడిస్తున్నారు. "ఊరుకో! చిన్నపిల్లాడిలా ఏడుస్తావెందుకు? ఎవరన్నావింటే నవ్విపోతారు!" శంభుదాసుమీద కూలీలకు జాలికలిగింది కాని, ఎదురుగుండా సిక్కు వున్నాడు. సిక్కు మా చెడ్డ చిక్కులమనిషి! శంభుదాసుని వెనకేసుకొస్తే అతనితో పీకులాటపంచాంగం! ఎవడు పడగలడు?

సిక్కు "తగిలేయండి పీనుగుని! నాకంటికి మళ్ళీ కనిపించు!...ఊఁ! ఇంద అణా! పట్టుకుపో నీబియ్యం, డబ్బూను!"

శంభుదాసు తెప్పరిల్లాడు. కారుతున్న నెత్తురు అరచేత్తో తుడుచుకుంటూ "తప్పయిపోయింది సర్దార్ జీ! మాట తూలాను!"

"పో! పో! పో!"

డబ్బూ బియ్యం పట్టుకుని శంభుదాసు నెమ్మదిగా వచ్చినదారిపట్టేడు. చీకటిలో యిట్టే మటుమాయ మయాడు.

"మీకేం కావాలర్రా! చెప్పండి?" సర్దార్ ధాంధూం అన్నాడు. మిగిలిన కూలీలు "ఏంలేదు సర్దార్జీ! కూలిపని వుందేమోనని!"

"ఏంలేదు! నేనేం చెప్పను; పొండి! కూలీలేదు, గీలీలేదు!"

"స్టేషనుకి మూటలు పట్టుకెళ్ళాలన్నారు కదా!"

"మూటలూ గీటలూ!...పొండి పొండి"

అక్కడే నించున్న మునూ వంక తిరిగి అదే స్వరంతో "హాయ్!" ఓయ్ అబ్బాయి! నీకేం కావాలి!"

మునూ సమాధానం చెప్పేలోపునే హరి "వాడికేమీ అక్కర్లేదండి... మనూరికి కొత్త. నిన్ననే వచ్చాడు...
రేపు పన్లో ప్రవేశిస్తాడు!"

"సరే! ప్రవేశించమను...మంచిది!"

"అదేనండి! కాతా వాడిపేరున..."

"నీకు బాగా తెలుసునా?"

"నాతోనే కదండీ సర్దార్, వాడుంటూంట!"

"సరే...సరే..."

హరి నోరు మెదపలేదు. సిక్కు తన ధోరణిలోనే "కానీ ఓ మాట బ్బాయ్! మునపటిలాగ డబ్బు పెగలడంలేదు! మాచెడ్డ రొక్కటంగా వుంది...రూపాయికి పావలాడబ్బులు వడ్డీపలుకులోంది...నాకొక్క అణాయే లాభం! అయిదణాలు చేసి పట్టుకుపో...ఎంత కావాలి లెఖ్ఖ?"

"రొక్కమేమీవద్దు సర్దార్జీ! రెండ్రూపాయల బియ్యం, రెండ్రూపాయల పప్పూ యిస్తిరా, మీ పేరు చెప్పుకుంటాం యింటిల్లిపాదిమీ!...... మిగతా సామానుకి రేపొస్తాను...డబ్బట్టుకుని!"

"సరే...అలాగేకానీ...అయితే వొకటి...రూపాయికి నాలుగణాలే వడ్డీ!"

"మీతో మాకు బేరా లొకటా? సర్దార్జీ! మీ రెంతంటే అంతే! మీమాట కదురులేదు!"

"ఆనక తిరకాసొస్తే నేనొప్పుకోను!...ఇంతేనా కావాలి, ఇంకే మన్నా కావాలా?"

సిక్కు సానుభూతితో ఏదో మహోపకారం చేస్తున్నట్టు అడిగేడు.

"సర్దార్‌జీ! పిండి ధరెంత ?"

"ఆఁ! ఎంతోనా ? శేరు రూపాయి, బియ్యం రూపాయి పావలా! ఆవనూనె పదణాలు...పంచదార రూపాయిన్నర...త్వరగా చెప్పు...... నాకు అవతల బోలెడంత పనుంది ! నీతో కూచుంటే తెల్లారుతుంది ! చెప్పు ! ......ఏం కావాలి ?"

"సర్లెండి...సామానంతా పట్టుకుపోతాను."

"పట్టుకెళ్ళు, నే నొద్దన్నానా? కాని ఎక్కడికక్కడ ఎప్పటికప్పుడు నివాడా అయిపోవాలి!"

"పదిశేర్ల బియ్యం యిప్పించండి సర్దార్జీ!"

"హాఁ! పంచదార?"

"వీళదు!"

"సరే; సరే; పిండో?"

"అదో పదిశేర్లు!"

"పప్పు మాటేమిటి?"

"చాల్లెండి ఓ అయిదుశేర్లు!"

"నూనోయ్! బ్రాజమానం?"

"అవునవును; మర్చిపోయాను సర్దార్జీ! ఒక శేరు కొలిపించండి! ఏలాగో సర్దుకుంటాం"

శిక్కు, బియ్యం కాటాలోపోసి తూకంవేశాడు. పదిలంగా మొగ్గు ఒక్క పిసరులేకుండా తూచి పొట్లాలుకట్టి "ఎంతయిందో తెలుసా?"

"నాకు లెక్క తెలిస్తే యింకేం బాబూ !"

"సరే; సరే; సరేలే ! నెలాఖరున జీతాలిచ్చేటప్పుడు..."

"అలాగలాగే, సర్దార్జీ !"

ఈసామానుకెంత ఖర్చవుతున్నదీ మునాకు అవసరంలేదు. తనకు నెలకు పదిహేను రూపాయల జీతం ! వో ! ఎంతయితేనేమి ? కొంప మునిగిపో లేదు !

... ... ... ...

తెల్లవారడంతరవాయి, ఫ్యాక్టరీ, చెవులుచిల్లులుపడేటట్లుకూతకూసింది. ఫ్యాక్టరీ కూత చెవిని పడకుండానే యిక పడపోతుందనే భయంతోనే, తెల్ల

వారుర్ఘామునే లక్ష్మి మేలుకొంది. మేలుకోడంతడవు, కళ్ళు నులుపుకుంటూ, జారిపోతున్న పమిటనైనా సరిచేసుకోకుండా రాత్రినుంచీ అందుకే పలవరిస్తున్నట్టు మూలకుపోయి కుండతీసింది. కుండలో మిగిలిన పప్పూ, దాకలోని పులుసూ, తీసి ఓదగ్గర పెట్టింది. కుండ బరబర నీళ్ళుపోసి తొలిచింది. లక్ష్మి యిద్దరు పిల్లలతల్లి. కాని నవయవ్వనంతో తొణకిసలాడుతోంది. మొహంలో నాజూకు సడలలేదు. జబ్బల నిగారింపు తగ్గలేదు.

మెడచుట్టూ పోసిన చిన్న చిన్న చెమటబిందువులు శంఖాల తావళం వలె శోభిస్తున్నాయి. పల్లెజీవితం ఆమెకు ఎంతో ఉత్సాహాన్ని ప్రసాదించింది. పొంగులు తీస్తున్న యవ్వనాన్ని ఉద్రేకపూరితం చేసింది. ఇంకా జీవితంలోని మెరకపల్లాలు, ఎగుడు దిగుడులు, మంచిచెడ్డలు రుచిచూడలేదో, లేక సహజంగా ఆమె స్వభావమో మరి, ఆవిడ ఎప్పుడూ నవనవలాడుడూ వుంటుంది. దంతపు బొమ్మ వంటి గాజు కళ్ళు, నల్లటి కాటుక కళ్ళల్లో తెల్లని వెలుగు నీడలు. చిన్నపిల్లలు ఆడుకునే రబ్బరుబొమ్మ కళ్ళు, పగడపు రంగు బుగ్గలతో పందెంవేస్తున్నాయి. ఈ రెండింటిలోను ఎవరిది హెచ్చు అందమో ఎవరమూ చెప్పలేము. ముక్కుకున్న రంగురంగుల పొళ్ల ఆభరణం వెలుగు చీకట్లు మధ్య తళతళ, ధగధగ మెరుస్తోంది. సన్నని పెదవులమధ్య భయమంటే ఏమిటో ఎరుగని చిరునవ్వు చిందుతున్నది. కిందిపెదవి కింద, వుందా లేదా అనేటంత చిన్ని లొత్త. రహస్యంగా దాగుకున్న అందాన్ని దాచుకున్న చిన్న లోతు. తను వున్నట్టు తనకే తెలియని చిన్నని రేఖ.

ఫ్యాక్టరీకూత వినేసరికి లక్ష్మి సింహగర్జనవిన్న లేడిపిల్లలా చటుక్కున లేచింది. కదలాడే కాటుక కళ్ళతో నలుమూలల వెదుకుతూ నాలుగూ సవరించుకొని ఆ పనీ, యీ పనీ చేసుకుంది. ఫ్యాక్టరీ మళ్ళీ కూసింది. తెలియని భయం గుండెల్లోంచి తొంగిచూసి లక్ష్మికెందుకో నవ్వు వచ్చింది.

ఏం చేయాలో తోచని అమాయిక నవ్వు! తొందరమాత్రం పడాలి. మగని చెంతకు పోయి భయంతో చుట్టబెట్టుకున్నట్టు కౌగలించుకుంది. భర్త కాలి బొటనవేలు పట్టుకుని మెలికెలు తిప్పి మెల్లగాపిలుస్తూ లేపింది. అదరిపడి లేచి "హాఁ! హుూఁ!" మని హరి మూలిగేడు. నెమ్మదిగ లక్ష్మి "లెండి! లెండీ! టైమయిపోయింది!" హరి నిద్రలేచాడు. కళ్ళ ముందు లక్ష్మి, లక్ష్మిలా కనిపించింది.

ఇంకా నిద్రపోతూనే వున్న పిల్లల్ని లేపి పిల్లల మొహాలు తల్లి తన చీరకొంగుతో తుడిచింది. మునూ నిద్రలో ఎవరితోనో దెబ్బలాడుతున్నాడు. హరి, అతని భుజాన్ని తట్టి లేపుతున్నాడు: "లే, తమ్ముడూ ! లే ! లే !"

మెల్ల మెల్లగా కళ్ళు తెరిచాడు. తల ఇటు అటు తిప్పాడు. ఆవులించాడు. చేతులు చాచాడు. కాళ్ళూ శరీరం నిగిడించి బద్ధకం విరుచుకున్నాడు. చేతులు వెనక్కి లాగుకుని ఆనుకుని ఒక్క ఊపున గొంతుకపడి కూచున్నాడు. కూచుని తల ఎత్తేసరికి ఎదుట తలమీద మేలిముసుగులేని లక్ష్మి మోము నవ్వుతూ కనిపించింది. లక్ష్మివంటి ఆడపిల్లల్ని తాను యిదివరకు చూశాడు. ఇదే వయస్సులో, ఇదే వొడ్డూ పొడుగుతో రంగుతో వున్న ఆడపిల్లలు బీస్‌నదీ తీరానికి అప్పుడప్పుడు వస్తూవుండేవారు. ఈ పిల్లనుచూసీ చూడగనే, పొద్దున్నే, అవన్నీ, తన చిన్ననాటి సంగతులు, చూసిన దృశ్యాలు జ్ఞాపకం రావడం ఎంతహాయి!

ఆమెను అడగాలనికాదుగాని, ఆమెకు వినబడాలని మునూ "మొహం కడుక్కుందు కిన్నినీళ్లుంటే బావుండును?" ఆమె అతనికేసి చూసింది. నవ్వుతున్న కళ్ళను వెనక్కి తిప్పేసుకుంది. గిరుక్కునతిరిగి గుడిశ మూలకుపోయి చిన్నచెంబుతో నీళ్ళను అక్కడే పెట్టింది. గుడిశలో నీరుపోడానికి గోడకు చిన్నతూమువుంది. తూముముందు చిన్న రాతిపలక.

లక్ష్మి కుర్రవాళ్లకు చల్దన్నం పెట్టేందుకు పళ్లెంతీసింది. "బాగానే వుంది. తిండీతిండానికి టైమేది? అంత పెట్టాలనుకున్నదానవు, పొద్దున్నే లేవలేకపోయావటే? పద! పద!...తిండీతిప్పలూ..." భర్త తొందరపెడుతున్నా వద్దంటున్నా పిల్లలకు అన్నం తినిపిస్తోంది భార్య. పిల్లలకు అన్నం "సాయించడం"లేదు. నిద్ర యింకా పోదామనుకుంటే మధ్యలో లేపేశారేమో, పిల్లలకు చికాకుగావుంది. హరి తొందరపెడుతున్నాడు. "రావే! నిక్కినీలిగి వెడితే ఫ్యాక్టరీలో అడుగుపెట్టనీయరు!...ఒహోహో! రమ్మంటూంటే..."

"ఏవిటండీ ఆ తొందర? కచ్చల్లో కందులు వేపకండి! మీకు పుణ్యముంటుంది!"

"రండర్రా! రండి!" అంటూనే వాళ్ళు వస్తున్నారో లేదో వెనక్కి తిరిగి చూడకుండానే హరి గుడిశ అవతలకు వచ్చేశాడు. జుబ్బాతో మొహం

తుడుచుకుని ప్రాణం కాస్త తెప్పరిల్లగా మునూ అతనివెంట పడ్డాడు. కానీ నోరు అరుచి, చేదు! చేదు! గుటుకవేస్తే...అబ్బ!

లక్ష్మి యింకా యివతల కూడిపడలేదు. అదీ ఇదీ సర్దుతోంది. పొద్దున్నే పిల్లల. కేమిటేమిటో అంగ్ ష్ణలు పెట్టాలని ఉబలాటం. పిల్లవాడికి క్రాపింగు దువ్వింది. పిల్లకు జడవేసింది. తాను చీర మార్చుకుంది. పైన నిలబడి హరి విసుక్కుంటున్నాడు: "రావే, త్వరగా! రావే, త్వరగా రా! దబ్బునీ!" భర్త కేకలు విని అదిరిపడి కుర్రవాళ్ళను ముందుకు తోస్తూ లేడి పిల్లలా పరుగులమీద యివతలకు వచ్చింది.

మురుగునీటి గుంటవద్ద కూలీలు కాళ్ళూ, చేతులూ కడుక్కుంటు న్నారు. మరికొందరు పళ్లుతోముకుంటున్నారు. దూరంగా చెట్లచాటున కొందరు చెంబిటి కెడుతున్నారు.

మూడవసారి ఫ్యాక్టరీ 'బయ్'మంది. కూలీలు ఒకర్నొకరు తోసు కుంటూ ఎవళ్ళమానాన వాళ్ళు ముందుపోదామనే తలంపుతో ముందుకు అడుగులు వేస్తున్నారు, దారి సమంగా లేదు. పచ్చని పచ్చికపై మంచు బిందువులు మెరుస్తున్నాయి. కూలీల చికాకుకు అంతులేదు. దున్నిన చాళ్ళవలె వున్న నుదుటిమీద ముడుతలతో కనుబొమ్మలూ, మొహం ముళించుకుని వొకరిమీదవొకరు ఎగిరెగిరి పడుతూ ఫ్యాక్టరీ ఎన్నమ్మకూతకు అదిరదిరి పడుతూ ఒక్కొక్కసారి నడక, అంతలోనే పరుగు. పరుగు పరుగున ఫ్యాక్టరీకి పోతేనే పరువూ మర్యాదా దక్కేది. లేకుంటే మేస్త్రీ ధాంధూ!

ఫ్యాక్టరీ గడియారం ఆరుగంటలు కొట్టింది. నోట్లో వేళ్ళు పెట్టుకుని దిక్కులు చూసుకుంటూ హరి పిల్లలు తల్లివెనక నడుస్తున్నారు. మునూ 'అప్పుడే ఆరయింద'న్నాడు. హరి స్పీడు ఎక్కించాడు. మలుపు తిరిగి ఒక కాళీ జాగాలోనికి అడుగుపెట్టాడు. జాగా లారీలతో, పత్తిబేళ్ళతో నిండి వుంది. తోవచేసుకుంటూ హరి తన బృందంతో ఫ్యాక్టరీకి వెడు తున్నాడు. ఫ్యాక్టరీకి వెళ్ళే తోవనిండా పేడ, అశుద్ధం, మురికి, చెత్తా చెదారం. కూలీలకీ కంపు, ఛండాలం, మామూలే. ముక్కుబద్దలుకొట్టే దుర్వా సన వాళ్ళకు కొత్త కాదు. ఈ మురికి వాసనకి, ముళ్లదారి నడకకు, అర్ధా కలికి, రెక్కలు ముక్కలయే చాకిరీకి కూలీలు అలవాటుపడిపోయారు. ఈ జాగాలోకి యింత సేపటికి అడుగుపెట్టగలమనే సంతసంతప్ప వాళ్లకి విచారంలేదు. వాళ్ళు నివసించే నరకకూపాల్లాంటి గుడిశల కంటె, ఎలకల

బోనుల కంటె, ఖైదు కొట్టులకంటె యీ కాళీబాగాలో గాలీ, వెలుతురూ వుందికద! ఎప్పుడు తెల్లారుతుందీ, ఎప్పుడు గుడిశల్లోంచి యివతల పడతామా అని ఎదురుతెన్నులు చూస్తూ, మళ్లీ ఎప్పుడు సాయంత్రమవుతుంది, ఎప్పుడీ ఫ్యాక్టరీ జైలునుంచి విడుదలవుతామా అని పడిగాపులుపడుతూ, కూలీలు గుడిశెలకు వస్తారు. మళ్ళీ అంతా మామూలే. పొద్దున్న, సాయంకాలం గుడిశ, ఫ్యాక్టరీ...ఇక్కడా అక్కడా ఎక్కడా సుఖమూ, తృప్తీ, ఆనందమూ, ఆశాలేని జీవితం!

నడుస్తున్నకొద్దీ ఫ్యాక్టరీ దూరమవుతున్నట్లేవుంది. "వచ్చేశాం, అదే చింతాంసాహేబ్ బంగాళా!"

"ఎవరిదో ఆ పూలతోట?"

మనూ కెదురుగ ఒక దివ్యమైన బంగాళా, దానిచుట్టూ పూలతోటా కనిపించాయి "అది మేనేజరు ఆఫీసు. ఆఫీసుదాటేక చింతాంసాహేబ్ బంగాళా."

షెడ్దగ్గరకువచ్చారు. తలుపుముందు థామస్ నిలబడి మీసాలు మెలిపెట్టుకొంటూ, తల ఆడిస్తూ ఠీవిగా వచ్చే కూలీజనాన్ని పరీక్షిస్తున్నాడు. థామస్ కనీకనిపించగానే "సలాం, సలాం!" "దండాలు! దండాలు!" అంటూ కూలీలు చేతులెత్తి జోహుకూములుచేస్తున్నారు. దణ్ణాలు పెట్టడమే తరవాయి, చేతులెంతవేగంగాఎత్తేరో, అంతకంటే వేగంగాకాళ్ళు ఎత్తిగేటుదాటి చరచర లోనికి వెళ్ళిపోతున్నారు. గద్దనిచూసి భయపడిపోయే కోడిపిల్లలవలె మేస్త్రీనిచూసి కూలీలు జడుసుకుంటూ ఒకొక్కక్కరే, ఫ్యాక్టరీ ఆవరణలోకి చేరారు.

ఇది థామస్‌కొక పండుగ. ఒకపర్వదినం. ఠీగ్గా గొర్రెలను తోలినట్టు కూలీలను తోలుతూ, ఆకాస్సేపూ తానొక ప్రపంచ నియంతనను కుంటూ మీసాలు మెలితిప్పి నిలబడతాడు. కళ్ళెగరేస్తాడు. కనుబొమలు చిట్లిస్తాడు. కోప్పడతాడు. అదిలిస్తాడు. అరుస్తాడు. ఆలస్యమయిందంటాడు. జాగ్రత్తంటాడు.

కూలీలు వొకొక్కక్కరే నూకాలమ్మనుచూసినట్టు బెదురుతూ థామస్‌కు వంగివంగిసలాములు చేసుకుంటూ వెళ్ళిపోయాక, మెల్లగా తక్కుతూతారుతూ హరి అతని చెంతకు వచ్చినిలబడ్డాడు: "సలాం సాహేబ్! సలాం సలాం!" నిక్కర్లోంచి జేబురుమాలు తీసి మొహాని కద్దుకుంటూ "ఒహో! కొత్త

కూలీలా, మీరు ?" అన్నాడు థామస్. అవును బాబూ ! కొత్తకూలీలం ! కొత్త కూలీలం"

హుఁ ! రండి రండి ! నావెంట రండి ! పనుల్లో దిగవిడిచి వస్తాను." థామస్ ఆజ్ఞాపించడమేమిటి "వస్తున్నాంబాబుగారూ!" అంటూ హరీ, వాళ్లూ అతన్ని అనుసరించడమేమిటి, రెండూ వొకేసారి లిఫ్టులో జరిగిపోయాయి. "ఏయ్, అడకూలీ ! దా ! హేయ్ గుంటకక్కగట్టా ! ఇదుగో ! ఇలా, ఇలా ఇటు ఇటూ" అంటూ థామస్ బుర్ర వొంచుకొని సన్ననిదారి మధ్య ఆగి పోయాడు : "అలా వెళ్లండి ! మాట్రన్ మీకేపని చేయాలో పురమాయిస్తాడు." థామస్ మాట్లాడే భాష హిందూస్తానీయే కాని, దానితుదా మొదలూ ఏమిటో మాత్రం లక్ష్మికి బోధపడడంలేదు. అతనిమాటల కర్థం తెలియక ఏంచేయాలో తోచక, మేలిముసుగు సవరించుకుంటూ మిడుతూ మిడుతూ చూస్తూ నిల బడ్డది. థామస్ లేనికోపాన్ని నటిస్తూ బూటుకాలితో నేలను దబ్ దబ్ మని కొట్టి, మొహం కందగడ్డలా చేసుకొని, "పోరేం? పొండి పొండి పనుల్లో!" కనికేక వేశాడు. గజగజ నిలువునా వణికిపోతూ కంపించిపోతున్న భార్యను, హరి బరాబరా చేయిపట్టుకొని షెడ్ లోకి లాక్కుపోయాడు. లక్ష్మి, పిల్లన్ని తనతో తీసుకువెళ్ళేలోపునే హరి, ఆమెను గొరగొరా యీడ్చుకు పోయాడు. షెడ్ వద్ద తలుపుపక్క నించున్న మాట్రన్ మహాశయుడు లక్ష్మిని చూడగానే "రా, పిల్లా రా ! ఇక్కడేం పాముగీమూ నిన్ను కుట్టదులే!" దిక్కులు చూస్తున్న లక్ష్మిని థామస్ గదమాయించి తరిమివేసిన తరవాత తనకూ హరికీ యీ పాట్లు ఎలాగా తప్పవనుకొని, మునూముందే జాగ్రత్తపడి అతనిచేత మాటలు తినడమెందుకని ఇనపమెట్లు మెల్లగా జారి పోకుండా దాటుతూ వెనక్కి వెనక్కి భయం భయంగా చూస్తున్నాడు. ఇనప కమ్ములుమీద కాలుజారి ఒక పక్కకు తొలిగిపోయాడు. అడుగులు నిలదొక్కుకున్నాడు. "పదపద రా త్వరగా ! నేనేం నీకు నౌకర్నట్రా!" అనే ఫోర్ మన్ కేకలు బిగ్గరగా వినిపించడంతో మునూ అడుగులు గబగబ వేస్తూ "అడుగులుజారి కిందపడితే ఏందారి భగవంతుడా!" అను కుంటూ ఊపిరి బిగబట్టుకొని మెట్లు ఎక్కుతున్నాడు.

త్వరత్వరగా మెట్లు దాటగానే, పెట్టెలవంటి గదులు మెషిన్ చుట్టూ కనిపించాయి. ఈ గదుల్లోకి వెళ్ళాలంటే దారి ఎక్కడ వున్నదో కనిపించ లేదు. స్పిన్నింగ్ షెడ్డువద్ద దారికడ్డంగా చింతాం సాహెబ్ నించుని అందర్నీ

అదలిస్తున్నాడు. చుముళ్ళా ఎదురయిన సాహేబ్‌గారిని చూసి మునూ నిలువునా నీరయి పోయాడు. అటూ ఇటూ చూశాడు. ఎక్కడా హరిజాడ లేదు. హరికి ఫ్యాక్టరీ వ్యవహారమంతా తెలుసును కనక అవలీలగా లోపల కొచ్చేసి ఎటోపోయి వుంటాడనుకున్నాడు.

మెషిన్ దబదబ ధ్వనిచేస్తున్నది. మునూ ఎదురు పడగానే సాహేబ్ "పదరాగాడ్డె" అంటూ కుర్రవాడి మెడ దొరకపుచ్చుకొని, అవెటో లాక్కు పోయాడు. కొంతదూరం వెళ్ళేసరికి వొకబల్ల కిరువంకలా నించున్న కూలీలు కనిపించారు. ఉన్నది ఇద్దరే కూలీలు. అందులో ఒకడు హరి. మరివొకడు దుక్కల్లా గొర్రెచెవులతో నించున్నాడు. "నువ్వేం చేయాలో ఈ కూలీలు చెబతారు! వీళ్ళ దగ్గిర పని నేర్చుకో! మప్పుతారు!" అంటూ సాహేబ్ గారు గిర్రున వెనక్కి తిరిగి వెళ్లిపోగానే మునూ ప్రాణం తేరుకొంది.

'అమ్మయ్య'అని నిట్టూర్చి చుట్టూ వొకసారి కలయచూశాడు. చెమటలు కక్కుతూనే వున్నాడు. నిట్టూర్పు వేడిగానే వుంది. కూలీల మోములు నల్లగా వాడిపోయి, దిగులుగా, చికాకుగా ఈదురోమని కనిపిస్తున్నాయి. ఎదురుగా గుండ్రని చక్రాలతో,నలుపలకల దిమ్మలతో, పటకాలతో, మెషిన్ వుంది. ఇన్ని భాగాలతో, ఇంత బ్రహ్మాండంగా కనిపిస్తున్న యింజను అతనికి అమితాశ్చర్యాన్ని కలిగించింది. వెంటనే యింజను చక్రాలు కదలి టకటకమని మెల్లని ధ్వనిపుట్టి గబగబ దబదబ వొకటే గొడవగా రానురాను చెవులు గళ్లుపడేటంత రొదను పుట్టించింది. వేళ్లురెండూ చెవులలో పెట్టుకుని మునూ కళ్ళు మూసుకున్నాడు. ఇంజనుధ్వనికి షెడ్ జవజవ లాగుతున్నదా అనిపించింది. ముందు వున్న కర్రల వసారా గజగజ మంటున్నది. పంజరంలో వున్న చిలుకవలె తాను యిక్కడ చిక్కుపడి పోయాననేభావం అతని హృదయాన్ని కలవర పెట్టసాగింది. కలవరాన్ని, కంపాన్ని లోలోపలనే అణచుకుందుకు ప్రయత్నిస్తూ చుట్టూ ఒకసారి చూశాడు. గోడలు పెద్ద పెద్ద గోడలు గోడలమీద జింక్‌షీట్లుషెడ్డు గోడలనిండా ఎగిరిపడుతున్న దూదిపింజలు, దుమ్మూ్మదూగరాఅతిని కనులలో సూదులుగుచ్చినట్లు బాధపెట్టి, పక్కనేవున్న రెండుచిన్నకిటికీలు కనిపించేసరికి ఉపశమింపచేశాయి. కిటికీల్లోంచి సన్నని వెలుతురు లోనికి వస్తున్నది. కాని లోపల గాలిమాత్రం భరించలేనంత వేడిగా వుంది. దూదీ, నూనె దిక్కుమాలిన వాసనతో పేగుల్నిదొల్చేస్తున్నవి. మొహంనిండా చెమటబిందువులుపోశాయి. చెమటకు చొక్కాతడిసిపోయి

వీపుకు అంటుకుపోయింది. తడిసిన వీపూ, మొహానికిపట్టిన చెమటా తనూతప్ప యీ ప్రపంచంలో తనకింకెవరూలేరనే దిగులు, ఆవేదన అనంతమైన దుఃఖాన్ని కలిగించాయి. ఈ దుఃఖం, ఈ కన్నీళ్ళు, ఈ దుర్భరజీవితం 'నన్ను పిచ్చెత్తించడం లేదుకదా' అనే భయాన్ని కలిగించాయి. ఉన్మాదిలా చూపులు చుట్టూ సారించాడు.

"ఇంకా నించునేవున్నావా నాయనా!" మునూ ఎడమ పక్కనే చతికిలబడి కూచున్న హరి హెచ్చరిక చేశాడు: "దిక్కులు చూడకు. నీపనేదో నువ్వుచేసుకో. నేను చేస్తున్నట్టే నువ్వూను!... అదిగో దారం. తెగిపోకుండా చూడు. తెగిపోయినచోట తక్కున ముడిపెట్టెయ్యాలి!!! వేగం! వేగం!"

మొదట మునూకీ పని ఏమంత కష్టమనిపించలేదు. సన్నని తీగల్లా సాగుతున్న దారపు పోగులకంక పరిశీలనగచూస్తూ కపడ్డార్‌గా నిలబడ్డాడు. కాని గబగబ పరుగులు పెడుతున్న దారపుపోగులు 'కపడ్డార్' అన్నట్లు హెచ్చరించి ముందుకు ఉరకలు వేస్తున్నాయి. చేయివణకింది. వెనక్కి తగ్గింది. అడుగు మందగించింది. "భయపడితే లాభంలేదు తమ్ముడూ! చొరవ చేయాలి!"

మునూకు ఏంచేయాలో స్ఫురించలేదు. "అక్కడకూమని కుడి చేతితో హేండిలు తిప్పు. దారము వొసిలిందే ఎడంచేత్తో అతికించేయ్" కుడిచేత్తో కొంచెం జోరుహెచ్చించి మునూహేండిలును తిప్పుతున్నాడు. దారంతెగింది. ముడి ఎలావేయాలో తెలిసిందికాదు. పక్కనేవున్న మరొక తను అతన్ని పిల్చాడు. దారంతెంపి ముడివేసి 'ఇలా చేయాలోయ్ బ్రాజ మానం!' అతను ముడివేస్తున్న పద్ధతిని జాగ్రత్తగా గమనించి అతన్లాగే చేతులు ఉంచాడు. తెగినదారం యిట్టేముడివేశాడు. పనినేర్చేసుకున్నానుకదా అనే విజయగర్వం పెదవులపై చిరునవ్వుగా అవతరించింది. ఇపుడిక మెషి నును తన యిష్టంవచ్చినంత వేగంగా చకాచకా తిప్పేయవచ్చును. ఇదేమంత పెద్ద పనికాదు. కూసువిద్య. చేత్తో ఓ మారిలా తిప్పేస్తేసరి తతిమ్మా పనంతా ఆ మెషినే చేసుకుపోతుంది. తన పనల్లా హేండిలుతిప్పి పారేస్తూ వుండడమే. మెషిను దారాలను సాగదీసుకుపోతూ నేసుకుపోతూవుంటుంది. అయితే తను యిదివరకు యిలాటి పనులు చేయలేదు. ఇదిమాత్రంకొత్త. పని మాత్రం మోటుకాదు. కాని నిఘామాత్రం అవసరం. సర్వకాల

సర్వావస్థల్లోనూ దారపుపోగులు మీదనే కళ్ళుప్పగించి కనిపెట్టుకునే వుండాలి. కళ్ళుకొంచెం కరకరల్లాడినా, పనిమాత్రం సరదాగా వుంది! గిరగిర హేండిలు తిప్పుతూ వచ్చేసరికి చెయ్యి దానం తటదే, అదీ వొక మెషిన్లాగే తిరిగి పోతున్నదనిపించింది. గిరగిరతిరిగే చక్రాలతో జయ్యాజయ్యామనే పటకాలధ్వని మధ్య జిగ్‌జిగ్‌మనే మెషినూ, జర్‌జర్‌మనే గొలుసులు, దూదిపింజలు, దుమ్మూదూగురా నూనెకంపూ ఉక్కపోస్తున్న షెడ్డూ, ఈ వాతావరణానికి అలవాటుపడుతున్నట్టేవుంది. కాని, నోటిలో గొంతులో ఏదో "సెల"వేసినట్లు మాత్రం అనిపించింది. పరగడుపు. మెడవొప్పి. గుండెబెదురు. నల్లనివికారమైన దయ్యాం తన రూపంలోనే తన పీకపట్టుకు పిసుకుతున్నదనిపించింది. తన గ్రామంలోని చీకటిగదుల్లో గోతులముందు కాళ్లుచాపుకొని టకటకటక నేసుకుపోయే దేవాంగులు జ్ఞాపకంవచ్చారు. ఎద్దుకి గంతలుకట్టి పాకలో గుండ్రంగా తిరిగినచోటనే తిరుగుతూ గానుగతిప్పే తెలుకలవాళ్ళు జ్ఞప్తికివచ్చారు. దౌలత్‌పూరులో తాను మూటలుమోసిన పిండిమిల్లు యింతకంటె చిన్నదా ఏమిటి! కాలంగడుస్తున్నకొద్దీ వొక్కొక్కగంటే నడుస్తున్నకొద్దీ పొద్దున్న మీదపడుతున్నకొద్దీ తనకి జ్ఞాపకాలన్నీ మటుమాయమౌతున్నాయి. జూన్ మాసపు ఎండ తూర్పుభాగాన వున్న కిటికీలలోంచి వచ్చి గోడలమీదవున్న దూదిపింజలను కాకపెట్టడమేకాక, క్రమక్రమంగా షెడ్డు టిన్నురేకులను వేడెక్కిస్తున్నది.

మధ్యాహ్నమయింది. మునూ శరీరమంతా ఆపాదమస్తకమూ చెమట పట్టింది. పనిమీద ఏకాగ్రచిత్తుడైవున్న మునూకు చెమట తుడుచుకుందుకు వ్యవధే లేకపోయింది. వొంటినున్న చెమట వొంటినే ఆరిపోతోంది. మళ్ళీ కొత్తగా చెమట పోస్తోంది. దేనిదారి దానిది. దీనికే అలవాటు పడిపోతేనే పని చేయగలిగేది. కాని శరీరం మాత్రం జిగటుగా, గంధకపు వాసన కొడుతోంది. అదిమాత్రమే వాడు భరించలేక పోయాడు. నుదట పట్టిన చెమట బిందువులు మెల్లగా కరిగి కిందకుజారి, కళ్లల్లోపడుతూ కితకితలు పెడుతున్నవి. చిరుచెమటలు పట్టిస్తున్న కక్కిస్తున్న, ఉక్కపోస్తున్న ఈ గదిలో యీ కూలీలంతా ఎలా వుండగలుగుతున్నారనే ప్రశ్న పుట్టింది. ఒకసారి తలతిప్పి కూలీలకేసి చూశాడు. కూలీల్లో ఎవరికీ వొంటిమీద చొక్కాలేవు. శరీరమంతా చెమటకు తడసిపోయింది. తనుకూడా కుడితిణీ తీసిపారేస్తే! అయితే

ఎలా తీయడం, చేతుల్నిండా పనేకదా మరి! ఒకచేయి హేండిలు తిప్పు తూంటే, మరో చేయి తెగినదాన్ని ముడి వేస్తూవుండా!

ఫ్యాక్టరీ, కూతవేసింది. హేండిలు తిప్పుతున్న కూలీలచేతులు ఎక్కడ వక్కడ ఆగిపోయాయి. పనులుచేస్తున్న కార్మికులు ఆ చేతులతో మొహం తుడుచుకుంటూ నిలబడిపోయారు. మునూ కూడా పని వొదిలేసి లేచాడు. కాస్తముందుకు జరిగి తచ్చాడుతూ, గాలి తగులుతుందేమోనని కుడితిణీ తీసి వేశాడు. నెత్తిమీదనున్న టోపీ గబుక్కున లాగేడుకాని బొత్తాలు విప్ప నందున లొత్తలా నెత్తికి అంటుకుపోయిన టోపీ అతికించినట్టు అక్కడేవుండి పోయింది. కుడితనీ విప్పుకుంటూవుంటే ఎడం భుజంవద్ద విడిపోయి, కళ్ళకు తెరకప్పి కుడిభుజంవద్ద ఆగిపోయింది. ఇంతసేపూ బక్ బక్ మని చప్పుడుచేస్తూ వున్న చక్రాలు వొక్కసారి చడీచప్పుడూ లేకుండా ఆగిపోవడంతో, బుస్ మని రయ్ మని గాలికొట్టుకు వచ్చి ఆ వేగానికి మునూ చొక్కాని ఎత్తుకు పోయి ముక్కముక్కలుగా చించి పారవేసింది! కుడితిణీ చక్రాలపళ్ళ యిరుకున పడి బలి అయిపోయింది. పోయిన చొక్కాకోసం గబగబ మునూ మెషిన్ చక్రాలచెంతకు గంతులేశాడు. అతని పక్కనే కూచున్న గొర్రెచవుల కూలీ "చస్తావు! మెషినితో సరసాలు చేయకు".

మెషిను వద్దకు వొళ్లూపై తెలియకుండా పరుగుడుతున్న మునూ రెక్కపట్టుకుని హరి తటాల్న యివతలకు లాకేడు. షెడ్డులోంచి బయటకు ఊడిపడుతూ మెల్లమెల్లగా అడుగులువేసి నడుస్తూంటే ఏమిటీ గమ్మత్తంతా అనుకున్నాడు. వెయ్యిచేతులు, పదివేలకాళ్ళు, లక్షల తలల రావణాసురిడి వంటి మెషిను తనతో సరసమాడి, కవ్వించి, గమ్మత్తుగా తనచొక్కా గద్దలాగ తన్నుకుపోయిందే!

వొంటిమీద చొక్కా లేకపోవడం చిన్నతన మనిపించి:దికాని తీరా ఫ్యాక్టరీ ఆవరణలోకి వచ్చేసరికి కూలీలంతా తనలాగే వొంటిమీద గుడ్డయినా లేకుండా వున్నారు. అందరితోపాటే, తనూను. సిగ్గేమిటి, సిగ్గూ ఎగ్గూను. కూలీలవదనాలు ఎండిమాడి నల్లని బొగ్గువలె వున్నాయి. నుదట మీద ముడితలుదేరి గుంటలు పడ్డ బుగ్గలతో, మాసినగడ్డాలతో, వున్న కూలీలు. తను వొక్కడేకాదు. వందలకు వందలు, వేలకు వేలు కూలీలు. కనుబొమలు ఉంచుకుపోయి వున్నాయి. శరీరం ముడతలు దేరింది. కళ్లులోతుకుపోయాయి.

జుత్తుచిక్కులు చిక్కులుగావుంది. గొంతుకముడి ఎక్కొచినట్టు వుంది. కూలీలంతాయింతే!

ఇంగ్లీషువాళ్ళ పద్ధతిని అనుసరిస్తూ హరి మహగొప్పలాగ "టిఫిన్ టైం! టిఫిన్" అనగానే మునూకు నవ్వు పుట్టుకువచ్చింది. జిమ్మీ థామస్ వచ్చి నప్పట్నుంచీ మధ్యాహ్నపు విరామాన్ని టిఫిన్ టైం అనే నాజుకు పేరు పెట్టేడు. తనకూ, దొరలకూ యిది టిఫిన్ టైమ్, . కాని కూలీలు ఏ చెట్టు కిందనో, ఏ రాతి మీదనో కూచుని ఏదో యింత కతికి, కాస్సేపు సేదతీర్చు కొని, ఉస్సురుస్సురుమని ఫ్యాక్టరీ మళ్ళీ కూతకూయగానే, పనుల్లోకిపోతారు. కూలీలకు చెమటపట్టిన మొహాలు కడుక్కుందుకూ కూడా ఫ్యాక్టరీలో కుళా యిలు లేవు. ఫ్యాక్టరీ ఆవరణలోనే బేస్లుపడివున్న అవతల నూనెపీపాల దగ్గర ఒకచిన్న కుళాయివుందా లేదా అన్నట్టువుంది. ఫ్యాక్టరీకూత కూయడం తర వాయి. చీమల బారుల్లా కూలీలు గుంపులు గుంపులుగా చేరి బారులు బారు లుగాతీర్చి అక్కడే తిరుణాళ్ళ జనంవలె పడిగాపులు కాస్తూ గుక్కెడు నీళ్ళు తాగడం కోసం 'నేను ముందా నువ్వు ముందా' అనుకుంటూ ఒకర్నొకరు మోచేతులతో పొడుచుకుంటూ, అరుచుకుంటూ ఎవరికీ జాగాదొరక్క గంటల కొద్దీ నిలబడి వుంటారు. ఏలాగో ఓలాగ పుడిసెడు నీళ్ళుతాగి బతుకు జీవుడా అని బయటపడ్డ కూలీలకు ఆరెండు ఎంగిలిమెతుకులూ కతికేందుకు జాగాయే లేదు. ఒక క్యాంటీనూలేదు. అంగడీలేదు. ఫ్యాక్టరీ అవతల మాత్రం రొట్టెల దుకాణం వాడు రెడీగా కూచునివుంటాడు. తమ పిల్లలకో, భర్తలకో, యింటి దగ్గర్నుంచి యిచ్చిన ఉడికీ ఉడకని మెతుకులో, గంజినీళ్లో పట్టుకు వస్తే ఆప్యాయంగా అవి అందుకుని, అదే మహాప్రసాదమనుకుని కళ్ళకద్దుకుని గబ గబ నోట్లో వొంపుకొని కూలీలు కడుపు నిండందే భోజనం చేసేంకదా అని సంతృప్తిపడతారు.

తాటిచెట్టుకింద చతికిలబడి గిన్నెలు ముందుంచుకొని, ముద్దలుచేస్తూ ఎగరేస్తూ గబగబ నోట్లో కుక్కుకుంటున్న కూలీలను చూసి మునూ ఆశ్చర్యపో పడ్డాడు. ఇంకముదెన్నడూ ఉత్తరప్రాంతాల్లో కూలీలు యిలాగతినడం అత నెపుడూ చూళ్లేదు.

మిగిలిన కూలీలంతా ఎక్కడకక్కడ సర్దుకొని కూడుతింటూవుంటే "మనాడవాళ్ళింకా రాలేందేం చెప్మా" అని ఎదురుతెన్నులుచూస్తూ హరి

విసిగెత్తిపోతున్నాడు. దూరంగావున్న షెడ్‌కేసి భార్యను వెతుక్కుంటూ బయలుదేరాడు.

దిగులుగా, చికాకుగా మునూ వొంటరిగా ఒకపక్క నిలబడి పోయాడు. మళ్ళీ అంతలోనే మిల్లు కూతపెట్టింది. కార్మికులు త్వరత్వరగా ఎవరి పనుల్లోకి వాళ్ళు వెళ్ళిపోతున్నారు. అందర్నీ వెళ్ళనిచ్చి మునూ, తానూ తిరిగి పనిలోకి వెళ్ళేడు. వెడుతూ వెడుతూ కుళాయి పక్కనుంచివస్తూ దానికేసి ఆత్రుతగా చూసేసరికి అది దబ్‌దబ్ మంటున్నది. ఎండ ఫెళ్‌ఫెళ్ లాడుతున్నది. ఎండలోంచి లోపలకు వెళ్ళేసరికి మిట్టమధ్యాహ్నపు తీవ్రమైన ఎండ ఎలక్ట్రిక్ షాక్ వలె నరాలను ఘ్యాజులవలె కాల్చివేసి నెత్తురు నిండా నిస్త్రాణను వొంపింది. చెవులు గుయ్‌మంటున్నాయి. వేడివేడి ఆవిరి, గూబల్లోంచి గుయ్‌మంటూ బుగ్గలమీదపడింది. కళ్ళు భగభగ మంటున్నవి. నెత్తి బరువెక్కింది. దిమ్మెత్తింది. పోటు పెట్టింది. ఆకలిదహించి వేస్తోంది. ఎత్తి కుదిపెట్టినట్టు శరీరం!

ఇదివరకు హరి కూచొని పనిచేసేచోటున యిప్పుడు హరి కనిపించ లేదు. అతని స్థానంలో మరొక కూలీని కూచోబెట్టి థామస్ వెళ్ళిపోయాడు.

కొంతసేపు గడిచింది. హరి ఒగుర్చుకుంటూ, నోటితో గాలి వొదులుతూ, జాపోనుకుంటూ త్వరత్వరగా లోనికి వచ్చాడు. హేండిలు పట్టుకొని చకచక తిప్పుకుపోతున్న మునూ హరివంకొకసారి పరకాయించి చూశాడు. స్పిన్నింగ్ షెడ్‌లో మెషిన్ పటకామీద తెలియక తన కుర్రవాడు చేయి వేయగా, అది విరిగిపోయిందని పట్టలేని దుఃఖంతో హరి బావురుమన్నాడు. హరిదుఃఖంచూసి మునూ నిశ్చేష్టుడయాడు. నోటమాట రావడం లేదు. వెర్రివాడిలా హరివంకచూస్తూ తనపని తాను- చేసుకుపోతున్నాడు. గుండె నీరయింది.

గొర్రెచెవులకూలీ "అయితే డాక్టరుకి చూపించావా, లేదా?" అని ప్రశ్నించాడు. "లేదన్నా, యింకాలేదు" వణకిపోతూ గద్గదికంగా హరి సమాధాన మిచ్చాడు. "లేదన్నా లేదు. మిల్లులో డాక్టరు లేడుకదా! బస్తీలో డాక్టరు దగ్గరకి పిల్లాణ్ణి తీసుకెళ్ళమని చితాంసాహెబ్ సెలవిచ్చాడు. కాని ఆయనకి నామీద కోపంగా నేవుంది. పల్లో చేరిన రోజునే ఈ అవాంతరం తెచ్చిపెట్టి పనిఎగ్గొట్టేనని ఆయన అగ్గిరుద్రుడై పోతున్నాడు. బస్తీలోకి వెళ్ళి పిల్లాణ్ణి డాక్టరుకు చూపించనా, లేక సాహెబ్‌కోపం చల్లార్చేందుకు

ఇక్కడే ఉండిపోనా అనే మీమాంసతో హరి మనసు కాస్సేపు అటూ ఇటూ ఊగిసలాడింది. కొసకు డాక్టరు వద్దకు పోవాలని నిర్ణయించుకొన్నాడు. వెడుతూ వెడుతూ ఏదో పారవేసుకున్నవాడిలాగ దారిలో మధ్య ఆగి, పరధ్యానంగా వెనక్కితిరిగి, చటుక్కున మునూదగ్గరకు వచ్చాడు: "నువ్వింటి కెళ్ళేటప్పుడు దాన్ని కూడా తీసుకువెళ్ళు బాబ్బాబూ! వెర్రిబాగుల్ది; దారి తెలియదు దానికి పాపం!" తనభార్యను తలుచుకొని, చేయివిరిగిన బిడ్డణ్ణి ఆస్పత్రికి తీసుకువెళ్లాలనేబాధ్యత జ్ఞప్తికి వచ్చి కళ్ళనిండా నీరు నింపుకొని, బుగ్గలమీద బిందువులు జారిపడుతూవుంటే హరి వెళ్ళి పోయాడు. వెళ్ళిపోతున్న హరితో కూడా తన హృదయం ఎగిరిపోతున్నట్టు మునూ భ్రమించి, గుండె నిముకున్నాడు. తనే వెళ్ళి ఆ కుర్రవాడిని వీపు మీద వేసుకొని, ఆస్పత్రికెడితే బాగుండును; ముసలివాడు హరి ఏం బాధ పడతాడో కదా! మునూ యిలా చూశాడో లేదో, అప్పటికప్పుడే హరి చకచక ఫ్యాక్టరీ దాటి వెళ్ళిపోతున్నాడు. ఇవతలకొచ్చి తొంగిచూస్తే మురికి గుంటల పక్కగా నడిచి వెళ్ళిపోతున్న హరి కనిపించాడు.

హరి వెడుతున్న ఆస్పత్రి యిక్కడ కెంత దూరముందో యేమో అంతవరకూ అతను పిల్లవాణ్ణి మోసుకువెళ్ళగలడో లేదో, వెళ్ళే లోపున కొంపతీసి, పిల్లవాడి ప్రాణం కాస్తా గుటుక్కుమంటే... శ్రీహరీ!...అలా కలలోగూడా జరగకూడదు కాని, జరిగితే మాత్రం తనకి పుట్టగతులుండవు. హరినీ, అతని భార్యనూ తలెత్తి చూళ్ళేడు. చూడ్డానికి మొహం చెల్లదు. తను వచ్చిన వేళా విశేషం. ఏ దుర్ముహూర్తాన తల్లి గర్భంలోంచి యీ భూమ్మీద పడ్డాడో, పుట్టిన వెంటనే తండ్రిని వెళ్ళగొట్టాడు. "అవును, నేను నిర్భాగ్యుణ్ణి. నాది శని జాతకం. పుట్టిన వెంటనే తండ్రిని, తండ్రి తరువాత తల్లిని సాగనంపాను. నేను అడుగుపెట్టాను, ప్రభుదయాలు కొంపా గోడీ నష్టాల్లో కలిసిపోయాయి. అప్పుడు ప్రభుదయాలు, యిప్పుడు యిక హరీ! నేనింత పాపాత్ముణ్ణయితే, చేసిన పాపాలు నన్ను కట్టికుడపక, పరాయివాళ్ల నెందుకూ బాధించడం! నన్ను చేరదీసినందుకు ఇదా ఫలితం వాళ్ళకి? హాయిగా చచ్చిపోతే, యిన్నిబాధలే లేకపోను. లోకానికిన్ని ఇక్కట్లూ వుండేవికావు. చచ్చిపోతే పీడపోను. చచ్చిపోవాలని వుంది. అవును చనిపోవడమే మంచిది. అబ్బ! ఇక్కడొక్క నిమిషం నిలవలేను. ఇంత కంటే మా అత్తయ్య గుడిసే నయం."

మరణించాలనే కోరిక విచిత్రంగా పుట్టి, తనకు పరిచయంవున్న హరి దూరంకావడంతో, యితర కూలీల ముఖాల్లో మొహం ఎరగని కారణాన, అతనికి దిగులుపుట్టి తానొక దిక్కుమాలిన జీవి ననిపించింది. ఎడతెరిపి లేకుండా మెషిను చెవులు చిల్లులుపడేటట్లు ఊరికే దబదబ రొదచేస్తోంది. బతికుండగానే మంటల్లోపడవేసి రెక్కలు ఊడదీసి ఒక్కొక్క వెంట్రుకే వూడలాగుతున్న కోడిపెట్టలాగ ప్రాణం గిలగిలమంది. రోడ్డుపక్క కుళ్ళు కాలవ చెంత, జోరున వానకు తడిసిపోతూ కలుగు కనిపించక తడిసి ముద్దయి పోతున్న ఎలుకస్థితి తనకంటె నయం. తలలో దయ్యాలుదూరి కలవరపెడుతూ, భయాలను రేపుతూ, జడిపిస్తూ తన ప్రాణంతో ఎంతకాలమీ చెలగాటం ?

ఒక్కసారి లాకు తీసిన ప్రవాహంలా ఆలోచనలు, ఇదివరకు తాను చూసిన దృశ్యాలు, ఒకటొకటే జ్ఞాపకానికి వస్తున్నాయి. పెద్దపెద్ద దొరలతో, మార్వాడీలతో, షాహుకార్లతో ధగధగ మెరసే కార్లతో, పేదరికంతో ముక్కుతూ, మూలుగుతూ నడుస్తున్న కూలీలతో, బిచ్చగాళ్ళతో, రంగు రంగుల వింత వింత రకారకాల వస్తువులతో క్రిక్కిరిసివుండే బజారు కనులముందు కట్టినట్లయింది. బజారులలో పెద్ద పెద్ద భవంతులు, దివ్యమైన లోగిళ్లు, కూలీల పేటలలో మురికిగుంటల దోమలమధ్య నేలకానుకుని వుండే గుడిశలు! ఇప్పుడు తను వున్నది ఒక ఫ్యాక్టరీ. ఇది కొత్త. దీని అంతూ పంతూ యింకా పట్టలేదు. అయితే తను ఇక్కడ కెందుకు వచ్చినట్టు? కూలికోసం, కూటి కోసం పట్టణంలో బతుకుదామని; ఎక్కడ పల్లె, ఎక్కడ బొంబాయి! చింతాంసాహేబ్ యిస్తానన్న జీతం, అవును యిదివర కెన్నడూ తను ఆర్జించిన పాపాన పోలేదు యింత డబ్బు! గలగలమంటున్న డబ్బు హృదయంలో మోగింది. డబ్బు వుంటే, తానిదివరకు చిన్నతనం నుంచీ కొనుక్కుందామని కలలుకంటున్న, తొడుక్కుందామని కలవరిస్తున్న బూట్లు, వాచీ, ఒకే ఒక వాచీ, ముచ్చటయిన ముద్దులాలికే ఒక గొలుసు, పోలో టోపీ, ఒకటంటే ఒకటే కుడితిణీ, కాళ్ళకి సాక్సు......దొరగారితనం వుట్టిపడేలా వుండును. కాని ఇవి తీరని కోరికలు. అందని ఆశలు. వీటిని తలుచుకుందుకే అర్హతలేని కూలీ మనూ! "అర్హత లేకపోవడమేమీ ? నీకూ వుంది యోగ్యత" అని అతని ఆత్మ ఊరడించింది. "అవునవునని" తనను తానే సంబాళించుకున్నాడు. మళ్ళీ మరణం నుంచి తప్పించుకుని జీవిస్తున్నట్లనిపించింది. అనేక కోరికలు మనసులో పుట్టి జీవితంమీద ఆసక్తి, ఆశనూ

ఉత్సాహాన్నీ కలిగించాయి. "అబ్బెబ్బే! మరణించడం యేం కర్మం! చచ్చిపోతే యేముంది? నేను జీవిస్తాను. పని నేర్చుకుంటాను! అన్నీ తెలుసుకుంటాను. ఆర్జిస్తాను. బతికి బట్టకడతాను. అతన్లాగే ఆ వచ్చే వస్తాదులాగే నేనూ దారుఢ్యంగా వుంటాను."

అతను మెల్లగా మునూ చెంతకు వచ్చి నిలబడి ప్రశ్నించాడు :

"ఇవేళే పన్లో కొచ్చినట్టున్నావ్, యేవూరు నీది?"

"శ్యామనగరం, దౌలత్‌పూర్‌లలో పనిచేశాను."

"మాది పంజాబ్‌లే. మనం యిద్దరం భాయీ భాయీయే! నీపేరు?"

"మునూ!" ఇంతమందిలో ఒకతను అంత ఆప్యాయంగా తనను పలకరించి; మనం యిద్దరం భాయీభాయీయే అనగానే, మునూ కిక తాను ఏకాకిని కాననే ధైర్యం కలిగింది. కాని, యీధైర్యం కొంతసేపే. ఈలోపునే ఫ్యాక్టరీ కూతకూసింది. జిప్‌జిప్‌మని ఒగరుస్తూ మెషిన్ ఆగిపోయేలోపున ఆవిరి కమ్మింది. ఆయాసంతో రొప్పుకొంది. మెషిన్ ఆగగానే కూలీలంతా నరవాసనతగిలిన ఆవురావురుమనే పులుల్లా ఇవతలకు వచ్చారు. మునూ ఛెంగుఛెంగున దుముకుతూ స్పిన్నింగ్ షెడ్డులోకి వెళ్ళాడు. స్పిన్నింగు షెడ్డు నిండా ఆడకూలీలే. మూపున, తొడలమీద పసిపిల్లల్ని వేసుకుని లాలిస్తున్నారు. కొందరు పిల్లలు దుమ్ములోనే నేలమీద పొర్లుతున్నారు. కీచుమనే గోల, గుక్కపెట్టి ఏడుపు, కింకపిల్లల అల్లరితో షెడ్డు ఎగిరిపోతున్నది. మునూ, ఎదుట కనిపించేసరికి లక్ష్మి బావురుమని ఏడిచింది. మునూ దుఃఖం పైకి కనిపించనీయకుండా లోలోపలనే దిగమింగుతూ లక్ష్మిని వెంటబెట్టుకొని బయటకు వచ్చేశాడు. ఫ్యాక్టరీనుంచి యివతలకొస్తూంటే నాదిర్‌ఖాన్ కూమనేచోటున గోడగడియారం కనిపించింది. మునూ గడియారంలో టైముచూసి తను ఫ్యాక్టరీకొచ్చి ఎన్నిగంటలయిందా అని లెక్కచూశాడు. పదకొండు గంటలయింది. అబ్బ! ఎన్నిగంటలపని. పడమట సూర్యుడు అస్తమించాడు. సంజచీకటి పడుతోంది. ఆకాశంమీద మబ్బుతునకలు కదలాడుతున్నాయి.

ఆ మర్నాడు శనివారం. శనివారం మధ్యాహ్నం కూలీలకు సెలవు. మధ్యాహ్నం హరి తనకొడుకును ఎత్తుకొని ఆస్పత్రికి బయలుదేరాడు. అతని వెంట బజారు చూద్దామని లక్ష్మి, మునూ బయలుదేరారు. ఇతర కూలీలు

కూడా ఎవరిపనుల్లో వాళ్ళు అటుఇటూ తిరుగుతున్నారు. కల్లుదుకాణాలవద్దా, సారాబట్టీలవద్దా గుమిగూడిన మనుష్యుల్ని చూసుకుంటూ హరీ, మునూ, లక్ష్మి ఆస్పత్రికి వెళ్ళారు. ఒకవీధి చివరన ఆస్పత్రి వుంది. సరాసరి అక్కడకు వెళ్ళి అంతా ఆగిపోయారు. ఔట్ పేషెంటువార్డులో నిరీక్షిస్తూ నించున్నారు. ఆస్పత్రి వాసన ముక్కుల్ని బద్దలుకొడుతోంది. వచ్చీపోయే జనాన్నీ, రోగుల్నీ చూసి మునూ ఆశ్చర్యపోతున్నాడు. మూలుగుతున్న రోగుల్ని చూసి లక్ష్మి కంగారుపడింది. దెబ్బలుతిని కట్టుకట్టించుకుందుకు వస్తున్న మనుషుల్నిచూసి చిన్నపిల్ల భయపడింది. తెల్లనిగౌనులు వేసుకొని కీసుకీసు గొంతులతో నర్సులు ఏమేమో అరుస్తున్నారు ఎలక్ట్రిక్ బల్బుల్లా మెరిసిపోతున్న నర్సులు. కోయిలకంఠాలతో పెదవులకు అంటీఅంటనట్టు మాట్లాడుతూ అటుఇటూ ఎత్తెత్తి అడుగులువేసుకుంటూ నడుస్తున్న హంసయానలు.

హరీ వాళ్ళూ నేలమీద చతికిలబడ్డారు. మునూ బెంచిమీద కూచున్నాడు. మీదనుంచి ఫేను గిరగిర రెక్కల్ని ఆడిస్తోంది. గాలి రివ్వురివ్వున కాస్త వేడివేడిగా వీస్తోంది. బెంచీమీద కూచున్న ముస్లింపాపం మూలుగుతూ, కళ్లుమూసుకుంటూ, తెరుస్తూ పక్కనున్న మరో రోగి భుజంమీద చేతుల్ని ఆనుకున్నాడు. ఎదురుగ డ్రాయరుముందు కుర్చీలో కూచుని చుట్టూ రోగుల్ని పోగుచేసుకుని మందుపోసి యిస్తోన్న నర్సు, వయ్యారిభామ గబుక్కున లేచి వచ్చి మునూ కూచున్న బెంచీవద్ద ఆగిపోయింది. "పోరా, పో" అను మునూను గదిమింది. గతుక్కుమని మునూలేచి నిలబడ్డాడు. సిగ్గుతో తలవంచేసుకున్నాడు. మొహం నల్లబడింది. మిగిలిన రోగులు మునూ కింత అవమానం జరుగుతూవుంటే తమ కేమీ పట్టనట్టే ఊరుకున్నారు. వెయిటింగురూములోంచి బయటకుపోయి సన్నని దారిమధ్య నించున్నాడు.

ఆస్పత్రి దాటి యివతలకొచ్చి నిలబడిచూస్తే సముద్రఘోష దూరంగా వినిపించింది. తెల్లని నురగల్ని కక్కుతూ నల్లనిసముద్రం. ఆకాశంమీద మేఘాలు పరుగెడుతున్నాయి. మేఘాలసందుల్లో మెరుపులు తళుక్కు తళుక్కున మెరుస్తున్నాయి. హఠాత్తుగా పెద్దగాలి వీచింది. గాలికి తట్టుకోలేక మునూ మళ్ళీ ఆస్పత్రిలోకి వెళ్ళిపోయాడు. మునూను చూడగానే లక్ష్మి చంకలోవున్న చంటిపిల్ల రెండు చేతులూ యిచ్చి నేను వస్తానన్నట్లు నవ్వింది. హరి పిల్లవాణ్ణి ఎత్తుకుని యివతలకు వస్తున్నాడు. ఆకాశం యిపుడు మరీ భీషణంగావుంది.

ఇవతలకు వచ్చేసరికి వీధుల్లో దీపాలు గాలికి ఆరిపోయాయి. ఉరుములతో, మెరుపులతో ఆకాశం గర్జిస్తోంది. హఠాత్తుగా వానకురియడ మారంభించింది. విదాహంగావున్న నేలమీద కుండపోతగా వర్షంపడుతోంది. వానకు జడిసి ఎక్కడివాళ్లక్కడే నిలబడిపోయారు. రెండుగంటలకాలం వానకురిసి ఆగిపోయింది. ఇపుడిక చిన్నచిన్న తుంపర్లు పడుతున్నాయి. హరి బయలుదేరాడు. రోడ్లన్నీ వాగుల్లాగ ప్రవహిస్తున్నాయి. రోడ్లకవతల నీటిమడుగులు కనిపించాయి. చెరువు పొంగి నీరు, నదుల్లా ప్రవహించింది. పక్కనవున్న గుడిశలు కొట్టుకుపోయాయి. తడిసిపోయిన బట్టలతో, చలికి వణికిపోతూ, మళ్ళీ వానవస్తుందేమోననే భయంతో ఈ వానకు, మిల్లువుందా లేదా అనే దిగులుతో హరీ, మునూ, లక్ష్మీ గబగబ అడుగులు వేస్తున్నారు. మిల్లు పక్క కూలీల గుడిశలు తుపానుకు ఎగిరిపోయాయి. లోపలకు నీరు కొట్టుకువచ్చింది. కూలీలు దుఃఖిస్తూ అరుస్తూ అటూఇటూ తిరుగుతూ ఆందోళన పడుతున్నారు.

"రామ రామ!" అంటూ హరి యించుమించు పరుగు ప్రారంభించాడు. వీపుమీద వున్న పిల్ల బరువుగావుంటే ఒక్కసారి మార్చుకొని మునూ నిశ్శబ్దంగా నడుస్తున్నాడు.

ఇదివరకు పెద్ద పెద్ద తుపానులు లేచి, వరదలవల్ల తన గ్రామంలోని యిళ్ళన్నీ ఎలా కొట్టుకుపోయాయో మునూకు జ్ఞాపకంవచ్చింది. ఆ సంఘటన జ్ఞప్తికిరాగా, మునూ కళ్ళమ్మట నీరు తిరిగింది.

"ఏంరో మునూ!" అనే కేక వినిపించేసరికి తన నింత చనువుగా ఎవరూ పిలవరనుకుంటూ ఆ కేక బహుశా తనను కాదనే నిశ్చయంతో మునూ వెళ్ళిపోతున్నాడు.

"ఆగరా! ఆగు!"

"ఎవరు చెప్మా."

"ఓరి నీతల్లిమొగుడూ! పిలుస్తూంటే ఆగవేంరా?"

మునూ ఆగిపోయాడు. వెనకనుంచి రతన్ ఫ్యాక్టరీలో తనతో జోస్తీ కట్టిన కూలీవచ్చి వీపుమీద చేయివేశాడు: "నీగుడిశ కొట్టుకుపోతే తల దాచుకుందుకు నీకు చోటుదొరక్క పోదులే!"

ఎత్తుకున్న కొడుకును యింకో భుజంమీదకు మార్చుకొని హరికూడా ఆగిపోయాడు. సిగ్గుతో మేలిముసుగు సవరించుకుంటూన్న తనభార్య

ఎంతో అందంగావున్నట్లు కనిపించింది. లక్ష్మి పమిట సర్దుకొంది. "వుండన్నా వుండువుండు! రతన్ పిలుస్తున్నాడు." కాని తీరా రతన్ దగ్గరకు వచ్చి నిలబడి వీపుమీద చేయివేసేసరికి అతని నోటమ్మట గుప్పున సారావాసన కొట్టుకొచ్చింది. కళ్ళు ఎర్రబడివున్నాయి. మనిషి తూలుతున్నాడు.

చిత్తుగాతాగి, మత్తుతో తూగుతూ మీదపడబోతున్న రతన్‌నుచూసి మునూ వెనక్కితగ్గేడు. మునూ భుజాలను తట్టుతూ, వొక్కచరుపుచరిచి రతన్ "రండర్రా రండి! మీ అమ్మ సిగ్గొయ్యా! తలదాచుకుందుకు చోటేదీ మీకు?"

మునూ బిత్తరపోయాడు. "బిత్తరపోతావేం? నేను తాగివున్నాననా? కొంచెం తాగాన్లే. అయినా యీ రతన్ అలాంటివాడు కాదునుమీ. మన్తో వ్యవహారం సజావుగా సాగుతుంది. మనం ప్రపంచంలో పేరుమోసిన వస్తాదులం! రా! నాతో రా! ఉండడానికి మంచి ఉటక చూపిస్తాను."

రతన్‌వెంట హరీ, మునూ, లక్ష్మి నడుస్తున్నారు. హరి మెల్లగా మునూ చెంతకువచ్చి మోచేత్తోపొడిచి అడిగాడు: "నిజంగా వీడిగదిలో మనకి చోటు వుంటుందంటావా?" మునూ సమాధానం చెప్పేలోపునే, రతన్ "రండర్రా! రండి!" అంటూ కేక వేశాడు.

ఒకరివెంట వొకరు నెమ్మది నెమ్మదిగ అడుగులు వేసుకుంటూ, చీకటిలో, మధ్య మధ్య మెరుపుల వెలుతురులో దారి చూసుకుంటూ నడుస్తున్నారు. ఆకాశంమీద యింకా మేఘాలు నిండుగానేవున్నాయి. కొద్దిగా వానచినుకులు పడుతున్నాయి. ఫ్యాక్టరీ ఆవరణదాటి పక్కకు తిరిగేసరికి చిన్న బంటూలో కాలుపడి హరి పడిపోయాడు. ఒకరి తరువాత వొకరు కాలు వొసిలి కిందకు వొరగపోయారు. వానలో బట్టలన్నీ తడిసిపోయాయి. చలికి వణకుతూ ఎప్పుడు గూటికి చేరుకుందామా అని పిట్టలకుమల్లే వేగంగా నడుస్తున్నారు. హరి వుండే పూరిగుడిశలు దాటి మూడు చిన్న చిన్న సందులు తిరిగి చిన్న లోగిలి చెంతకు వచ్చి ఆగారు. లోగిలి ముందు నించుని రతన్ పెద్దగా నవ్వుతూ మునూ వీపుమీద ఒక్క చరుపు చరిచి "రారా! దొంగలమ్మికే!"

హరి కళ్ళమ్మట గిర్రున నీళ్ళు తిరిగాయి: "ఈ రాత్రి మావాడు చచ్చిపోతాడనుకున్నాను. నా పెద్దకొడుకు నాకు దక్కేయోగం వుంది.

చచ్చేవంటే నాకిక దినవారాలు చేసే దెవళ్ళు? మీ ధర్మమా అని బతికేదు కాని!" "రండి! మీదకురండి! దీంట్లో ఏముంది మహా! ఆమాత్రం సాయం మీరు చేయకపోతే వస్తాదువని పేరెందుకు నాకు?"

వస్తాదుమాటలు, నవ్వులు, ప్రవర్తనచూసి మునూ అబ్బురపడ్డాడు. వస్తాదు తనకిక నాయకుడు. అతనికిమల్లే తనూ వుండాలి.

అది మూడంతస్థులమేడ. పేరుకు మేడకాని నిజానికి మాత్రంకాదు. ఒకవరసా, వాడీ లేకుండా గదులు; ఎక్కడా మసలడానికి వీల్లేని యిరుకైన గదులు. గాలి తగిలితే ఊడిపడిపోతున్నట్లున్న మెట్లు. మూడో అంతస్థులో ఒక గదిలోనికి అంతా ప్రవేశించారు. గది చాలా చిన్నది. పది అడుగుల వెడల్పు; పదిహేనడుగుల పొడవు. గదిలోపొగ చిమ్ముకువస్తున్నది. పొమ్మన లేక పొగపెట్టినట్లు ఉక్కిరిబిక్కి రవుతున్నది. గదిలో అస్థిపంజరంలా ఒక మనిషి కూచుని నేలకు చేతులు ఆనుకుని ముందుకు జేకుతున్నాడు. ఎదురుగా, వొక బక్కపల్చని ఆడమనిషి మోకాళ్ళమీద తల వాల్చుకుని దేవుడో, రాముడో అంటూ మూలుగుతున్నది. ఆమెపక్కనే పిల్ల గుక్కపెట్టి ఏడుస్తున్నది.

మునూవాళ్లూ గదిలోకి రాగానే, ఆ ఆడమనిషీ, మగవాడూ చిరునవ్వులతో స్వాగతమిచ్చారు. వాళ్ళ ఆప్యాయతను చూసి మునూ ఎంతో సంతసించాడు. ఇంతవరకూ మిల్లుకూలీలు ఎవరికివారే; యమునాతీరే. ఒకళ్ళ గొడవ ఇంకొకళ్ళకు పట్టదు.

గదికి ఉత్తరంగావున్న కిటికీలో కోడిగుడ్డులాంపు మసినికక్కుతూ వెలుగుతోంది. గది కిటికీలోంచి చూస్తే మేఘావృతమైన ఆకాశం కనిపిస్తున్నది. గదిమూల పొయ్యిలో పుల్లలు సన్నగా మండుతున్నాయి. సన్నని ఆ మంట వెలుగులలో మనుషుల నీడలు గోడమీద పొడుగ్గా పడుతున్నాయి.

"సగం గది అద్దెకిస్తానన్నావుకదూ మామా!" అని రతన్ కత్తి కలిపాడు.

"ఆఁ; అవునవును."

"ఇదిగో వీడిపేరు మునూ. ఈ కుర్రాడితోపాటు యీ సంసారం. వీళ్ళ కొంపాగోడీ తుఫానుకి కొట్టుకుపోయింది సిబూ!"

షిబూ గుడుగుడుపీలుస్తూ పొగవదులుతూ "సరే, సరే! రమ్మను, రమ్మను ... ఎవరబ్బాయ్, నీ పేరు; మునూవా?"

"ఆఁ ఆఁ"

"మన్దే దేశం?"

"ఉత్తరాది"

"ఒహో! ఉత్తరాదా? ఏ ప్రాంతామో?

మునూ వీపుమీదవున్న పిల్లను కిందకు దింపి "కాంగ్రా అండి."

"ఒహో కాంగ్రావా? నే నక్కడ కొన్నాళ్ళున్నానే! అయితే నువ్వప్పటికి పుట్టివుండవ్. ఎప్పటిమాటో లే! నా చిన్నప్పటిమాట! అవు నోయ్ అవును! కాంగ్రా పర్వతాలమీద కాళికాదేవి ఆలయం వుంది."

షిబూ అనవసర ప్రసంగాన్ని విని అతని భార్య మాటల్ని మరపించింది. "ఇదిగో! అట్టుముక్క! తిని యిన్ని నీళ్ళు తాగి బబ్బోండి." భార్య మనసు గ్రహించి షిబూ తన ధోరణిని ఆపివేశాడు. అతని చిన్నకూతురు తండ్రి దగ్గరకుచేరి "తరువాత ఏమిటయింది." "నాన్నా చెప్పవూ!" అని ఆతురతతో ప్రశ్నించింది. "పో. పో! దయ్యం! పోయి పడుకో" అని తండ్రి గద్దించాడు.

మునూ, గది అంతా వొకసారి పరికించి 'యిక్కడికి గాలీ, వెలుతురూ సోకవట్టుందే! ఇపుడు రోజ్జగాలికనక భయంలేదు. తెల్లారితే గదిలో బతకడం కష్టం. మావుడికాయలు కావువేసినట్లే! లోపలపొగ పైకి ఎలాపోతుంది? ఉన్నది ఒక్కటే కిటికీ. సరే, సరే! ఆ గుడిశలకన్న యిది మెరుగే కదా!' అనుకుంటున్నాడు.

హరిని చూసి రతన్ "నువ్వుండే గుడిసెకన్న యిది బంగార్లా వుంది" అన్నాడు.

హరి సమాధానం చెప్పేలోపునే మునూ "అవునవును. ఆమాట నిజమే. ఈ ఊరు రాగానే మొదటే యిక్కడికొస్తే ఏ చిక్కూ లేకపోను. దిక్కుమాలిన్ది వున్న లొడ్డూ, లొసుగూ అంతా పోయింది మాయదారి గుడిసెలో."

"నిజమే మరి. మరి మనం గుడిసె వొదిలేస్తే చింటూం సాహేబ్‌కి చిర్రెత్తుకొస్తుంది. నెలజీతమంతా ముక్కుమీదగుద్ది వసూలుచేస్తాడు."

"అయితే ఎంతద్దె యిస్తున్నావు హరీ!"

"మూడ్రూపాయలు రతన్ గారూ !"

"మరి రెండురూపాయలే ఎక్కువలే. మా మంచికొంప యిది."

"అద్దెమాటకేంగానీ, చేతిలో చిల్లిగవ్వ లేదు. అప్పుడే అప్పులపాలయ్యి పోయాను. సాహేబ్‌కి పదిరూపాయ లీయాలి, ఇంట్లో పప్పూలేదు; ఉప్పూ లేదు. తుపానుకి గుడిసెలో చెంబూ, ముంతా ఏమయ్యాయో తెలియదు. విధిబాబూ విధి! బ్రహ్మరాసిన రాత. తప్పించుకుపోవడం ఎవరితరం?"

"దిగులుపడకు". ధైర్యంచెబుతూ రతన్ తన ఛాతీపై చేతులతో కొట్టుకుంటూ "వీడు...వీడు...ఈ రతన్ వుండగా నీ కేం భయంలేదు భాయ్ !"

"ఈ మునూ దయవల్ల కాదండీ తమ కింత జాలికలిగింది నా మీద. ఆ వేళ మునూనే అడ్డుకోకపోతే, మా పిల్లాడు చచ్చిపోవల్సిందేకదా! వాడి సాహసంవల్ల మావాడు బతికి బట్ట కట్టాడు. మీ ఉపకారానికి నా చర్మం వల్చి చెప్పులు కుట్టిస్తా."

షిబూ కీ ప్రసంగం అప్రస్తుత మనిపించిందో, యేమో "ఆఁ, చాల్లెద్దురూ దిక్కుమాలిన గొడవ!...హరీ! ఇదిగో యీ అట్టుముక్క కాస్త నోట్లో వేసుకో. మా ఆవిడ చేతివంట బాగుంటుందిలే. ఇప్పుడే బియ్యంకడిగి ఎసట్లో పోసింది. పట్టెడు మెతుకులు తిని, పడుకోండి. తెల్లారితే మనపురాణాలు మనకెలాగా వుండనే వున్నాయ్" అన్నాడు.

హరి "అదేమిటి బాబుగారూ! మీరూ పిల్లలవాళ్ళే. మాకెందు కిపుడీ భోజనాలు!" అంటూ అభ్యంతరం చెప్పాడు. "సరిసరి! ఎంత పట్నవాసం వచ్చినా, ఎంత బొంబాయిలోవున్నా మన మర్యాదలు మనం మర్చిపోతా మటయ్యా, నీ వెర్రికానీ. ఇదిగో ఈగోనె పట్టాపరుచుకొని నడుం వాల్చు కోండి. కావాలంటే దుప్పటి తెచ్చియిస్తాను."

"మీ కెంత శ్రమ కలిగిస్తున్నాం మేం! అనవసరంగా మీ కెందుకీ యాతన?"

"ఇదో శ్రమా నాకు? ఇప్పటికి నలభైఏళ్ళు దాటుతున్నాయి. ఇంత వరకూ మర్యాదచేయడంలో నేను వెనక్కి తీసెరగను".

ముసలతని యింట హరీ అతని కుటుంబానికీ యింత మర్యాద జరగ డానికి తా నేకద, కారణమనుకుని మునూ లోలోన సంతోషపడ్డాడు.

కాని, యీ సంతోషం తెల్లవారినతరువాత చల్లబడిపోయింది. పొద్దున్నే లేచీలేవడంతోటే దూరంగా ఏదో దిక్కుమాలిన వాసన వేసుకొచ్చి ముక్కుపుటాలను బద్దలు చేస్తున్నది. అప్పటికప్పుడే రతన్ లేచి హుక్కా పీల్చుకుంటున్నాడు. అసహ్యంగా మొహంపెట్టి మునూ "ఎక్కడదన్నా ఆ రోత వాసన!"ని ప్రశ్నించాడు.

"ఎక్కడ చెప్మా ... ఎక్కడోలే ... బహుశా సందులోంచి కాబోలును."

మునూ గది చివరకువెళ్ళి కిటికీలోంచి తొంగిచూశాడు. మొహం ముకుళించిపోయింది. తల దిమ్మదిరిగేటట్లు కంపుకొట్టుకొచ్చింది. కిందవున్న సందులో మరుగుదొడ్లు దుర్భరంగా వున్నాయి. మునూ కంగారెత్తుకుపోయి "ఏమిటన్నా యిది?"

"ఏమీలేదు తమ్ముడూ! రెండువందలమందికి ఏడు మరుగుదొడ్లున్నాయి. తుడిచే పాకీవాడు ఒక్కడే. మరి కంపువేయదూ? ... నీ కెందుకొచ్చిన చిత్తక్షోభ. నీ సంగతేదో నువ్వు చూసుకో. ఒక్క అణా పారేద్దాం. పారేస్తే పాకీవాడు మనకి ప్రత్యేకంగా హంగుచేస్తాడు. రా, నాతో రా."

రారమ్మని రతన్ పిలిచినవెంటనే మునూ అతనివెంట బయలుదేరాడు. దారిలో తుప్పుపట్టిన మేకులూ, ట్రంకుపెట్టెల మూతలూ, తట్టలూ, బుట్టలూ, పడివున్నాయి. మెల్లగా వాటిని దాటుకుంటూ, మరుగుదొడ్లదగ్గరకు వచ్చేసరికి, మునూ చేతులు వాటంతటవే ముక్కును మూసివేశాయి. చొక్కాకొసతో ముక్కు మూసుకుంటూ "హుఁ హుఁ" అని చీత్కరించుకుంటూ, మునూ నించుండిపోయాడు. మరుగుదొడ్లపక్క దుర్భరమైన కంపుని తట్టుకోలేక ముక్కుమూసుకు జపంచేసుకుంటున్న మహర్షిలా ఒక పాకీపిల్లవాడు కూచున్నాడు. రతన్ అధికారపూర్వక స్వరంతో అతన్ని గద్దించాడు: "మెహతర్! మనదొడ్డి శుభ్రంచేశావూ?"

"చేశాను పహిల్మాన్‌గారూ!"

"సరే! ఇదిగో ఈ కుర్రవాడు మన సైడువాడే, ప్రతిరోజూ శుభ్రం చేసినవెంటనే మనవాడి కింత చోటు యియ్యి" మునూకు దారి చూపిస్తూ పాకీ పిల్లవాడు ముందు నడిచాడు.

లోపలికి వెళ్ళి అక్కడి కంపును భరించలేక మునూ కొన్ని నిమిషాలలో యివతలకు చక్కావచ్చేశాడు. ఇంత త్వరగా వచ్చేసిన మునూను చూసి రతన్ "దేహబాధ తీరిందా తమ్ముడూ?"

"హుం హుం!" అని మూలిగి బుర్రవూపి, నోటితో గాలిని వదలి పెట్టాడు మునూ.

"కాళ్ళు కడుక్కోవాలంటే అదిగో పంపు." కుళాయిచెంత ఆడవాళ్ళు తీర్థప్రజలా నిండున్నారు. గోవర్ధనగిరుల్లా కుండలు కుళాయిచుట్టూ పేర్పులమీద పేర్పులతో వున్నాయి. కుళాయికి ఫర్లాంగు దూరంవరకూ బురద కూడుకొని వుంది. ఈ భయానకదృశ్యాన్ని చూసి మునూ "ఇపుడక్కర్లేదన్నా!"

"మరీవీధికంతా యిదొక్కటే కుళాయి."

మేడమెట్లు ఎక్కుతూంటే మేడ దిగుతూన్న హరి ఎదురయాడు. గుడిశల్లో చెంబూ, ముంతా ఎవరికంటా పడకముందే తెచ్చుకోవాలనే ఆదుర్దాతో హరి గబగబ మేడమెట్లు దిగుతున్నాడు. "నేనూ వచ్చేదా? నీతో వస్తే చెరువులో వొళ్లు కడుక్కోవచ్చు" నన్నాడు మునూ.

* * *

తెల్లవారింది. చెవులు గింగురులెత్తిస్తూ ఫ్యాక్టరీ విజిల్ వేసింది. వేసిన విజిల్‌కు అదరదరిపడుతూ ఎక్కడున్నవాళ్ళక్కడ, ఏపనిచేస్తున్నవాళ్ళాపని వదలిపెట్టి గబగబా పరుగులంకించుకొని కూలీలు బయలుదేరుతున్నారు. కాస్సేపటిలో మిల్లుముందు చీమలబారులా కూలీలు వరసలు వరసలుగా నించున్నారు. మిల్లుగేటుముందు చింతనిప్పుల కనులతో, మీసాలు మెలివేసుకుంటూ చింటాంసాహెబు పులిలా మాటువేశాడు. అసలే అతను కోతి. కల్లుతాగాడు. నిప్పుతొక్కాడు. తన గుడిశల్ని కూలీలంతా ఖాళీచేశారనే కోపంతో మండిపడిపోతున్నాడు. కసాయివాడి కత్తిలాగ చురచురచూస్తూ చూపులతోనే కూలీలను బలిపుచ్చుకునే అమ్మవారిలా గేటుముందు హూంకరిస్తున్న చింటాంసాహేబ్‌ను చూడడంతోటే కూలీల ప్రాణాలు నిలువునా ఎగిరిపోయేయి. వందగజాల దూరంలో వుండగానే వంగి వంగి "హుజూర్, సలాం, సలాం" అంటూ దణ్ణాలు పెడుతూ, మొక్కుతూ అమ్మవారి గుడిలోకి వెళ్లే మేకపిల్లల్లా కూలీలు ఒకరొకరే యిటు వస్తున్నారు.

మునూ కాస్త దగ్గరకుపడి "హుజూర్! సలాం, సలాం! సలాం హుజూర్" అని మొక్కాడు. చింటాంసాహేబ్ ఉగ్రుడై కూలీలను కాలి బూటుతో తంతున్నాడు. ఒకర్ని డొక్కలమీద, మరొకర్ని వీపుమీద, యింకొకర్ని కాళ్ళమీద కుక్కల్ని తన్నినట్టు తన్ని కిందపడ్డవాళ్ళను తొక్కేస్తూ చింటాంసాహేబ్ విలయతాండవం చేస్తున్నాడు. తన్నులు తింటున్న తాపులకు లోనయిన దౌర్భాగ్యులలో హరిఒకడు కిందపడి దొర్లుతూ, లేచి చేతులు రెండూ జోడించి, వంగుని, "మీ పాదాలకు మొక్కుతా బాబూ! దాసుణ్ణి! దాసాను దాసుణ్ణ"ని బతిమాలుకుంటున్న హరిని చూడగానే మునూ కనులనీరు కమ్మింది.

"మొక్కుతావూ? ఎవరికిరా? నే నేం అమ్మనా గన్నుకున్నావా మొక్కడానికి?" కూలీలు మొక్కుతున్నకొద్దీ మోచేతి గుద్దులు, మోకాలు తాపులు, బూట్ల తన్నులు ఎక్కువవుతున్నాయి.

"ఎందుకు ఖాళీ చేశారు? ఎవర్నడిగి ఖాళీ చేశారు?

"తుపాను బాబూ! తుపానుకి గుడిశలన్నీ కొట్టుకుపోయాయ్!"

"కొట్టుకుపోయాయా? కొట్టుకుపోతాయి. పోవుమరీ?"

"మీద టాపారం ఎగిరిపోయింది హుజూర్!"

"అవున్రా హరీ! నీమాట?

"హుజూర్, హుజూర్! నాదీ అంతేబాబూ! రోడ్డునిండా నీరు నిల్చిపోయింది."

"నిల్చిపోయిందీ, నీరు నిల్చిపోయిందీ? నీవంట్లో నీరు తీసేస్తానుండు! నిన్న నేనటు రాలేదూ? వచ్చి చూడలేదూ? నీరుందా నీరు?"

ఫోర్‌మన్ గద్దింపులకు హరి బెదిరిపోతున్నాడు. మునూ నెత్తురు పొంగుకువచ్చింది. హరి సర్దుకొని నెమ్మదిగా "నిన్న మీ రొచ్చేసరికి నీరు నిలవుండి పోలేదు హుజూర్! నిన్న నే నీరంతా అవతలికి తీసేసి నా సామాను తెచ్చుకున్నాను."

హరి ఆడుతున్న అబద్ధానికి మునూ సంతోషించాడు. ఎలాగయితేనే బయటపడతాడుకదా, అబద్ధమో సుబద్ధమో మరి!

"ఎందుకీ అబద్ధాలు !" అంటూ ఫోర్‌మన్ దూకుడుగా హరి మీదకు దూసుకువచ్చాడు. ముసూ గట్టిగానే "నిజమేనండి హుజూర్! నేనూ హరికి సాయంచేశాను నిన్న" అన్నాడు.

"లంజకొడకా! పిల్లికి ఎలక సాక్ష్యం! వేలెడున్నావ్ తత్తుకొడకా" అంటూ క్రోధంతో ఫోర్‌మన్ ముసూమీదకు లంఘించబోయాడు. గేటు చెంత పిల్లలతో నించున్న లక్ష్మి భయంతో కెవ్వున కేక వేసింది. "ఆ మాట నిజమేనండి హుజూర్!" అని మళ్ళీచెప్పాడు ముసూ. "మాట మిగల్చెప్పకి"ని ఫోర్‌మన్ చేయి ఎత్తాడు. రతన్ గబగబ అడుగులు వేసుకుంటూ ఫోర్‌మన్ మధ్యకు వచ్చి "ఆగవయ్యా ఆగు, ఆగు! ఏమిటా దుడుకు?" చేతులు రెండూ వెనక్కితీసుకుని తగ్గాడు ఫోర్‌మన్. రతన్ కంఠం సరిచేసుకుని "నిజం. నిజం. నేనూ చూశాను ఆ గుడిసెని. నీరు నిల్వవుంది. గుడిశ టాపారం ఎగిరిపోయింది."

"అబద్ధం!"

"నీదా, నాదా ?"

"నీది"

"జాగ్రత్తగా రానీయ్ మాటలు. మాటలు ఆస్తే ఖర్చుపెట్టకు. నీమానాన నువ్వు నీపనేదో చేసుకో. వెళ్ళు; లేకపోతే నీ పరువింక దక్కదు."

"ఝూటాకోర్."

"మళ్ళీ అను ఆమాట! ప్రాణాలు తీసేస్తాను." రతన్ గొంతుక బిగ్గరగా చేసుకొని, పిడికిలి బిగించాడు. చేతులు రెండూ మీదకు ఎత్తాడు. కళ్ళతో భయపెట్టాడు. ఫోర్‌మన్‌గుండె దడపుచ్చుకొంది. భీముడిలా కనిపిస్తున్న రతన్ ఉగ్రస్వరూపాన్ని చూసి గొంతు మూతపడింది: "నువ్వెవరివి మధ్యని ? వాళ్ళకి నేను నాకొంపలు అద్దెకిచ్చుకున్నాను."

"ఇచ్చుకుంటే ?"

"నాఇష్టం."

"నీ ఇష్టం నీ ఇంటివద్దిర. తిన్నగా యింటికిపోయి దుప్పటి ముసుగు తన్ని పడుకో. నీజోలికెవరూ రారు!"

"నేను నీపై ఆఫీసర్ని."

"అందుకే కిందపడకని చెబుతున్నాను."

"నేను ఫోర్మన్ని"

"అయితే కూలీల్ని బూటుకాళ్ళతో తన్నమని నీ కెవడిచ్చా డధికారం ?"

"నేను ఈ నెల అద్దెంతా వసూలుచేస్తాను. చూస్తాను, ఎవ రడ్డు తారో" అంటూ ఫోర్మన్ "ఎటెన్షన్ ! మార్చి !" అని కేక వేశాడు.

"నీ అద్దె నీ కెలాగ పారేస్తారు ! కాని వొంటిమీద మళ్ళీ చెయ్యి వేశావో, నా తడాఖా చూపిస్తాను."

వార్డర్ నాదిర్ఖాన్ రోషంలో వున్న రతన్ను "అంతే ! అంతే ! తర్వాతలెండి ఆ మాటలన్నీ. పదండిక పదండి" అంటూ వెనక్కి తీసుకు పోయాడు.

రతన్ వీవింగ్ షెడ్డులోకి మెల్లగా వెళ్ళిపోయాడు. కూలీలు ఎవరి పనుల్లోకి వాళ్లు వెళ్లిపోయారు. పని చేస్తున్నారన్న మాటే కాని ఎవరికీ గుండెల్లో ప్రాణాలులేవు. అనవసరంగా రతన్, అల్లరి తెచ్చిపెట్టాడనే భయం కూలీలను ఆవరించింది. రతన్నుచూసి మునూ విజయగర్వంతో కళ్ళల్లో నవ్వుతున్నాడు. షెడ్లోని ఒకయువకుడు రతన్ చెంతకు వచ్చి "కోడిపుంజులా తలపడ్డావ్ ? కానీ, నీమీద పగబట్టాడు ఫోర్మన్."

"ఏడిశాడు ! ఇలాంటివాళ్ళని లక్షమందిని చూశాను. నేను పహిల్వానిని. మాట్లాడితే ముక్కుమీద గుద్దుతాను. సోలడు నెత్తురుకారి చస్తాడు ముండాకొడుకు."

"ఏమైనాకాని, మాగొప్ప తమాషా చేశావే అన్నా" మునూ తెగిపోయిన నూలును ముడివేస్తూ మళ్ళీ సంభాషణ కుపక్రమించాడు. "లేకపోతే వాతోనా ఫోర్మన్ మజాకాలు ! ఇలాటి వాళ్ళు లక్షాతొంభైమంది నా తలమీదంచెగిరిపోయారు."

"ఊఁ !"

"జంషెడ్పూర్లో తాతా స్టీల్ వర్కుసులో నేను పనిచేశాను. అక్కడ వున్నవాళ్ళు ఏభైవేలమంది కార్మికులు. వుండుండి యజమానులు ఆకస్మాత్తుగా మా జీతాలు కోసేసేరు."

"కోసేస్తే ?"

"ఊరుకుంటామా ? మా శక్తేమిటో ఒక్కసారి చూపించాం. అంతా పన్లు మానేశాం. ఆ సమ్మె నడిపింది నేను. ముందు నించుంది నేను. కంపెనీ గడగడలాడింది" రతన్ బోరవిరుచుకుని సాభిశయంగా చెప్పుకొస్తున్నాడు: "మా షరతుల కన్నిటికీ యజమాను లంగీకరించారు."

"అయితే మరి అక్కణ్ణుంచెందుకు వచ్చేశావ్, అన్నా ?"

"అలా అడుగు చెబతాను. మళ్లీ స్ట్రయికొచ్చింది."

"ఎందుకని ?"

"రోజూ మా చేత గంటలతరబడి పని చేయించేవాళ్లు. దానికో నియమమంటూ లేదు. కూలీలంటే కుక్కలతో సమానమని యజమానుల తలపోగరు. ఎవరికీ కొంపాగోడీ లేదు. అన్నోటిగంటలు పని చేయించకూడదన్నాం. మమ్మల్నీ మానవమాత్రులుగా చూడాలన్నాం. కూలీలకు యిళ్ళవసతులు చూపాలన్నాం."

మునూ ఆతృతతో రతన్ చెప్పే కథను వింటున్నాడు. రతన్ నాటి ముచ్చటలను చెబుతున్నాడు: "యజమానులు, కూలీల కోరికలను నిరాకరించారు. సమ్మెచేయక తప్పిందికాదు. కాని మనలోకూడా విభీషణాయిలున్నారుకదూ. ఇంటిగుట్టు లంకకుచేటని, దొంగముండాకొడుకులు మన గుట్టంతా వాళ్ళకి అందిచ్చేశారు. దాన్తో సమ్మె చప్పబడిపోయింది. నాకు మాత్రం తట్టుకాలేసుకొచ్చింది. చెప్పద్దూ, వొకద్రోహిని మెడకాయపట్టుకుని చితకతన్నాను. ఇక్కడికి వెళ్ళిపోవచ్చేశాను."

"నా కక్కడికి వెళ్లాలనుందన్నా ! ఉక్కు ఫ్యాక్టరీలో పనిచేస్తే మా బాగుంటుంది. రైలింజన్లూ, రైలుబడ్డీలూ అక్కడ తయారుచేస్తారు కాబోల్నే ?"

"అలాటి వూహాపోహాలకి పోకు. అక్కడ వేడి జాస్తీ. అప్పుడు నాకు పదెనిమిదేళ్ళు. నేను కమ్మరివాణ్ణికనక ఆ ఫ్యాక్టరీ వేడికి తట్టుకోగలిగాను. మరొకడయితేనా, మిడతలా మాడిపోవల్సిందే."

"ఫ్యాక్టరీలో అంత వేడి ఉంటుందేం ?"

"ఇనుం సల సల మసుగుతున్న ఏటిలా ప్రవహిస్తూ వుంటుంది. ఒక ఎకరం మేర కాగుతున్న ఇనప ప్రవాహం. అవిరులు కమ్ముతూ వొళ్ళు తెక తెక లాడిస్తుంది. కళ్ళన్నీ మంటలెత్తుతాయి. కాంతికి చూపులు మంద

గిస్తాయి. పగలూ, రాత్రీ అని లేదు. ఎప్పుడూ యింతే. వాన పడిందా యిక చచ్చేమన్నమాటే. వేడివేడి ఆవిరి మబ్బులమధ్య మనిషి నిలువునా చచ్చిపోవల్సిందే."

రతన్ ఎంత వర్ణించినా, మనూకు జంషెడ్‌పూర్ పోవాలనే కోరిక పోయిందికాదు :

"నీ కెలా వచ్చిందా ఉద్యోగం ?"

"నాకు ఉద్యోగం కావాలి. సంపాదించుకోవా లనుకున్నాను. గేటు ముందు నిలబడి భోగట్టా చేశాను. ఫోర్‌మన్ దగ్గరకు వెళ్లమన్నారు. వెళ్లాను. అపుడు దేశంలో యుద్ధం జరుగుతోంది. కూలీలంతా యుద్ధానికి పోయారు. మనుషులు దొరకిడంలేదు. కంపెనీ రైలుపట్టాలు తయారుచేస్తోంది. మనుషులు చాలామంది కావాలి. నేను దొరికాను."

"ఫ్యాక్టరీలో పని సులువుగా వుంటుందా? "

"ఏమిటన్నావ్ ? సులువుగా ఉంటుందా అనేనా ? సులువు సులువు, అహహా..." రతన్ విచిత్రమైన నవ్వు నవ్వి "ఆఁ! అంతా సులువే. పొద్దున్న ఆరు మొదలు సాయంత్రం ఆరు దాకా పని. వారానికి ఏడు రోజులు పని. సల సల మరిగే ఉక్కు ప్రవాహం ముందు ఆవిరులు మొహం మీద కమ్ముకొస్తూవుంటే, జాగ్రత్తగా ఎవరి పని వాళ్ళు చేసుకుపోవల్సిందే. మీదను నించుని క్రేన్ అందిచ్చే ఇనప తీగల్ని వొంసిలిస్తూ ఎర్రటి ఇనప ముక్కల్ని కిందకు దింపుతూ 'జాగ్రత్త! మీదపడితే భస్మమౌతావ్ !' అని క్రేన్ మనిషి కేకవేస్తూ వుంటాడు. ఎడంచేత్తో వేడి తగలకుండా మొహాని కడ్డంపెట్టుకుని కాలే ఇనప వాసాన్ని కిందకు దింపుతూ ప్రాణానిక్కూడా ఖాతరు చేయకూడదు."

"ఇలా రోజుకూ ఎన్నిగంటలు ?"

"రోజల్లాను. రోజుకీ మున్నైఆరు గంటలు."

"అబ్బ ! మున్నైఆరుగంటల పనే ! మరి పడుకోవడం ?"

"రూల్సు ప్రకారం మున్నైఆరుగంటలూ పనిచేయాలే అనుకో. కాని నేను మున్నైరెండుగంటలే పనిచేసేవాణ్ణి. తతిమ్మా నాలుగు గంటలూ ఓమూల యిటికజెడ్డ తలగడగా పెట్టుకొని, ఓబల్లచెక్కమీద పడుకునేవాణ్ణి. ఆ పక్కనే క్రైంకీపరుగాడి కాపలా. కానివాడు నల్లమందు భాయీలే. కునుకు

పాట్లు పడుతూవుండేవాడు. ఉక్కు ఫ్యాక్టరీలో నిద్రపోవడమంటే మనిషికి మారకం తప్పదని వాడికీ తెలుసును. కూలీ లెవరూ నిద్రపోరని వాడి ధైర్యం. పడుకుంటే ఏదో ఓ యినపముక్క మీదపడవచ్చును. లేదా 'రేకులు ఎగిరి మెడ కాయ కోసుకుపోనూవచ్చును."

మునూ ఆశ్చర్యంగా నోరు వెళ్ళబెట్టి రతన్‌వంక తదేకదీక్షతో చూస్తున్నాడు. మునూ తన వాంఛను హృదయంలో అణచుకోలేక పోయాడు. కళ్ళల్లో కనిపిస్తున్న పిల్లవాడి కోరికను కనిపెట్టి రతన్ హెచ్చరించాడు: "జంషెడ్‌పూర్ వెళ్లాలనే ఉద్దేశం మానుకో. ఇక్కడేవుండి నీపనిపాటలు చేసుకుంటూవుండు. అక్కడ ప్రమాదాలు జాస్తీ. ఎప్పుడూ దబదబమనే ఉక్కుచప్పుడే. క్రేన్‌తో చెలగాటం మాటలతో పనికాదు. పావుటన్ను ఉక్కుదూలాల్ని నీతరంకాదు ఎత్తడం. ఎత్తుతూంటే అవి ఒక్కొక్కపుడు మీదనుపడితే నిన్ను పలకరించేవాడుండడు. గొలుసుతెగి మీదపడిందీ, అంతా గోవింద గోవింద! కట్టకట్టుకు చావవల్సిందే. అటూఇటూ పరు గెత్తడం, దూలాల్ని ఎక్కించడం, దింపడం, మోయడం!"

రతన్ సంభాషణ కొనసాగుతుండగా, ఫోర్‌మన్ అటొకసారి వచ్చి తొంగిచూసి గద్దించాడు: "పిట్టకథలు చెప్పక నీపనేదో నువ్వు చూసుకో. కూసేగాడి దొచ్చి మేసే గాడిదని చెరిపిందట."

ఫోర్‌మన్ కేకవేసి వెళ్ళిపోగానే "వీడు మనమీద పగపట్టినట్లున్నాడే" అన్నాడు మునూ.

... ... ...

ఫోర్‌మన్, తోకతొక్కిన తాచులా పగపట్టి ఎప్పుడు రతన్‌ను కాటు వేద్దామా అని పొంచుండి నిరీక్షిస్తున్నాడు. కూలీలందరిమీదా అతనికి పగే. కాని పగతీరే రోజు యింకా రాలేదు. రోజులు గడిచాయి. వారాలు వెళ్ళాయి. పక్షాలు దొర్లిపోయాయి. నెల పదిహేనురోజులు గడిచాక, కూలీల జీతాల చెల్లింపురోజు వచ్చింది. బట్వాడానాడు అమల్దారీ అంతా ఫోర్‌మెన్‌దే.

శనివారం మధ్యాహ్నం సూర్యుని ఎర్రని కిరణాలు కూలీల వీపుల మీదపడి మాడ్చివేస్తున్నాయి. ఎండిపోయిన కడుపులతో, దీనవదనాలతో కూలీలు ఎండలో వరసగా నించున్నారు. ఫోర్‌మన్ మొహం కోపంతో,

ఎర్రబడింది. అధికారదర్పంతో కుర్చీలో చతికిలబడి గంటలతరబడి ఆఫీసు ముందు కూలీలను నిలబెట్టి ఒక్కొక్కరినే లోనికి రమ్మంటూ గద్దిస్తూ అడావుడి చేస్తున్నాడు. ఆఫీసువరండానడవలో నాదిర్ ఖాన్ చేతిలో లొట్టాయికర్ర పట్టుకొని నించున్నాడు.

కూలీలు గదిలోనికివెళ్ళి ఒక్కొక్కరే యివతలకు తెల్లమొహాలు వేసుకుని వస్తున్నారు. హరి, వంతు వచ్చింది. బల్లమీద ఎగిరిపడుతున్న ఈగల్ని తోలుతూ మీసం పళ్ళతో కొరికి "హరీ!" అని కేకపెట్టాడు ఫోర్ మన్.

ఫోర్ మన్ మాటల ఉచ్చారణ హరికి బోధపడలేదు. గది యివతల నించున్న రతన్, మునూలవంక చూస్తూ అక్కడే నిలబడిపోయాడు. "హరీ" అని మళ్ళీ లోనుండిపిలుపు. సమాధానంలేదు. కూచున్న కుర్చీలోంచి లేచి "హరీ" అని మళ్ళీ కేకవేశాడు ఫోర్ మన్. కూలీలు భయంతో దిక్కులు చూస్తున్నారు. పిలచినవెంటనే వెళ్ళకపోతే తెల్లదొర మండిపడతాడనే భయంతో హరిని పట్టుకుని ముందుకు తోశారు. మునూ హరిని మోచేత్తో పొడిచి "హరి అంటే హరీ అచ్యుతాలేదేమయ్యా!" అని నవ్వాడు.

ఒక్క గంతులో గదిలోకి పోయి గాభరాగా నించుని గడ గడ వణకిపోతున్నాడు హరి. ముసలివాడిని చూడగానే కళ్ళు చింతనిప్పుల్లా చేసుకుని ఫోర్ మన్ "హర్రీఅప్ హర్రీఅప్!" అని గద్దించాడు: "నే నేం నీబాబుగార్ని నౌకర్ననుకున్నావుర్రా? రెండుచేతులా నీ జీతం అందిచ్చి నీ వొళ్లో పోయడానికి గంటలతరబడి కూచుంటాననుకుంటున్నావా?...తే... ఇలా తే... ఆ వెధవచెయ్యి."

హరి నమస్కరించి, వణకుతున్న పెదవులతో ఏదో మాట్లాడబోయి, కుడిచేతి బొటనవేలును అందిచ్చాడు. "పెట్టు! వెధవ వేలు" వేగంతో యింక్ పేడ్ మీద అద్దుకుని సరిగ్గా అంటుకున్నదో లేదో పరకాయించాడు. కుష్ఠురోగి శరీరాన్ని చూసి అసహ్యంచుకున్నట్లు హరి బొటనవేలు పట్టుకుని ఫోర్ మన్, రిజిష్టరులో వేలి ముద్రవేసి, అయిదురూపాయల నోట్లు రెండు అందిచ్చాడు. మరి పదిరూపాయలు ముట్టజెప్పాడు.

"నువ్వు నా కివ్వవలసింది పదీ. అప్పుమీద వడ్డీ రూపాయి. సరే, గుడిసెకి అద్దె మూడ్రూపాయలు. ఫ్యాక్టరీలో బట్టలనేత పాడయినందుకు అయిదురూపాయలు కట్! మిగిలిన జీతం మొత్తం నీకూ, నీ పెళ్లానికీ, నీ కుర్రాడికీ, మునూగాడికీ."

"అప్పు, వడ్డీ, కట్" యీమాటలు ఎప్పుడూ కూలీలచెవులలో గింగురు మంటూనే వుంటాయి. వీటికి భాష్యంచెప్పడానికి ఏ అర్థికవేత్తా అవసరం లేదు. అది కూలీలకు స్వానుభవమే. ఈమాటలు చెవినిపడగానే, కూలీల గుండెలలో రైళ్ళు పరుగెత్తుతాయి. కాని వాటిని శిరసావహించక తప్పదు. హరి అదే పదివేలనుకుని యిరవైరూపాయిలూ తీసుకుని, ఫోర్‌మన్‌కు సలాం చేసి బయటకువచ్చాడు. మునూను చూడగానే నోట మాటరాలేదు. కనులనిండా నీరు గిర్రుగిర్రున తిరిగింది. మొహం తెల్లబోయింది. నుదురు ముడతలు దేరింది.

"ఏం? అలా వున్నావేం?"

ఊపిరి బిగబెట్టుకొని హరి "ఏమీలేదులే బ్రదర్! ఇదంతా మనకర్మ! గుడిసెకి అద్దె, బట్టలు సరిగ్గా నేయనందుకు జీతం కోత, అప్పు వడ్డీ... మనందరికీ ముట్టజెప్పింది యిరవై. పాతికరూపాయలు మోసం!...ఇదిగో జీతం పదీ, యిండ."

"అహహా అక్కర్లేదు. నీ దగ్గరే వుంచు నా తిండికీ తిప్పలకీ అవడం లేదూ ఆపాటి?"

"నీ కెందుకయ్యా మధ్యని, నానుంచి యిన్ని తిప్పలు? నీకు రావల్సింది నీకే యిచ్చేస్తాను."

పుచ్చుకోమని హరీ, వద్దని మునూ వొకర్నొకరు బలవంతం చేసు కుంటున్నారు. రతన్ సలహాయిచ్చాడు "ఐదు రూపాయలు పుచ్చుకో, జోబీఖర్చుకి వుంటుంది."

గదిలోనుంచి 'రతన్' అనే కేక వినవచ్చింది. రతన్ చరచరా గదిలోకి వెళ్ళాడు. వెళ్ళీ వెళ్ళడంతోటే మాట తడుముకోకుండా "బట్టలనేత ఫస్టుగా చేశాను సాహేబ్! వడ్డీలేదు; ఏమంటే మనకేం అప్పుసొప్పుల్లేవ్. అద్దె అసలే లేదు. జీతం సీదాగా యిచ్చేయాల్సిందే."

"ఆలస్యంగా పనికి వచ్చినందుకు రూపాయి జరిమానా. నీకు రావల్సిం దిక పంధొమ్మిదీ."

"జరిమానా గిరిమానా జాన్తానై. నాకు రావాల్సిన ఇరవయ్యీ రావల్సిందే. ఒక్క దమ్మిడీ తక్కువకాడానికి వీల్లేదు."

రతన్ ఎర్రని చూపులు, కండలుదేరిన జబ్బల నిగారింపు చూసి తెల్ల దొర హడలెత్తిపోయాడు. మీసా లొకసారి కొరుక్కుంటూ సాలోచనగా "సరే! ఇది మొదటిసారి, మరి పనికి ఆలస్యంగా రాకు ... వేలిముద్ర వేయి."

" నాకు సంతకంచేయడం వచ్చును. "

ఫోర్‌మన్ మారుమాటాడక కలంతీసి రతన్ చేతికి యిచ్చాడు. దర్జాగా సంతకంపెట్టి, రతన్ ఇరవైరూపాయలు లెక్కచూసుకొని, విసురుగా వెళ్ళి పోయాడు. విసురుగా వీపు ఫోర్‌మన్‌వంక పెట్టి వెళ్ళిపోవడమంటే కూలీల నిర్లక్ష్యాని కదొక గుర్తు. పళ్ళు ఒక్కసారి పటపట కొరికి ఫోర్‌మన్ ఊరు కున్నాడు.

రతన్ ఇవతల కొచ్చేసరికి మునూ వాళ్ళూ వెళ్ళిపోయారు. ఇంటికి వెళ్ళిపోయి వుంటారని తనూ ఫ్యాక్టరీదాటి బయటకు వచ్చేశాడు. మురుళ్ళ కాలువదాటి రోడ్డుసందులోకి వచ్చేసరికి హరి కనిపించాడు. పొడుగ్గావున్న పఠానొకడు హరి మెడ పట్టుకుని గుంజుతున్నాడు. గుంజుతూ బూతులు తిడు తున్నాడు! మునూమాత్రం అక్కడ లేడు. హరి తన బొడ్డుకొంగునవున్న ముడివిప్పి పఠాన్ చేతిలో డబ్బుపెట్టాడు. "మాక్కనిపించకుండా ఉడా యించేయాలనుకున్నావురా? కూలీలవెనక వెనకే నక్కి తప్పుతూ తారుతూ పారిపోదామనుకున్నావేం? నాదిర్‌ఖాన్‌బాకీ జమకట్టు!...ఇంతేనా; ఇంకా వుంది...చూణ్ణీ...మూటవిప్పు! హూఁ! చూపించు" అంటూ పఠానూ, అతనివెంటవున్న సాయబ్బూ హరిని దబాయిస్తూ అతనిమెడ పట్టుకు ఒక్క తోపు తోశారు. "వడ్డీ ఐదు రూపాయలు."

"ఇంతకన్నా నా దగ్గరేం లేదు సాహేబ్! బట్టలు సరిగ్గా నేయలే దని జీతం తగ్గించారు. అప్పు, వడ్డీ, ఇంటి అద్దె. వచ్చేనెల యిచ్చుకుంటాను సాహేబ్! దయదల్చండ"ని హరి వాళ్లని వేడుకుంటున్నాడు. పఠాన్ ఒక్క కాలితో తన్నేందుకు ఉద్యుక్తుడౌతూవుండగా, మెల్లగా రతన్ వెన కాలే వచ్చి పఠాన్ చొక్కా పట్టుకున్నాడు. "ఏమిటీదబాయింపు?"

"మిమ్మల్ని కాదు పహిల్మాన్‌గారూ!"

"నన్ను కాదులే. వాడినే. డబ్బు యిచ్చేశాడుకదా, ఇంకెందు కా జులుం? ముసలాడు తేరగా దొరకాడనా? అంత కొవ్వెక్కివుంటే నాతో రండి." పఠాన్ పీక గట్టిగా పట్టుకొని రతన్ ముందుకూ వెనక్కీ లాగి

గద్దించాడు. పఠాన్ యిక ప్రాణాలు దక్కవని గొంతుక తగ్గించాడు. రతన్ అతని మెడ వదలివేశాడు. పఠాను మెల్లిగా తలవంచుకుని ముందుకు సాగిపోయాడు.

హరీ, రతనూ యింటికి వచ్చేసరికి, గేటుముందర చౌకీదారు మునూను గద్దిస్తున్నాడు: "అద్దె తెండి."

రతన్‌ను చూసి మునూ "షిబూ యిస్తాళ్ళే అని చెప్పినా, నన్ను తే తెమ్మని పీక్కుతింటున్నాడు. హరి తన బొడ్డుకొంగున వున్న మూడు రూపాయలు తీసి చౌకీదారు చేతిలో వుంచి "నీ రెండు రూపాయలూ నువ్విచ్చేయ్ మునూ! తర్వాత షిబూ మనం చూసుకుందాం లెక్క" మునూ రెండురూపాయలు తీసి యిచ్చాడు. రతన్ కూడా తన రెండు రూపాయలూ జమకట్టివేశాడు.

హరి వణకుతూ; మేడమెట్లమీద జారి కింద కూలబడ్డాడు. లోనుంచి లక్ష్మి వచ్చి అతన్ని లేవదీసింది. రతన్ బీడీ ఊదుకుంటూ గదిలో చతికిలబడ్డాడు. ఇంతవరకూ మునూ బీడీలోవున్న మజా గ్రహించలేదు. కాని ఇవాళ బీడీ తాగాలని బుద్ధిపుట్టిందో యేమో, రతన్ వైపు చేయి చాచాడు. రతన్ యిచ్చిన సిగరెట్టు ముట్టించి ఒక్క దమ్ములాగేసరికి దగ్గుపట్టుకుంది. రతన్ పొగ వదులుతూ పెద్దగా నవ్వాడు.

షిబూ గదిలోకి వస్తూ "ఇది సంతోషానికి సమయంకాదు. నాజీతం కోత కోసేశారు."

"నాజీతం అణా పైసల్తో రాబట్టేను. అలాగే మీరూ దెబ్బలాడ వల్సింది. దెబ్బలాడ్డానికి గుండెధైర్యం లేదూ, నాతోరండి. వచ్చి యూని యన్‌లో చేరండి. ఎన్నాళ్ళనుంచి చెబుతున్నాను మీకు, యూనియన్‌లో చేరండర్రా బ్రహ్మదేవుళ్ళాగా అని! వింటేగా నామాట?"

"యూనియన్లోనే చేరతాను. ఎప్పుడు చేర్పిస్తావో చెప్పు" అనడిగాడు మునూ.

"రా. ఎప్పుడో యెందుకు, యిప్పుడే రా!"

లక్ష్మి చేస్తున్న ఉపచారంవల్ల హరి కాలినొప్పి ఉపశమించింది. తానూ యూనియన్‌లో చేరతానని బయల్దేరాడు హరి. షిబూ సైతం వారివెంట

ప్రయాణమయ్యాడు. "రండి, అంతా రండి ... దారిలో నేనో గుక్క పుచ్చుకుంటాను. ఎన్నాళ్ళయిందో తాగి" అంటూ రతన్ లేచాడు.

*　　　*　　　*

మునూ రతన్‌ల స్నేహం దినదినం అభివృద్ధి అవుతున్నది. పరిచయం స్నేహంగా, స్నేహం సోదరభావంగా క్రమక్రమంగా పెంపొందింది. ఒక తల్లికడుపున పుట్టి ఒకే పొత్తిళ్ళల్లో పెరిగిన అన్నదమ్ముల్లా యిద్దరూ మసులుతున్నారు. ఫ్యాక్టరీ రొదరొదలో చాలీచాలని జీతంతో, అర్ధాకలితో సతమతమౌతున్న మునూ ప్రాణానికి రతన్ చెలిమి సంజీవిప్రాయంగా వుంది. రోజూకూ పన్నెండుగంటల పని ఎంతటి బలాఢ్యుణ్ణయినా పీల్చి పిప్పిచేస్తుంది. 'పగలల్లా పని చేసి చేసి అలసి అలసి యింటికివస్తే, గది ఎలకల బోనులా వుంటుంది. గదిలో పదిమంది మనుషులు కాపురం. చిందరవందరగా బట్టలు, అక్కడే పొయ్యి, పొమ్మనలేక పెట్టినట్లు పొగ, చెంబులు, ముంతలు, పసిపిల్లల ఏడుపులు, ఈసురోమంటున్న యీ జీవితం! ఇంటిల్లిపాదికీ ఒకటే మరుగుదొడ్డి. ఒకచోటే చేతులూ, మూతీ కడుక్కునే స్థలం, ఏమిటీ జీవితమని ఎంత విసిగినా, వొక్క ఉపకారం మాత్రం జరిగింది. అంతా ఒకటేననే సోదరభావం కూలీలందరకూ కలిగింది. మునూ యీ నరకంలోంచి బయటపడి అప్పుడప్పుడు నగరంలోకి రతన్ వెంట వెళ్ళివస్తూ గాలి పీలుస్తున్నాడు. కాని, యీ స్వేచ్ఛ ఆ కాస్సేపే! తరవాత అంతా మామూలే!

రోజల్లా రెక్కలు ముక్కలుచేసుకుని, యింటికివచ్చి అపరాత్రివేళ పక్కమీద వాలితే, నిద్ర ఒకంతకి పట్టదు. పట్టినతరవాత ఒకంతకి మెలకువ రాదు. మెలకువ వచ్చినా, పొద్దున్నే పక్కమీదనుంచి లేవబుద్ధి వేయదు. ఫ్యాక్టరీకి వెళ్ళాలంటే మైళ్ళకుమైళ్ళు నడవాలి. ఎదురుగా పొలాలలోకి వెళ్ళి కాలకృత్యాలు తీర్చుకొని, వొంటిమీద చెంబుడునీళ్ళు పోసుకునేసరికి గంటసేపు పడుతుంది. రాత్రి దాచుకున్న అట్టుముక్క నోట్లో కుక్కుకుని అదుతూబుడుతూ యిన్నినీళ్ళు గొంతుకలో పోసుకుని, ఫ్యాక్టరీకి చేరుకునేసరికి ఆరుగంట లవుతుంది. అప్పుడే అక్కడ గేటుముందు నాదిర్‌ఖాన్ చిత్రాపట్టుకుని ఎవరు లేటుగావచ్చారో పేర్లు రాసుకుంటాడు. నెలయ్యేసరికి ఫోర్‌మెన్‌దగ్గరికి చిత్రగుప్తుడిచిత్తా హాజరు.

సాయంకాలం ఆరు గంటలకు ఫ్యాక్టరీ జివిల్ వేస్తుంది. కాళ్ళీడ్చుకుంటూ కూలీలు ఎగిరి గుడిసెలకి నాళ్ళు చేరుకుంటారు. రోజుకీ ఎనిమిది

గంటలు నిద్రపోవాలంటే ఎనిమిదిగంటలకల్లా చాపలమీద ముసుగు తన్ని పెట్టటమే శరణ్యం. కాని తిండీ,తిప్పలూ అయేసరికి తొమ్మిదీ,పదీ అవుతోంది. పక్క మీద వాలడమే తరువాయి, కూలీల కిట్టే నిద్ర పట్టేస్తుంది. కాని అంత దబ్బునే నిద్రపోవడం మునూకు ఇష్టంలేదు. రతన్ పరిచయమైనప్పట్నుంచీ నగరం, వింతలు, సారాదుకాణం అతనికి ఆకర్షణ కలిగిస్తున్నాయి. అటు ఇటూ తిరిగివచ్చేసరికి పన్నెండు గంటలు దాటుతోంది. పన్నెండు దాటేకే కంటిమీద కునుకు !

కూలీలమధ్య తిరుగుతూ, మంచీ చెడ్డా మాటలాడుకుంటూ, కష్ట సుఖాలు చెప్పుకుంటూ కాలక్షేపం చేస్తూవుంటే మనసుకు సంతృప్తి. వాళ్ళందరిలాగే తానూ పెద్దవాడినయిపోయాననే భావం అతనికి కలిగింది. మరో రెండు మూడేళ్లు పోతే తానొక తగు మనిషికింద జమ.

సెలవువచ్చిందీ ఆవేళ కూలీలకుపండుగే. అందరితోపాటే మునూకూడా పట్నంలో వింతలు చూడ్డానికి వెళతాడు. నగరంలో కనిపించే షాపులూ, షాపులలోని నల్లని బూట్లూ, రబ్బరుబొమ్మలూ, వింతవింత వస్తుసముదాయాన్ని చూసి, వాటిని కొనుక్కోవాలనే కోరిక తీరనివ్యథగా గుండెలలో బాధ పెడుతూవుంటే, దిగులుచూపులతో మునూ బొంబాయినగర బజారులలో నడుస్తాడు. ప్రతి శనివారం రతన్ వెంట పట్నంవెళ్ళిన మునూకీ ఆవేదన తప్పదు.

వారాలు గడుస్తున్నాయి. సెలవలు వస్తున్నాయి. పోతున్నాయి. ఒక శనివారంనాడు రతన్ వెంట మునూ నగరంలోకి బయలుదేరాడు. రోడ్డు దుమ్మురేపుతోంది. కూలీల కాళ్ళరాపిడికి ఎర్రనిదుమ్ము గాలికి ఎగురుతున్నది. రోడ్డుపక్క తోళ్ళగోదాములలోంచి చచ్చినశవాల కంపు పేగుల్ని తోడివేస్తోంది. ఖాళీజాగాల్లో మురికిచెత్తలమీద చచ్చిన కుక్కలు నోళ్ళు వెళ్ళబెట్టుకొని, పళ్ళుగిట్టకరుచుకుపడివున్న పిల్లులు, వాటిమీదవాలే గద్దలూ చూపరులకు బ్రతుకే వొక స్మశానంవలె స్ఫురియింపచేస్తున్నవి. దారి కిరు వైపులా అక్కడక్కడ చింతచెట్లమీద కొంగలు సవ్వడిచేస్తున్నాయి. మరికొంతదూరం నడిచేసరికి పచ్చని పూలతోటలమధ్య చక్కనిగేట్లతో తెల్లని బంగాళాలు, చూపులకు దిగ్భ్రమ కలిగిస్తున్నాయి. పూలతలు తలలుఊపుతూ ఎర్ర ఎర్రని కాంతులతో భవనాలముందు వున్న పందెళ్ళపై అల్లుకున్నాయి. బయ్ బయ్ మనే ధ్వనులతో దుమ్మురేపుతూ కారులు జర్రు జర్రున పోతు

న్నాయి. కొన్ని కారులు చడీచప్పుడులేకుండా మనుషులు ఏమవుతారనే ఆలోచనా, పాలోచనా లేకుండా దూసుకుపోతున్నాయి.

రోడ్డు మలుపుతిరిగి చటుక్కున ఆగి రతన్ నవ్వుతూ "ఈవేళ గొప్ప జెల్సా! తమాషా!" అన్నాడు. "చూపిం చయితే".

ఎదురుగ వున్న సారాదుకాణం కనిపించేసరికి రతన్ వదనం వికసించింది. "నీ కొద్దూ?" అంటూ సీసా ఖాళీచేసి రతన్ బీడీ ముట్టించాడు. మునూ చెయ్యిపట్టుకొని అబ్దుల్ రహ్మాన్ వీధిని దాటి, బెహండీబజారు దీపపు వెలుతురులోకి వచ్చాడు. గ్రేండ్‌రోడ్డుకు పోయే సందులోకి మళ్ళేడు.

మునూ కొంచెం జోగుతూ, ఉల్లాసంతో రతన్‌వెంట అడుగులు వేశాడు. సందు చాలా యిరుకు. బురద బురదగా వుంది. సందులో ఎక్కడా కొత్తకొంపలేదు. అన్నీ పాతబడిన యిళ్ళే. సందు మొగిని పూల దుకాణాలు వాసనలు విరజిమ్ముతున్నాయి. వాకిట్లో తెల్లతెల్లని, రంగు రంగుల అంచులతో చీరలు ధరించి ఆడవాళ్లు చూపులతో పలకరిస్తూ, నవ్వులతో కవ్విస్తూ నించున్నారు. గదిముందు పరుపుల కుర్చీలలో వయ్యారంగా కూచున్న స్త్రీలు, బొక్కనీలిమీద నిండుగని తమలపాకుల వంటి పెదవులతో, ఎర్రగా పండిన పెదవులమీద నవ్వులతో పలకరిస్తూ చిలిపికళ్ళతో నవ్వుతున్నారు. జుత్తుముడి విడిపికొట్టేవాళ్ళూ, జడకుచ్చులను భుజాలమీదుగా గెంతించేవాళ్లూ, దారమ్మటపోయే జనానికి గంగవెర్రు లెత్తిస్తున్నారు. తమలపాకుల యీనెలు తీసుకొంటూ, యీనెల్ని గోళ్లతోమీటుతూ, తాంబూలం నములుతూ, యువకులు అటు యిటు తచ్చాడు తున్నారు.

మునూ మొహంలో కొకసారి తొంగిమూసి రతన్ "బాగులేదురా అబ్బీ యీవీధి మజా? ఆడవాళ్ళు, అందమైన ఆడవాళ్ళు. ఇందులో నీకంటికి ఏపిల్ల నజరుగావుందీ?" తన ఆశ్చర్యాన్ని దాచుకుంటూ మునూ చిరునవ్వు నవ్వాడు. రతన్‌మాటలు మునూ హృదయంమీద పూలగుత్తులతో వొత్తాయి. ఏదో ఒకమత్తు ఆవరించినట్లయి, తీయని కలలోంచి నడిచి వెడుతున్నట్లనిపించి, అమాయకమైన అతనికనులు చిరునవ్వులు నవ్వాయి.

"రారా తమ్ముడూ! గులాబీపువ్వులాంటి పిల్ల. పియారీ జాన్! గులాబీజాం."

మానవునికి కలిగే సహజోద్రేకాలకు, తరుముకొస్తున్న కలలకు తట్టుకోలేని వయసు అతనిది. బలీయమైన వాంఛలు, యిన్నాళ్లూ ఏమిటో తెలియని

మనసుకే అగుపించని కోరికలు అతని మనసును ఉయ్యాలలూగిస్తున్నాయి. చిత్ర విచిత్రమైన చాపల్యాలు, ఆశలు రంగు రంగుల బొమ్మలుగా మనసులో మసక మసకగా కనిపిస్తున్నాయి. ఈప్సితాలు అలలు అలలుగా, కదలి తేలిపోయి, పాటలు పాడుతూ పరవశమెత్తిస్తున్నాయి. ఇది ప్రేమ. అనిర్వచనీయమైన, అగాధమైన ప్రేమ; ఒక గీతంగా, సంగీతంగా, భంగిమతో ఎదుట నృత్యం చేస్తున్నది. ఇది క్షణికమో, లేక శాశ్వతమో అతనికి తెలియదు. కాని, ఏకాంతంగా యిన్నాళ్లూ కుమిలి కుమిలి దుఃఖిస్తున్న అతని ఆత్మ పడుతున్న మూగవేదన! అయితే ఇదే ఆనందానికి, ఈ కామతృప్తిని తీర్చుకుందుకు హేయమైన వ్యభిచార వృత్తికి దిగజారిపోయి, ఎంతమంది యువకులు యీ వీధిలో ఒకరితో ఒకరు కుమ్ములాడుకుంటూ వుంటారో, పట్టెడు అన్నంకోసం, యింత కబళంకోసం, పరుల కామతృప్తిని తీర్చేందుకు పడతులు తమ మానాన్ని పణంగా ఒడ్డుతారో, యీ జూదం పాపం అతనికి తెలియదు. దేశంలో ప్రతి పట్నంలోనూ జరిగే పశువుల సంతను అతను చూశాడు. కాని రహస్యమైన వ్యాపారం సాగించే యిటువంటి సంతలను అతనింతవరకూ చూడలేదు. ఈ సంతలో మానవతులు పశువులకంటె నైచ్యంగా పరిగణింపబడుతున్న విషయం అతని ఊహకందలేదు. ఏమీ పనీపాటూ లేకుండా ఆడవాళ్లలా ఎందుకు వాకిట నించుని చూపులకోసలతో, దారమ్మటపోయే మనుషులతో బేరాలాడతారో అతని కవగాహన కాని విషయం.

రతన్ అతన్ని ఒక చీకటిగొందులోకి తీసుకువెళ్లాడు. గొందుముందున్న ఒక యింటివద్ద ఆగాడు. ముందొక పెరడు వుంది. పెరడుదాటి యిరుకైన సందులోకి మళ్ళి మేడమెట్లు ఎక్కాడు. మేడమెట్లుదాటి నాలుగడుగులు వేసేసరికి గది ఎదురయింది.

అలంకరించిన గది. పందిరిపట్టె మంచం, మంచంకింద పీకదాను, గోడలకు కృష్ణలీల బొమ్మలు, మధ్యన ఆంగ్లచక్రవర్తి ఏడవ ఎడ్వర్డుఫోటో రతన్‌ను పలుకరించాయి. మంచంపక్క టేబిలుమీద కాగితపు పూలగుత్తులు చిందరవందరగా పడివున్నాయి. సీలింగుమీదనుంచి పాదరసపుబుడ్లు వేళ్లాడుతున్నాయి. హనుమంతుడిఫోటో పక్క ఒక ఆడమనిషిబొమ్మ కొట్టవస్తున్నట్లు కనిపించింది. బహుశా, ఆఫోటోవే పిరోజారీజాన్‌ది కాబోలును. ఫోటోలోనిపిల్ల అందంగా జుత్తు విరియబోసుకొని రెండు చేతులతోనూ ఆగబెట్టుకుంటున్నది. నవనవలాడుతున్న పిల్ల, నాజూకు కనులతో మిసమిస

లాడుతున్న అమ్మాయి! ఆమె యిప్పుడు కిటికీచెంత కూచుని పూసలసంచు లోంచి బజారమ్మాట చూపులను సారిస్తోంది. ఫోటోలోవున్న యవ్వనం యిప్పుడామె దేహంలో కనిపించదు. పాలిపోయిన మొహంలో వాడలిపోయిన అందం ఎక్కడ కనిపిస్తోందో అని వయసును దాచుకుందుకు చేస్తున్న అలంకరణతో ఆమె దీనంగా కిటికీచెంత కూలబడింది. ఇమిటేషను సిల్కుచీర చాటున వాడిలిపోయిన యవ్వనం దాగుకొనివుంది. మెడలో సన్నని పూసల గొలుసు వేసుకొని జీవితంలో ఓడిపోయిన స్త్రీ కూచునివుంది. పహిల్మానును చూడగానే "రండి పహిల్మాన్‌గారూ! ఎన్నాళ్ళకెన్నాళ్ళకి! ఐవూ జాడా లేరే!" అంటూ ఎదురుగ వచ్చి పలకరించింది. "కళ్ళు కాయలు కాసుకుపోయాయి. ఎంత దయలేదండీ మీకు?" అంటూ ఆమె తనకు లేని ప్రేమను నటిస్తూ చేతులు తిప్పుతూ అభినయించింది. "నావమంటావా చెప్పు. తీరిక లేక చస్తూంటే! దీనికితోడు ఆ దొంగముండా కొడుకు ఫోర్‌మెన్‌గాడు నాజీతం కట్ చేసేశాడాయె!" "ఈ నెల కట్ చేయలేదనుకుంటాను." ఆమె చిరునవ్వు నవ్వింది. "నీ డబ్బు నీకు ముట్టదేమోనని జెదిరిపోకు!" అంటూ రతన్ మాటల్ని మరపించి, ఆమెను బుజ్జగించాడు. "చూడు ఈ కుర్రాడు! నవమన్మధుడు! నీకోసం వెతుక్కుంటూవచ్చాడు."

"ఏమిటి పహిల్మాన్జీ! నాతో సరసాలు!...అతను మీ అబ్బాయా?" "అబ్బెబ్బే! నాకు పోటీదారుడు! నిన్ను వలచివచ్చిన ప్రేమికుడు!" కోపంగా ఆమెమూతి ఓగించుకుంది. ఏమిటీ సరసం, పోనిద్దురూ, అన్నట్టు మోహం చిట్లించింది. ముక్కుపుడక తళుక్కుమని మెరిసింది. మెడలోని పూసలదండ చెదరి వక్షస్థలంమీద పడింది. పమిట విదిలించింది. గుప్పున సెంటువాసన గుబాళించింది. మునూకు మైకమెత్తింది. ఆమె ప్రేమాభినయము చూస్తూ అతను నిలబడి పోయాడు. "ఎప్పుడూ వెటకారాలే! వేళా లేదు, పాళా లేదు. ఎవరున్నా ఎకసక్కేలే!......కూచోండి పహిల్మాన్ గారూ!" "వేళాకోళా లాడడానికి నేనేం గంధోళీగాణ్ణను కున్నావా? సరేలే. ఇవాళనుంచీ నీ ఇంట్లో గందోళీగాడిలా ఆడుతూ పాడుతూ కూచుంటాను".

"అబ్బ! ఏంమాటలవి పోనిస్తురూ! తప్పుమాటలు. హాస్యానికూడా అనకూడని మాటలూ...షర్బత్తుబాగుంది; తాగుతారూ?...రెండు జావళీలు పాడనా?"

"ఇదిగో! నేనే తెచ్చాను షర్బత్! నువ్వో కాస్త తాగు." రతన్ తన చేంతవున్న సీసా ముందు పెట్టాడు. "మీరే తెచ్చారూ; ఇక్కడ లేదను కున్నారా? సరేలెండి. గ్లాసులైనా సప్లయిచేస్తానుపోనీ" ఆమె పందిరిపట్టి మంచంవద్ద నున్న అలమరాతీసింది. అలమరాలో పంచదారచిలకలు పేర్చి పెట్టి వున్నాయి. కింద గూడులోంచి గ్లాసులుతీసి పట్టుకొచ్చింది.

గ్లాసులు పట్టుకొచ్చి గది ద్వారంచెంత నించుని బైటకు తొంగిచూస్తూ "ఓ జానకీ! గులాబ్‌జాన్! ఓయ్ బీబీ!" అని అరిచింది.

"వాళ్ళందర్నీ పిలుస్తున్నావ్. డ్యాన్సుందా ఏమిటి?"

"ఏదో కాస్సేపూ."

"నీ డ్యాన్సుమండిరి! ఇలారావే! రావే వజ్రాలమూటా! నాపక్కన కూచోవే చిలక!"

ఆమె వయ్యారంగా ముసి ముసినవ్వులతో మురుస్తూ, వగలు కురిపిస్తూ అతని బుజాలమీద చేతులువేసి, తొడమీద కూచుంది. మునూ నరనరం ఉద్రేకంతో తెగిపోతున్నది. ఒక ఆడదీ మగవాడూ అంత చేరికగా, ఒకళ్ళ నొకళ్ళు రాసుకుంటూ కూచోడం అతనెన్నడూ చూడలేదు. వాళ్ల మామ దయారామ్, ఎప్పుడూ వేరే యింకోగదిలో పడుకునేవాడు. వాళ్లత్తయ్య మరొక గదిలో నిద్రపోయేది. ప్రభ, పార్వతీ ఇద్దరి మంచాలూ ఒకదాని పక్క యింకొకటివున్నా, పార్వతిని ప్రభ తాకుతుండగా ఎన్నడూ వాడి కంటపడలేదు. వాళ్ళదో ప్రపంచం. లక్ష్మీదింకోలోకం. ఇప్పుడు రతన్, ఆమె చేతులను పట్టుకుని, తన వొళ్లో కూచోబెట్టుకొని, ఆమె చుబుకాన్ని నిమురుతున్న ఈ దృశ్యం, మునూకు తాగుడుకన్న ఎక్కువ నిషా కలిగించింది. అతను ఆమెను ఎత్తి కుదేశాడు. కిచకిచమన్నాడు. పెద్దగా నవ్వాడు. మంచం మీదకు లంఘించాడు.

గదిలోనికి బూడేఖాన్ వచ్చాడు. కళ్ళు లోనికిపోయాయి. దవడలు లొత్తలు పడ్డాయి. గుంటలుపడ్డ కళ్ళతో రతన్‌నుచూస్తూ "సలాం పహిల్మాన్‌గారూ! చాలాకాలానికి వచ్చారు... మేజువాణీ పెట్టించనా?... ఏయ్... ఏయ్..." బూడేఖాన్ తారుపుగుల్ల ముందాకొడుకు, హార్మోనియం తీసుకొని వాయించడం ఆరంభించాడు. హార్మోనియం బర్రుమని పెద్దగా ఏడుస్తూ ప్రేమికులను హడలెత్తించింది. ఆమె మద్దెలతీసి దబ దబ

చేతులతో మొత్తుతోంది. "షరిపోయింది సంగీతం." అంటూ రతన్ నవ్వాడు. హార్మోనియంమోత, మద్దెలచప్పుడూ విని యిద్దరు ఆడపిల్లలు చరచర గదిలోకి వచ్చి నృత్యం చేస్తున్నారు. పియోరీ పదం పాడుతూ కళ్ళు ఎగరేస్తున్నది. మువ్వల చప్పుడు ఘల్ ఘల్ మంటూ చేతులూ, కాళ్ళూ తిప్పుతూ అభిన యిస్తున్నారు ఆడపిల్లలు. రతన్, ఉపలు ఊదుతూ అచ్ఛా అచ్ఛా అంటూ జేబులోంచి రూపాయితీసి రంగున విసరి పారవేశాడు. "హాఁ హాఁ! అదిగదీ! అవీ వరస! జాన్! నాముద్దులగుమ్మా!"

ఆమె పాట ఆపి, రతన్ భుజాలమీద చేతులు ఆనించి గడ్డంమోపి వెనకనుంచి చెవుల్లో "మీ ఆనందమే నా ఆనందం! రతన్, నారత్నం." అంటూ అతని క్రాపింగులోకి వేళ్ళను పోనిచ్చింది. వేళ్ళు తమాషాగా చొక్కా జేబులోకి వెళ్ళనిస్తూ ఆమె నవ్వింది. రతన్ మరొక రూపాయి తీసి యివ్వబోయాడు. ఆమె పుచ్చుకున్నది కాదు. ఆడపిల్లలు మళ్ళీ యింకొక జావిళీ అందుకున్నారు. భుజాలను కదుపుతూ, కళ్ళను తిప్పుతూ నాట్యం చేస్తున్నారు. అద్దంలో పడుతున్న నీడలను చూసి రతన్ "వారే వా! వహ్వా! సెహభాష్" అంటూ చప్పట్లు చరిచాడు. జావిళీ అయిపోయిన తర్వాత మరోరూపాయి తీసి రంగున గిరవాటేశాడు. నాట్యం జరుగుతున్నంత సేపూ, మునూ మంత్రముగ్ధునివలె కూచుండిపోయాడు. ఆమె అతన్ని త్వరగా పంపించివేయమని సౌజ్ఞ చేస్తూ "కుర్రాడు అలసిపోయినట్లున్నాడే!" అంది. "అవును మునూ. నీకు నిద్రొస్తున్నట్లుంది. ఇంటికి వెళ్ళిపో. తరవాత నే నొస్తాలే."

తనకిపుడు నిద్రేకావాలో, అన్నమే కావాలో ఏమీ తెలియలేదు మునూకి. ఏదోకావాలనే ఆకాంక్షతప్ప, అది యేమో అతనికే తెలిసిందికాదు.

వెంటనే లేచాడు. ఆమె అతని తల నిమిరింది. గడప దాటగానే మునూ కనులలో నీరుతిరిగింది. వీధిలోకి అడుగువేశాడు. దుఃఖం ముంచుకువచ్చింది. వెక్కి వెక్కి ఏడ్చాడు. ఆ మహదానందనిలయంనుంచి బయటపడి అతను అడుగులువేశాడు. వీధులు నిర్మానుష్యంగా వున్నాయి. షాపులన్నీ మూసివేశారు. దుకాణాలముందు అరుగులమీద కూలీలు నిద్రపో తున్నారు. ఉసురుసురుమంటున్నారు. మరికొందరు ఊసులాడుకుంటున్నారు. నగరంబయట చీకటిలో తెల్లని భవనాలు కనిపిస్తున్నాయి. తాటివనంలోంచి గుడ్లగూబఅరుపు భయంకరంగా వినిపిస్తోంది.

చీకటిలోనడిచి వెళుతుంటే యింతసేపూ తాను విన్న జావళీ, గజ్జెల చప్పుడు గుండెలలో సూదుమోగి బాధ పెట్టసాగాయి. అతని అవ్యక్త చైతన్యం క్రమ క్రమంగా విడి వడి, మాటున దాగివున్న అర్థం కాని కోరిక లను ఉసిగొల్పుతూ, దయ్యాలవలె పట్టుకుని పీడించ మొదలు పెట్టింది. "ఏమిటీ గుండెల్లో మంట? ఎందుకీవేళ యిలా వున్నాను?" ఈ ప్రశ్నకు సమాధానం దొరకలేదు. "హుం! ఎందుకో ఏమో," అనుకుని విసురుగా నిర్లక్ష్యంగా నడిచి వెళ్లిపోతున్నాడు. గబగబ అడుగులు వేశాడు. వెనక నుంచి యేదో ఒక భూతం జుత్తు విరియబోసుకొని, అట్టహాసంగా నవ్వుతూ, పళ్లికిలిస్తూ గోళ్లతో అతని కనుగుడ్లను ఊడబెరుకుతున్నట్టు భయపడ సాగేడు. ఇది భయంకరమైనస్వప్నం. స్వప్నమా? నిజమా? నిజం, నిజం దాచ వీలులేని నిజం. భూతం ఎదటకనిపించకుండా, కళ్ళు రెండూగట్టిగా మూసేసు కున్నాడు. కాలికి రాయి తగిలి కిందపడ్డాడు. ఒగురుస్తూ లేచి నించుని, ప్రాణం అరచేత్తో పట్టుకుని చీకటిలో త్వర త్వరగా నడుస్తున్నాడు. చీకటి చెదిరి పోయింది. గుండె కుదుటపడింది. ఎదురుగా గుడెసెలోంచి మిణుకు మిణుకు మంటూ దీపం వెలుగుతోంది. అమ్మయ్య, బతుకు జీవుడా! దీపపు వెలుతురు కనిపించింది. గుడిసె దాటలేక మిద్దెకు చేరుకునేసరికి గుండెధైర్యం చిక్కింది.

గదిలో ఆముదపు ప్రమిద గుడ్డివెలుతురును ప్రసరిస్తున్నది. దీపంముందు కూచుని లక్ష్మి చిరిగినపాతను కుట్టుకుంటూ, కళ్ళల్లో వత్తులుపెట్టుకు మునూ కోసం ఎదురుచూస్తోంది. గదిఅంతా నిశ్శబ్దం. ఎవరిమానానవారు నిద్రపో తున్నారు.

"ఇంతసేపై ఎక్కడికి వెళ్లావూ?"

లక్ష్మి మునూ ముఖంలోనికి తొంగిచూసింది. గోడవార చతికిలబడి లక్ష్మి చూపులతోనే పలకరించాడు మునూ. అతనికళ్ళల్లో నీరు తిరిగింది. తనతల నిమిరిన పయారీజాన్ కంటినీళ్ళలో మసిలింది. లక్ష్మిప్రశ్నకు సమా ధానమీయక వస్తున్న దుఃఖాన్ని ఆపుకుంటూ అతను తను పడుకునే చాప చెంతకు పోయాడు. చాపమీద మేను చేరవేసినవెంటనే మాగన్ను పట్టింది.

కొన్ని నిముషాలకు హఠాత్తుగా తెలివివచ్చింది. కళ్ళు తెరిచి చూసే సరికి, వెచ్చవెచ్చని చేతులతో లక్ష్మి అతనిబుగ్గలను నిమురుతున్నది. అతనిమీద కూచుని వేడి వేడి నిట్టూర్పులను వదులుతున్నది. కళ్ళు ధగధగ మెరుపులతో

బేడిసవంటి చూపులతో వేడుకొంటున్నవి. కళ్ళల్లో బాధ గోచరించింది. మూలుగులు వినిపించాయి. మునూ, తల ఆడించి కిందకు దించుకున్నాడు. ఆమె, అతని గడ్డాన్ని పట్టుకుని తల పైకెత్తింది. మెత్తని అతిసున్నితమైన చేతి స్పర్శ. అతని నుదుటుమీద పెదవులతో చుంబించింది. చిరుగాలిలాగ, దూరంగా పుంతలో వినిపించే ప్రతిధ్వనిలా ఆమె "అవును మునూ! అవును; మనం బాధలు పడ్డంకోసమే యీ లోకంలో పుట్టాం. మనం! మనబాధలు! ఇవి తక్క మనకింకో లోకంలేదు..." అతనిని తన రెండు చేతులా కౌగలించుకుని, అతని పక్కలో జేరబడి తన రొమ్ముకదుముకుంది.

ఆమె తనగుండెల కతన్ని అదుముకుంటూంటే శరీరం దగ్గరగా తీసుకొంటున్నకొద్దీ గుండెలలో ఏదో ఆందోళన, ఆదుర్దా కలగజొచ్చాయి. శరీరం పటుత్వంతప్పింది. రాత్రల్లా అదేఅవస్థ. తెల్లవారేవరకూ తన శరీరంమీద తనకే అధికారంలేదు. చనిపోయినపుడు యిలాగే యీ శరీరం పడిపోతుంది కాబోలును. కాని ఈ మరణం తాత్కాలికం.

కూలీలకు మరణం తాత్కాలికంకాదు. నిత్యమూ మరణమే. సెలవు రోజుల్లోపుట్టి పనివున్నరోజుల్లో నిత్యమూ మరణిస్తూనేవుంటారు. ఆ సెలవు పూట మానవులుగా బతికి, సెలవయిపోగానే మళ్ళీ మామూలు బాదరబందీలలో చిక్కుకుపోతారు. సోమవారం రావడం భయం. ఫ్యాక్టరీకూత కూస్తుంది. తిరిగి ఒకటేచాకిరీ. దీనికి అంతూ, పొంతూలేదు. ఎక్కడి నరం అక్కడ తెగిపోయి, యంత్రాలకుమల్లే ఫ్యాక్టరీకిపోయి యంత్రభూతపు కొలువుంలో పగలల్లా పడిగాపులు కాసి, రాత్రి యిళ్ళకు చేరుకుంటారు. విషణ్ణవదనాలతో, జోగిపోతూ, తూలిపోతూ, నడవలేక ఆపసోపాలుపడుతూ గూటికి చేరేసరికి సంతోషం ఎక్కడ! అంతా దుఃఖం! దుఃఖసాగరం!

అయితే కూలీ లెందుకింతవిషాదంగా వుంటారు? మునూకీ ప్రశ్న ఆశ్చర్యమే కలగచేసింది. కారణం అతను ఫ్యాక్టరీలో చేరి ఆట్టేకాలం కాలేదు. మనిషి రక్తాన్నింకా మిల్లు పొగగొట్టం ఆవిరిగా ఊదేయలేదు. అతనికింకా జవసత్త్వా లున్నాయి. కనక యీ ప్రశ్నకు సమాధానం దొరకలేదు. ఫ్యాక్టరీకి వెళ్ళిపోతున్న కూలీల నొకసారి పరికించాడు. వణకుతున్న, నీరసించిన, వాడిపోయిన వదనాలతో, తడబడుతున్న అడుగులతో కూలీలు. ఆకాశంవంక తేరిపారచూస్తూ, చూపులలో ఏ భావమూ కనిపించని కూలీలు. వీపుకు అంటుకుపోతున్న కడుపులతో అలమటిస్తున్న కూలీలు! ఒకరి నొకరు

చూసుకుంటున్నపుడు, ఒకరి కింకొకరు యెదుట పడినపుడు "రామ్, రామ్" అనుకుంటూ మూలుగుతూ, పలకరించుకుంటూ కూలీలు యిదంతా కర్మ కింద పరిగణిస్తూ కాలం నెట్టుకు వస్తున్నారు. అయితే లోకంలో వొక మనిషి యిన్ని కష్టాలకు లోనుకావడం కర్మ ఫలితమేనా ? పూర్వజన్మలో చేసిన పాపాలు యీ జన్మలో కట్టి కుడుపుతాయని ప్రభుదయా లొకసారి మునూకు చెప్పాడు. దౌలత్‌పూరులో ఆనాడు ప్రభుదయాల్‌ను పోలీసులు కటకటాల మధ్య బంధించారు. చేతికివచ్చినట్టు కిమ్చీలతో చావమొత్తారు. దెబ్బలకు తట్టుకోలేక అతనికి జ్వరం వచ్చింది. ఆ వచ్చిన జ్వరమే అతని ఆయుష్షును పోసుకుంది. దీనికంతా కారణం ప్రభుదయాలు వెనకటి జన్మలో చేసిన దుష్కృత్యాలేనా ? ఈ ప్రశ్న మునూను పట్టి వేధించజొచ్చింది. అతనివలె యిక్కడి కూలీలుకూడా కర్మ సిద్ధాంతాన్ని నమ్ముకుంటున్నారు కాబోలును. హరికూడా తనకు అలాగనే చెప్పాడు. కాని మంచిరోజులు రాకపోవులే అని నిట్టూర్చాడు. ఈ కర్మ, గిర్మ అనే మాటలు విన్నప్పుడల్లా రతన్‌మాత్రం పకపకా నవ్వేవాడు. జీవితాన్ని కులాసాగా తీసుకోవడం అతని కలవాటు. ఎక్కడకు పోయినా ఆ చలాకీ, ఆ ధీమా, అతనిహుందాతనం వేరు. అతని కతనే సాటి. మిగిలిన కూలీలు అణకువతో జీవితంలో కృంగిపోతూ దిగులుగా పడి వుంటారు.

కాని రతన్‌ను కలుసుకున్నప్పుడల్లా అదేమోకాని, మునూకుమాత్రం భయంవేసింది. ఎప్పుడో ఒకప్పుడు అతని కేదో ఆపద ఎదురౌతుందని మునూ భయపడుతూనే వున్నాడు. "అస్తమానూ అతను అదృష్టవంతుడనీ, కులాసాగా హాయిగా వుంటాడనీ అనుకోవడం ఎందుకు ? నా చిల్లంగికళ్ళు అతని మీద పడితే అతనికి శని దాపురిస్తుంద"ని మునూ తనఆలోచన మానున్నాడు.

మునూ భయపడ్డట్టుగానే వొకనాడు రతన్‌కి ఆపద ఎదురయింది నాటినుంచి అతని పెదవులపై చిరునవ్వు మటుమాయమైంది. విషాదచ్ఛాయలు అలముకున్నాయి.

రోజూ ఫోర్‌మన్ ఫ్యాక్టరీగేటుచెంత నిలబడడం, కూలీలు సలాములు చేస్తూ లోనికి వెళ్ళుతుంటే, ఎర్రనికళ్ళతో కూలీలను నానాబూతులుతిడుతూ పశువులను తోలినట్లు తోలడం ఫోర్‌మన్‌కు అలవాటు. అమ్మవారు గుడి ముందు నించున్న నేటపోతులవలె గజగజ వణకుతూ కూలీలు అతనితిట్లని భరిస్తారు. ఒక్కొక్కప్పుడు ఫోర్‌మన్ తిట్లతోపోనీక యిద్దరు ముగ్గురు

కూలీల్ని తంతాడు. ఇంట్లో తనభార్యచేత చీవాట్లూ చెప్పుదెబ్బలూ తిన్న రోజునో, దేశంలో ఏదో నగరంలో జాతీయవాదుల ఊరేగింపు జరిగిందని తాను పత్రికలో చదివిన రోజునో, దౌర్జన్యవాదులు విజృంభించారని, కమ్యూనిస్టులప్రచారం దేశంలో జరుగుతుందనో తెలిసిన రోజునో, ఫోర్‌మన్ ఆగ్రహావేశుడై కూలీలమీద చిందులు తొక్కుతాడు. బ్రిటిష్‌ప్రభుత్వానికి తాను భారతదేశంలో నమ్మకమైన బంటు. తానొక ఆంగ్లేయుడు. బ్రిటిష్ వాళ్ళకి వ్యతిరేకంగా భారతదేశంలో అలజడి ఎందుకు జరగాలి? అందుకే కోపంతో ఆనాడు ఫోర్‌మన్ చిందులుతొక్కి కూలీలను కాలితో తంతాడు.

రతన్ స్వభావంవేరు. అతనికి స్వాతంత్ర్యేచ్ఛ అమితం. ఒకరికి ఒదుగుతూ అడుగులకు మడుగు లొత్తడం అతని వ్యక్తిత్వానికి సరిపడదు. తన శక్తి తనకు తెలియడమేకాక, యూనియన్‌కున్న బలం ఎంతటిదో అతనికి తెలుసును. తన చేతిలో విద్య వుంది. పని వుంది. పనికి తగ్గ జీతం నెలయ్యేసరికల్లా ఎవరికోసం యిస్తారు యజమానులు? నెల దాటగానే జీతం యివ్వక వాయిదాలు వేశారా, లేదా ఏదో మిష పెట్టి జీతంలో కోతకోశారా, అతను యెంతమాత్రం సహించడు. ఆందోళన అతని ఊపిరి. అలజడి అతని జీవితం.

స్వాతంత్ర్య ప్రియుడైన రతన్‌పేరు చెబితే ఫోర్‌న్‌మకు అగ్గిలంమీద గుగ్గిలం.

ఒకనాడు రతన్ అలా నడిచి వెడుతూంటే ఫోర్‌మన్ ఎదురయాడు. రతన్ "సలాం సాహేబ్" అని పోబోతున్నాడు. వెళ్ళిపోతున్న రతన్‌ను ఫోర్‌మన్ "యిలా రా" అని పిలిచాడు. రతన్ నిర్లక్ష్యంగా "వస్తూన్నానని" ఫోర్‌మన్ దగ్గరకు వెళ్ళి నిలబడ్డాడు.

"నిన్ను పనిలోంచి తీసేశాం."

"ఏం తప్పు చేశానని?"

"తప్పూ గిప్పూ లేదు. మం దిక్కణ్ణుంచి వెళ్ళు."

రతన్ వొక్కసారి తలపైకెత్తి ఫోర్‌మన్‌వేక చూశాడు. స్వాతిశయంతో, గర్వంతో అతని మొహంలోకి గుచ్చిగుచ్చి చూశాడు. కళ్ళు ఎర్రబడ్డాయి. పళ్లు పటపట కొరికాడు. ఇన్నాళ్ళూ అణకువతో పడివున్న పీడిత ప్రజల క్రోధాన్ని వ్యక్తపరుస్తున్నట్లు నిలబడి చేతులుఎత్తి ఫోర్‌మన్‌ను ఒక్క చెంపపెట్టు పెడదామనుకున్నాడు. అతను చేయి ఎత్తేలోపునే ఫోర్

మన్, నాదిర్‌ఖాన్ నించున్నచోటుకువెళ్ళి మాటాడుతున్నాడు. వెన్నుచూపి వెళ్ళిపోతున్న మనిషిని కొట్టడం వస్తాదుల లక్షణంకాదు. ఎత్తిన కండలు తేరిన చేతని మెల్లగా దించుకోనే సరికి నరాలలో పారుతున్నరక్తం నీళ్ళుగామారి కళ్ళవెంట ప్రవహింపజొచ్చింది.

మున్నూ, అతన్ని ఓదారుస్తూ "నిన్ను పన్లోకి తీసుకోమని నేను వెళ్ళి బతిమాలివస్తాను."

"అక్కర్లేదు. వాణ్ణి బతిమాలడమా ? నా తడాఖా చూపిస్తాను."

రతన్ వెంటనే అఖిలభారత ట్రేడ్‌యూనియన్ కార్యాలయానికి వెళ్ళాడు. యూనియన్ ప్రెసిడెంటు లల్లా ఓంకార్‌నాథ్‌తో చెప్పి ఈ అన్యాయమేమిటో చూద్దామనుకున్నాడు. ఆఫీసుముందు వరండాలో ఒక గుమాస్తా కూచున్నాడు. "ప్రెసిడెంటుగారితో ఓసారి మాట్లాడాలండి".

" ఆయన బిజీగా వున్నారే ! "

అతన్ని లోనికి వెళ్ళకుండా గుమాస్తా కావలికుక్కలా కూచున్నాడు. రతన్ గుమాస్తా మొహాన అర్ధరూపాయి గిరవాటేశాడు. గుమాస్తా లోనికి పోయి, తిరిగి వచ్చి "తీరుబాటుగా లేదని చెప్పమన్నారు. నీ కంప్లైయింటేమిటో చెప్పు. నేను అప్లికేషన్ రాస్తాను ఓరూపాయి ఖర్చవుతుంది." రతన్‌కు పీక మొయ్యా కోపంవచ్చింది. గుమాస్తా పీక పట్టుకుని నులిపి పారేద్దా మనుకున్నాడు; కాని యిందుకు గుమాస్తానని లాభంలేదనుకొని సముదాయించుకున్నాడు. తనను పనిలోంచి తీసివేసిన సంగతీ, తన సర్వీసు, అన్ని వివరాలు రతన్ తెలియచేశాడు. గుమాస్తా రూపాయి తీసుకున్నాక వాటిని రాయ జొచ్చాడు.

రతన్‌ను పన్లోంచి తీసివేశారనే వార్త నలుగురికీ తెలిసింది.

ఒక్కొక్కరే వస్తూ పోతూ రతన్‌ను ఊరడిస్తున్నారు. సాను భూతిని అందచేస్తున్నారు. "ఇదంతా భగవదేచ్ఛ. మన చేతుల్లో ఏముంది? "

"హుఁ ! మంచివాళ్ళ కిది కాలంకాదు."

"అంతేలే. చెడ్డవాళ్ళ కిది కాలం."

జీవితంలోని అనేక బాధలు, కూలీల శక్తిని హరించివేశాయి. విషాద ఛాయలు వారిని ఆవరించాయి. ఏ ఆపదవచ్చినా, ఏ అన్యాయం జరిగినా తలవంచి భరించాలనే అణకువను బానిసత్వాన్ని ప్రసాదించాయి. మాలీమేక

వంటి కూలీలు, నమ్రతను కళ్ళల్లో దాచుకున్న కూలీలు, గోగులవలె పడివున్న కూలీలు, పసిపిల్లలవలె నోరూ యీ యాలేం కూలీలు !

కూలీలంతా ఎవరిళ్ళకువాళ్ళు వెళ్ళిపోయి సద్దు అణగేసరికి రాత్రి ఎనిమిదిన్నరయింది. మరో పావుగంట గడిచాక ఎవరో ముగ్గురు వ్యక్తులు రతన్‌ను చూడ్డానికివచ్చారు. ఎవరో కాదు, వారు కూలీలకు చిరపరిచితులే. మిల్లు మైదానంలో ఏవేవో ఉపన్యాసాలిచ్చే సౌదా, ముజఫర్, స్టాన్లీజాక్సన్‌లను కూలీలు ఎరుగుదురు.

"నిన్ను పనిలోంచి తొలిగించారటగా, రతన్ !"

"అవునండి !"

"కారణం ?" స్టాన్లీ జాక్సన్ వచ్చీరాని హిందూస్థానీలో ప్రశ్నించాడు.

"నాకేం తెలియదండి !"

"మరి, ఫోర్‌మన్ నీకు చెప్పలేదూ ?"

"ఏమీ చెప్పలేదండి. ఆయనకి నా మీద చాలాకాలంనుంచీ గుర్రుగా వుందండి. ఎప్పుడు ఊడబెరికేద్దామని చూస్తున్నాడు...సరే...దానికేంగాని ...లల్లా ఓంకార్‌నాథ్ మా యూనియన్ ప్రెసిడెంటేగదంటి...ఆయన నా సంగతే పట్టించుకోలేదండి."

"అలా అయితే మరి మాతో ఎందుకు చెప్పలేదూ ?" ముజఫర్ ఆప్యాయంగా అడిగాడు.

"విచారించకు. మాతో కలసి తిరుగుతున్నావని అతను నీ మీద కత్తి కట్టాడు. చూద్దాంలే దాని అంతేదో !"

"మీ దగ్గరకొద్దామనే అనుకున్నానండి. వచ్చేనా, మీ సావాసం చేస్తున్నానని అందరికీ టాంటాం అయిపోతుందండి. ఇక నా కెక్కడా పని దొరకదండి."

ఈ సంభాషణంతా వింటూ ఒకమూల కూర్చునివున్న మునూకు రెడ్‌ఫ్లాగ్ యూనియన్ నాయకుల ఆగమనం ఆనందమనిపించింది. తనుకూడా ఏదో మాట్లాడాలనే ఆసక్తికొద్దీ "అయితే ఫోర్‌మెన్‌దగ్గరకే వెడితేసరి" అన్నాడు.

"అలా వెళ్ళడమనే ప్రశ్నే లేదు" చేతుల్ని పైకెత్తిసుకుంటూ సౌదా "చాలదూ యీ అవమానం ? మీ దరిద్రానికీ, ఆకలికీ ఎవరు కారణం ?

మిమ్మల్ని చెమట కక్కేటట్టు పనిచేయించి, మీ జీవితాల్ని దుర్భరంచేసి ......"

"అవును. అక్షరాలా నిజం! మీ రన్నమాట ముమ్మాటికీ నిజం" అంటూ హరి ముందుకు జరిగాడు.

"ఎవరూ చెప్పనక్కర్లేదు. మీ జీవితమే మీకు చెబుతున్న సత్యం యిది! మీ రుండే యీకొంప, మీ అందరికీ సరిపోతుందీ? ఈ పూరి గుడిసెలలో పాడుపడినకొంపల్లో మీరు ఎలకల్లా మాడి చచ్చిపోవల్సిందేనా? దీని కేమీ తరుణోపాయం లేదూ? తోటలూ, పిల్లలకు చదువూ సంధ్యా లేకపోతేపోయె! ఉండడానికి యిల్లయినా వుండద్దా? ఇక్కడే యిలాగే రోజుకు పదకొండుగంటలూ పనిచేసి పనిచేసి కొన్నేళ్ళకు మరణిస్తారు. మీ పిల్లలు ఒక అణా డబ్బులికి రెక్కలు ముక్కలు చేసుకు పనిచేస్తే బతుకులో ఎదుగూ బొదుగూ లేమకదా! మీ కష్టసుఖాలు మీరే ఆలోచించుకోవాలి. ఈ నిద్రలోంచి లేవండి! మేమూ మానవమాత్రులమేనని చాటండి."

ముజఫర్ నెమ్మదిగా అన్నాడు: "సౌదా చెబుతున్నమాటలు బహుశా పౌరుషంగావున్నాయికాబోలును! కూలీల దుర్భర జీవిత పరిస్థితులు చూస్తే ఆయన ఆవేశపరుడౌతాడు. ఆయనా మీలాగే బాధలు పడ్డాడు. ఈ బాధలన్నీ లోకంలో లేకుండా తొలగిపోవాలని ఆయన ఆరాటం".

జాక్సన్ "ఆయన మీ పిల్లలకి చదువు సంధ్యలు చెబుతాడు."

"చదువుమాటకేం! ముందు వాళ్ళ కింత కూడు కావాలి. మీరు పగలల్లా మగ్గాలమీద బట్టలు నేస్తున్నారు. బేళ్ళకొద్దీ బట్టలు ఫ్యాక్టరీలో తయారవుతున్నాయి. పొలాల్లో మీ సోదరులు పత్తి పండిస్తున్నారు. తోటి కూలీలు రోడ్లను వేస్తున్నారు. తోటల్లోనూ, దొడ్లల్లోనూ, గనుల్లోనూ వేలాది లక్షలాది కూలీలు కష్టపడుతున్నారు. మీరు పండిస్తున్న పంటలు మీవి కావు. తయారు చేస్తున్న వస్తువులు మీవి కావు. ఎవరో ఒకడు యివన్నీ నావని పట్టుకుపోతున్నాడు. ఇంతపండిస్తే, ఇంతశ్రమపడితే యిచ్చేకూలి కడుపుకే చాలదు. తిండీ, తిప్పలూ లేవు. ఇల్లూ వాకిలీ లేదు. కడుపునిండా కూడులేదు. పట్నాలలో మిల్లుల్లో పనిచేసినన్నాళ్ళూ చేసి, శరీరం వాడిలిపోయాక, జవసత్వా లుడిగిపోయాక తిరిగి మీ పల్లెలకు మీరు పోతారు. అక్కడ మీ కోసం మరణం కనిపెట్టుకు కూచుంటుంది. కరువు కాటకాలు, రోగాలు పల్లెల్ని చుట్టబెడతాయి. ఇలాగ నరకకూపంలో మిమ్మల్ని తోయడానికి

యజమానికున్న హక్కేమిటి? ఈ సంగతి మీ రెప్పుడైనా ఆలోచించారా?" అని సౌదా ప్రశ్నించాడు. "ఊహుం లేదు" రతన్ సమాధానమిచ్చాడు. "పోనీ, యజమానులు మిమ్మల్ని మానవమాత్రులుగా జమకడుతున్నారా?"

"అదీ లేదు."

"లేకపోతే మాత్రం, మేం ఏం చేయగలం బాబూ!" అన్నాడొకకూలీ.

"ఏమైనా చేయగలరు."

"మీరంటే చదువుకున్న బాబులు! మేం ఏ మాటాడితే చెల్లుతుంది?"

"మీరూ మానవులే!"

"అవును. నేను మానవుణ్ణి" అంటూ రతన్ గుండెలమీద చేయివేసి చెప్పాడు. మునూ "అందుకే నిన్ను పన్లోంచి తీసేశారు. వస్తాదుని కదాని డాబుచేశావు." మునూ అమాయకపుమాటల కంతా వొక్కసారి నవ్వారు. కొంతసేపు నిశ్శబ్దం. భుజాలొకసారిని నిమురుకుంటూ, గొంతుక సవరించుకుని హరి అన్నాడు: "మేం ఎవరిదగ్గరో ఒకరిదగ్గర కొలువుచేస్తూ పడివుండవలసిన వాళ్ళమేకదా, బాబూ! ఇవాళ ఫోర్ మన్; రేపింకోరు!"

"కొలువంటూ ఎవరూ చేయనక్కర్లేదు. పనిమాత్రం చేయాలి. అంతే" అని సమాధానమిచ్చాడు సౌదా. "పనిచేయడం ఎప్పుడూ మంచిదే. కాని మీరుచేసే పనికీ, తెచ్చే కూలికీ ఎక్కడా సంబంధంలేదు. పదకొండుగంటల పనికి అంతేనా కూలి? రోజుకి యిన్నిగంటలు పని చేయడానికి మీరు మనుషులా, రాక్షసులా?"

"చేయక తప్పుతుందా, బాబూ?"

"తప్పుతుంది. అంతా ఒకమాటమీదుంటే అన్నీ తప్పుతాయి."

"ఏం చేయమంటారు?"

"మిల్లులో పనిచేయడం మానేయండి. వాళ్లని పుట్టించిన దేవుడు దిగొస్తాడు."

"పని మానేసి?"

"రోజుకు ఎనిమిదిగంటల పని. పనికితగ్గ జీతం. జీతం హెచ్చించేవరకూ, మీపిల్లలకు బదులు పెట్టించేవరకూ పన్లోకి వెళ్ళకండి!"

"సమ్మెచేస్తే మీ కోరికలన్నీ నెరవేరుతాయి."

“ చేస్తాం ” రతన్ తనదృఢనిశ్చయాన్ని వెలిబుచ్చాడు. మిగిలిన కూలీలు ఏమీ మాట్లాడలేదు. నిజమే, రోజుకీ పదకొండుగంటలు పని చేయించి, చాలీచాలని జీతాలతో కొంపాగోడీ లేకుండా చేసి, యజమానులు తమ నెత్తురును జలగలవలె పీలుస్తున్నమాట, నిజమే! కాని పనిమానేస్తే ఇపుడువచ్చే యీనాలుగురాళ్లూ కంటికికనపడవు. ఈచాలీచాలని మెతుకులూ దొరకవు. అన్నానికి మొహంవాచాలి. గంజినీళ్లకే కరువు. రానున్న యీ కష్టాలను ఊహించుకుని కూలీలు తలలు వంచుకుని నేలకేసి చూస్తూ మౌనంగా కూచున్నారు.

“నిదానంగా ఆలోచించండి. ఈ పరిస్థితులకు ఎవరు కారణమో తెలుసుకోండి” ముజఫర్ రతన్‌కేసి తిరిగి“రతన్! రేపొకసారి కనిపిస్తావుకదూ! నిన్నెందుకు తీసేశారో కనుక్కుందాం”

“దణ్ణాలండి. దణ్ణాలు” అంటూ కూలీలు, వెళ్లిపోతున్న ఆ ముగ్గురు నాయకులను కొంతదూరం సాగనంపారు. మునూ ఈ సంభాషణ విన్న తరవాత ఆనందోద్రేకాలను పట్టలేకపోయాడు.

రతన్‌ను ఎందుకు పనిలోంచి యజమానులు తొలగించారో కూలీ లెవరికీ అర్థంకాలేదు. ఆవిషయం కనుక్కోవాలని, తిరిగి అతన్ని పనిలోకి తీసుకోవాలని ముజఫర్ ప్రభృతులు పట్టుబట్టినమీదట, అఖిలభారత ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ అధ్యక్షుడు, రతన్ విషయం ఆలోచించక తప్పిందికాదు. రతన్‌ను తిరిగి పనిలోకి తీసుకోవాలని కోరుతూ దరఖాస్తువ్రాసి మేనేజరు మిస్టర్ లిటిల్‌కు పంపారు. ఆమర్నాడు అన్ని ఉత్తరాలతోపాటు రతన్ దరఖాస్తు మేనేజరు టేబిల్‌మీద వుంది. ఇంగ్లండునుంచి ఖరీదుచేయవలసిన యంత్రాల వివరాలను తెలిపే వుత్తరాలు, బేళ్ళ, పత్తిధరలను వివరించే లేఖలు మేనేజరు టేబిల్‌మీద పడివున్నాయి. పిల్లవాడు మిఠాయిచూసి ఎగిరి గంతువేసినట్లు, మేనేజరు మిస్టర్ లిటిల్ తనబల్లమీద పడివున్న టపానుచూసి పరుగుపరుగున వచ్చాడు. వచ్చాడుకాని ముందు యేఉత్తరాలు తీయాలో బోధపడిందికాదు. ‘డియర్ సార్’ అని పలుకరిస్తున్న, ఆనర్డుసర్ అని గౌరవం ప్రదర్శిస్తున్న, ‘అభివందనాలతో నిరీక్షిస్తున్న’ ‘పంపించవలసిన నూరుబేళ్ళ ప్రత్తియునూ’ అని వివరిస్తున్న ఉత్తరాలలో ముందు దేనిని చదవాలో తికతికమకలుగానే వుంది. అసలే మిస్టర్ లిటిల్‌కు శాంతస్వభావం తక్కువ. బొంబాయి నేడితగులుతున్నా వంటికిపట్టిన నజ్జు

వదలిందికాదు. మీద తిరుగుతున్న ఫేన్‌వంకచూసి, కుర్చీ జర్రున లాగి, పేపర్లు తీసి గొంతుక సవరించుకున్నాడు. ఒక్క గుక్కెడు విస్కీ తాగితే మజాగా వుంటుందనుకున్నాడు. కాని దీని దుంపతెగినపని ఒకళ్ళకి తల అమ్ముకున్నాక తప్ప దీ దురవస్థ. టేబిల్‌ముందు కొకసారి వంగి ఉత్తరాలను ఎంచుతున్నాడు. మొట్టమొదట సర్ రెజినాల్డ్సు ఆర్డర్లేమిటో చూద్దాం అను కుని "హేయ్" అని పిలిచాడు. ఆ 'హేయ్'కి అర్థం గుమాస్తా అని. తెల్లనిసూటు తొడుక్కునివున్న గుమాస్తా పరుగెత్తుకొచ్చాడు. భారతీయుడు, తెల్లదొర పిలిచేసరికి గజగజలాడిపోతూ ఎదుట నించున్నాడు. "నించోడం ఎందుకు ? కూచో."

"అలాగేసార్! అలాగే!" గుమాస్తా పెదవులు కంపించిపో తున్నాయి.

"సరే! ఈ వుత్తరం చెబుతాను, రాసుకో!" ఏదో కొంప మునిగి పోతున్నట్లు నేరస్థునిలా కుర్చీలో చతికిలబడి గుమాస్తా దిక్కులుచూస్తున్నాడు. దిక్కులు చూడకనే మేనేజరు గద్దింపుకు గుమాస్తా నిలువునా నీరయి పోయాడు. గుండెలు దడదడలాడాయి. బిగ్గరగా కళ్ళెర్రచేస్తూ "దిక్కులు చూడ్డానికిదేమైనా సంతనుకున్నావా?" గుమాస్తా యింకా కంగారుపడు తున్నాడు. "రాయి, హుఁ!" గుమాస్తా పెన్సిలుతీశాడు. మేనేజరు చెప్పుకు పోతున్నాడు : "మీద నోటీస్ అని రాయి. స్పెల్లింగ్ తెలుసునా?"

"ఆఁ ఆఁ!"

## నోటీసు

నోటీసు అనేసరికి మేనేజరు మీసాలమీదకు ఒక యీగ ఎగిరివచ్చి వాలింది. ఈగను తోలుకుందుకు చేయివిసిరేడు. మళ్లీ ఈగవచ్చి వాలింది. నోటి కడ్డంపడింది. "ఒరే లల్కా!"

"హుజూర్ హుజూ"రంటూ ఒక పార్కీ కుర్రవాడు త్వరత్వరగా వచ్చాడు. "ఈ ఫ్లైకిల్లర్‌ని తీసుకుని ఈగల్ని తోలరా! రూములో ఒక్క పురుగు వుండకూడదు!"

"అంతే సర్! అంతే హుజూర్" బెత్తం తీసుకుని అటూ ఇటూ కుర్ర వాడు ఊపాడు. "రాయవయ్యా" గుమాస్తా పెన్సిలుతీసికొని కాగితం మీద పెట్టాడు. మేనేజరు చెబుతున్నాడు :

"ప్రస్తుత వర్తక ద్రవ్యసంక్షోభమువలన, అనివార్యమైన పరిస్థితు లలో..." మేనేజరు కన్నుమూసుకుని కనుబొమలను పీక్కుంటూ కాస్సేపు ఆగాడు. దగ్గాగా, మళ్ళీ "...ఫ్యాక్టరీ ఖర్చులను తగ్గించవలసి వచ్చినందున... మిల్లు కొన్ని రోజులు తెరవబడదు...బడదు... ప్రతి నెల ఆఖరివారము ఎవ రికీ పనివుండదు...వుండదు. కనక ఆవారము ఎవరికినీ కూలి చెల్లింపబడదు... బడదు కాని... మేనేజిమెంటువారు కూలీల స్థితిని దృష్టియందిడుకొని కొంత ధనసహాయము చేయుదురు...ఈ మార్పులు పదియవ తేదీనుండి అమలులోనికి వచ్చునని బోర్డాఫ్ డైరెక్టర్లు నేడు ప్రకటించుచున్నారు. ఇట్లు: సర్. రెజినాల్డు వైట్, బార్-ఎట్-లా, సర్ జార్జివైటు మిల్సు అధ్యక్షుడు."

గుమాస్తా తను చెప్పింది సరిగ్గా రాశాడో లేదోనని ఒక్కమారు చదవమని ఆజ్ఞాపించేసరికి ఈగవచ్చి మేనేజరు నుదుటను వాలింది. లల్లూకా వంక కోపంగా చూశాడు. లల్లూకా స్కైక్లిలర్‌తో మేనేజరు నుదురును తాకాడు. మేనేజరు వొళ్లు మండుకొచ్చింది. "గాడిద వెధవా!" మేనేజరు గబుక్కున లేచి కుడిచేత్తో తన నుదురును రుద్దుకుంటూ నిల బడ్డాడు. నౌకరును ఒక్కతాపు తందామనుకున్నాడు. కాని యింతలోనే టెలిఫోన్ మ్రోగింది. రిసీవర్ పట్టుకుని "హల్లో హల్లో"మని మొర పెట్టాడు మేనేజరు.

"ఆఁ ఆఁ! సర్ జార్జి వైట్ మిల్సు"నుదురు తడుముకుంటూ మేనేజరు "అఫ్‌కోర్సు...—అఫ్‌కోర్సు... సర్. రెజీనాల్డు...గుడ్‌మార్నింగు...సర్ రెజినాల్డు గుడ్‌మార్నింగ్...యస్సెస్...నాట్‌టూబేడ్...ఆఁ, ఆఁ మీకు తెలుసుగా! అవునవును. ఆర్డర్లు వస్తున్నాయి. వెంటనే మరొస్తారుకదూ! సరే...సరే...గుడ్‌మార్నింగ్" రిసీవర్ కిందపెట్టి, మేనేజరు "ఫోర్‌మన్‌ను పిలవరా గాడిదకొడకా!" కుర్రవాడు తుర్రున పరుగెత్తి యిట్టే మళ్లీ వచ్చే శాడు: "హుజూర్! సాహెబ్‌గా రొస్తున్నారు!"

"గుడ్‌మార్నింగ్" అంటూ జిమ్మీ లోనికి వచ్చాడు. మేనేజర్ "వచ్చేవారంనుంచీ కొత్త ఆర్డర్! నెలకీ మూడువారాలే! మిల్లుకి రోగం కుదురుతుంది వెధవలకి...ఒక్కగుక్కెడు విస్కీ...ఒక్కపిసరు...?"

"అదిగో అక్కడేవుంది...నువ్వు కాస్తతాగి నాకో కాస్త యియ్యి..." తాను ఓ గుక్కెడు పుచ్చుకుని సీసా అందిచ్చాడు. "దగ్గివచ్చాకనే, ఆర్డరు

పంపించు. ఈ లోపున కూలీలకు తెలియనీయకు! తొత్తుకొడుకులు... మహా డేంజరస్".

"వాళ్ళతలకాయి! తలపాగరు వదిల్చిపారేశాను...ఆ రతన్ లేడూ... వాడు ఆ వస్తాదు...కమ్యూనిస్టుల మద్దతుందని నన్ను నువ్వంటే నువ్వని ఎదిరించాడు...తిక్క వొదిల్చేశాను..."

"ఏం చేశావ్?"

"బర్తరఫ్!...చేతిలో మంచిపనే వుంది వెధవకి...కాని కండకావరం జాస్తి"

"ఒహోహో! అదా సంగతి! వాణ్ణి మళ్ళీ పన్లోకి తీసుకోమని ట్రేడ్‌యూనియన్‌వాళ్లు అప్లికేషను పంపేరులే! వాడేనా వీడు? హోరి ముండా కొడుకులూ, ఈ ట్రేడ్‌యూనియన్ పీనుగులు, కూలీల కేమిటో నూరిపోస్తున్నట్లున్నారే? వీళ్ళని గవర్నమెంటు ఎలా ఊరుకుంటోందని?"

జిమ్మీ మీసాలు తిప్పుకుంటూ, "బాధలేదు. ఇపుడు వాళ్ళలోనే వాళ్ళకి చీలికలు. ఒక యూనియన్ రెండు ముక్కలయింది. ఇండియన్ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్సూ, రెడ్‌ఫ్లాగ్ యూనియన్."

ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్‌కు ఓంకార్‌నాథేనా ప్రెసిడెంటు?"

"అవునవును. ఆ రెడ్‌ఫ్లాగ్ యూనియన్‌ని జాక్సన్ లేవదీశాడు. వాడిది మాంఛెస్టరటా?

"జాక్సనో, జీక్సనో...ముండాకొడుకు లందర్నీ చెట్టుకొకడ్ని కట్టి పెట్టికాల్చి చంపక యింకా చూస్తోంది గవర్నమెంటు!".

మిస్టర్ లిటిల్ యింకా ఏమేమో మాట్లాడును కాని, యింతలోనే కారువచ్చి ఆగిన ధ్వని వినిపించింది. చరాచరా అతను బయటకు వెళ్ళిపోయాడు. విస్కీగ్లాసులను ప్రక్కన పెట్టేసి జిమ్మీ వరండాలోకి నడిచాడు.

కారు వచ్చి ఆఫీసుకుముందు ఆగేసరికి, నౌకరు తలుపుతీసి పక్కకు ఒత్తిగిల్లాడు. కారులోంచి వొకస్థూలకాయుడు, పొట్టిమనిషి కిందకు దిగి వరండాలోంచి ఎదురువస్తున్న జిమ్మీని పలుకరించాడు: "నోటీసు అంటించేరా? కూలీలకు చెప్పారుకదా జిమ్మీ?"

"ఇంకా లేదుసర్! చెబదామని వెడుతున్నాను" ఫోర్‌మెన్ జిమ్మీ ఆవరణలో నించుని, ఎండవేడికి తట్టుకోలేకపోతున్నాడు. తలమీద టోపీ కూడా లేని జిమ్మీని చూసి వెటకారంగా రెజినాల్డు: "నీ కోటోపీ కొని

పెట్టమని నీ భార్యకి రికమెండు చేయమంటావూ?" అన్నాడు. అక్కడికి కొంచెం దూరంలో నేవున్న బంగళాలోంచి, జిమ్మీభార్య, రెజినాల్డు తలవని తలంపుగా ఫ్యాక్టరీకి రావడం ఆశ్చర్యంతో చూస్తూ నిలబడింది. జిమ్మీ మొహం ఎర్రబడింది. బంగాళావంక తేరిపారచూసి భార్యను లోలోన తిట్టుకున్నాడు. "ఆఁ, అయితే లిటిల్ !" అంటూ రెజినాల్డు ఆఫీసు గదిలోకి అడుగులువేశాడు. లిటిల్‌వంక ఒకసారి పరిశీలనగా చూసి "ఇంగ్లండులో ఆర్థిక పరిస్థితులు తల్లక్రిందు లవుతున్నాయి. ఇక్కడే కాదు; కలకత్తా జూట్ మిల్సూ, మెడ్రాస్ మైన్సూ మూసివేయమని ఆర్డరు వేశాను. ఇంగ్లండునుంచి ఆర్డర్లెలా వస్తాయో చూద్దాం...చూశావా డబ్బుకెంత రొక్కటంగా వుందో?..."

"ఆడిటర్సు ఎక్కౌంట్లు తణిఖీ చేస్తున్నారు. రిజిస్టర్లేమీ యిక్కడ లేవు. మనకు ప్రమాదం లేదనుకుంటాను. గతమాసం ఆర్డర్లు బాగానే వచ్చాయి. కాని బయటు ఎదుర్కొంటున్న పోటీ వుందే... దీని తల్లికడుపు మాడిన పోటీ ?"

"ఆ సంగతేదో నేను చూసుకుంటాను. వైస్రాయ్‌ని కల్సుకోబో తున్నాను కదూ! పరిస్థితులన్నీ గవర్నమెంటుకు తెల్సునులే! లార్డుఉల్వార్ హాప్టన్ మహాగొప్పవాడు. ఆయన్ది పెద్ద బుర్ర. ఏం చేసినా పకడ్బందుగా చేస్తాడు. లండన్లో దిట్టమైనవాడే వున్నాడు. సింగపూర్ వ్యవహారాల్లో బ్రిటన్ గడుసుదనంగా వుండాలంటాను. మన షిప్పుల కేమీ డేమేజీ రాకుండా చూడాలి."

"వచ్చిన యిబ్బందీ..."

"అవు నవును, అదేలే! దిక్కుమాలిన యిండియన్లు రానురాను తెలుగుమీరుతున్నారు. సోషలిస్టు ఐడియాలు అరెరే... జాస్తీగా పెరిగి పోతున్నాయి యిక్కడ... గాంధీయిస్టులు... వాళ్ళమొహం యీడ్చా... ఒకవిధంగా వాళ్ళతో ఓతంటా..."

"అదే, అదే".

"స్టెఫెన్సన్ మిల్సు జమ్షెడ్జీ కొనేశాడు. తెలిసిందా నీకీ సంగతి? ఇక మనకి నూటికీ పాతికవంతులేవాటా. ఇంటియన్లకి డెభ్భై అయిదువంతులు. భాఖాభా...సరే...దీనికి ఓ కిటుకు వుందిలే..." రెజినాల్డు ప్రసంగం కట్టి పెట్టి తన వాచీ ఒకసారి చూచుకుని, "సరి సరే, నాకు టైంఅయిపోతోంది.

ఎకౌంట్సు పంపిస్తావు కదూ ?" అంటూ అతవలకు పరధ్యానంగా వెళ్ళి పోయాడు.

ఫ్యాక్టరీని నెలకు మూడువారాలే తెరిచి వుంచుతారనే ఆర్డరు కూలీలకు తెలిసి, బిలబిల్లాడుతూ షెడ్డులలోంచి ఇవతలకు వచ్చేస్తున్నారు. రెజినాల్డ్సు వెళ్ళిపోకుండా యింకా అక్కడే వున్నట్లయితే అతన్నే కూలీలు బతిమాలుకొని వుందురు. కాని అతను జర్రున తూరీగలాగ కారుమీద వెళ్ళిపోయాడు. చింటాం సాహేబ్ చుట్టూ కూలీలు గుమిగూడి అతన్ని అనేకవిధాల బతిమాలుకుంటున్నారు. దగ్గర కెవరొచ్చినా పరువు తక్కువని హెచ్చరిస్తూ దర్జాగా అతను నిలబడ్డాడు. కూలీలు ఫ్యాక్టరీని మూసివేయవద్దని అతనిని బతిమాలారు. ప్రార్థించారు. కళ్ళమ్మట నీరు పెట్టుకున్నారు. పాదాలకు మొక్కారు. కాని అతను ఏ మాత్రం చలించలేదు. చలించక తన బంగాళాకు వెళ్ళిపోయాడు. నాదిరీఖాన్ కూలీలగుంపును అవతలకి తగిలేశాడు.

ఫ్యాక్టరీ మూసివేస్తున్న కారణం రతన్ బర్తరఫేనని మునూ అభిప్రాయం చింటాం సాహేబ్ చెంతకుపోయి, రతన్‌కి తిరిగి పని యిప్పించమని ఎలాగో ఓలాగ బతిమాలుకుని నచ్చజెబుదామనుకున్నాడు. ఫ్యాక్టరీ గోడౌనువద్దనున్న కుళాయి దిమ్మఎక్కి చుట్టూకట్టివున్న తీగలదడి మీదనుంచి ఒక్కగెంతు గెంతి అవతలకు వెళ్ళాడు. అవతల చింటాం సాహేబ్ బంగాళా వుంది. బంగాళాముందువున్న వెదురు తడకలను దాటి లోపలకు వెళ్ళాడు. బంగాళాముం దొక చిన్న పూలతోట వుంది. తోటమధ్య రోడ్డు కిరువైపులా పూలపందిళ్ళు వాసనలను వెదజల్లుతున్నది. రోడ్డుమీదపడి మెల్లమెల్లగా బంగాళా వరండాలోనికి వెళ్ళాడు. వరండాలో కొంపదీసి చింటాం సాహేబ్ ఎదురుగా కనిపిస్తే ప్రాణాలు దక్కవని భయం పట్టుకుంది. గుండెలు కొట్టుకుంటున్నవి. వరండా మెట్లమీదనుంచి తొంగిచూచేసరికి ఎదురుగా ఒకావిడ ఎవరోమరి, ఎవరోకాదు, ఫోర్‌మన్ భార్య కాబోలును, కూర్చునివుంది. పడకకుర్చీలో చతికిలబడి జంపరుగుడ్డను వొళ్ళో పరుచుకుని లేసు అల్లుకుంటున్నది. కాళ్ళు పారజాపివున్నాయి. మొహం చిర్రు, బుర్రు లాడుతోంది. మనిషి పొట్టి. రాగివర్ణపుజుత్తు పొట్టిగా భుజాలమీద పడుతోంది. నెల్లీ థామస్ ఏమంత పొడగరికాదు. ఎదురుగ, ఆమె కనిపించేసరికి కొంతసేపు భయంతో మునూపక్కను దాక్కున్నాడు. ధైర్యం చిక్కబట్టుకొని, ఎదురుగా

వెళ్ళి ఆమెకు "సలాం! సలాం అమ్మగారూ!" అన్నాడు. "సలాం" అంటూ ఆమె నెమ్మదిగా గొణుగుకొని పక్కగదిలో విస్కీతాగుతున్న భర్తకేసిచూసి "వీరభోగ వసంతరాయుళ్ళాగ, ఎప్పుడూ గుక్కలకొద్దీ తాగడమేనా? ... మాడండి ... ఎవరో కూలివాడొచ్చాడు మీకోసం" అన్నది. భార్య ఎత్తిపొడుపుమాటలకు విసిగి విసిగి వున్నాడేమో, ఎవరో కూలీ వచ్చాడనేమాట వినగానే, గిర్రున తిరిగి ఎదురుగా నిలబడివున్న మునూమీదికి చేతిలోని విస్కీగ్లాసు విసిరివేశాడు. కూలీలు తన యింటికి ఎందుకు వస్తారు? పని తగ్గించినందుకు పగబట్టి తనను కత్తితో పొడిచి చంపడానికితప్ప! మిగిలిన కూలీలు అవతలవుండిపోయి, ఈ కుర్రవాడిని లోపలకు పంపించివుంటారని జిమ్మీథామస్ భయపడిపోయాడు. భయపడి చేతనున్న గ్లాసును మునూమీదకు విసిరికొట్టేసరికి నెల్లీథామస్ "పోలీస్! పోలీస్! మర్డర్! మర్డర్" అని కేకలుపెట్టింది.

దీనితో జిమ్మీథామస్ మరీ రెచ్చిపోయి పిడికిలి బిగించి కుర్చీలో కూచున్న తన భార్యపై పడబోయాడు. ఆమె చటుక్కునలేచి తప్పించుకుంది. థామస్ పిడికిలి కుర్చీ కర్రమీదపడి దెబ్బ తగిలింది. భార్యమీదకు కస్సునలేచాడు. ఆమె ట్రేను అడ్డం పెట్టుకుని అరవసాగింది. అతను తాగి తూగి కిందపడిపోయాడు. ఆమె అరుపులకు భయపడి మునూ ఎప్పుడు, ఎలా పారిపోయాడో పారిపోయాడు. కాని మిస్టర్ లిటిల్ మాత్రం కంగారుగా, థామస్ బంగాళాకు చక్కావచ్చాడు. భార్యాభర్తల కలహం చూసి "ఏమి టేమిటి? ఎందు కేమిటి?" అంటూ ప్రశ్నించాడు. నెల్లీ థామస్ కొంచెం సంబాళించుకొని, సమయస్ఫూర్తిగా జవాబిచ్చింది. "మాశారాండి! ఈ మనిషి కోపం! ఏం లేదండీ... నే నిలాగ యీ కుర్చీలో కూచుని అల్లుకుంటున్నాను. సరే, ఆయనికి రోజూ బాగా తాగి అల్లరి చేయడం మామూలే అనుకోండి. దానిమాటకేం... ఈలోగా ఎవరో కూలి కుర్రవాడు ఫ్యాక్టరీనుంచొచ్చి నిలబడ్డాడు... ఎవరోవచ్చారండీ మీకోసం అన్నాను... అంతకన్నా నేనేం అన్నాను చెప్పండి... ఆపళంగా తాగుతున్న గ్లాసు ఆ కుర్రాడి మీదకి గిరాటేశి, నామీద పడ్డారు. పీక నొక్కపోయారు. నయం తప్పించుకున్నాను కనక సరిపోయింది...లేకపోతే చచ్చిపోయేదాన్నే... నన్ను కొట్టబోయి ఆయనే బోర్లా పడ్డారు."

మిస్టర్ లిటిల్ కనుబొమలు మీదకు ఎత్తి నెల్లీకంక చూశాడు. ఆమె గణ గణ ఫిర్యాదు చేసుకుపోతున్నది. "విసిరిన గ్లాసు తగల్లేదు కనక సరి పోయింది కాని, పుర్రపెధవ చచ్చి ఊరుకున్ను. ఎందుకండీ కూలి వెధవల్ని అలా తంతారని నే నలా చెబుతూనే వుంటాను... కూలి ముండాకొడుకు లతో మన కెందుకు చెప్పండి; వాళ్ళేమన్నా మన సాటివాళ్ళు కనకనా?"

భార్యాభర్తల తగువు ఎలాతీర్చడమో మిస్టర్ లిటిల్‌కు బోధపడక, తికమకలు పడుతూ ప్రశ్నార్థకంగా మొహం పెట్టాడు. ఆమె, యిక భరించ లేనట్లుగా మొహంపెట్టి "ఇదేమిటి సర్, రోజూ యీయనతో నా కెందు కొచ్చిన తద్దినం? ఇక ఈ ముసిలి సాధింపులు నేను పళ్ళేనుస్మండీ! తెగ తెంపులు చేసేసుకుంటేనే కాని ప్రాణానికి సుఖంలేదు." ఆమె వయ్యారంగా గునుస్తూ ఏడవజొచ్చింది. మొహం ముడుచుకుంది. కళ్ళను చేతులతో కప్పుకుంది. వెక్కి వెక్కి ఏడ్చింది.

ఆనాటి మధ్యాహ్నం ఫ్యాక్టరీలోని కూలీలు బిలబిల్లాడుతూ మిల్లు వదలి బయటకు వచ్చేస్తున్నారు. ఫ్యాక్టరీ నెలకొకవారం మూసివేస్తారనే వార్తతో కూలీల తలపై పిడుగుపడ్డట్లయింది. కూలీలకున్న ఆస్తీ పాస్తీ ఒక్కటే. పనిచేసి ఆ చాలీచాలని జీతంతోనే ఎలాగో జీవితాన్ని నెట్టుకు వస్తున్నారు. పని తగ్గిస్తే వస్తోన్న ఈ కూలిడబ్బులూ రావు. పని తగ్గించడమంటే చూస్తూ చూస్తూ కూలీలను మాడ్చడమే. ఇలా మాడిపోవడం ఏ మనిషీ ఎప్పుడూ కోరడు. పనిచేసి కూలీలకు ఆ కాసిన్ని గంజినీళ్ళు తాగాలని వుంది.

పనిమీద వాళ్ళకెపుడూ విముఖతలేదు. పత్తిని బాగుచేసి, పేకులుతీసి, బట్టలు నేయడానికి వారెప్పుడూ సిద్ధమే. ఏదో ఒకవంకతో జీతాలను కోతకోస్తున్నా ఫోర్‌మన్ కమీషన్లు తీసుకుంటున్నా, అప్పులకు వడ్డీలకు వడ్డీలు పెరిగిపోతున్నా ఆ యిచ్చేజీతం నెలనెలకీ యిచ్చేస్తే చాలును. ఇంటి అద్దె చెల్లించడానికీ, బియ్యం తాలింపు సామానుకు సరిపోయే జీతం, పోనీ చాలీచాలని జీతం, అదైనా వస్తోందికదా అని కూలీల సంతృప్తి. పని తగ్గించ డంతో ఈ సంతృప్తికాస్తా ఎగిరి పోయింది.

తమకిక, ఆకస్మిక మరణం ముంచుకువస్తున్నదనే భీతి కూలీలను ఆవ రించింది. ఇంతకాలంగా బొందిలో కొట్టుమిట్టాడుతున్న, కదలిక కలిగిస్తున్న

ఆ కాస్త జీవశక్తి నశించి, కృంగిపోయింది. చప్పి దవడలతో, లోతుకుపోయిన కనులతో, అస్థిపంజరాలుగా చేసిన ఈ జీవితం ఎంత కఠోరమైనది !

ఫోర్‌మన్ బంగళానుంచి పారిపోయి వచ్చాక, మునూ రతన్‌ను కలుసుకున్నాడు.

"మళ్ళీ నీకు పని యిప్పించమని బతిమాల్దామనుకున్నాను".

"ఎవర్ని ?"

"ఫోర్‌మన్ సాహేబ్‌ని"

"బంగాళాకు వెళ్ళాను. వెళ్ళేసరికి కోపంతో ఎగిరిపడ్డాడు. నా మీద గ్లాసు విసిరి కొట్టాడు... నీమీద కోపంకొద్దీ ఫ్యాక్టరీ మూసేస్తానంటున్నాడు."

"నామీద కోపంకాదురా పిచ్చివాడా ! ఇదంతా పెద్దసాహేబ్ దురాశ. దురాశకొద్దీ మూసేస్తానంటున్నాడు."

"ఫ్యాక్టరీ మూసేస్తే వాళ్ళకే నష్టమేకదూ !"

"నష్టంకాదు లాభం...నీ కదంతా బోధపడాలంటే ఇవాళ మీటింగుకిరా. అంతా జాగ్రత్తగా విను."

"ఎక్కడ మీటింగు ?"

"ఇక్కడే ! అన్ని ఫ్యాక్టరీలవాళ్ళూ వస్తున్నారు. మన ట్రేడ్‌యూనియన్ సమ్మె నోటీసుయిస్తుంది".

"అయితే ఫోర్‌మన్‌నని లాభం లేదు."

"ఒకళ్ళనని లాభమేమిటి? మనపని మనం చేసుకుపోవాలి కాని!"

"ఫోర్‌మెన్ ఏమీ చేయలేదన్నమాట."

"వాడో గాడిద కొడుకు! అంతా వాడిమాయే ! ఉండుండు చూస్తూండు, వాడితల పగలకొడతాను ! వాణ్ణేకాదు. ఆపెద్ద దొరనికూడా! తొత్తుకొడుకు, మన జీతాలు కోతకోయడానికి వీడెవడురా ?"

అఖిల భారత ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు కార్యాలయం చేరువన వున్న మైదానంలో కూలీలు క్రమ క్రమంగా గుమిగూడుతున్నారు. మిల్లు పొగ ఆగిపోయింది. కూలీల ప్రవాహం సాగిపోతున్నది. ఎండ ఫెళ ఫెళ కాస్తున్నది. సభ ఎప్పుడు ప్రారంభింపబడుతుందా అని కూలీలు ఆతురతతో నిరీక్షిస్తున్నారు. కొందరు కూలీలు భయంతో గొణుగుతున్నారు. తరంగాలుగా కూలీలు ఒకరి నొకరు తోసుకుని కూర్చున్నవాళ్ళు సగంలేచి వేదికవంక చూస్తున్నారు. హరిసైతం యితరకూలీలవలె, కాళ్ళీడ్చుకుంటూ

సభకు హాజరయ్యాడు. గుంపులోనుంచి ఒక నినాదం బిగ్గరగా వినిపించింది. మిగిలిన కార్మికులు నినాదాన్నందుకున్నారు : "జీతాలకోతను రద్దుచేయాలనే" నినాదాలు దిక్కు-దిక్కులా ప్రతిధ్వనిస్తున్నాయి. గాలిలో పొయిలాగ తేలి పోతూ ఆకాశం దద్దరిల్లజేస్తున్న నినాదాలు : "యూనియన్‌జాక్ నశించాలి! ఎర్రజండా జిందాబాద్!" కోకిల గొంతెత్తి కూస్తున్నపుడు ఎంతో మధు రంగా వుంటుంది. వెయ్యికోకిలలు గొంతెత్తి నినదిస్తున్న సంగీతంవలె కూలీల గొంతు మారుమూలలకుసైతం వినిపింపసాగింది. దారిద్ర్యం, ఆకలీ, నికృష్టతా యివే కూలివాళ్ళ అన్నదమ్ములు. చీకటి గూభ్యాలలో, నరకకూపాలలో నివసించే కూలీల నినాదాలు! అశేష పీడితప్రజల హృదయాలను వ్యక్తపరచే నినాదాలు! కార్మికులు ఒక్కొక్కరే సభాస్థలికి చేరుకుంటున్నారు. యువకులు, ఎప్పుడూ యవ్వనం అంటే ఏమో ఎరుగని యువకులు, ముసలితనంతోనే పుట్టిన యువకులు వీధులవెంట నడుస్తున్నారు. దిసమొలలతో వున్న పిల్లలను నడిపించుకుంటూ గర్భిణీస్త్రీలు నడవలేక అవస్థపడుతున్నారు. మహాచికపు పొక్కుల మొహాలతో, సన్నబడిన కాళ్ళపై శరీరాన్ని నిలబెట్టినట్లు ఊగి పోతూ, కళ్ళమ్మట వెలువడుతున్న ఆవిరులతో కూలీలు యిటే వస్తున్నారు. కాని ఈవేళ కూలీల హృదయాలు ఉప్పొంగి పోతున్నాయి. నూత్న తేజస్సు కనులలో ప్రకాశిస్తున్నది. కుత కుత ఉడికిపోతున్న పేదల గుండెలకు ఉప శమనం కలిగినట్లు, సభాస్థలి నిండుకుంది. గొంతుఎత్తి నినదిస్తున్నపుడు తమ ఆత్మశక్తి తమ కిపుడు అవగతమైందనే విశ్వాసం పొడమింది. ఇన్నాళ్ళనుంచీ మనసులో పొంచి పొంచి వున్న దుఃఖం, అణగద్రొక్కుకుంటూ వచ్చిన క్రోధం, ఒక్కసారి మటుమాయమై నట్లనిపించింది. ఎర్రని కళ్ళతో కూలీలు ఒకరొన్నొకరు తోసుకుంటూ నడిచివస్తున్నారు.

గుండెలలో గుచ్చుకున్న ముల్లును ఊడబెరికి పైకి పారవేస్తున్నట్లు ఒక ముసలి కూలీ అన్నాడు : "ఇది కానికాలం! కాలం తిరగబడింది."

"నిజం, నిజం అన్నా! ఇంక మనం ఎలా బతగ్గలం?" అని ప్రశ్నిం చాడు యువకుడు.

"ఎలా బతగ్గలమా? మన జీతాలు తగ్గించకూడదని మనం దెబ్బలాడి" సమాధానమిచ్చాడు నవయువకుడు.

"దెబ్బలాట, దెబ్బలాట, కాకిపిల్ల కేంతెల్సు ఉండేల్ దెబ్బని! కుర్రాళ్ళ కేంతెల్సు ... చిన్నా పెద్దా అక్కర్లేదూ" అని గద్దించాడు

ముసలి కూలీ. "ఎందుకులేదు తాతా! రోజూ నీకు నేను దణ్ణంపెట్టడంలేదూ? కాని వాడికి ... మన జీతాలను కోతకోసే ఆ దొరకి, ... ఫ్యాక్టరీ మూసేసిన ఆ దొరకి నేను సలాం ఎలాపెట్టగలను తాతా? తానేమో కారుంటేనేకాని కదలడు. నేనేమో యీ రాళ్ళపై నడవాలి! ఫ్యాక్టరీ మూసేయడానికి వాడి కధికారం ?"

"అవున్నాయనా! అవునవును. దొరకి గర్వం హెచ్చు. ఆయనేం చేసినా మనం పడి ఊరుకోవాలి."

"ఎవరు పడతారు తాతా! చూడు. నిన్న నాపిల్లకి కాలు విరిగి పోయింది. డాక్టర్ మోకాలు తీసేయాలంటున్నాడు"

"కుక్కకి పడేసినట్టు యింతపడేస్తే మనం బానిసల్లా పడివుంటామని వాళ్ళ ఉద్దేశం. వాళ్లుమాత్రం పందుల్లా తిని తిరుగుతారు. మనం అంటే బానిసల మనేనా దొరల ఊహ?"

"మనం బానిసలం కాదు; భారతీయులం. ట్రేడ్‌యూనియన్ సభ్యులం".

"ట్రేడ్‌యూనియన్ ఏం చేస్తుందోయ్?"

రతన్ గుంపుమధ్య నిలబడి "ట్రేడ్‌యూనియన్ ప్రెసిడెంటు ఓంకార్ నాథ్ యిప్పుడు మనతో మాట్లాడతారు. తరవాత రెడ్‌ఫ్లాగ్ యూనియన్ నాయకులు ముజఫర్, జాక్సన్ సౌదాలు మాట్లాడుతారు" రతన్ మొహం నిండా నెత్తురు పేరుకుంది: "రండి రండి, ఓంకార్‌నాథ్‌గారూ!" అని ఆహ్వానించాడు. తన నాయకుడు రతన్ ఉపన్యాసానికి ఆనందంపట్టలేక అక్కడే కూచున్న మునూ "రండి, ప్రెసిడెంటుగారూ!" అని కేకవేశాడు. మిగిలిన కూలీలు అదేమాటను అందుకున్నారు.

వేదికమీదకు లల్లా ఓంకార్‌నాథ్ వచ్చాడు. మనిషికి నలభై ఏళ్లుంటాయి. కాని జుట్టుమాత్రం నెరిసింది. ఖరీదైన కళ్ళద్దాలొంచి అటూ ఇటూ చూసి గొంతుక సవరించుకున్నాడు. కట్టుకున్న సిల్కుపంచె గాలికికదిలింది. సిల్కులాల్చీ తళతళ మెరుస్తోంది. తానుతప్ప ఈ ప్రపంచమంతా అనవసరం అనే చూపులతో గర్వంగా ఒక భంగిమపెట్టి తాను ఎన్నెన్ని కష్టాలుపడిందీ, ఆక్స్‌ఫర్డులో వున్నప్పుడు ఎంతెంత గొప్పగొప్ప ఆలోచనలు కావించిందీ చెప్పాడు. తన సోషలిస్టు ఆశయాలు యిటు గాంధీ, అటు బ్రిటిష్‌వాళ్ళనూ ఎలా సంతృప్తి పరచగలవో వివరించాడు. ప్రాక్పశ్చిమాల సిద్ధాంతాలను

సమన్వయంచేయగల సత్తా తన కార్యక్రమానికే వుందని చెపుతూ గొంతుక సవరించుకొని "సోదరులారా!" అని పిలిచాడు. వేదికపక్కనేవున్న రతన్ "అన్నింటిమాటకేం...ముందు స్ట్రయికుమాటేమిట"ని ప్రశ్నించాడు.

"ఆయనేనా, నిన్నా వేళ..." అని మునూ ప్రశ్నించకమునుపే రతన్ "ఆఁ ఆఁ! ఆయనే నేనుకల్సుకోవాలంటే వీల్లేదన్నది" అన్నాడు: "కానీయండి ప్రెసిడెంటుగారూ! ఉపన్యాసం కానీయండి" ముజఫర్ రతన్‌ను కూచోమని సౌజ్ఞచేశాడు. రతన్ కింద చతికిలబడ్డాడు. ఓంకార్‌నాధ్ ఉపన్యసిస్తున్నాడు: "సోదరులారా! నైపుణ్యము గలిగిన, లేదా నైపుణ్యములేని శ్రమశక్తి యనునది, సంపదలను గలిగించు సాధనమైయున్నది. తరతరముల నుండియును యిదియే వరుస. మన ప్రాచీన భారతదేశమునందు సహితమును జాతీయ ఆర్థికరంగమున శ్రమశక్తి యెంత ప్రాధాన్యము వహించినదియూ, యెట్టి పాత్రను నిర్వహించినదియూ ఎల్లరును గుర్తెరింగిరి. యజమాని, భృత్యుడు అను వీరిరువురి మధ్యగల సంబంధములు, వీరిరువురికిని గలుగు సమస్యలనుఁ బ్రస్తావించుచు రాధాకుముద్ ముఖర్జీయను యార్థికశాస్త్రవేత్త యేమనె నన...అన..."

"అవన్నీ ఎందుకండీ! సోదె! మా జీతాలకోత రద్దుచేయాలంటే యూనియన్ యేం చేయాలని?" రతన్ ప్రశ్నించాడు. రతన్ మాటల్ని వినిపించుకోకుండా అధ్యక్షుడు చెప్పుకుపోతున్నాడు. "తమ భృత్యుల జీతనాతములను సమముగా యీయక, హెచ్చుపని చేయించుచూ, యూరికే బకాయీలను వుంచుతూయున్న యజమాని తెలివి తక్కువవాడని రాధాకుముద్ బెనర్జీ వేరొకచోతెల్పినాడు. అటులనే పూర్తిగా పనిచేయకుండగనే తే తెమ్మని యజమానిని వేతనములనడుగు కూలివానిని తెలివితేటలులేని వానికిందే జమకట్టవలెను. అట్లే, చేసిన పనికి జీతమీయని వేల్పు యజమాని కాడు."

"ఇంతకీ మన సమ్మెమాటేమిటి?"

"మిల్లు మూయకుండా మనం ఏం చేయాలి?"

అధ్యక్షుడు పెదవుల్ని గట్టిగా బిగించి చీత్కారంచేస్తూ "ఆయా అధికారులతో ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ సంప్రతిస్తుంది."

రతన్ తల పైకిఎత్తి "నిరుడు జంషెడ్పూరులో తాతాలో మీరు సంప్రదించిన సంగతి మాకు తెలుసుకదా!"

"కూర్చో. పనికి అడ్డురారు. సంప్రదింపులకి యజమానులు సిద్ధంగానే వున్నారు. తొందరపాటువల్ల పరిస్థితులు విషమించనీయకు. భారత జాతీయ కాంగ్రెసు, వర్కింగుకమిటీల సలహాలు, అనుమతిలేనిదే సమ్మెచేసే హక్కు మనకులేద"ని ఓంకారనాథ్ అనగానే "కాంగ్రెస్సో గీంగ్రెస్సో ... మిల్లు మాత్రం మూయడానికి వీల్లేదు" అనే కేకలు సభలో వినవచ్చాయి. "నిశ్శబ్దం నిశ్శబ్దం. కూలీల సంగతి సందర్భాలన్నీ నాకు తెలుసును. ఇంగ్లీషు దేశంలో కార్మికవర్గం ఎందుకంత బలంగావుందో మీ కెవరికైనా తెలుసునా? నేను ఇంగ్లండునుంచి ఇండియాకు వచ్చేవరకూ యిక్కడ ఒక్క ట్రేడ్ యూనియనైనా వుండేదికాదు. అసలలాటిదనే దొకటుంటుందనే సంగతే ఎవరికీ తెలియదు. ఆ పేరే ఎవరూ విన్లేదు. నేను మీకోసం సంఘం పెట్టాను. నామాట వినండి. యజమానులు మీకు పని యిస్తారు. యజమానులు మీకు శత్రువులు కాదు. మిల్లు ఒకవారం మూసివేస్తామని యజమానులు అన్నారే అనుకోండి. అయితే మీరొక క్రమశిక్షణతో కట్టుబాటుగా వ్యవహరించవద్దా? యూనియను మీ తరఫున వుంది. యజమానికీ, మీకూ యిద్దరికీ సబబైనమార్గంలో అది కృషిచేస్తూ వుంటుంది. కార్మికులకు, పెట్టుబడిదారులకు సమైక్యత నెలకొల్పి యూనియన్ చేస్తోన్న ప్రయత్నాలను మీరు బలపరచాలి. నన్నూ, కార్యనిర్వాహకవర్గాన్నీ మీరు నమ్మకపోతే ఎలాగ?" సౌదా శీఘ్రసంగం తలనొప్పి పుట్టించిందో యేమో, గభాలున ఓంకార్‌నాథ్‌ని ఒకపక్కకునెట్టి తాను వేదిక ఎక్కాడు. "కార్యవర్గ సభ్యులంతా యిక్కడే వున్నారు. అందులో నేనొకణ్ణి. వ్యవహారం అమీ తుమీ తేల్చివేసుకుందాం. మిల్లుయజమానులమీద ఓంకార్‌నాథ్ గారికున్న నమ్మకం అంతా ఇంతా కాదు.

మిల్లుయజమానులు మీకు శత్రువులుకారని ఆయన హితబోధ చేస్తున్నారు. శత్రువులు అవునో, కాదో కాని వారుమాత్రం మీకు మిత్రులుకారని మీకే తెలుసును. నిజమాలోచిస్తే ప్రపంచం మొత్తంమీద పీడకులంతా ఒకటీ, పీడితులంతా ఒకటీ"

"నిజం నిజం; ఆమాట అక్షరాలా నిజం" అనే గొంతుకలు సభలో వినిపించాయి: "యజమానులు మలబార్ కొండశిఖరాలపై బంగాళాలలో నివసిస్తారు. మీరు పూరిగుడిశల్లో మగ్గిపోతున్నారు. మీ శ్రమశక్తిని వారు దోచుకుంటున్నారు. మీరిచ్చే ధనంతో కాకుంటే వాళ్ళకీసంపద లెలా వచ్చాయి? రోజుకూ పదిసార్లయినా తింటారు. తాగుతారు. పెద్దపెద్ద

కారులలో ఊరేగుతారు" సౌదా గొంతు గద్గదమయింది : "మీకు యిల్లూ, వాకిలీలేదు. తినడానికి నూకలుసైతం కరువే."

"రైట్ రైట్ !" కూలీలకేకలు మిన్నుముట్టాయి. తిరిగి ఆయన తన ప్రసంగాన్ని కొనసాగించేడు : "ఒక్కసారి మీ శరీరాన్ని తాకిచూసు కోండి. ఎవరివొంట్లోనైనా కాస్త నెత్తురుమిగిలివుందా? ఎముకలుతప్ప యింకేమీ మిగల్లేదు. వొంటిమీద గుడ్డలో చిరిగి పేలికలయాయి. మీరిలా వున్నా, కూలీలు యజమానులు ఒకటేనని ఓంకార్‌నాథ్ హితబోధ చేస్తున్నాడు."

రతన్ "శహభాష్! శహభాష్" అని కేక వేశాడు. మునూ ఉద్రేకం ఆగింది కాదు. "ఓంకార్‌నాథ్ డబ్బున్నవాడు. మీ దారిద్ర్యబాధ ఆయనకేం తెలుస్తుంది? నరకంలో, యములాడి పాశాలమధ్యనైనా సుఖమన్నది వుంది కాని మీ జీవితంలో లేదనే సంగతి ఆయనకు తెలియదు. జలగల్లాగ మీ నెత్తురు పీలుస్తున్న దెవరో ఆయనకి తెలుసునా, మిమ్మల్ని వాళ్ళకే బలియిద్దా మనుకుంటున్నాడు. మీలో ఎంతమందిని ఫోర్‌మన్ అప్పులూ అవీ యిచ్చి ఏదో పేరున పీడుస్తున్నాడో ఆయనకి తెలుసునా? రతన్ మంచి పనివంతుడే. కాని యేంలాభం? ఫోర్‌మన్ అతన్ని పనిలోంచి ఊడబెరికాడు. ఇలాగ ఎంతోమందిని అకారణంగా అన్యాయంగా పన్లోంచి తీసేశాడు. జీతా లిచ్చేరోజున మీ కెవరికైనా సంతోషంగా వుంటోందా? నిజం చెప్పండి. ఫ్యాక్టరీ యివతల ఫోర్‌మెన్, అవతల అప్పులవాడూ నాదిర్‌ఖాన్ ... ఈ పీడ ఎలా వొదిలించుకోవాలో ఎన్నడైనా మీరు ఆలోచించుకున్నారా? ఇదే విధంగా చితికి చివరికి దిక్కుమాలిన చావు చావవల్సిందేనా మీరు? శతాబ్దాలు గడిచినా, మీ స్థితి ఎలా బాగుపడుతుందో ఆలోచించుకోలేరా ?"

సౌదా చెబుతున్న ప్రతిమాటనూ మునూ చెవులు రిక్కించుకుని జాగ్రత్తగా మంత్రోపదేశంలా వింటున్నాడు.

"ప్రపంచంలో రెండురకాల మనుషు లున్నారు. ధనికులు, పేదలు. ఈ యిద్దరికీ సంబంధంలేదు. దోపిడీచేసి, దాగ్లుకొట్టి సంపదలన్నీ హరించివేస్తున్న ధనవంతుల్ని వారికేం 'మహారాజులని' లోకం పొగుడుతుంది. ఈ సంపదలన్నీ వాళ్ళ కెవరిచ్చారు? మీరే! అయితే మీ స్థితి ఎలావుంది? తిండానికి తిండి, కట్టడానికి బట్ట నోచుకోని నిర్భాగ్యులు మీరు.

ఎన్నన్నా పడివుంటారు. ఎన్నికష్టాలొచ్చినా అనుభవిస్తారు. ఇదేం అన్యాయమని నోరువిప్పి అడగరు. ప్రశ్నించడం మీకు తెలియదు. మీరంటే లోకంలో ఎవరు ఖాతరుచేస్తారు? ఆత్మగౌరవం, మనుషులమనే జ్ఞానం మీకు కలగాలి. ఈ చైతన్యం మీరు పొందాలి." లోకంలో ధనికులు, పేదలు అనే రెండు రకాల మనుషులున్నారనే ఆయన ఉపన్యాసం మునూ హృదయాన్ని ఆకట్టుకొన్నది. తాను శ్యాంనగరంలో వున్నపుడు తనకి యిదే ఊహ కలిగింది. అయితే ఆయనలాగ తాను విడమర్చి తన మనసులోని ఊహల్ని చెప్పలేకపోతున్నాడు.

"మేలుకోండి. ఈమగత నిద్రలోంచొకసారి కళ్లువిప్పి చూడండి. లెండి. నించోండి. మేమూ మానవులమనే చాటండి. న్యాయంకోసం, ధర్మంకోసం నిలబడండి. మీ హక్కులకోసం మీరే నిలబడాలి. జీవితం కోసం పోరాడండి. రేపట్నుంచీ ఎవరూ పన్లోకి వెళ్ళకండి. ఇదిగో, యిది మీ హక్కులపత్రం. చదువుతున్నాను. ఒక్కొక్కటొక్కటే చదివి వినిపిస్తున్నాను. ఈహక్కులు మీకు కావాలని మీరంతా ఎలుగెత్తిచాటండి" అంటూ ఆయన ఒక కాగితంతీసి చదువుతూవుంటే కూలీలు వేదమంత్రంవలె పఠిస్తున్నారు:

"మేం మానవులం. ఆత్మల్లేని యంత్రాలం కాం."

"మాకు పనిచేసేహక్కు కావాలి. ఈపనికి మేం లంచాలుచెల్లించం."

"మాకు శుచీ, శుభ్రమూ కల్గయిళ్ళుకావాలి."

"మా పిల్లలకు బడులు కావాలి."

"ఋణదాతల పంజాలనుంచి మేం విముక్తిని కోరుతున్నాం."

"మిల్లుల్లో పని తగ్గించినట్లయితే మాకు తగిన జీతాలు చెల్లించాలి. దయాధర్మభిక్ష యాచించి ఆ సబ్సిడీలను పుచ్చుకుందుకు మేం బిచ్చగాళ్ళం కాం."

"పనిగంటలు తగ్గించాలి".

"మా ఉద్యోగాలకు భద్రత కావాలి. తన చిత్తమొచ్చినపుడు మమ్మల్ని పనుల్లోనుంచి తీసివేసేహక్కు ఫోర్‌మన్‌కు లేదు."

"మా సంఘాన్ని చట్టసమ్మతమైనదిగా గుర్తించితీరాలి."

హక్కులప్రణాళికలోని నిర్వచనాలను కార్మికులు గొంతెత్తి చదువుతూంటే, ఋక్కులవలె వినిపించసాగేయి. ఆకాశం దద్దరిల్లిపోతున్నదా అని

పించింది. బడులలో చిన్నపిల్లలు ఎక్కాలు చదువుతున్నట్టు మొదట నెమ్మదిగా బరువుగా వినిపిస్తూ రానురాను ఒక ప్రబోధగీతంవలె, కదనగీతంవలె ప్రతిధ్వనించ సాగింది. నిదురపోతున్న చైతన్యం నెమ్మదినెమ్మదిగా కనురెప్పలను తెరచి ప్రపంచాన్ని పలకరించింది. ప్రశ్నించింది. ఆనందంతో కూలీలు నినదిస్తుంటే ఎక్కడలేనిశక్తీ యీక్షణంలో పుట్టుకొచ్చి కూలీల ఆత్మలు రెక్కలు విప్పుకొన్నవి. కనులవెంట జలజలరాలుతున్న ఆనందబాష్పాలు పుడమితల్లి తలపై వొలుకుతున్నవి. సముద్రం ఘోషించి ఘోషించి ఉపశమించినట్లు వుంది సభ.

దూరంగా ఏదో కలకలం వినిపించసాగింది. గాలిసైతం విపరీతంగా బాధపడుతున్నట్లు రోదించసాగింది. ఎవరివో కంఠధ్వనులు, అరుపులు, కేకలు : "ఎత్తుకుపోయారు! మా పిల్లాణ్ణి ఎత్తుకుపోయారు!" "ముస్లింలు... అరరే! ... ఎత్తుకుపోయారు. హిందువులిక బతకడమెలాగ ?"

సభ నిశ్శబ్దంగా వింటున్నది. "ఏమిటాఅల్లరి ?" సౌదా ప్రశ్నించాడు.

"హిందువుల కుర్రవాణ్ణి ముస్లింలు ఎత్తుకుపోయారట !"

సౌదా యేమీ చలించకుండా హెచ్చరించాడు : "ఇదంతా ఒక బూటకం! ఎవర్నీ ఎవరూ ఎత్తుకుపోలేదు. ఇది మన శత్రువుల ప్రచారం... ప్రశాంతంగా యిళ్ళకు వెళ్ళిపొండి! రేపట్నుంచీ ఫ్యాక్టరీకి హాజరుకాకండి! రేపు ఊరేగింపు!"

"అలాగే సార్! కానీ ... కానీ ... హిందూ కుర్రవాణ్ణి ఎత్తుకుపోయారు సార్! ముస్లింలు, ముస్లింలు" అనే మాట వినిపించింది. "ఒక్కడే కాదు. చాలామందిని ఎత్తుకుపోయారు" "ముస్లింల తలపొగరు! అరెరె! మన మతం మంటగలుపుతుంటే ... ఊరపందుల్లా బలిసి తొత్తుకొడుకులు! లంజాకొడుకులు! "ఉండండి! వీళ్ళ పని పడతాం" అనే కేకలు అక్కడక్కడ వినిపించ సాగేయి.

"ఆ సంగతి మేం చూసుకుంటాం లెండి! మీరు మాత్రం యిళ్ళకు వెళ్ళిపొండి" మళ్ళీ సౌదా హెచ్చరించాడు. "వెళ్ళిపోతే యెలాగ! పగతీర్చుకుంటాం! డబ్బే కాకుండా, పిల్లల్నికూడా ఎత్తుకుపోతారా వీళ్ళు?"

వేదిక దగ్గరనేవున్న కొందరు కూలీలు అరవసాగేరు : "మా పని పడతారూ ? మేమూ చూస్తాం ? మేం పందులమా ? లంజాకొడుకులమా ? హిందూవుల్లా! హిందూవులు" గుంపులో కలవరం హెచ్చింది. తలపాగాలు

జారిపోతున్నాయి. చేతులతో ఒకర్నొకరు తోసుకుంటున్నారు. గుద్దుకుంటున్నారు. తన్నుకుంటున్నారు. ముష్టియుద్ధం చెలరేగిపోతున్నది.

మునూ గజ గజ వణకిపోతూ రతన్ లాల్చీ పట్టుకుని నించున్నాడు. నించుని వెనక్కొకసారి చూస్తాడు కదా, యికనేముంది! సముద్రతరంగాలు ఒకదానిమీద ఒకటి పడుతున్నట్లు, గుంపులోని జనం అటు ఇటూ తోసుకుంటున్నారు. ఒకరి గొంతుక యింకొకరు పట్టుకుంటున్నారు. మొహాలమీద దెబ్బలు, వీపులమీద గుద్దులు దబ దబ వినిపిస్తున్నాయి.

మునూ నిలువునా కంపించిపోయాడు ఒకర్నొకరు తిట్టుకుంటున్న, కొట్టుకుంటున్న జనాన్ని చూసి మునూ కెవ్వున కేక వేశాడు. ఎత్తుకుపోయారనే ఒక గాలికబురు ఎంతపనిచేసింది! ఒక్కనిముషంలో ప్రశాంతవాతావరణాన్ని భగ్నంచేసి ఒకర్నొకరు తన్నుకునేటట్టు గొంతుకలు నులుపుకునేటట్టు చేసిన ఈ "ఎత్తుకుపోయార"నే గాలికబురు ఎంతటిది! సౌదా యింతసేపూ చెప్పిన హితోక్తులకు మునూ హృదయం ఉప్పొంగిపోయింది. రక్తం ఉడికెత్తిపోయింది. ఆ ఉద్రేకోత్సాహ లిపుడొక క్షణంలో భయంగా మారిపోయి నిలువునా కంపమెత్తిస్తున్నాయి. గుంపులోని జనం హఠాత్తుగా చెల్లాచెదరై పోతున్నారు. పడుతూ లేస్తూ పరుగెడుతూ కూలీలు పారిపోతున్నారు. గుంపులోని జనాన్ని యిష్టమొచ్చినట్లు పోలీసులు లాఠీలతో చావమోదుతున్నారు. పోలీసుల ఎర్రటోపీలను చూసేసరికి మునూ ప్రాణం అక్కడికక్కడే ఎగిరిపోయింది. ఆనాడు ప్రభుదయాళ్‌ను అరెస్టుచేసి స్టేషన్లో కటకటాలమధ్య పడవేసి యిష్టమొచ్చినట్లు తన్నింది ఈపోలీసులే! నీలిరంగు నిక్కర్లువేసుకుని బెల్టులుతగిలించుకుని యమదూతలు ప్రత్యక్షమయేసరికి ఏం చేయాలో మునూకు బోధపడలేదు. నిశ్చేష్టుడై కళ్ళువప్పగించి చూస్తున్నాడు.

"ఇంటికి వెళ్ళిపో!" తన లాల్చీపట్టుకున్న మునూను విదిలించుకొని రతన్ గుంపులోకి దుమికాడు.

"రతన్! రతన్! అన్నా! అన్నా!" అంటూ మునూ కేకలుపెట్టినా అతను ఆగలేదు. వేదిక పైకెక్కి "రతన్! రతన్" అని పిలవసాగేడు. గొంతుక బొంగురుపోయింది. రతన్ జాడ తెలియలేదు. పోనీ హర అయినా కంటికి కనిపిస్తాడేమోనని మునూ ఆశతో గుంపును చూపులతో వెదకసాగేడు.

చీకటి తెరలు కమ్ముకొస్తున్నవి. కూలీలు తొందరతొందరగా, భయం భయంగా పరుగులు పెడుతున్నారు.

వేదికపై దిక్కులుచూస్తున్న మునూ రెక్కపట్టుకు యివతలకు లాగి "ఎవరు నువ్వు? హిందూవివా? ముస్లిమువా?" అంటూ కర్రఝుళిపిస్తూ గర్జించాడొక పఠాన్. మరణ మిక తప్పదనే భయంతో మునూ మూగవాడిలా సౌజ్ఞ చేశాడు. "మాట్లాడవేంరా?" అంటూ పఠాన్ గద్దించాడు. గట్టిగా కేకలు వేద్దామనుకున్నాడు మునూ, కాని గొంతుక పెగిలిందికాదు. కళ్ళు ఒక్కసారి మూసేసుకున్నాడు. మళ్ళీ తెరిచి చూశాడు. గబుక్కున వేదికమీంచొక దుప్పిగంతువేసి కోతిలా ఛంగుఛంగున గుంపులోకి పారిపోయాడు. పఠాన్ కర్రతో ఠపీమని వేదికమీద కొట్టడం మునూకు వినిపించకపోలేదు. మైదాన్‌లోంచి బయటపడాలనే తొందరతో గబగబా అడుగులువేస్తూ పరుగు లంకించుకున్నాడు. కూలీలు ప్రవాహంలా, వెళ్ళిపోతున్నారు.

"పిల్లల్ని ఎత్తుకుపోతోంది ఈ పఠాన్లే" అన్నాడొక కూలీ.

"మిల్లు యజమానులు వీళ్ళని మనమీద ఉసికొల్పుతున్నారు. సర్కారు చూస్తూ ఊరుకుంటోంది."

"అంతే! అంతే! పఠాన్లే ఈపని చేస్తూంట. కార్లల్లో పిల్లల్ని పడేసుకుని పట్టుకుపోతున్నారు. గవర్నమెంటేమీ వినిపించుకోవడంలేదు. అయితే మనం మన పిల్లల్ని వీధుల్లోకి రాకుండా జాగ్రత్తపడాలి."

"పఠాన్లు మనకి శత్రువులు. సమ్మెను పడగొట్టడానికి రెండొందల మంది పఠాన్లని యజమానులు కూలికి తెచ్చారు. వీళ్ళకి బుద్ధిచెప్పాలి."

"నాదీఖాన్ లేడూ; ఆ వడ్డీ వ్యాపారస్తుడూ, వాడి దగ్గిరకెళ్ళి యీ వ్యవహార మేమిటో తేల్చేసుకుందాం."

ఎవరో కూలీ ఖండితంగా చెబుతున్నాడు కాని వాళ్ళందరితోనూ నాదీఖాన్ యింటికి వెళ్ళడానికి మునూ యిష్టపడ్లేదు. ఇదివరకు పఠాన్ వడ్డీ వ్యాపారస్తుడు, హరిని ఎలా కొట్టాడో తాను కళ్ళారా చూశాడు. కూలీలను తప్పించుకుని చరా చరా వెళ్ళిపోయాడు. తను వుండే యిల్లు యిక ఎంతో దూరంలేదు. కాని వీధి మొగిలో మనుషులు గుమ్మిగూడుకుంటు న్నారు. ఒకళ్ళనొకళ్ళు బాదుకుంటున్నారు. సందులోకి వెళ్ళక హరిజనులు నివసించేచోటుకి దారితీశాడు. ఆ దారేమో తనకు కొత్త. దారిలో బురద

గుంటల్లో పడుతూ, లేస్తూ చీకట్లో తడుముకుంటూ నడిచిపోతున్నారు. ఈ రాత్రి ఎక్కడో అక్కడ నిద్రపోయి తెల్లారేక యేం చేయాలో ఆలోచించు కోవచ్చుననుకున్నాడు. చీకటి. నిశ్శబ్దం. నక్షత్రాలుకూడా ఎక్కడా కనిపించడంలేదు. సందులు, మురికి, దుర్వాసన, దోమల సంగీతం, క్రిక్కిరిసిన యిళ్ళు; కుళ్ళుకాలవల బొంబాయి, చెత్తల డబ్బాలతోవున్న బొంబాయి తన హుందాతనాన్నంతా పోగొట్టుకుంటున్నది. ఎక్కడా చూసినా అసహ్యామే. రోత. దిక్కుమాలిన నగరం. ఇప్పుడు తను ఎంతదూరం వచ్చినట్టు? మునూకు తెలియడంలేదు. ఫ్యాక్టరీ దగ్గర అల్లరి చెలరేగింది. తాను తప్పించుకుని యివతలపడ్డాడు. పడీ, ఎక్కడకు వచ్చినట్టు? ఇక్కడ అక్కడకంటె ఎక్కువ గోలగావుందే! దూరంగా జనసంరంభం. ఏ వేవో కేకలు వినిపిస్తున్నాయి. సందులుదాటి వచ్చేసరికి బహిండీ బజార్‌లోద్వారం చెంత మనుష్యులు గుంపులు గుంపులుగా గుమిగూడి అరుస్తున్నారు.

స్క్వేర్‌చెంత తరంగాలుగా జనం. గుంపుకు దూరంగానిలబడి వింటున్నాడు. ఈ గుంపులోని మనుష్యులలో ఉద్రేకంలేనివారెవరూ కనిపించడంలేదు. ఎందుకు వీళ్ళింత ఉద్రేకపడుతున్నారో మొదట అతనికి తెలిసింది కాదు. తరవాత తెలియజొచ్చింది. ఎత్తుగావున్న చప్టామీదకుఎక్కి ఎవరో ఒక స్థూలకాయుడు గావుకేకలు పెడుతున్నాడు: "ఒహో! మీకే! మీకే నర్రా! మీరు హిందూమతస్థులే అయితే, మీకు మీతల్లులమీద చెల్లెళ్ళమీద ప్రేమన్నదే వుంటే నిద్ర ఎలాపోతున్నారయ్యా? రండి రండి ఇవతలకిరండి! కర్రలూ కత్తులూ పట్టుకురండి! మన భార్యల్ని, మన అక్కచెల్లెళ్ళను ముస్లింలు చెరుస్తుంటే ఊరుకుంటామా? గవర్నమెంటు ఊరుకుంటేమాత్రం మనకి పౌరుషంలేదా? గవర్నమెంటు మన హిందువులచేతుల్లోని కర్రలు లాక్కుంది. కాని ముస్లింలచేతుల్లోని కర్రలూ, కఠార్లూ అలాగే వుంచింది. పైగా అయిదుగురుకంటె ఎక్కువమంది కలుసుకుంటే కాలుస్తానని హుకూంలు జారీచేసింది. ఏమిటీ అన్యాయం? ఈ అన్యాయానికి మనం జవాబుచెప్పాలి. మన మహారాష్ట్రరక్తం ఎంత శక్తిగలదో మన నెత్తురుబలం చూపించాలి. మహమ్మదీయుల తలపొగరు అణచివేరాలి! మహమ్మదీయులు నశించాలి! నశించాలి! నశించాలి!"

దుకాణం చెప్టా ఎక్కి గుంపులోని జనాన్ని చూస్తున్నాడు మునూ. ఎవరో జనాన్ని దబదబ కర్రలతో బాదుతున్న చప్పుడు వినవచ్చింది. కేకలు

వినిపిస్తున్నాయి. "హై హై! చంపుతున్నారు! చంపేశారు!" గుంపులోని జనం పళ్ళు పటపట కొరుకుతున్నట్లు కనిపించింది. మళ్ళీ కేకలు. "చంపండి! నెత్తురు తాగండి! ముస్లిములను నరకండి! పగతీర్చుకోండి! లూటీచేయండి! కాల్చండి!" గుంపు ఆవేశంతో కదలిపోతూ స్క్వేరుకుదాటి అబ్దుల్ రహ్మాన్ వీధిలోకి చొచ్చుకుపోతున్నది. పదిమంది భారతీయ పోలీసులను వెంటబెట్టు కొని, ఒక ఇంగ్లీషు ఆఫీసరు ఖాకీదుస్తులతో లాఠీని ఆడిస్తూ వస్తున్నాడు. ఆఫీసర్ని చూడగానే మనూ చెప్తా దిగిపోయాడు. చీకటిలో ఎక్కడో ఓమూల దాగోవాలని ప్రయత్నిస్తున్నాడు. ఆ జనసమూహానికి ఎదురుగావున్న రోడ్డుమీదకు తప్పుకుంటే ప్రమాదం తప్పుతుందనే ఆలోచన తట్టింది. ఆలోచనలతో మెదడు కరిగిపోతున్నది. ముఖంమీద మెటికలు పులకరించాయి. పోలీసుల చేతుల్లో ఊగుతున్న లాఠీలు కళ్ళముందు కనుపించసాగేయి. తనలో తానే గొణుక్కుంటూ తనమీద తానే జాలిపడుతూ కలలో, నడిచిపోతున్నట్లు అపస్మారకంలో కలవరిస్తున్నట్లు గొణుక్కుంటూ వెళ్ళిపోతున్నాడు: "ఇపుడు నాకళ్ళముందు కనిపిస్తున్నదేమిటి?" ఈ ప్రశ్నలకు వీధులు ఏమీ సమాధానమీయలేదు. కాని వీధిమాత్రం అతనివంక తేరిపార చూసింది. బాల్కనీలతోవున్న పెద్దమేడలు, అంతస్థులమేడలు, అతన్నిచూసి వెక్కిరిస్తున్నాయి. మేడలచుట్టూవున్న పెద్దపెద్ద రాతిగోడలను చూసేసరికి అతనికి కాంగ్రాపర్వతాలు జ్ఞప్తికివచ్చాయి. తన ప్రశ్నలకు ఈరాళ్లూ, రప్పలూ సమాధానమీయలేదు. ఆనాడు తనపల్లెలో మందలోంచి తప్పించుకు పారిపోయిన గొర్రెను వెదుకుకోందుకు లోయలలోనికి వెళ్లాడు. ఎంత వెదికినా ఎక్కడా ఆగొర్రె కనిపించలేదు. "గొర్రె ఎక్కడుందో?" అనే ప్రశ్నకు ఆనాడు కాంగ్రా పర్వతశిఖరాలు సమాధానమీయలేదు. ఈనాడూ అంతే! ఈమేడలు, సౌధాలు, శిఖరాలు అతని ప్రశ్నలకు జవాబీయడంలేదు! చీకటి భూతంలాగుంది. పొడిపొడిగా నల్లని కాటుకలా పొగలా అలుముకుంటున్న చీకటితెరల మధ్య మృత్యువు పెద్దపులివలె తొంగితొంగి చూస్తున్నది కాబోలును! చీకటే మృత్యువు! మెల్లమెల్లగా, చీకటి సన్నని దారపు పోగులవలె నేసుకుంటూ, కాదు కాదు, ఉరిత్రాడుతో కంఠాన్ని చుట్టబెట్టుతూ ఉక్కిరి బిక్కిరి చేస్తున్నది. పాపులలో నిశబ్దం. వీథులలో నిశబ్దం. ఎక్కడా అలికిడిలేని వీథులు. దయ్యంవలె జుత్తు విరియబోసుకుని మృత్యువు, చీకటి ఆకారంలో వీథులలో నృత్యం చేస్తున్నది. "ఎందుకు తన

కింత భయం కలగాలి?" అనే ప్రశ్న ఉదయించి, అబ్బే ఈ చీకటే సహజమే! తెల్లారితే వెలుగు రావడమూ నిజమే! అనే ధైర్యం కలిగింది. "నేను ధైర్యవంతుణ్ణి. లోయల్లో తిరిగాను. కొండలు ఎక్కాను. శ్మశానాల మధ్య, తోటల గుబురులమధ్య తిరిగాను. వందలకొద్దీ మైళ్ళు ఏకాకిగా ప్రయాణం చేశాను. నాకెందుకీభయం? భయంలేదు!" అని గుండెకు ధైర్యం చెప్తున్నాడు. హఠాత్తుగ కండలుదేరిన రతన్ శరీరం మెదడులో మెరిసింది. "ఇప్పుడతను ఎక్కడున్నాడోకదా! హరిమాట? లక్ష్మి ఆమె పిల్లలూ పాపం యింట్లో ఈపాటికి నిద్రపోతూ వుంటారు కాబోలు! అరరే! వాళ్లందర్నీ విడిచి వెళ్లిపోతున్నానే! ఎక్కడికీ ప్రయాణం? ఎక్కడికో అక్కడికి! వాళ్లు లేకపోతేనేం, దిగులెందుకు? భయం దేనికి?"

"ఊహుఁ! అక్కడికిక వెళ్లను! వెళ్లనుగాక వెళ్లను!"

మునూ ముందుకు వెడుతూవుంటే, కెవ్వుమనే కేక చీకట్లను దూసుకు పోతూ వినవచ్చింది. "అల్లాహో అక్బర్!" అనే నినాదాలు వినిపించాయి. గబగబ పరుగుపెట్టాడు. పక్కనేవున్న సందులోకి మళ్ళేసరికి ముందొక ముసలివాడు పరుగెడుతున్నాడు: అతన్నొక రాక్షసునివంటి పఠాన్ వెంట తరుముతున్నాడు. చటుక్కున ఆగిపోయి, మునూ దృష్టినిసారిస్తూ నిలబడి పోయాడు. ఎదురుగా మరొకసందు మళుపులోంచి యిద్దరు మహమ్మదీయులు వచ్చి ముసలివానిమీద పడ్డారు. డేగకుచిక్కిన కోడిపిల్లలా గిలగిల కొట్టుకుంటూ "రాం రాం! అయిపోయింది" పఠాన్ ముసలివాని వెన్నుమీద దొక పోటుపొడిచాడు. "గాడిదకొడకల్లారా!" గిజగిజలాడుతున్నకు, ఒక్క కేకపెట్టి ముసలిప్రాణి నేలమీద విరుచుకు పడిపోయింది.

మునూ వెనక్కితిరిగి పరుగెత్తుతున్నాడు. వెనక ఎవరో వెంట తరుముతున్నట్లు అడుగులచప్పుడు వినవచ్చింది. గాలి రొప్పుకొస్తున్నది. గాలి చేసే సవ్వడికూడా మహమ్మదీయుల అడుగులచప్పుడువలె వినిపించింది. వాళ్ళు కత్తులు దూసుకువస్తున్నారనే భయంతో శక్తికొద్దీ పరుగెడుతున్నాడు. వెనక ఎవరూ రాకపోయేసరికి కాస్త ప్రాణం తెప్పరిల్లి జాపోస్తూ ఆగిపోయాడు. కాని ముందు కొంచెందూరంలో భగభగమనే మంటలు కనిపించాయి. అగ్నిజ్వాలలు ఆకాశాని కంటుకుంటున్నాయి. ఎర్రని నీలిమంటలు, ఫెళఫెళమనే కాలుతున్న దూలాలచప్పుడు! ముందు నుయ్యి వెనక గొయ్యి; ఎటు వెడదామా అని దిక్కులుచూస్తూంటే అక్కడవున్న యింటివాకిలి

ముందు నించున్న ఒకాయన హెచ్చరించాడు: "అది ముజ్లీ మిఠాయి దుకాణం. అటు వెళ్ళకు. నిన్నూ ఆమంటల్లో పారేస్తారు" అక్కడవున్న దుకాణాలచెంత కాళీజాగావుంటే యీ పూటకి ఓమూల నక్కిపడుకొని, తెల్లారేలోపున ఎటో పారిపోవచ్చును.

కాని ఎక్కడా జాగా కనిపించలేదు. మళ్ళీ మహమ్మదీయుల కేకలు వినిపించాయి: "అల్లాహో అక్బర్!" దబదబ పాదాలచప్పుడు. ఇటే ఎవరో వస్తున్నట్లు, ఒకరూ యిద్దరూ కాదు. ఒకదండుకు దండే! చప్పుడు విన్న నీటిపాములా తుర్రున మరో సందులోకి మునూ పారిపోయాడు. అదే సందులో, ఒక నృత్యమందిరం వున్నది. నృత్యమందిరాని కెదురుగావున్న యింటివాకిట్లో ఒకామె నించుని గుండెలు బాదుకుంటూ గొల్లుగొల్లున ఏడుస్తున్నది: "నాకొడుకో! యేమయ్‌పోయావ్ నాతండ్రో! చిన్నప్పట్నుంచీ పెంచాను బాబో!" ఇక అటు వెడితే తానూ ఒక హంతకుడనుకుని ఆమె, మీద పడి యేంచేస్తుందో ననే భయంతో వచ్చినదారినే వెళ్ళిపోదామనుకున్నాడు. కాని వెనకనుంచి పఠానులు గుంపొకటి గబగబావచ్చి వీధిలోని తలుపులను బాదుతున్నారు. పఠానులను చడీచప్పుడులేకుండా పోలీసులు తుపాకులు తెరిచి తరుముకురాగా, పఠానులు పారిపోతున్నారు. మునూ చటుక్కున ఒక యింటివసారాలోకి వెళ్ళిపోయి, స్తంభంపక్కన దాక్కున్నాడు. పోలీసులు తరుముతూ బూట్లు టకటక చప్పుడుచేసుకుంటూ వెళ్ళిపోగానే మునూ యివతలకొచ్చాడు. దీర్ఘంగా నిట్టూర్చి నిలబడ్డాడు. మెల్లమెల్లగా గోడ వారమ్మటే తడుముకుంటూ తారుతూ వెళ్ళిపోతున్నాడు. వీధిచివరకు రాగానే తిరిగి వెనక్కిచూస్తే యికనేముంది! మళ్ళీ యుద్ధం! దొమ్మీ! నెత్తురు! గోల! ఒకరికొకరు రభిముఖంగా నించుని మహమ్మదీయులూ, హిందువులూ కోడిపుంజుల్లా దెబ్బలాడుకుంటున్నారు. "అల్లాహో అక్బర్"

"జై కాళికాదేవికీ జై!"
"అల్లాహో అక్బర్!"
"జై, శివాజీకీ జై!"
"పొడు పొడు"
"నరుకు నరుకు"
"పండుల్ని నరికినట్టు నరుకు"
"ముంజకాయల్ని దోరవెట్టినట్టు ..."

"గాడిదకొడుకులు"

"లుచ్ఛాఖోర్లు"

ఈసారి తను వీళ్ళచేతుల్లో పడకతప్పదు. స్క్వేరుదగ్గరకు గబగబ అడుగులువేస్తూ ఒగరుస్తూ పరుగెడుతున్నాడు. వెనక ఎవరో తరుముకు వస్తున్నారు.

హఠాత్తుగా మునూ వీపుమీద ఒకదెబ్బ పడింది. దెబ్బకు తట్టుకోలేక కిందపడిపోయాడు. "కుక్క! గాడిద! హిందువట! హిందూ" అంటూ పఠాన్ కిందపడిన మునూ నొక్కతాపుతన్ని చరచరా వెళ్ళిపోయాడు. కేకలు వేసుకుంటూ తిట్టుకుంటూ పఠాన్లంతా స్క్వేరువదలి వెళ్ళిపోతున్నారు. అటూ ఇటూ దారులచెంత పొంచున్నారు. మునూ కళ్ళువిప్పి చూసేసరికి స్క్వేర్ నిర్మానుష్యంగా వుంది. చౌపతీ బీచ్‌నుంచి ఏవో ఏడ్పులు పెద్దగా వినిపిస్తున్నాయి. పిట్టలు ఆకాశంలో ఎగురుతున్నవి. తెలతెలవారుతోంది. మునూ కళ్ళువిప్పి చూశాడు. ఎదుట ఒక త్రిభుజాకారంగా వున్న పూలతోట కనిపించింది. ఆ తోటలోకిపోయి మొక్కలచాటున, పొదలమాటున దాగుందా మనుకున్నాడు. లేవడానికని తల కొంచెం పక్కకు వొత్తిగించి చూసేసరికి ఎవరో తనకు సమీపంగానే మరొక నిర్భాగ్యుడు మూలుగుతూ దొర్లుతున్నాడు. కొంతసేపు గడిచింది. ఇక మూలుగులు వినిపించడంలేదు. అతనిచెంతకు వెళ్ళాలనుకున్నాడు మునూ. కాని శరీరం కదలలేదు. తల తిరిగిపోతున్నది. కళ్ళు మూతలుపడుతున్నాయి. మగతనిద్ర. నిస్త్రాణ.

ఏవో అడుగుల చప్పుడు మళ్లీ వినిపించ సాగింది. "సరే! నా పనిసరి. భూమ్మీద నాకింక నూగ్గింజలు లేవు" అనుకున్నాడు. కాని అతనికింకా యీ భూమ్మీద నూకగింజలున్నాయి. సాంఘిక సేవాసమితి వలంటీర్లు యిద్దరు వచ్చి అతన్ని ఒక స్కూలు వరండాలో పడుకోబెట్టారు. వలంటీర్లు ఉప చారాలు చేయడం మునూకు మనస్కరించలేదు. అందుకని కళ్లు మూసివేసు కున్నాడు. కాని ఏమి జరుగుతున్నదోమాత్రం అతనికి తెలియకపోలేదు. వొంటిమీద స్మారకం తప్పిపోతే బాగుండును. ఉహుం కాదు; ఇప్పుడు తాను చనిపోతే, దుఃఖించేవాళ్లెవరు? ఇన్ని నెలలుగా పనిచేయగా, యింకా వొంట్లో యీ శక్తి ఎలా మిగిలింది?

స్కూలు వరండాలో ఒక చాపమీద అతన్ని వలంటీర్లు పడుకో బెట్టారు. వరండాలో మునూతోపాటు చాలామంది బిచ్చగాళ్లూ, దరిద్రులూ,

కూలీలా నిలబడి వున్నారు. రాత్రి ఎలాగో చావును తప్పించుకుని బతుకు జీవుడా అని ప్రాణం అరచేతుల్లో పెట్టుకొని దిగులుగా మరికొంతమంది మూలమూలల కూచున్నారు.

డాక్టరు వచ్చాడు. మునూను పరీక్షగా చూసి, "ఎక్కడమ్మా, నీకు తగిలింద ?"ని ప్రశ్నించాడు. మునూ కళ్ళువిప్పి చూశాడు. శ్యాం నగరంలో వున్న డాక్టరు బాబుగారిలాగ సూటూ బూటూ హేటూ యీాయనకు లేవు. మునూ మళ్ళీ కళ్ళు మూసుకుని పక్కకు వొత్తిగిల్లేడు. అతని శరీరంమీద చేతులువేసి చూసి 'పక్కలు వేడిగా వున్నాయే' అనుకుంటూ చీటీరాసి యిచ్చాడు డాక్టరు. వలంటీరు ఒక కప్పు పాలు తెచ్చి అతని నోటికందించాడు. మునూ గడ గడ తాగివేశాడు. ముఖం కొంచెం తేటపడ్డది. కొంచెంసేపు నిద్రపోతే కాస్త సత్తువ వచ్చును కాని, అతను కళ్లు తెరచుకొని అలా చూస్తూ వుండిపోయాడు. వరండాలో యింకా చీకటిగానే వుంది. పేడ, వుచ్చా మురికి కంపు. ప్రాణంతోడుకు పోతోంది. పూలతోటలోని గులాబీపూల వాసన బూడిదలోపోసిన పన్నీరు. ముక్కు బిగించుకుని తన చుట్టూ తనలాగే పడివున్న మనుషులను చూస్తు న్నాడు. కొందరి కాళ్లూ చేతులూ విరిగిపోయాయి. మరికొందరికి మెడమీద గాయాలు. కొంచెరు గోడకు జేరగిలబడి నిద్రపోతున్నారు. దగ్గులు, మూలు గులు, ఏడుపులు వినిపించసాగేయి. నోరొకసారి తెరిచి గాలిపీల్చాడు. పళ్లు బిగించి 'అమ్మ'అని మూలిగాడు. ముక్కు బద్దలైపోయే దుర్వాసన. భరించ లేనంత కంపు. సముద్ర తీరానికి పోయి యిసకలో పొర్లుదామనుకున్నాడు. ఎదరగా గేటు తెరచుకొనివుంది. కొందరు బయటనుంచొస్తున్నారు. మరి కొందరు లోనుంచి పోతున్నారు. తనుకూడా గేటులోంచి చరచరా దూసుకు పోయాడు.

చౌపతికిపోవాలంటే యిక్కడికది మూడువందలగజాల దూరం. "అక్కడికిపోతే ఫరవాలేదుకదా!" అని ప్రశ్నించుకున్నాడు. మెల్లమెల్లగా అడుగులు వేస్తున్నాడు. "ఏదో ఒకటి! ఏమైతేకానీ! ఇక్కణ్ణుంచిమాత్రం పోతాను" నడుస్తూవుంటే యిదివరకు తనకు శ్యాంనగరంలో, కౌలత్ పూర్‌లో కనిపించిన దృశ్యాలన్నీ మెదడులో తిరుగసాగేయి. రాత్రి చూసిన దృశ్యాలు, భయానక సంఘటనలు, ఒకర్నొకరు చంపుకుంటున్న మనుష్యులు, క్రీనీడలు మనసులో కదలసాగేయి. మంటలవలె వేగంగా సముద్రంచెంతకు

పరుగులుతీస్తున్నాడు. చౌపతీబ్రిడ్జి దాటాడు. వేగను ఒకటి కనిపించింది. ఎదురుగా వందల వేల లక్షలమైళ్ళ విస్తీర్ణంలో సముద్రం కనిపించి, పాము లాగ బుసలుకొడుతూ నురగల్ని కక్కుతూ విషాన్ని విరజిమ్ముతూ ఘోషి స్తోంది. సముద్రాని కెదురుగవున్న తిలక్ విగ్రహం ఎంతో చిన్నదిలా కని పించింది. పక్కనేవున్న ఒక కొబ్బరిదుకాణంబడ్డీమీద పడుకున్నాడు. బడ్డీ మీద చాలా జాగావుంది. సముద్రం జోలపాటపాడుతూ అతన్ని నిద్ర పుచ్చింది.

కళ్ళుతెరిచి చూసేసరికి కరకరమని సూర్యుడు నడినెత్తిమీదకొచ్చాడు. కాని ఎవరూ రాలేదు. పాపు ఈపూట తీయరుకాబోలును. సాయంకాలం వరకూ అక్కడే అతను నిద్రపోయాడు. మళ్ళీ నిద్రలేచేసరికి పొద్దు వాలి పోతున్నది. ధగధగ మెరిసే సూర్యకాంతిని సముద్రకెరటాలు మెరుస్తున్నాయి. రాత్రి నిద్రలేదు. తెల్లవారుఝామున చలి. ఇప్పుడు హాయిగా వెచ్చగావుంది. సేదతీర్చుకోవడంవల్ల ఆకలివేస్తున్నట్లేలేదు. మనసులోని దుఃఖం ఉపశ మించింది. నెలలతరబడి పొద్దున్నే లేస్తూ "పొద్దుగూకులా పనిచేశానుకాదూ; ఈపాటి విశ్రాంతి అవసరమే మరి" అనుకున్నాడు. ఇక్కడ ఈసముద్రాని కెదురుగ నీలిఆకాశం తన అందాన్ని నీళ్ళల్లో చూసుకుంటున్న యిక్కడ యింతసేపు కాలం వెళ్ళబుచ్చడం, తన చిన్ననాటి ఆనందాన్ని మైమరపిం చింది. మైదానంలో తనగేదెల్నీ, ఆవుల్నీ మేపుకుంటున్నపుడు ఎంతహాయిగా వుండేది! ఆ మైదానంవలె ఈ సముద్రమూను! మైదానంలో ఆనాడు తన ఆలమందల్ని మేపుకున్నపుడు వుండే ఆత్మస్వేచ్ఛ, ఆ స్వాతంత్ర్యం, ఆ వెర్రి ఆనందం నిజంగా యిక మళ్ళీవస్తుందా?

పొద్దున్నే లేచి ఫ్యాక్టరీకిపోయి రెక్కలు ముక్కలు చేసుకుంటూ రావడంవల్ల అతనికి పనిచేయడమొక అలవాటయిపోయింది. ఇపుడు పని మీదకు బుద్ధిపోయింది. త్వరత్వరగా లేచి ఏదోపని, ఏదో ఒకటీ, ఏదైతేనేం చేసితీరాలి. పని లేకపోతే తోచదు. కాని ఏ పనిచేయడం? ఎక్కడికిపోతే పని దొరుకుతుంది? ఇంతకీ తనకు ఏపని కావాలి? ఈ ప్రశ్నలకు సమాధానం దొరకలేదు. ఎప్పుడూ తాను యీ ప్రపంచంలో ఏకాకినే అనేభావం అతన్ని పట్టుకుని పీడించసాగింది. చుట్టూ యింతమంది మనుషులున్నా, ఏదో పనిలో మగ్నులైవున్నా యిదేభావం! భావంకాదు భయం!

కాని తను పనిచేసిన ఆ కొన్నాళ్ళుమాత్రం హాయిగావుంది. చేసిన పనివల్ల వొళ్ళు హూనమైతేనేంగాక, చేతులు బొబ్బలెక్కితేంనేం, యింటికిరాగానే యింత కూడు తిన్నవెంటనే, కూలీలతో ఏవో హాస్యాలూ, నవ్వులాటలూ! ముచ్చట్లుచెప్పుకొని, కాస్సేపు నవ్వుకుని అంతా నిద్రపోయేవారు. పొద్దున్నే లేచేవారు. మళ్ళీ పనులకు పోయేవారు. అదే నిజమైన జీవితం!

ఏదోపని సంపాదించాలనే ఉత్సాహం వున్నా, ఇతరుల జీవితాలను చూస్తున్నా, వైవాళ్ళపై సానుభూతీ, ప్రేమా కలుగుతున్నా, యిప్పుడు మళ్ళీ తనది వొంటరిజీవిత మనేభావం ఆవరించింది. ఈ భావం చీకటిలా వ్యాపించింది. తను ఏకాకి; తిండీ తిప్పలూలేవు. పనీపాటూ లేదు. కాని భయంలేదు. ఆ సమయానికి ఎలాగో ఒకలాగ ఎవరో ఒకరు ఆదుకుంటున్నారు. శ్యాంనగరంనుంచి తను పారిపోయివచ్చినపుడు ప్రభుదయాల్ తనను ఆదరించాడు. మావటివాడు తనను బొంబాయి తీసుకువచ్చాడు. హరి స్నేహం కుదిరింది. మిల్లులో పని అయింది.

"మిల్లులో పని దొరక్కపోతే రతన్ స్నేహం తనకు దొరికేదా మరి! వీళ్ళెవరూ లేకుండానే మూటలుమోస్తో, తట్టలు ఎత్తో మార్కెట్టులోనూ, స్టేషనుచెంతా నేను చాలారోజులు నెట్టుకొచ్చాను. భయం దేనికి? ... అయినాసరే, మిల్లుకి వెడతాను. వెళ్ళి అక్కడ ఏమౌతుందో చూసివస్తాను," అనుకున్నాడు. తల ఆడించాడు. చేతులు చాచుకున్నాడు. వొళ్ళు విరుచుకున్నాడు. ఆవులించాడు. బద్ధకం తీర్చుకున్నాడు. కిందకొక్క గెంతుగెంతి హుషారుగా నడుస్తున్నాడు. సముద్రతీరంలో ఎవరూ లేరు. జాలరివాళ్లు వలలువేసి చేపలు పట్టుకుంటున్నారు. చౌపతీ బ్రిడ్జిదాకా వచ్చాడు. మలబారు కొండలమీద మేడలు కనిపించాయి. దిగువను ఎర్రని, పచ్చని, తెల్లని రంగురంగుల భవంతులు కనబడ్డవి.

రోడ్డు నిశ్చలంగావుంది. రాత్రి నగరంలో ఏమీ సంఘటనలు జరగనట్లే నిర్మలంగా నిశ్శబ్దంగావుంది రోడ్డు. సైకిళ్ళూ, కార్లూ వస్తున్నాయి. పోతున్నాయి. షాపులమీద బోర్డులను చదువుకుంటూ వెళిపోతున్నాడు: "ఆటోడిలక్స్" "భారతీయ వాచ్ వర్క్స్" "ది అమెరికన్ ఆటోపార్ట్ కో" "క్లినికల్ లేబరేటరీ ఆఫ్ డాక్టర్ యన్. జె. మోడీ, యమ్. బి., బి. యస్; యమ్. ఆర్. సి. పీ (లండన్)" "భారత స్వదేశీ స్టోర్సు" ఎన్ని షాపులు! ఎన్నెన్ని బోర్డులు!!

ఫరేఖ్ మాన్షన్ వద్ద కూలీలు అడావుడిగా తట్టలలో ఏదోమోస్తున్నారు. నాలుగురోడ్ల మొగిని పోలీసు నించున్నాడు. షాపుముందర ఒక బండివుంది.

వంకీలు వంకీలుగా తిరిగిన కొమ్ములతో ఎద్దులు మెడమీద కాడిని కదుపుకుంటూ తోకలతో జోరీగల్ని తోలుకుంటూ, గడ్డిని నెమరవేస్తూ నించున్నాయి. బండివాడు ఎద్దులముందు నుంచుని అరక ఆపుతున్నాడు. రోడ్డు పక్కదారులమీద జనం గొడుగులుపట్టుకుని అటూఇటూ పోతున్నారు. వచ్చేపోయే జనాన్ని చూస్తూ కాళ్లను లెక్కబెడుతూ, పాదాలను చూస్తూ మునూ నించున్నాడు. "ఏమిటి? రాత్రి జరిగిన గడబడ అంతా అయిపోయింది కదా!" అనుకున్నాడు. కాని కొన్ని షాపులు యింకా తెరవలేదు.

రాత్రి యింత గలాభా జరిగి ఊరు యిప్పుడెలా ప్రశాంతంగా వుందో మునూకు అర్థంకాలేదు. ఎవరూ ఏమీ తనతో చెప్పకుండా నిగూఢ రహస్య మేదో దాచి వేస్తున్నా రనిపించింది. రాత్రి జరిగిన ఘటనలనుగురించి ఎవరూ మాట్లాడుకోకుండా, ఏమీ ఎరగనట్లు ఒకర్నొకరు తప్పించుకు తిరుగుతున్నా రేమి! దారమ్మట పోతున్న ఎవర్నైనా కలుసుకుని తమాషాగా భోగట్టా లాగుదామనుకున్నాడు. కిటికీమీద కాకివాలి "కా, కా!" మని అరుస్తోంది మునూ అటు చూశాడు. ఆలోచిన సాగడంలేదు. నాలుగురోడ్ల మొగిని పోలీసు ఒక పార్శీ వానితో సంభాషిస్తున్నాడు. పార్శీ గొప్ప ధనవంతుడు. మెల్లిగా వెళ్లి ఆ మాటలేమిటో చెవిని జారవేసుకుంటే రహస్యం తెలిసి పోతుంది. బండి వెనకాలకెళ్లి బికారివానిలా నటిస్తూ కిందపడ్డ ఆకులు ఏరు కుంటూ మునూ, ఆ మాటలేవో వింటున్నాడు: "అబ్బేబ్బే, మా పోలీసుల కందిన సమాచారంబట్టి ఎవర్నీ ఎవరూ ఎత్తుకుపోలేదండి"

"మరి మీ పోలీసులు ఏం చేసినట్టూ?"

"మేంలేకపోతే యీఊరే వుండేదికాదండి! మిల్లుఏరియా అమపులో కొచ్చేసరికి తలప్రాణం తోకకొచ్చిందండి. ఆఖరికి ఆర్మ్‌డుపోలీసుకూడా రావల్సివచ్చింది. ఎంత పెంకితనంగా నువ్వా అంటే నువ్వా అని పోట్లాడేరు. అయినాసరే సర్కారు మిలటరీనిమాత్రం రప్పించలేదు. ఎక్కడి కక్కడ అణచిపారేసి కంట్రోలు చేశామండి! తెల్లారేసరికి ఊర్ని మామూలుగా పువ్వులాచేసి పెట్టేశాం"

"మీరులేకపోతే ఈపూట జనాన్నిలా నడవనిచ్చేవాళ్ళేనా?"

"జనమేకాదండీ! కొంపలన్నీ పీకిపారేద్దురు! చావగొట్టి చెవులు మూశాంకనక సరిపోయింది...అంత అమల్జరక్కపోతే మిల్లు కూలీలు మామాట వింటారాండీ? ఇప్పు డెవళ్ళపన్లోకి వాళ్లు వెళ్లిపోయారు!"

"మిల్లుతీశారా?"

"స్ట్రయికూ గియికూ రాత్రితోనే సరండి."

మిల్లులో యథాప్రకారం కూలీలు పనులుచేసుకుంటున్నారనే వార్త మాత్రమే మునూకు ధైర్యంకలిగించింది. సరే, యిక తాను ఆలస్యంచేయకూడదు. సరాసరి, మిల్లుకి వెళ్ళిపోవాలి. హరికూడా మిల్లులోనే వుండివుంటాడు. అరఫర్లాంగుదూరం నడిచి వెళ్ళేసరికి యిద్దరు కాంగ్రెస్‌వలంటీర్లు మాట్లాడుకుంటున్నారు. వాళ్ళు చెబుతున్న మాటల్ని ఒక నూటువాలా రాసుకుంటున్నాడు. కాలికి దెబ్బతగిలినట్లు కుంటుతూ అక్కడే తచ్చాడుతూ కింద చతికిలబడి వేలిపై గాయంమీద రోడ్డుబూడిద అద్దుకుంటున్నట్లు నటిస్తూ మునూ, వారిసంభాషణ వింటున్నాడు: "ఈవేళ పొద్దున్న ఏడున్నరకి ఆల్వీ ఖాస్లీ లిద్దరూ ఒక ముస్లింతో మాట్లాడుతున్నారు. ఏదోలాగ రెండుపార్టీలవాళ్ళకీ సబోరీ చేద్దామని ప్రయత్నిస్తున్నారు."

"ఆల్వీ, ఖాస్లీలు ఎవరు?"

"లేబరు నాయకులు ..."

"సబోరీకి వచ్చారుకదా?"

"అహాఁ! అలా మాట్లాడుతూండగానే ఎవరో ఒకపార్టీ అతను వెనకాలగా వచ్చి ఆల్వీని కత్తితో పొడిచేడు."

"పొడిస్తే ఏం జరిగింది?"

"మిల్లులో కూలీల కీవార్త తెలిసింది. వందలకొద్దీ కూలీలు యివతల కొచ్చేశారు. తమ నాయకుణ్ణి పొడిచినందుకు ప్రతీకారంగా పఠాన్లమీద కలియబడ్డారు. పోలీసులు విచ్చుకత్తులతో, తుపాకులతో వచ్చి కూలీల్ని చావగొట్టారు. పోలీసులికి పఠాన్లెంతచెప్పితే అంత. గుంపు చెల్లాచెదురయింది కాని, వాళ్ళ దుంపతెగిన జనం, యూనియనాఫీసు ముందు గుమిగూడేరు. డెప్యూటీ కమిషనర్ కరోడా రకం. రెజిమెంట్లుకి రెజిమెంట్లు గుప్పించాడు. మెషిన్‌గన్లు గురిపెట్టాడు. పట్నం అంతా అదుపులోకి వచ్చేసింది."

"మరి మీరేం చేస్తున్నట్టు?"

"మిస్టర్ సిన్హా మేడలో హిందూ, ముస్లిం నాయకుల సమావేశం ఏర్పాటు చేస్తున్నాం."

ఇంతలో ఎవరో మహారాజులా వున్నాడు, కారుమీద వచ్చాడు. విలువైన దుస్తులు, లాంకోటూ, ధగధగ మెరిసే టోపీ ధరించాడు. వలంటీర్లు 'వందేమాతరం' అంటూ అతనికి స్వాగతమిచ్చారు. ఈ మహారాజపురుషు డెవరో మునూరు తెలియలేదు. కాని ఆయన్ని మాడగానే ఆకర్షణ పుట్టుకొచ్చింది.

"మీ నాయకులు ఏంచేస్తున్నారర్రా?" అని ఆయన ప్రశ్నించాడు.

సమాధానం రాలేదు. మళ్లీ ప్రశ్నించాడు. "కార్పొరేషన్ మెంబర్లేం చేస్తున్నట్టు? యువజన సంఘనాయకులు నిద్రపోతున్నారా? రాత్రిల్లా హిందువులు, పఠాన్లను నరికి పారేశారే, కాంగ్రెస్ ఏం చేసిందని? మిస్ మేయో ఇండియామీద చెణికిందంటే చెణకదూ? లేనిపోని వెధవ పోరు పాలూ మీరూనూ!" కాంగ్రెస్ వలంటీర్లేమీ మాట్లాళ్ళేదు. ఇంతసేపు నోట్ బుక్కుమీద రాసుకుంటున్న పత్రికా విలేఖరి ఆ"మహారాజపురుషుణ్ణి" ప్రశ్నించాడు. "మౌలానా హస్రతాలీసాబ్! ఇది దేశం మొత్తంమీద జరుగుతుందనుకుంటానే! హిందూముస్లిం కొట్లాటలూ..."

"ఆఁ! ఎందుకు జరగవూ?" ఆయన కాస్సేపుఆగి, "మమల్ని మేం రక్షించుకోవాలి. దేశం మొత్తంమీద ఆర్గనైజ్ చేయదల్చుకున్నాం"

"కాంగ్రెస్, శాంతిసంఘాల్ని ఏర్పాటు చేస్తోందండీ" అన్నాడు కాంగ్రెస్ వలంటీరు.

"చేస్తుంది, చేస్తుంది; మీరెప్పుడూ అలాగే చెబుతూ వుంటారు కబుర్లు. కబుర్లాని! శాంతి సంఘాల్ట! శాంతి సంఘాలు!" మౌలానా మరికొంతసేపు ఊరుకొని కోపంగా అన్నాడు: "ఈ లోపున ముస్లిముల్ని కాళికాదేవికి బలిర్తురుగాని! లంజకొడుకు హిందువులు పొద్దున్నే ముగ్గురు ముస్లింల్ని పొడిచి చంపేశారు; మహమ్మదీయ మిల్లుల్లో ఏభైమందిని చచ్చేట్టు తన్నేరు. వాళ్లనిపుడు ఆస్పత్రిలో కల్సుకుని యిటొస్తున్నాను. ఆస్పత్రిలో గాయంతిన్న వాళ్లందర్నీ చూశాను. లెక్కలుతీశాను. హిందువులకంటె, మహమ్మదీయు లకే ఎక్కువ దెబ్బలు తగిలాయి. మహమ్మదీయులే హెచ్చు."

"సలాం, మౌలానా" అంటూ పత్రికావిలేఖరి సైకిలు ఎక్కాడు. "ఏమయ్యోయ్! నీకు పుణ్యంవుంటుంది. నేన్చెప్పిందంతా అచ్చువేయ్

కంటూ" మౌలానా కేకవేసేలోపున, పత్రికావిలేఖరి సైకిలుమీద పిట్టలా ఎగిరిపోయాడు.

ఇంతలో యింకొక కారు బర్రునవచ్చి ఆగింది. కారులోంచి ఎవరో ఆసామీదిగి మౌలానాకు సలాంపెట్టాడు. కాంగ్రెస్‌వలంటీర్లు "వందేమాతరం" అంటూ స్వాగతమిచ్చారు. మౌలానా నిర్లక్ష్యంగా అటుచూడకుండానే సమావేశం జరుగనున్న పెద్ద మేడలోకి వెళ్ళిపోతున్నాడు. ఆయనవెంట కారులోని పెద్దమనిషి, పండిట్జీ, మదనమోహనమలబారీ మేడమెట్లు ఎక్కుతున్నాడు. కార్లు యిక వెనక్కి వెళ్ళిపోవచ్చని డ్రైవర్లకు వలంటీర్లు సౌజ్ఞ చేశారు.

సమావేశం జరుగుతున్న మేడమీదకు తనూవెళ్ళి 'కథాకమామిషూ' తెలుసుకోవాలనుకున్నాడు మునూ. అందర్నీ వెళ్ళిపోనిచ్చి తానూ మేడమెట్లు ఎక్కి ద్వారంచెంత చాటుగా నిలబడ్డాడు. కాంగ్రెస్ వలంటీరు అతన్ని గద్దించాడు: "ఎవర్రా నువ్వు! ఛో" మేడమెట్లు దిగుతూంటే బజారులోంచి తుపాకీపేలిన ధ్వనులు ధన్‌ధన్‌మని వినిపించసాగాయి. రోడ్డుమీదకురాగానే ధ్వనులు విపరీతమయాయి. ముందుకుచూశాడు. నరసంచారం లేదు. బెహండీ బజారులో తుపాకుల్పేలుడు. బజారులోంచి తుపాకీదెబ్బలకు గురయిన మనుషులు, కాళ్ళుతెగిన, గుండు గుండెల్లో దూసుకుపోయిన మనుషులు వొరిగిపోతున్నారు. జనం చెల్లాచెదురుగా అటూ ఇటూ సందుగొందుల్లోకి తప్పుకుంది. కుంటుకుంటూ యిటే కొందరు వస్తున్నారు.

అరుపులు, దెబ్బలు, గోల, తుపాకుల్మోత. మెషీన్‌గన్లకు ఆహుతి అవుతున్న మనుషుల సంఖ్య అతనికి అందలేదు. మనిషి కొయ్యబారిపోయాడు. తన వెనకా, ముందూ, తుపాకులు మళ్ళీ మ్రోగాయి. చెట్లు వణికెత్తిపోతున్నాయి. వీధులు ఊగిపోతున్నాయి. మలబారుహిల్సు దగ్గర ఏమీ ప్రమాదం జరుగుతున్నట్లు కనిపించడంలేదు. కొండలమీద బంగాళాలు నిశ్చలంగా, ధైర్యంగా వున్నాయి. తుపాకుల ప్రేలుళ్ళు ఆగిపోయాయి. కాని జనుల గల్లంతు యింకా వినిపిస్తోంది. రోడ్డు చివరకు వచ్చి వెనక్కిచూశాడు. ముచ్చెమటలుపోశాయి. గుండెదడపుచ్చుకుంది. శరీరం పట్లుతప్పింది. స్వాధీనంలో లేదు. ఆకలి కరకరలాడుతున్నది. అడుగు ముందుకు పడ్డంలేదు. "ఎక్కడికి? ఎక్కడికి? ఎక్కడికి?" అనే ప్రశ్నలు తుపాకిగుండుల్లాగ అతన్ని వెంటతరుముతున్నాయి.

"కాళ్ళు తడబడుతున్నాయేం, నాశక్తేమైనట్టు?" అనే ప్రశ్నకు ఆకలే సమాధానం. అతని కళ్ళముందు నేలకొరిగిన మనుషులు, పళ్ళు గిట్టకరుచుకుని చనిపోయిన మనుషులు గిర్రునతిరుగుతూ నేలను కరుచుకుపడ్డవాళ్ళు అనేకులు! వీళ్ళని పిట్టల్ని తరిమినట్టు తరిమి, కుక్కల్ని కాల్చినట్టు కాల్చిపారవేశారు కాబోలు పోలీసులు! స్వాతంత్ర్యరాజ్యం యిది. ఇక్కడ మనుషులకిక తావులేదు. మరణవేదన పడుతున్న ప్రాణి ఎలా గిజగిజమని తన్నుకుంటుందో అతనికి అనుభవమే. తన గ్రామంలో కసాయివాడు గొర్రెల్ని కైమా చేస్తున్నపుడు, మేకల్ని అమ్మవారికి బలియిస్తున్నపుడు 'మే మే మే' అని గిలగిల కొట్టుకుంటున్న మేకల, గొర్రెల మరణవేదన తాను కళ్ళారాచూశాడు. వీళ్ళూ అంతే! వీళ్ళు మాలీమేకవంటి మనుష్యులు. మరణవేదన ఎవరికైనా అనుభవించడం కష్టమే. నోరులేని జంతువుకీ, నోరున్న మానవుడుకీ మరణంఒకటే! తాను ఎన్నోసార్లు చనిపోయి బతికేడు. మరణవేదన అతనికి తెలుసును. జీవితంలోని అగాధాలు, జీవితసముద్రంలోని శీతల ఉష్ణజలప్రవాహాలు, జల పాతాలు యిప్పుడతనికి అర్థమయాయి!

కాని ఎవరి నుదుటను ఎలారాసివుందో, ఒకరి విధికి ఒకరు కర్తలు కాదు; తన కర్మకు యితర్లనని యేం లాభం! వేదాంతం దారి వేదాంతానిది. జీవితందారి జీవితానిది. జీవితంమీద అతనికి మక్కువ ఎక్కువ. కనిపించే దృశ్యాలు కనులను చెదరగొడుతున్నవి. నాగరికత ప్రసాదిస్తున్న వస్తు సముదాయం అతనికి మోజును కలిగిస్తున్నది. ప్రతి అందమైన వస్తువుమీద అతనికి మోజే! నల్లనిబూట్లు, గడియారాలు, దొర టోపీలు, నాజూకయిన బట్టలు, వీటిని చూసినప్పుడల్లా చిన్నతనంలోని ముచ్చట్లు జ్ఞప్తికి వస్తాయి. పసివానివలె అతని హృదయం పరుగులు తీస్తుంది. దారమ్మట వెడుతూంటే యిరుపక్కలా కనిపించే మిఠాయి దుకాణాలు నోరూరిస్తున్నవి. దుకాణాలు తప్ప మనుషు లెవరూ లేరు. ఎక్కడా సందడిలేదు. ఊరుమాటు మణిగినట్లుంది. ఎడమవైవు సముద్రం కనిపిస్తున్నది. కుడిపక్క మలబార్ హిల్సుమీద దొరల బంగళాలు తోటలు, అవతల హార్బరు, మైదానం. చతురస్రాకారంగా వున్న బంగాళా ముందు పూలతోట, పూలతోటచుట్టూ రెండువరసలుగా చెట్లు. బంగాళాను చూసేసరికి వింతగా భయం పుట్టుకొచ్చింది. చూపులు మరల్చుకొని, మైదానం వంక పరిశీలనగా చూస్తూ రోడ్డుమధ్య నిలబడ్డాడు. ఎంత అందమైన దృశ్యం!

బర్‌బర్‌మంటూ కారు ఒకటి చరచరావచ్చి బఁయ్‌మంది. కారు హార్న్ మోగేలోపునే తప్పుకుందా మనుకుంటూనే తొందరలో కిందపడి పోయాడు మునూ. కారు ముందుచక్రాలు గబగబా అతనికిమీంచి దొర్లుకు పోయి తక్కుని కారు ఆగిపోయింది.

"అరెరే! పొద్దున్నే ఎవరిమొహం చూశానోకాని..." అంటూ మిసెస్స్ మెయిన్ వార్నింగ్ అరిచింది : "ఈదేశంలో అడుగుపెట్టానో లేదో, హిందూ ముస్లిం కొట్లాటలూ...యిదో గండమూను! బాగానే దాప రించాయి నాకు" మిసెస్ మెయిన్ వార్నింగ్ మునూ గుండెలమీద చెయ్యి వేసింది. తలపట్టుకు చూసింది. "ఏమిటి గత్యంతరంఅమ్మా" అంటూ ఆమె చిన్నకూతురు ఆదుర్దాగా ప్రశ్నించింది. "గత్యంతరం ఏమీలేదు. ఎవరైనా చూస్తే ప్రమాదం! రాళ్లుచ్చుకుతంతారు. కారులో ఎక్కించుకుపోదాం."

నౌకరును మునూని కారులో పడేయమని చెప్పి "నీకు తెలియదు; వీళ్ళు రౌడీపీనుగులు! చూస్తే ఊరుకోరు మనల్ని...మనతో వీణ్ణి సిన్లా తీసుకుపోదాం...చచ్చిపోడులే...మనకు నౌకరుకూడా లేడాయె!"

మిసెస్ వార్నింగ్ నౌకరు మహమ్మదీయుడు. కిందపడిన మునూ హైందవుడు. వీడుచస్తే తనకేమనిపించింది కాని, అమ్మగారి ఆర్డరయింది కనక మునూను ముట్టుకోక తప్పిందికాదు. మునూ ఒక్కడే కనిపించివుంటే వాడి పీక పిసికేసివుండును. గత్యంతరంలేక అతన్ని ఎత్తుకొని కారులో పడవేశాడు.

"తాజ్‌హోటల్‌లో వున్న లగేజి త్వరగా ఎక్కించు" మిస్సెస్ మెయిన్ వార్నింగ్ హుకుం జారీచేసింది : "త్వరగా పోనీయవోయ్ కారూ! సిటీలోంచిమాత్రం పోనీయకు. కొలాబాగోడ్డు మీంచిపోనీయ్. పూనాల్లో రాత్రి భోజనం... తెలిసిందా...మరి ఎంత స్పీడులో పోనిస్తావో, కారుని."

## ౫

బొంబాయి పొలిమేరలను దాటి, కారు వేగంగా వెళ్లిపోతోంది. దారిలో మునూ కళ్లు విప్పి చూశాడు. రాత్రి భోజనానికి బరోడా చేరుకున్నారు. అక్కడ అతనికి స్పృహ వచ్చింది. రెండురోజులు కారుమీద ప్రయాణం చేసేసరికి మనిషి కొంచెం తేరుకున్నాడు. కాని మనసులో మాత్రం బెంగపడింది. పట్టెడు మెతుకులకోసం, పొట్ట చేత్తో పట్టుకుని దేశం కాని దేశం వచ్చి, ఎన్ని బాధలు పడ్డాను అనే ఒక భయం అలముకుంది. ముందురోజులు యింకెంత గడ్డుగా వుంటాయోకదా! ధనం, అధికారం, అనేవి పర్వతాలవంటివి. వీటిముందు తనబోటి పేదల తిరుగుబాటు చిన్ని సెలయేళ్ల వంటివి. పర్వతాలను సెలయేళ్లు ఏం చేయగలుగుతాయి కనక! రతన్ పోరాడేశు. పోరాడి ఏం సాధించుకున్నాడు? లక్ష్మి, పాపం హరి, వాళ్ల పిల్లలు! వీళ్లంతా ఏమైపోయారో అనే ఆందోళన అతనికి కలిగింది. ఈ ఆందోళన ఆవేదన అతని పడుచుదనాన్ని హరించివేశాయి. ముసలికాలం దాపురించినట్లు నిస్సహాయుడుగా యిక్కడ చిక్కుపడిపోయాడు. మిసెస్ మెయిన్‌వార్నింగ్‌కు మాత్రం అతను ముసలివాడుగా కనబళ్ళేదు. అలా అయితే అతన్ని అక్కడే దిగవిడిచి వుండేది. ముసలివాడూ కాడు, నడివయసులోనూ లేడు. మంచి కుర్రవాడు! యువకుడు, కనిపించేసరికల్లా ఆమె మనసు అనేక ఆలోచనలమీదికి పోయింది. మెత్తని నున్నని శరీరం, సొగసైన మోము, నాజూకయిన గడ్డం; అతని కనులలో ఏదో అపూర్వ కవిత్వం తొంగి చూస్తున్నట్లు ఆమెకు అనిపించింది: "నీకిప్పుడు ఎన్నోయేడు?"

"పదిహేనేళ్ళండి అమ్మగారూ" తన నల్లనికనులతో అతని నల్లని కనులలోకి గుచ్చిగుచ్చి చూసింది. తన పొడుగైన చేతులను చాచి, అతని చీలమండమీద మెల్లగా గిల్లింది. వేళ్ళలో వీణను మీటుతున్నట్లు, భుజాలను తాకింది. నుదురు నిమిరింది. సీటుమీదకు జేరబడి ఒక్క దీర్ఘ నిట్టూర్పువిడిచి, కిచకిచమని నవ్వింది. కళ్ళతో బాసలుచేసింది. కుర్రవాడిది మంచివయసు. పదిహేనేళ్ళ పిల్లవాడే ఆమెకు అవసరం. తానొక ముసలివాణ్ణయిపోయానని మునూ పడుతున్న ఆవేదన ఆమెకు తెలియదు. తెలియవలసిన అగత్యమూ

లేదు. ఆమెకు కావల్సిందల్లా నౌకరు కుర్రవాడు. అతన్ని కొంచెం జాగ్రత్తగా చూస్తే, యింత తిని నానాచాకిరీ చేస్తూ తనగుమ్మంలో పడివుంటాడు.

మిసెస్ మెయిన్‌వార్నింగ్ ఆంగ్లో-యిండియనుల బిడ్డ. ఆమె తాత ముత్తాతలు భారతదేశాన్ని, ఈస్టిండియాకంపెనీ ఆక్రమించుకునేకాలంలో కంపెనీకి మద్దతుగా సైనికులుగాచేరి తమ జీవితాలను ధారపోశారు. సిపాయీల కలహంలో జాన్ నికల్సన్ తరఫున ఆమె తాతగారు పోట్లాడి అధికారుల మన్ననలను పొందేడు. ఒక ముస్లిం చాకలియువతిని చేరదీసి ఒక కొడుకును కని, తనమానాన తానుచనిపోయాడు. కొడుకు పేరు విలియమ్ స్మిత్. యూరేపియన్ ప్రత్యేక సైనికదళంలో విలియం స్మిత్ సార్జంటుగా చేరి, మన్నో అభిమానానికి పాత్రుడయాడు. భారతదేశంలోని భారత సైనిక పటాలాలను బ్రిటిష్ ప్రభుత్వం తన అదుపు ఆజ్ఞలలోకి తీసుకున్నతర్వాత, యీ పటాలం రద్దుఅయింది. అప్పుడు విలియమ్‌స్మిత్‌కు ఒకప్రశ్న ఎదురయింది.

బ్రిటిష్ పటాలంలో చిన్న ఉద్యోగిగా చేరడమా, లేక వీదో సంస్థాన పటాలానికి అధికారిగా వెళ్ళి అంచీలమీద పెద్ద ఉద్యోగి కావడమా అనే ప్రశ్న అతన్ని కొంతకాలం వేధించింది. బ్రిటిష్ పటాలంలోకంటె సంస్థానాధీశుల పటాలంలో అధికారం హెచ్చు. కాని జీతం తక్కువ. బ్రిటిష్-ఇండియన్ సైనిక పటాలంలో వుండడం కంటె తెల్ల ఉద్యోగికి సంస్థానాధీశుని కొలువే మంచిది. తనది తెల్లరంగు కనక, యిట్టే అవలీలగా సైనికాధికారి కావచ్చును. ఈ తలంపుతో విలియమ్‌స్మిత్ జాలింపార్ నవాబు పటాలంలో సరాసరి కర్నలుగా చేరాడు. కర్నలుగా చేరాక, ఒక ఇంగ్లీషుపిల్లను వివాహం చేసుకున్నాడు. ఆవిడొక యింజను డ్రైవరు కూతురు. వారిద్దరికీ 'మే' అనే అమ్మాయి పుట్టింది. కూతురుపుట్టి ఏడాది గడిచిందో లేదో భార్యాభర్తల కిద్దరికీ ఎడబాటు కలిగింది. ఎడబాటుకు కారణం యేమీలేదు; తన కింకొక మగవానివల్ల అనతికాలంలోనే బిడ్డ పుడుతుందనే అనుమానం స్మిత్తు భార్యకు కలిగింది.

'మే'ను ఒక కేథలిక్ మతాచార్యుని భార్య చిన్నతనంనుంచీ పెంచింది. చదువుకునే యీడువచ్చాక కాన్వెంటులో చేరింది. కాన్వెంటులో చదువుకునే పిల్లలంతా పెద్దపెద్ద యింగ్లీషువాళ్ళ బిడ్డలు. తనేమో చిన్న ఉద్యోగి కూతురు. వాళ్ళెప్పుడూ యింగ్లండుగురించీ, తమకుటుంబాల గొప్పదనంగురించీ మాట్లాడుకునేవాళ్లు. అందువల్ల అందరిలోను తాను తక్కువదాన్ననే

న్యూనతాభావం 'మే' కు కలగజొచ్చింది. ఈభావం ఒకవ్యాధివలె ముదర సాగింది. తాను ఫక్తు తెల్లదొరసానులపిల్ల కాకపోయె; ఇంతమందిలోనూ తలఎత్తుకు ఎలాతిరగడం? తానూ ఒక తెల్లదొరసానినైనట్టూ, ఆమె తాత ముత్తాతలకు ఇంగ్లండులో జమీలేవో వున్నట్టూ, కాకమ్మకథలల్లి పిల్లలకు చెప్పజొచ్చింది. శరీరంనిండా పౌడరు పులుముకుని వన్నె కాపాడుకుంటున్నది. కాని పిల్ల లీకథల్ని నమ్మడంలేదు. స్కూలుకు వెళ్ళడమంటే ప్రాణాంతకంగా వుంది పిల్లకు. కొసకు స్కూలు విడిచిపెట్టి తండ్రిదగ్గరకు వెళ్ళిపోయింది. ఎంతత్వరగా యింగ్లండువెళ్ళి పవిత్రత సంపాదిద్దామా అని ఉవ్విళ్ళూరింది. కాని ఆమెతండ్రి కాపాటిడబ్బు సత్తువలేదు. ఇది కారణంగా ఇద్దరికీ కీచులాట ఆరంభమయింది.

కాని కొన్నాళ్ళకు 'మే' ఆశలు ఫలించాయి. తండ్రిప్రసక్తి లేకుండానే ఆమె యూరప్ వెళ్ళగలిగింది. ఏ శరీరపు వన్నెనైతే చూసి తను యిన్నాళ్ళూ చీత్కరించుకుని, అందుకోసం యూరపువెళ్లి తెల్లబడివద్దామనుకుంటున్నదో, ఆ శరీరపురంగును చూసి ఒక జర్మన్ యువకుడు మోహవిభ్రాంతుడయాడు. అతనిపేరు హెన్రిక్ అల్మర్ - జాలింపార్ సంస్థానంలో పెద్దపెద్ద జాగీరుదార్లను యిచ్చకాలాడి వారి ఫొటోలు రాసి, పైసా పరకా ఆర్జించుకుంటున్నాడు. ఈ జర్మన్ చిత్రకారుణ్ణి ప్రేమించి పెళ్లి చేసుకుంటే తను యూరపు పోవడానికి అదే ప్యాస్‌పోర్టు అవుతుందని 'మే' ఉవ్విళ్లూరింది. ఇంతకాలం కాన్వెంటులో బోధించిన బ్రహ్మచర్యం తిరగబడి పురుషుడు కావాలనే కోర్కె పీడించసాగింది. ఆమె వెంటనే అల్మర్‌ను పెళ్ళిచేసుకుంది. కాని దురదృష్టవశాత్తు 'మే'కి పెళ్ళయిన రెండేళ్ళకే యుద్ధం వచ్చిపడ్డది. యుద్ధం రావడమేమిటి, జర్మన్ చిత్రకారుణ్ణి కాన్సెంట్రేషన్ క్యాంపులో పడేయడమేమిటి, రెండూ ఒకేసారి జరిగిపోయాయి. యుద్ధం రాకపూర్వమే 'మే'కు ఒక ఆడపిల్ల కలిగింది. ముద్దుముద్దుగా ఆ పిల్లను వెనీలోప్ అని పిల్చుకుని దంపతులు ఉబ్బిపోయేవారు. యుద్ధం వచ్చాక ఒక పిల్లవాడు పుట్టాడు. ఇపుడు 'మే' యిద్దరు బిడ్డల తల్లి.

భర్త చనిపోయేడనే వార్తరాగానే ఆమె దుఃఖించకపోలేదు కాని అదేమిటో, అతనితో యిన్నాళ్లు తాను కాపరం చేసినా, తాను ఒక కన్యననే భావం ఆమెకెపుడూ వుండేది. ఆమె చేతిని అతను పట్టుకుని తన భుజంమీద వేసుకున్నా, చేతులతో నడుమును చుట్టివేసి వొళ్లో కూచోబెట్టుకున్నా

పిరుదులమీద తట్టి, మెడవాసనచూసినా, ఆమెతనొక కన్యననే అనుకునేది ఇదంతా తనకేమీ సంబంధించని వ్యవహారంగా భావించేది. చిన్నతనంనుంచీ నూరిపోసిన క్రైస్తవమత సిద్ధాంతాలు, యిచ్చిన శిక్షణ, ఆమె మనస్సులో అంతర్గతంగా ఏదో మూలను దాక్కొని వెక్కిరించినట్లనిపించింది. అయితే ఆమె అతన్ని ముద్దుపెట్టుకున్నా, బాహువులలో లతవలె అల్లుకున్నా, ఈ కోరికలకన్నీ కారణం ఆమెలో వున్న భారతీయ రక్తం. కోరికలు రేగి, మనిషిని అల్లకల్లోల పరుస్తున్నపుడు వెంటనేపోయి మంచుగడ్డవేసిన నీళ్ళల్లో స్నానం చేద్దామన్నంత ఆవేశం పుట్టుకొచ్చేది. పురుష సాంగత్యమనేది తగదని అది క్రైస్తవ మతసిద్ధాంతాలకు వ్యతిరేకమని ఆమె నమ్మకం. కోరికల విజృంభణ పాపం, అనే యీ రెండు శక్తులమధ్య ఆమె కొట్టుమిట్టాడింది. కాగా ఆమెకు చిత్తం భ్రమించింది. పిచ్చి ఎక్కలేదు కాని పిచ్చికుదరగా రోకలి తలకుచుట్టుకున్నంత వివేకం మాత్రం పుట్టింది. కాగా ఆమె ఆలోచనలన్నీ ఎగుడు దిగుడులే. దీనితో ఆమె బుద్ధికి తిరకాసు వచ్చింది. వింత వింత మాటలు, తమాషా పోకడలు, రకరకాల ధోరణులు ఆమెకు అలవడ్డాయి. చూపులకు తగిలిన అందగాడిమీద మనసు పోయింది. ఎర్రగా బుర్రగా వున్న ప్రతివాడితో కేరింత లాడాలనే కోరిక పుట్టింది. మొదట ఎవరైనా కాస్త మొహమ్మాటం పెడితే కాదనలేకపోయింది. తరవాత తనకుతానే మగ వాళ్లను మొహమ్మాటపెట్టి యిబ్బంది పెడుతోంది. బంగాళాకు వచ్చే ప్రతి మనిషితోనూ ముద్దులు, ఆలింగనాలు, జల్సాలు సాగించజొచ్చింది.

ఆమె నల్లని కేశపాశాలకు ఆగా రజా అలీషా అనే పురుషుడు చిక్కుకుపోయాడు. ఏమి మరులుగొలిపిందో, ఏమి ఉరులుపోసిందో కాని, అతను ఆమె కనుసన్నలలో మసలుకుంటున్నాడు. అలీషా నవాబు పటాలంలో కెప్టెనుగా పనిచేస్తున్నాడు. పుట్టుకచేత పెర్షియన్. దీనికితోడు అల్లిబిల్లి కవిత్వం కొంత. ఏవో గీతాలు పాడుకుంటూ, అల్లుకుంటూ ఆమె సౌందర్యా రాధనలో పడిపోయాడు. సౌందర్యానికి ముగ్ధుడయాడని కాదుకాని, ఆమెను అతను ప్రేమించాడు. 'మే' అనేకమందిని చూసింది. అనేక రుచులను అనుభ వించింది. కాని యితనిపోకడే వేరు. అందరికంటె, కొసకు తనభర్త హెన్రిక్ కంటె నాగరికతకలవ్యక్తి. అందరికంటె మనిషి పొడుగు. జబరైన విగ్రహం. విగ్రహానికి తగ్గ కండబలం. బలానికితగ్గ హొమక్కు. హొమక్కుకుతగ్గ శృంగారం. కాని అతను పెర్షియా దేశస్థుడు. అతన్ని పెళ్ళాడితే తన

ఇంగ్లీషుజాతికి తలతంపులనే పౌరుషం ముంచుకొచ్చింది. అయితే అతను ఆమెను అలా యిలా వొదిలిపెట్టక, యిట్టే పెళ్ళాడేశాడు. పెళ్ళాడేసిన ఆ ముందువున్న ప్రేమ, యిట్టేపోయింది. 'మే' తనొక ఆంగ్లవనిత ననే అహంకారం చంపుకుందికాదు. ఆలీషాను వేధించసాగింది. అతన్ని, తనకొక నౌకరు కుర్రాడిలా చూడసాగింది. చీటికీ మాటికీ అమ్మాయిగారికి చిర్రు బుర్రులే. నిమిష నిమిషానికీ కోపతాపాలే. ఇంట్లోనే కాకుండా కొసకు అతని ఆఫీసుకూడా వెళ్ళి జగడం పెట్టేది. ఒకరోజున యిద్దరూ మాటా మాటా అనుకున్నారు. ఆలీషా ఆమెజుత్తుపట్టుకుని గొరగొరా యీడ్చి బయటకు నెట్టి గది తలుపులు వేసుకున్నాడు. కాని జరిగినదానికి ఆమె విచారించలేదు. శని విరగడయిందనుకుంది. అప్పటికే ఆమెకూ, మరొక యింగ్లీషు ఉద్యోగికీ 'యిలాకా' వుందని వూళ్లో పుకారు పుట్టింది. అతని పేరు గ్రై మెయిన్ వార్నింగ్ అతను తనకన్న వయసులో చిన్న కనక ఎలాపడితే అలా ఆడించవచ్చని ఆమె ఊహ. ఒకరోజున నవ్వుతూ అతని భుజాలమీద గడ్డం ఆనించి "మీరు పిల్లాడు పుడుతున్నాడెంచక్క" అన్నది. ఇందుకు గ్రై మెయిన్ వార్నింగేమీ ఆశ్చర్యపడలేదు.

మహమ్మదీయ మతాచారం ప్రకారం విడాకులు పొందడం సులభం. వెంటనే ఆలీషాకు విడాకులు యిచ్చి గ్రై మెయిన్ వార్నింగ్‌ను పెళ్లాడి 'మే', శ్రీమతి మెయిన్‌వార్నింగ్ అయింది. వివాహమయిన కొన్నాళ్లకు ముద్దు ముద్దుగా శ్రీమతి మెయిన్‌వార్నింగ్, భర్తను ఒక కోరిక కోరింది: "ఇంగ్లండు వెళ్ళి కాన్పు తరులాసాగా మనమిద్దరం..." శ్రీమతి కోరికను అతను కాదనలేకపోయాడు. ఆరు నెలలు సెలవు సంపాదించి భార్యతో యింగ్లండు చేరుకున్నాడు. ఇంగ్లండులో భార్య ప్రసవించినందుకు భర్త సంతోషించాడు. కాని, తీరా పిల్లవాని మొహం చూశాక, గ్రై మెయిన్ వార్నింగ్ మొహం నల్లబడింది. పిల్ల, రూపురేఖలు తనవికావు. రంగుకూడా తనదికాదు. అచ్చం ఆలీషా రూపురేఖల్ని పుణికి పుచ్చుకుంది పిల్ల. ఒకసారి యిద్దరికీ మాటా మాటా వచ్చి ఆవిడ కోపంలో, వున్నమాటకాస్తా అనేసింది. తనకుపుట్టిన బిడ్డకు ఆలీషాయే తండ్రి అని చెప్పేసింది. గ్రై మెయిన్‌వార్నింగ్ అల్లాయిటుల్లాయి పిల్లను చేసుకోవడం అతని తల్లిదండ్రుల కెంతో నామర్దా అనిపించింది. తమ ఆంగ్ల సంప్రదాయాన్నీ, కుటుంబ పరువు ప్రతిష్ఠల్నీ మంట గలిపినందుకు కోపగించి, అతన్ని పలకరించడం మానేశారు. పలకరించడమేకాదు, అతని

మొహమే మొద్దంలేదు. అతనికిది నిజంగా ఎంతో బాధాకరంగా తోచింది పసిపిల్లవాడిలాగ, తన శ్రీమతి కౌగిలిలో కరిగిపోతూ, తన దుఃఖాన్ని అవలీలగా మర్చిపోయాడు. వాస్తవికపరిస్థితులనుంచి తప్పించుకుని ఉష్ట్రపక్షిలాగ యిసకలో తలదూర్చి కాలక్షేపం చేయడం యింగ్లీషువాళ్ల కలవాటు. గ్రైమెయిన్ వార్నింగ్ ఇంగ్లీషువాడే కనక యదార్థపరిస్థితులనుఎదుర్కోక, తనూ, తన భార్యా, తన ఉద్యోగమే సర్వస్వంగా భావించాడు. తనభార్య వ్యవహారాలుకూడా అతను పట్టించుకోలేదు. కొన్ని ఏళ్లు తపస్సు చేయగా చేయగా దేవుడు వరమిచ్చినట్లు 'మే' యింగ్లండులో కాపురంపెట్టే అదృష్టం కలిగింది. ఇంగ్లండొక స్వర్గం, ఈ స్వర్గంనుంచి తనకి వెళ్లిపోవడం తప్పదనేసరికి ఆమె గుండెలు కొట్టుకోసాగాయి. గ్రైమార్నింగ్ సెలవు అయిపోవచ్చింది. పెషావరుపోయి తన డ్యూటీలో చేరాలి. అతను తన డ్యూటీలో చేరాడు, కాని మే మాత్రం యింగ్లండులోనే వుండిపోయింది. పాలిటెక్నిక్‌లో డిప్లొమా సంపాదించి వస్తానని, పిల్లలు ఎదిగాక భారతదేశం తను వెళితే మంచిది కదా అని భర్తకు ఆమె నచ్చచెప్పింది. మే, కౌగలి ఎంతో మధురమైనది. ఆమెపెదవుల తీపి తనెన్నడూ మర్చిపోలేడు. తన అందాలరాణి కోరిన కోరికను గ్రైమార్నింగ్ కాదనలేకపోయాడు. కాదనలేకపోవడమేగాక, తనభార్య కష్టపడిపోతుందేమోనని, తన జీతంలో సగం, నెల నెలా ఆమెకు ముట్టేటట్టు యేర్పాటుచేసి మరీ వెళ్లిపోయాడు. జీతమే కాక, తన తల్లివల్ల వచ్చిన ఆస్తిలో సగం ఆమెకు రాసియిచ్చాడు. పెషావరులో అతని మనసు యేమీబాగుండలేదు. సరిహద్దు గ్రామాల్లో మహమ్మదీయ కొండజాతులవాళ్ళు లేవదీసే పితూరీలను అణచి బ్రిటిష్ సామ్రాజ్యాన్ని కాపాడుతూ వచ్చేసరికి అతని తలప్రాణం తోకకు వస్తోంది. పరిపరివిధాలపోతున్న మనసును బిగబెట్టుకుని శ్రీమతికి ప్రేమలేఖలు రాస్తూ సంతృప్తి చెందుతున్నాడు.

ఇంగ్లండులో మే కులాసాలకేమీ లోటులేదు. నెల నెల వచ్చే జీతం; ఎక్కడాలేక్కా సినిమాలు, విందులూ, వినోదాలూ, రాత్రి క్లబ్బులూ ఆమెకు కావలసిన ఆనందాన్నిస్తున్నాయి. హోటళ్లల్లో దిక్కూ మొక్కూ లేకుండా పడివున్న ఆంగ్లో-ఇండియన్లతో పరిచయం స్నేహంసంపాదించి, నిజమైన తెల్లదొరలతో సావాసం చేస్తున్నానని ఆమె సంతోషించింది. ఇక ఆవిడ సంస్కృతిని రూపొందించుకోవడమే తరువాయి. చదివిన ప్రతి పద్యమూ అది బోధపడకపోయినా, "అవునవును! ఎంతబాగుంది కవిత్వం" అంటూ మెచ్చుకో

సాగించె. కంటపడ్డ ప్రతి కంగిరి బింగిరి గీతలూ ఆమెకు మహాద్భుతమైన తైల-చిత్రాలవలె కనిపించసాగాయి. కవి అన్నవాడెవడు కనిపించినా అతనితో సరససల్లాపాలు సాగించజొచ్చింది. చిత్రకారుడు ఎదటపడితే ఆమె చూపుల నుంచి వొసిలించుకు పోవడం అతనికే కష్టమనిపించేది. ఆ పాటీ పాటి కళాకారులతో కాలక్షేపంచేస్తూ పగలూ, రాత్రీ ఒకపూటవలె గడుపుతూ రసజ్ఞురాలనే బిరుదు సంపాదించుకుంది. ఒక పిల్లకవిగారు రసజ్ఞతగురించి వొకనాడు ఉపన్యసిస్తూవుంటే, ఆమె ఆనందోద్రేకాలను అణచిపెట్టుకోలేక గబుక్కున ఆయన చెంతకు వెళ్ళి "మీ ఆటోగ్రాఫు కావాలండీ" అని నాజూకు వొలకబోస్తూ చిర్నవ్వు నవ్వింది. అతన్ని మెల్లిగా బుట్టలోవేసుకుని బొహీమియాకు ప్యాసుపోర్టు సంపాదించుకుంది. కాని ఆమె నాగరికత సభ్యత చాలా తక్కువ తరగతిలో వున్నవని, ఆమె వొట్టి పేలుడుకాయ అనీ, మిత్రులు కొంత కాలానికి ఆమెను వెంట బెట్టారు; ప్రతి హాలివుడ్ ఫిల్మును తెగ పొగుడుతూ అదీయిదీ వాగుతూ వచ్చేసరికి మిత్రులకు తలనొప్పివచ్చి 'దీనికి టేస్టులేదని' తేల్చివేశారు.

కాని హైమార్నింగ్ మాత్రం ఆమెను భారతదేశం రారమ్మని బతిమాలుతూ, ప్రాధేయపడుతూ, దీనంగా ఉత్తరంమీద ఉత్తరం రాస్తూనే వున్నాడు. 'అయ్యో, నేనొచ్చేస్తే ఎలాగండీ! రాల్ఫుచదువు పాడయి పోదుటండీ! పెన్నీలోప్ యీ ఏడైనా ప్యాసవలూరి?" అంటూ ఏదో ఒకసాకు చెబుతూనేవచ్చింది. వాళ్ళిద్దర్నీ బోర్డింగుస్కూళ్ళో చేర్పించి, చేతి పిల్లతో చక్కారాకపోతే తనిక ఉద్యోగం చేసేటట్టులేదని హైమార్నింగ్ జవాబురాశాడు. "సరేలెండి, ఒక ఏడాదిపాటు అక్కడేవుంటా"నని ఆమె సమాధానం రాసింది. ఈ షరతులకు ఇద్దరూ అంగీకరించగా, 'మే' యింగ్లండునుంచి బయలుదేరింది. కాని "ఎండాకాలం చచ్చిపోతాను సుమండీ, ఆ దిక్కుమాలిన పెషావర్లో! సిమ్లాలో ఓ మేడ అద్దెకుతీసుకోండి, మీకు పుణ్యముంటుందని" భర్తను భార్య ముందే హెచ్చరించింది. ఇదివొక షరతుగా పరిణమిస్తే ఎలాగా తాను బద్ధుడుకాక తప్పదని అతను వెంటనే సిమ్లాలో ఒక మేడ అద్దెకుతీసుకుని అట్టేపెట్టాడు. అతనింకా సెలవుపెట్టి సిమ్లారాలేదు కాని, ఆమె ముందుగానే వచ్చింది. ఆనండేల్ భవనంలో తన నౌకర్లతో 'మే' హాయిగా కాలం వెళ్ళబుచ్చుతున్నది. హైమార్నింగ్ పది

హేను రోజులు సెలవుపెట్టి సిమ్లా వస్తున్నానని ఉత్తరంరాశాడు కాని, ఆమె ఆవుత్తరాన్ని పూర్తిగా చదవలేదు.

ఆమె దర్జా, డాబు, దర్పాలు చూసి మునూ ఆశ్చర్యపడ్డాడు. ఇంతవరకూ తనను ఏ తెల్లదొరసానీ యింతగా ఆదరించలేదు. తను కనిపించేసరికి నల్లవాడని అసహ్యించుకునేవారు. ఈవిడ అలాకాదు. ఎంతో అభిమానంతో చేరదీస్తోంది. నిజం; శ్యాం నగరంలో వున్నప్పుడు శైలను చూసినప్పుడల్లా మునూ హృదయం వెర్రిగెంతులు వేసేది. ప్రభుదయాల్ భార్య తొడమీద తలఆనించి నిద్రపోతున్నప్పుడు, ఆమె తన వేళ్ళతో అతనిజుత్తును సవరించి ఊరడించినపుడు అతనికెంతో హాయి అనిపించింది. లక్ష్మిమీద, తెలియకుండానే, ప్రేమ ఉదయించింది. కాని వాళ్ళందరిదారీ వేరు. ఈ తెల్లదొరసాని వగలు వేరు. అతనిచేతులు పట్టుకుని అప్పుడప్పుడు నిమురుతుంది. అరచేయి గిల్లుతుంది. తలమీద చేయివేసి నిమురుతుంది. భుజాలను తడుతుంది. కొంటెగా, కళ్ళతో నవ్వుతుంది. నవ్వులతో పలకరిస్తుంది—కాని అతని మనసు అణగిఅణగి ఒదిగి ఒదిగి వుంది. ఆలోచన మనసుకు తట్టడంలేదు. ఇంతటి అదృష్టం తనకు అకస్మాత్తుగా పట్టడం, యింత ఆనందం లభించడం అతనికి ఆశ్చర్యంగానే వుంది. అయితే తెల్లదొరసాని నవ్వులు, కిచకిచలు, చక్కిలిగింతలు కేవలం దయనుమాత్రమే సూచిస్తున్నాయో, మరేదైనా భావాలను వ్యక్తం చేస్తున్నాయో అతని కవగాహన కాలేదు.

తెల్ల దొరసానితో కారులో వస్తూవుంటే దారిలో చాలా విచిత్రాలు చూశాడు. హిమాలయా పర్వతాల చేరువనవున్న కల్కాకు కారు చేరుకుంది. శ్రీమతి హెయిన్ వార్నింగ్ ఏదో యింతలోపల పడేద్దామని రెస్టారెంటుకు వెళ్లింది. మునూ కారుదిగి, మహమ్మదీయ నౌకరును కనిపించే వింతల్ని గురించి భోగట్టా చేశాడు. ఎదురుగ ఆకాశాన్నంటుతున్న పర్వత శిఖరాలు కనులకు దిగ్భ్రమ కలిగిస్తున్నాయి. ఈ పర్వతాలు, తన కాంగ్రా పర్వతాలకంటె ఎంత ఎత్తు! ఎత్తైన పర్వతాలమీద చిన్ని చిన్ని జలపాతాలు, ఆకు పచ్చని మొక్కలు అందంగా కనిపిస్తున్నాయి. గాలి వెడ వెడ లాడుతున్నది. ఆకాశంమీద దూదిపింజలవలె మబ్బులు తేలిపోతూ హిమాలయ శిఖరాలపై కమ్ముకుంటున్నవి. ఉదయిస్తున్న సూర్యకాంతి వింత వింత రంగులతో శోభిస్తోంది.

దొరసానమ్మగారి టాకు టీకు చెప్పలేనంత ఆడావుడిగా వుంది. చేతిలోసంచి జారిపోతున్నట్లు, దాన్ని వొదిలివేస్తూ, మళ్ళీ పట్టుకుంటూ, విసురుగా నడుస్తూ, తలముడి సవరించుకుంటూ, పిన్నులు జారుస్తూ, మారాం చేస్తున్న పిల్లను అదిలిస్తూ ఆ దుకాణం చెంతకూ, ఈ షాపు దగ్గిరకీ పరు గెడుతూ, అది యిదీ బేరమాడుతూ, ఏదీ కొనకుండా, మళ్ళీ వెళ్లి షాపువా డడిగిన ఖరీదుకే పళ్ళూ అవీ కొని వాటిని వయ్యారంగా చూసుకుంటూ టిప్ టాప్‌గా ప్లాటుఫారమంతా తచ్చాడుతూ నానా హంగామా చేస్తున్నది దొరసాని. దొరసాని కులుకులుచూసి ప్లాటుఫారంమీద రైలుకోసం కని పెట్టుకున్న సోల్జర్లు కళ్ళతో నవ్వుతూ, ఈలవేస్తూ "అబ్బో అబ్బో కిర్రో కిర్రో"మని హాస్యాలాడుకుంటున్నారు. సోల్జర్ల కంగాళీచూసి దొరసాని హడలెత్తిపోయి స్టేషను మాస్టరు గదిలోకి తప్పుకుంది. ప్లాటుఫారంమీద చాలామంది దొరలు, దొరసానులు, పిల్లలూ నించుని వున్నారు. కొండ ప్రాంతాల ప్రజలు మూటాముల్లె సర్దుకుని ఎంత త్వరగా రైలు వస్తుందీ, ఎంత దబ్బున అందరికంటె ముందుగా రైల్లోపడదామా అనే ఆతృతతో నిరీక్షి స్తున్నారు. శ్రీమతి మెయిన్ వార్నింగ్ మునూకు ఆ పనీ, యీ పనీ పురమా యించి ముస్లిం నౌకరును తీసుకురమ్మంది. అతను రాగానే "ఇంకా ఎంత దూరం మనం వెళ్ళాలయ్యా?" "ఏభై మైళ్ళండి."

"పెట్రోలూ, ఆయిలూ పోయించేవా?"

కారు బయలుదేరింది. సన్నని రోడ్డుమీద జరజర కుదుపు లేకుండా కారు సాఫీగా వెళ్ళిపోతూంటే, మెలికలు తిరిగిన రోడ్డును చూసుకుంటూ "ఇది ఎంత గమ్మత్తుగా వుంద"నుకుంటూ మునూ కారులో కూచున్నాడు. ఈ జీవితం బహు ఖుషీగా వుంది.

దొరసాని తనచేతులతోనే ఆపిలుపళ్ళూ, కోవాబిళ్ళలూ తీసి మునూకు యిచ్చింది. వాటిని తింటూ, చుట్టూవున్న చెట్లూ చేమలూ, ఆకాశం, భూమీ కారుతో పరుగెడుతూవుంటే, మునూ వాటిని కళ్ళు ఆర్పకుండా చూస్తున్నాడు. కల్కా స్టేషనువద్ద చిన్ని రైలు, 'బుల్లిబుల్లిరైలు వొగురుస్తూ 'పఫ్ పఫ్' మని పొగలు వదులుతూ బ్రహ్మాండమైన కొండమీదకు ఎగ బాకుతూవుంటే అతనికెంతో ఆశ్చర్యంవేసింది. చిన్నపిల్లవాడు వడిచేముందు తప్పటడుగులువేస్తూ, చేతులు ఆడిస్తూ, నవ్వుతూ ఒక్కొక్క అడుగే ముందుకు వేస్తున్నట్టు బుల్లిబుల్లి యీరైలు, మెట్లు ఎక్కుతున్నది. దీనికంటె

తనకారే నయం. వేగంగా పోతోంది. దొరసానిపిల్ల ముందుకూచుని చేతులో వున్న ఆటబొమ్మతో ఆడుకుంటున్నది. మునూకు తన చిన్ననాటి ఆట్ట పాటలు జ్ఞప్తికివచ్చి నవ్వొచ్చింది. తను ఆ బుల్లిరైలు ఎక్కివెడితే బాగుండును మరి! పర్వతాల సాలోపులో అక్కడక్కడ యిళ్లు కనిపించగానే నిన్న కాక మొన్ననే తన పల్లెవదలి యిక్కడకు వచ్చినట్లుయింది; తన పల్లె, లోయలమధ్య వున్న తన యిళ్ళు, మైదానాలు, పచ్చికబయళ్ళూ, యిక్కడా వున్నాయన్నమాట! ఆహాఁ! కొండశిఖరంమీద పాడుపడిన దేవాలయం, తన హామిర్‌పురం వద్దనున్న దుర్గగుడిలా లేదూ! వుంది. మొత్తానికి అదీ యిదీ ఒకటే! కారులోంచి తను వెళ్ళిపోయి, కొండలన్నీ చుట్టివచ్చినట్టూ, గుడిలోకి పోయినట్టూ ఒక్కసారి మనసు ఊహించుకుంది. కొండ దిగువను వున్న మెట్టభూమిలో తను నాగలితో దున్నినట్లు హృదయం చిత్రించుకుంది. నిజమే, ఇదే గొప్ప జీవితం! కొండలలో, లోయలమధ్య పొలాలలో, గట్టుల వెంట, చెరువులపక్క తిరుగుతూ, పశువుల్ని మేపుకుంటూ, చక్కగా దున్నుకుంటూ జీవితం వెళ్ళబోసుకోవడం ఎంత హాయి! ఎంత ఆనందం!

కారు మెట్టమీదకు ఎక్కుతున్నపుడు ఒక్క కుదుపు కుదపడంతో యింతసేపూ తను ఊహించుకున్న, మనసులో చిత్రించుకున్న ఊహాలు, రకరకాల బొమ్మలు అదృశ్యమయాయి. ఇందాకా, దొరసానమ్మగారు దిగిన స్టేషనులాంటిదే, ఆ బజారువంటిదే, ఆ దుకాణాలవంటివే, తన పల్లెలో వున్నట్లయితే, పెద్దపెద్ద పట్టాలు చూడాలని తనకు మనసువుండేదికాదుకదా!

పర్వతశ్రేణులకు అంతూదరీ లేదు. వాటిమీద కమ్ముకొచ్చిన మబ్బులూ, ఆకాశం ఎంత విశాలంగా వున్నాయో; మంచుతో కట్టిన పర్వత శిఖరాలు, పచ్చిక బయళ్ళూ, ఆకాశం, మబ్బులూ, నదులూ, సముద్రమూ వీటిని పుట్టించిన దేవుడు యింతకంటె పెద్దవాడు కాబోలును. "దేవుడు ఎన్నెన్ని వింతలు సృష్టించాడురా భగవంతుడా..."

రోడ్డుమీద కారు వేగంగా పోతూవుంటే, మూపున సంచులు వేసుకుని, నెత్తిమీద మూటలు ఎత్తుకుని బరువుగా నడుస్తూ సిన్లూపోతున్న కూలీలు కనిపించారు. వాళ్ళు పాపం యింతదూరం నడిచే రావాలి కాబోలు. ఎంతదూరం నడిచి వచ్చారో! మరి, వాళ్ళకంటె తను నయంకదూ! కారు మీద వెళిపోతున్నాడు. ఈ చెట్లనూ, పర్వతాలనూ, ఇళ్లనూ, మనుష్యులనూ

దాటి కారు గబగబ, గబగబ మీదికి, యింకా మీదకి ఆకాశమంత ఎత్తున మబ్బులమీద తేలి ఆగుతే బాగుండును!

కారు శరవేగంతో ముందుకు పోతున్నది. రోడ్డుపక్క దివ్యమైన భవనం కనిపించేసరికి శ్రీమతి మెయిన్‌వార్నింగ్ తనకూతురుకు "అదేనే, వైస్రాయివుండే భవనం" అని చూపించింది.

దొరసానమ్మగారిదగ్గర నౌకరీకి కుదురుకోవడం తన అదృష్టమే అనుకున్నాడు మునూ. కాని అతను చేయవలసిన పనులేమిటో యింకా నిర్ధారణ కాలేదు. దొరసానమ్మగారిని కనిపెట్టుకుని ఆవిడ కూడాకూడా తిరుగుతున్నాడు. ఆవిడ పిల్చేసరికల్లా చేతులుకట్టుకుని హాజరవుతున్నాడు; చెప్పిన పనులల్లాయిట్టే చేసేస్తున్నాడు. ఈపనులకి ఒకతలా, తోకా లేదు. అయినా యిదీ తమాషాగానే వుంది.

తెలతెలవారుతుండగా అలాదాద్ వచ్చి మునూను లేపాడు. మునూ లేచి కళ్ళు కలుపుకున్నాడు. పొయ్యి రాజేయమని దాద్ ఆజ్ఞాపించాడు. మునూ నిప్పుచేయగానే తాను గుడుగుడుపీలుస్తూ గదిలో ఒకమూల కూచున్నాడు. అలాదాద్ దొరసానమ్మగారి వంటవాడు. బంగాళాకు ఇరవై గజాల దూరంలో నౌకరీవాళ్ల బసవుంది. అదేబస, అదే వంటిల్లు. నిముషంలో పొయ్యిరాజేసి, కెటిల్‌తో నీళ్లుపెట్టి మరగనిచ్చాడు. నీళ్లు పొంగులు బారేక, మునూ 'టీ' చేశాడు. ట్రేలో అన్నీ అమర్చి అలాదాద్‌కు చూపించాడు. "రైట్! దొరసానమ్మకు యిచ్చిరా!" అన్నాడు అలాదాద్.

దొరసానమ్మగారు యింకా లేవలేదు. చిన్నపిల్ల సిర్సీ ఊరికే గల్లంతు చేస్తోంది. రొట్టె, వెన్నా, టీ త్వరగా పట్రామని తల్లిని అల్లరి చేస్తోంది. శ్రీమతి మెయిన్ వార్నింగ్ తెల్లవారు ఝామున రెండు మూడు గంటలకు కాని, పక్కమీద వాలింది కాదు. అల్లరి చేస్తున్న పిల్లను "మొహం కడుక్కోవే" అని అదమాయించింది. పిల్ల మెంకెఘటం. తల్లిని చంపి పుట్టిన రకం. మారాం మానింది కాదు. తల్లి కూతురు వీపుమీద ఛళ్ళున రెండు చరిచి బుగ్గలు సాగదీసి నౌకర్ల బసలోకి తగిలేసింది. వంటింట్లో నౌకరు యిచ్చిన టీ తాగుతూ సిర్సీ ఊరుకుంది.

మునూ, గదీ వసారా తుడుస్తూ యింత పెద్ద బంగాళాలో తాను మసులుతున్నందుకు తన అదృష్టాన్నొకసారి తలుచుకుంటున్నాడు. గదిలోంచి

ఆపిలు పళ్ళవాసన వేసింది. తివాసీలను తుడుస్తూ, బల్లలను తులుపుతూ తన పనిలో నిమగ్నుడై వున్న మునూను చూసి దొరసాని ఎంతో సంతృప్తిగా అతనివంక తదేక దృష్టితో విలోకిస్తున్నది. ఈ భవనంలో మసలగలుగు తున్నందుకు అతను యేమని ఆలోచిస్తున్నాడు, లేక అసలు అతని కే ఆలోచనలూ రమ్మన్నా రావా? ఇదీ దొరసాని తనలో తాను వేసుకున్న ప్రశ్న. దగ్గరగా రమ్మని పిలిచి అతనితో ఊసులు చెబదామనుకుంది. కాని, అతను తనకు నౌకరనేమాట గుర్తుకువచ్చి ఊరుకుంది. తను ఏపని చేసినా లోకం అలా అనుమానిస్తుందెందుకు? దిక్కుమాలిన లోకం; మనిషికి రక రకాల ఆవేదనలు వుంటాయని, ఒక్కొక్క భావం వచ్చినపుడు ఒక్కొక్క తీరున మనిషి వుంటాడని గ్రహించేపాటి తెలివితేటలే లేవా, యీ లోకానికి! ప్రేమించేటపుడు, దయచూపేటపుడు, సంతోషంగా వున్నపుడు, అర్థిస్తు న్నపుడు, ఆనందిస్తున్నపుడు స్త్రీ రకరకాల అనుభూతులను పొందుతుంది గదా, యీ అనుభూతులన్నీ సహజమైనవని లోకం ఎందుకనుకోదు? ఇతరు లను విమర్శించేహక్కు మనిషికి ఎవరిచ్చారు? "నా యిష్టం. నాకేది మోజుగావుంటే ఆ గౌను తొడుక్కుంటాను. నా కెవరిమీద ప్రేమవుంటే వాళ్ళతో వుంటాను. మధ్యన వీళ్ళకెందుకు? ఈ కుర్రవాణ్ణి ముద్దుపెట్టు కుంటాను. మధ్య నీ కెందుకు?" అని ఎదట ఎవరో వున్నట్టూ, వాళ్ళతో తాను దెబ్బలాడుతున్నట్టూ దొరసాని తనలో తాను వితర్కించుకుంది. కమ్మెచ్చుతీసిన మునూ శరీరం, కండలుదేరిన అతని భుజాల నునుపు, శ్రీమతిని వెర్రెక్కిస్తున్నాయి. గుండె దడదడ కొట్టుకుంటున్నది. సిస్లూ రాగానే యీ గాలీ, వెలుతురూ మనుషుల మనసులను చెదరగొడతాయనుకుని ఒక్కసారి సిస్లూను తిట్టుకోసాగింది. మంచంమీదనుంచి లేచి జుత్తు సవరించు కుంటూ పడకగదిలో అటు ఇటూ తారట్లాడుతోంది. మొహం ఒక్కసారి చేతులతో వెచ్చగా రాసుకుంది. పౌడరుతీసి పులుముకుంది. జుత్తుముడి విప్పుకుంది. భుజాలమీద పొడుగైన జుత్తును విసిరేసి అద్దంలో చూసుకుంది. దొరసాని ముస్తాబును, సింగారింపును చూడాలనే కుతూహలం మునూకు కలిగి, ఏదో పనిచేస్తున్నట్టు గదిలోకి వచ్చి, సన్నసన్నంగా ఆమెకేసి చూస్తు న్నాడు. దుస్తులు వేసుకుందుకు బీరువా తెరిచి దొరసాని అట్టే అలా నిలబడిపోయింది.

తనకు కలిగిన కోరిక లోలోన తాపం కలిగిస్తోంది. సన్నని కంఠంతో మెడవంచి మునూకేసి తిరిగి దొరసాని "అబ్బాయీ!" "ఏమండమ్మా" "కత్తెర యిటు తేమ్మా!" దొరసాని గట్టిగా ఆవులించింది.

"అలాగేనమ్మా" అంటూ నిముషంలో మునూ కత్తెర పట్టుకొచ్చి అందించాడు. కత్తెర తీసుకుంటున్న వంకతో, ఆమె, అతని చేతిని పట్టుకుని వెనక్కి లాగుకుంది. మునూ చేతులనిండా మన్నూ బూడిదా వుండడం చూసి దొరసాని "ఇదేమిట్రా నీ చేతులు బంగారంకానూ! వెళ్ళి శుభ్రంగా కడుక్కునిరా. సబ్బు నురగపట్టించు" అంది. అతని చేతులు వదుల్తూ "ఇదేమిట్రా బ్రహ్మ రాక్షసిలా నీ గోళ్ళు తగలడా! ఎవరన్నా్న రక్కుతావా ఏమిటి కోతిలాగ?" కోతి అనేమాట విని మునూ కిచకిచమని నవ్వాడు. ఆమె నవ్వుతూ "వెళ్ళి చేతులు కడుక్కురా! కత్తెరతో నీగోళ్లు కత్తిరించి పెడతాను" అంది.

గతరాత్రి ఆమె తన చేతిగోళ్లను సొగసుగా కత్తిరించుకోవడం చూశాడు కనక, యిందులో ప్రమాద మేమీ లేదనుకున్నాడు మునూ. వెంటనే వెళ్ళి చేతులు శుభ్రంగా కడుక్కుని దొరసానమ్మగారికి అందించాడు. ఆమె అతని చేతుల్ని నాజూకుగా పట్టుకుంటూ, నవ్వుతూ కులుకుతూ, కత్తెరతో గోళ్లు తీస్తున్నది. కుర్చీమీద చతికిలబడి ఒకకాలు తన యిష్టమొచ్చినట్టు విసరిపారేసి, తొడవరకూ కనిపించేటట్టు కూచుని, సెంటులవండుకులు పూసిన సిల్కు రుమాలు తీసి మొహం వొత్తుకుంది. కళ్లల్లో ఏదో వెలుగును కనబరుస్తూ ఆకలి చూపులతో మునూను చూస్తూ నవ్వుతున్న పెదవులను తెరచింది. "భేషుగ్గావున్నావురా కుర్రాడా! అందంగా పిగిలిపిట్టలా! ఇక నీకు పెళ్లి చేయడమే తరువాయి." ఆమె తనచేతులతో అతని చేతులను తాకుతూ నిమురుతూవుంటే వొక విధమైన వణుకు, వెచ్చదనం పుట్టుకొచ్చి మునూ కరిగిపోయాడు. ఆమె చేస్తున్న శృంగారాభినయం, వగలాడి చూపుల తళుకు, రొమ్ము వంపులూ, నడుము కదలికలూ, చేతుల స్పర్శా, అతన్ని పరవశుణ్ణి చేశాయి. సిగ్గుతో తలవంచుకుని నిలబడ్డాడు. కాని తొడల బిగువు, శరీరం నునుపు, చూపుల తళుకు చూసేసరికి వొంటిమీద స్పృహతప్పింది. ఉద్రేకం పొంగుకొచ్చింది. హృదయం ఉద్రూత లూగింది. మనసు చంచలమయింది. హఠాత్తుగా ఆమె తొడలమీద, చేతులువేసి గట్టిగా చప్పుచప్పున ముద్దులుపెట్టుకుంటూ మూర్ఛవచ్చినట్లు కళ్లనీళ్ళతో, కింద ఆమె పాదాల చెంత వాలిపోయాడు. అతన్ని దూరంగా తోసివేసి కల్లెర చేసి ఆమె "అరరే

ఏమిట్రాయిది మూర్ఖప్పీనుగా! నీకొచ్చినేళ్ళెవరి కొచ్చేయిరా! వెళ్లు వెళ్లూ నీపని చూసుకో...అన్నా! మితిమీరిపోతున్నావే! టీ అవీ తయారుచేశావా!"

సిగ్గుతో కృంగిపోతూ మునూ వంచినతల ఎత్తకుండా గబగబ గది లోంచి అవతలకి పారిపోయాడు. మళ్ళీ దొరసానమ్మగారి మొహం యే మొహంతో చూడగలనని లోలోపల బాధపడ్డాడు. కాని ఆమె మొహం చూడక తప్పిందికాదు. టీ, రొట్టె, వెన్న పట్టుకురావలసినవాడు తనేనాయె! తప్పదుకదా! టేబిలుముందు అవి పెట్టేటపుడు సిర్సీ అడిగింది: "ఎందుకూ ఏడుస్తున్నావ్! మా అమ్మ కొట్టిందేవిటి నిన్ను?" మునూ సమాధాన మేమీ చెప్పలేదు. రొట్టె, వెన్న తింటూ శ్రీమతి మెయిన్ వార్నింగ్ మూడుగంటలసేపు కాలక్షేపం చేసింది. పొద్దున్న భోజనం ఎప్పుడూ చాలా బరువుగా మూడుగంటలసేపు తింటూ, కబుర్లుచెబుతూ కాలక్షేపం చేయడం ఆమె కలవాటు. అలవాటు కాదు; అది ఆమె ఆరోగ్యవిషయాల్లో ఒకటి. ఒక్కొక్కప్పుడు మూడుగంటలే కాదు. నాలుగూ నాలుగున్నర గంటలు పడుతుంది. ఇంతసేపు పట్టడానికి కారణం ఆమె అనారోగ్యం. శ్రీమతి మెయిన్‌వార్నింగ్‌కు లోగడ ఎంతో ఖాయిలాచేసింది. మనిషి మంచాన పడ్డది. కడుపులో రాయివంటిదేవో చేరుకుందని డాక్టర్లు చెప్పారు. ఆపరేటు చేస్తే అంతా నయమవుతుందన్నారు. లండన్లో మూడు నాలుగుచోట్లకు పోయి చూపించినా ఆపరేషన్ దీనికి చికిత్స అన్నారుడాక్టర్లు. ఆమె కడుపులో అట్లాంటి జబ్బేమీ లేదని ఆమెకు నమ్మకం. తన శరీరంలో ఏ ఒక భాగమూ కోసి తీసివేయతగ్గదికాదని ఆమె విశ్వాసం. సరే, ఏదో జబ్బంటూ వుందంటున్నారు కనక, ఆపరేషను ఎలాగా తాను చేయించుకోదు కనక, "ఏదో ఓమందో, మాకో యిలా తగలేయండ"ని ఆమె డాక్టర్ స్టీఫెన్సన్ వద్దకు వెళ్ళి అడిగింది. ఆయన ఆహారశాస్త్రంలో నిపుణుడు. ఇదివరకు వాడిన మందులన్నీ కేవలం బైరాగి చిట్కాలనీ, వాటివలనే ఆమెకు కడుపు చెడి పోయిందనీ ఆయన చెబుతూ ఏయే ఆహారం ఎంతెంతసేపు నములుతూ మింగాలో, ఎప్పుడెప్పుడు తినాలో ఒక పథకం తయారుచేసి యిచ్చాడు. "ఓస్సి! ఇదెంతలెండి! ఓరోజులో తక్కున కుదిర్చిపారేస్తాను ... పళ్ళు బాగా తినండి! ఆపిలుపళ్ళు, బత్తాయి, కమలాలు, ద్రాక్షపళ్ళు, బాదం. పప్పు మీ యిష్టం! తెల్సిందాండీ? ఎంత తిన్నా యీ రోగంవద్దనదండి! కాని వారింజలుమాత్రం ముట్టుకోవద్దు. రోజూ పొద్దున్నే నేన్చెప్పినట్టు చేయండి;

తగ్గకపోతే ఆనక నన్నడగండి" డాక్టరు చెప్పిన యీ మందు ఆమెకు ఎంతో నచ్చింది. తనకు నచ్చిన విషయం వెంటనే ఒక సూత్రంగా ఆచరణలో పెట్టగల బుద్ధిమంతురాలు శ్రీమతి మెయిన్‌వార్నింగ్. నెలలుతరబడి ఆమె డాక్టరు గారి సలహా ప్రకారం బుట్టలకొద్ది పళ్ళు తినసాగింది. ఆమెకు నిజంగా జబ్బు ఏమీ లేదుకనక అది యిట్టే కుదిరిపోయింది. తన స్నేహితుల సానుభూతి పొందడానికి మాత్రం అప్పుడప్పుడు మూలుగుతూ మక్కుతూ, వుండడం కద్దు. పొద్దున్నే ఆపిలుపళ్ళు, సపోటాలు, ద్రాక్షపళ్ళు గుత్తులు గుత్తులుగా, గుట్టలు గుట్టలు, పెట్టుకుని వాటిని జాగ్రత్తగా వొలుచుకుంటూ అతి లలితంగా, మధురంగా ఆరగిస్తుంది. టేబిల్ మీద పళ్ళతొక్కలు మేరువు పర్వతమంత గుట్టపడి చూసేవాళ్ళకి అసహ్యంవేసినా, ఆమెకంతా సొగసుగానే కనిపిస్తుంది. పొద్దున్నే ఫలహారం ఆరగించిన తరవాత, సీసాలకు సీసాలు తాగి, హాయిగా పడకకుర్చీలో వాలుతుంది. పన్నెండున్నర గంటల వరకూ ఒకటేతిండి. బకాసురుడిలాగ యింత తిండీ అరిగిపోయినట్టు, వెంటనే భోజనానికి సిద్ధమౌతుంది.

ఆవిడ "భోజనం సిద్ధంగా వుందీ"అని అడగడం తరవాయి, అలాదాద్ అన్నీ అప్పటికే సిద్ధంచేసివుంచుతాడు. ఆమె ఎంతపీక మొయ్యాలిని పడుకుంటే అలాబాద్‌కు అంతమంచిది. లేకపోతే, ఆవిడకి మధ్యాహ్నం నిద్రపట్టదు. నిద్ర పట్టకపోయిందీ తానే బజారుకు వచ్చి వస్తువులు కొంటానంటుంది. ఆమె ఎప్పుడూ బజారుకు రాకుండా ఏదోఒక ఖాయిదా ఏర్పాటు చేస్తూ అలాదాద్ కమిషన్లు కొట్టేస్తున్నాడు. ఈ కమిషన్లు లేకపోతే, తనకిచ్చే జీతం తనకే చాలదు. మరి తన కుటుంబమూ పెద్దదేనాయె! తనూ, తనపెళ్ళాం, ఓ కొడుకూ, కూతురూ! పూటకి నాలుగు విస్తళ్ళు; పైపెచ్చు కొడుకు చదువుకుంటున్నాడు. పుస్తకాలు, నెలనెలా జీతం; దొరసానిచ్చే ముష్టి రూపాయల జీతంలో యీ సంసారం యీదుకురమ్మంటే వాడితరమా! ఇంతకీ ఇందులో తప్పేముంది? డబ్బున్నవాడి తలకొట్టకపోతే సన్యాసీ సన్యాసీ రాసుకుంటే లాభం యేమిటి? తెల్లదొరలు ధనవంతులు. భారతీయులు పేదలు. ధనవంతులడబ్బు తినడంలో తప్పులేదు. భోజనం సిద్ధం చేశావా అనేసరికి దొరసానమ్మగారిదగ్గరికి పోయి అలాదాద్ "చిత్తం! అయితే ఏంవడ్డించనండి"

"టొమాటో పులుసూ; ఉల్లిపాయలకూర, ఏం?"

రాత్రి దొరసానిగారు భోజనం వండవద్దన్నారు. "చూడూ! స్టూవర్టు దొరగారులేరూ! ఆయనింట్లో మన కీపూట భోజనం!"

"చిత్తం చిత్తం"

"చిత్తంలేదు, బత్తెంలేదు; నువ్వేవచ్చి వడ్డించాలక్కడ! తెల్సిందా?"

"అలాగే అమ్మగారూ!" అమ్మగారు ఫక్తు తెల్లదొరసానను కుని యీకాస్త జీతానికీ ఒప్పుకున్నాడు కాని, ఆమె ఆంగ్లో యిండియనని తనకు మొదటే తెలుసుంటే అంగీకరించేవాడు కాడు. తెల్లదొరసానికైతే బజారు ధరలు తెలియవు కనక తాను కన్నీకొట్టవచ్చును.

"కుర్రాణ్ణిపిల్చి ఓరిక్షా పట్రమ్మని చెప్పూ"

"అలాగేనండమ్మగారూ"

"అలాగేనం డమ్మగారు కాదు... ముగ్గురు కూలాళ్ళు కావాలు. నాలుగో కూలాడు ఆ కుర్రవెధవేచాలు"

"అలాగేనండమ్మగారూ!"

శ్రీమతి మెయిన్‌వారింగ్ దుస్తులు మార్చుకునేలోపున, మునూ రిక్షా లాక్కొచ్చాడు. ముగ్గురుకూలీలూ, తనూ గేటువద్దర రెడీగా నుంచున్నారు. రిక్షాకు ముందొక యింజను తగిలించివేస్తే యీబెడద తప్పుతుంది కదా అనుకున్నాడు మునూ. కాని రిక్షామాత్రమే సిమ్లాలో తిరగవచ్చును; కార్లమీద వైస్రాయి, సైనికాధిపతీ, పంజాబ్ గవర్నరూ, తదితర గొప్ప ఉద్యోగులూ వెళ్ళవచ్చును. వీరుతప్ప పార్లమెంటు సభ్యులైనా సరే, మహారాజులైనాసరే, రిక్షాలమీదే ప్రయాణంచేయాలి తప్ప కార్లమీద తిరగ గూడదు. రిక్షాలు బళ్ళకన్న నయం. జంపన్లయితే లాగేవాళ్ళకి మరీ కష్టం. డోలీ అయితే శవండూరేగినట్టే వుంటుంది.

విక్టోరియన్ యుగపు రోజులలో సెయింటుమార్కున్న చర్చి మతాచార్యుడు రెవరెండు ఫార్రైన్‌కు హఠాత్తుగా భావకల్లోలం కలిగింది. జీవుడు మరణిస్తే ఏమౌతుందనే ఒకానొక భయం అతన్ని వేధించగా గొర్రెలమందల వంటి తన భక్తకోటికి ఏది తరుణోపాయమని దీర్ఘంగా ఆలోచించసాగేడు. తన భక్తుల ఆత్మలు క్షోభపడకుండా వారి బొందెలను చర్చినుంచి యింటికీ, యిళ్ళనుంచి చర్చికీ చేరవేసే సాధనమేమిటా అని లోలోపల విచారించగా మతాచార్యులవారి కొక వాహనం కలలో కనిపించింది. తత్ఫలితంగా వారు

వొక నరవాహనాన్ని సృష్టించారు. అదే రిక్షా. వారు తయారుచేయించిన రిక్షా ఎలావుండేదో సిమ్లా పౌరులింకా మర్చిపోలేదు :

ఒకానొక కాలంలో వుండేదోయ్ రిక్షా
నలుచదరంగా మోయలేనంత బరువుగా
దానమ్మ సిగతరగ, ఏనుగుపగిదిగ
కదిలిందా రథం, గట్టైనా పుట్టైనా ఆగితే ఒట్టు!
ఆ కాలంలో ఫార్టెస్సుమా టొక పేరడైస్
అతని మేధోజనిత నరవాహనం ఓడి
ఇంతకన్న భక్తుల పరమపదసోపానం పెద్ద ?
మే నెలలో మొదటిసారిగ చేరిందోయ్ యిది సిమ్లా ?

గుర్రాలవలె దౌడుతీయడం, మనుషులకు మప్పడం ఏమంత కష్టం కాదు. కనక యిట్టే రిక్షాలు ఏవీధిలో పడితే ఆ వీధిలో కనిపించసాగేయి. మతాచార్యుడు ఫార్టెస్ అనంతరం అతను తయారుచేసిన రిక్షా రకరకాల పద్ధతులతో ఫ్యాషన్లతో పాశ్చాత్య దేశాల నాగరికతవల్ల పెంపొందింది. మొట్టమొదట రిక్షాలకు యినపచక్రాలు వుండేవి; మనిషి కూచుంటే భూమిలో కర్ణుడి రథ చక్రాల్లా దిగబడిపోతూ, గజగజలాడేది. ఎక్కడైనా సిమ్లాలో నృత్యగాన ప్రదర్శనాలు జరిగాయీ అంటే ప్రదర్శనశాలముందు వందలకొద్దీ రిక్షాలు వరసలు వరసలుగా గుమిగూడి వుండేవి. పద్దెనిమిది వందల తొంభై ఎనిమిదో సంవత్సరంలో రబ్బరు టైర్లు వొచ్చాయి; ప్రతి రిక్షాకు విధిగా రబ్బరు టైర్లు వుండితీరాలనే నియమం పంధొమ్మిది వందల నాలుగో సంవత్సరంలో మున్సిపాల్టీ విధించింది. రబ్బరుటైర్లు లేని రిక్షాలకు లైసెన్సులు లేనేలేవు. అంతకు ముందు తారురోడ్లన్నీ యినపచక్రాల రాపిడివల్ల పాడైపోయేయని మున్సిపాల్టీ అభిప్రాయం. రబ్బరుచక్రాలు, లోపల పరుపులు, తమాషా అయిన గూడులు రిక్షాలకు అలంకారం కాగా, వాటిలో డబ్బున్న దొరలు గలగల మువ్వలచప్పుడు వినిపిస్తూవుంటే ఖుషీగా కూచుని అటూ ఇటూ తిరగడం సరదా. మానవుడు పశువుకిమల్లే బండి లాగుతూవుంటే, ఆ బండిలో కూచుంటే తన ఆత్మ క్షోభిల్లుతుందని గాంధీ రిక్షా ఎక్కనన్నారు. చరిత్రలో యింతకంటె మూర్ఖుడు మరొకడు వుండబోడని సిమ్లానాగరికుల అభిప్రాయం. సిమ్లాలోని రిక్షా సాధారణంగా తొమ్మిది అడుగులఎత్తు వుంటుంది. వెడల్పు నాలుగడుగులు

రిక్షాలోకూచునే మనుషుల బరువు మినహాయించినట్లయితే, దానిబరువు రెండు వందల అరవై, మూడువందల అరవై పౌనులు. రిక్షాల బరువులను, అందులో కూచున్న మనుషులను లాగలేక కూలీలు లోలోపల బూతులు తిట్టుకుంటూ వుంటారు. ఎగుడు ప్రదేశం వచ్చినపుడు మరీబాధ. రెండుకాళ్లూ వెనక్కి దన్నిపెట్టి రిక్షాముందుకు లాగుతుంటే, అందులో కూచున్న మనుషులు వెనక్కి గతుక్కుమని ఒరిగిపోతూవుంటే కూలీలు మరీ తిట్టుకుంటారు.

మొదట రిక్షా లాగినప్పుడు మునూ చాలా శ్రమపడ్డాడు. రిక్షా లాగడంకూడా ఒకళ్ళునేర్పే విద్య అని శ్రీమతి మెయిన్‌వార్నింగ్ ఎన్నడూ భావించలేదు; కాని యిది అంత చులకనగ పట్టుబడే విద్యకాదని మునూ గ్రహించాడు. మోహన్ యిది నిజంగా కూసువిద్య కాదనీ, దీనికీ అంతో యింతో గురువు అవసరమనీ, కొన్నాళ్ళ లాగ లాగుతూవుండడమే గురువు అనీ, తరవాత దానికదే పట్టుబడుతుందనీ చెప్పాడు. మొదట తన కీయమ యాతననిపించిందట. కాని రానురాను రిక్షా తనచేతులకి లొంగిపోయిందిట. ఊపిరి బాగా బిగపట్టడం, కాడిపట్టుకుని రిక్షా అటూ ఇటూ పడిపోకుండా నిలబెట్టడం, గిరుక్కున తిప్పడం, మళ్ళించడం, జరజరా పోనీయడం, వేసే అడుగు నేలమీద నిక్కచ్చిగా పడుతోందో, లేదో, బలంగా భూమిమీద ఆనుతుందో లేదో చూసుకోవడం, సొలోపుల్లో వెయ్యికళ్ళతో, చేతులతో కాసుకోవడం యివన్నీ రిక్షాలాగుడు విద్యలో కిటుకులని మోహన్ చెప్పాడు. ఊపిరి బిగబెట్టి ఒగర్చకుండా బండిని లాక్కుపోవడం యీ శాస్త్రంలో ప్రథమ ప్రకరణం. ఒక్క ఒకుదుప్ప ఒగిర్చి, ఆఖరుసారి ఆక నిట్టూర్పు విడిచి ఊపిరి ఒకేసారి విడవడం ఈ శాస్త్రంలో చరమాధ్యాయం. మొదట మోహన్ చెప్పిన కిటుకులు మునూకి తలకెక్కలేదు. కాని క్రమ క్రమంగా వారు చెప్పిందంతా నిజమే అనిపించింది.

రిక్షా లాగుతూ మునూ మిలటరీ బారక్సులను దాటాడు. వైస్రాయి అంగరక్షకుడి కాపలాప్రదేశాన్నిదాటి చుట్టుదారిని రైల్వేబోర్డు ఆఫీసుకు రిక్షా చేరుకుంది. మాల్‌దగ్గరకు వచ్చేసరికి ఎముకలు సున్నమయాయి. అతను గబగబ రిక్షా లాగుకుపోతూవుంటే మిగిలిన రిక్షావాళ్ళు "సెహబాష్, సెహబాష"ని అతన్ని ప్రోత్సహించేవారు. పర్వతప్రాంతాలలో, ఎగుడుప్రదేశం వచ్చేసరికి మునూ జాపోస్తూనిలబడిపోయేవాడు. వాళ్లల్లో ఒకడువచ్చితనే ఆరిక్షా లాగేవాడు. పోస్టాఫీసు చెంతకువచ్చాక ఇక రిక్షాలాగడం కష్టంకాదు! 'డౌన్లో

రిక్షాచక్రాలు వాటంతటవే దొర్లుకుపోతాయి. రిక్షా జరజరపోతూవుంటే రిక్షా మువ్వలు గలగమంటూంటే మునూహృదయం సెలయేరులా పరుగులు తీసింది. రిక్షా లాగుకుంటూ బజారులోని దుకాణాలను చూసుకుపోతూవుంటే ఎంతో ఆనందమనిపించింది. రకరకాల షోరూములు, కిటికీలు, షాపులు, దుకాణాలు, డసరాఫీసులు; లారెన్స్ అండ్ మేయో, సాహేబ్ సింగ్ అండ్ కో' ది మోడరన్ బుక్షాప్, జోన్స్ అండ్ జోన్స్; వెండీ బంగారు నగల వ్యాపారస్తులు; మహమ్మద్ గుల్, ఉన్నివ్యాపారస్తుడు, హోవాంగ్, చైనా బూట్లషాపు, ఓ రకరకాల బోర్డులతో వింత వింత దుకాణాలు బజారులో కనిపిస్తాయి.

రిక్షా మాల్ చెంతకు రాగానే శ్రీమతి మెయిన్‌వార్నింగ్ దర్జాగా అందరికీ వినిపించేటట్లు "డేవికో రెస్టారెంటుకు పోనీయండ్రా" అంది. శ్రీమతి స్టూవర్టు దొరసానమ్మగారిని టీకి రమ్మని శ్రీమతి మెయిన్ వార్నింగ్ ఆహ్వానించింది. ఆవిడ ఈపాటికి రెస్టారెంటుకు వచ్చి వుంటుందని శ్రీమతి మెయిన్‌వార్నింగ్ అంచనా.

ఆమెను రెస్టారెంటులో దిగవిడిచి, కూలీలు రిక్షాలతో స్టాండువద్ద నిలబడి ఈవిడ మళ్ళీ ఎప్పుడువస్తుందిరా బ్రహ్మదేవుడా అని ఎదురుచూస్తున్నారు. రెస్టారెంటంటే ఎలా వుంటుందో, అందులో ఏమేమి వుంటాయో, దొరసానమ్మలంతా అక్కడ ఏం చేస్తున్నారో చూద్దామనే కుతూహలంకొద్దీ మునూ కిటికీలోంచి తొంగిచూశాడు. రకరకాల తినుబండారాలతో, పేము కుర్చీలతో రెస్టారెంటు కలకల్లాడుతోంది. కుర్చీలో కూచున్న సిర్సీ కిటికీలోంచి తొంగిచూస్తున్న మునూను చూసి "అమ్మోయి! మన కూలీలేవ్!" అని అరిచింది. శ్రీమతి మెయిన్‌వార్నింగ్ సరిగ్గా ఆ సమయానికే మంచి రసపట్టులో వుంది. ఆమెను పెద్దమనుషులకు ఎవరో పరిచయం చేస్తున్నారు. కుళ్ళుగుడ్డలతో, అట్టకట్టిన జుట్టుతో, మొద్దుమొహాలతో వున్న కూలీలు, తగు మనుషుల సరసనకూచుంచుకు కాదుకదా, వాళ్ళ తలుచుకుందుకు కూడా అర్హతలేనివాళ్ళు. రోడ్డుమీద చెట్లనీడను కొందరుకూలీలు కూచున్నారు. మరి కొందరు మోకాళ్ళమీద తలదించుకుని కునుకుపాట్లు పడుతున్నారు.

మొదటిరోజు రిక్షా లాగాడో లేదో మునూ కామర్నాడు జ్వరం వచ్చింది. సాయంత్రం రిక్షా లాగుతూ వస్తున్నపుడు మిణుకులు పట్టేశాయి. కాళ్ళు తోడుకుపోయి, ఎముకలు బాణం ఎక్కుపెట్టినట్టు కరకరలాడాయి. గదిలోకి రాగానే చాపమీద పడిపోయేడు. పాదాలు నూతికపోట్లులా

పొడుస్తూవుంటే రెండుకాళ్ళూ పారచాపుకున్నాడు. అటూ ఇటూ రాసుకున్నాడు. కాని నయంకాలేదు. నొప్పి తగ్గలేదు. గొంతుక ఎండిపోతున్నది. సెలవేసినట్లు మండుతున్నది. వెనక్కి విరిచికట్టినట్టు చేతులు వెళవెళలాడాయి. గ్లాసుడు నీళ్ళు గుటగుట తాగేశాడు. అయినా గొంతుక ఎండిపోతూనేవుంది. వంట్లో రక్తం సలసల మరిగిపోతున్నది. సాయంకాలం యింటికొచ్చాక యింతబాధపడ్డా "దీనికేంలే! ఆయాసం! అదేపోతుంద"నుకుని నిర్లక్ష్యంగా పొయ్యిదగ్గర కూచున్నాడు. తలనొప్పి, పోటు, దబ దబ వెయ్యిరోకళ్ళతో దంపుతున్నట్టు విపరీతమైన బాధ! వెంటనే వెళ్ళి ఏదో ఓమూల కూలబడిపోవా లనుకున్నాడు. ఉండుండి హఠాత్తుగా గజ గజ చలి పుట్టుకొచ్చింది. చంకల్లో బిళ్ళలుదేరి పోటు ప్రారంభమయింది. శరీరమంతా మిల్లులాగ దబదబమంటూ ఊపుతున్నది. రైలు వస్తున్నపుడు దగ్గరగావున్న బ్రిడ్జి జవజవ ఊగినట్టు శరీరం! చలికి తట్టుకోలేక పొయ్యిమంట తగిలేటట్టు దూరంగా నేలమీద ఒరిగిపోయాడు. రాత్రయింది. చీకటి పడింది. బజారునుంచి వస్తూ కిందపడుకున్న మునూను చూసుకోకుండా గబుక్కున అతనిమీద అడుగువేసి అవతలకు తప్పుకొని, పై పెచ్చు "ఎవర్రా అది ?" అంటూ ఆలాదాత్ గద్దించాడు. సమాధానం రాలేదు. మెల్లగా మునూ మూలుగుతున్నాడు. అటూ ఇటూ కదిలిపోతూ "అమ్మ అమ్మ" అంటూ వణకిపోతున్నాడు.

ఆలాదాద్ మునూను చూడగానే జ్వరంవచ్చిందని అతని వొంటిమీద చేయివేయకుండానే యిట్టే పోల్చేసుకున్నాడు. పరుగుపరుగునపోయి దొరసానమ్మగారితో చెప్పాడు. మునూకు జ్వరంవచ్చిందనే కబురువిని ఆమె కంగారుపడింది. ఆమె ముగ్గురు నలుగురు పిల్లలతల్లి. తనకొడుకు రాల్ఫుకు జ్వరం వచ్చినపుడు ఆవేళా, యిలాగే ఎంతో ఆదుర్దాపడింది. మునూను వంటింట్లోంచి మేడమీదకు రమ్మని తనపిల్ల పడుకునే మంచంపక్క మంచం వేసి దానిమీద పడుకోమన్నది. మునూ మొదట ససేమిరా, రానన్నాడు. తాను నౌకర్ననీ మేడమీద పడుకోతగననీ చెప్పుకున్నాడు. ఆమె పట్టు పట్టింది. వెంటనే డాక్టరు మార్కంటును రమ్మని కబురుపంపింది. ఆయన మేజరు; సివిల్ హెల్తాఫీసరు. జాతిచేత భారతీయ క్రైస్తవుడు. ఒక గొడారివాని కొడుకు. అతన్ని చిన్నప్పుడే ఒక మతాలయంవారు చేరదీసి విద్యాబుద్ధులు చెప్పించారు; ఇంగ్లండుపోయి చదువుకునివచ్చాడు.

అక్కడ ఇంగ్లీషువాళ్లతో భాయిభాయిగా తిరిగి వాళ్ళతో పైలా పచ్చీసుగా వుంటూ కాలం గడిపేడు. ఆ అవకాశం తనకు రాగానే తానొక యింగ్లీషు వాణ్ణనే భ్రమించసాగేడు. ఇంగ్లండులోనే ఒక నృత్య కన్యను ప్రేమించి వివాహం చేసుకుని, ఆంగ్లేయుల పద్ధతులను, ఆచారాలను 'తూచా' తప్పకుండా అనుకరిస్తున్నాడు. పూర్వం అతనిపేరు మోచీ. ఇప్పుడు మార్కాంటు. తాను ఏ దేశంలో ఎవరి యింట పుట్టిందీ, ఎవరు పెంచిందీ అవన్నీ మర్చిపోయి, తానొక ఐ. యం. యస్ ఆఫీసరుననే విషయంమాత్రమే సదాజ్ఞాపకం పెట్టుకుని లోకంలో వ్యవహరిస్తున్నాడు. ఇందుకు శాస్తిగా నేమో అన్నట్టు ఆయన సతీమణి యింగ్లండులోనే వుండిపోయి, నెలనెలా భర్త పంపించే సగం జీతాన్ని మింగుతూ కూచుంది. తాను ఇంగ్లీషువాడి నైనందుకు ఆ మాత్రం జరిమానా చెల్లించుకోక తప్పదని భావించాడు డాక్టర్. కాని అతనికి లేని తనమంటే ఏమిటో బాగా తెలుసును. నెల నెలా తన జీతంలో సగం, ఏడువందల రూపాయలు తన భార్య దిగమింగుతూ రావడం అతనికి ఎంతో కష్టమనిపించింది. ఎలాగా ఏడువందలు ఖర్చయిపోతున్నాయి కనక, మిగిలిన డబ్బు తనకింద ఏమీ ఖర్చుపెట్టుకోకుండా వెనక వేసుకుంటూ అక్కడా అక్కడా తన ఖర్చులకి కాస్త కతుకుతున్నాడు. ఋణమో పణమో భర్తలకెంతతోస్తే అంతా, కస్పీ అతనికి ముట్టజెపుతూనేవున్నారు. అయి నప్పటికీ అతనికి పట్టుకున్న మనోవ్యాధిమాత్రం తగ్గలేదు. మనోవ్యాధికి మందులేదు. కాని తన భార్యకు పట్టుకున్నడబ్బుపిచ్చి తగ్గేటట్టులేదు. ఆమె వ్యాధినయమౌతేనేకాని తన జబ్బు కుదేరేటట్టులేదు.

ఈ ఆలోచనలతో విసుగెత్తిపోయి, తనభార్యకు విడాకులిచ్చేద్దామా అన్నంత విపరీతపు అభిప్రాయాలు కలుగుతూ రాగా, ఆవిషయం మళ్లీ మర్చిపోతున్నాడు. కారణం ఏమీలేదు. పరాయి ఆడవాళ్లపొందు డాక్టరుకు ప్రీతిగానేవుంది. డాక్టరుకి పంచదారకన్న పరదారప్రీతి.

శ్రీమతి మెయిన్‌వార్నింగ్ రమ్మని కబురు తోలేయగానే, చరచర డాక్టరు వచ్చేశాడు. రాగానే శ్రీమతి మెయిన్‌వార్నింగ్ ఎదటపడ్డది. ఆమెను చూడగానే తనకంటె కాస్త చాయగానేవుందే అనుకున్నాడు. అస్తమానూ తువ్వాలుతో వొత్తుతున్న శ్రీమతి బుగ్గలు ఆపిలుపళ్లవలె ఎర్ర పడ్డాయి. ఈమె వాటం చూస్తే యూరోపియన్ల పిల్లవలె వున్నదే! ఇంగ్లీషు వాళ్లకన్న, మిగిలిన భారతీయ క్రైస్తవులకన్న యూరేషియన్లు మంచి కలి

విడిగా వుంటారు. వీళ్లతో కత్తుకలపడం చాలా సులభం. డ్రాయింగు రూములో అడుగుపెట్టీ పెట్టగానే డాక్టర్, శ్రీమతి మెయిన్‌వార్నింగును ప్రశ్నించాడు. "ఎవరండీ యీ అబ్బాయి ?"

"నౌకరు కుర్రాడండి ! బొంబాయిలో దొరికితేనూ, తీసుకొచ్చాను."

" దొరికేడూ ?"

"ఆఁ ! అవునండీ పాపం ! ... నన్ను నేనే పరిచయం చేసుకుంటున్నందుకు క్షమించాలి మీరు. నాపేరు శ్రీమతి మెయిన్‌వార్నింగ్. పలకడానికి పేరు కష్టంగానే వుందికదూ ?"

"పేరు పలకడం కష్టమైనా మీతో యిబ్బందేం లేదులెండి ! అందర్లా కాదు మీరు. అందర్లోనూ ఇట్టే కలిసిపోతారు. ఈ ఆంగ్లోఇండియన్లున్నారా అండి, వొంటిపులి రాకాసులు."

"బాగా అన్నార"ని అందే కాని ఆమె కామాట అనడం ఏమీ యిష్టంలేదు. భారత క్రైస్తవ కూటమిలో తానూ ఒక సభ్యురాలిగా పరిగణింపబడాలని ఆమె యిన్నాళ్ళూ తపస్సు చేస్తున్నది. తనకూ, ఆంగ్లజాతికీ భేదం వున్నదనే అభిప్రాయం ఆమెకు కలగడం అతనికీ యిష్టంలేదు. కనక డాక్టరుగారు చటుక్కున సంభాషణ మార్చి:

"ఎంతకాలమైంది మీ రీవూరొచ్చి ?" అనడిగాడు. "ఏదండీ ! ఇంకా నాలుగురోజులైనా కాలేదు. అదేమిటో కాని ఇంగ్లండు వదలబుద్ధి కాదండీ డాక్టర్ గారూ !"

"మంచివారే ! ఆదేశం, ఆ సంగతీ ... " డాక్టరు కళ్ళల్లోకి వాలు చూపులు చూస్తూ ఆమె నవ్వింది. "ఒక్క గుక్కెడు పుచ్చుకుంటారూ తీర్థం ?" "దానికేం భాగ్యం...మీ కోరిక కాదండం కష్టం ఐతే శ్రీమతి మెయిన్‌వార్నింగ్ ! ఇంగ్లండు వ్యవహారాలు ఎలావున్నాయండీ ?"

ఇద్దరూ మాటిమాటికీ తలో గుక్కెడు తీర్థం పుచ్చుకుంటూ, తమ ఇంగ్లండుదేశం, అక్కడి మబ్బుల సొగసు, కొండలతీరు, నక్షత్రాల అందం, అభివర్ణించుకుంటున్నారు. భోజనానికి వేళయిపోతున్నా బాతాఖానీ ఒకంతకు తెమలడంలేదు. స్టూవర్టు భోజనానికి నిరీక్షిస్తూవుంటాడని ఆమెకు జ్ఞాపకం వచ్చింది. ఇంతసేపు మాట్లాడుకున్నా అసలు విషయం తెమలనట్లు యిద్దరూ ఫీలయ్యారు. ఏదో చెప్పడం మర్చిపోయానన్నట్లు డాక్టరు, ఏదో

అందామనుకుంటూంటే అమాటే జ్ఞాపకం రావడంలేదన్నట్టు ఆవిడా, ఒక ర్నొకరు కాస్సేపు చూసుకున్నారు. డాక్టరు వెళ్లిపోతూవుంటే ఆమె కొంచెం దగ్గి "డాక్టరుగారూ! రేపు వస్తారుకదూ! వొంట్లో ఏమిటోగా వుంటుందండీ. ఏమిటో నాకే తెలియదూ. ఏదో ఇదిగా వుంటుందండీ! రేపుటేకి వస్తారు కదూ?"

"మహారాజులాగ" అంటూ డాక్టరు వెళ్ళిపోయాడు. ఇంతసేపూ దొరసాని బంగాళాలో మునూ హాయిగా నిద్రపోయాడు; కాని కణతలు భగ్గుభగ్గుమని మండిపోతున్నాయి. కాని జ్వరం నిమ్మళించడంతో దొరసా నమ్మగారి బంగాళాలో పడుకునే అవకాశంకాస్తా పోయింది. చిన్నిచిన్ని చెమట బిందువులు శరీరమంతా పట్టి, జ్వరాన్ని ఆర్పివేశాయి. కాళ్ళొకసారి విదిళించుకుని మొహానికిపట్టిన చెమటను చొక్కాతో తుడుచుకుని, నిట్టూర్పు లతో ఒకపక్కకు వొత్తిగిలేసరికి గిర్రున కళ్ళమ్మట నీళ్ళుకారాయి. కంటి నీళ్ళల్లో తనతల్లి కనిపించింది.

శ్రీమతి మెయిన్‌వార్నింగ్ భోజనంచేసి, మేడమీదకు వచ్చింది. ఉడుకులాం అతని నుదుట అద్దింది. శరీరం ఒకసారి నిమిరింది. ఆమెకు అత నంటే ఎంతదయ!

జ్వరం నిమ్మళించాక పరిస్థితి అంతా మామూలే. మళ్ళీ నౌకరీ; రిక్షా. ఈ రెండూ జీవితంలో తప్పేటట్టులేవు. ఆమె తనమీద ఎంత దయకనబరుస్తున్నా తనుతనే! ఆమె ధనవంతుల బిడ్డ. తనొక బికారి. ఆమె యింగ్లీషులబిడ్డ. తను కొండప్రాంతాలమనిషి. వాళ్లంతా పెద్ద పెద్ద లోగిళ్లలో తిరుగుతూ వుంటారు. తను తిరిగేదివొకరోడ్డుమీదనే. శ్రీమతిమెయిన్‌వార్నింగును అహర్నిశం,కనిపెట్టు కునిఆమె చెప్తున్న పనులను చేసుకుపోతున్నాడు. బంగాళాతుడవడం; తివాసీలు దులపడం, పక్కలు వేయడం; ఇవన్నీకాక బజార్లో రిక్షాలాగడం; ఈ చాకిరీ ఒక నిత్యకృత్య మయిపోయింది. ఇదే జీవితం. జీవితంలో ఇంతకంటే మరొక మార్పులేదు. రిక్షామీద కూచుని "ఆషాపుకు పోనీయ్, ఈషాపుకూ పోనీయ్" అని దొరసానమ్మ ఎద్దును తోలినట్టు అతన్ని బజార్లమ్మట తిప్పుతోంది. బజారు పనిలేనినాడు కులాసాకి రిక్షామీద వీథుల్లో అలాతిప్పి యింటికి తీసుకు రమ్మంటోంది. తెల్లదొరలకు భారతదేశం నందనోద్యానవనం. అందులో దొరసానులు దేవకన్యలు. చేయడానికా పనంటూ ఏమీలేదు! డబ్బుకా వెన కాడనక్కర్లేదు. శ్రీమతి మెయిన్ వార్నింగ్ యింతకంటె యింకేం కోరు

వుంటుంది! భారతదేశంలో నౌకర్లెప్పుడూ నౌకర్లే. ప్రజలంతా నౌకర్లే. పొద్దున్నే పక్కమీదనుంచి లేవగానే రొట్టె, వెన్న, పళ్లూ అన్నీ సిద్ధం చేస్తాడు ఆలాదాద్. మధ్యాహ్నం భోజనం రెడీ. తిని తిరక్క ఆమె భారత దేశంలో ఎవర్ని ఉద్ధరిస్తుంది? ప్రపంచంలో భారతదేశంవంటిదేశం యింకెక్కడన్నా వుంటుందా! గాలిషికారు తిరిగి బంగాళాకు రాగానే విడిచిన దుస్తులు మడతలుపెట్టే, పొద్దున్నే పక్కమీదనుంచి లేచీలేవగానే పరుపులూ, దుప్పట్లూ సర్ది ఒకచోట అమర్చే, బూట్లు తుడిచి, నిగనిగలాడే టట్లు పాలిష్‌చేసే నౌకర్లు తెల్లదొరలకు ప్రపంచంలో యీ దేశంలో తప్ప మరెక్కడ దొరుకుతారు? అద్భుతమైన దేశం, కల్పవృక్షంవంటి, కామధేనువు వంటి దేశం! అర్థరూపాయ డబ్బులు పారేస్తే యిక్కడికూలీ తనకు గులాం! అణా డబ్బులు మొహానకొడితే గంటసేపు రిక్షా! డజను కోడిగుడ్లు యిక్కసి ఆరణాల ఖరీదు! రెండు కాన్లు పడేస్తే లాండ్రీలో గౌన్లూ, అవీ చలవచేసి యిచ్చేస్తారు. పారిస్ మోడల్ దుస్తుబు కారుచౌక! ఇక హోటళ్ళు డాన్సింగ్‌లు, రాత్రి క్లబ్బులూ, సినిమాలూ, అప్పుడే వచ్చిన హాలివుడ్ ఫిల్ములూ ఒహో! రెండు మూడు క్లబ్బుల్లోచేరి పైవాళ్ళ ఖర్చుతో తెగ తాగవచ్చును. పుగాకుమీద యిక్కడ పన్నులేదు. ప్లేయర్సు సిగరెట్లు ధర ఒక్కరూపాయి. ఈ దేశంలో పాశ్చాత్య ప్రపంచంలో దొరికేవన్నీ లభిస్తాయి. అక్కడ ధరహెచ్చు. ఇక్కడ అంతా చౌక. తిన్నంత తింటూ, తాగినంత తాగుతూ, జల్సాగా ఖుషీగా దేవేంద్రభోగం అనుభవించవచ్చును. ఇంద్ర సభలో మేనక, తిలోత్తమలవలె నృత్యాలు, కౌగిలింతలు, ఒహో! భారత దేశంలో బ్రిటిష్‌వాళ్ళ కొలువులో ఊడిగంచేసి పించనీ తీసుకుంటూ ఇంగ్లం డులో కాలక్షేపం చేయలేక, తెల్లదొరలు మళ్ళీ భారతదేశంలో ఎప్పుడు ఉద్యోగం దొరుకుతుందా అని గోతికాడ నక్కల్లా కాసుక్కూచుంటారు యిందుకే కాబోలును! భారతదేశంలో బ్రిటిష్ పరిపాలనను స్థాపించిన పెద్ద పెద్ద దొరలంతా ఇంగ్లండులో కావలివాళ్ళు. ఇంగ్లండులో వాళ్ళు ఊర కుక్కలు. ఇక్కడ సీమకుక్కలు. వాళ్లకంటికి భారతదేశం పులావు వడ్డించిన ప్లేటు.

ఇన్ని సదుపాయాలు భోగాలు భారతదేశంలో దొరుకుతున్నా ఆమెకు అందని ఆనందమంటూ ఒకటి వుండిపోయింది. "యూనియన్ జాక్ క్లబ్"లో సభ్యత్వం కావాలని ఆరాటపడింది. దరఖాస్తుమీద దరఖాస్తు

పంపుకుంది. కాళ్లా వేళ్లాపడి బతిమాలుకుంది. కాని ఆమె రక్తం స్వచ్ఛమైన తెల్లదొరలది కానందున సభ్యత్వం దొరకడం దుర్లభమయింది. వెంటనే తన అధమజాతి జ్ఞప్తికివచ్చి ఆత్మను వేధించసాగింది. క్లబ్బులో ఎవరినోటవిన్నా ఆమె ప్రసక్తే; నగరంలో గుసగుసలు బయలుదేరాయి. గుసగుసలు బయల్దేరుతున్నకొద్దీ ఆమె జాగ్రత్త వహించింది. ఈ ఆంగ్లో-యిండియన్ కూటమి తనను పూర్తిగా పంక్తి బాహ్యురాలుగా నిషేధించనన్నా నిషేధించాలి. లేదా శిరోధార్యమని స్వీకరించనన్నా స్వీకరించాలి. ఈ పట్టుదలతో ఆమె కొంచెం దూరదూరంగా వుంటూ కాస్తబెట్టుసరి నటించింది. ఇప్పుడిక ఆమెకు జీవితంలో అందరాని ఆనందంఏదో వున్నట్టనిపించలేదు.

మునూకుసైతం ఈ జీవితం అలవాటు పడిపోయింది. ఈ చాకిరీ అంతా సంతోషంగానే కనిపించింది. మనలోమనమాట, దొరసానమ్మగారు రిక్షాలో సిస్సీని వొళ్లో కూచోబెట్టుకుని అందమైన గౌను తొడుక్కుని, ఆనందంగా నవ్వుతూ వచ్చేపోయే జనాన్ని కనిపించే బంగళాలను అవెవరివో తన కూతురుకు చెబుతూ కిలకిలమని పలుకుతూ, జేబురుమాలతో మొహం అద్దుకుంటూవుంటే రిక్షాలాగుతున్న తనకు ఎంతో సంతోషంగా వుంది: "అదిగోనే, ఆయన మేజరు జనరల్ సిల్క్లాడ్ హారింగ్టన్ !" గబుక్కున ఒక రిక్షా మునూరిక్షాను దాటి వెళ్లిపోయింది. "ఈయనా, ఆఁ! సర్ జిజీభాయ్ ఇస్మాయిల్; చాంబరాఫ్ కామెర్సుకి ప్రెసిడెంటే ప్రెసిడెంటూ" ప్రెసిడెంటుగారి రిక్షాయింకా తన రిక్షాను దాటనేలేదు. "సర్ ఛార్లెస్ రీడ్ అనీ, హోం మెంబరు" రీడ్ గారి రిక్షా యింకా వెనకనే వుండిపోయింది."అబ్బో ! ఆవిడ, లేడీ రక్షీ అని ! వైస్రాయి కౌన్సిలు మెంబరుగారి పెళ్లాం !" "పండిట్ ద్వారకాప్రసాద్, కాంగ్రెస్ ప్రెసిడెంటు కాబోల్నే" "ఆవిడ లండీ మహారాణీ సాహేబా" తనతల్లి చెప్పే ఈ మాటల కర్థం ఏమిటో తెలుసుకోడాని సిస్సీ చిన్న పిల్ల. మునూకి అన్నీ జ్ఞాపకం వుండిపోతున్నాయిమరి ! బెనారస్ సిల్కుషాపు దగ్గరపడగానే రాగానే "రిక్షా మెల్లిగా పోనీయరా" అంటూ సిల్కుషాపుకేసి దొరసానమ్మ చూస్తూవుంటే రిక్షా దానంతటదే, నగలషాపు దాటుకుపోయేది. దొరసానమ్మగారితోపాటు తానూ సిల్కు-చీరలూ, కంఠాభరణాలూ, గాజులజతలూ చూసేవాడు. రిక్షా మెల్లిగా పోనీయమన్నందుకు ఆమె ఎంతమంచిదోకదా అనుకునేవాడు మునూ. తెల్లదొరసాని టాకుటీకుచూసి ఖిగిలిన కూలీలు "ఆడదానికింత తలపొగరేమిటిరా" అనేవారు. కాని తెల్ల

దొరల బాణీవే అంతని మునూకు తెలుసును. తెల్లదొరల్ని ఎన్నడూ యీ కూలీలు చూళ్ళేదు కనక, వాళ్ళతో మసలి ఎరుగరు కనక, ఇవన్నీ వాళ్ళకి ఆశ్చర్యంగానూ, విపరీతంగానూ కనిపించవచ్చును. కాని మునూకి తెల్లదొరల అనుపానులన్నీ తెలుసును. ఈ కూలీలందరికంటే తాను తెలివైనవాణ్ణనీ, చిన్నతనంలో తల్లీ తండ్రీ పోయారుకనక కానీ, లేకపోతే తానూ బాగా చదువుకుని ఓ ఆఫీసరయిపోయి వుండేవాణ్ణనీ మునూ అనుకున్నాడు.

రిక్షామీద ఎక్కి తెల్లదొరసాని సాహేబ్ సింగ్ అండ్ కంపెనీకి వెళ్లింది. మునూను గేటు యివతలనే వుండమనిచెప్పి తను లోపలకు వెళ్ళి పోయింది. నున్నగా దువ్విన నల్లనిగడ్డం నిమురుకుంటూ సూటువేసుకున్న సిక్కుయువకుడు దొరసానిని చూసి సలాం చేయడం, ఆమె అతనూ ఇంగ్లీషులో పీస్‌పీస్‌మనడం మునూ విన్నాడు. విని తానూ ఇంగ్లీషు మాట్లాడేస్తూవుంటే ఎంత బాగుండునో కదా అనుకొన్నాడు. సిక్కు కేసి తిరిగిచూసి "ఆ గడ్డానికీ సూటు సరిపోదురా బాబూ" అనుకున్నాడు. తానూ ఒక ఇంగ్లీషువాడయిపోతే యీ యాతన్లేమీ వుండవుకదా! తను కారు ఎక్కగానే ఆవేళ, దారిలో "నీ వయస్సెంతరా అబ్బాయ్" అంటూ దొరసాని తన అరచేతిని గిల్లిన సంగతి జ్ఞాపకం వచ్చింది. తనకు జ్వరం వచ్చి నపుడు మళ్లీ గిల్లింది. ఆ గిల్లులు ఎంతబాగున్నాయి, కితకితలు పెట్టినట్లు! కాని వాటిని తలుచుకుని లాభంలేదు; ఇంతాచేసి తను నౌకరు కుర్రాడు. కాకపోతే వొక కూలీ. ఆ సిక్కుతో పిల్లదొరసాని పకపకలు, యికయికలు సాగిస్తున్నదంటే ఆయన డబ్బున్న మహారాజు కాబోలును; లేదా పెద్దపెద్ద చదువులు చదువుకున్నాడులావుంది. తెల్లదొరసాని ఎలాగా తెల్లదొరసానే!

"ఒరే కుర్రాడా! ఇలారారా! ఇవి పట్టుకెళ్లు" దొరసానమ్మగారి ఆర్డరు అందుకుని గబగబ మునూ లోపలికి పరుగెత్తాడు. మందుసీసాలు పట్టు కుని రిక్షాలో పెట్టాడు. ఇలాంటిపనులు మిగిలిన కూలీలను పురమాయించక తనకే అప్పగిస్తుంది దొరసాని. తను జాగ్రత్తగా పనిచేస్తాడు. అందుకని ఆమెకు అతనంటే నమ్మకం. మునూ సంతోషంతో దొరసానమ్మ రిక్షాలో కూచోగానే రిక్షా పోనిచ్చాడు. సాయంకాలం యింటికి వచ్చేసరికి గుండెల్లో మంట బయలుదేరింది. గుండెల్లో నిజంగా నొప్పేమీలేదు. కాని ఏదో తెలియని విచారం. తాను ఏకాకిననే దిగులు. వీపు కొయ్యముక్కలాగ ఎటూ వంగిందికాదు. కూర్చోలేదు; నించోలేదు. సాయంకాలం రిక్షా గబ

గబ లాగుతూంటే రిక్షా కుదుపులకు దొరసాని సంబరపడింది. ఆమె సంబరంచూచి మునూ రిక్షాను మరీ వేగంగా పోనిచ్చాడు. జాఖూమీదుగా రిక్షా జరజర నడుస్తూవుంటే "వీడు మయూరనాట్యం చేస్తున్నాడే" అనుకుంది దొరసాని. కూడావస్తున్న రిక్షాలను తనను అందుకోనీయక, ముందు పోతున్న వాటినితప్పించి, పక్కపక్కల వెడుతున్న రిక్షాలను కేకవేస్తూ మునూ దర్జాగా తనబండిని లాక్కొచ్చాడు. మధ్యమధ్య "అప్పనా తనమన మారోరి బైరన్నా" అని పాడుకుంటూ నవ్వుతూ తలపాగా సవరించుకుంటూ కుడితినీ సర్దుకుంటూ ఇంటికి వచ్చేశాడు.

ఆ సంతోషం యిప్పుడు విచారంగా మారింది. మునూ ఒక్కదగ్గు దగ్గి నేలమీద వుమ్మేసి "చాచా" అనుకున్నాడు. ఉమ్ములో ఎర్రని జీర కనిపించింది. అటు అతను చూడనేలేదు. మామూలుగానే అలాదాద్‌కి ఆపనీ, ఈపనీ చేసిపెడుతున్నాడు. వంట వేగంకాకపోతే దొరసాని కోప్పడుతుంది. ఇంచుమించు ప్రతిరోజూ డాక్టరుని ఇంటికి భోజనానికి రమ్మని పిలుస్తూనే వుందామె! డాక్టరు భోజనానికి వచ్చేవేళయింది.

ఉత్తర సరిహద్దు ప్రాంతాలనుంచి ఒకవారం రోజులు సెలవు సంపాదించుకొని, ఎలాగైతేనేం మిస్టర్ మెయిన్‌వార్నింగ్ భార్యను చూడ్డానికి వచ్చాడు. దొరగారిని చూడగానే మంచి వయసులోవున్నవాడే అనిపిస్తుంది. సొగసైన నీలివర్ణపు కళ్ళు, అందమైన జుత్తు; దొర నిక్షేపంలా వున్నాడనిపించింది మునూకి. అందరితోటి కలివిడిగావుంటూ ఎప్పుడూ నవ్వుతూ పలుకరిస్తూ ఏవేవో మాట్లాడే దొరనుచూసేసరికి మునూకి చాలా ప్రేమ పుట్టుకొచ్చింది. ఇంతవరకూ తెల్లదొరల మొహంలో చిరునవ్వు ఎన్నడూ చూడలేదతను. ధుమధుమలాడుతూ ధూమరాక్షసుళ్లావుండే దొరలే ఇన్నాళ్ళూ అతనికి తారసపడ్డారు. "దొరలంతా యింతేరా" అనుకున్నాడు. కాని ఈయన అందర్లాకాదు. అందరూ యీయన్లా ఎందుకుండకూడదు! అయితే అప్పర్ బజారులో నవ్వుతున్న దొరల మొహాలు కనిపించినా "పోసిద్దూ, వాళ్లు నవ్వుతూంటే దెయ్యాలు నవ్వుతున్నట్లే" అనుకున్నాడు మునూ. తెల్లదొరలెవరూ యీయన్లా సరదాగా తనతో యింతవరకూ మాట్లాడలేదు. తను కూలివాడుకనక దొరలు తనతో మాట్లాడరని సమాధానం చెప్పుకొని ఊరుకున్నాడు. కాని మెయిన్‌వార్నింగ్ సాహేబ్ మహామంచివాడు. అతను తనను చూచి నవ్వుడల్లా, తనేకాదు, నౌకర్లెవరు కనిపించినా నవ్వుతూ కులాసాగా

వుంటాడు. అందరూ యీ దొరగార్లా నౌకర్లను చూసినవ్వుతూ పలకరిస్తూ వుంటే ఎంత బాగుండును ? ఇంతకీ నవ్వితే నవరత్నాలు రాలిపోవుకదా ! ఈ దొర పీనుగలకి పలుకే బంగారం ! పెషావరునుంచి వస్తూ దొర ఆపిలు పళ్ళూ, అవీ తెచ్చాడు. ఆలాదాద్‌కు నాలుగు బత్తాయి పళ్ళిస్తూ మునూకో రెండిమ్మన్నాడు.

తనకు పళ్ళిచ్చాడని కాదుకాని, దొరంటే అతనికి సరదా. "అయనేం పని చెబితే నేను చేయలేదుకనక ?" అనుకున్నాడు మునూ. దొరసానికి బదులు ఆయనే తన రిక్షాలో కూచుని బజార్లమ్మట తిప్పమంటే బాగుండును. కాని ఆయన ఎప్పుడూ రిక్షా ఎక్కమన్నా ఎక్కడే ! ఆవిడ రిక్షాలో కూచోవడం, ఆయనకూడా నడుస్తూరావడం, "అసహ్యం ! ఛీ ఛీ", దొర యింటిదగ్గరున్నపుడు ఏపని చేయమన్నా ఎగిరి గంతులో చేసేస్తున్నాడు మునూ. కాని పాపం ఆయన ఎంతోకాలం వుండడానికి సెలవులేదుకదా ! వారం యిట్టే అయింది. అయితే యీ వారంరోజులూ అన్నిపనులు యిట్టే చకచకా చేసి పెట్టాడుకదా, తన చాకచక్యంచూసి దొర ఏమనుకుంటున్నాడో ! ఇంతకీ తనంటే ఆయనకి అభిమానం వుందంటూమా ? ఈ ప్రశ్నలకు సమాధానం దొర వెళ్ళిపోతున్నప్పుడుకాని మునూకి తెలియలేదు. అతన్ని రైల్వేస్టేషను దాకా దిగబెట్టి యింక వెళ్ళిపోదామనగా, తాను వెళ్ళిపోయేముందు దొర మునూకి అయిదురూపాయలు బక్షీ యిచ్చాడు. ఇకనేం; దొరకి తనంటే యిష్టమే !

ఈ దొర యింతమంచివాడా, వాడి దుంపతెగ, ఆ దొర, డాకుదొర మేజర్, వట్టి పాపిష్టిముండాకొడుకులా వున్నాడే ! ఇన్నిసార్లు, యిన్నిసార్లేమిటి ప్రతిపూటా బంగాళాకివస్తాడా, అతని కిన్నిపనులు తను చేసిపెడుతున్నాడా, ఒక్క రాగిదమ్మిడీ 'యిందు కొనుక్కో' అని యియ్యాడే ! తనకీ, ఆలాదాద్‌కీ యివ్వకపోతే మానె, పోనీ, దొరసానమ్మకైనా పళ్ళనీ, గిళ్ళనీ పట్టుకురాడు. తన బట్టా, తన పొట్టా తప్ప యింకేంలేదు యీ దిక్కుమాలిన దొరకి. సిర్సీతో ఆడుకుంటూవుంటే మునూను కోప్పడతాడు. సిర్సీని బోర్డింగ్ స్కూల్లో చేర్పించేశాడు. నౌకర్లని వృత్తినే నిలబెట్టకూడదని దొరసానిగారితో చెప్పి పెద్దపెద్ద పనులు చెప్పేస్తున్నాడు. ఆవేళ అలాగే; తనూ, దొరసానమ్మగారూ గుర్రంమీద కూచుని, మునూను గుర్రంముందు నడవమన్నాడు. గుర్రంమీద కూచున్నవాళ్ళకి పదిమైళ్ళుకాదు, వందమైళ్ళన్నా కులాసాగానే

వుంటుంది. గుర్రంముందు కూచున్నవాళ్ళకి ? ఆ జ్ఞానంవుంటే తనను పది మైళ్ళు నడిపించి మషోబ్రా తీసుకువెడతాడా దొర! ఒక్కొక్కప్పుడు గుర్రంమీద, ఆదివారంపూట రిక్షామీద దొరసాని మషోబ్రా వెడుతున్నది.

ఆ ఆదివారం పొద్దున్న దొరసాని గాలిషికారుకు బయలుదేరుతూ రిక్షావెంట నలుగురు కూలీలను తీసుకువెళ్ళింది. మునూ అయిదో కూలీ. రిక్షాచక్రాలు గుండ్రంగా రోడ్డును కొలుచుకుంటూ పోతూవుంటే లక్కర్ బజారు, చర్చి, సైన్యాధికారి బంగాళా, బొమ్మల దుకాణాలు, అనాథ శరణాలయం, సౌంజౌలీ బజారు ఒక్కొక్కటే దాటుకుపోతున్నవి. బజారులో అక్కాబత్తుడి దుకాణం కనిపించింది.

దుకాణంముందు ఆడవాళ్ళు నించున్నారు. వీళ్ళు తన కొండలప్రాంతపు వాళ్ళల్లే వున్నారే. ముక్కులనున్న పెద్దపెద్ద పోగులు గుండ్రంగాతిరిగి పెదవులను ముద్దుపెట్టుకుంటున్నవి. తనప్రాంతపు స్త్రీలను చూసేసరికి మునూ కెంతో ఆనంద మనిపించింది. పోయినప్రాణం లేచివచ్చినట్లయింది. రిక్షా దుకాణందాటి బజారులనువదలి, తిన్నగాపోతోంది. నృత్యమందిరంలో సంగీతం వినవస్తోంది. ఈ సంగీతం ఎంత మధురంగావుంది! మాలెర్కోట నవాబు మందిరం వచ్చింది. దూరంగా చెట్లు రోడ్డుమీద నీడల దుప్పట్లను పరుస్తున్నవి. వంకరలుతిరిగిన నాల్డేరారోడ్డు, రోడ్డుపక్క తోటలు, చెట్ల నీడలు, నీళ్ళగొట్టాలు, కుండీలు మహాద్భుతంగా వున్నాయి.

పర్వత పంక్తులనుంచి నీరుతో మీదచిమ్మినట్లు చల్లనిగాలి వేసింది. చమటతో తడిసిన శరీరాని కా చల్లనిగాలి నవనీతం పూసినట్లుంది. ఎంత చక్కనిగాలి ! ఎంతచల్లనిగాలి ! గాలితోపాటు అత్తరువుల వాసన ! చెట్లు కూడా సెంట్లు పూసుకున్నాయి కాబోలును; లేక ఇవన్నీ అత్తరువు చెట్లో మరి !

దొరసాని రిక్షామీద నుంచుంటే, డాక్టరుదొర గుర్రంమీద స్వారీ చేస్తూ రిక్షాతో సమంగా నడిపిస్తూ దొరసానితో కబుర్లు చెబుతూ నవ్వుతున్నాడు. గుర్రంముందు మునూ నడుస్తున్నాడు. ఒక్కొక్కప్పుడు గుర్రం రిక్షాకంటె ముందు పోతుంది. చటుక్కున దొర గుర్రాన్ని వెనక్కితిప్పి రిక్షాకు దగ్గరగా నడిపిస్తున్నాడు. మళ్ళీ పక్కకు అదిలిస్తున్నాడు. టకటక గుర్రం కదం తొక్కుతోంటే ఆ అడుగులన్నీ తన గుండెలమీద పడుతున్నట్లు వుంది. మునూ గుండెల్లో గుర్రపు డెక్కల చప్పుడు !

దొర, దొరసానీ గుఱ్ఱంమీంచి, రిక్షామీంచి దిగి చేయీచేయీ పట్టుకొని పెళ్ళికొడుకూ, పెళ్లి కూతుర్లా ముసిముసి నవ్వులు నవ్వుకొంటూ టిఫిన్ కి వెళ్లిపోయారు. ప్లేట్లనిండా మాంసం వడ్డించుకొని, కోడిపెట్టకు పెట్టనే లగాయిస్తూవుంటే మునూకు నోరూరింది. టిఫెను అయిపోయాక కూలీలను రిక్షాస్టాండువద్ద కాస్సేపు సేదతీర్చుకోమని ఆజ్ఞాపించారు. మునూ ఒళ్ళు హూనమయిందేమో, సేదతీర్చుకోవడంమంటూ ఎలావుంటుందో తెలియలేదు. కాని మిగిలిన కూలివాళ్ళదగ్గర ఏడుపుగొట్టులావుంటే తను లోకువవుతానని అనుకుంటూనే తానేమీ అలసిపోనట్లు నటించాడు. దొరసానమ్మగారు ఇవతలకువచ్చి మునూను కేకవేసింది. "ఆ మిగిలిన టిఫిను నువ్వేతిను." ప్లేట్లు పట్టుకొని ఇవతలకొచ్చి చూచేసరికి కోడిపెట్ట కాలు కనిపించింది. కాలుకి కాలే తినమని యిచ్చిన దొరసాని ఎంతమంచిది! ఎలాగైనా ఎన్నన్నా దొరసాని దొరసానే! మిగిలిన కూలీలకి యివ్వలేదంటే తనేమో ఆవిడ సొంత నౌకరూమరి! కుళాయి దగ్గరకుపోయి శుభ్రంగా మిగిలినదంతా తిని యిన్నినీళ్ళు తాగి రిక్షాస్టాండువద్ద దొరసానమ్మగారికోసం కనిపెట్టుకూచున్నాడు.

కుళాయిదగ్గర కడుపునిండా మాంసంతిని, నీళ్ళుతాగి చేతులు తుడుచుకుంటూ వస్తున్న మునూనుచూసి మిగిలిన కూలీలు ఎగతాళి చేస్తున్నారు: "ఎంగిలి కూడు! ఛా ఛా!"

"అదేం దొరసానిరా! చెత్తల దొరసానీ!"

"చెత్తల దొరసానో, గిరసానో, అవన్నీ నాకెందుకు?" అని ప్రశ్నించాడు మునూ. "మీ కేమీ పెట్టలేదని మీ కంత ఉడుకు."

"ఏడిశావ్ లే! నీకోసమే చెబుతూంట!"

"ఇదేమిట్రా నీ కీచాకిరీ! చేసినపన్లన్నీ చాలక, దున్నపోతులా దొరసాన్ని కూచోబెట్టుకుని రిక్షాలాగడం, నీకర్మకాలా!"

మునూ ఏమీ మాట్లాడలేదు.

"రిక్షాలాగుడు బతకొచ్చునే! పైపెచ్చు ఆవిడదగ్గిర ఆ చాకిరీచేయడం కర్మేం నీకూ?"

"ఇన్ని పన్లు చేయడంవల్ల నీమొఖం ఎలా అయిపోయిందో చూడు. పంకుతమలపాకులా పాలిపోయింది"

"కళ్ళు లోతుకుపోయాయి"

మోహన్, మునూ నాడిపట్టుకుని పరీక్షించాడు "క్షయేమో కొంపదీసి?"

"నాతో హాస్యాలెందుకన్నా! ఒక్క సిగరెట్టు యిద్దూ!"

ఇంటికి వెళ్లిన తరవాత రాత్రల్లా మునూ దగ్గుతూనేవున్నాడు. అతని దగ్గులకు ఆలాదాద్ లేచిపోతూనే వున్నాడు.

"అబ్బ! నీ అమ్మకడుపు బంగారంకానూ; నిద్రపట్టనీయవురా, మునూ!"

"మొన్న నువ్విచ్చిన బీడీ తాగినప్పట్నుంచీ యిలాగే వుంది మావాఁ!"

పొద్దున్నే లేచి పళ్లు తోముకుని, గొంతుకలో నీళ్లుపోసుకుని పుక్కిలించి ఉమ్మివేశాడు. గొంతుకలోనుంచి రక్తంపడింది. నెత్తురు కళ్లెమీద యింత యిసకపోసి ఎవరికీ తెలియనీయకూడ దనుకున్నాడు. ఏదో ఒక పని చేస్తూ యీసంగతి మర్చిపోదామని ప్రయత్నించాడు కాని, మర్చిపో వీలులేని జబ్బుయిది. పేగుల్లో బాధలా జబ్బు నయంకాదుకాబోలు ననే భయం హృదయాన్ని కృంగదీస్తున్నది. మబ్బుల మబ్బులుగా భయం మసక కమ్మి గుండె నీరయిపోతోంది. "మోహన్ చెప్పినట్లు కొంపదీసి యిది క్షయకాదు కదా!"

"ఉహుఁ! ఇంక యిది నిమ్మళించదు" అనుకున్నాడు. అసలు క్షయ అంటే ఏమిటి? దీనికి ముందూ, మాకూ లేదా? ఇదివరకు అనేకసార్లు తాను మరణిస్తే బాగుండునని కోరుకున్నాడు. ఈ మూడురోజులూ బాధను తట్టుకోలేక చనిపోవాలనే అనుకున్నాడు. కాని మరణం! ఎంత భయంకరమైనది! కాని భయంకరమైన మృత్యువు తనను సమీపిస్తున్నదని అతను భావించగానే, దుఃఖం ఉబికుబికి వచ్చింది. మరణం! మరణించినవెంటనే ఊపిరి ఆగిపోతుంది కాబోలును; లేక ఊపిరి ఆగినవెంటనే మరణం వస్తుంది కాబోలును!

ఈలోకంలో తనకు 'నా' అన్న వాళ్ళెవరూ లేరు. ఉన్నవాళ్ళెవరూ మిగలలేదు. మిగిలింది ఒకే ఒక రతన్! అతనికి ఒక ఉత్తరంముక్క రాసి పడేస్తే, ఏమని సలహాయిస్తాడో! ఇప్పుడు యిక్కడతను ఏకాకి. అక్కడ రతనూ ఏకాకే. ఇంతకీ అతను బతికేవున్నాడా? పాపం చనిపోయేడేమో! అతను చనిపోతే తను ఏం బావుకుందామని బతికివుండడం? ఉహుఁ! అతను చనిపోలేదు. బతికుంటే తప్పక తనకతను సహాయంచేస్తాడు.

ఆవేళ దొరసాని చాలా అడావిడిగా వుంది. ఎక్కడికో వెళ్ళే ప్రయత్నంలో వుంది. హాంకాంగ్ కొట్టుకు వెళ్ళమని మునూను ఆజ్ఞాపించింది. దగ్గిదగ్గరున్న బట్టలు పట్టుకురమ్మంది. "ఈ ఉత్తరం డాక్టరుగారి కిచ్చిరా" అంది. ఏమిటీ సంగతంతా అని అలాదాద్‌ను మునూ అడిగితే "హైస్రాయి గారికి టీపార్టీరా" అన్నాడు.

ఉత్తరం పట్టుకుని డాక్టరుగారింటికి వెళ్ళేదారిలో రైల్వేబోర్డాఫీసుకు ఎదురుగావున్న చిన్న పోస్టాఫీసుకు వెళ్ళాడు. ఒక ఉత్తరం రతన్‌కి రాసి పడవేశాడు. తాను సిమ్లా ఎలావచ్చిందీ, దొరసానమ్మగారింట ఎలా పనికి కుదురుకున్నదీ వివరాలన్నీ తెలిపి "నాకిక్కడ ఏమీ తోచడంలేదు. వొంట్లో బాగులేదు. ఏడుపొస్తోంది. నువ్వు యిక్కడకొచ్చేస్తే బావుణ్ణు. నీకు వీలు లేకపోతే, నేనే అక్కడకువచ్చేస్తే సరదాగావుండును. బొంబాయిలో నాకో నౌకరీ చూపించావంటే వచ్చేస్తాను. నువ్వెప్పుడు రమ్మని రాస్తావా అని ఎదురుచూస్తున్నాను."

మునూ తిన్నగా డాక్టరు దొరగారి బంగాళాకి వెళ్ళి దొరసానమ్మగారి ఉత్తరం బట్వాడా చేశాడు. ఉత్తరం చదువుకుని, తానో ఉత్తరంరాసి, "ఇదీ మిస్టర్ దాస్ కియ్యి".

"ఎక్కడండి దొరగారి బంగాళా ?"

"హెడ్డాఫీసు లేదూ?"

"వుందండి. ఎరుగుదును."

"అక్కడికి మూడు మైళ్ళుంటుంది. తిన్నగావెళ్ళి పొలిటికల్ డిపార్టు మెంటు ఎక్కడని అడుగు."

మునూ ఉత్తరంపట్టుకుని తిన్నగా హెడ్డాఫీసుకువెళ్ళి అక్కడనుంచి మూడుమైళ్ళు నడిచాడు. మిస్టర్‌దాస్, విదేశాంగ రాజకీయ శాఖోద్యోగి. తీరా ఆఫీసు కనుక్కొని వెళితే ఆయనక్కడ లేడని, యింటికి టిఫినుకు పోయాడని చెప్పారు.

'చచ్చేనురా భగవంతుడా' అనుకుని ఆయనయిల్లు తటసీళ్ళన్నీ అడిగి మునూ మరి రెండుమైళ్ళు నడిచాడు. మిస్టర్ దాస్ భార్యతో కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ భోజనం చేస్తున్నాడు. తిన్నగా ఆయన దగ్గరకు వెళ్ళి ఉత్తరం యిచ్చాడు మునూ. కవరు చించి ఉత్తరం చదువుకున్నాడు మిస్టర్

దాస్. "ఈ గవర్నమెంటువాళ్ళు మిమ్మల్ని అన్నంకూడా తిననీయరేమిటండీ?" తన భర్తకు ఎంతోటి పనులు వుంటున్నాయో అని ఆయనభార్య అతిశయంతో ప్రశ్నించింది.

"గవర్నమెంటు కాదులే."

"మరెవరు రాశారా ఉత్తరం?"

"అబ్బబ్బ! చంపేస్తున్నారనుకో ఒసేయ్ నన్ను! ఈ వైస్రాయికి విందు కాదుకానీ, నా తలప్రాణం తోకకొస్తోంది. పొద్దున్న పన్నెండు మందికి టిక్కెట్లిప్పించానా, యిది పదమూడోది!"

"ఇదెవరికీ?

"మన హెల్తాఫీసర్లేడూ...అతనూ వస్తాట్ట! విందులూ, నృత్యాలూను... కాదేవ్! అతనికేకాదు; మిసెస్ మెయిన్‌వార్నింగ్‌కూడా కావాల్ట!

"మిసెస్ మెయిన్‌వార్నింగూ! ఆవిడెవరు? వార్నింగ్?" "ఆవిడకీయన మరిగాడు!" మిస్టర్ దాస్ ఆలోచనలో పడ్డాడు. అతనిభార్య "ఇవ్వనంటే ఏమనుకుంటాడో"

"అదే ఆలోచిస్తున్నాను"

"మరి మన చిట్టి పిల్లకి జబ్బుగా వుందంటే వచ్చి చూశాడా? మొహమ్మాటాలు ఎవరికైనా వుంటాయి."

మిస్టర్ దాసు సరేనని "మీ దొరగారికి నమస్కారాలని చెప్పరా అబ్బాయ్" అని మునూను పంపివేశాడు.

దారిలో దిక్కులుచూడకుండా తిన్నగా దొరసానమ్మగారిబంగాళాకు వచ్చేశాడు. పర్వతాలమీద మబ్బులుపడుతూ ఆకాశమంతా కప్పివేస్తున్నాయి. ఇంక బంగాళా వందగజాలదూరంలోవుందనగా మెరుపులు, ఉరుములు రానే వచ్చాయి. సరిగ్గాబంగాళాలో అడుగుపెట్టేసరికి కుండపోతగా వర్షం కురియడమారంభించింది. ఆ కురవడం కురవడం నాలుగు గంటలసేపు ఒకటే పోత. అప్పటికి వాన కాస్తతగ్గి తిరుగుమొహంపట్టి, చక్కని గాలివేసి మబ్బుల్ని చెదరగొట్టింది. స్లట్లెజ్ నది నిండు గర్భిణిలా ప్రవహిస్తూ దూరంనుంచి వొక వెండి సముద్రంలా కనిపిస్తోంది. వాన కురియలేదు కాని, గాలిమాత్రం మూడు రోజులపాటు వేసింది. అమావాస్య రోజులు. మునూ ఎక్కడికీ కదలడంలేదు.

పొద్దున్న భూటమాత్రం దర్జీవాడి దగ్గరికోసారీ, జోళ్ల షాపుకోసారీ. మునూను దొరసాని పంపించింది.

ఒకనాటి సాయంకాలం మునూ, మోహన్‌ను చూడ్డానికి వెళ్ళేడు. మళుపురలో లోవర్‌బజారు దాటేక చిన్న చిన్న భూరిగుడిశలు వున్నాయి. వాటిలో కూలీలు నివసిస్తున్నారు. గుడిశల పక్క మురుగు కూపం, దోమల సంగీతంతో గుయ్‌గుయ్ మంటున్నది. ఈ గుడిశల్లో ఏ గుడిశ మోహానుదో మునూకు తెలిసిందికాదు. గుడిశలముందు కూలీలు చిలుం పీలుస్తూ కబుర్లు చెప్పుకుంటున్నారు. గుడిశలలో ప్రమిదల సన్నని వెలుతురు కూలీల తలపాగాలమీద పడుతోంది. ఈ కూలీలంతా సిమ్లా పర్వత ప్రాంతీయులే అయినా తన కాంగ్రావాసులకుమల్లే కాదు. ఇంతకీ వీళ్ళంతా తనకు క్రొత్త. కనక మునూ సంశయిస్తూనే గుడిశలచెంతకు వెళ్లాడు.

గుడిశలముందు కూచుని కూలీలు చిలుం పీలుస్తూ పాటలు పాడుకుంటున్నారు. గుడిశల దగ్గరకు వెళ్ళేసరికి లోప లొకపూరికొంపలో పెనం మీద అట్లు వేస్తున్నాడొకకూలీ. మరొకకూలీ యింకో గుడిశలో బూరెలు చేస్తున్నాడు. పొగ తుట్టలుతుట్టలుగా గుడిశెలనిండా కమ్మి మీదికిపాకి, పాముల్లా కొండచిలువల్లా మెలికలు తిరిగి కూలీలను కప్పివేస్తున్నది. పొగ గొంతుకలోకి పోయింది. దగ్గుతెర వచ్చింది. అయినా మునూ కూలీలపాటలు వింటూ నించుండి పోయాడు. ఒక గుడిశముందు కూచుని మోహన్ అన్నం తింటున్నాడు. కొందరు కూలీలు అప్పుడే అన్నం తినేశారు. మరికొందరు నిద్ర రాకపోయినా పడుకున్నారు.

మునూని చూడగానే, అతన్ని ఎరిగిన యిద్దరుకూలీలు "రా! రా!" అని పిలిచారు. మోహన్ గోనెపట్టా తెచ్చి నేలమీద పరిచాడు. ముసలి కూలీలు అతనివంక పరకాయించారు.

"ఏమిటన్నా! ఈవేళ బూరెలూ, గారెలూ" మోహన్, మునూ ప్రశ్నకు జవాబిచ్చేలోపునే, వొకకూలీ "ఏంత దొరసానికొలువులోవున్నా నీకుంపతెగా, మన పండుగలమాటే మర్చిపోయావూ?" "వాళ్ళమాటల కేంలే! నీతో హాస్యాలాడుతున్నారు. పండుగాలేదు, ఎండుగాలేదు. కొంపా గోడీవున్న వూరు వదిలిపెట్టి వచ్చేశారు. ఇక్కడేం తోస్తుంది? నీలాటి కుర్రాళ్ళు కనిపిస్తే పరాశకాలు" అన్నాడు మోహన్.

" ఏమీ అనుకోకు, ఏదో హాస్యానికన్నాం " అంటూ ఆ కూలివాడు మోహన్‌కేసి తిరిగి " పొద్దుక్కే నీతోపాటు లేపేద్దూ బాబ్బాబూ! సొంజాలి వెళ్ళాలి "

బీడీ కాలిగిస్తూ " అలాగేలే " అన్నాడు మోహన్. " అన్నట్టు నా కిప్పిస్తానన్న అప్పుమాటేంచేశావు భాయీ! మనపెళ్ళి దగ్గిరకొస్తోంది "

" ఏం చేయలేదు. ఏమీ చేయను. పెళ్ళిచేసుకుని ఏం సుఖపడదామని? అప్పుచేసి పప్పుకూడా? పెళ్ళయితే సంసారంరా భాయీ! "

" దాన్దారి దాన్ది. దీన్దారి దీన్ది."

"ఇప్పటికే నీ గుండె చెడిపోయింది. కష్టానికి రిక్షాలాగితే నీ పని ఏమవుతుందీ!" ఇంతలో మరొకకూలీ అందుకుని "ఇంతకీ పెళ్లయితే ఏం చేస్తావురా పెళ్లాంతో?" కూలీలంతా ఫక్కున నవ్వారు. "అయితే యింకేం చేసేది నేను?" మళ్లీకూలీ ప్రశ్నించాడు. "హాయిగా మీ ఊరు పో. మడి దున్నుకు బతకవచ్చు మహిలో......"

"దున్నుకుందుకు మడిచక్కేదీ? అది తాకట్టులో వుందికదా?"

"అయితే నాతోరా. తాకట్టు విడిపిస్తాను. ఆ తాకట్టు పట్టిన గాడిద కొడుకు బుర్ర పగలకొట్టి నీ భూమి నీ కిప్పిస్తాను."

మోహన్ కూలీలకేసి తిరిగి అన్నాడు: "మనం ఏ పనిచేయనీయండి! ఏపంట పండించనీయండి. పండించిన పంటలో, చేసినపనిలో కూలీలకూడా వంతుండాలి."

"ఈ కబుర్లన్నీ ఎవరికైనా చెప్పు. నేను మాత్రం యిక్కణ్ణుంచి పోను. ఏదో ఓపని చేసుకుంటూ దొరికిందేదోతింటూ బీడీలు కాల్చుకుంటాను."

"నిన్నలాగా బతకనీయరు. ఏ పని చేస్తున్నావో ఆ పనే నిన్ను చంపుకు తింటుంది."

"రేపు చెబుదువుగాన్లే నీ పురాణం" అంటూ ఆ కూలీ దుప్పటి ముసుగు తన్నేడు.

"సరే! ఇప్పుడే వస్తానుండ"మని మోహన్ వెళ్ళిపోయాడు. మోహన్ వెళ్ళిపోగానే మునూ కీ ప్రపంచం వింతగా, కొత్తగా కనిపించింది. ఈ ప్రపంచంలో తనకేమీ సంబంధం లేదనిపించింది. మోహన్ ఎదటవుంటే మునూ

తనకు తెలియకుండానే పొంగిపోతాడు. అతని కితనంటే ఎంతో అభిమానం. దుప్పటి ముసుగు తన్ని పెట్టిన కూలీ మొహం పైకెత్తి "మోహన్" అన్నాడు. ఒహో వెళ్లిపోయాడూ? అనుకుని "మా తమాషా అయిన మనిషి! తానంత చదువుకున్న వాడైతే యిక్కడ రిక్షా లెందుకు లాగుతున్నాడో మరి?"

అతని ప్రశ్నకు ఒక ముసలికూలీ జవాబిచ్చాడు: "పెద్దింటి వాడ్రా అతను!"

"మరి యీ కూలిపనేం కర్మ?"

"చిన్నప్పు డలా అలా తిరిగి చెడిపోయాడు. పైలా పచ్చీసుగా వెళ్లిపోయాయి రోజులు. ఇప్పుడు విచారిస్తున్నాడు."

"విచారించేం లాభం?"

"లాభమో నష్టమో! మొదట యీ కూలిపని అతనికీ కష్టంగానే వుండేదిట! అంతా కొత్త. కూలివాళ్ళల్లో కలిసిపోవడం యిబ్బందనిపించిందట. మన్లో కలిసిపోవాలని ఎంతో యిదవుతున్నాడు."

"పాపం" అనేమాట తనకు తెలియకుండానే మునూ హృదయం లోంచి దూసుకువచ్చింది.

"అంతా చిత్రం! విచిత్రం!" అంటూ కూలీ ముసుగులో దూరేడు. ముసలికూలీ తనధోరణి సాగిస్తూనే వున్నాడు: "అతను దొరుకుతాడా, పట్టుకుందామా అని సర్కారువారు చూస్తున్నారు. ఏంచేస్తూవుంటాడో అని సి. ఐ. డీ. లు అతన్ని కనిపెట్టుకు తిరుగుతూ వుంటారు. ఈసంగతి మీ కెప్పుడూ మోహన్ చెప్ప నేలేదా?"

"లేదు." కూలీలు భయపడిపోయారు.

అయితే ఇవాళో రేపో చెబుతాల్లెండి! మిమ్మల్ని..."

ముసలికూలీమాట ముగియకుండానే మోహన్ చేతిలో ఒక ప్యాకెట్టు పట్టుకుని వచ్చేశాడు: "మునూ! ఇంద! తిను! ఇక్కడేం దొరకవు నీకు పెడదామంటే. షాపుల్లో మిఠాయివుండలు తప్ప మరేంలేవు. ఎప్పుడూ అవి మాత్రం తినకేం! ఇదిగో! రోజూ పళ్ళుతినాలిరా అబ్బాయ్‌నువ్వు! అర్ధశేరు పాలైనా తాగితేనే కాని నీఆరోగ్యం తిన్నబడదు. వెళ్లు...ఇంటికి వెళ్లు... టైము అయిపోతోంది."

మునూ "రాం రాం" అంటూ వెళ్లిపోయాడు. మోహానంటే యిదివర కెన్నడూ లేనంత అభిమానం పుట్టింది. అభిమానంతోపాటు భయమూవేసింది. ముసలికూలీ చెప్పినమాటలు గింగురుమంటున్నాయి. బొంబాయిలో రతన్‌ను పనినుంచి తొలగించివేశాక, ఆనాటిరాత్రి ముగ్గురు నాయకులువచ్చి ఏమేమో ఉపదేశించారు. ఆనాటిరాత్రి ఈవేళ మళ్ళీవచ్చిం దనిపించింది. మోహన్ కూడా వాళ్ళలాగే నాయకుడు కాబోలును!. అతన్ని తలచుకుంటూ అతను తన చెంత వున్నప్పుడు కలిగే ఆనందాన్ని యిప్పుడు సైతం అనుభవిస్తూ మునూ యింటికి వెళ్లిపోయాడు.

శుక్రవారం వొచ్చింది. అమ్మగారి సంతోషం చెప్పలేం. ఆవేళే నృత్యప్రదర్శనం. సైస్రాయిగారు ప్రదర్శనానికి వస్తున్నారు. ఎంతో అందంగా పర్వతాలమీద సూర్యకాంతి పడుతున్నది. గాలులు సన్నసన్నని ధ్వనులు చేస్తున్నాయి. పర్వతాలమీద జలపాతాలు సూర్యకాంతికి మెరుస్తున్నాయి. చిన్నపిల్లలా ముస్తాబయి, మొహానికి పౌడరు అద్దుకుని ఎత్తుమడమల జోడు తొడుక్కుని దొరసానమ్మ రిక్షామీద కూచుంది. డాక్టరు సిసిలి 'హోటల్‌కి వస్తానురమ్మనమన్నాడు. అక్కణ్ణుంచి యిద్దరమూ నృత్యప్రదర్శనానికి వెళదా' మన్నాడు. రిక్షామీద కూచునేముందు తన అందం వొకసారి చూసుకుని మునూను "ఎలాగుందిరా?" అంది. "బాగుంది. బాగుందమ్మగారూ!". అనగానే, వాడి అరచేయిమీద గిల్లి కితకితలు పెట్టినట్టు భుజాలమీద చేతులు ఆనించి కిలకిల నవ్వింది. హోటలుదగ్గరకొచ్చేసరికి చెమటకు మునూ చొక్కా తడిసిపోయింది. హోటల్ ముందు ఆవిణ్ణి దింపి ఆవిడ లోపలకిపోయాక, యివతల నిలబడి చొక్కా వొంటిమీదే ఆరబెట్టుకుంటూ కొసలుతీసి దులుపు తున్నాడు. హోటల్ నుంచి సైస్రాయి భవనానికున్నదూరం 'అదొక దూరమేనా' అనిపించింది మునూకి. గబగబ రిక్షాను లాగుతూ ఎంత త్వరగా పోదామా, వచ్చిన దొరసానుల్ని చూద్దామా అని అతని ఉబలాటం. ఉబలాటం ఊరికినే పోలేదు. సిమ్లా వచ్చినందుకు సంతోషించాడు. పెద్ద పెద్ద గదులలో, గోడలకున్న ఫోటోలను చూస్తూ భవనానికి దూరంగా వంద లాది కూలీలతోపాటు తానూ కూచుని వచ్చిపోయే దొరబాబుల్ని వీక్షిస్తూ 'ఎంతదృష్టం,' అనుకున్నాడు మునూ. ఎత్తుమడమల బూట్లమీదపడుతున్న సిల్కుదుస్తులతో, గుండ్రని భుజాలను ఊపుకుంటూ దొరసానులు వొక్కరొక్కరే లోనికి వస్తూవుంటే మునూకి పట్టరాని సంతోషం

కలిగింగి. పొడుగైన నల్లని కోట్లు, కాలర్లు, షర్టులు, మెడల్సు వేసుకుని దొరలు వస్తున్నారు. మరికొందరి దుస్తులు మరీ తమాషాగా వున్నాయి. అంత పొడుగైన కోట్లు ఎలా తొడుక్కోగలిగారా అనుకున్నాడు. ఆ కోట్లు తళతళ మెరుస్తూంటే కళ్లు జిగేల్ మన్నాయి. వీటిమీద బంగారపు పూత ఎందుకు చెప్మా అనుకున్నాడు. కాళ్లకంత బిగుతుగా షరాయి లెందుకో అడపా తడపా మహారాజులుకూడా కనిపిస్తున్నారే! ఓయిబాబు, వీళ్లు తొడుక్కున్నవి బట్టలుకావురాబాబూ, ఇవి తొన్నుకాని! దొరసానులు, దొరబాబులు, మహారాజులు, వాళ్లతోపాటు వాళ్ల అబ్బాయిలు, అమ్మాయిలు బిలబిల్లాడుతూ వస్తున్నారు. పిల్లల్ని చూసి మునూ కొంచెం యాశ్చర్యపడ్డాడు. ఇంతంతలేసి దుస్తులు వేసుకుని, అంతంతలేసి గడ్డాలతో వున్న వీళ్లకూడా నృత్యాలంటే ముచ్చటేమిటని, కూలీలు నవ్వుకోసాగారు. అతిథులు లోనికి వెళుతూంటే, "గాడ్ సేవ్ దికింగ్" ఆరంభమయింది. మునూ చెవులు రిక్కించి వింటున్నాడు.

"ఈ డ్యాన్సులు బలేతమాషాలే" అన్నాడొక కూలీ." "అబ్బో! దీనికి చాలా డబ్బవుతుందిరా! మా దొరగారికి బట్టలకే రెండువేలయాయి."

"మా అమ్మగారిగౌనుకే అయింది మూడొందల రూపాయల సొమ్ము" అన్నాడు మునూ. వెటకారంగా మోహన్ "మరి టిక్కెట్టు సంపాదించడానికో?" మోహన్‌కేసి తిరిగి ఒకకూలీ అడిగాడు: "నీ సంగతి చూస్తే, నీ కీ డ్యాన్సు బాగున్నట్టు లేదే!"

"వాళ్ళ వ్యవహారం చూస్తూంటే తలనొప్పి నాకు. ఇంతడబ్బు తగలేయడం వాళ్ళ కెందుకు ఆనందమో నాకు తెలియడంలేదు. జన్మలో ఒకళ్ళమీద ఒకళ్ళకి పడదు. పడకపోయినా ఇక్కడ అంతా కలుసుకుంటారు. ఒకళ్ళనిచూస్తే ఒకళ్ళకి కడుపుమంట. వాళ్ళలో కులాలు మాపట్టింపులే. మనకన్నా హెచ్చు. ఓ దొరసాని మొగుడు నెలకీ అయిదొందలు తెస్తున్నాడనుకో. దానింటికి రెండువేలు తెచ్చేజీతగాడి భార్య వెళ్లమన్నా వెళ్లదు. అయిదొందలు తెచ్చేవాడి పెళ్లాం, మూడొందలుతెచ్చే దొరభార్యని పలకరించమన్నా పలకరించదు. ఒరే అబ్బాయిలూ! నాకు తెలుసున్రా. డబ్బున్న వాళ్లింటో లక్ష్మి వుంటుందికాని, ప్రేమ వుండదురా. ఉహుఁ! ఈ దొరసానులు, దొరలు ఒకళ్లతో ఒకళ్లు యిష్టంగా వుండరే! అంతా వాళ్లకి డబ్బు; డబ్బు! ఛస్సి."

"మరి యీ వేషాలెందుకు ?"

"మనల్ని ఏలుతున్న పెద్దదొర జల్సాకి! గౌన్లు బిగిగావుంటాయేమో దొరసానులకి చెమటపోస్తుంది. సరే పరాయివాడి పెళ్లాంమీద చేతులు వేయకపోతే దొరలకి మతే పోతుంది. ఒకళ్లనొకళ్లు ముద్దులు పెట్టుకుని ఎంతో బాగుందనుకుంటారు. హోటళ్లకి పోయి పీకమొయ్యా తిని తాగుతారు. ఇక్కడ మనం ఆకలితో మాడిచస్తాం..."

"దొరల తమాషాలన్నీ నీకు తెల్సునే. దొరసానుల కిల్లాడీతనం నీకేం తెల్సునోయ్?"

"సరిసరి! విను, చెబతాను, కథ; జాఖూ కొండలమీద ఓ దొరుండే వాడు. అతనికి సైన్యంలో పెద్ద ఉద్యోగమే. అతని భార్య మహాకిల్లాడీ. రంగేళీ."

"వయస్సు ?"

"ఉంటాయిలే పాతిక. బాగుండేది పిల్ల"

"దొరగారి వయస్సో ?"

"ఆయనికి ఏభై; అక్కడే వొచ్చింది తిరకాసు."

"తిరకాసేముందయ్యా! అంతముసలాణ్ణి అదెందుకు చేసుకోవాలీ ?"

"డబ్బురా, డబ్బు! దొరడబ్బును దొరసాని ప్రేమించింది. పెళ్లి చేసుకుంది. కాని దొర ఆవిడ వొంటిమీద చెయ్యి వేశాడా, దూరంగా వెళ్లి పోయేది. అలా మొగుణ్ణి తోసేస్తూ దొరసాని దూరంగా వెళ్లిపోవడం, గులాం చాలాసార్లు చూశాడు. గులాం వాళ్లింటనౌకరు. మంచి బలంగా వుండేవాడు. వయసుకాడు. మనిషి మంచివాడే కాని దొరసానంటే మాత్రం అతనికి పడేదికాదు."

"తర్వాత, తర్వాత"

"దొరసానికి దొరంటే వొంటిమీద కారంరాసుకున్నట్లుండేది. పొద్దున్నే అతను ఆఫీసుకు పోగానే, ఆవిడ హాయిగా తాగేది. డ్రాయింగు రూములో పనిచేసుకుంటున్న గులాంను చూస్తూ నిలబడేది. ఆవిడక్కడ నిలబడితే వాడికి పనెలాసాగుతుంది? జబ్బలదాకా పల్చనిగౌను తొడుక్కుని దొరసాని ద్వారం దగ్గర బొమ్మలా నిలబడితే గులాంకి గంగవెర్రు

లెత్తేది. వాడితో మాటా మాటా కలిపి "నీకు పెళ్లయిందా? ఆడవాళ్లు బాగుంటారుకదూ," ఇలాగ ఎన్నో ప్రశ్నలు వేసేది."

మోహన్ బీడీ వెలిగించి పొగవదులుతూ దొరసాని కథ చెబుతున్నాడు. "గులాం తనఊళ్లో ఓ అమ్మాయిని పెళ్లాడాలనుకున్నాడు. అందుకు తల్లి దండ్రులు ఒప్పుకోలేదు. ఎప్పుడో ఒకప్పుడు యింటికివెళ్లి, ఆమెను పెళ్లాడా లనుకుంటున్నాడు. ఈకథంతా గులాం, దొరసానికి చెప్పాడు."

మిగిలిన కూలీలంతా దొరసానమ్మ కథను వింటూ మోహన్‌కేసి అబ్బు రంగా చూశారు. "ఒకరోజున బాగాతాగి వచ్చింది దొరసాని. పని చేసు కుంటున్న గులాం చేతుల్ని గట్టిగా పట్టుకుంది. పట్టుకుని అందికదా: "నువ్వు ప్రేమించిన పిల్లకంటె నేనందంగా లేనూ? నేను దొరసానిని. ఇటుచూడు. నా భర్త పెద్ద ఉద్యోగి. చిన్నప్పుడు నేనూ ప్రేమించాను. అతను కవి. ఆయనా నన్ను ప్రేమించాడు. కాని పాపం ఆ కవి ఎంతో బీదవాడు. ఏంచెయ్యను. అతన్ని పెళ్ళాడలేకపోయాను. అందుకిప్పుడు విచారించి యేం లాభం? రా, నాతో ఒక్కసారి ..."

గులాముకి కోపంవచ్చింది. "నువ్వు దొరసానివైతే నాకేం, ఉద్యో గస్థుడి భార్యవైతే నాకేం; నిన్ను నేను ప్రేమించడంలేదు."

"నామీద నీకు జాలిలేదూ?"

"ఉంది. కాని ప్రేమలేదు."

ఆమె అతనిమీద పడింది. అతను ఆమెను అవతలకు తోసివేశాడు. నాటినుంచీ ఆమె దొరతో ఏంచాడీలు చెబుతుందోనని భయంగానేవుంది. దొరకు కోపంవచ్చి తనను జైల్లోపెట్టిస్తే! దొరబంగాళా వొదిలిపెట్టి పారి పోయాడు గులాం. ఆమె అతన్ని వెంబడించింది: "వెళ్ళిపోకు! పని వొదిలి పెట్టకు! రా, నాతో రా" కాని అతను ఆ పోవడం పోవడం మళ్ళీ రాలేదు. తెల్లదొరలు ఆనందంగా, హాయిగా వుంటారనేమాట సర్వాబద్ధమని గులాం నమ్మకం.

మోహన్ దొరసానమ్మ కథ ముగించి యిలా అన్నాడు: "గులాంకే కాదులే. నాకూ తెలుసును వీళ్ళ మజాకాలు. నేనూ యూరపులో చూశాను. డబ్బున్నవాళ్ళ కావల్సింది కేవలం సుఖం అనుకో. అదెలా రానీయ్ వాళ్ళ కక్కర్లేదు."

మోహన్ చెప్పిన కథ కూలీలకు చాలా విచిత్ర మనిపించింది. మెల్లగా ఒక కూలీ ప్రశ్నించాడు: "అన్నా! ఈ దొరల డ్యాన్సేమిటి? ఆడదీ, మగాడూ అలా చైతక్కలాడతారేం?"

"అదంతా ప్రేమ! అదో ఆట! ఆమూలకి యీమూలకి ఒదిగి, అటూ యిటూ ఆడి, ముద్దులు పెట్టుకుంటారు. ఒకళ్ళ నొకళ్ళు కౌగిలించుకుంటారు. ఆఖరుకి ఓ పక్కలో పడుకుంటారు. ప్రేమకు ముందివన్నీ జరగాలన్న మాట. లేకపోతే ప్రేమ పుట్టదు. మనకేం తెలుసును. మన కిలాంటి దిక్కుమాలిన తతంగాల్లేవ్. మనం వాళ్ళకంటె వెయ్యిరెట్లు నయం. అయితేనేం, మనం వాళ్ళకి రిక్షాల్లాగుతున్నాం. వాళ్ళు మహారాజులు, మనం బానిసలం!"

"ఆగండర్రా ఆగండి! వాళ్ళొచ్చేస్తున్నారు!" అన్నాడు మునూ. "ఇటు కాదు; తోటలోకి వెళుతున్నారు."

"అదేమిటన్నీ, ఆడా మొగా చెట్టపట్టాల్ కట్టుకుని వెడుతున్నారు?"

"మొగుడూ పెళ్ళాం ఆట కాబోలు."

మునూ లేచి, తోటలోకి తొంగి చూడాలనుకున్నాడు. మోహన్ "అటు చూడకు; మీ అమ్మగారు చేయకూడనిపని చేస్తోంది. ఆనక ఉడుకోక్కగలవ్."

"అది చేస్తే మధ్యన నాకేం ఉడుకు మోత్తనం!"

ఆకాశంమీద నక్షత్రాలు మిణుకు మిణుకుమని ప్రకాశిస్తున్నాయి. దూరంగా దీపాలు ధగధగ వెలుగుతున్నాయి. భవనంలోంచి సంగీతం వినిపిస్తోంది. దొరసానులు దొరలు డ్యాన్సులు చేస్తున్నారు. సంగీతం, డ్యాన్సూ అతనికి పిచ్చెక్కిస్తున్నాయి. బాగా అలసిపోయాడేమో, ఒక్కసారి ఆవులించాడు. మోహన్ తను కప్పుకున్న దుప్పటితీసి, కిందపరచి "నీ వొంట్లో బాగులేదు. పడుకో. కాస్సేపు నిద్రపో" "అబ్బెబ్బే! నాకేం, నిక్షేపంలా వున్నాను." మునూ గొంతుక బొంగురుపోయింది. గట్టిగా దగ్గాడు. ఊపిరి బిగ్గరగా పీల్చాడు. మళ్లీ దగ్గువచ్చింది. ఈసారి దగ్గు ఆపుకుందామనుకున్నా ఆగిందికాదు. దగ్గుతూ కింద ఉమ్మివేశాడు. నోట్లోంచి నెత్తురుపడింది. "నేనిదివరకే చెప్పాను; రక్తం పడ్డం యిదే మొదటిసారికాదు. ఆవేళాయిలాగే నెత్తురు కక్కావు. అవునా?" మునూ లేదని తల ఆడించాడు. "వొంట్లో

బాగులేదని దొరసానితో చెప్పలేకపోయావ్ ? ఎందుకు రిక్షాలాగావ్ ? నీ నోట్లోంచి రక్తంపడుతోందని ఆవిడకి తెల్సునా ?"

మునూ మాట్లాడలేదు. మళ్లీ దగ్గు వచ్చింది. కళ్లమ్మట నీళ్లు కారాయి. జుత్తు రేగిపోయింది. మనిషి దగ్గు ఆపుకోలేక నిలబడిపోయాడు. నిలబడ్డవాడు వొంగుని పక్కలు చేతుల్తో పట్టుకుని దగ్గుతున్నాడు. కూలీలు అతన్ని నెమ్మదిగా కింద కూచోబెట్టారు. చుట్టూమూగి ఉపచారాలు చేస్తున్నారు. భవనం వద్ద కాపలావున్న సిపాయి ఒక్కసారి హఠాత్తుగా గుమిగూడిన కూలీలను చూసి, యిదేదో పితూరీ అనుకున్నాడు. బీటులోవున్నట్లుగానే లెఫ్ట్ రైటు లెఫ్ట్‌రైట్‌గా అడుగులు వేస్తూ ఠంచన్‌గా నిలబడి గద్దించాడు: "ఎవరది ?"

"ముర్రాడికి-వొంట్లో బాగులేదు సర్కార్ !" ఒక కూలీ నెమ్మదిగా భయపడుతూ సమాధానమిచ్చాడు.

"తీసుకుపొండి! తీసుకుపొండి! పక్కకి తీసుకుపొండి! సర్కారు యిటే వస్తున్నారు !"

మునూను భుజాలమీదవేసుకుని మోహన్ "యింటికి తీసుకువెళతాను. మీ రిక్కడే వుండండి. దొరసానికి చెప్పండి" అంటూ దొరసాని బంగాళా వైపు వెళ్ళిపోయాడు.

డ్యాన్సు అయిపోగానే, శ్రీమతి మెయిన్‌వార్నింగు, డాక్టరూ ఇవతలకు వచ్చారు. మునూ నోట్లోంచి నెత్తురుపడుతున్నదనే కబురు విని ఆమెకు మతిపోయింది. డ్యాన్సు హాలులోనూ ఆమె మనసుకు శాంతిలేదు. ఇవతలకొచ్చాకా లేదు. డ్యాన్సుహాలులో ఆమెను ఎవరూ చేరనిచ్చారు కాదు. ఆమెను మిగిలిన భారతీయులతోనే జమకట్టి, ఎవరూ దొరసానితో డ్యాన్సు చేశారుకారు. కొసకు ఒక అనామక ఇంగ్లీషు ఆఫీసరు ఆమె నడుం చుట్టూ చేతులు పెనవేసి అటూ యిటూ కాసేపు అడుగులువేశాడు. తిన్నగా యింటికిపోయి డాక్టరూ, తనూ యింత బ్రాందీతాగితే, యీ అవమానం మర్చిపోవచ్చునని ఆవిడ చరచరా యివతలకు వచ్చింది. రాగానే యీ కూలీలు చావుకబురు చల్లగా చెప్పారు. అబ్బ! జీవితం ఎంత దుర్భరంగా వుంది అనుకుంది దొరసాని.

డాక్టరు, మునూను పరీక్షించాడు. పరిస్థితేమీ బాగుండలేదనేసరికి దొరసాని కళ్ళమ్మట నీళ్ళుతిరిగాయి. డాక్టరు చెప్పినప్రకారం మునూను

ఘోటాసిన్లూ సోలోపులలో వేరే ఎక్కుచ్చిగావున్న చిన్న గుడిశలో మంచంమీద పడుకోబెట్టారు. అతనేకాక యింకో యిద్దరు కూలీలు అక్కడ యిదే వ్యాధితో బాధపడుతున్నారు. ఇతను మూడో రోగి.

మళ్ళీ యింకోకమాటు హెమరేజి వచ్చింది. దగ్గుపొరకమ్మింది. ఇంత నెత్తురుపడ్డాక కాస్త ఉపశమించింది. మోహన్ అతన్ని చూడ్డానికి వచ్చాడు. అప్పటికి మునూ గుడిసెలో వరండామీద నిద్రపోతున్నాడు. కళ్ళు లోతుకు దించుకుపోయి వున్నాయి. బుగ్గలు గుంటలుపడ్డాయి. మెడ సన్నపడింది. దుప్పటి కప్పుకుని, నిద్రలోనే మూలుగుతున్నాడు. దుప్పటి వొత్తిగించి మోహన్ శరీరంమీద చెయివేసి పక్కలు వెచ్చగా వున్నవేమోనని చూసి, గుండె నిమిరి, మోహన్ వెళ్ళిపోయాడు.

గుడిశలో ఏకాకిగా మంచంమీద మూలుగుతువ్న మునూ ప్రాణం. అతనికి రావలసిన వ్యాధి కాదుయిది. వ్యాధికితోడు పరిపరివిధాల పరుగులు పెడుతున్న మనసు. మనసు నిలవరించుకుందుకు ఎవరి ఆసరాకారములేని బతుకు. బతుకులో అతను ఏకాకి. మొదట నాలుగైదు రోజులూ, దొరసాని అతన్ని చూడ్డానికివచ్చింది. పళ్లుకొని తెచ్చి యిచ్చింది. "భయంలేదులే. నయమవక ఏం చేస్తుంది ?" అంటూ ఓగడించింది. కాని ఆమె మాటలు పెదవులమీద నుంచే వచ్చినట్లు అతనికి అనిపించాయి. ముద్రవాడిని అన్యాయంగా రిక్షా లాగించి ఉసురుపెట్టానే అనేభావం ఆమెకు కలిగింది. జాలివేసింది. ప్రేమ పుట్టింది. కాని ఎంత జాలివేసినా, ప్రేమకలిగినా దొరసాని అతనికి చేసేది అంతంత. 'వాడిదగ్గరికి వెళ్లాసి' కాదని డాక్టరు, దొరసానిని ఆంక్షపెట్టాడు. అతని కట్టుభాయిదాల్లో వున్న ఆమె, మునూ చెంతకిక రాలేకపోయింది. "అది అంటురోగం ! వెళ్ళావు కనక" అనే తన ప్రియుని మాటలు చెవులలో గిర్రున తిరిగి భయమూ, అనుతాపమూ కలిగాయి. మౌనంగా దొరసాని తన ఆవేదనను లోలోన అణచుకుంటున్నది.

డాక్టరుతో దొరసాని చేసిన చెలిమి మునూ మొదట గమనించలేదు. కాని యిప్పుడు దొరసానిమీద అతనికి జుగుప్స కలిగింది. తన నోట్లోంచి నెత్తురు కళ్ళేలు కక్కుతుంటే యిక తనకు మరణం దగ్గరపడిందని కుమిలి పోతున్నపుడు ఆమె నాలుగయిదుసార్లు అతన్ని చూడడానికి వచ్చింది. ఇప్పుడు జబ్బు మరీమోపుచేసింది. మనిషి పూర్తిగా డీలాఅయిపోయాడు. మంచంమీద పడిపోయాడు. ఎటూకదలలేని స్థితిలోకూడా అతన్ని చూసి ఎలావుందని

అడగడానికైనా ఆమె రావడంలేదు. "చచ్చిపోతానా ? ఊహుఁ! చనిపోను ! నిమ్మళిస్తుంది." తనలోతాను ప్రశ్నించుకుంటూ తనను తానే సంబాళించుకున్నాడు. ఇప్పుడు దొరసానిమీద జాలి వేసింది. దొరసానిమీదే కాదు. తనకు పరిచయమైన మనుష్యులందరిమీదా జాలివేసింది. పరిచిత వ్యక్తులమీదనే కాదు, అందరిమీద అతనికి కరుణ జనించింది. ఆనాడు పులిలా వుండేమనిషి ఈనాడు మాలీమేక. ఇదివరకు తన శరీరంలోని నరాలు తనకు తెలియకుండానే వాటిపని అవి చేసుకునేవి. ఇప్పుడవి పనిచేయడంలేదని అతను గ్రహించాడు. మొహం వివర్ణమయింది. తెల్లగా పాలిపోయింది. దవడలు లోపలకు తోసుకుపోయాయి. కళ్లు అతికించినట్లు కనిపించసాగాయి. నల్లని కనుగ్రుడ్లలో నీరు కనబడదు. కళ్లల్లో ఎర్రజీర మాయమైంది. కొండల లోయలవలె కళ్ళు. కళ్లల్లో సెలయేళ్ళవలె నీళ్ళు

మళ్ళీ యింకొకసారి దగ్గుతెరవచ్చింది. అతను నిలువునా కంపించిపోయాడు. సూర్యుడు ఉదయించాడు. దగ్గు కాస్త తగ్గింది. భయం పోయింది. మనిషి స్థిమితపడ్డాడు.

ఇపుడు ఊపిరి బాగా ఆడుతోంది. లోపలికి గాలి బాగా వెళుతోంది. దగ్గు రాలేదు. "అమ్మయ్య! భయంలేదు" అనుకున్నాడు.

మనిషికి కడుపునిండా ఊహాలే. వొంట్లో బాగుందనిపించేసరికి మళ్ళీ మధురమైన కలలు కన్నాడు. రతన్ ఉత్తరం రాశాడు: "తమ్ముడూ! భయపడకు. వెంటనే బొంబాయి వచ్చేయ్. ట్రేడ్‌యూనియన్ ఆఫీసులో నీకొక చిన్న ఉద్యోగం చూశాను. జీతం తక్కువే అయినా గడవడానికేం ఫర్వాలేదు. నేనుండగా నీకేంభయం వెర్రితమ్ముడూ! ఇక్కడ ఫ్యాక్టరీవాళ్ళమీద, కాబూలీ అప్పులవాళ్ళమీద, ఫోర్‌మన్‌మీద మేం పోరాడదల్చుకున్నాం. ఈసారి విజయం మనదే. నువ్విక్కడ లేవుకదాని, నాకూ దిగులుగానే వుంది." ఉత్తరం చదివి మునూ బొంబాయి వెళ్ళిపోదామనుకున్నాడు. "ఇదిగో! కొంచెం వొంట్లో సత్తువరానీ, వెడుదువుగాని" అని ఆత్మ అనునయించింది. రోజులు గడుస్తున్నాయి. గాలివిసురు తగ్గింది. ఈగలబాధ, దోమల గుఁయ్యి గుఁయ్యి క్రమక్రమంగా తగ్గుతున్నకొద్దీ అతనివొంట్లో నయంగా వున్నట్లనిపించింది. వొంట్లో మెల్లమెల్లగా నెత్తురు కూడుతోంది.

"ఇంక వెళ్ళిపోవచ్చులే బొంబాయి" అనుకుంటున్నాడు. "రైలు మీద వెళ్ళక్కర్లేదు; నడిచే వెళ్ళిపోగలను" అనే ధైర్యం కలిగింది.

మళ్ళీ హెూమరేజివచ్చింది. దగ్గు. దగ్గుతో నెత్తురు. మంచంమీద వాలిపోయాడు. ఇన్నాళ్లూ మళ్లీ బొంబాయి వెళ్లాలనే కలలఅలలు విరిగిపోయాయి. మనసులో చిత్రించుకున్న నగరం, వీథులు, ఫ్యాక్టరీ, రతన్, బొమ్మలన్నీ చెరిగిపోయాయి. భయం, భయం. భయసందేహాలమధ్య బతుకు భారం! "లాభంలేదు, భయపడి లాభంలేదు" తనకుతానే మొండిధైర్యం చెప్పుకున్నాడు. జబ్బు కొంచెం తగ్గింది. కాని మళ్ళీ హెచ్చదనే ధీమాలేదు. సూర్యుడు ఉదయించినపుడు ఉదయకాంతి మీదపడుతున్నపుడు ప్రాణానికి హాయి.

డాక్టరు రోజూ రావడంలేదు. వారానికోసారి వస్తున్నాడు, పోతున్నాడు. తనను పరీక్షిస్తున్నపుడు డాక్టరుచూపుల్ని మనూ పరిశీలిస్తున్నాడు. తన చూపులలో కాంతి సన్నగిల్లినా డాక్టరుచూపులలో కాంతి కనిపిస్తే చాలును! కాని ఆయనచూపులలో ఆశాభావం కనిపించలేదు.

ఇప్పుడు మనూ కింకో ప్రపంచం లేదు. తనుతప్ప వేరే ఒక ప్రపంచం వున్నట్లనిపించడం లేదు. తాను చూసినవీ, తాను అనుభవించినవీ తప్ప యింకేవో వున్నవన్న స్ఫురణ అతనికి కలగడంలేదు. అమ్మ జ్ఞాపకం, అత్తయ్య జ్ఞాపకం, మావ జ్ఞాపకం, బీస్‌నదీతీరాన ఇసుకరేణువుల తళతళలు జ్ఞాపకం, నదీజలాల చల్లదనాన్ని నెమరవేసే పశువులజ్ఞాపకం, మామిడితోటలు, ఎర్రగా, కోలగా, గుండ్రంగా పండిన పళ్ళజ్ఞాపకం......జ్ఞాపకాలమధ్య తనే వొక జ్ఞాపకం!

సాయంకాలం మోహన్ వచ్చి దగ్గుతున్న మనూ తలపట్టుకున్నాడు. తనపక్కలో గుండెమీద చేయివేసి నిమురుతూ కూచుంటే అతనికెంత ఉపశమనం! గుండెల్లోబాధ చేతులతో తీసిపారవేసినంత సంతృప్తి!

ఆకాశంమీద మబ్బులు. కొండలను నల్లగా కప్పుతున్న మబ్బులు. జల్లులు జల్లులుగా వాన. వానతోపాటు దగ్గువచ్చింది.

అతనిముందు కొండశిఖరాలు ఎత్తుగా కనిపిస్తున్నాయి. శిఖరాలపై మబ్బులు కమ్ముకొస్తున్నాయి. దుఃఖంవలె వాన కురుస్తోంది. అతను మంచం

మీద లేచి కూచున్నాడు. దూరంగా పర్వతశిఖరాలమీద వాలుతున్న మబ్బులను చూస్తున్నాడు. మనసులో ఆలోచనలు తళుక్కున మెరిశాయి. జ్ఞాపకాలు గుండెలను కదిపాయి. ఒకదానితో ఒకటి సంబంధంలేకుండా మనసులో ఇంతలోనే మెరుస్తూ, అంతలోనే మటుమాయమయే ఆత్మను వేధించే, క్షోభపెట్టే అనంతమైన జ్ఞాపకాలు! విద్యుల్లతల జ్ఞాపకాలు! కలలో కనిపించి నిద్రపోతున్న మనిషిమీద కత్తులుదూసే, బాకులువిసిరే జ్ఞాపకాలు!

ఉన్నట్టుండి వానజల్లులు ఎక్కువయాయి. సాయంకాలమయింది. వానజోరుహెచ్చింది. మునూగుండెల్లో నొప్పి ప్రారంభమయింది.

ఎలాగైతేనేం, దగ్గు తగ్గింది. నాలుగయిదురోజులు మళ్ళీ దగ్గురాలేదు. మనిషి కుదుటపడ్డాడు. ఒంట్లో బావుంది. "అమ్మయ్య! నే నింక చచ్చిపోను."

మళ్ళీ వానపోతగా దగ్గు. దగ్గుతోపాటు నెత్తురు. మునూను చూడ్డానికి మోహన్ వచ్చాడు. దగ్గుతున్న మునూను పక్కమీదనుంచి తూలిపోకుండా పట్టుకున్నాడు. మునూ తల రేగిపోయింది. నిస్సహాయమైన శూన్యమైన దృక్కులతో చూస్తున్నాడు. మోహన్ చేతిస్పర్శ తనకు సంజీవి. చేతులతో మోహన్ చేతులను పట్టుకున్నాడు. ఈ కరస్పర్శలో ఎంత శాంతి! ఎంత హాయి! మిత్రుని చేతులను వెచ్చగా నొక్కాడు. అతనికేసి జాలిగా, నిస్సహాయ నిరుపేదగా చూశాడు.

"ఏమయితే అయిందిలే. నువ్వుమాత్రం వీరయువకుడివి. భయపడకు తమ్ముడూ!"

తుపానుకు భీతిల్లిన పిట్ట తనతల్లి రెక్కలచాటున దాగుకొన్నట్లు, తనమిత్రుని తొడలమీద తల ఆనించి అతనికి దగ్గరదగ్గరగా జరుగుతూ ఏదో అడుగుతున్నట్లు హడలుతున్నట్లు, చూశాడు. రెండుచేతుల్నీ కొమ్మలను పట్టుకున్నట్లు పట్టుకున్నాడు. మిత్రుని వరాలవేడి, తన శరీరంలోకి విద్యుత్‌లా ప్రవహించింది.

సంజ చీకటి పడింది. ఆకాశంలో నెలవంక ఉదయిస్తున్నది. చుక్కలు మిలమిల మెరుస్తున్నవి. పిట్టలు కిలకిల మంటున్నవి. పిట్టల కిలకిలలు వింటూ, చుక్కలకాంతిని చూస్తూ......

అతని కనులు అలాగునే మూతలుపడి వుండిపోయాయి.

ఎంతహాయి...తన మిత్రుని చేతుల వెచ్చదనం!

ఈరేయి...అదే అతని ఆఖరు జ్ఞాపకం!!



## Check List

| | | | |
|---|---|---|---|
| **Book Number** | NPR01B329 | **Date** | 29/3/2023 |
| **Front Cover** | Yes | **Back Cover** | Yes |
| **Blank Pages** | CP ,405 | | |
| **Missing Pages** | No | | |
| **Prepared By** | D.Mounika | **Cutting By** | D.Mounika |
| **Scanned By** | Mounika | **Pages** | 411 |
| **Quality Checking** | lakshmi | | |